ఓమ్

శ్రీపద్మపురాణాంతర్గత

# మాఘ

# మాహాత్మ్యము.

ఆంధ్రతాత్పర్యసహితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1928

ఓమ్.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

పద్మపురాణాంతర్గత

# శ్రీ మాఘ మాహాత్మ్యము

## ఆంధ్ర తాత్పర్య సహితము.

## ప్రథమాధ్యాయము.



శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్,
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్.

తా. వసిష్ఠమహాముని మునిమనుమఁడును, శక్తిమహాముని మునుమఁడును, పరాశరమహాముని కుమారుఁడును, శుకమహామునికిఁ దండ్రియుం నైనపాపనుఁడగు శ్రీవ్యాసమహామునీశ్వరునకు నమస్కరించెదను.

శ్లో. వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే,
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః.

తా. విష్ణురూపుఁడయిన వ్యాసుఁడును, వ్యాసరూపుఁడయిన విష్ణువును, వేదములకు జన్మస్థానమును, వసిష్ఠమహామునివంశమున జన్మించినవాఁడు నైన శ్రీకృష్ణద్వైపాయనునికి పలుమాఱు మ్రొక్కెదను.

శ్లో. పారాశర్యం పరమపురుషం విశ్వవేదైకయోనిం
విశ్వాధారం విమలయశసం వేదవేదాన్తవేద్యమ్,
శశ్వచ్ఛాన్తం శమితవిషయం శుద్ధబుద్ధిం విశాలం
వేదవ్యాసం విమలమతిదం సర్వదాహం నమామి.

తా. పరాశరమునికుమారుఁడును, పురుషోత్తముఁడును, ఎల్లవేదములకు జన్మహేతువైనవాఁడును, ఎల్లవిద్యలకు నాధారమైనవాఁడును, నిర్మలమయిన యశస్సుగలవాఁడును, వేదములచేతను వేదాంతములచేతను దెలియఁదగినవాఁడును, మిగులఁ బ్రశాంతుఁడును, అణఁచఁబడిన విషయాభిలాష గలవాఁడును, విమలమయిన బుద్ధిగలవాఁడును,

చాల గొప్పవాఁడును, తేటయైన బుద్ధినిచ్చువాఁడును నైన శ్రీ వేదవ్యాసమహామునికి నేనెల్లప్పుడును నమస్కరించెదను.

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

తా. దేవదేవుఁడగు శ్రీమన్నారాయణుని మనుష్యులలో నుత్తముఁడయిననరుని స్వయంప్రకాశరాలైన సరస్వతీదేవిని, శ్రీవ్యాసమహామునినిఁగూర్చి నమస్కరించి పిమ్మట మంగళవాక్యమును బలికెదను.

శ్లో. అజ్ఞానతిమిరాన్ధస్య జ్ఞానాఞ్జనశలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

తా. ఏగురునిచేత నజ్ఞానమనెడి చీఁకటిచేత కన్నుగానని నాయొక్క కన్ను జ్ఞానమనెడి కాటుకకణికచేఁ దెఱవఁబడెనో ఆగురువునుగూర్చి మ్రొక్కుచున్నాను.

మూలమ్. ఆరబ్ధం నైమిశారణ్యే సత్త్రం ద్వాదశవార్షికమ్, ఆజగ్ము రఖిలా స్తత్ర మునయో బ్రహ్మవాదినః. అసితో దేవలశ్చైవ సుమన్తుః పైల ఏవ వా, సుమతి ర్వామదేవశ్చ జాబాలిః కాశ్యపో భృగుః. పర్వత శ్శరభఙ్గశ్చ సుతీక్ష్ణోఽగస్త్య ఏవ చ, ఆపస్తమ్బోఽథ మాణ్డవ్య స్సత్యః కాత్యాయన స్తథా. రథీతరోఽఙ్గిరాశ్చైవ కపిలో రైభ్య ఏవ చ, ముద్గలో గౌతమశ్చైవ కణ్వః కాణో ఽత్రి రేవ చ. ధూమ్రో హారీతక శ్శఙ్కుః పృథు ర్మఙ్కుశ్చ సంకృతిః, కౌణ్డిన్యో విధ్రువశ్చైవ కాణాదో గర్గ ఏవ చ. కౌశికో గాలవో బభ్రు ర్వ్యాస శ్శక్తిః పరాశరః, శని ర్విభాణ్డకః పజ్కో బుధో

---

తా. పూర్వకాలమందు శౌనకాదిమహామునులచే నైమిశారణ్యమున పండ్రెండేండ్లకు ముగియఁనదియైన ఒకయజ్ఞము ప్రారంభింపఁబడెను. అపు డాయజ్ఞమునకు లోకమునందలి వేదవాదులైనమును లందఱు వచ్చిరి. అందు అసితుఁడు, దేవలుఁడు, సుమంతుఁడు, పైలుఁడు, సుమతి, వామదేవుఁడు, జాబాలి, కాశ్యపుఁడు, భృగువు, పర్వతుఁడు, శరభంగుఁడు, సుతీక్ష్ణుఁడు, అగస్త్యుఁడు, ఆపస్తంబుఁడు, మాండవ్యుఁడు, సత్యుఁడు, కాత్యాయనుఁడు, రథీతరుఁడు, అంగిరసుఁడు, కపిలుఁడు, రైభ్యుఁడు, ముద్గలుఁడు, గౌతముఁడు, కణ్వుఁడు, కాణుఁడు, అత్రి, ధూమ్రుఁడు, హారీతకుఁడు, శంకుఁడు, పృథువు, మంకువు, సంకృతి, కౌండిన్యుఁడు, విధ్రువుఁడు, కాణాదుఁడు, గర్గుఁడు, కౌశికుఁడు, గాలవుఁడు, బభ్రువు, వ్యాసుఁడు, శక్తి, పరాశరుఁడు,

బోధాయనో వసుః. జమదగ్ని ర్భరద్వాజో ధూమపో భార్గవ స్తథా, శౌనకో నారద శ్చైవ శతానన్ద శ్శాతాతపః. విష్ణువృద్ధో విశాలాక్షో జరత్కారో మహామునిః, పక్వపాశధరః పారః పారగః పణ్డితో త్తమః. మహాకాయో మహాగ్రీవో మహాబాహు ర్మహోదరః, ఉద్దాలకో మహాసేన ఆర్త ఆమలకప్రియః. ఏకపాదో ద్విపాదశ్చ ఊర్ధ్వబాహు ర్జలాశనః, ఉగ్రశీలో మహాశీలః పిశఙ్గో మన్త్రవి త్పటుః. శాణ్డిల్యః కరుణః కాలః కైవల్యశ్చ కలాధరః, కల్పాన్తః కఙ్కణః కణ్డుః కఠః కాలాగ్నిరుద్రకః. శ్వేతబాహు ర్మహాప్రాజ్ఞః శ్వేతాశ్వతరసంజ్ఞకః, ఏతే శిష్యైః ప్రశిష్యైశ్చ బ్రహ్మిష్ఠా వేదపారగాః. లోకానుగ్రహకర్తారః పరోపకృతిశాలినః, పరప్రియరతా నిత్యం జపయజ్ఞపరాయణాః. ఆగత్య నైమిశారణ్య మశేషగుణసంయుతమ్, కర్తు మారేభిరే సత్త్రం గోమతీతీరవాసినః. ఏతస్మి న్నేవ కాలే తు సూతః పౌరాణికోత్తమః, పుణ్యం త మాయయౌ శీఘ్రం దీర్ఘసత్త్రదిదృక్షయా. త మాశ్రమ మనుప్రాప్తం జటావల్కలసంయుతమ్, ప్రసన్నవదనం శాన్తం పర

---

శని, విభాండకుఁడు, పంకుఁడు, బుధుఁడు, బోధాయనుఁడు, వసువు, జమదగ్ని, భరద్వాజుఁడు, ధూమపుఁడు, భార్గవుఁడు, శౌనకుఁడు, నారదుఁడు, శతానందుఁడు, శాతాతపుఁడు, విష్ణువృద్ధుఁడు, విశాలాక్షుఁడు, జరత్కారుఁడు, పక్వుఁడు, పాశధరుఁడు, పారుఁడు, పారగుఁడు, మహాకాయుఁడు, మహాగ్రీవుఁడు, మహాబాహువు, మహోదరుఁడు, ఉద్దాలకుఁడు, మహాసేనుఁడు, ఆర్తుఁడు, ఆమలకప్రియుఁడు, ఏకపాదుఁడు, ద్విపాదుఁడు, ఊర్ధ్వబాహువు, జలాశనుఁడు, ఉగ్రశీలుఁడు, మహాశీలుఁడు, పిశంగుఁడు, మంత్రవిదుఁడు, పటువు, శాండిల్యుఁడు, కరుణుఁడు, కాలుఁడు, కైవల్యుఁడు, కలాధరుఁడు, కల్పాంతుఁడు, కంకణుఁడు, కండువు, కఠుఁడు, కాలాగ్నిరుద్రుఁడు, శ్వేతబాహువు, శ్వేతాశ్వతరుఁడు అనువారు ముఖ్యులు. ఇట్టిబ్రహ్మతేజోమూర్తులును, తుదముట్ట వేదములను చదివినవారును, లోకులను ఏలుకొనుటకు కర్తలును, పరోపకారపరులును, పరులకు ప్రియముచేయుటయం దాసక్తులును, జపములును యజ్ఞములును శ్రద్ధతో చేయువారును నైనమహామునులందఱు తమతమ శిష్యులతోను, శిష్యులశిష్యులతోను వచ్చి యెల్లశుభలక్షణములకు నాస్పద మయిన నైమిశారణ్యమునందు గోమతి యనునదిగట్టున యజ్ఞశాల నిర్మించుకొని యజ్ఞము నారంభించిరి.

ఆకాలమునందు పురాణకథలు చెప్పుటయందు మిగుల సమర్థుఁ డైనసూతుఁడు చిరకాలము చేయఁబడునదియుఁ పుణ్యమును కలుగఁజేయునదియుఁ నైన ఆయజ్ఞమును చూడవలె నను వేడుకతో అచ్చటికిరాఁగా మునులందఱును ఆతనిఁ జూచి, జడలు నార

పూర్థ విశారదమ్. అశేషగుణసంపన్న మనన్తానన్ద శేవధిమ్, భస్మోద్ధూళితసర్వాఙ్గం త్రిపుణ్డ్రాఙ్కిత మస్తకమ్. రుద్రాక్షమాలాభరణం జటామణ్డలమణ్డితమ్, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞం సర్వభూతహితే రతమ్. జితేన్ద్రియం జితక్రోధం జీవన్ముక్తం జగద్గురుమ్, వ్యాసప్రసాదసంపన్నం వ్యాసవ ద్విగతస్పృహమ్. వేదమార్గే సదా నిష్ఠం వేదమార్గప్రవర్తకమ్, నైమిశీయా మహాత్మానో మహాభక్తిసమన్వితాః. చిత్రాః శ్రోతుం కథా స్తత్ర పరివవ్రు స్సమన్వితాః, అభివాద్య మునీం స్తాంస్తు సర్వానేవ కృతాఞ్జలిః. అపృచ్ఛ త్స తపోవృద్ధి మృషిభి శ్చాభినన్దితః, అథ తే షూపవిష్టేషు సర్వేష్వేవ తపస్విషు, నిర్దిష్ట మాసనం భేజే వినయా ద్రౌమహర్షణిః. సుఖాసీనం తత స్తం తు విశ్రాన్త ముపలక్ష్య చ, శ్రోతుకామాః కథాః పుణ్యా ఇదం వచన మబ్రువన్. ఋషయః— అష్టాదశపురాణాని సేతిహాసాని కృత్స్నశః, త్వత్త శ్శ్రుతా న్యశేషాణి శ్రోతవ్యాంశో న విద్యతే. సూతః—శృణ్వన్తు మున

చీరలు ధరించి,-తేటమీఱిన మొగమును, మిగులతిన్నఁదనమును, మేలైనయర్థముల నెఱుఁగుటయందలి నేర్పును, ఎల్లమంచిగుణములకలిమియు, మేరలేని సంతోషమును, దేహమునందంతట భస్మధారణమును, నొసట త్రిపుండ్రధారణమును, మెడను రుద్రాక్షసరములును, మండలాకారమయిన జడముడియును గలిగి ఎల్లశాస్త్రముల మర్మములు నెఱిఁగినవాఁడును, ఎల్లప్రాణులకు మేలుగోరువాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, కోపము నణఁచినవాఁడును, బ్రతికియుండునప్పుడే మోక్షమును పొందినవాఁడునునై వ్యాసానుగ్రహమువలన వ్యాసునివలె లోకులకెల్లను గౌరవపాత్రుఁడయి ఏయపేక్షయులేక వేదమునందు విధింపఁబడిన నిష్ఠను వహించి వేదోక్తము లయిన యాచారములను నడపుచు వర్తించునట్టి యీపుణ్యాత్ముని జూడఁగంటిమిగదా యని యత్యంతభక్తితో సత్కరించి ఆయనవలన చాలవినోదకరము లైనకథలనెల్లను విను వారై అందఱు నొక్కటిగఁ గూడి యతనినిఁ జుట్టుకొనిరి.

సూతుఁడును వారు కోరినచొప్పున కథ చెప్పఁదలఁచి చేతులు జోడించుకొని, యెల్లవారికి నమస్కరించి వా రిచ్చినసిద్ధాసనమునందుఁ గూర్చుండెను.

అంతట శౌనకాదిమును లెల్లరు నతనిఁ జూచి ఓయుగ్రశ్రవుఁడా మేము నీవలనఁ బదునెనిమిదిపురాణములును తుదముట్ట వింటిమి. ఇప్పుడు వినవలసినయంశము లేవియుం గానముకదా. అయినను ఇప్పుడు మేము వినఁదగినదానిని నీవే యోచించిచెప్పుము. అనఁగా, సూతుఁడు ఈమునులిప్పుడు తమమనసులకు ప్రియమైనవిషయమును విందురు.

య స్సర్వే శ్రోతవ్యాంశం మనోగతమ్, యావజ్జాతం ప్రవక్ష్యామి విదుషాం వః పురోగతః. ఋషయః.—బ్రాహ్మ్యం పురాణం ప్రథమం పాద్మం వైష్ణవ మేవ చ, శైవం భాగవతం చైవ భవిష్యన్నారదీయకమ్. మార్కణ్డేయం త థాగ్నేయం బ్రహ్మవైవర్త మేవ చ, లైఙ్గం తథైవ వారాహం స్కాన్దం వామన మేవచ. కౌర్మ్యం మాత్స్యం గారుడం చ బ్రహ్మాండం చ తతఃపరమ్, ఆద్యే ష్వష్టాదశే ష్వేషు పురాణేషు మహత్సు చ. ద్వితీయం పాద్మమిత్యుక్తం పురాణం రోమహర్షణమ్, పఞ్చపఞ్చాశ దిత్యుక్తం సహస్రగ్రన్థ సఙ్ఖ్యయా. తస్మి న్పురాణే భవతా మాఘమాసస్య వైభవః, అగ్రతో వర్ణితోఽస్మాకం తం భూయో వక్తు మర్హసి. ఏతేషా మత్ర సర్వేషాం విస్మృతప్రాయ మేవ నః, ఇదానీమపి నేదీయాన్ మాఘ స్తస్మాత్కృపానిధే. త ద్భూయ శ్శ్రోతుకామానా మస్మాకం వర్ణ యాగ్రతః, మునీనాం వచనం శ్రుత్వా సూతః పౌరాణికోఽబ్రవీత్. సూతః—సాధు సాధు మహాప్రాజ్ఞా స్సత్ప్రసంగ స్సమీరితః ఆలోక్య మాఘ మాసన్న మేతదర్థ మిహాగతః. వక్తుం వో మాఘమాహాత్మ్య మహ మత్రాగతోఽపి హి,

---

గాక. నాకు తెలిసినంతమట్టుకు విద్వాంసులయిన మీయెదుట వివరింతునని పలికెను.

అందులకు ఋషులు దయానిధి వైనయోసూతుఁడా! బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యత్తు, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మ్యము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము అను నీపురాతనములైన మహాపురాణములు పదునెనిమిదింటను ఏఁబదియైదువేల గ్రంథసంఖ్యగలిగి వినునప్పుడు దేహములను పులకాంకితములనుగాఁ జేయునట్టి దైన పాద్మపురాణము రెండవది యని చెప్పియుంటివి. అందు మాఘమాసవైభవమును కొంత వింటిమి. అది యీకూడిన మాకందఱకు తఱుచుగా మఱపునకు వచ్చియున్నది. కనుక దాని నిప్పుడు మరల వినఁగోరుచున్నాము. ఆ మాఘమాసమును సమీపించి వచ్చుచున్నది కాఁబట్టి దానివైభవమును మరల మాకు సవిస్తరముగాఁ జెప్పుము. అందుల కోరిక మాకు మిక్కుటమయి యున్నది అనిరి.

పౌరాణికుఁ డైనసూతుఁడు వారిపలుకులు విని పండితులగు నోమునులారా! మీరు మంచివిషయమును ప్రస్తావించితిరి. మేలు మేలు. బాగుగ నున్నది. మాఘమాసమును సమీపించివచ్చుచున్న దని దానిమాహాత్మ్యమును మీకు చెప్పవలె నని యెంచి నే నిచ్చటికి వచ్చినాను. అందులకు తగినట్లు మీరును ఆమాఘమాహాత్మ్యమునే వినఁ

భవద్భిశ్చ మునిశ్రేష్ఠాః ప్రశ్న స్తత్సదృశః కృతః. తస్మాద్భూయః ప్రవక్ష్యామి మునయ శ్శృణు తాదరాత్, రోమహర్షణనామ్నశ్చ శిష్యతాయాశ్చమద్గురోః నారాయణాంశతాయాశ్చ సదృశం ప్రబ్రవీమివః,ఇత్యగ్రతో మునీన్ద్రాణా ముదీర్య వినయోజ్జ్వలః. వక్తు మారభతే దేవం నమస్కృత్య పినాకినమ్, ఓమ్నమోఽహం పరార్థాయ పరమార్థస్వరూపిణే, నమోహిరణ్యగర్భాయ హరయే శంకరాయ చ,సరస్వత్యై నమస్తుభ్యం విఘ్నేశాయ నమో నమః. పారాశర్యం పరమపురుషం విశ్వవేదైకయోనిం విద్యాధారం విమలయశసం వేదవేదాంతవేద్యమ్, శశ్వ చ్ఛాన్తం శమితవిషయం శుద్ధబుద్ధిం విశాలం వేదవ్యాసం విమలమతిదం సర్వదాహం నమామి. ఇతి దేవా న్నమస్కృత్వా మునీన్ద్రా నిద మబ్రవీత్. ఇమం ప్రశ్నం సముద్దిశ్య దిలీపో భూభృతాం వరః, పప్రచ్ఛ స్వకులాచార్యం వసిష్ఠం మునిపుంగవమ్. తస్మై తేన సమాఖ్యాతం మాఘమాహాత్మ్య ముత్తమమ్, తథైవాహం ప్రవక్ష్యామి భవతా మిహ విస్తరాత్, యథావ న్మాఘమాహాత్మ్యం వక్తా శ్రోతా చ దుర్ల

---

గోరితిరి. కనుక ఎచ్చరికతో వినుఁడు చెప్పెదను. మాతండ్రియగు రోమహర్షణునంతవానిశిష్యుఁడనైనందులకును నారాయణాంశమునఁ బుట్టిన వ్యాసునియనుగ్రహము గలవాఁడనైనందులకును దగినట్లు మీరడిగినదంతయుఁ జక్కఁగాఁ జెప్పగలను అని కథచెప్పనారంభించుచు, పరమాత్మస్వరూపమైనదియు, పరవస్తువైనదియునైన యోంకారమునకు మ్రొక్కెదను. బ్రహ్మకును, విష్ణువునకు, శివునకును, స్వయంప్రకాశురాలైనసరస్వతీదేవికిని, విఘ్నవిచ్ఛేదకుఁడైనవిఘ్నేశ్వరునకును మ్రొక్కెదను. పరాశరునికుమారుఁడును, పురుషోత్తముఁడును, ఎల్లవేదములకు పుట్టినచోటగువాఁడును, ఎల్లవిద్యలకుగనియైనవాఁడును, స్వచ్ఛమయిన కీర్తిగలవాఁడును, వేదవేదాంగములచేతఁ దెలియఁదగినవాఁడును, మిగులతిన్ననివాఁడును, విషయాసక్తి నణఁచినవాఁడును, పరిశుద్ధమయిన బుద్ధిగలవాఁడును, చాలగొప్పవాఁడును, నాకుఁ దేటయైనబుద్ధి గలుగ ననుగ్రహించినవాఁడును నైన వేదవ్యాసమహామునీశ్వరునకు సర్వదా మ్రొక్కెదను. అని దేవతా గురు వందనములు గావించి మునీంద్రులను జూచి యిట్లు చెప్ప నారంభించెను.

మునీంద్రులారా! వినుఁడు. మునుపు దిలీపమహారాజు తమకులగురువైన వసిష్ఠమహామునిని నన్ను మీ రడిగినట్లే యడుగఁగా ఆయన యామహారాజునకు సర్వోత్తమమయిన యీమాఘమాహాత్మ్యమును సవిస్తరముగాఁ జెప్పెను. ఆచొప్పుననే యిప్పుడు మీకు నేనును జెప్పెదను. మాఘమాసముయొక్క మహిమ యిట్టిదని తెలిసిచెప్పువారున్ను,

భః. సులభాశ్చ వయం యూయం వక్తుం శ్రోతుం చ తత్పరాః.
స మాఘమాసోఽఖిలపాపశత్రుస్సౌభాగ్యహేతుః ఖలు వర్ణ్యతేఽద్య,
నిమజ్జనా ద్యత్ర విభాతకాలే నరా స్సువర్లోకకుటుమ్బిన స్స్యుః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే
సూతం ప్రతి ఋషిప్రశ్నో నామ
ప్రథమోఽధ్యాయః.

ద్వితీయోఽధ్యాయః.

శ్రీసూతః. అథావరావభృథస్నాతః కృతకౌతుకమఙ్గళః, పూజితో నాగరై స్సర్వై ర్దిలీపో భూభృతాం వరః. మృగయారసికో భూత్వా స్వపురా న్నిర్గతో బహిః, కౌతూహలసమావిష్ట ఆఖేటవ్యూహసంవృతః. ఉపానద్గూఢపాదస్సన్ సితోష్ణీషపరిచ్ఛదః, బద్ధగోధాఙ్గుళిత్రాణో ధనుష్పాణి శ్శరీ నృపః. బద్ధతూణీరాసిధేనుశ్చ తథా భూత్యైశ్చ పత్తిభిః, కా

వినువారును ఎక్కడను ఉండరు. ఈవిషయమునందు అనఁగా, చెప్పుటయందు నేనును, వినుటయందు మీరును సులభులము. ఆసక్తులము. దేనియందరుణోదయమున లేచి స్నానముచేయువారు స్వర్గలోకమున వాసముచేయువా రగుదురో ఆమాఘమాసమును వర్ణించెదనని సూతుఁడు శౌనకాదిమహామునులకుఁ జెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమున
సూతునిగూర్చి ఋషులు ప్రశ్నచేయుట యను
ప్రథమాధ్యాయము.

## రెండవ యధ్యాయము.

### దిలీపమహారాజు వేఁటాడ నడవికిఁ బోవుట.

సూతుఁడు చెప్పెను. రాజశ్రేష్ఠుఁడైన దిలీపుఁడు యజ్ఞముచేసి ఆయజ్ఞాంతమునందు చేయవలసిన ఎల్లవైదికక్రియలతోడ నవభృథస్నానమును గావించి యెల్లపురజనుల చేతను పూజింపఁబడినవాఁడై రాజ్యమేలుచుండి యొకనాఁడు వేఁటయందలి వేడుకచేత పాదుకలుదొడుగుకొని తెల్లనిపాగాను ధరించి కవచమును దొడిగి ఉడుముతోలుతోఁ గుట్టఁబడిన హస్తకవచమును గట్టుకొని విల్లు చేతఁబూని అమ్ములపొదులు మూఁపునఁదాల్చి

న్తారేషు సురమ్యేషు వనే షూపవనేషు చ. గుహాసుచ నికుఞ్జేషు నదీప్రస్రవణేషు చ, నిమ్నోన్నత ప్రదేశేషు శిలానాం గహ్వరేషు చ. అసిచర్మధరైశ్చైవ ఖడ్గతోమరపాణిభిః, ధనుష్పాణిభి రాయాతై స్స ర్వాయుధధరై ర్వృతః.స నిర్గత్య పురాద్రాజా వివేశ చ మహద్వనమ్, మృగయాకృష్టహృదయో మాఘమాసే సమీపగే.అసిభి స్తోమరైర్భల్లై ర్గదాభిర్ముసలై శ్శరైః, అసిభి స్సితధారాభిః పరిఘై రాయుధై ర్గదైః. గదాభిర్భిణ్డివాలైశ్చ శతఘ్నీభి ర్ముసుణ్డిభిః, క్షురప్రై రర్ధచన్ద్రైశ్చ నారాచైః క్షురతోమరైః. అన్యైశ్చ వివిధై ర్బాణై రాయుధైశ్చ సమన్వతః, వన్యాన్మహిషమాతంగాన్ సింహశార్దూలభల్లుకాన్. హరిణాంశ్చ మరాన్ ఖడ్గాన్ మహావ్యాఘ్రాన్ వృకాన్ బహూన్, శరభాదీన్మృగా నన్యాన్ ప్రజోపద్రవకారిణః. క్రీడయిత్వాయుధశతై ర్వనదర్శనలాలసః, ఉల్లఙ్ఘితమహాస్రోతో యువా పఞ్చాస్యవిక్రమః. తస్మిన్ క్రీడతి తైస్సార్ధం కుఞ్జేషు మృగయ న్మృగాన్, హన్యతాం హన్యతా మేషో మృగో

దట్టీకట్టునందు బాకుఁజెక్కుకొని వేఁటకు తగినవేషముతో ననేకులు వేఁటకాండ్రు వెంటరాఁగా పట్టణమునుండి వెడలి, యందముగాఁ గానవచ్చునట్టియడవులుసొచ్చి పెద్ద పెద్ద తోపులందును కొండగవులయందును పొదరిండ్లయందును సెలయేటిసొనలయందును మిట్టపల్లములగు నేలలయందును రాళ్ళసందులందును కత్తి కేడెములు పట్టాకత్తులు ఈఁటెలు విండ్లు అమ్ములు లోనుగాఁగల యాయుధములనెల్ల ధరించి తనవెంటవచ్చు వేఁటకాండ్రతోడ సంచరించుచు నొక గొప్పయడవి దూఱి, కత్తులతోను, ఈఁటెలతోను, బల్లెములతోను, గదలతోను, రోఁకండ్లతోను, బాణములతోను, సురియలతోను, గడెమ్రాఁకులవంటి యాయుధములతోను (బాణాకఱ్ఱలతోను) విడిచివాటుగుదియలతోను, పిరంగులతోను, ఇనుపకట్లగుదియలతోను, మంగలకత్తులవంటియాయుధములతోను, అర్ధచంద్రబాణములతోను, నారసములతోను, చిట్టీటెలతోను, మరియు బహువిధములైన యాయుధములతోను, ఆయడవియందలి సింహములు శరభములు ఏనుఁగులు కారుపోతులు పులులు ఎలుగుగొడ్లు ఖడ్గమృగములు చమరీమృగములు తోఁడేళ్లు జింకలు దుప్పులు మొదలుగాఁగల పెక్కుతెగలమృగములను నఱికియుఁ బొడిచియుఁ గ్రుచ్చియుఁ దలలుపగులఁ గొట్టియు ఒడళ్లు నలియ మోదియుఁ నానావిధముల వేఁటలాడి, అంతట నాయడవియందలి వినోదము లెల్లను జూడ వేడుకపడినవాఁడై ఆదిలీపుఁ డందుగల సెలయేళ్ల నెల్ల దాఁటుకొనిపోయి యందందుగల పుట్టలలోను పొదలలోను మృగములను వెదకి వెదకి

వేగాత్పలాయతే, ఇతి జల్పత్సు భృత్యేషు స్వయ ముత్ప్లుత్య హన్తి చ, ఇతస్తతః క్వచిద్యాతి పునః పశ్యన్వనస్థలీమ్. ద్విరేఫోడ్డీనసంత్రస్త లీనకేకికులాకులమ్, విత్రస్తహరిణీసంఘాం ద్రవచ్ఛాఖాపదసంకులామ్. క్వచిత్కోటరసంఘుష్టఘూకనాదనినాదితామ్, ఖడ్గయూథైః క్వచి ల్లక్ష్మీం దధానా మివ దన్తినామ్. క్వచి ద్వరాహదంష్ట్రాగ్ర సము ద్ధృతకశేరుకామ్, మృగేన్ద్రనఖనిర్భిన్నదన్తిమౌక్తికముద్రితామ్. శా ర్దూలనఖనిర్భిన్నమృగరక్తారుణాం క్వచిత్, పీవరస్తనభారార్తసిద్ధకిన్నర భామినీమ్. అవరోధాజిరశ్రోణీం సూచయన్తీ మివ క్వచిత్, క్వచి ద్వృషఘురచ్ఛాయం క్వచి త్పుష్పసుగన్ధినీమ్. క్వచిల్లతాగృహద్వారి భృఙ్గమాలాసుతోరణామ్, అర్ధనిస్సృత నిర్మోక నాగభీమమహాబి లామ్. విలీనాజగరైర్భీమాం క్వచి న్నిర్ముక్తసర్పిణీమ్, క్వచిద్దావానల జ్వాలా శిఖావ్యాప్తమహీరుహామ్. క్వచి న్నికుఞ్జాన్నిర్గచ్ఛత్క్రోధ వ్యాఘ్రత్రసన్మృగామ్, వ్యాముఞ్చ శ్వశునాం యూథం శశ

---

చూచిచంపుచు సేనలతోడ విహరించుచుండగా, నదెమృగ మొదుపుతప్పి పాఱిపోయెను. చూడుఁడని భృత్యులు కూఁతలు పెట్టిరి. ఆకూఁతలువిని రాజట్లు దాఁటుకొని పాఱిపోవు న మృగమును వెదకుచు బహుదూరము పోయి తుమ్మెదలు జుమ్మని మీఁదికెగయఁగా బెదరిన నెమళ్ల బాఱుల చేత కలఁతనొందినదియు, మిక్కిలి బెదరు నొందిన లేళ్లమందలు ను, మాంసమునే తిని జీవించునట్టి క్రూరమృగములు పఱుగెత్తుటవలనిసందడి గలిగిన దియు, మ్రాఁకులతొఱ్ఱలలో నుండి కూయుగుడ్లగూబల చేత భయముపుట్టించునదియు, ఖడ్గమృగముల గుంపులచేతను ఏనుఁగులగుంపులచేతను నిండుకొన్నదియు, అడవిపందుల కోఱకొనల చేత పెల్లగింపఁబడుతుంగగడ్డలతోడిజవుకునేలలుగలదియు, సింహములవాఁడి గోళ్లచేతఁ జీల్పఁబడిన యేనుఁగుల కుంభస్థలమునుండి రాలు ముత్యాలరాసులచేతఁగప్పఁ బడినదియు, పెద్దపులుల గోళ్లచేతఁ జీల్పఁబడిన జింకలనెత్తురులచేత నెఱ్ఱవారినప్ర దేశములు గలదియు, స్థూలములైన స్తనములబరువుచే గాసిల్లుచు చరించునట్టి సిద్ధకిన్నర స్త్రీలవలన నంతఃపురపు ముంగిళ్లవలె దోఁచు ప్రదేశములు గలదియు, వృక్షములనీడ లును పువ్వులతావులును తీఁగయిండ్లవాకిండ్లయందు తోరణములు గట్టినట్టు కానవచ్చు తుమ్మెదల బాఱులును గలిగి మనోజ్ఞమయినదియు, కుబుసము లూడ్చినపాములకలి మిచేత భయమును బుట్టించునట్టికలుగులు కలదియు, కార్చిచ్చు మంటలచేత నావరించిన మ్రాకులయందుండి విడివడి పాఱు చిఱుపాములు గలదియు, ఉగ్రము లైన పెద్దపులులకు వెఱచి పొదలనుండి వెడలి పాఱునట్టి మృగములు గలదియు

కేషు క్వచిత్క్వచిత్. పల్వలేషు చ విశ్రాన్తః క్వచి ద్యాతి వ నా_న్తరమ్, ఏవం ఖేలతి రాజేన్ద్రే వ్యాధవర్గే చ వల్గతి. తత్ర కోలాహలత్ర_స్త స్సారంగో నిర్గతో వనాత్, స్ఫురద్వేగక్రమాక్రా_న్త దుర్గ మార్గమహీతలః. కదాచి ద్గగనారూఢః కదాచి ద్భూమిగోచరః, న యావ ల్లక్ష్యతాం యాతి ధన్వినాం పృష్ఠగామినామ్. క్వచిద్దృష్టిపథం యాతి దర్శనం యాతి న క్వచిత్, తత్ర స్రోతోఽతిగమ్భీరం కణ్టక ద్రుమసంకులమ్. ప్రవిష్టో విషమారణ్యం రాజా వై తత్పదానుగః, దూరా ద్దూరతరం గత్వా దేశా ద్దేశం చ నిర్జలమ్. అన్వగచ్ఛ న్మృగం రాజా శుష్యద్గద్గదకన్ధరః. శుష్యత్తాలు ముఖవ్యాధశ్రాన్తానుచరసేవితః. మృగదర్శనసంరమ్భా నృపోఽసౌ శుష్కకన్ధరః, క్షుత్పరీతాఖిల వ్యాధో భ్రా_న్తప_త్తిస్ఖలద్గతిః. అతీతదీర్ఘమార్గస్సన్ తృషార్తో మధ్యగే రవౌ, దదర్శాగ్రే తు కాసారం స్పర్ధయ_న్త మపాంనిధిమ్. తీరస్థ వృక్షశాఖాభి శ్ఛన్నతీర్థం సుశీతలమ్, ఘనపాదపతీరస్థం సుతీర్థం సుజలం శివమ్. విశాలం వికచామ్భోజం మధుమ_త్తమధువ్రతమ్, పద్మినీ

నైన యడవినడుమ చొచ్చి కుందేళ్లపై కుక్కలనుసికొలిపివిడుచుచు, నీటిపడియలయందు పడదీఱవిహరించుచును ఆడిలీపుఁడు బోయలగుంపుతోడ సంచరించుచుండెను. అప్పుడు వారిసంచారమువలనికోలాహలధ్వనికి వెఱచి యొకజింక కదుపడిగాఁ బఱుగెత్తునది నడుమనడుమ మిక్కిలి పొడవుగా కుప్పించి దాఁటుచు, నంతటంతట నిలిచి మెల్లమెల్లగా నడచుచు, నొక్కొకప్పుడు విల్లునమ్ములు పూని వెంటఁబడు వేఁటకాండ్రకు కనఁబడియుం వారిగుఱికిఁదక మఱిగిపోవుచు, చిత్రసంచారముచేయుచుండఁగా నీటివెల్లువ వలన మిగుల పల్లమై దట్టమైనముండ్లచెట్లచే మిట్టపల్లములుగాఁ గానవచ్చుచోట ఆ మృగము కాలిజాడను వెదకి పట్టి ఆజాడవెంబడిని బహుదూరము పోయి నీళ్లుదిక్కుని యొక్క మహారణ్యప్రదేశము చేరి దప్పిచేత గొంతెండి డగ్గుత్తికపడి నోటమాట వెడలక తనవలెనే సెలవులెండి మొగములు వాడినవేఁటకాండ్రచేతను నట్టిపరిచారకులచేతను కొలువఁబడినవాఁడగుచు మృగముజాడ ననుసరించి మధ్యాహ్నసమయమునకు బహుదూరము కడచిపోయి దప్పివలన బాధ హెచ్చుచుండఁగా, సముద్రమును బోలినదై గొప్పలైనదరియందలి మ్రాఁకుల నీడలచేత మిక్కిలి చల్లనైన యుంపకముచేత నిండుకొని యుం_క్తములైన రేవులును, మంగళకరమై చక్కఁగా విరిసి పరిమళించుచున్న తామరలును, పూదేనెలు త్రాగి మత్తుగొని యూవరించి యున్నతుమ్మెదలబాఱులును, మరకతమ

పత్త్రషణ్డైశ్చ ఛన్నం మరకతై రివ. దివ్యప్రసన్నసలిలం సజ్జనానాం మనో యథా, చలజ్జలచరై ర్భీషణం వీచిరాజివిరాజితమ్. అన్తర్గ్రాహగణక్రూరం ఖలానా మివ మానసమ్, క్వచి చ్ఛైవాల విషమం కృపణస్యేవ మన్దిరమ్. విహగానాం చ సన్తాపం శమయన్తం దివానిశమ్, దాతార మివ సర్వస్వ మాపన్నార్తిహరం సదా. తర్పయన్త మివామ్భోభిః శ్వాపదాన్ స్వపితౄనివ, హరన్తం సర్వసన్తాపం హిమాంశు మివ చానిశమ్. తం దృష్ట్వాఽభూ ద్గతగ్లాని శ్చాతకో జలదం యథా, గత్వా పీత్వా జలం రాజా కృతమాధ్యాహ్నికక్రియః. భుక్త్వా ఖేటకసంపన్న స్సహాయై స్సహితో నృపః, ఉవాస సరస స్తీరే రమ్యాశ్చ కథయన్ కథాః. తత శ్శరాసనే బాణం కృత్వా రాత్రౌ స్థితో నృపః, వ్యాధా స్సంధాన మాస్థాయ రురుధుః క్రమశః పథః. ఏవం స్థితేషు వీరేషు వనే విస్తీర్య వాగురాః, నిశాన్తే నిర్గతం యూథం సూకరాణాం తత స్తతః. చర్విత్వా సరసీకన్దాన్ పపాత వ్యాధసంకులాః, రాజ్ఞా

---

ణులచేత గప్పఁబడెనో యనునట్లు పరపులై కానవచ్చు తామరాకులును, సజ్జనుని మనస్సువలె నిర్మలమై పానయోగ్యమై యొప్పునట్టి యుదకమును, ఇటునటు మెదలుచు భయమును పుట్టించుచున్న జలజంతువులును గలిగి, దుర్జనుని చిత్తమువలె ప్రాణిహింసక మత్స్యములు మొదలగువానిచేత క్రూరమైనదియుం, లుబ్ధుని గృహమువిధమున ఒక్కొక్కచోట ఆకుపాఁచిచేత మిట్టపల్లమై యుండునదియుఁ రెండుబగళ్లను పక్షులసంతాపమును పోఁగొట్టుచుండునదియు, కావలసినధనము గలదాతరీతి నెల్లప్పుడు దీనజనులపీడను పోఁగొట్టునదియుం, తల్లిదండ్రులతెఱఁగున సింహశరభాదిమృగముల నుదకదానముచే తృప్తిపరచునదియు, చంద్రునివిధమున నెల్లప్పుడు తాపము నణఁచివేయుచున్నదియునైన యొకసరస్సును జూచి మేఘమును జూచి తనివిపొందు చాతకపక్షియట్లు మిక్కిలి యూఱట నొంది యాసరస్సునందు మాధ్యాహ్నికక్రియలన్నియుం జరపి దప్పిదీఱ నాచల్లనినీళ్లు త్రాగి అప్పటికి లభించిన యాహారద్రవ్యములచేత నాఁకలి తీర్చుకొని తనవలెనే యాప్యాయనము నొందిన బోయవాండ్రతోను తక్కిన సహాయులతోను గలసి యా కొలనిగట్టునఁ గూర్చుండి యిష్టకథాగోష్ఠితో ప్రొద్దుపుచ్చుచుండెను. పిమ్మట ప్రొద్దుగ్రుంకఁగానే రాజు విల్లెక్కుపెట్టుకొని మృగములరాక కెదురుచూచుచు నచ్చటనే యుండెను. బోయలును అట్లే మృగములువచ్చుదారు లడ్డగించి నిలిచిరి. అట్లుండఁగా పగలు వలలో చిక్కుపడక తప్పించుకొనిపోయిన యడవిపందులన్నియు మందలు

విద్ధా స్తథా క్రోడా వ్యాధైశ్చ బహవో హతాః. క్షణేనైవ వరాహా స్తే విద్ధాః పేతు ర్మహీతలే, తాం దృష్ట్వా విపులం నాదం వ్యాధా శ్చక్రు స్సుదర్పితాః. ధావన్త స్త్వరయా యుక్తా మిళితా యత్ర భూమిపః, తా నాదాయ భక్ష్యై ర్భూపో నిర్గత స్సరసీ తటాత్. స్వపురం గన్తుకామోఽసౌ దృష్టవాన్ పథి తాపసమ్, బ్రాహ్మణం వృద్ధ హారీతం వైఖానసమతే స్థితమ్. నియమై ర్దుష్కరై రుగ్రైః పరిక్షీణ కళేబరమ్, అస్థిశేషం మహావాత విస్ఫురత్కర్కశత్వచమ్. దధానం హారిణం చర్మ వసానం మృగవల్కలమ్, కుర్వాణం నైగమం జప్యం నఖలోమజటాధరమ్. తం వనాశ్రమిణం దృష్ట్వా మార్గం హిత్వా ససంభ్రమమ్, ప్రణమ్య శిరసా రాజా కృతాఞ్జలి రుపస్థితః. అథ రాజ్ఞా మలంకారై ర్ద్విజో నిశ్చిత్య భూమిపమ్, ఉవాచ శ్రేయసో హేతోః పరోపకృతికామ్యయా. కి మత్ర గమ్యతే రాజన్ కాలే పుణ్యతమే శుభే, మాఘే మాస్యవిధాయైవ ప్రాతస్స్నానం సరోవరే. ప్రత్యువాచ తతో రాజా నాహం జానే ద్విజోత్తమ, మాఘస్నానఫలం

---

మందలుగావచ్చి యాసరస్సునందలి తుంగముస్తెలను పెల్లగించి తినఁబోయి బోయల గుంపుచే తఱుమఁబడినవై రాజుచే జంపఁబడెను. ఇట్లు ఎల్లపందులును నిమిషమాత్రములో తమచే మడిసినందులకు హర్షించి వేఁటకాండ్రంతయు కేకలు వేయుచు వచ్చి రాజును పరివేష్టించిరి. అంతట రాజు వారిచే నాపందుల బొందులను ఎత్తించుకొని యందుండి కదలి పట్టణపుదారిఁబట్టి వచ్చుచు నొక్కచోట నతిప్రయాసమున నడపదగిన గొప్పగొప్ప వ్రతములను నడపుటచే మిక్కిలి చిక్కిపోయిన దేహముతో మంచిగాలికి కొట్టుకొనిపోవువానివలె ఎముకలు బయిటవేసికొని ముడుతలు పడినచర్మముతోడి దేహముపై కృష్ణాజినమును కప్పుకొని వేదోక్తమంత్రములను జపించుచు మిక్కిలి పెరిగినగోళ్లచేతను రోమములచేతను చూడ ననువుగాక మెల్లగా వచ్చుచున్నవైఖానసుఁడైనహారీతుఁడను బ్రాహ్మణునిఁ జూచి రాజు ఆయనకు త్రోవ యిచ్చి దారిమోరను నిలిచి ఆయనపాదములు తనశిరస్సు సోఁకునట్లు సాగిలఁబడి మ్రొక్కి చేతులు జోడించుకొని నిలువఁబడెను. అప్పు డాఋషీశ్వరుఁడు దిలీపునిఁ జూచి యతని యలంకారాదులచేత నతఁడు రాజని తెలిసికొని యతనికి మేలు కలుగఁజేయఁదలచినవాఁడై, రాజా! అతిపావనమును మంగళకరము నైనమాఘమాసమునందు తెల్లవారుఝాఁట స్నానముచేయక మంచి యుదకము గలసరస్సునొద్దనుండి పోవుచున్నావే అది యేమి అనియడిగెను. అందులకు రాజు, ఓ బ్రాహ్మణోత్తమా! మాఘమునందలిస్నాన

కీదృక్తన్మే కథయ విస్తరాత్. ఇతి భూపవచ శ్శ్రుత్వా ప్రాహ వైఖానసో మునిః, భగవాన్ ద్యుమణి శ్శీఘ్ర మభ్యుపైతి తమోనుదః. స్నానకాలో౽య మస్మాకం న కథావసరో నృప, స్నాత్వా గచ్ఛ కులాచార్యం వసిష్ఠం పృచ్ఛ భూపతే. ఇత్యుక్త్వా తాపసో మాఘస్నానాయ నిర్గతః, ప్రత్యావృత్య దిలీపో౽పి తత్ర స్నాత్వా యథావిధి. తర్పయిత్వా పితౄన్ దేవాన్ ఋషీనథ విశేషతః, నత్వా మునివరం వీరః కృత్వా తు కరసంపుటమ్. స్థిత స్తూష్ణీం మహారాజ స్తత్సమీపే మహామతిః, హృద్గతం తస్య విజ్ఞాయ త్వనుజ్ఞాం ప్రదదౌ తతః. సో౽నుజ్ఞాత స్తథా రాజా కృతకృత్య స్సుఖేన చ, పున స్స్వనగరీం ప్రాప వీరో౽సౌ హర్షపూరితః. పూజితో నాగరై స్సర్వై స్స్తుతో౽సౌ వన్దిభి స్తథా, అంతఃపురం వివేశాథ వానప్రస్థకథాం స్మరన్. ఉషిత్వా తత్ర రాజా వై నిశామేకాం సుఖేన చ, ప్రభాతే పునరుత్థాయ దిలీపో భూభృతాం వరః. శ్వేతాశ్వం రథ మారుహ్య సుశ్వేతచ్ఛ

---

ఫలము ఎట్టిదో నే నెఱుఁగను. దానిని నాకు తెలియఁజెప్పుమనఁగా నావైఖానసుఁడు రాజా భగవంతుఁడైన సూర్యుఁడు లోకము నావరించిన యంధకారము నెల్లను తొలఁగించుచు ఉదయించుచున్నాఁడు. ఇది స్నానసమయము గాని కథలు చెప్పుటకుఁ దగినసమయము కాదు. కనుక మేము స్నానము చేయఁబోవుచున్నాము. నీవును ఇప్పుడిచ్చట స్నానము చేసిపోయి మీకుఁ గురువైన వసిష్ఠుని నడిగి యీస్నానమువలని ఫలమును దెలిసికొనుము. అని చెప్పి మఱుమాట లేక స్నానము చేయఁబోయెను.

దిలీపుఁడును మరల నాసరస్సునకుఁ బోయి యథావిధిగా స్నానము చేసి దేవర్షి పితృతర్పణములను గావించి ఆ ఋషీశ్వరునికి నమస్కరించి ఆయన యెదుట చేతులు కట్టుకొని నిలువఁబడఁగా నాయన మహారాజును మహాబుద్ధిమంతుఁడు నైన దిలీపుని యభిప్రాయము తెలిసికొని పట్టణమునకుఁ బోవ సెలవిచ్చెను.

అట్లు దిలీపుఁడు సమయోచితకృత్యములు నడపినవాఁడును వృద్ధతాపసుని యనుజ్ఞ నడపినవాఁడు నై యత్యంతసంతోషముతో నెమ్మదిగా తన పట్టణమునకుఁ బోయి పురజనులెల్లను బూజింపఁగా స్తుతిపాఠకులు బిరుదు లుగ్గడించి పొగడఁగా నంతఃపురము సొచ్చి యారాత్రి సుఖముగాఁ గడపి మఱునాఁడు తెల్లవాఱి లేచి వానప్రస్థుఁడైన యాఋషి చెప్పినమాటలు తలఁచుకొని మంచివస్త్రములు కట్టుకొని యెల్లసొమ్ములు పెట్టుకొని మంచివాసన గలగంధము పూసికొని పువ్వులు దాల్చి తెల్లగొడుగు వింజామరలు

త్రచామరః, సాలంకార స్సువాసాశ్చ సుపుష్పా మన్త్రిభి స్సహ. జయశబ్దాన్ పురశ్శృణ్వన్ స్తుతో మాగధవన్దిభిః, వసిష్ఠ స్యాశ్రమంయాతో ఋషివాక్య మనుస్మరన్. నత్వా బ్రహ్మర్షి మనఘం వినయాచారపూర్వకమ్, దత్తాసనో గృహీతార్ఘ్య ఆశీర్భిః కృతమఙ్గళః. సానన్దం మునినా పృష్టః కుశలం భూపతి స్తథా, అథో ఇ త్యబ్రవీ ద్రాజా హర్షయన్ మునిపుఙ్గవమ్. సోఽథ వైఖానసే నోక్తం పృష్టవాన్ మధురాకృతిః. దిలీపః—భగవన్ త్వత్ప్రసాదేన శ్రుతో విస్తరతో మయా, ఆచారో దణ్డనీతిశ్చ రాజధర్మాశ్చ యే పరే. వర్ణాశ్రమవిభాగానా మాశ్రమాణాం చ యాః క్రియాః, దానాని తద్విధానాని యజ్ఞా స్తద్విధయ స్తథా. వ్రతాని తత్ప్రతిష్ఠా చ విష్ణో రారాధనం తథా, అధునా శ్రోతు మిచ్ఛామి మాఘస్నానస్య య త్ఫలమ్. విధేయం య ద్విధానేన త న్మే బ్రహ్మమునే వద. వసిష్ఠః—సమ్య గుక్తం పరం జ్ఞేయం లోకద్వయహితావహమ్, నిర్మలీకరణం తేన మునినా వనవా

---

మొదలగువారితో తెల్లనిగుఱ్ఱములను గట్టి తనసారథి తోలివచ్చినరథము నెక్కి మంత్రులు మొదలగు వారుచితవేషములతో తమతమవాహనము లెక్కి యుభయపార్శ్వములందు గొలిచి రాఁగా ముందర జయజయశబ్దములతో వంశావళిచదువువారును స్తుతిపాఠకులును పొగడుచు నడవఁగాఁ బట్టణమునుండి వెడలి వసిష్ఠమహాముని యాశ్రమమునకుపోయి పాపరహితుఁడును బ్రహ్మర్షియు నైనయామునీశ్వరునికి మిక్కిలి వినయముతో మ్రొక్కి ఆయన ఇచ్చుదీవనలను సత్కారములను పొంది, ఆయనయనుమతివలన తగినపీఠమునందు గూర్చున్నవాఁడై ఆకులగురుని కుశల మడిగి వైఖానసమహర్షి యానతిచ్చినవిషయమును గూర్చి యిట్లు ప్రశ్నచేసెను.

దిలీపుఁ డడుగుచున్నాఁడు.—షడ్గుణైశ్వర్య సంపత్తి గలయోగురువర్యా, మీయనుగ్రహముచేత సదాచారక్రమమును దండనీతివిషయములను ఇంకను తెలియఁదగిన రాజధర్మములను బ్రాహ్మణాదు లైననాలుగువర్ణములయు బ్రహ్మచర్యాదు లయిననాలుగాశ్రమములయందుధర్మములను, దానములను, దానవిధులను, యజ్ఞములను, యజ్ఞములు నడపు క్రమములను, వ్రతములను, వ్రతాచరణవిధులను, విష్ణుపూజావిధానమును తెలిసికొంటిని. ఇప్పుడు పరమపావనమైన మాఘస్నానఫలములను వినఁగోరి వచ్చితి. ఆమాఘస్నానవిధానమును దానిమహిమను ఆనతిచ్చి నన్ను గృతార్థుని జేయవలయునని ప్రార్థించెను.

వసిష్ఠునివాక్యము.—రాజా! వనవాసి యైనయావైఖానసుఁడు చెప్పినమాఘమాహాత్మ్యము చక్కఁగాఁ దెలిసికోఁదగినది. ఇహపరములందు మేలుగలుగఁజేయునది.

సినా. క్రతుభక్కామినం యే వై ప్రత్యాసత్తి మఖణ్డితామ్, కామయ
న్తే మృగార్కే తే స్నాతుం స్రోతసి సర్వదా. వినా వహ్నిం వినా
యజ్ఞ మిష్టాపూర్తం వినాపి యే, వాఞ్ఛన్తి స్వస్తి తే స్నాన్తు ప్రాత
ర్మాఘే బహిర్జలే. గోభూతిలహిరణ్యాని స్వర్ణధేనుశతాని యే, అదత్వే
చ్ఛన్తి వై స్వర్గం తే మాఘే స్నాన్తు సర్వదా. త్రిరాత్రైస్సువ్రతైః
కృచ్ఛ్రైః పరాకైశ్చ నిజాం తనూమ్, అశోష్యేచ్ఛన్తి యే స్వర్గం
తే మాఘే స్నాన్తు సర్వదా. నీరాన్నే చైత్రవైశాఖే తపే పూజాచ
కార్తికే, జపహోమౌ తథా దానం మాఘమాసే నృపోత్తమ, సా
నుబన్ధ స్సుపర్యాప్తో ధరాధీశో భవే ద్ధ్రువమ్, కైవల్యోత్పాదికా బు
ద్ధిః యయాఽసౌ న భవే త్పునః. స దాగ్నౌ పరివస్యా సా విహితా
దివ్యలోచనైః, త దక్షయం తపో దానం మాఘమాసే నృపోత్తమ.

---

పరమపావన మయినది. ఎవరు దేవతాస్త్రీలతోడి యొడతెగనిసంబంధము నపేక్షింతురో వారు సదా మాఘమాసమునందు ప్రవాహములలో మునుఁగఁగోరుదురు. ఎవరు గార్హ్యాగ్నియుఁ శ్రౌతాగ్నియుఁ లేకయు యజ్ఞములు చేయకయుఁ అన్నసత్రములు పెట్టకయుఁ చెరువులు మొదలగునవి వేయింపకయుఁ పుణ్యముఁ బొందఁగోరుదురో వారు మాఘమాసమునందు ఊరిబయటి తటాకాదులయందు ప్రాతఃకాలమున స్నానముచేయుఁదురు. ఎవరు గోదాన భూదాన తిలదాన హిరణ్యదానములును బంగారుతోఁ జేయఁబడిన గోవుల దానమును చేయక పుణ్యలోకములను పొందఁగోరుదురో వారు మాఘమునందు తప్పక ప్రాతస్స్నానము చేయుదురు. ఎవరు త్రిరాత్రోపవాసాదులయిన యుత్తమవ్రతముల చేతను [1]కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తముల చేతను సూర్యగ్రహణాదులయందలి స్నానముల చేతను శరీరమును గృశింపఁజేయకయే స్వర్గసుఖము నొందఁగోరుదురో వరు మాఘమాసమున విధివిహితముగా స్నానము చేయుదురు. చైత్రవైశాఖమాసములలో జలాన్నములును, జ్యేష్ఠాషాఢమాసములలో అర్చనమును, కార్తిక మాసమునందు జపహోమములును, మాఘమాసమునందు స్నానదానములును ఎవరుచేయుదురో వారు తమ్ము సంబంధించినవారితోడ మిక్కిలి తృప్తిని వహించి కడపట సర్వభూమండలమునకును ఏలిక లగుదురు. దేనిచేత తాను మరల జన్మము నొందకుండునో అట్టిమోక్షమునకు సాధక మయినబుద్ధియుఁ గలుగును. అట్టిబుద్ధి దివ్యజ్ఞానమును అగ్నిపూజయు గలది

---

[1] మూఁడుదినములు పగలే భోజనము చేసియుఁ మూఁడుదినములు రాత్రియే భోజనము చేసియుఁ మూఁడుదినములు తనంత లభించినపదార్థములను భుజించియుఁ పిమ్మట మూఁడుదినములు భోజనమే లేకయుఁ ఉండి చేయునట్టివ్రతము సాంతపనము, అదిమొదలుగాఁ గలవ్రతములను నడపుట కృచ్ఛ్రము అనఁబడును,

సంపదే చ సుజాయాయై రతయే తద్వినాపి వా, కాయశుద్ధ్యర్థ మపరే చతుర్థం స్నానజం ఫలమ్. నిరన్నా హ్యదితి స్స్నాత్వా మాఘ ద్వాదశమాసికే, ఇంద్రాద్యాన్ ద్వాదశాదిత్యాన్ లేభే త్రైలోక్యవిశ్రుతాన్. సుభగా రోహిణీ మాఘా ద్దయాశీలా హ్యరున్ధతీ, శచీ చ రూపసంపన్నా ప్రాసాదే సాప్తభౌమికే. తుములీకృతశోభాఢ్యే నర్తకీలలితాజిరే, ద్విపకర్ణమరుచ్ఛన్నే రూపవత్ స్త్రీజనాకులే. జితవాదిత్రనిర్ఘోషే మఙ్గళాచారశోభితే, వేదమంత్రైః పవిత్రే చ తత్త్వద్విజసమాకులే. సురార్చనకృతే రమ్యే సదా తిథినిషేవితే, ముదితాస్తే వసన్తీహ యై స్స్నాత్తం మకరే రవౌ. దత్తం యై ర్బహుధా మాఘే పురారి స్సుపరిష్కృతః, తే యాన్తి సదనం శమ్భో స్సర్వకామప్రపూరితమ్. ఇష్టవస్తుపరిత్యాగా న్నియమస్య చ పాలనాత్, ధర్మమూల స్సదా మాఘో ధర్మమూలం నికృన్తతి. కామమూలఫలద్వారో నిష్కామో

---

యగును. మాఘమాసమునందు చేయఁబడుదానము ఎన్నఁడును చెడనితపస్సును బోలినదగును. మఱియు సంపద లభింపను, మంచిభార్య కలుగను, సంభోగము ప్రాప్తింపను, అటు గానిపక్షమున శరీరశుద్ధికయ్యును ఈస్నానము అని కొందఱు తలఁతురు. కనుక పూర్వకాలమునందు దేవతల తల్లియైన యదితి పండ్రెండునెలల కొకతూరి వచ్చునదియైన యీమాఘమాసమునందు ఆహారము లేనినియమముతో స్నానము చేసి మూఁడు లోకములలోను ప్రసిద్ధులైన యింద్రాదిదేవతలను ద్వాదశాదిత్యులను గనెను. సౌందర్యవతియైన రోహిణియు, దయామతియగు నరుంధతియు, సౌభాగ్యవతియైన శచియు, మఱియు ననేకులును ఈ మాఘమాసమునందు స్నానముచేసి మనోజ్ఞమయిన కాంతిచే నొప్పునదియు, వేశ్యలనాట్యములచేత నందగించు ముంగిళ్లుకలదియు, ఏనుఁగుల చెవులనెడు విసనకఱ్ఱలవలనఁ బుట్టినగాలిచేత నావరింపఁబడునదియు, చక్కఁదనము గల యిల్లాండ్రచేత సందడించునదియు, చెవుల కింపుగా వినఁబడెడి యాటపాటల రొదలు గలదియు, శుభకార్యములచే వెలుఁగొందునదియు, వేదమంత్రములచే పవిత్రమయినదియు, తత్త్వము తెలిసిన సద్బ్రాహ్మణులతోఁ గూడుకొనినదియు, ఎల్లప్పుడును అతిథులచే సేవింపఁబడుచుండునదియు, మిగుల మేలైనదియు నైన దివ్యమందిరమునందు సంతోషముతో నివసించుచున్నారు. మాఘమాసమునందు విశేషదానములును శివార్చనమును చేయువా రెల్లకోరికలు పొందఁదగిన శివునినివాసమయినకైలాసమున వసింతురు. మఱియు నీమాఘమాసమునందు నియమముతో నిష్టవస్తువులను వర్జించువారును, మంచినియమమును పాటించువారును శివపదము నొందుదురు. ధర్మమునకు మూలమును అధర్మమునకు మూలచ్ఛేదకమును, కోరినఫలములను పొందుటకు త్రోవయు, కోరికలు

మోక్షద స్తథా, యే లోకా దానశీలానాం యే లోకా విపినౌక సామ్. యే లోకాతిథిభక్తానాం తే మాఘస్నాయినాం సదా, దేవ లోకా న్నివర్తన్తే పుణ్యై రన్యైః పరంతప. కదాచి న్న నివర్తన్తే మాఘస్నానరతా జనాః, నాతఃపరతరం కించి త్తపో నాతః పరం మ హత్. ఏతదేవ పరం తప్యం సద్యో దురితనాశనమ్, విద్యాధరాయ కథి తం భృగుణా మణిపర్వతే, కశ్చిద్విద్యాధరో రాజన్ ధర్మేణ ప్రతి బోధితః.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, దిలీపస్య
మృగయాదికప్రసఙ్గో నామ ద్వితీయోఽధ్యాయః.



లేనివారికి కోరకుండు బుద్ధినిచ్చునదియు ముక్తిప్రదము నయిన యీమాఘమాస మెల్ల పాపములను మూలముట్టుగ నాశము చేయును. దాన మిచ్చుటయే స్వభావముగాఁ గలవారికిని, అడవియందె నియమముతో వాసము చేయువారికిని ఏలోకములు లభిం చునో ఆలోకములు మాఘస్నానము చేసినవారికి తప్పక లభించును. ఏపుణ్యముచేతనైన స్వర్గమునుండి మరలుదురుగాని మాఘస్నానమువలని పుణ్యముచేత ఎప్పటికిని ఎవరును స్వర్గమునుండి మరలరు. మానవులు తరించుట కింతకంటె నితర మయిన సులభోపా యము లేదు. ఇంతకంటె గొప్పతపస్సును లేదు. ఎప్పుడు చేయుదుమో అప్పుడే పాప ములను నశింపఁజేయునట్టిదైన యిది తప్పక చేయఁదగిన కార్యము. ఈకథ పూర్వ కాలమునందు మణికూటపర్వతమునందు భృగుమహర్షి చేత నొకానొక గంధర్వునకుఁ జెప్పఁబడె నని వసిష్ఠమహాముని దిలీపునితోఁ జెప్పెను.

ఇది పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమందు దిలీపుఁడు
వేఁటాడఁబోవుట మొదలగువానిని తెలియఁజేయు
ద్వితీయాఽధ్యాయము.



## తృతీయోఽధ్యాయః.

దిలీపః. బ్రహ్మన్ కదా భృగు ర్విప్రో నిజగాద మహీధరే, తస్మై ధర్మోపదేశం తం కథ్యతాం మే కుతూహలాత్. వసిష్ఠః. ద్వాదశాబ్దం పురా రాజ న్నవవర్షు ర్వలాహకాః, తేనోద్విగ్నాః ప్రజాస్సర్వా హిమవత్సహ్యయో ర్నృప. స్వాహా స్వధా వషట్కారవేదాధ్యయనవర్జితే, సోపప్లవే సదా లుప్తసర్వధర్మే చ నిష్ప్రభే. ఫలమూలాన్నపానీయహీనే వై భూతలే తథా, విన్ధ్యపాదే తరుచ్ఛన్నే రమ్యే రేవాతటాశ్రమాత్. సహశిష్యై ర్వినిష్క్రమ్య హిమాద్రిం సంగతో భృగుః. తత్ర తిష్ఠతి కైలాసగిరేః పశ్చిమతో గిరిః. మణికూట ఇతి ఖ్యాతో హేమరత్నశిలోచ్చయః, అధోర్ధ్వస్ఫటికశ్వేతో మధ్యే నీలశిలో గిరిః. భాతిభి స్సర్వతశ్శుభ్రో నీలకణ్ఠ ఇ వాబభౌ, ఇన్ద్రనీలశిలాఢ్యస్తు హేమరేఖాన్తరాన్తరః. స్ఫురద్విద్యుల్లతః కృష్ణజీమూత ఇవ రా

---

## మూఁడవ యధ్యాయము.

దిలీపునిమాటలు.—బ్రహ్మర్షియైన యోవసిష్ఠమునీశ్వరా, ఎప్పుడు మణికూట పర్వతమునందు భృగుమహాముని గంధర్వునికి ధర్మోపదేశము చేసెనో నాకు తెలియ నానతిమ్ము. వసిష్ఠుని మాటలు—ఓదిలీపుఁడా! పూర్వకాలమునందు ఒకానొకప్పుడు వానలేక కాటకము సంప్రాప్తముకాఁగా హిమవత్పర్వతమునకు సహ్యపర్వతమునకు నడిమి దేశములందుండు జనులెల్ల అన్నవస్త్రములులేక చాల డస్సిరి. అప్పుడు హోమకార్యములు నడుపుటకును దేవతానివేదనమునకును పితృదేవతానివేదనమునకును వలయు పదార్థములు లేకయుం వేదపాఠములు జరుగకయుం క్రూరజనులవలని బాధ మెండుకాఁగా ఎల్లధర్మములును చెడి ఆహారమునకు పండ్లు దుంపలు వేళ్లు సయితము చిక్కకయుం గుంటలు చెరువులు పాడుపడి నీళ్లు చిక్కకయుం పోఁగా, భృగుమహాముని బహువిధములయిన వృక్షములుగలిగి అందగించునట్టి రేవానదిగట్టునందలి తనయాశ్రమమునందు నిలువలేక అందుండి వెడలి తనశిష్యులతోఁగూడ హిమవత్పర్వతమునకుఁ బోయిచూడఁగా, దానికిపడమటితట్టున కైలాసపర్వతమునొద్ద స్వర్ణమయములను రత్నమయములు నయిన రాళ్లచేత మిక్కిలియున్నతమై క్రింద పైన స్ఫటికపురాళ్లచేత తెల్లనై నడిమిభాగమున ఇంద్రనీలమణులచే నల్లనై దేహమునందు తెల్లనిబూది పూసికొని పల్లవన్నెజడముడిని నల్లని మెడయును గలశివుఁడోయనునట్లు ప్రకాశించుచుండునదియుం, అచ్చటచ్చట ఇంద్రనీలమణులును బంగారువన్నెజాజురేఖలును గలిగి తీఁగమెరపులతోడి వర్షాకాలపు మేఘమువలె వెలుఁగుచుండునదియుం, శిఖరములయందు ఇంద్రనీలమణులునుమధ్యభాగమునందు

జతే, మూర్ధ్ని నీలశిల శ్శైల స్సోఽధః కాంచనమేఖలః. నారాయణ ఇవాభాతి ధృతపీతామ్బర స్తథా, ఆమేఖలం సునీలాభో మధ్యే మధ్యే సితోత్పలః. సతారక మివ వ్యోమ రాజతే స్మ మహీధరః, లబ్ధాత్మన స్సుహృద్దీప్తదీప్తదివ్యౌషధీధరః. బహుదీపకృతో గేహ ఇవాహో నిశి భాసితః. అధిత్యకాసు సంగీతైః కిన్నరీణాం సకీచకైః, రమ్యాభపత్త్రపతాకాభి రుత్స ఏవ సదాచలః. హరితోపలవైదూర్య పుష్యరాగసితాశ్మభిః, ఇన్ద్రాశ్మమణ్డలైస్సోఽభూ దిన్ద్రచాపై రివావృతః. సర్వధాతుమయై ర్హేమై ర్నానారత్నవిభూషణైః, సోఽగ్నిజ్వాలాభి రాక్రాన్త శృఙ్గై రివ విరాజితః. తస్యాగస్య నితమ్బేషు శిలాసు మసృణాసు చ, విద్యాధరా నిషేవన్తే సపత్నీకా జితశ్రమాః. నిరుద్ధాంతర్మరున్మార్గా జితక్లేశా విరాగిణః, ధ్యాయన్త్యహర్నిశం బ్రహ్మ రమ్యసానుగ్రహేషు చ. సాక్షసూత్రకరా

బంగారువన్నె రేఖలుగలిగి పీతాంబరమును ధరించిన విష్ణుమూర్తివలె తేజరిల్లుచుండునదియు, నల్లగాఁ గానవచ్చు నెత్తపుపట్టులందు నడుమనడుమ దోఁచు స్ఫటికపురాళ్లు మినుకు మినుకుమనఁగా నక్షత్రములతోఁడి ఆకాశమువలె మెరయుచుండునదియు *విశల్యకరణి లోనుగాగల జ్యోతిస్స్వరూపములైన మూలికలచేత రేలుంబగళ్లును పెక్కుదీపములు వెలుగగా ఒప్పునట్టిమహాగృహమును పోలియుండునదియు, చరులయందు పిల్లనగ్రోవులు ఊదుచు పాటలుపాడుచు చెంచెతలు తిరుగగా, టెక్కెములను బోలిన అరటియాకులును పచ్చలు నీలాలు తరుపులు మొదలు గాఁగల రత్నములకాంతులు ఒండొంటితోఁ గలసి ఆకాలమునందు తోఁచునట్టి యింద్రధనుస్సులో ఆనఁదగియుండఁగా †గైరికాది ధాతువులచేతను బహువిధములైన రత్నములచేతను జ్వాలలతోఁ గూడిన అగ్నివలెనే తోఁచుచుండునట్టిదియు సైనమణికూటము అనుపర్వతమొకటియుండెను. ఆకొండమీఁది చదరపునేలలయందు నున్ననిచాపఱాళ్లపై నివసించి అనేకులు గంధర్వులు తమతుఁ గలవిహారములవలని బడలికలు పోఁగొట్టుకొనుచుందురు. అందలి చరులయందు ప్రాణవాయువులను బిగఁబట్టుకొని సర్వదుఃఖముల నెడఁబాసి వర్తించునట్టి విరాగులు పగళ్లను రాత్రులందును ఏకాంతగృహములందువలె అచంచలులై పరబ్రహ్మమును ధ్యానించుచు ఆకొండగవులయందు చేరుకొని అనేకులు సిద్ధులు చేతులందు జపమాలికలు వ్రేలఁగా సగము మూసినకన్నులతో భగవంతుని ధ్యానించుచుందురు.

* సంధులు వదలిన యెముకలను మరలఁ గూర్చునట్టి మహిమ గలమూలిక.

† కొండమీఁద వాననీళ్లు జాఱుటచేత నేర్పడునట్టి ఎఱ్ఱని పచ్చనిచారికలు.

స్సిద్ధా అర్ధోన్మీలితలోచనాః, ఆరాధయతి భూతేశం సున్దరీషు దరీషు చ. మన్దారకుసుమామోద సురభీకృతదిఙ్ముఖాః, పతన్నిర్ఝరిణీవారి ఝంకారముఖరా స్సదా. ఉపత్యకాసు ఖేలద్భి ర్వన్యాశ్వైః కలభైర్గజైః, కస్తూరీమృగయూథైశ్చ చారుచిత్రమృగై స్సదా. విలసచ్చమరీబృన్దైర్విచిత్రై శ్శ్వాపదై స్సదా, శుకైః పారావతై శ్చైవ చకోరైః కలకణ్ఠకైః. రాజహంసై ర్మయూరై శ్చ సదా రమ్య స్స పర్వతః, సరోవరై స్సురమ్యైశ్చ వాపీభి స్సర్వతో గిరిః. ఫుల్లేన్దీవరకల్హారపద్మినీషణ్డసేవితః, భ్రమరా స్తత్ర గాయన్తి మధుమత్తా మధుస్వరమ్. గన్ధలుబ్ధాః ప్రధావన్తి సరస శ్చసరోత్తమమ్, సేవ్యమానస్సదా దేవై ర్గుహ్యకై రప్సరోగణైః. దిలీపః—సర్వైశ్వర్యమయ శ్శైల స్సర్వసిద్ధసమాశ్రయః, భగవన్ కియ దుచ్ఛ్రాయః కియ దాయామవిస్తరః. వక్తు మర్హసి

ఆదిగాక ఆకొండ ఎల్లదిక్కులను వ్యాపించుచున్న పరిమళముతోడి పువ్వులుగల పారిజాతవృక్షములచేతను, పైనుండి ఎడతెగక పడునట్టి జలధారలశబ్దములచేత భయముపుట్టించునట్టి సెలయేళ్లచేతను, సమీపభూములయందు కడుపార మేసి మదించి సంచరించునట్టి అడవిగుఱ్ఱములు ఏనుఁగుగున్నలు కస్తూరిమృగములమందలు పలువన్నెలు గలవి యగుటచేత అందగించు జింకలయు గురుపోతులసమూహములు నానావిధములయిన మృగములను గొట్టి తినియే బ్రతుకునట్టి మహామృగములు మొదలగువానిచేతను, చిలుకలు, పావురములు కోవెలలు మొదలగు పక్షులచేతను, రాజహంసలచేతను, నెమళ్లచేతను, తామరలు నల్లగలువలు తెల్లగలువలు మొదలగునవి యెల్లప్పుడు విరిసి పరిమళించుచుండఁగా సుందరము లగుసరస్సులచేతను, దిగుడుబావులచేతను మిక్కిలి రమణీయమై యుండును. అట్టియాకొండయందు తుమ్మెదలు మధురములయిన పూఁదేనెలు త్రాగి మదించి చెవులకింపుగా గానము చేయుంత్రొత్తవాసనలయందు దాసక్తికలవై ఒక తామరకొలనినుండి మఱియొక తామరకొలనికి పాఱుచుండును. ఇదిగాక ఆకొండ దేవతలచేతను, దేవయోనివిశేషులయిన విద్యాధరులచేతను, ఎల్లప్పుడు సేవింపఁబడుచుండును.

దిలీపునిమాటలు:—షడ్గుణైశ్వర్య సంపత్తి గలయోమునీంద్రా! ఎల్ల వింతలకును ఉనికిపట్టయినదియు సిద్ధులు సాధ్యులు మొద లగువారికెల్లను చోటయినదియు నైన ఆకొండపొడు గెంత? దానినిడివి యెంత? వెడలుపు ఎంత? అదియంతయు వినవలెనను కోరిక నాకు గలదు. విశదముగా తెలియఁజెప్పుము. నీవే ఈవిషయమును నాకు తెలియఁజెప్పఁ గలవాఁడవు.

సర్వజ్ఞ శ్రోతుకామాయ విస్తరాత్. వసిష్ఠః— షట్త్రింశద్యోజనోచ్ఛ్రితో మస్తకే దశయోజనః, ఆయామవిస్తరాభ్యాం సమూలే షోడశయోజనః. హరిచన్దనమన్దార చూతరాజీవిరాజితః, దేవదారుద్రుమాకీర్ణ స్సరళార్జునశోభితః. కాలాగరులవఙ్గైశ్చ పున్నాగై శ్చంపకై స్సదా, విరాజతే గిరిశ్రేష్ఠ స్సదాపుష్ప స్సదాఫలః. తం దృష్ట్వా పర్వతశ్రేష్ఠం దుర్భిక్షభయపీడితః భృగు శ్చకార తత్రైవ వసతిం హృష్టమానసః. తస్మి న్మనోహరే శైలే తత్ర తత్థా వనాన్తరే, చిరకాలం వసన్ తేపే తప స్సుచరితం భృగుః. ఏవం తిష్ఠతి రాజేన్ద్ర ద్విజే స్వాశ్రమవాసిని, అవతీర్యాగతౌ శైలాత్తం విద్యాధరదమ్పతీ. సమాగమ్య మునిం నత్వాస్థితౌ తా వతిదుఃఖితౌ, తథావిధౌ తు తౌ దృష్ట్వా మఞ్జువాక్యం ద్విజోఽబ్రవీత్. భృగురువాచ.—వద విద్యాధరశ్రేష్ఠ యువాం కి మితి దుఃఖితౌ, శ్రుత్వా తస్య మునే ర్వాక్యం ప్రాహ విధ్యాధరో ద్విజమ్. విద్యాధర ఉవాచ.—శ్రూయతాం తద్ద్విజశ్రేష్ఠ మమ దుఃఖస్య కారణమ్, సుకృతస్య ఫలం ప్రాప్య లబ్ధ్వాపి త్రిదశాలయమ్. లబ్ధ్వాపి దేవతాదేహం ముఖం వ్యాఘ్రస్య

వసిష్ఠుఁడు చెప్పుచున్నాఁడు.—ఓ దిలీపా! వినుము. ఆకొండపొడవు ముప్పదిమూఁడుయోజనములు. దానిశిఖరము పదియోజనముల విరివి గలది. దానియడుగుభాగము పదియాఱుయోజనములవిరివి గలది. అది మంచిగంధపుచెట్లచేతను పారిజాతపుమ్రాఁకులచేతను ప్రకాశించుచుండును. మఱియు నందు దేవదారువు, సరళము, అగరువు, లవంగము, సురపొన్న, సంపెఁగ మొదలగువృక్షములును గలవు. అందు ఎప్పుడును పువ్వులు పండ్లు వలసినన్ని యుండును. అట్టివాసయోగ్యమయిన పర్వతమును జూచి భృగుమహాముని మిగుల సంతోషించి కరవువలని భయముతీఱ అందునివసింప నిశ్చయించి అచ్చట మనోహరమైన ఒకతోఁటయందు ఆశ్రమము కావించుకొని చాలకాలము తపస్సు చేయుచుండెను. ఆసమయమునందు ఒకగంధర్వుఁడు తనభార్యయు తానును ఆయాశ్రమమునకువచ్చి భృగుమహామునికి మ్రొక్కి మిక్కిలి చింతింపసాగెను. భృగువు ఆగంధర్వదంపతులను జూచి ఆదరించి మీరు దుఃఖింప నిమిత్త మేమి అని అడుగఁగా విద్యాధరుఁడు తనవృత్తాంతము నిట్లు చెప్ప నారంభించెను. ఓ బ్రాహ్మణోత్తమా! నాదుఃఖము ఏ మని చెప్పుదును. నేను పుణ్యఫలమువలన దేవశరీరమును ధరించి స్వర్గమును బొందినవాఁడనైనను పెద్దపులి మొగ మొకటి నాకు కలి

మేభవత్, న జానే కారణం తస్య విపాకో౽య ముపస్థితః. ఇతి సం
స్మృత్య సంస్మృత్య న లేభే శర్మ మే మనః, అన్యచ్ఛ్రూయతాం
విప్ర యేన మే వ్యాకులం మనః. జాయేయం మమ కల్యాణీ మఞ్జు
వాణీ సురూపిణీ, నృత్తగీతకలాభిజ్ఞా సర్వసద్గుణశాలినీ. యస్మిన్ కాలే
కుమారీయం తత్ర వా బాలయా౽నయా, విపఞ్చీం పరివాదిన్యా త
న్త్రీభి స్సప్తభి ర్భృశమ్. వీణావాదరసాభిజ్ఞ స్తోషితో నారద స్త్వ
యా, ముగ్ధభావేన గాయన్త్యా హ్యనయా రక్తకణ్ఠయా. విచిత్రస్వర
గానజ్ఞో రాజరాజో౽పి తోషితః, అస్యాః కౌతుకభిన్నాయాం వాద
యన్త్యాం విపఞ్చికామ్. నానావక్రగతిం చిత్రాం తాం శ్రుత్వా పఞ్చ
మధ్వనిమ్, తుతోషోద్భిన్నరోమాఞ్చో ధున్వ న్మౌళిం మహేశ్వరః.
శీలే నార్యగుణగ్రామరూపయౌవనసంపదా, అనయా సదృశీ లోకే
కాచి దస్తి నితమ్బినీ. క్వేయం దేవముఖీ నారీ క్వాహం వ్యాఘ్రము
ఖః పుమాన్, ఇతి సంచిన్త్య సంచిన్త్య దహ్యామి హృది సర్వదా.
వసిష్ఠః— ఇతి విద్యాధరేణోక్తం శ్రుత్వా కాకుత్స్థనన్దన, త్రికాలజ్ఞో

---

గెను. అందుకు కారణ మేమో తెలిసినది కాదు. ఇది యేదుష్కర్మపరిపాకమున నయి
నదో యీ పవిచారము నామనస్సును సర్వదా బాధించుచున్నది. నామనస్సున ఆట్టివిచారము
పుట్టుటకు ముఖ్యకారణము ఏమనఁగా, పరిశుద్ధురాలును తిన్ననిమాటలు గలిగినదియు
మంచి చక్కఁదనము గలిగినదియు ఆటపాటలయందు నేర్పు గలిగినదియు నైన యిది
నాభార్య. ఎల్లమంచిగుణములును దీనియందే కలవు. ఇది పసితనమునందు కన్యగా
నున్నప్పుడే ఏడుతంతులవీణెను సాధారణమయినవీణెను వాయింపనేర్చి వీణాగానరస
మును గుర్తెఱిఁగిన నారదుని మెప్పించెను. ఇది గాక బాల్యచాపల్యముచే ప్రౌఢవోలెకు
పాడునప్పుడే షడ్జము మొదలయిన స్వరములమర్మము నెఱిఁగిన కుబేరుని మెప్పించెను.
ఇది గానపరవశయై వీణె వాయించుచుండఁగాఁ బెక్కులు వక్రగతులు గలిగి వింతను
బుట్టించుచున్న పంచమస్వరయుక్త మయిన యీగానసంగీతమును విని శివుఁడు హర్షించి దేహ
మునందు గగుర్పాటు కలుగఁగా తలయూఁప సాగెను. ఇది స్వభావముచేతను,
మంచిగుణములచేతను, రూపముచేతను, వయసుచేతను, సంపదచేతను మేలిమిని
వహించినది. దేవతాముఖము గల ఇట్టిభార్య లభించియుం ఈపెద్దపులిముఖముతో దీనికి
దొరగానివాఁడనై యుండ నయ్యెనే యని నాస్థితిని పలుమాఱుఁ దలఁచితలఁచి మన
స్తాపము నొందుచున్నాను అనెను.

**వసిష్ఠునిమాటలు.—** దిలీపా! అట్లు ఆవిద్యాధరుఁడు తనదుఃఖమును చెప్పఁగా

భృగుః ప్రాహ ప్రహసన్ దివ్యలోచనః, శృణు విద్యాధరశ్రేష్ఠ విచిత్రం కర్మణః ఫలమ్. ప్రాప్య ప్రాజ్ఞా న ముహ్యన్తి ముహ్యన్త్యజ్ఞానచేతసః, మక్షికాపాదమాత్రం తు యథా హి విషమం విషమ్. క్రియా తు విహితాల్పాపి విపాకే దారుణా భవేత్, అణుమాత్రం విషం యత్తద్గ్రాహకాలే లవాగ్నివత్. తథైవానుభవే కాలే మహత్పీడాం కరోతి హి, తథైవ పాతకం కర్మ క్రియాకాలేఽల్పమేవ యత్. తద్భోగసమయే కర్తుర్విపాకే మేరుతాం వ్రజేత్, ఉపోష్యైకాదశీం మాఘే తైలాభ్యఙ్గం త్వయా కృతమ్. ద్వాదశ్యాం పారణా త్పూర్వం తేన వ్యాఘ్రముఖో భవాన్, ఉపోష్యైకాదశీం పుణ్యాం ద్వాదశ్యాం తైలసేచనాత్. కురూపం ప్రాప్తవాన్ దేహం పురా హ్యేవం పురూరవాః, దృష్ట్వాత్మానం కురూపం స తేన దుఃఖేన దుఃఖితః. రాజ్యం త్యక్త్వా తదా యతః కిం కరోమీతి చిన్తయన్, తపసే నిశ్చయం కృత్వా జగామ స్వపురం తతః. గిరిరాజం సమాగమ్య దేవతాసరస

---

నంగా భూతభవిష్యద్వర్తమానము లనుమూఁడు కాలములను గుర్తెఱిఁగిన ఆభృగుమహాముని తన దివ్యజ్ఞానముచే వానిస్థితియంతయు తెలిసికొని నవ్వుచు ఇట్లు పలికెను. ఓ విద్యాధరుఁడా! నిన్ను పొందిన విచిత్రమైన కర్మఫలమును చెప్పెదను వినుము. మంచి తెలివిపరులై అందులకుఁ దగినవివేకమును పొందినవారును భ్రమించి అలయుచున్నారు. విషము ఈఁగకాలంతయైనను ప్రాణబాధకమై పరిణమించునట్లు చేయఁబడిన కర్మము అత్యల్పమైనను అందలి యనుభవము బలవంతమైన దగును. విషమును కొంచెము త్రాగినను అది పిమ్మట నిప్పువలె తపింపఁజేయునట్లు దుష్కర్మము కొంచెము చేయఁబడినదైనను అనుభవసమయమునందు సంతాపము కలుగఁజేయకమానదు. కనుక పాపకృత్యము చేయుసమయమునందు అల్పముగాఁ దోఁచునుగాని అనుభవించునప్పుడు అట్లు తోఁచదు. అంతకంతకు పెరిగి మేరుపర్వతమువలెనే తోఁచుచుండును. నీవు మాఘమాసమునందు ఏకాదశినాఁడు ఒక్కపొద్దుండి ద్వాదశినాఁడు తలంటిపోసికొంటివి కాఁబట్టి నీకు ఈపులిమొగము గలిగెను. ఇట్లే పూర్వకాలమునందు పురూరవుఁడనురాజు పావనమైన ఏకాదశినాఁడు ఉపవాసముండి ద్వాదశినాఁడు తలంటుకొని కురూపియయి అందువలనివిచారముచే రాజ్యమును వదలి ఆరూపహీనతను పోఁగొట్టుకొనను ఉపాయమేమి యగునో యని విచారించుచు పట్టణమునుండి వెడలి హిమవత్పర్వతమునకుఁ బోయి, దేవసంబంధమైన ఒకసరస్సుగట్టున నివసించి మిక్కిలి యక్కఱతో ఆసర

స్తటే, స్థిత్వా చ పరమప్రీత్యా శుచి స్స్నాతః కుశాసనే. నవనీల ఘనశ్యామం నళినాయతలోచనమ్, శఙ్ఖచక్రగదాపద్మధరం పీతామ్బరం విభుమ్. కిరీటహారకేయూర ముక్తామాణిక్య భూషితమ్, కౌస్తుభేన విరాజన్తం వనమాలాధరం హరిమ్. చిన్తయన్ హృదయే రాజా నిగృహీతాఖిలేన్ద్రియః, మాసమాత్రం నిరాహార స్తప స్తేపే సుదుష్కరమ్ అల్పేన తపసా తుష్ట స్సప్తజన్మకృతార్చితః, సంస్మరం స్తస్య భూపస్య సాక్షా న్నారాయణ స్స్వయమ్. మాఘస్య శుక్లపక్షే తు ద్వాదశ్యాం మకరే రవౌ, కృపయా పరయా యు క్త స్తథైవ పురత స్స్థితః. శ్రియా పరమయా యు క్త స్తుతో గీర్వాణసత్తమైః, దృష్ట్వా రాజా త మాయాన్తం హరిం లోకగురుం ప్రభుమ్. దణ్డవ త్ప్రణిపత్యాథ కరపద్మాఞ్జలిస్థితః, ఉవాచ దేవదేవేశం హర్షగద్గదయా గిరా. కృతకృత్యోఽస్మి దేవేశ దర్శనేన త వానఘ, దుఃఖసంసారమగ్నం మాం సముద్ధర జనార్దన. భృగుః. శఙ్ఖాద్భి రభిషి చ్యాథ ముదా తం

---

స్సునందు స్నానముచేసి శుచియై దర్భాసనమునందుఁ గూర్చుండి వర్షాకాలమేఘమువలె నల్లనైన దేహమును, కమలములవలె వికాసముతోడి విశాలము లైనకన్నులును, శంఖము చక్రము గద పద్మము అనునాలుగింటిని బూనిననాలుగుచేతులును, బంగారువన్నెవస్త్రమునుగలవాఁడై, ప్రభువై, కిరీటము ముత్యాలపేరులు భుజకీర్తులు రత్నాలు వీనిచేత నలంకరింపఁబడి, కౌస్తుభమణిని వనమాలనుధరించి వెలుఁగొందునట్టి శ్రీవిష్ణుమూర్తిని మనసున నిలిపి, ఇంద్రియములను స్వాధీనముచేసికొని, ఆహారమేమియును లేక చేయ శక్యముగాని ఘోరమైనతపస్సు చేయఁగా, శ్రీవిష్ణుదేవుఁడు ఏడుజన్మములందు చేయఁబడినపూజవలన నెంతసంతోషము కలుగునో అంత సంతోషమును పొందినవాఁడై మాఘశుద్ధ ద్వాదశీ శుభదినమునందు శ్రీలక్ష్మీసమేతుఁడును దేవతాప్రభువు లైనబ్రహ్మాదులచేతఁ బొగడఁబడుచున్నవాఁడు నై యతనికి ప్రత్యక్ష మయ్యెను.

అంతట పురూరవుఁడు తపస్సు చాలించి లోకములకెల్లను ప్రభువును గురువు నైన శ్రీహరిని జూచి కఱ్ఱవలె చాగిలఁబడి మ్రొక్కి చేతులుజోడించుకొని సంతోషాతిశయముచేత డగ్గుత్తికపడి నోటమాట వెడలకుండఁగాఁ బ్రయత్నపూర్వకముగ ఎలుఁగు తెచ్చుకొని యాభగవంతునితో ని ట్లని విన్నవించెను. ఓయేలినవాఁడా! నీదర్శనముచేత నేను కృతార్థుఁడ నైతిని. ఎల్లదుఃఖములను గలుగఁజేయునది యైనసంసారము నం దుండి న న్నుద్ధరింపుము. అని వేఁడుకొనఁగా భగవంతుఁడు శంఖోదకములచేత

చక్రవర్తినమ్, వాసుదేవో దదౌ తస్మై స్మారయన్ తైలచేష్టితమ్. అతీవ సున్దరం రూపం కమనీయం మనోహరమ్, యేన తం చకమే దేవీ ఊర్వశీ చాప్సరోత్తమా. ఇతి లబ్ధవర సోఽపి కృతకృత్యః పురం గతః, ఇతి కర్మగతిం జ్ఞాత్వా కిం విద్యాధర ఖిద్యసే. భవాన్ పరిజిహీర్షుశ్చే దాననస్య విరూపతామ్, శీఘ్రం మద్వచనా దేవ ప్రాచీనాఘవినాశనమ్. మాఘమాసే కురు స్నానం మణికూటనదీజలే, ఋషిసిద్ధజనైర్జుష్టం కథయిష్యామి తద్విధమ్. తవ భాగ్యవశాన్మాఘో నికటః పఞ్చమేఽహని, పుష్యస్యైకాదశీం శుక్లా మారభ్య స్థణ్డిలేశయః. మాస మేకం నిరాహార స్త్రికాలం స్నాన మాచరేత్, త్రికాల మర్చయన్ విష్ణుం త్యక్తభోగో జితేన్ద్రియః. మాఘ స్యైకాదశీ శుక్లా యదా విద్యాధరోత్తమ, తదా నిర్దగ్ధపాపం త్వాం ద్వాదశ్యాం పుణ్యవాసరే. అభిషిచ్య శివై స్తోయై ర్మన్త్రపూతై రహం సుర, కామవత్త్రోపమం వక్త్రం కరిష్యామి త వానఘ. దేవతావదనో భూత్వా త్వం విద్యాధరసత్తమ,

---

(సంతోషబాష్పములచేత) అతని నభిషేకించి అభ్యంగముచేత సైనకార్యమును జ్ఞప్తికి దెచ్చుచు ఎట్టిరూపముచేత అప్సరసలలో ముఖ్యురాలయినయూర్వశి యతనిని వరించెనో అట్టిరూపము అతనికి కలుగ ననుగ్రహించెను. ఇట్లు సురూపమును బొంది కృతార్థుడై పురూరవుఁడు తనపట్టణమునకుఁ బోయి యెప్పటివలె సుఖముగ నుండెను.

ఓయీ విద్యాధరుఁడా! నీవు నట్లు తగినప్రయత్నముఁజేయక యేల పూర్వకృతమును దలఁచి దుఃఖించెదవు. నీవికారముఖమును బోఁగొట్టఁ గోరదలఁచినయెడల నామాట విని యీమణికూటపర్వతమునందలి యేటిలో పూర్వముచేసిన పాపములనెల్ల నశింపఁజేయునది యైన మాఘస్నానమును చేయుము. ఋషులచేతను, సిద్ధులచేతను, తక్కినజనులచేతను శ్లాఘింపఁబడునట్టి యీమాఘస్నానవిధిని చెప్పెదను వినుము. నీయదృష్టవశమున నిఁక అయిదుదినములలో మాఘమాసము వచ్చును. పుష్యశుక్లైకాదశి మొదలుకొని యొక నెలదినములు భోజనము మాని ప్రతిదినము ప్రాతఃకాలమందు స్నానము చేయుచు రావలెను. ఎల్లభోగములు నువదలి, ఇంద్రియములనుజయించి, పైఁజెప్పినమూఁడుకాలములందును శ్రీహరిని పూజించుచు మాఘశుద్ధ ఏకాదశి యెప్పుడువచ్చునో యని యెదురుచూచుచుండి ఆపుణ్యదినమునందు నియమముతో ఉపవసించి యుండవలెను. అట్లుంటివేని నేను ఆదినమున నిన్ను పావనములయినమంత్రోదకములచేత స్నానము జేయించి, మన్మథుని ముఖమువంటి సొగసయినముఖము నీకు వచ్చునట్లు చేసెదను. ఓయి విద్యాధరుఁడా నీవు అట్లు నాచేత దేవతాముఖమును బడసినవాఁడవును,

అనయా వరవర్ణిన్యా క్రీడయస్వ యథాసుఖమ్. జ్ఞాతమాఘప్రభావ స్త్వం మాఘస్నానం సదా కురు, ఇత్యుక్త్వా భృగుణా తస్మై ధర్మజ్ఞేన మహాత్మనా విద్యాధరాయ రాజేన్ద్ర పున ర్గాథా ఉదాహృతా, మాఘస్నానై ర్విపత్తారో మాఘస్నానా దఘక్షయః. సర్వవ్రతాధికో మాఘ స్సర్వకామఫలప్రదః, మాఘో గర్జతి యజ్ఞేభ్యో మాఘో యోగాచ్చ గర్జతి. తీవ్రాచ్చ తపసో మాఘో భో విద్యాధర గర్జతి, పుష్కరే చ కురుక్షేత్రే బ్రహ్మావర్తే పృథూదకే. అవిముక్తే ప్రయాగే చ గఙ్గాసాగరసంగమే, యత్ఫలం దశభిర్వర్షైః ప్రాప్యతే నియతేన్ద్రియైః. తత్ఫలం ప్రాప్యతే మాఘే త్ర్యహస్నానా న్న సంశయః, స్వర్గభోగే చిరం రాగో యేషాం మనసి వర్తతే. యత్ర క్వాపి జలే తైస్తు స్నాతవ్యం మృగభాస్కరే, ఆయురారోగ్యసంపత్తౌ రూపే సుభగతాగుణే. యేషాం మనోరథ స్తైస్తు స్నాతవ్యం మృగభాస్కరే, యే బిభ్యతి నరాః పాపా ద్దరిద్రా యత్ర సన్తి వై. సర్వథా తైః ప్రయత్నేన మాఘే కా

---

సమస్తపాపములనుండి విడువఁబడినవాఁడవు నై మిక్కిలి చక్కఁదనముగల నీయిల్లాలితోఁగూడి సుఖముగా క్రీడింపుము. నీవిప్పుడు మాఘమాసప్రభావమును తెలిసికొని మాఘస్నానము చేయుము. అని యిట్లు బోధించి ధర్మము నెఱింగినవాఁడును మహాత్ముఁడు నైన యాభృగుమహాముని, ఆగంధర్వునితో మరియు నిట్లు చెప్ప నారంభించెను.

మాఘస్నానముచేత నాపదలు తొలఁగును. పాపములు నశించును. అది సమస్తములైన వ్రతములలోను ఉత్తమ మైనది. ఎల్లకోరికల నీడేర్చును. మఱియు, మాఘమాసము యజ్ఞములు చేయుటకుఁ దగినది. యోగముల నభ్యసింపను, ఘోరములైన తపస్సులు చేయను ముఖ్యమైనది. పుష్కరము, కురుక్షేత్రము, బ్రహ్మావర్తము, పృథూదకము, గఙ్గాయమునాసఙ్గమమైన ప్రయాగ గఙ్గాసాగరసఙ్గమము అను పుణ్యతీర్థప్రదేశములందు వాక్కు మొదలైన యిన్ద్రియములను నియమించి పదిసంవత్సరములు తపస్సు చేసి పొందగలఫలమును మాఘమాసమునందు మూఁడుదినములు స్నానముచేసి పొందవచ్చును. ఇందులకు సందేహము లేదు. ఎవరు చిరకాలము స్వర్గఫలము ననుభవింపఁ గోరుదురో వారు మాఘమాసమునందు ఏతీర్థమునసైనను స్నానము చేయఁదగును. ఆయుస్సునందును, ఆరోగ్యమునందును, సంపదయందును, చక్కఁదనమునందును, మంచిగుణములను పొందుటయందు నెవ్వనికి కోరికకలదో వారు మాఘమాసమునందు స్నానము చేయవలసినవారు. ఎవరు పాపమువలన భయపడుదురో ఎవరిని దారిద్ర్యము బాధించునో వారు మాఘమాసమునందు పూనికతో స్నానము చేయవలసినవారు.

ర్యం నిమజ్జనమ్, దారిద్ర్యపాపదౌర్భాగ్య పఙ్కప్రక్షాళనాయ వై. మాఘస్నానాన్న చా న్యోఽస్తి ఉపాయస్సురసత్తమ. శ్రద్ధాహీనాని కర్మాణి కృత్వా న్యల్పఫలాని వై. ఫలం దదాతి సంపూర్ణం మాఘస్నానం యథా తథా, అకామో వా సకామో వా యత్ర క్వాపి బహిర్జలే ఇహాముత్ర చ దుఃఖాని మాఘస్నాయీ న పశ్యతి, పక్షద్వయే యథా చన్ద్రః క్షీయతే వర్ధతే తథా. పాతకం క్షీయతే మాఘే పుణ్యరాశి ర్వివర్ధతే, యథాబ్ధౌ ఖలు జాయన్తే రత్నాని వివిధాని చ. ఆయుర్విత్తకళత్రాదిసంపదో మాఘత స్తథా, కామధుక్చ యథా కామం చిన్తారత్నం చ చిన్తితమ్. మాఘస్నానం దదా తీహ తద్వత్సర్వమనోరథాన్. కృతే తపః పరం జ్ఞేయం త్రేతాయాం యజనం తథా. ద్వాపరే తు హరేః పూజా కలౌ దానం విశిష్యతే, ఏక ఏకస్య ముఖ్యస్స్యా న్మాఘ స్సర్వయుగేషు చ. సర్వేషాం సర్వవర్ణానా మాశ్రమాణాం చ భూపతే, మాఘస్నానం హి సర్వస్య ధారాభిః ఖలు వర్షతి. ఇతి వాక్యం భృగో శ్శ్రుత్వా తస్మి న్నేవాశ్రమే సురః, స

---

ఓయి గంధర్వుఁడా! పేదరికము, పాపము, అదృష్టహీనత, అనునట్టి యడుసును కడుగుటకు మాఘస్నానమునకంటె వేఱొకపావనజలము కలుగదు. శ్రద్ధలేక చేయఁబడినకర్మములు స్వల్పఫలముల నిచ్చునట్లు మాఘమాసమునందు చేయఁబడినస్నానము అధిక ఫలమునిచ్చును. కోరిగాని కోరకగాని ఎక్కడియైనఁ దకమందుఁగాని మాఘస్నానము చేయువాఁడు ఇహపరములు రెంటియందును దుఃఖములను పొందఁడు. చంద్రుఁడు శుక్లపక్షమునందు వృద్ధి నొంది కృష్ణపక్షమునందు క్షయించునట్లు మాఘమాసమునందు పాపములు క్షీణించును, పుణ్యములు వర్ధిల్లును. సముద్రమునందు బహువిధములైనరత్నములు పుట్టునట్లు మాఘస్నానమువలన ఆయుస్సును, ధనమును, భార్యాపుత్రాదుల కలిమియు పుట్టుచుండును. కామధేనువును చింతామణియును కోరినకోరికలనెల్ల నిచ్చునట్లు మాఘస్నానము ఎల్లకోరికలను ఇచ్చును. కృతయుగమునందు తపస్సును, త్రేతాయుగమునందు యజ్ఞయాగాదులును, ద్వాపరమునందు విష్ణుపూజనమును ముఖ్యములు. కలియుగమునందు దానము ముఖ్యము. ఇట్లు ఒక్కొక్కటి ఒక్కొక్కయుగమునకు ముఖ్యములుగా నున్నవి. మాఘమాసము మాత్రము అట్లుగాక ఎల్లయుగములందును ఎల్ల వర్ణములవారికిని ఎల్లఆశ్రమములవారికిని ముఖ్యమై వారువారు కోరినకోరికలను వానగా కురియుచున్నది. అని భృగుమహాముని చెప్పఁగా విని గంధర్వుఁడు ఆయాశ్రమమునందే యుండి ఆపర్వతమునందుండి ప్రవహించుచున్ననదిలోని మడుగునందు శాస్త్రవిధి మేరకు భార్యతో మాఘస్నానముచేసి, భృగుమహర్షి యనుగ్రహమువలన

హైవ భృగుణా మాఘే గిరినిర్ఝరిణీహ్రదే. యథోక్తవిధినా స్నానమకరోద్భార్యయా సహ, భృగోరనుగ్రహాత్సోఽథ సంప్రాప్తో మానసేప్సితమ్. దేవతావదనో భూత్వా ముముదే మణిపర్వతే, ఆజగామ మునిర్విన్ధ్యం తమనుగ్రాహ్య హర్షితః. మణిమయగిరిసిన్ధౌ స్నానమాత్రేణ మాఘే మదనవదనతుల్యస్తత్ర విద్యాధరోఽభూత్, కుమితనియమదేహో విన్ధ్యపాదావతీర్ణో భృగురపి సహ శిష్యై రాజగామాథ రేవామ్. అఖిలభువనసారం మాఘమాహాత్మ్యమేవం ద్విజవర భృగుణోక్తం భూప విద్యాధరాయ, వివిధఫలవిచిత్రం యశ్శృణోతీహ నిత్యంరుచిరసకలకామాన్ ప్రాప్నుయాద్దేవవత్సః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే విద్యాధరస్య వ్యాఘ్రముఖవిమోచనం నామ తృతీయోఽధ్యాయః.



---

మనోభీష్టప్రకారము దేవముఖమును పొంది ఆనందించెను. భృగుమహామునియును వానినట్లు సంతోషపెట్టి అందుండి మరల వింధ్యపర్వతమునకు వచ్చెను.

ఆగంధర్వుఁడు ఆపర్వతమునందలి సెలయేటియందు స్నానము చేయుటచేతనే మన్మథుని ముఖమువంటి ముఖముగలవాఁడాయెను. ఓర్పుగలిగి నియమముతో శరీరయాత్ర నడుపునట్టిభృగుమహాముని వింధ్యపర్వతమువెంబడి కొండలలోఁ జొచ్చి క్రమముగా శిష్యులతోఁగూడ రేవానదీతీరమునందలి యాశ్రమమునకు వచ్చెను.

ఓయి దిలీపమహారాజా! సకలలోకములందును సారవంత మని గ్రహింపఁబడిన ఈమాఘమాహాత్మ్యము బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన భృగుమహర్షిచేత గంధర్వునికిఁ జెప్పఁబడెను. ఈలోకమునందు బహువిధము లయినఫలముల నిచ్చుటచేత వింతను బుట్టించునది యైన యీమాఘమాహాత్మ్యమును ఎవఁడు సర్వదా వినుచుండునో వాఁడు తగినఫలములనన్నిఁటిని పొంది దేవతయో యనఁదగి యుండును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు విద్యాధరుని పెద్దపులిముఖమును పోఁగొట్టునది యైనమూఁడవయధ్యాయకథ.



## చతుర్థోఽధ్యాయః.

వసిష్ఠః. శృణు రాజన్ ప్రవక్ష్యామి ప్రభావం మాఘమాసజమ్, య మాకర్ణ్య నరో భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే. పురా రాజన్ గతే కల్పే వర్తమానే కృతే యుగే, కుత్సో నామ మునిశ్శ్రీమాన్ బ్రహ్మసూను రకల్మషః. స కర్దమసుతాం కన్యాం ఉపయేమే విధానతః, తస్యాం తస్యచ పుత్రోఽభూ ద్వత్సో వంశవివర్ధనః. పంచమేబ్దే పితా తస్య కుత్సో బ్రహ్మోపదిష్టవాన్. కృతోపనయనః పిత్రా బ్రహ్మచర్యపరాయణః. వసన్ గురుకులే నిత్య మగ్ని కార్యంచ సంధ్యయోః, కుర్వన్ త్రిషవణస్నానం భిక్షాశీ విజితేన్ద్రియః. కృష్ణాజినధరో నిత్యం నిత్యం స్వాధ్యాయతత్పరః, కేశాన్త ఉదధత్తేహ పాలాశం దణ్డముద్వహమ్. కటీతటలసన్మౌంజః కమణ్డలుభరస్సదా, శుభ్రకౌపీనవాన్ శుద్ధశ్శుభ్రయజ్ఞోపవీతవాన్. సమి ద్భస్మలసన్మూర్ధా సర్వేషాం నయనప్రియః, నమస్కరో త్యహరహం మాతరం పితరం గురుమ్. ఆచార్యమన్యాన్ వృద్ధాంశ్చ యతీన్ద్రాన్ బ్రహ్మవాదినః, బ్రహ్మయజ్ఞపరో ధీమాన్

---

## నాలవ యధ్యాయము.

వసిష్ఠునిమాటలు—ఓయి రాజా! మనుష్యుఁడు దేనిని విని సమస్తపాపములను దొలఁగించుకొనునో అట్టి మాఘము సమహిమను జెప్పెదను వినుము. పూర్వకల్పాంతమున నిప్పటికృతయుగమునందు పరిశుద్ధుఁడై తేజోవంతుఁడైన కుత్సుఁడు అనుబ్రాహ్మణకుమారుఁడొకఁడు కలఁడు. ఆతఁడు కర్దమమహాముని కొమార్తె యగునొకకన్యను శాస్త్రవిధిచొప్పున పెండ్లియాడి ఆమెయందు వంశోద్ధారకుఁ డగుకుమారు నొకనిని పడసెను. ఆకుమారుఁడు తనతండ్రివలన అయిదవయేటనే ఉపనయనము చేయఁబడి బ్రహ్మచర్యమువహించి గురుకులవాసముచేయుచు ప్రతిదినమును ప్రాతఃకాలమునందును సాయంకాలమునందును సమిధాధానము మొదలగు అగ్నికార్యములు చేయుచు మూఁడుకాలములయందును స్నానము మొదలగు అనుష్ఠానములుచేసికొనుచు మాధుకరాన్న మనుభుజించుచు ఇంద్రియజయముగలవాఁడయి సర్వదా కృష్ణాజినమును తనపొడవుగల మోదుగుకఱ్ఱను మొలను ముంజత్రాడును చేతకమండలువు అనుపాత్రమును ధరించి తెల్లనికౌపీనమును తెల్లజన్నిదమును వెలుఁగొందఁగా హోమకుండములోని తెల్లనిభస్మమును దేహమునందంతటఁబూసికొని చూచువారికి కనులపండువుగా సంచరించుచుండును. ప్రతిదినము తెల్లవాఱి లేచి నిత్యకర్మములు జరుపుకొని తల్లిదండ్రులు ఉపదేశగురువు చదువుచెప్పునట్టి గురువు ఇతరు లయిన పెద్దలు వైరాగ్యమును వహించి వర్తించునట్టిసన్యాసులు మొదలగువారికి

నిత్యానుష్ఠానతత్పరః. పవిత్రపాణిః కురుతే దేవర్షిపితృతర్పణమ్, పుష్ప చందన గంధాది కదాచిదపి న స్పృశేత్. మౌనభృన్మధుపిణ్యాక లవణ క్షార వర్జితః, పాదుకోపానహారోహ దర్పణాలోకవర్జితః, దంతధావన తాంబూలశిరోవేష్టనవర్జితః. నీలం రక్తం తథాపీతం వస్త్రం కాంచనభూషణమ్. అన్యాని యాన్యనర్హాణి బ్రహ్మచర్యాశ్రమస్యచ, సదాచారరతస్త్యాని సర్వాణి నస్పృశేత్. ఈదృశాచారసంపన్నో విచరన్ బ్రహ్మచార్యసౌ, మజ్జనం కురుతే భక్త్యా మకరస్థే దివాకరే. మాఘమాసే విశేషేణ దేహశుద్ధిం కరోత్యలమ్, చాన్ద్రాయణాదిభిః కృచ్ఛ్రైస్స వత్సర ప్రథమాశ్రమే చిత్తశుద్ధిం పరాం ప్రాప్తః మకరాదిత్యమజ్జనాత్, అస్యాం పశ్చిమవాహిన్యాం కావేర్యాం దుర్లభం నృణామ్. మజ్జనం మకరాదిత్యే ఆరబ్ధం భాగ్యవానహమ్. సముద్రగానాం సకలాపగానాం ప్రత్యక్ప్రవాహాంచ ఉదక్ప్రవాహామ్, ప్రయాగతీర్థా దధికం వదన్తి మయాద్య లబ్ధం కృతపూర్వపుణ్యైః. కృతార్థోఽస్మి కృతార్థోఽస్మి కృతార్థోఽస్మీతి హృష్టధీః తత్ర త్రిషవణస్నానం కురుతే సహ్యజాజలే, తేన

---

మ్రొక్కుచు నుండును. పువ్వులు గంధము మొదలగు పరిమళద్రవ్యములను ముట్టఁడు. భోజనకాలమునందు మాటలాడఁడు. మద్యము తెలికపిండి మొదలుగాఁగలవస్తువుల నపేక్షింపఁడు. ఉప్పుకారములను గోరఁడు. పావకోళ్లు పాదరక్షలు ధరింపఁడు. అద్దమును జూచుకొనఁడు. దంతధావనము తాంబూలచర్వణము నెఱుఁగఁడు. తలను పాగా పెట్టుకొనఁడు. నల్లని పచ్చని బట్టలను బంగారుసొమ్ములను తొల్పఁడు. మఱియు బ్రహ్మచారికి కొరగానివస్తువు లెన్నిగలవో వాని నన్నిటిని వదలి సదాచారసంపన్నుఁడై వర్తించుచుండును. ఇట్టిలక్షణములు గల యాబ్రహ్మచారి చాంద్రాయణాదివ్రతములచేతను పుణ్యతీర్థములయందు స్నానముచేయుటచేతను పరిశుద్ధదేహుఁడై ఒకానొకసమయము నందు పడమరగా పారుచున్న కావేరినదియందు స్నానము చేయఁబోయి తనపూర్వపుణ్యము వలన నప్పుడు మాఘమాసమునరాగా ఎట్టివారికిని పొందశక్యముగానిదియు పుణ్యమును కలుగఁజేయునదియు నయిన కావేరి పశ్చిమవాహినియందు స్నానము లభించెనని సంతోషించుచు సముద్రమునఁ గలియు నదులన్నిటిలోను పావనమై కొన్నియెడల పశ్చిమ వాహినియు కొన్నియెడల ఉత్తరవాహినియు నైన ఈ కావేరితీర్థమును పెద్దలగువారు ప్రయాగకంటెను మహిమగలదానినిగాఁ జెప్పెదరు. ఇట్టి పుణ్యతీర్థమున స్నానముచేయ లభించెను. నేను కృతార్థుఁడనైతిని అని మాఘమాసమంతయు నచ్చటనే నివసించి మూఁడుకాలములయందును స్నానము చేయుచుండెను. ఆతీరున అతఁడు మూఁడు

మాఘత్రయం స్నాతం కావేర్యాః పశ్చిమామ్భసి. తేన పుణ్యేన శుద్ధాత్మా నిర్మమో నిస్పృహో నృప, మాతాపితృభ్యాం గురుణా విసృష్ట స్తపసే యయౌ. ఏకయోజనమాత్రేణ కావేర్యా ఉత్తరే తటే, నారాయణగిరా వేష నామ్నా పాపౌఘనాశనే. తుంగై శ్శృంగై ర్దివం స్పృగ్భి స్సానుభిశ్చ విరాజితే, ద్రుమైః ఫలయుతై శ్చాభిశోభితే శుభదర్శనే. మృగసంఘమహావ్యాళద్విజయక్షనిషేవితే, బహుపుష్ప లతాభిశ్చ సమ్య క్సంఛన్నభూతలే. సుఖవాతానుచరితే శీతలోదక సంకులే, భ్రమరై ర్గీయమానైశ్చ పిబద్భిః పుష్పజం మధు. శైలకన్దర నివాసిభిః కోకిలై ర్మధురస్వనైః, సుస్వరం గీయమానైశ్చ గంధ ర్వైశ్చ నిషేవితే. నృత్యద్భిశ్చ మహాబర్హై ర్మయూరై రుపశోభితే, కిన్నరేన్ద్రైశ్చ గాయద్భి శ్శోభితే ధృతకుణ్డలైః. అశ్వత్థ ప్లక్షబిల్వైశ్చ శోభితే బహుశాఖిభిః, తిలకైః పుష్పితై శ్చాపి కృతమాలైశ్చ పుష్పితైః. అశోకై ర్నక్తమాలైశ్చ చందనై స్స్యందనై స్తథా, ఖర్జూరైః పుష్పి తై శ్చాపి విభాజిద్భి ర్మహీధరే. పున్నాగ నారికేళామ్ర పనసార్జున

---

మాఘమాసములు అందు స్నానము చేసి ఆసుకృతమువలన పరిశుద్ధమైన యంతఃకరణముతో ఏకోరికయు లేనివాఁడై తల్లిదండ్రులయనుమతి వడసి తపస్సు చేయఁబోయెను.

అట్లు ఆమృగశృంగుఁడు తపస్సుచేయఁగోరి కావేరి యుత్తరపుగట్టునందు ఆకాశము నొరయుచున్న శిఖరములచేతను రమ్యములై యొప్పునట్టి చరులచేతను గొప్పగొప్ప మ్రాకులచేతను మిగుల దర్శనీయమై, నానావిధ మృగసమూహములచేతను కొండచిలువలచేతను కలకల కూయునట్టి పక్షులచేతను భయంకరమయి, బహువిధములయిన పుష్పతీగలచేత చక్కగా నావరింపఁబడిన నెత్తప్రదేశములయందు విహరించు యక్షులును, తిన్ననితాఁకుడుగల చల్లని గాలియుం చల్లని తేటనీటితోడి దొనలును పూదేనెలు త్రాగి మత్తుగొని ఝుమ్మని రొదలు చేయుచున్న తుమ్మెదలును కొండగుహలు ప్రతిధ్వనులియ్య మనోజ్ఞముగా కూయునట్టికోయిలలును చెవులుసొగియ పాటలు పాడుచున్న గంధర్వులును విరివికల పురులు విచ్చి యాడు నెమళ్లునుగలదై, దిక్కుల కెగబ్రాకిన నిడుపాటికొమ్మలు గలిగి యొండొంటిబెనచుకొని మిన్నంటపెరిగిన రావి జువ్వి మారేడు లోనగు మ్రాకులచేతను చక్కగాపూచిన సురపొన్న పాదిరి బొట్టుగు రేల అశోకము కానుగు నెమ్మి ఖర్జూరము గందపుమ్రాను మొదలగువానిచేతను, టెంకాయచెట్టు మామిడి పనస వెలగ చింత గజనిమ్మ దానిమ్మ మొదలగు ఫలవృక్షములచేతను, మరియుం మద్ది వేము మొదలగు వృక్షజాతులచేతఁ బ్రకాశించుచున్నదియు చాలఁ బొడవైనదియు నయిన

పాటలైః. కపిత్థ తింత్రిణీనింబ లికుచాననదాడిమైః, శోభమానే గిరౌ తస్మిన్ నానాశ్చర్యసమాకులే. తస్మిన్ సరోఽస్తి కలికల్మషహారి వారి కళ్యాణతీర్థమితి వాంఛితసిద్ధిదాయి, కల్లోలలోల కమలాంతిక సన్నివిష్ట హంసావళీభి రనిశం పరిశోభమానమ్. నిమజ్జ్య తస్మిన్నపి మాఘమేకం తత్పశ్చిమే రోధసి సన్నివిష్టః, చక్రే తపో నిశ్చలగాత్రయష్టిర్ని వాతనిష్కంప ఇవ ప్రదీపః. విస్మృత్య విషయాన్ బాహ్యాన్ స్థితః పాషాణకాష్ఠవత్, అంతర్యచ్చ బహిర్యచ్చ ఊర్ధ్వం యచ్చా పృథక్చ యత్, నిష్ఠా మవాప్య తత్సర్వ మహామేవేత్యచింతయత్. పిపాసయా సమాగత్య మృగా స్తస్మిన్ జలాశయే, కణ్డూయన్తే స్వశృంగైస్తు కాష్ఠబుద్ధ్యా దినేదినే. తత స్సర్వజగన్నాథ స్సర్వేషా మీశ్వరో హరిః, హృదయస్థో యథా తస్య తథైవాగ్రే స్థితోఽభవత్. శ్రీభగవాన్. మృగశృంగ మహాప్రాజ్ఞ తవ ప్రీతోఽస్మ్యహం హరిః, ఇత్యుక్త్వా బ్రహ్మరంధ్రే తం పస్పర్శ పురుషోత్తమః. అథ ప్రబుద్ధో విరత స్సమాధితో విలోకయామాస పురస్థితం హరిమ్, సహస్రతిగ్మప్ర

---

నారాయణగిరి అనుకొండయందు పరిశుద్ధమయిన నీళ్ల చేతను అలలవలన కదలాడుచున్న తామరలచేరువల విహరించు హంసలబారులచేతను వెలుఁగొందుచు తనయందు స్నానము చేసినవారిపాపములను పోఁగొట్టి యిష్టసిద్ధులను కావించునట్టి మహిమగల యొకసరస్సునొద్దకుఁ బోయి దాని పడమటిగట్టున ఉనికి చేసికొని గాలిలేమిచే చలింపని దీపమువిధమున కదలక మెదలక కూర్చుండి తపస్సుచేయనారంభించెను. అట్లు తపస్సుచేయుఁనపుడు అతఁడు ఎల్లవిషయములనుమరచి రాయో మ్రానిమ్రోడో అనునట్లు చలింపక లోపలను వెలుపలను ఎగువను దిగువను గలిగినవన్నియును తానేయని తలఁచి యుండెను. దప్పిగొని యాకొలనియందు నీళ్లుత్రాగవచ్చిన జింకలు ఆతనినిఁ జూచి మ్రానిమ్రోడు అనితలఁచి తమ దేహముల దురద దీర రాచుకొనుచుండును. అట్టి యతని తపస్సునకు సంతసించి, ఎల్లలోకములకు ప్రభువును సర్వరక్షకుఁడును నైనశ్రీవిష్ణుమూర్తి యతనిహృదయమున నెట్లు వసించియుండునో అట్లే ప్రత్యక్షమాయెను.

శ్రీభగవంతుని మాటలు. ఆవిధముగా ప్రత్యక్షమైన ఆపురుషోత్తముఁడు జ్ఞానసంపన్నుఁడై తపస్సుచేయుచున్న కొత్సునిఁజూచి ఓ మృగశృంగా ! నీవిషయమున నేను చాల సంతోషించితిని అని యానతిచ్చి అతనిమాడుపట్టు తడవెను. అంతట మృగశృంగుఁడు నిద్రపోయి మేలుకొన్నవానివలె సమాధినుండి యెచ్చరికనుపొంది ప్రపంచజ్ఞానముతో కన్నులు తెరచి వేయిసూర్యబింబములు వెలిఁగినట్లు వెలుఁగుచుండువాఁడును దివ్యమణి

తిమేన తేజసా విరాజమానం మకుటం దధానమ్. ససంభ్రమ స్తతో నత్వా స్తోతుం సముపచక్రమే, ఓన్నమో వాసుదేవాయ లోకానుగ్రహకారిణే. ధర్మసంస్థాపనార్థాయ యథేచ్ఛావపుషే నమః, సృష్టిస్థిత్యుపసంహారాన్ మనసా కుర్వతే నమః. సంహృత్య సకలాన్ లోకాన్ సంహృత్య వటపల్లవే, సదానన్దాయ శాన్తాయ చిత్స్వరూపాయ విష్ణవే. స్వేచ్ఛాధీనచరిత్రాయ నిరీశాయేశ్వరాయచ, ముక్తిప్రదాయినే సద్యో ముముక్షూణాం మహాత్మనామ్. వసతే పక్వచిత్తానాం హృదయే యోగినామపి, చరాచర మిదం కృత్స్నం తేజసా వ్యాప్య తిష్ఠతే. లోకాధికాయ మహతే మహతేఽణోరణీయసే, స్థూయమానపదాబ్జాయ వాక్యై రుపనిషద్భవైః. అపారఘోరసంసారసాగరోత్తారహేతవే, నమస్తే లోకనాథాయ లోకాతీతాయ తే నమః. నమః పరమకల్యాణనిధయే పరమాత్మనే, అచ్యుతాయాప్రమేయాయ నిర్గుణాయ నమో నమః. నమస్సహస్రశిరసే నమస్సతతభాస్వతే. నమః

---

కిరీటమును ధరించినవాఁడునై సాక్షాత్కరించిన శ్రీవిష్ణుని జూచి తొట్రుపడుచు లేచి సాష్టాంగనమస్కారము చేసి స్తోత్రము చేయ నారంభించెను.

లోకముల నేలుకొనుటకు కర్తయును, సర్వప్రాణులయందును తాను ఉండియును తనయందు సర్వప్రాణులను ఉంచుకొనివర్తించువాఁడును, ధర్మము నిలుపుటయే ముఖ్య కృత్యముగాఁగలవాఁడును, సంకల్పమాత్రమున సృష్టి స్థితి లయములు చేయువాఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, సర్వలోకములను లయింపఁజేసి యెల్లప్పుడును ఆనంద స్వరూపుఁడై వర్తించువాఁడును, శాంతగుణము ప్రధానముగాఁగలవాఁడును, జ్ఞానస్వరూపుఁడును, స్వాధీనమైన నడవడిగలవాఁడును, తనకంటె నితరమైన ప్రభువులేని వాఁడును, మోక్షము నపేక్షించు సత్పురుషులకు మోక్షము నిచ్చువాఁడును, పండిన మనసుగల యోగులహృదయమునందు వసించువాఁడును, తన తేజస్సును స్థావరములు జంగమములును గలయీ ప్రపంచమునందెల్ల వెలిఁగించువాఁడును, ఎల్లలోకములందు నధికుఁడును, గొప్పవానియందెల్లను గొప్పవాఁడును, చిన్నవానియందెల్లను చిన్నవాఁడును, ఉపనిషత్తులలోని వాక్యములచేత కొనియాడఁబడునట్టి యడుగుదామరలు గలవాఁడును, అంతములేనిదియు భయంకరమునైనసంసారసముద్రమును దాఁటుటకు సాధనమయిన వాఁడును, లోకములకు రాజైనవాఁడును, లోకముల నతిక్రమించినవాఁడును, మేలయి నశుభములకు ఉనికిపట్టయినవాఁడును, నాశములేనివాఁడును, ఇంతటివాఁడని తెలియ శక్యముగానివాఁడును, హేయగుణములేనిదియు లేనివాఁడును, వేయితలలుగలవాఁడును, ఎప్పుడును వెలుఁగుచుండువాఁడును, రాక్షసులకు పగవాఁడును, జయించుటయే

కమలనేత్రాయ నమోఽనన్తాయ జిష్ణవే, నమస్త్రిమూర్తయే ధాత్రే నమస్త్రియుగశక్తయే. నమస్సమస్త సుహృదే నమస్సతతజిష్ణవే, శంఖచక్రగదాపద్మధారిణే లోకధారిణే. స్ఫురత్కిరీట కేయూర మణికుణ్డలధారిణే. నిర్ద్వంద్వాయ నిరీశాయ నిర్వికారాయ తే నమః, త్రాహిమాం పుణ్డరీకాక్ష శరణ్య శరణాగతమ్. త్వమేవ సర్వభూతానా మాశ్రయః పరమా గతిః, త్వయి స్థితం యథా చిత్తం న మే చంచలతాం వ్రజేత్. తథా ప్రసీద దేవేశ శరణం త్వాం గతోఽస్మ్యహమ్, నమస్తుభ్యం నమస్తుభ్యం భూయో భూయో నమో నమః. నారాయణాయ నలినాయతలోచనాయ నాథాయ పత్త్రరథనాయకవాహనాయ, కాళీయభోగిఫణరంజితపాదకాయ నవ్యాంబుదాభరుచిరాయ నమః పరస్మై. ఇతి స్తుత్వా హృషీకేశం నమస్కృత్వా పునఃపునః, ఆనందబాష్పనయనః పులకీకృతవిగ్రహః, శిరస్యంజలి మాధాయ తూష్ణీం తత్పురతస్స్థితః.

---

స్వభావమయినవాఁడును, తుదిలేనివాఁడును, బ్రహ్మవిష్ణురుద్రులనెడుత్రిమూర్తులే తానైనవాఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును, సర్వజనులకు మేలుగలుగఁజేయువాఁడును, జయించునట్టిస్వభావముతో శంఖము చక్రము గద పద్మము అనువానిని పూనినవాఁడును, ఎల్లలోకములనువహించినవాఁడునైన శ్రీమన్నారాయణునికొరకు నమస్కరించెదను. మిగుల వెలుఁగొందునట్టి కిరీటమును కౌస్తుభమణిని మకరకుండలములను ధరించుటచేత ప్రకాశించుచున్న అవయవములుగలిగిన స్వామీ నీకు నమస్కారము. నీకంటె రెండవవాఁడును, నీకంటె నితరప్రభువును, షడ్భావవికారములునులేక ఒప్పునట్టి నీకు నమస్కారము. కమలములవంటి కన్నులతో నన్ను చల్లగా కటాక్షించి రక్షింపఁజాలిన ఓ ఏలినవాఁడా! శరణాగతుఁడ నగు నన్ను ఏలుకొనుము. ఎల్లభూతములకు నాశ్రయుఁడవును, రక్షకుఁడవును నీవే. ఎల్ల దేవతలకును ప్రభువయిన నీయందు పొందిన నామనస్సు చలింపకయుండు విధమేదియో దానిని కావింపుము. నేను నీచే కాపాడఁబడఁదగినవాఁడనగుదును కనుక నీకు పెక్కునమస్కారములుచేసెదను. ప్రళయకాలమునందు జలములపయి నివసించువాఁడవును, తామరలవలె వికాసమును వహించిన గొప్ప కన్నులు గలవాఁడవును, కాళియుఁడను సర్పరాజు పడగలపై నాట్యము చేయుటచేత ఒప్పినవాఁడవును, వర్షాకాలమేఘముయొక్క వర్ణమువంటి వర్ణముగల శరీరముగలవాఁడవును, పరమాత్మస్వరూపుఁడవును నన్నేలినవాఁడవునైన నీకు నమస్కరించెదను.

అని యిట్లు మాటిమాటికి వినుతులుచేసి చేసి కడపట కన్నులయం దానందబాష్పములురాలగా దేహము గగుర్పొడువగా మోడ్పుకేలు తనపై నుంచుకొని అభగవంతుని సన్నిధిని ఊరక నిలువఁబడెను.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే మృగశృంగస్య భగవత్ప్రసాదో నామ చతుర్థోఽధ్యాయః.

---

## పఞ్చమోఽధ్యాయః.

శ్రీభగవాన్. మృగశృంగానయా స్తుత్యా పరా ప్రీతిరజాయత, మాఘమాసే సరస్యస్మిన్ యత్త్వయా స్నాయి తేనచ. తపసాచ ప్రహృష్టోఽస్మి శాంతితోఽసి నితరాం మునే, యజ్ఞైః స్వదక్షిణైర్దానై రన్యైశ్చ నియమైర్యమైః. అహం తథా న తుష్యామి యథా మాఘనిమజ్జనాత్, ఇత్యుక్త్వా తం పునః ప్రాహ మోక్షేచ్ఛుం ముదితాననమ్. వరం వరయ సత్యం తే పశ్చాద్దాస్యామి వాంఛితమ్, మృగశృంగ మమ ప్రీత్యై మదాజ్ఞాం పరిపాలయ. బ్రహ్మచర్యేణ ఋషయో యథా తుష్టాధునా తథా, యజ్ఞేన దేవా స్సంతోష్యాః ప్రజయా పితరం పునః. అతో భవద్వివాహాయ ప్రయత్నః క్రియతాం త్వయా, ఏతదిష్టతమం మహ్యం ఏతదేవ

---

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మృగశృంగునికి శ్రీమన్నారాయణుఁడు ప్రత్యక్షమై యనుగ్రహించుటను తెలుపునది యైన నాలవ యధ్యాయ కథ.

---

## ఐదవ యధ్యాయము.

శ్రీ భగవంతుని మాటలు.—ఓయి మృగశృంగుఁడా! నీచేత చేయఁబడినస్తోత్రముచేతను నీవు మాఘమాసమునందు ఈసరస్సున స్నానముచేసినందుచేతను నీయందు నాకు మిక్కిలి ప్రేమకలిగెను. నీతపస్సునకు సంతోషించితిని. ఈస్నానము మొదలగునియమములచేత నీవు చాలడస్సితివి. మాఘమాసస్నానమువలన సంతోషించునట్లు పూర్ణదక్షిణ లిచ్చి చేయుఁ యజ్ఞములవలనను దానములవలనను నోములవలనను నేను సంతోషింపను. అని యిట్లు ఆనతిచ్చి మోక్షేచ్ఛ గలవాఁడును, తేటమీరిన మొగముగలవాఁడును నైన ఆఋషినిఁ జూచి ఓయి మృగశృంగుఁడా! నీవు వలసినవరము నడుగుము. అది యెట్టిదయినను కాదనక యిచ్చెదను. నాయందలి భక్తితో నాయాజ్ఞను నడపుము. బ్రహ్మచర్యముచేత ఋషులును యజ్ఞముచేత దేవతలును ఎట్లు తృప్తి నొందుదురో అట్లు పితృదేవతలు సంతతిచేత తృప్తినొందుదురు. కాఁబట్టి నీవు అవశ్యము పెండ్లికై ప్రయత్నముచేయుము. ఇది నాకు మిక్కిలి ప్రియమును ఇష్టమునైన

వరం ప్రియమ్, సర్వథా మమ తుష్ట్యర్థం కరణీయ మిదం త్వయా. భావిజన్మని విప్రత్వం జీవన్ముక్తో జనిష్యసి, బ్రహ్మసూను ర్మహాజ్ఞానీ ఋభునామా జనిష్యసి. వేదాంతవాక్యసంజ్ఞానం నిదాఘాయోపదిశ్య చ, పున స్త్వం పరమం ధామ సమేష్యసి న సంశయః. ఇతి విష్ణో ర్వచ శ్శ్రుత్వా దేవదేవస్య శార్జ్గిణః, మృగశృంగో వరం వవ్రే పుణ్డరీకం దయానిధిమ్. దేవదేవ జగన్నాథ సర్వదేవనమస్కృత, అత్ర సన్నిహితో నిత్యం సర్వేషాం సర్వకామద. సర్వదా సర్వజంతూనాం సర్వసంపత్ప్రదో భవ, ఇద మేకం వరం దేహి యద్యనుగ్రహభాగహమ్. ప్రసీద పుండరీకాక్ష ప్రణతార్తిహ రాచ్యుత, శరణం త్వాం ప్రపన్నోఽస్మి శరణాగతవత్సల. ఇతి బ్రువాణమాహేదం కృపయా గరుడధ్వజః, తథాస్తు మృగశృంగాత్ర సర్వథా నివసామ్యహం. యేఽర్చయంతి నరా స్తేషాం కర్మస్థా స్స ర్వసిద్ధయః, విశేషేణ సర స్యస్మి న్మకరస్థే దివాకరే. నిమజ్య నిఖిలైః

---

కార్యము. నీవు నాత్ప్రీతికై గృహస్థాశ్రమము నాశ్రయింపవలయు. అట్లు చేసినపక్షమున రాగలజన్మమున నీవు జీవన్ముక్తుఁడ వయ్యెదవు. నీవు మీఁదటిజన్మమున మిక్కిలి జ్ఞానవంతుఁడవై ఋభువు అనుబ్రాహ్మణకుమారుఁడవై పుట్టి నిదాఘుఁడు అనుబ్రాహ్మణునికి వేదాంతము ఉపదేశించి జ్ఞానాధికునిగా జేసి పిమ్మట ఉత్తమస్థానమును పొందఁగలవు. సందేహము లేదు. అని యీవిధముగా దేవతలకు దేవుఁడయిన శ్రీవిష్ణుమూర్తి ఆనతియ్యగా విని మృగశృంగుఁడు దేవతలకు ప్రభుఁడవును లోకములకు ఏలికవును దేవతలు మొదలగువారిచేత మ్రొక్కఁబడువాఁడవును నైన ఓస్వామీ! ఎల్లవారికిని గోరిన కోరికల నిచ్చువాఁడవయిన నీవు నాకు వరమిచ్చెదు పక్షమున ఇప్పుడు నాకు ప్రసన్నుఁడవైనరీతిని యిక్కడ ప్రతిష్ఠితుఁడవై ఎల్లకాలము ఎల్లప్రాణులకును ఎల్లకోరికలను ఇచ్చుచుండునట్టుగా వరమిమ్ము. నేను నీఅనుగ్రహమునుపడసినవాఁడ నైనందులకు ఇదియొకగురుతుగా తామరలవంటికన్నులతో కటాక్షించి భక్తులపీడలను పరిహరించుచు నుండఁ గోరెదను. భక్తులయందు వాత్సల్యముగల ఓపరమపురుషా! నీవే నాకు దిక్కు. అని యిట్లు వేఁడుకొనఁగా శ్రీలక్ష్మీప్రియుఁడైన భగవంతుఁడు వాత్సల్యపురస్సరముగా ఇట్లు మందలించెను. ఓయి మృగశృంగుఁడా! నీవు కోరినట్లు సర్వదా నేను ఇక్కడనే నివసించెదను. ఎవరు నన్నుపూజింతురో వారికి సమస్త సంపదలను ఇచ్చెదను. వారువారు చేయుభక్తికొలఁదిని వారివారికి ఫలములను లభింపఁ జేయుచుందును. ఎవరు ఈసరోవరములో మాఘస్నానముచేసి యెల్ల పాపములచేతను

పాపైః ప్రముక్తా యాంతి మత్పదమ్. వ్యతీపాతేఽయనే సంక్రమణేపి విషువేపివా, పూర్ణిమాయా మమాయాంచ గ్రహణే చంద్రసూర్యయోః, స్నాత్వా దత్వా యథాశక్తి మను లోకే మహీయతే, ఏవం బ్రువతి గోవిందే ప్రణమ్య స పునర్ద్విజః. అవద త్పునరప్యేకం భక్తవశ్యం హరిం తదా, కుత్సస్య పుత్రః కౌత్సోఽహం కథం మే మృగశృంగతా, ఏత దాచక్ష్వ దేవేశ త్వద్భక్తస్య కృపానిధే. శ్రీభగవాన్.-కల్యాణసరసస్తీరే త్వయ్యత్ర తపసి స్థితే, మృగాః పిబన్తః పానీయం ప్రతివాసరమత్రవై. అకణ్డూయంత శృంగేణ శరీరం తవ నిర్భయాత్, తదా త్వాం మృగశృంగాఖ్యం వదంతి పరమర్షయః. అద్య ప్రభృతి లోకోఽయం మృగశృంగేతి వక్ష్యతి. ఇతి వ్యాహృత్య సర్వేశ స్సర్వేషాం సర్వదో నృణామ్, నారాయణగిరౌ తస్మిన్ హరి రద్యాపి దృశ్యతే. అథ స మృగవిషాణ స్తత్ర సంపూజ్య దేవం నిరగమదథ తస్మాత్తన్నిదేశేన శైలాత్, జగదుపకృతిహేతో దారయోగే ధృతాత్మా కమలనయన మాద్యం

---

విడువఁబడినవారై నన్నుపూజింతురో వారు నాదైనయుత్తమస్థానమును పొందుదురు. వ్యతీపాతము ఉత్తరాయణ దక్షిణాయనములు సంక్రమణములు విషువములు పున్నమ అమావాస్య సూర్యగ్రహణము మొదలుగాఁగల పుణ్యకాలములయందు ఈకొలనిలో స్నానముచేసి తమతమశక్తికి తగినట్లు దానములిచ్చినవారును అట్టి పరమపదమును పొందుదురు. అని యిట్లు భగవంతుఁడు సెలవియ్యగా విని సంతోషించియు ఆబ్రాహ్మణుఁడు భక్తపరాధీనుఁడవయిన ఓ శ్రీహరీ! కుత్సమహాముని పుత్రుఁడనైన నేను కౌత్సుఁడనుగదా నాకు మృగశృంగత్వము కలుగుటయెట్లు అనతిమ్మని వేఁడెను.

శ్రీభగవంతుని మాటలు. ఓమునివరా! నీవు అచంచలనిష్ఠ వహించి ఈకొలనిగట్టున తపస్సుచేయునప్పుడు ఇక్కడికి జలపానముచేయవచ్చిన మృగములు నిన్నుజూచి భయపడక ప్రతిదినమును తమకొమ్ములతో నీదేహమును గోకుచుండెను కనుక ఇచ్చటిమహామునులు నిన్ను మృగశృంగుఁడు అనిరి. ఇకమీఁద లోకులందరు నిన్ను మృగశృంగుఁడు అనియే చెప్పుదురు. అని చెప్పి యెల్లవారికిని ఏమియడిగిన ఇచ్చువాఁడైన శ్రీమన్నారాయణుఁడు ఆనారాయణగిరియందే నెలకొనెను. ఇప్పటికిని మృగశృంగునిమహిమను దెలుపుచు అచ్చట యెల్లవారికిని దర్శన మిచ్చుచున్నాఁడు.

అంతట అట్లు తపస్సువలన కృతార్థుఁడయిన ఆమృగశృంగుఁడు ఆభగవంతుని అనతివడసి అందుండి వెడలి లోకులమేలునకు కారణమైనవివాహమును చేసికొనుటయందు ఇష్టముగలవాఁడై, ప్రధానపురుషుఁడును పుండరీకాక్షుఁడు నగు శ్రీమన్నారాయ

భావయ న్నంతరంగే మౌంజీకృష్ణమృగచర్మదణ్డవృక్షాణిపల్లవలసత్క-మణ్డలు, జన్మభూమిమవిశజ్జితేంద్రియో భోజరాజపుటభేదనం నిజమ్. మృగశృంగముని ర్వ్యావదాయాతి నిజమందిరమ్, తత్పూర్వమేవ తన్నామ ప్రతితం భువి కేవలమ్. ప్రణామం విదధే సమ్యగ్జననైశ్య భువి దణ్డవత్, పిత్రేచ విధివ న్నత్వా స్వముదంతం న్యవేదయత్. గాఢ మాలింగితో మూర్ధ్ని సమాఘ్రాతో ముహుర్ముహుః, ఆనందాశ్రు పరీతాభ్యాం పితృభ్యా మభిలాలితః. గురుంత మభివాద్యాథ పునస్స్వాధ్యాయతత్పరః, పితు ర్మాతు ర్గురో ర్నిత్యం శుశ్రూషణపరాయణః. అధీతాఖిలవేదోయం గురుణానుమత స్తథా, వ్రతస్నానం తతోత్సర్గం సమాప్య విధిపూర్వకమ్. ఆవోచ త్పితరం కుత్సం మృగశృంగో మహామనాః, సుతస్య సంభవే క్లేశం సహేతే పితరౌ భృశమ్. శక్తో వర్ష శతే నాపి నోకర్తుం తస్య నిష్కృతిమ్, అత స్తయోః ప్రియం కుర్యా

---

ఞుని స్మరించుచు మొలను ముంజత్రాఁడును దేహముపై జింకతోలును చేత మోదుగు కఱ్ఱయుం నొప్పఁగా చిగురుటాకుఁనుబోలిన మృదుహస్తమునందు కమండలువును బూని తన జన్మస్థానమైన భోజనగరమునకు వచ్చి తనయిల్లుచొచ్చి తనరాకకు హర్షించుచున్నతల్లిదండ్రులకు దండాకారముగా సాఁగిలఁబడి మ్రొక్కి తనవృత్తాంతమంతయుం సవిస్తరముగా తెలియఁజెప్పెను. ఆతలిదండ్రులును కొడుకును చాలకాలము ఎడబాసియున్నకొరతదీర బిగ్గరకౌఁగిలించుకొని పలుమారు మూడుకట్టుమూర్కొని మనసులలోనున్న ప్రేమరసము ఇట్లు వెడలుచున్నదో అనునట్లు కన్నులలోనుండి ఆనందబాష్పములు వెడలి జలజల రాలగా ముద్దుపెట్టుకొని ఆకుమారుని సంతోషింపఁ జేసిరి. అనంతరము ఆకుమారుఁడు తనగురువునకు మ్రొక్కి వేదాధ్యయనముచేయ నారంభించినవాఁడై ప్రతిదినము తల్లిదండ్రులకును గురువునకును భక్తిపూర్వకముగా శుశ్రూషలుచేయుచు ఎల్లవేదములను చదివి గురువుచే ననుజ్ఞతీసికొని [1]స్నాతకవ్రతమును [2]ఉత్సర్గమును శాస్త్రమునందు చెప్పఁబడినచొప్పున నడపి తనతండ్రినిఁ జూచి ఇట్లు పలికెను.

నాయనా, కొడుకులను కని పెంచుటయందు తల్లిదండ్రులు ఎంతో శ్రమపడుచున్నారు ఆశ్రమనుమాన్పుటకు నూరేండ్లుపాటుడినను కొడుకు సమర్థుఁడుకానేరఁడు. కనుక అట్టితల్లిదండ్రులను విద్యనేర్పి తెలివికలుగజేసిన గురువును ఎవఁడు సంతోషపెట్టునోవాఁడు ఉత్తముఁడు అనఁబడును. ఆముప్పురును సంతోషించినయెడ సమస్తతపస్సుల

---

1 బ్రహ్మచర్యమును మాని వివాహముకావలె ననెడియిచ్ఛతో చేయుం వ్రత విశేషము. 2 గురుసన్నిధిని వేదాధ్యయనము మానుట.

ద్గురోరపి చ సర్వదా, త్రిషు తేషు సుతుష్టేషు తపస్సర్వం సమాప్యతే. తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే, తానతిక్రమ్య యత్కుర్యాత్తన్నసిధ్యేత్కదాచన. తానేవామూన్సమారాధ్య త్రీన్ లోకాన్ విజయేత్సుధీః, ఏతదేవ నృణాం ప్రోక్తం పురుషార్థచతుష్టయమ్. య దేతేషాంహి సంతోష ఉపధర్మోఽస్య ఉచ్యతే, అధీత్య వేదాన్ వేదౌవా వేదం వా క్రమతః. పితుః అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావిశేత్, గృహాశ్రమాత్పరో నాస్తి యదిపత్నీ వశంగతా. అనుకూల్యంహి దంపత్యో స్త్రివర్గోదయహేతవే, అనుకూలం కళత్రం చే త్త్రిదివేన హి కిం తతః. ప్రతికూలం కళత్రంచే న్నరకేన హి కిం తతః, గృహాశ్రమ స్సుఖార్థాయ భార్యామూలంహి తత్సుఖమ్. స్వభార్యాయాం వినీతాయాం త్రివర్గోఽపి భవేద్ధ్రువమ్, జలూకయోపమీయంతే ప్రమదా లఘుబుద్ధిభిః. మృగీదృశాం జలూకానాం విచార్యం మహదంతరమ్. జలూకాః కేవలం రక్తం గృహ్ణంతి పున రంగనాః. గృహ్ణంతి సర్వమవ్యగ్రాః చిత్తం విత్తం బలం సుఖమ్, దక్షప్రజాపతీసాధ్వీ

---

ను చేసిన ఫలము లభించును. వారిసేవయే యెల్లతపస్సులలోను శ్రేష్ఠమైనతపస్సని పెద్దలు చెప్పుదురు. ఆమువ్వురి యానతినిమీరి యేపనిచేసినను అవి నెరవేరదు. బుద్ధిశాలియగువాఁడు ఇదితెలిసి వారినేపూజించి మూఁడులోకములను జయించును. ఆపూజయేధర్మము, అర్థము, కామము, మోక్షము ననెడునాలుగుపురుషార్థములు నగును. కనుక ఎట్లు ప్రవర్తించునెడల తల్లిదండ్రులకును గురువునకును సంతోషముకలుగునో అట్లు ప్రవర్తించుట ముఖ్యధర్మ మగుచున్నది. వటువగువాఁడు ఋక్కు యజుస్సు సామము ననెడు మూఁడువేదములనుగాని, ఆమూఁటిలో రెంటినేగాని ఒకటినేగాని క్రమముగా గురువునొద్ద చదివి పిమ్మట చలింపక బ్రహ్మచర్యమును నడిపి గృహస్థాశ్రమమును పొందవలయును. భార్య స్వాధీనురాలగునేని గృహస్థాశ్రమమునకంటె నుత్తమమైన ఆశ్రమము కలుగదు. దంపతుల అనుకూల్యము నాలుగువిధములైన పురుషార్థములకు సాధనమగును. భార్య అనుకూలయైనయెడల స్వర్గభోగమునం దపేక్ష యుండదు. భార్య ప్రతికూలురాలౌనెడల అదియే నరకమగును. గృహస్థాశ్రమమునందు పొందగల సుఖములకు పెండ్లామే ముఖ్యసాధనము. భార్య వినయముతో ననువర్తించునది అయ్యేనేని ధర్మార్థకామములు మూఁడును హస్తగతములగును. కొందరు బుద్ధిహీనులు స్త్రీలను జలగలతో సరిపోల్తురు. జలగలు రక్తమునుమాత్రము పీల్చును. స్త్రీలన్ననో మనస్సు ధనము మొదలుగా సర్వమును ఆకర్షింతురు. కాఁబట్టి పురుషుఁడు మీఁదచెప్పఁగల సుగుణముల

పటువాక్యా ప్రియంవదా. గుణైరమీభిస్సంయుక్తా సాస్త్రీ శ్రీరూపధారిణీ, ఉపయేమే తతో భార్యాం సువర్ణాం సాధులక్షణామ్. జనక స్యాసగోత్రాయా మాతురప్యసపిండకా, దారకర్మణి యోగ్యా సా ద్విజానాం ధర్మవృత్తయే. స్త్రీసంబంధేఽప్యపస్మారక్షయశ్విత్రకులం త్యజేత్, అభిశస్తసమాయుక్తాం తదాకన్యాప్రసూంత్యజేత్. రోగహీనాం భ్రాతృపతీం స్వస్మాత్కించి ల్లఘీయసీమ్, ఉద్వహేత ద్విజో భార్యాం తాం కన్యాం మృదుభాషిణీమ్. నపర్వతర్క్ష వృక్షాఖ్యా ననదీ సర్పనామికామ్, నవాతీపుష్పనామ్నీంచ ప్రేతఘూతాహ్వయాం త్యజేత్. నచాతిరిక్తహీనాంగీం నాతిదీర్ఘాం నచాకృశామ్, నాలోమికాం నాతిలోమాం నాస్నిగ్ధాం స్థూలమూర్ధజామ్. మోహాన్నోపయమేన్మర్త్యః కులహీనాంచ కన్యకామ్, హీనోపయమనాద్యాతి సంతానస్య విహీనతామ్. లక్షణాని పరీక్ష్యేత తతః కన్యాం సముద్వహేత్, సులక్షణా సదాచారా పత్యూరాయుశ్చ వర్ధయేత్. ఇతి ప్రాహ మనుః పూర్వ మగస్త్యోఽపి తథా

గలిగినదియు చతురత్వముగలదియు సంతతిగలదియు పతివ్రతయు తిన్ననివియు ప్రియములు నైనమాటలుగలదియు చక్కదనముగలదియు తండ్రికి సగోత్రురాలు కానిదియు తల్లికి సపిండురాలు కానిదియు అయినయిల్లాలు బ్రాహ్మణునకు స్వధర్మవృద్ధికై గ్రహింప దగినది. కన్యకను పిచ్చి అరుదెవులు బొల్లిరోగము ఇవిగలవంశమున గ్రహింపరాదు. బ్రహ్మహత్యాది పాతకములు కలిగినదియు ఆడుబిడ్డలనే పడయునట్టిదియు నైన వంశమున కన్యకను గొనదగదు. ముందుచెప్పినవ్యాధులు లేనిదియు అన్నదమ్ములతోఁ గూడినదియు తనకంటెచిన్నదియు యోగ్యురాలును తిన్నని మాటలుగలిగినదియు నైనకన్యకను బ్రాహ్మణుఁడు వివాహము కావలయును. పర్వతనామము వృక్షనామము నక్షత్రనామము నదీనదములనామములు సర్పనామము కలకన్యకను నేత్రములయు పుష్పములయు నామధేయముగలకన్యకను వృద్ధిలేనివంశమునందు బుట్టినకన్యకను వివాహముకారాదు. ఎచ్చుతక్కువ అవయవములుగలదానిని మిక్కిలి కృశించినదానిని మిక్కిలిపొడువైనదానిని రోమము లేనిదానిని విశేషించి రోమములున్నదానిని కఠినదేహముగలదానిని బిరుసుగల వెండ్రుకలు గలదానిని మంచికులము లేనిదానిని ఎంత మోహానాంగినైనను పెండ్లాడరాదు. ఈ చెప్పిన యవగుణములలో నేవియేని కలిగినకన్యకను పెండ్లాడుటవల్లనే కొందరు సంతానము లేనివారు అగుచున్నారు. కనుక ఈ లక్షణముల నన్నిటిని పరిశీలించిచూచియే కన్యకను పరిగ్రహింపవలెను. మంచిలక్షణములును మంచియాచారమును గలిగిన కన్యక తన పెనిమిటియాయుస్సును వృద్ధినొందించును.

బ్రవీత్, అన్యేచ ఋషయస్సర్వే ప్యేవమాహు స్త్వమప్యుత. ఈదృశీ కుత్స భార్యా మే లభ్యతే జనకాధునా, మృగశృంగస్య తద్వాక్యం మధురం వేదసమ్మితమ్. శ్రుత్వా కుత్సః ప్రహృష్టాత్మా పునఃపుత్రమభాషత, మావిచారం కురుష్వాత్ర మృగశృంగ మహామతే. ఈదృగాచారయుక్తస్య తవాప్రాప్యం నవిద్యతే, అనాచారవతాం న్నాణాం ఆలస్యోపహతాత్మనామ్. అమాఘస్నాయినాం న్నాణాం తాదృశాదుర్లభాః స్త్రియః, అకృతాతిథిపూజానా మనైకాదశ్యుపోషిణామ్. అమహాదేవభక్తానాం తాదృశాదుర్లభాః స్త్రియః, అమాతృపితృభక్తానామగురుప్రీతికారిణామ్. అగోశుశ్రూషకాణాంచ తాదృశా దుర్లభాః స్త్రియః, అథైవపితృకార్యాణా మదత్వాభుంజతామపి. అదానధర్మశీలానా మహుత్వాచాప్యమశ్నతామ్, అగోపీచందనానాంచ అమాలీతులసీభృతామ్. అకావేరీజలాద్రాణా మమాఘవ్రతచారిణామ్, అమాఘమహిమజ్ఞానాం తాదృశా దుర్లభాః స్త్రియః. దదాతి విద్యా మఖిలాంచకీర్తి మారోగ్యమాయు

---

అని మునుపు అగస్త్యుడును మనువును జెప్పియున్నారు. ఇతరమునులును ఇట్లే చెప్పిరి. ఓతండ్రీ! ఇప్పుడు ఈచెప్పఁబడిన దుర్గుణములు లేనికన్యక యెక్కడ దొరకును. అని యడుగఁగా, కుత్సమహాముని వేదసమ్మతమైనదియు ఇంపైనదియు నైన మృగశృంగుని మాటలు విని సంతోషించినవాఁడై అతనితో నిట్లనెను. నాయనా! నీవు ఈవిషయమై ఆలోచింపఁ బనిలేదు. మంచిఆచారము గలవాఁడవైన నీకు ఈలోకమునందు పొందరానిది యేమున్నది. ఆచారహీనులై మందమతులై మాఘస్నానముచేయనివారై యుండు వారికి సద్గుణములు గలకన్యకలు లభింపరు. అతిథులను పూజింపనివారును ఏకాదశి నాఁడు ఒక్కపొద్దు ఉండనివారును శివభక్తులు కానివారును ఉత్తమకన్యకలను పొందుట దుర్లభమగును. తల్లిదండ్రులయందు భక్తియు గురువునందు ప్రీతియు గోవుల యందు దయయు లేనివారలకు నట్టికన్యకలు దొరకుట యరుదు. పితృకార్యములు చేయక స్నానముచేయక భోజనముచేయువారును దానధర్మములు లేనివారును ఔపాసనముచేయక భుజించువారును గోపీచందనమును ధరింపనివారును కావేరిజలమున స్నానముచేయనివారును మాఘస్నానవ్రతమును నడపనివారును మాఘమాసముయొక్క మహిమను గుర్తెరుగనివారును అట్టికన్యకను పడయఁజాలరు.

ఓయి పుత్త్రుఁడా! మాఘమాసము ఎల్లవిద్యలను ఇచ్చును. నిర్మలమైన కీర్తిని ఆరోగ్యమును ఆయుస్సును చెడని సంపదను ఇచ్చును. మఱియు మాఘమాసము వలన

ర్ధనమక్షయం చ, సమస్తపాపక్షయ మింద్రలోకం కిం కిం న దద్యాత్స్నుత మాఘమాసః. పుష్టిం పశూనుత్తమవాగ్విభూతిం దదాతి విష్ణో రచలాం చ భక్తిమ్, కళత్రభాగ్యం కమనీయరూపం కిం కిం న దద్యాత్స్నుత మాఘమాసః. సౌభాగ్యమాచార మపత్యవృద్ధిం సత్సంగతిం నిత్యముదారభావమ్, ఖ్యాతించ శౌర్యంచ బలం దదాతి కింకింనదద్యాత్స్నుత మాఘమాసః. మాఘస్నానేన సుప్రీతో మహాదేవో మనోరథమ్, పూరయిష్యతి తే పుణ్యాన్పుండరీకాయతేక్షణః. ఇతి పితృవచనం నిశమ్య సత్యం ముదితమనా మృగశృంగనామధేయః, పునరపి పితరం ప్రణమ్య మూర్ధ్నా హృది హరి మేవ దివానిశం నిదధ్యౌ.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే వివాహ్యకన్యాస్వరూప
నిరూపణం నామ షష్ఠోఽధ్యాయః.



ఎల్ల పాపములును నశించును. స్వర్గము కలుగును. ఇదిగాక మాఘమాసము దేహపటుత్వమును మంచిమాటల కలిమిని పశుసంపదను మానని విష్ణుభక్తిని తగినభార్యను సమస్తభాగ్యములను యోగ్యమైనరూపమును మంచితనమును మంచియాచారమును సంతానాభివృద్ధిని మంచివారితో సహవాసమును దానధర్మములు చేయుంటయందలి తెగువను ప్రసిద్ధిని శూరత్వమును బలమును కలుగఁజేయును. తామరలవలె విశాలములైన కన్నులుగల శ్రీమన్నారాయణుఁడు నీవుచేసిన మాఘస్నానమువలన ప్రీతినొందినవాఁడై నీయిష్టమును నెరవేర్పఁగలఁడు. అని యిట్లు తండ్రియైన వత్సమహాముని చెప్పఁగా విని మృగశృంగుఁడు మనసున సంతోషించినవాఁడై తండ్రీ నీమాట సత్యము అని ఆయన పాదములు తనతలసోకునట్లుగా సాగిలబడి మ్రొక్కి భగవంతుని ధ్యానముచేయుచు నిలువఁబడెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు పెండ్లాడఁదగిన
కన్యకను నిరూపించుటను దెలుపునది యయిన
అఱుఁదవ యధ్యాయము.



## షష్ఠోఽధ్యాయః.

వసిష్ఠః — అథ భోజపురే తస్మిన్నుచథ్యో మునిపుంగవః, సువృత్తా నామ తస్యాసీత్కన్యా కమలలోచనా. సా మాఘమాసే కన్యాభి స్సఖీభి స్సహ మజ్జతి, ప్రాతఃకాలే సముత్థాయ కావేర్యాః పశ్చిమాఘుసి, సహ్యపాదోద్భవా దేవి శ్రీరంగోత్సంగగామిని. శ్రీకావేరి నమస్తుభ్యం మమ పాపం వినాశయ, మరుద్వృధే మహాభాగే మాఘమాసే నిమజ్జతామ్. మహాపాపహరే మాతర్మంగళాని ప్రయచ్ఛ మే, పతిం దేహి సుతం దేహి మతిం దేహి మనోరథాన్. పాతివ్రత్యం తథా దేహి మమ పశ్చిమవాహిని, ఇత్థం మంత్రం సముచ్చార్య నమస్కృత్య కవేరజామ్. వివస్వత్యుదితే కించిత్సువృత్తాం స్నాతి నిత్యశః, ఇత్థ మబ్దత్రయం మాఘస్నాన మేషాచకార వై. అస్యాశ్చిత్రం చరిత్రం చ కౌశలం గృహకర్మణి, దృష్ట్వా పితా ప్రహృష్టాత్మా కస్మై దేయే త్యచింతయత్. అథ సూనో ర్వివాహాయ వత్సస్య బ్రహ్మచారిణః, ఉచథ్యస్య సుతా మైచ్ఛ త్కుత్సస్య బ్రహ్మచారిణః.

---

## ఆఱవ యధ్యాయము.

వసిష్ఠమహాముని మాటలు.—ఆభోజపురమునందు ఉచథ్యుఁడు అను పేరుగల బ్రాహ్మణశ్రేష్ఠుఁ డొకఁడు గలఁడు. ఆయనకు తామరపూవులవంటి కన్నులు గలకూఁతురు ఒకతె కలదు. దానిపేరు సువృత్త. అది మాఘమాసమునందు ప్రతిదినము తెల్లవారిలేచి తన యీడు కన్యకలను కొందరనుగూర్చుకొని పశ్చిమవాహిని యైన కావేరికిపోయి స్నానము చేయుచుండును. స్నానముచేయుటకుముందు సహ్యమను కొండయందుపుట్టి శ్రీరంగమునుపొందునట్టిదానవైన కావేరీ నాపాపములను పోఁగొట్టుము. దేవతలకు పొందదగిన దానవును, పావనమైనదానవును, మఘమాసమునందు స్నానముచేయువారి పాపములను పోఁగొట్టుదానవును నైన నీకు నమస్కరించెదను. నాకు శుభములు ఇమ్ము. మంచి భర్తను కొడుకులను మంచిబుద్ధిని పతిభక్తిని ఇమ్ము. మఱియు నాకుఁగల కోరికల నెల్లను ఇమ్ము. అను అర్థము గలమంత్రములను చెప్పి, సంకల్పముచేసి కావేరినిగూర్చి నమస్కారము చేసి ప్రొద్దుపొడుపున నే స్నానముచేయుచుండును. ఆకన్యక మూఁడుసంవత్సరములు ఇట్లు మాఘస్నానము చేసెను. ఉచథ్యుఁడు ఆకన్యకయొక్క వింతయైన నడతను ఇంటిపనులయందలి నేర్పరితనమును చూచి సంతోషించి దీనికితగినవరుఁడు ఎవఁడు అగునో అని ఆలోచించుచుండెను.

అంతట కొడుకు పెండ్లికై విచారించుచున్న కుత్సమహర్షి తత్త్వము తెలిసినవాఁడును, బ్రహ్మచారియు నైన తనకుమారునికి ఉచథ్యుని కూఁతురైన సువృత్తను తీసి

ఉత్కృష్టరూపా మురులక్షణాఢ్యా ముపాధిశూన్యా ముభయత్రశు
ద్ధామ్, ఉచథ్యకన్యా ముపమానహీనా ముద్వోఢుమేనాంచ కమే సకౌ
త్సః. కదాచిత్తు సువృత్తా సా సఖిభి స్తిసృభిస్సహ, మాఘస్నానాయ కా
వేరీకూల మాపారుణోదయే. తదా వనద్విపః కశ్చి ద్వ్యాసితాభి ర్మదోద్ధ
తః, ఉద్ధస్తో బృంహితం కుర్వ౯ శుండాశూత్కారభీషణః. తం దృష్ట్వా
భయవిత్రస్తా స్సువృత్తాద్యా స్సులోచనాః, దుద్రువు ర్దూర మధ్వానం
గజోఽప్యనుగతో గతః. కన్యా ధావనవేగేన నిశ్వాసోచ్ఛ్వాసపీడితాః,
తృణచ్ఛన్నే మహాకూపే నిపేతు ర్జలవర్జితే. నిపత్య విహ్వలాస్సద్యః
గతప్రాణా స్తథాభవ౯, అనాగతాసు తాస్వేవం దేశకాలే గతే తదా.
మాతరః పితర స్తాసాం విచిన్వంతోఽథ బభ్రముః, వనాద్వనం పరిభ్రా
మ్య గుల్మాద్గుల్మం వ్యలోకయ౯. క్వచి త్క్వచిత్పరిభ్రష్టవస్త్రాన్యా
భరణానిచ, దృష్ట్వా తదనుసారేణ గచ్ఛంతో దీనచేతసః. పాతాళసన్ని
భంకూపం దదృశుర్ద్రుగగోచరమ్, గతాసూ రపితావీక్ష్య కన్యాఃకమల

---

కొనగోరెను. మృగశృంగుఁడును మంచి ఆకారముగలదియు, మేలైన శుభలక్షణములు గలదియుఁ, కేవల కుటుంబపోషణాసక్త కానిదియుఁ, తల్లివంశమువలనను పరిశుద్ధురాలును, ఈడులేనిదియుఁ నైన ఉచథ్యునికొమార్తెను పెండ్లాడఁగోరెను. అట్టియెడ ఒకనాఁడు ఆసువృత్త తనచెలిమికత్తెలైన ముగ్గురుకన్యకలును దానును మాఘస్నానముచేయుఁటకై తెల్లవారిలేచి కావేరికి పోయెను. అప్పుడు మదించిన ఒకయడవియేనుఁగు తొండము మీఁదికెత్తుకొని చిరకొట్టుచు భయంకరముగా ఘీంకారముచేయుచు వారిపైఁబడ వచ్చెను. ఈకన్యకలు ఆయేనుఁగునుజూచి భయపడి గుండెలుకొట్టుకొనఁగా బహుదూరము పరుగెత్తిరి. అదియును వీరిని వెంబడించి తరుమసాగెను. ఆయేనుఁగు తరుముకొని రాగా పరుగెత్తువారు భయముచే కాళ్లుతడబడగా రొజుచుపోయి ముందువెనుక తెలియక పచ్చికచే నావరింపఁబడిన నీళ్లులేని ఒకపాడునూతిలోపడి దేహములు పరవశము కాగా ప్రాణములు విడిచిరి.

అంతట ఈకన్యకల తల్లిదండ్రులు కావేరికి స్నానము చేయఁబోయి బిడ్డలు ఏవేళకు రాకపోయిరేయని అందందు వెదకుచు తిఁగితిరిగి పిమ్మట అడవి యడవి పొద పొద చొచ్చి వెదకసాగిరి. అప్పుడు ఒకయడవిలో జారపడిపోయినవస్త్రములను కొన్ని ఆభరణములను గానవచ్చెను. వానినిఁజూచి మనసులలో కలవరము హెచ్చగా ఆవస్త్రములయుఁ ఆభరణములయుఁ జాడనుపట్టిపోయి అగాధమై చీకటికమ్ముకొనియున్న ఆపాడునూతిని అందుబడిచనిపోయిన తమకొమార్తలనుజూచిరి. అట్లుచూచి విమలాకమ

లోచనాః. రురుదుస్సుస్వరం ఘోరం కురర్య ఇవ దుఃఖితాః. మాతరః-విమ
లేకమలే తథా సువృత్తే సురసేత్యాదిభి రేవ నామభిః, ఉపహూయ ముహు
ర్ముహు ర్విషణ్ణా విలపంతి స్మ తదీయమాతరస్తాః మృగ భాస్కరమాసి నిత్య
శః ప్రతిబోధాభిరతీవ కౌతుకాత్, భవతీభిరియం మరుద్వృథాఫలము
ద్దిశ్యకిమేతదుత్థితాః. భవనే బహుధాన్యసంయుతే పరిపక్వం కమనీయమో
దనమ్, పితరః క్షుభితా స్సమాసతే ద్రుత ముత్తిష్ఠత భోక్తుమా
త్మజాః. అఘరోగవిపద్భయాదయో నభవంతీతి విపశ్చితో విదుః, మృగ
భాస్కరమాసి మజ్జతాం విపరీతే హి విధౌ కిముత్తరమ్. చరణం పుర
తః ప్రసార్య నో ముహురాహ్వానకృతోపమంత్ర్య చ, భవతీభిరుపేక్షణం
కృతం నహి పశ్యామ విరోధకారణమ్. ఉచథ్యః-మృగశృంగ ముని స్తపో
నిధిః పరిణేతుం భవతీమయాచత, శుభమస్తు తథాస్త్వితీరితా పున
రస్మై కథయామి కిన్ను వా. ఇతి కన్యాజనిత్రృషు క్రోశంతీ ష్వతిదారు
ణమ్, మృగశృంగో ముని శ్శీఘ్ర మా నాగత స్తపసాంనిధిః. విలోక్య

---

లా సువృత్తా సురసా అనిపిలుచుచు ఆకన్యకలతల్లులు నలువురును మిక్కిలి దుఃఖమునొం
దినవారై సుస్వరము గలఆడుహంసలో అనునట్లు గొంతెత్తి యేడ్చుచు, ఓబిడ్డలారా!
మీరు మాఘమాసమునందు మిక్కిలియెచ్చరికతో మెలఁగి అందువలనివైరాగ్యము చేత దేవ
త్వమును బొందఁగోరి ఈవిధముగా శరీరములను వదలితిరా ఏమి? బహువిధములైనధాన్య
ములు మొదలగువానితో నిండుకొన్న యిండ్లలో పక్వముగా వండఁబడిన చవియైన అన్న
మును భుజింపరాక మీతండ్రులు మిక్కిలి యఁకలార్చుచున్నారే మీరేల లేచిరారు.
శీఘ్రముగ లేచిరండి. మాఘమాసమునందు కావేరీస్నానము చేయువారికి పాపము రో
గము ఇడుమ అను వీనివలనిభయములు కలుగవని విద్వాంసులగువారు చెప్పుచుందురు.
అది మీయందు అబద్ధమై పోయెను. శాస్త్రములందు చెప్పఁబడిన ధర్మములే యిట్లు
అబద్ధములగుచుండఁగా ఇఁక ఏమనవచ్చును. అమ్మలారా! మీరు ఈనూతిలో కాళ్లు
చాచుకొని, పలుమారు రమ్మని పిలుచుచున్న మమ్ము ఆదరించి ఊరక అణఁగియున్నారే,
మాయందు ఇంతకోపము కలుగుటకు మేము చేసిన నేరమేమి? అని ఈవిధముగా ప్రలా
పింపసాగిరి అప్పుడు ఉచథ్యుఁడు తనకొమార్తనుజూచి, అమ్మీ! నిన్ను మృగశృంగమహా
ముని పెండ్లాడఁగోరి నన్నడిగెను. నేను మంచిది కానిమ్మంటిని. ఆయన మరలవచ్చి
నన్నడిగిన నేనేమి యుత్తరము చెప్పుదును అనెను.

ఇట్లు ఆకన్యకలతల్లిదండ్రులు దుఃఖించుచుండఁగా తపస్సునకు నిధియైనవాఁ
డును, సౌందర్యసంపన్నుఁడును అయినమృగశృంగమహాముని ఆపాడునూతియొద్దకువచ్చి

తాసాం దుఃఖంచ కన్యాస్తా వివశా స్తదా, దుఃఖితానపి తద్బంధూన్ను నస్యైవ మచింతయత్. తచ్చింతయిత్వా తానాహ ద్యుతిమాన్ ధృతిమాన్వశీ, ఉత్థాపయిష్యే వః కన్యాః దినైః కతిపయైరితి. శనై రాశ్వాస్య తాన్సర్వా న్నివార్యాహ చ రోదనమ్, యావదుజ్జీవయిష్యామి కన్యాః కమలలోచనాః. తావదాసాం మనోజ్ఞాని వపూంషి పరిపాల్యథ, ఇత్యుదీర్య మునిశ్రేష్ఠః కావేరీమేత్య పావనీమ్. కంఠదఘ్నే జలే తిష్ఠన్ ఆదిత్య మవలోకయన్, ఊర్ధ్వవక్త్రోర్ధ్వబాహుస్సన్ మృత్యుం తుష్టావనిత్యశః. తం హంతు మేకదా విప్రం జలమధ్యే స కుంజరః, హస్తముద్ధృత్య వేగేన మునేరంతికమాయయౌ. విలోక్య తస్య సంరంభం కరిణో మునిపుంగవః, న చచాల జలాత్సోఽపి చిత్రార్పిత ఇవస్థితః. గతమన్యుః క్షణా దేవశాంతోఽభూత్సగజేశ్వరః, శుండాగ్రేణగృహీత్వాతంస్వమూర్ధ్ని ప్రస్థాప్యసంస్థితః.తస్య శాపంమునిర్జ్ఞాత్వా జపంతావ త్సమాప్యచ,సుఖాసీనో గజస్కంధే సంతోషం పరమం యయౌ. తత్సంతః ప్రశంసంతి గజస్కంధాధిరోహణమ్,తస్మాచ్ఛోభన మేవైత దితిమత్వాతపోనిధిః ఏనము

---

అందులోపడి చనిపోయిన కన్యకలను వారిచావునకై దుఃఖించుచున్న కన్యకల తల్లిదండ్రులను జూచి ఇందులకు ఏమిచేయవచ్చునని విచారించి ధైర్యముగలవాఁడును ఇంద్రియనిగ్రహముగలవాఁడును గనుక ఆ యేడ్చుచున్న కన్యకల తల్లిదండ్రులతో మీరు దుఃఖపడవలదు. కొన్నాళ్లలో మీకన్యకలను ప్రాణములిచ్చి యీనూతినుండి లేపెదను. ఎప్పటికి ఈకన్యకలను లేపుదునో అప్పటిదాక మీరు అందములైన వీరి దేహములను కాపాడుచుండ లసినది. అనిచెప్పి వారిని ఓదార్చి అందుండి వెడలి పరమపావనమైన కావేరినదికి పోయి కుత్తుకబంటినీళ్లలో నిలిచి చేతులుపైకెత్తుకొని సూర్యునిజూచుచు మృత్యుదేవతను ప్రార్థించుచు నుండెను. అప్పుడు మునుపటియేనుఁగు తొండము పైకెత్తుకొని నీటినడుమనున్న ఆబ్రాహ్మణుని చంపునదియై మహావేగముతో వచ్చెను. అందులకు అతఁడు భయపడక యెక్కటి నిష్ఠను వదలక నిలిచియుండెను. అదిచూచి ఆ యేనుఁగు తనఆటోపముమాని నిమిష కాలముచి త్తరువునందలిరూపమువలె కదలక మెదలక యుండి పిమ్మట తొండముకొనను మెల్లగా ఆమునినిపైకి చాచి ఎత్తి నెత్తిపై బెట్టుకొనెను. అతఁడును దానివృత్తాంతమును తెలిసికొని జంకక జపమునుచాలించి దాని మెడపై పొందుపడకూర్చుండి ఏనుఁగునెక్కుటను సత్పురుషులు చాల ప్రశస్తముగా చెప్పుదురు గనుక ఈయేనుఁగునెక్కుట ఒకమంగళసూచకమే అగునని నిశ్చయించి తిర్యగ్జాతియందు పుట్టి చాలకాలమునుండి దుఃఖించుచున్న ఆయేనుఁగును కృతార్థమునుగా

త్తారయిష్యామి తిర్యక్త్వే దుఃఖితం చిరాత్. ఇతి నిశ్చిత్య మనసా విచార్య సుచిరం మునిః, మాఘాష్టదినజం పుణ్యం తుభ్యం దత్తమితి ద్విజః. ఆదాయ పాణినాతోయం శీఘ్రం తన్మూర్ధ్ని దత్తవాన్,జానన్నివకరీంద్రో సౌ తదాపాపవివర్జితః. ప్రళయాంబుదనిర్ఘోషసదృశం బృంహితం వ్యధాత్, తేనాపిసంతుష్టమనా మృగశృంగ స్వపాణినా. పస్పర్శ సాంద్రకృపయా ముక్తం దృష్ట్వా గజేశ్వరమ్, మునిపాణితల స్పర్శా ద్గజరూపం విహాయ సః. విస్మితేన మునీంద్రేణ దదృశే దివి దేవవత్, ప్రభామండల మధ్యస్థతేజోనిధిరకల్మషః. నిజరూపం సమాసాద్య ప్రణమ్య మునిమబ్రవీత్, కృతార్థోఽహంకృతార్థోఽహంకృతార్థోఽహంమునీశ్వర. యత్త్వయా తారితఃపాపాత్తిర్యక్త్వాచ్చవిగర్హితః,మమవృత్తమశేషేణప్రవక్ష్యామి కృపానిధే. శృణుష్వమునిశార్దూల సర్వభూతహితేరత, నైషధేనగరే పూర్వం విశ్వగుప్తఇతిశ్రుతః వైశ్యఃపరమధర్మాత్మా నిజధర్మపరాయణః, తస్యసూనురహంనామ్నా ధర్మగుప్తఇతిశ్రుతః. స్వాధ్యాయం యజనం దానం కుసీదంపశుపాలనమ్, గోరక్షాంకృషివాణిజ్య మకరం ద్విజపుంగవ.

---

జేయవలెను. అని తనమనస్సున నిశ్చయించుకొని మాఘమాసమునందలి యెనిమిదిదినముల స్నానఫలములను నీకుదత్తము చేసితిని. అని చేతనీళ్లెత్తి దానితలపైఁజల్లెను. అంతట అది ఆఫలమును గ్రహించినందులకు గురుతుగా పాపములేమి పొందినదై ప్రళయకాలపుమేఘమువలన బుట్టిన యుఱుమును బోలిన ధ్వని కలుగునట్లు ఘీంకారము చేసెను. అందులకు బ్రాహ్మణుఁడు సంతోషించి తనయందు ప్రీతిగలదైన ఆయేనుఁగుదేహమును తన చేతితో నిమిరెను. పరమపావనమైన ఆమృగశృంగుని చేయి సోకుటచేత ఏనుఁగు ఆయాకారమునువదలి ఆకాశమునకు ఎగసి దేవతారూపముతో కాంతిమండలము నడుమ వెలుగుచున్న సూర్యునివలెనే మృగశృంగునికి కనబడి తనస్థితికి ఆశ్చర్యమునొంది చూచుచున్న ఆమునిశ్రేష్ఠునికి నమస్కరించి యిట్లనెను. ఓమునీశ్వరా! నేను కృతార్థుఁడనైతిని. పుణ్యపురుషుఁడవైన నీచేత ఆదరింపఁబడి మృగజన్మమువలన విడువఁబడినవాఁడనైతిని గనుక దయాసముద్రుఁడవైన నీతో ఇక నావృత్తాంతమంతయు విశదముగాఁ జెప్పుకొనెదను. చిత్తగింపుము.

పూర్వకాలమునందు నిషధపట్టణములో మిక్కిలి ధర్మాత్ముఁడును మంచినడవడి గలవాఁడును నైన వైశ్యుఁడొకఁడు గలఁడు. అతనిపేరు విశ్వగుప్తుఁడు. నేను అతనికొమారుఁడను. నాపేరు ధర్మగుప్తుఁడు. నేను నాకులమునకు ఉచితములైన వేదములు జదువుట, యజ్ఞములు చేయుట, దానములిచ్చుట, ధనమును వడ్డికిచ్చుట, గోవులను కాపా

కామదంభవినిర్ముక్తః సత్యవా గనసూయకః, సదా త్రివర్గా ద్విరతం వణిక్కర్మణ్యవంచకః. ధనం దదామి విప్రాణాం యజ్ఞకాలే త్వయాచితః, వీతరోగభయక్రోధః లోభమత్సరవర్జితః. దాతాయజ్వాదేవభక్తోగోబ్రాహ్మణహితేరతః, స్వదారనిరతో దాంతః పరదారవివర్జితః. పితృకార్యంచతత్కాలే సర్వదేవార్చనంతథా, గంధద్రవ్యాణ్యనేకాని విక్రీణామి రసాన్ బహూన్. పయోదధీనితక్రాణి కాష్ఠానివివిధానిచ, గోమయాని తృణాదీని లవణం జాజిపిప్పలమ్. ధాన్యాని శాకమూలాని వస్త్రాణి వివిధానిచ, ధాతూనీక్షువికారాంశ్చ విక్రీణామి తథా పశూన్. యద్దదామి నతన్న్యూనం యద్గృహ్ణామి నచాధికమ్, విక్రీణామిరసాంశ్చాహం యద్యవర్జేవమాయయా. కృత్వాపిప్రతివిక్రేణ పరవస్త్రాద్ధనంబహు, యఃకరోతిజడాన్మూర్ఖాన్ వణిక్కర్మణివంచనం. స యాతి నరకం ఘోరం ధనం చ పరిహీయతే, సర్వేషా మపి దేవనాం బ్రాహ్మణానాం గవామపి.

---

డుట, సేద్యముచేయుట, బేరమాడుట అను క్రియలను నడపుచుందును. కాముకుఁడను గాను. సత్యముతప్పను. ఓర్వలేనితనము నెరుగను. ధర్మము అర్థము కామము అనునవి తగినట్టు నడపుదును. బేరమాడుటయందు జాగ్రత్తకలిగియుందును. యజ్ఞములుచేయునపుడు బ్రాహ్మణులచేత అడుగబడకయే దానములు చేయుదును. రోగము, భయము, క్రోధము, లోభము, మచ్చరము అనునవి నాకులేవు. ఈవియు దేవతాభక్తియుంగలిగి యజ్ఞములు చేయుచుందును. గోవులకును బ్రాహ్మణులకును మేలుచేయుటయందు ఆసక్తుఁడను. స్వభార్యయందే ఆసక్తిగలవాఁడను. పెద్దలచేత శిక్షింపఁబడినవాఁడను. పరస్త్రీలను కోరువాఁడను కాను. ఆ కాలములయందు పితృకార్యములను చేయుదును. ఎల్లవేల్పులను పూజింతును. బహువిధములైన పరిమళద్రవ్యములను రసవస్తువులను అమ్ముచుందును. పాలు పెరుగు మజ్జిగ వంటచెరకులు పిడకలు గడ్డి ఉప్పు జాజికాయిమొదలగు వస్తువులు పిప్పళ్లు బహువిధములైన ధాన్యములు కూరగాయలు వేళ్లు దుంపలు నానావిధవస్త్రములు శిలాజిత్తు మొదలగు ధాతుద్రవ్యములు బెల్లము మొదలగు మధురపదార్థములు ఆవులు గేదెలు మొదలగు పశువులు మొదలుగాగల సమస్తవస్తువుల బేరమును చేయుచుందును. నేను ఏవస్తువును కొన్నను మంచిదిగాచూచి కొందును. అమ్మునప్పుడు నికరముగా అమ్ముదును. ఎవఁడు వస్త్రాదులను కొనునప్పుడును అమ్మునప్పుడును తెలియని వారిని మంచివారిని మోసపుచ్చునో వాఁడు భయంకరమైన నరకమును పొందును. అట్లు ఆర్జించినద్రవ్యమును నష్టపడును. కనుక నేను అట్టిచెడ్డవ్యాపారమునకు 'చౌరక పాపం దమతమును ఆవలంబింపక ఎల్లదేవతలకును, ఎల్లబ్రాహ్మణులకును, ఎల్లగోవులకును

కరోమి నిత్యం శుశ్రూషాం పాషండానాముపేక్షకః, అద్రోహేణైవ భూతానాం కర్మణా మనసా గిరా. యా వృత్తిః పరమో ధర్మః తేన జీవామి భూసుర, ఏవం ధర్మేణ మార్గేణ కోటినిష్కముపార్జితమ్. ఆత్మజస్త్వేక ఏవాసీన్మమ సర్వగుణోత్తరః, ద్విధా విభజ్య తత్సర్వం అర్ధం పుత్రాయ చాదిశమ్. మదీయం భాగమాదాయ తటాకః కారితో మయా, ఉద్యానంచ మయా కారి నానావృక్షసమాకులమ్. దేవాలయో మయా కారి నానామండపసంయుతః, మరుభూమిషు మార్గేషు ప్రపాః కూపా మయా కృతాః. విశ్రామమండపంచాపి మార్గే మార్గే కృతం మయా, కన్యాదానంచ గోదానం భూదానంచ మయా కృతమ్. అన్నాశ్వగజదానాని వస్త్రదానం తథైవచ, తిలతండులగోధూమ ముద్గదానాన్యకారిషమ్. మాషవ్రీహి తిలాజ్యాది దానం దత్తం మయా బహుః, అధునా కిం బహూక్తేన త్వం శృణుష్వ విధేః ఫలమ్. హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి, లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే. భవితవ్యం భవత్యేవ నారికేళఫలాంబువత్, గచ్ఛత్యేవ హి గంతవ్యం గజభుక్తకపిత్థవత్. అథ కాపా

---

సదా శుశ్రూష చేయుచుందును. ప్రాణులయెడ ద్రోహచింత లేక మనస్సు వాక్కు కర్మము అను త్రికరణముల చేతను పరిశుద్ధుడనై ఏవృత్తి మిక్కిలి మంచిదో ఆవృత్తిని పూని జీవించుచుందును. అట్లు ధర్మ మార్గము తప్పక క్రమముగా కోటివరహాలు సంపాదించితిని. ఎల్ల మంచిగుణములు గలకొడుకును ఒకడు కలిగెను. అంతట నేను నాకుగల ఆస్తియంతయు రెండుభాగములుగా భాగించి అందు ఒకభాగము కొమారునికిచ్చి తక్కిన భాగమును నేను పుచ్చుకొని ఆధనమును చెరువులు త్రవ్వించుట తోపులు వేయించుట మండపములు గుళ్లు గోపురములు కట్టించుట నీళ్లు లేని అడవిమార్గములందు బావులు త్రవ్వించుట చలిపందిళ్లు పెట్టించుట పెద్దపెద్ద బాటలయందు బాటసారులు బడలిక తీర్చుకొనుటకై చావళ్లు కట్టించుట మొదలైన సత్కార్యములయందు వెచ్చపెట్టితిని. మరియు కన్యాదానము గోదానము వస్త్రదానము భూదానము అన్నదానము అశ్వదానము గజదానము తిలదానము తండులదానము గోధూమదానము ముద్గదానము మాషదానము వ్రీహిదానము ఆజ్యదానము మొదలగు మహాదానములను చేసితిని. అవిఇవి అననేల! నేను చేయని దానములును ధర్మములును లోకమున లేనేలేవు. ఏమి చేసిన నేమి! దైవబలము గొప్పది. హరిహర బ్రహ్మలైనను ఇంద్రాదులగు దేవతలయినను నొసట వ్రాసిన వ్రాలు తుడిచివేయలేరు. కనుక ఎవరికిగాని సుఖమో దుఃఖమో అదృష్టము చొప్పున అనుభవింపక తీరదు. టెంకాయలోని నీళ్లవలె రాగలది తనంతట నే వచ్చును. ఏనుగు

లికః కశ్చిద్రసవాదకుతూహలాత్, యత్కించిన్నప్రదృశ్యైవ వంచయామాస మాయయా. తం దృష్ట్వా ప్రత్యయో జాతో మమ తస్మిన్ మహీసుర, రసవాదాపదేశేన ధనం సర్వం క్షయం గతమ్. ఇత్థం ప్రోత్సారితస్తేన తద్భ్రాంత్యా భ్రమితశ్చిరమ్, తన్నిమిత్తం ధనం త్యక్త్వా దరిద్రోఽభవమంతతః. జరాజర్ఝరసర్వాంగో వ్యాధిభిః పరిపీడితః, యత్కించిదపివై కర్తుం నోశక్తో ద్విజసత్తమ. సంప్రాప్తే మాఘమాసేతు మహానద్యామినోదయే, స్నానం మయా దశదినం వార్ధకే పునరక్షమః. ఏతస్మిన్నేవ కాలేతు పుత్రో దేశాంతరంగతః, అశ్వామృతాః కృషిర్నష్టా గావో మేఽపహృతాః పరైః. భార్యా స్నుషాచ పౌత్రీచ మయ్యనాదరతాంగతాః, పౌత్రో వేశ్యాపతిర్ధూర్తో గృహం క్షిప్రం వ్యనీనశత్. వేశ్యావ్యాజేన రాజ్ఞాచ రాజ్యాన్నిర్వాసితా వయమ్, తథాపి వృద్ధో ధర్మాత్మా పుణ్యవానితి బాంధవాః. దిశంతి ధర్మానుద్దిశ్య యత్కించిద్ధాన్యమోదనమ్, పరం కాలస్యనియమం కాలదోషేణభూసుర.

---

తిన్న వెలగపండునందలి గుజ్జువలె పోగలది తనంతటనే పోకమానదు. అదియటుండనిమ్ము. నేను అట్లు సన్మార్గమున వర్తించుచుండఁగా రసవాదమునందు అభిరుచిగల కాపాలికమతస్థుడొకఁడు నన్ను మోసపుచ్చెను. వానిమోసపుమాటలను నమ్మి రసవాదము చేయుటయందు నాధనమంతయు నాశమునొందనాయెను. ఇట్లు వానితోడిసహవాసముచేత ఉన్నధనమంతయు పోగొట్టుకొని తుదకు నిరుపేదనై అన్నవస్త్రములకు గతిలేనివాడనైతిని. ముసలితనమునువచ్చెను. అవయవములన్ని వణఁకసాగెను, రోగబాధలు బలమయ్యెను. ఏపనిచేయుటకును ఓపికలేకపోయెను. అట్టిదశలో మాఘమాసము రాగా పదిదినములు ప్రొద్దుపొడుపునందు మహానదిలో స్నానముచేసితిని. అంతట స్నానముచేయ శక్తిచాలకపోయెను. అప్పుడే కొడుకును దేశాంతరమునకు పోయెను. గుఱ్ఱములు చచ్చిపోయెను. కృషి నశించెను. ఆవులను దొంగలు తోలుకొనిపోయిరి. పెండ్లాము ఆదరింపకపోయెను. కోడలును మనుమరాలును దయదప్పిరి. మనుమడుముండలమారియై చెప్పినమాటవినక యిల్లు పాడుచేసెను. భోగముదానినెపముచేత రాజు మమ్ము రాజ్యమునుండి వెడలగొట్టెను. ఇంతదుర్దశకు పాత్రుఁడనైనను ముందునేను చేసినధర్మకార్యములను దలంచి ముసలివాఁడని ధర్మాత్ముఁడని కొందరుపుణ్యాత్ములు, కొంత అన్నముగాను కొంతధాన్యముగాను ఇచ్చి నన్ను కాపాడుచుండిరి. ఓబ్రాహ్మణోత్తమా! ఇఁక కాదశనేమి చెప్పుదును. చాలకాలము ధర్మవిక్రయముచేసి కుటుంబమును పోషించుకొ

స్వధర్మవిక్రయంకృత్వా కుటుంబభరణం కృతమ్, యానియాని మయా పూర్వం దానాని వివిధానిచ. తానితాన్యపి సర్వాణి విక్రీతాని మునీశ్వర, కుటుంబభరణార్థాయ మాఘస్నానఫలంవినా. జిహ్వాచాపల్యవశత స్త్వేకదా పరవేశ్మని, భుక్తవానాగళం మృష్ట మజీర్ణమభవ త్తతః. అతిసార స్తతోజాత స్స్మృతిమానభవం తతః, అతిసారేణ మరణం ధర్మిష్ఠానాం భవేద్ధ్రువమ్. పూర్వపుణ్యఫలాదేవ మాసీచ్చ స్మరణం హరేః, అహం తత్ స్మరణేనైవ తేనాహం మరణంగతః. తేన మాఘప్రభావేన దేవేంద్రస్యైవ సన్నిధౌ, తత్ర మన్వంతరం స్థిత్వా తత్పుణ్యాంతే గజోఽభవమ్, యే ధర్మవిక్రయం కుర్యుః తే భవంతి మతంగజాః, ఇదానీమపి విప్రేంద్ర త్వయాహం తారితోఽభవమ్. పుణ్యదానంకృతంమహ్యం త్వయా స్వర్గోపలబ్ధయే, కృతార్థోఽస్మికృతార్థోఽస్మికృతార్థోఽస్మి మునీశ్వర. నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోనమః, ఇత్యుక్త్వా స యయౌ స్వర్గం సత్సంగ స్సద్గతిప్రదః. మహాను

నుచుంటిని. నాకుటుంబపోషణమునకై ముందు నేను ఏయేదానములను ధర్మములను చేసితినో ఆధర్మములను అన్నిటిని విక్రయించితిని. కడపట నాకుదక్కినది మాఘస్నానఫలమే. ఇట్లు ధర్మవిక్రయముచేసి జీవించుచున్నవాఁడను. ఒకనాఁడు ఒకయింటికి భోజనమునకుపోయి గొంతువరకు మెక్కితిని. దానిచేత అజీర్ణవ్యాధి సంభవించెను. పిమ్మట అది అతిసారరోగముగా పరిణమించెను. ధర్మాత్ములగువారికి అతిసారరోగముచేతనే చావు కలుగును. అనుమాటచొప్పున నాకు అదియే మరణమునకు హేతువాయెను. అప్పుడు నాపూర్వపుణ్యవశమున హరిస్మరణచేయ బుద్ధి పుట్టి ఆస్మరణచేయుచునే ప్రాణములు విడిచితిని. అంతట మాఘస్నానమువలని పుణ్యముచేత స్వర్గమునుపొంది దేవేంద్రుని సన్నిధానమునందు ఒక మన్వంతరము కడచుదాక ఉండి ఆపుణ్యము నశింపగానే అందుండి భూలోకమునత్రోయఁబడి ఏనుఁగుగాపుట్టితిని. ధర్మవిక్రయము చేసినవారు ఏనుఁగుపుట్టువుపుట్టుట సహజమేకదా. అట్లు ఏనుఁగునై యీభూలోకమునందు చరించుచున్న నన్ను నీవు తరింపజేసితివి. నీయనుగ్రహమువలన నాకు స్వర్గము ప్రాప్తించెను. నేను కృతార్థుఁడనైతిని. ముమ్మాటికి కృతార్థుఁడనైతిని. నీకు నమస్కారము నమస్కారము నమస్కారము అనుచు ఆవైశ్యుఁడు స్వర్గమునకు పోయెను. కనుక సత్పురుషుల

భావో మృగశృంగనామా మతంగజత్వాత్పరిముచ్య వైశ్యమ్, స్వయం పునస్తద్గళదఘ్నతోయే తుష్టావతిష్ఠ న్దిననాథసూనుమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే వైశ్యస్య
మతంగజత్వవిమోచనం నామ షష్ఠోఽధ్యాయః.

---

## సప్తమోఽధ్యాయః.

మృగశృంగః.- యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయ చ, వైవస్వతాయ కాలాయ సర్వభూతక్షయాయచ. ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే, వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయ వై నమః. దంష్ట్రాకరాళవక్త్రాయ భ్రుకిటీక్రూరచక్షుషే, ఊర్ధ్వరోమ్ణే మహారోమ్ణే ప్రలంబోష్ఠాయ తే నమః. అనేకబాహవే తుభ్యం నమోఽనంతక్షయాయచ, అంజనాద్రిసమాభాయ విభ్రమాయోగ్రరూపిణే. నమో భీషణరూపాయ పాపినాం భయదాయినే, తర్జతే కాలదండేన

---

సహవాసము సద్గతిని కలుగజేయును. అట్లు ఏనుఁగును పుణ్యపురుషుఁడుగా ననుగ్రహించిన మహానుభావుఁడగు మృగశృంగుఁడు మరల మెడలోతునీళ్లలో నిలిచి సూర్యపుత్త్రుఁడైన యముని ప్రార్థించుచు నుండెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు వైశ్యునకు ఏనుఁగు
రూపును పోగొట్టుటను తెలుపునదియైన ఆఱవయధ్యాయము.

---

## ఏడవ యధ్యాయము.

మృగశృంగునిమాటలు.— పాపులను దండించువాఁడును, ధర్మస్వరూపుఁడైన రాజును, చావునుగలుగజేయు దేవతయు, తుదముట్టించువాఁడును, సూర్యునికుమారుఁడును, కాలస్వరూపుఁడును, సమస్తప్రాణులను నాశముచేయువాఁడును, ఔదుంబరుఁడు దధ్నుఁడు అనఁబడువాఁడును, మిగుల గొప్పవాఁడును, నల్లనివాఁడును, బ్రహ్మస్వరూపుఁడును, అంగుష్ఠప్రమాణమైన జఠరాగ్నిగలవాఁడును, నానావర్ణములుగలవాఁడును, చిత్రగుప్తుఁడైనవాఁడును, కోరలచేత భయమునుపుట్టించునట్టి విశాలమైనముఖముగలవాఁడును, బొమముడిచేత క్రూరములైన నిక్కబొడుచుకొన్న నిడుపాటివెండ్రుకలు గలవాఁడును, వ్రేలుచున్న పెదవులుగలవాఁడును, అనేకములైన చేతులుగలవాఁడును నైనయమునికి నమస్కారము. కాటుకకొండవలె నల్లగా వెలుఁగుచున్న దేహకాంతియు భ్రమింపఁజేయునదియు

సర్వాయుధధరాయచ. మహామహిషవాహాయ దీప్తాగ్నిసమచక్షుషే, మహొత్తమోరు రూపాయ రక్తమాల్యాంబరాయ చ. ప్రళయాంబుద ఘోషాయ ప్రళయానిలరంహసే, పిబతే సాగరమివ గ్రసతే చాఖిలం జగత్. అశ్నుతే పర్వతానాస్యా దగ్నిరూపాయతే నమః, మృత్యునా కాలరూపేణ కాలేనానలవర్చసా. వ్యాధిభిర్బహుభిః పార్శ్వే సేవ్యమానాయ తేనమః, సహితా యోగ్రయాదృష్ట్యా మహాభీమాతి ఘోరయా. ఈదృగాకార రూపాయ పాపిష్ఠానాం నమో నమః, ప్రఫుల్ల పంకజాకార ప్రసన్నవదనాయచ. కారుణ్య పూర్ణ నేత్రాయ పితృరూపాయతే నమః, మహామృదుల కేశాయ భ్రూరేఖాన్వితచక్షుషే. మనోజ్ఞ శ్మశ్రు వక్త్రాయ పక్వబింబోష్ఠ శోభినే, ద్విభుజాయ ప్రసన్నాయ జాంబూనద వపుష్మతే. సర్వాభరణయుక్తాయ రత్నపీఠ స్థితాయచ, రత్నకేయూరహారాయ నానారత్నకిరీటినే. కూలంకషకృపాదృష్ట్యా పశ్యతే

---

భయమును కలుగజేయునదియు నైన విగ్రహపుష్టియుం గలిగి పాపాత్ములను వెరపించువాఁడును, ఎల్ల ఆయుధములనుధరించి పెద్దదున్నపోతును వాహనముగా జేసికొని కనుగ్రుడ్లు మండుచున్న నిప్పుకణికలవలె గానరాగా మిక్కిలి పొడవై నల్లనై యొప్పుచున్న గొప్ప దేహమునందు ఎఱ్ఱనివస్త్రములను ఎఱ్ఱనిపువ్వుదండలను ధరించుకొని ప్రళయకాలపు మేఘము ఉరుమునట్లు భయంకరమైన ధ్వనిగలుగ బొబ్బరించుచు ప్రళయకాలపు పెద్దగాలి యొక్క వేగమువంటి వేగముతో పాపులపైకిపోయి దండాయుధముతో మోదువాఁడును, సముద్రము లోకములోనిజలమునెల్లను ఆకర్షించునట్లు ఎల్లలోకమును మ్రింగుచున్న వాఁడును, నోట మంటలు వెడలగా ఆమంటలవలన పర్వతములను తగులబెట్టువాఁడు అగుటచేత అగ్నిస్వరూపుఁడును అయిన యమధర్మరాజునకు వందనము. ప్రళయకాలమునందలి అగ్నితేజస్సువంటి తేజస్సుగల నల్లనిస్వరూపముగల మృత్యుదేవతయు, దేహములను పొందిన బహువిధములైన వ్యాధులును ఇరుప్రక్కలచేరి గొలువగా, పాపాత్ములగువారికి భయమును కలుగజేయునట్టి చూపులతోను అట్టి యాకారముతోను కానవచ్చువాఁడవును, పుణ్యాత్ములగువారికి వికసించిన కమలములవలె తేటమీరిన ముఖముతో కానవచ్చువాఁడవును, పితృస్వరూపుఁడవునైన ఓ యమధర్మరాజా! నీకు నమస్కారములు. నిడుపులై మెత్తనివైన వెండ్రుకలును రేఖలు తీర్చినట్టుండు కనుబొమ్మలుగల కన్నులును, అందమైన గడ్డము మీసముతోడిముఖమును, దొండపండును బోలిన మెత్తనిదియు ఎఱ్ఱనిదియునైన మోవియు, రెండుచేతులును, నిగనిగలాడెడు బంగారువంటి దేహమునుగలిగి ఎల్లయాభరణములను రత్నములుదాపిన భుజకీర్తులను కిరీటమునుధరించి

మిత్రరూపిణే, సర్వసంపత్సమృద్ధాయ సౌభాగ్యనిలయాయచ. శ్వేతమాల్యాంబరాఢ్యాయ శ్వేతఛత్రోపశోభినే, లసచ్చామర హస్తాభ్యా ముభాభ్యా ముభయోరపి. పార్శ్వయో ర్దివ్య నారీభ్యాం వీజ్యమానాయ తేనమః, రత్నగ్రైవేయరమ్యాయ రత్నకుండలశోభినే. సభాసద్భిరుపాస్యాయ ధర్మాధర్మవిచక్షణైః, ధర్మేణ శుభ్రరూపేణ సత్యేన శుభలక్షణా. శమేనశశివర్ణేన దమేనాత్యంతతేజసా, ఆచారేణ విశుద్ధేన వర్ణాశ్రమభవేనచ. సేవితాయ సదాపార్శ్వే సంయమన్యా స్సభాంతరే, సాధూనాం స్నిహ్యతేశశ్వ త్ప్రాణా నాప్యాయతే గిరా. వాచాతోషయతే సాధూ౯ సర్వస్వం దదతే గుణైః, సదాసంతుష్టరూపాయ సజ్జనానాం నమోనమః. నమఃకృతాంతాయ కృపాకరాయ కృతక్రియాణాం కృతినాం హితాయ, సత్సంగినే సంయమినాంప్రియాయ ధర్మాత్మనే ధర్మకృతాం ప్రియాయ. ఘంటారవధ్వనిత దిఙ్ముఖ తుంగశృంగ ఘూత్కార భీషణ మహామహిషస్థితాయ, నారాచశక్తి ముసలాసి గదాత్రిశూల పాశాంకుశై ర్విలస దష్టమహాభుజాయ, సద్భి శ్చతుర్దశభిరేవ శుభాశు

---

రత్నాలహారములు మెడనుప్రేలగా దయారసముచేత నిండుకొన్న చూపులతో రత్నమయమైన సింహాసనమునందుకూర్చుండి, ఎల్లసంపదల సమృద్ధి గలవాడవై, సౌభాగ్యమునకు ఉనికిపట్టయి, తెల్లనైన పువ్వులచేతను వస్త్రములచేతను అలంకరింపబడి, తెల్లగొడుగును దాల్చి ధర్మాధర్మములను విచారించుటయందు సమర్థులైన సభికులచేత కొనియాడబడుచు, తెల్లని ఆకృతిగల ధర్మదేవతచేతను, శుభమే లక్షణముగాగల సత్యముచేతను, చంద్రుని కాంతివంటి కాంతిచేత వెలుగునట్టి శమముచేతను, మిక్కిలి తేజస్సుతో వెలుగునట్టి దమముచేతను, బ్రాహ్మణాదివర్ణములవలనను బ్రహ్మచర్యాదులైన ఆశ్రమముల వలనను గలిగిన మంచి ఆచారములచేతను, ఎల్లప్పుడు సేవింపబడుచు, సత్పురుషుల ప్రాణములను మంచిమాటలచేత మాటిమాటికి తనుపునొందించుచు, సత్పురుషులను సకలసుగుణముల చేతను వాక్కులచేతను సంతోషింపజేయుచు, సంతోషస్వరూపుడై మిత్రస్వరూపుడై ఒప్పునట్టి యమధర్మరాజా! నీకు మ్రొక్కెదను. పాపులకు నాశకుడవును, పుణ్యులకు దయాస్వరూపుడవును, యజ్ఞములు మొదలగు సత్క్రియలు చేయువానికి ప్రియమైనవాడవును, మంచిసాంగత్యముగలవాడవును, ఋషీశ్వరులకు ఇష్టుడవును, ధర్మముతో గూడిన మనసు గలవాఁడవును, ధర్మాత్ములకు ఇష్టుఁడవును, ఘంటలధ్వనులచేత దిక్కుల కొనలవరకు వ్యాపించుచున్న నిడుపాటికొమ్ములతో భయంకరముగా భిరకొట్టి శ్వాసము విడుచునట్టి గొప్పదున్నపోతు నెక్కినవాఁడవును, నారసము శక్తి రోకలి ఖడ్గము గద శూలము పాశము అంకుశము అనునట్టి ఆయుధములను ఎనిమిదింటిని బూనిన ఎనిమిది

భాని సమ్యగ్విచారయతి శాస్త్రిచ సాక్షిభిర్యః, తస్మై నమ స్సకలలోక హితాయ శాంతరూపాయ దక్షిణహరిత్పతయే యమాయ. భవ్యాయ భానుతనయాయ భవాపహాయ నేత్రప్రియాయ నియమస్థితమానసానామ్, సౌవర్ణమందమనుమాతృసపత్నజాయ వైవస్వతాయ వరదాయ నమశ్శుచీనామ్. బధ్వాదృఢం నిజభటై ర్నిహితాన్ పురస్తా ద్ఘోరేష్వనేకనరకేషు నిపాత్యపాపాన్, ఛింధీతి భర్జ దహశోషయ పేషయేతి శశ్వన్నమఃకథయతే యమునాగ్రజాయ. రక్తాంతవృత్తనయనాయ వృకోదరాయ భీతిప్రదాయ భ్రుకిటీ కుటిలాననాయ, నీలాయ నిష్ఠురభటైర్నియమై ర్విహీనాన్ సంతర్జితే భగవతేఽస్తు నమోఽంతకాయ. దూరే విలోక్య నిజకర్మరతాన్ విమానే ప్రత్యుద్గతాయ రచితాంజలిబంధనాయ సంజ్ఞాసుతాయ సరసీరుహలోచనాయ తుభ్యంనమో విహితపంచమహాక్రతూనామ్. విశ్వాధికాయ విమలాయ విచక్షణాయ విశ్వంభరాయ

---

చేతులుంగలవాడవును, సత్పురుషులగుపదునలుపురను సాక్షులనుగా జేసికొని జీవులపుణ్యపాపములను విచారించి శిక్షించువాఁడవును, సకలలోకములకు మేలుగోరువాడవును, శాంతస్వరూపుఁడవును, దక్షిణదిక్కును పాలించువాఁడవును, శుభములను కలుగజేయుంవాఁడవును, సూర్యునికొమరుడవును, సంసారదుఃఖమును తొలగించువాఁడవును, మంచి నియమముగల పుణ్యపురుషుల కన్నులకు ప్రియమైనవాఁడవును, సౌవర్ణుడు మందుడు మనువు అనువారికి సవతితల్లికొడుకును సూర్యపుత్రుఁడవగుటచేత పరిశుద్ధులగువారి కోరికలను తీర్చువాఁడవునైన యముఁడా! నీకు వందనములు చేసెదను. తన కింకరులచేత గట్టిగా కట్టి సమ్ముఖమునకు తేబడిన పాపులను అనేకములైన నరకములలో పడద్రోసి మాటిమాటికి కోయుము వేచుము కాల్చుము వరుసగా ఎండబెట్టుము పిండిపిండిగానూరుము అని చెప్పుచుండునట్టివాఁడును, యమునానదికి తోడబుట్టినవాఁడును, కనుఁగొనలు ఎఱ్ఱవారగా గిరగిర తిరుగుచున్న కనుగ్రుడ్లు గలవాఁడును, అంగుష్ఠప్రమాణముగల జఠరాగ్నిగలిగి భయమునుకలుగజేయుంచు వంకరైన బొమముడితో గూడుకొన్న ముఖము గలవాఁడును, క్రూరులైన కింకరులను నియమించుటచేత నీచులగు వారిని బెదరించునట్టి భగవంతుడైన యమునికి నమస్కరించెదను. తమతమ నియతకర్మములను నడపుటయందు శ్రద్ధగలవారిని విమానమునందుండగానే లేచి చేతులు జోడించుకొని యెదురుకొనువాఁడును, సంజ్ఞాదేవికుమారుడును, కమలములవంటి కన్నులుఁ గలవాఁడును, చేయబడిన పంచమహాయజ్ఞములుగలవారి నాదరించువాఁడునైన నీకు నమస్కారము చేసెదను. సర్వ విషయములందు అధికుడవును, నిర్మలుడవును, సమర్థుఁడవును, సర్వమును భరించువాఁడవును, బ్రహ్మ

విధివిష్ణుశివప్రియాయ, సత్సాక్షిణే సదసదాచరిణే౽ఖిలానాం శశ్వన్నమస్సకలలోకపరాయణాయ. ఇతి స్తుత్వా నమస్కార మకరోద్దండవద్భువి, దక్షిణాశాపతిం ధ్యాయన్ దాక్షిణ్యకరుణాలయమ్, తతః ప్రసన్నో భగవాన్ యమో వైవస్వతో౽౦తకః, ప్రాదురాసీన్మహాతేజాః ప్రసన్నవదనామ్బుజః. శ్వేతమాల్యాంబరధరో నానారత్నవిభూషితః, మహాబాహు ర్విశాలక్షో మహాలావణ్యశేవధిః. సంతోషోత్ఫుల్లనయనైః ప్రసన్నాననపంకజైః, మృదువాక్యైస్సువేషైశ్చ సర్వాభరణభూషితైః. సమస్తాయుధసంపన్నై స్సద్గుణై ర్వినయోజ్జ్వలైః, సేవ్యమాన స్సదా పార్శ్వే సింహస్కంధై ర్మహాభుజైః. దంష్ట్రాకరాళవదనై ర్మహావీర్యై స్సకింకరైః, సదస్యైరపి మధ్యస్థైః ధర్మిష్ఠై స్సూక్ష్మదర్శిభిః. సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞై ర్మహాక్రతుషు దీక్షితైః, కిరీటహార

---

విష్ణు మహేశ్వరులకు ఇష్టుడవును, ఎల్లవారియొక్క మంచిచెడ్డలకు మేలైన సాక్షియును, ఎల్లలోకములందును గొనియాడదగినవాఁడవునైన యమధర్మరాజా! నీకు నూటి నూటికి నమస్కరించెదను. అని యీవిధము మొగమోటమునకును దయకును ఉనికిపట్టయినవాఁడును, దక్షిణదిక్కునకు అధిపతియునైన యమునిస్తోత్రము చేసి కఱ్ఱవాటుగా నేలసాగిలబడి మ్రొక్కగా పద్గుణైశ్వర్యసంపన్నుఁడై సూర్యునికొడుకై ప్రాణులను తుదముట్టించువాడైన యముడు అతనియందు అనుగ్రహముగలవాఁడై మిక్కుటమైన తేజస్సును, కమలములవలె వికాసముగల మొగమును, గొప్పవైన చేతులును, మిగులచక్కదనమును, ఎల్ల మంచిగుణములును గలవాఁడై తెల్లనివస్త్రములను తెల్లని పూలదండలను అనేకములైన రత్నములు చెక్కిన ఆభరణములను ధరించి సంతోషముచేత తేటపారినకన్నులును తేటమీరిన మొగమును తిన్నదనముగలమాటలును మంచివేషమును గల్గి, ఎల్ల ఆభరణములచే నలంకరింపఁబడినవారును, ఎల్ల ఆయుధములను పూనినవారును, మంచి గుణములు గలవారును, వినయముచేత వెలుఁగునట్టివారును నయ్యును, సింహములను బోలినవారును, గొప్పగొప్ప చేతులు గలవారును, కోరలచేత వికవికాలోచునట్టి ముఖములు గలవారును, మిక్కిలిశూరులును నయ్యును తోచునట్టి కింకరులు ఎల్లప్పుడు ఇరుప్రక్కలచేరి సేవింపగా, మిక్కిలి ధర్మమునడుపువారును, ధర్మసూక్ష్మముల నెరింగినవారును, ఎల్లశాస్త్రములయందలి యర్థములను మూలముట్టుగ తెలిసికొన్నవారును, గొప్పయజ్ఞములయందు దీక్షనువహించినవారును, గొప్పయజ్ఞములు చేసినవారును, మధ్యవర్తులునైన సభవారితోడను, కిరీటములను ముత్యాలహారములను ధరించినవారును సమరసమైన గుణము

కేయూర మణికుండలిభిర్న్వృపైః. పరితస్సేవితో దాస్త్రైర్యమ స్తస్య పురో భవత్. మునిముత్థాప్య బాహుభ్యాం సమాలింగ్యేద మబ్రవీత్, స్తవే నానేన సంతుష్టో వరదోఽహ మిహాగతః. వృణీష్వ మత్తోఽభిమతం వర మిష్టం దదామి తే, తచ్ఛ్రుత్వా వచనం తస్య సముత్థాయ మునీశ్వరః. ప్రహర్షోత్ఫుల్లనయన స్తం సమాలోక్య విస్మితః. కృతాంతమాసాద్య కృతీకృతార్థః కృతాంజలిః కృత్యమువాచ తాసామ్, ప్రాణప్రదానంకురు కన్యకానాం పునః పునస్త్వామిదమేవయాచే. తద్వాక్య మాకర్ణ్య సధర్మ రాజః స్వకింకరాన్ పార్శ్వగతానువాచ, కన్యాశ్చతస్రస్సహసానయధ్వ ముద్యానమధ్యే కదళీవనస్థాః. తత్రైవ గత్వా కదళీవనస్థాః కన్యాస్సమా నీయ దదుర్యమాయ, సంప్రేషయామాస యమోఽపిశీఘ్రు మదృశ్యరూ పేణ సవిప్రకన్యాః. యథా సుప్తోత్థితాః పూర్వం తథా రూపా త్సము త్థితాః, జహర్షు స్స్వజనన్యోఽథ బాలా దృష్ట్వా సచేతనాః. పరిధాయ్య నిజం వాసః పూర్వవ ద్ద్విజకన్యకాః. ఆహూయ జననీబాలాః స్వ

---

గలవారునైన రాజులతోడను, మృగశృంగమహాముని కి ప్రత్యక్షమై ఆతనిని గ్రుచ్చి లేవనెత్తి ఆలింగనము చేసికొని నీవిప్పుడుచేసిన యీస్తోత్రముచేత సంతోషించి నీకు వరమిచ్చువాడనై యిచ్చటికి వచ్చితిని. నీకిష్టమైనవరమును అడుగుము. అడిగినవర మును తప్పక యిచ్చెదను. అని పలికెను.

అంతట మృగశృంగుడు ఆయమునిమాటలను విని లేచి సంతోషముచేత వికాస మును పొందిన కన్నులు గలవాఁడై ఆశ్చర్యముతో యమధర్మరాజును జూచి కోరినపనిని నెరవేర్చుకొనుటచేత సమర్థుడైన ఆతడు అంజలిచేసి పాడునూతిలో పడి చనిపోయిన కన్యకలవృత్తాంతమును చెప్పి ఓధర్మరాజా! ఆకన్యకల ప్రాణములను ఇమ్ము. మున్మా టికి నేనుకోరునది ఇదియే. అనగా యముడు తనపార్శ్వమునందున్న కింకరులను జూచి మన యరటితోటయందుండెడి ఆనలుగురు కన్యకలను ఇచ్చటికి శీఘ్రముగాపిలుచుకరండి యని ఉత్తరువు చేసెను. ఆకింకరులును ఆతని యుత్తరువు చొప్పునబోయి అరటితోట యందున్న కన్యకలను తీసికొనివచ్చి యమునియెదుట నిలిపిరి. అంతట యముఁడు మను ష్యులకు కానరాని రూపములతోనున్న ఆకన్యకలను వారిదేహములందు చేర్చెను. వెంటనే కన్యకలు నిద్రపోయి లేచినవారివలె ఆపాడుబావినుండి లేచి సంతోషముతో మెల్లగా వెలుపలికివచ్చిరి. అట్లు లేచివచ్చిన కన్యకలనుజూచి వారితల్లులును తెలివి నొందిరి. పిమ్మట ఆబ్రాహ్మణకన్యకలు ఎప్పటివలె తమతమవస్త్రములను కట్టుకొని తల్లులతో

కీయం వివిశుర్గృహమ్. ప్రాణాపహారీ భగవాన్ ప్రసన్నః ప్రోవాచ వాక్యం మృగశృంగమేనమ్, వృణీష్వ భూయోఽపివరం దదామి స్తోత్రేణసంతుష్టమవైహిమాం త్వమ్. మృగశృంగః -మయాకృతం స్తోత్రమిదం త్వదీయం యః కోఽపి భక్త్యాశృణుయాత్పఠేద్వా, తస్యాపమృత్యుర్భవితానపీడా యామీనభూయత్సభవేచ్చిరాయుః. యమః -తథాస్తు విప్రోత్తమకుత్సపుత్ర శృణుష్వ భూయోఽపి రహస్యమేకమ్, అవాచ్యమేతద్భువి నాస్తికానాం వాచ్యం ప్రయత్నాదిదమాస్తికానామ్. చతుర్దశీమంగళవారయోగే యఃకృష్ణపక్షే తిలతర్పణం చ, కృత్వా తదానీం స్తవమేతదుక్త్వా లభేత కామాం త్సకలాన్ సమర్త్యః. ఇమం వరం విప్రవరాయ దత్వా సార్థం గణైరంతరధాత్స దేవః, విప్రోఽపి లబ్ధ్వా వరమర్కపుత్రాత్ స్వమాశ్రమం హృష్టమనాః ప్రపేదే. యమస్తుతిమిమాం పఠేదనుదినంహియోమానవో నతస్యయమయాతనా భవతిచ ప్రసన్నో

---

గూడ తమయింటికి పోయి చేరిరి. ప్రాణములను అపహరించువాడైన యమధర్మరాజు మరల మృగశృంగునిజూచి నేను నీస్తోత్రమునకు చాలతనిసితిని. కాబట్టి యింకొకవరమును సైతము ఇచ్చెదను అడుగుము అనెను.

మృగశృంగునిమాటలు.—నీవిషయమునందు నాచేత చేయబడిన యీస్తోత్రమును శ్రద్ధతో విన్నవారికిని చదివినవారికిని అపమృత్యువు కలుగకయుం ఏవిధమైనదుఃఖములును కలుగకయుం దీర్ఘాయుష్మంతులుగానుండ వరము దయచేయుము.

యమునిమాటలు,—అని మృగశృంగుడు అడుగగా యముడు ఓయి బ్రాహ్మణశ్రేష్ఠుడా! అట్లే అగుగాక. అయినను ఒకరహస్యముగలదు. అది, దేవుడులేడు అని వాదించువారికి చెప్పరాదు. దేవుడున్నాడని అతనిలీలలు విచారించువారికి తప్పక చెప్పదగినది. అట్టిరహస్యము నీకుచెప్పెదను వినుము. ఎవడు మంగళవారముతోగూడిన కృష్ణపక్ష చతుర్దశినాడు తిలతర్పణముచేసి యీస్తోత్రమును పఠించునో వాడు ఎల్లకోరికలను తీర్చుకొనును. అనిచెప్పి యముడు తనపరివారముతో గూడ అంతర్ధానమయ్యెను. బ్రాహ్మణుడును ఆ యమునివలన ఇష్టవరములనుపడసి సంతోషించిన మనసుగలవాడై తన యాశ్రమమునకు పోయెను. కనుక లోకమునందు ఏమనుష్యుడు ప్రతిదినము నీయమస్తోత్రమును చదువునో వానికి యమునివలనిబాధలుకలుగవు. అపమృత్యువుపొందదు.

యముః, కదాచిదపమృత్యునా ప్యభిభవో నతత్సంతతీ మిహైవచ పరత్రచ శ్రియముపైతి న వ్యాధయః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే మృగశృంగస్య
యమవరప్రదానంనామ సప్తమోఽధ్యాయః.

---

అష్టమోఽధ్యాయః.

వసిష్ఠః.—సమాగాతాస్తు తాఃకన్యాః యమలోకా దనిందితాః, స్వమాతృభ్యస్స్వబంధుభ్య స్తత్రవృత్తాంతమబ్రువన్. దిలీపః. పాపినాం యాతనాశ్చాపి సుకృతీనాం గతిం తథా, విస్తరాచ్ఛ్రోతుమిచ్ఛామి పుణ్యపాపశుభాశుభాన్. వసిష్ఠః. స్వస్వమాతృభ్య స్స్వబంధుభ్యః కన్యకాభి రుదీరితమ్, తథైవ తే ప్రవక్ష్యామి పుణ్యపాప గుణాగుణాన్. కన్యాః. గంతవ్యో యమలోకో హి ప్రాణిభిశ్చ చతుర్విధైః, సంత్రా

---

అట్టివానికి యముడు ప్రసన్నుడవును. ఈలోకమునందు సంతతియు పరలోకమునందు సుఖసంపదయు లభించును. రోగాదులు రానేరవు.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మృగశృంగునికి
యముడు వరమిచ్చుటను దెలుపునట్టిదయిన ఏడవ యధ్యాయకథ.

---

ఎనిమిదవ యధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—నిందింపరానివారైన ఆకన్యకలు యమలోకమునుండి వచ్చినవారై అచ్చటి వృత్తాంతమును తమతల్లులకును చుట్టములకును చెప్పిరి.

దిలీపునిమాటలు.—పాపులైనవారు పడునట్టి నరకబాధలను పుణ్యులైనవారు పొందునట్టిసుఖములను వారివారిపుణ్యపాపములను వానివలని శుభాశుభఫలములను సవిస్తరముగా వినగోరెదను.

వసిష్ఠమహామునిమాటలు.—తమతల్లులకును తమచుట్టములకును ఆకన్యకలచేత ఎట్లు చెప్పఁబడెనో అట్లు పుణ్యపాపములను వానివలని గుణాగుణములను చెప్పెదను.

కన్యకల మాటలు.—ప్రాణులకెల్లను పొందదగినదైన యమలోకము భయమును పుట్టించునదియు ఘోరమైనదియు ఎల్లవిధములచేతను పరవశులైన వారగు నాలుగు తెరగుల ప్రాణులచేతను కడుపులలో నుండునట్టియు పుట్టుచున్నట్టియు పుట్టి

సజనకో ఘోరో వివశై స్సర్వ్వైదేవహి. గర్భస్థైర్జాయమానైశ్చ బాలై స్తరుణ మధ్యమైః, స్త్రీపుంనపుంసకై రన్యై ర్యాతవ్యం సర్వ్వజంతుభిః. శుభాశుభఫలం తత్ర దేహినాం ప్రవిచార్యతే, చిత్రగుప్తాదిభిస్సద్భి ర్మధ్యస్థై స్సమదర్శిభిః న తేత్ర ప్రాణినస్సంతి యే నయాంతి యమాలయమ్, అవశ్యం హి కృతంకర్మ భోక్తవ్యమవిశంకయా. తత్ర యే శుభకర్మాణ స్సౌమ్యచిత్తా దయాన్వితాః, తే నరా యాంతి సౌమ్యేన మార్గేణ యమమందిరమ్ మాఘమాసేతుసంప్రాప్తే యైస్స్నాతమరుణోదయే, కుర్వ్వంతి హరిగోవింద మాధవేతి నరోత్తమాః. తేయాంతి శుభమార్గేణ యమలోకం సుఖావహమ్, కించిదభ్యుదితే సూర్యే స్నాత్వా యే బదరీఫలమ్. మాఘమాసే ప్రయచ్ఛంతి తే యాంతి ముదితానరాః, మాఘే ప్రశస్తంకదలీఫలదానంహి తత్ప్రదాః. ఖాదంత స్తత్ఫలం హృష్టాః ప్రయాంతి యమమందిరమ్. తిలం దదాతి యో మాఘే స్నానం కృత్వారుణోదయే. సుఖేన సుప్రసన్నాత్మాసోఽపి యాతి యమాలయమ్.

---

పసిబిడ్డలుగా నుండునట్టియుం నడివయసు కలిగినట్టియుం స్త్రీరూపములు నపుంసకరూపములు ఆ స్త్రీ నపుంసకరూపములకంటె ఇతరమైన పురుషరూపములు నైన యెల్లప్రాణులచేతను పొందదగినదియుం నగును. అట్టి ఆయమలోకమునందు యోగ్యులును మధ్యస్థులును తమవారు ఇతరులు అను భేదములేక యెల్లవారిని ఒకటిగా జూచుకొనువారునైన చిత్రగుప్తుడు మొదలగువారు దేహధారులయొక్క శుభాశుభఫలములను విచారించు చుందురు. యమలోకమును పొందని ప్రాణులు భూలోకమునందు లేనేలేరు. చేసినకర్మము ననుభవింపవలెననుటకు సందేహములేదు. కనుక ఎవరు మంచిమనసును కనికరమును పుణ్యకర్మములను చేయుటయుం కలవారో వారు మంచిత్రోవగుండ ఆయమలోకమును పొందుదురు. ఏసజ్జనులు మాఘమాసమురాగానే అరుణోదయమున లేచి హరి గోవింద మాధవ అని హరినామస్మరణ చేయుచు స్నానముచేయుదురో వారు సుఖమైన మార్గమున యమలోకమునకు పోదురు. ఎవరు మాఘమాసమునందు ప్రొద్దుపొడిచి పొడవకముందే స్నానముచేసి రేగుపండ్లను దానము చేయుదురో వారుసంతోషించుచు యమలోకమునకుపోదురు. మాఘమాసమునందు అరటిపండ్లదానము మేలైనదని ఆదానము నెవరుచేయుదురో వారు ఆపండ్లను భక్షించుచు సంతోషముతో యమలోకము పొందుదురు. ఎవడు మాఘమాసమునందు అరుణోదయమునస్నానముచేసి నువ్వులు దానముచేయునో వాడును మిక్కిలి నిర్మలమైన మనసుగల

మాఘమాస్యుషసి స్నాత్వా దద్యాదామలకంతు యః. ప్రయాతి సోఽర్క తేజస్వీ వైవస్వతనికేతనమ్, పాదుకాః పాదరక్షాంశ్చ యో దదాతి ద్విజన్మనామ్. సవరాశ్వేన మహతా సుఖం యాతి యమక్షయమ్, ఛత్రదానేనగచ్ఛంతి పథాసాంద్రేణదేహినః. దివ్యాంబరధరాస్తత్ర యాంతి వస్త్రప్రదాయినః, శిబికావాహదానేన సుదృఢేనసుఖంవ్రజేత్. శయ్యాసనప్రదానేన సుఖం యాంతి సవిశ్రమాః, ఆరామకర్తాఛాయాసు శీతలాసుసుఖంవ్రజేత్. యాంతి పుష్పకయానేన పుష్పదామప్రదాయినః, దేవాయతనకర్తారో యతీనామాశ్రమస్యచ. అనాథమండపానాంచ క్రీడంతో మందిరోత్తమే, పథి విశ్రమ్య విశ్రమ్య ప్రయాంతి యమమందిరమ్, దేవాగ్నిగురువిప్రాణాం మాతాపిత్రోశ్చ పూజకాః, పూజ్యమానా నరా యాంతి కామితేన పథా సుఖమ్. ద్యోతయంతో దిశస్సర్వాయాంతిదీపప్రదాయినః, ప్రతిశ్రయ ప్రదానేన సుఖంయాంతి యమాలయమ్. సర్వ

వాడై యమలోకమును పొందును. ఎవడు మాఘమాసమునందు వేకువను స్నానముచేసి యుసిరికపండ్లు దానముచేయునో వాఁడు సూర్యుని తేజస్సువంటి తేజస్సుతో వెలుగుచు సూర్యునికొడుకైన యమునియింటిని పొందును. ఎవడు పావకోళ్లుగాని చెప్పులుగాని బ్రాహ్మణులకు ఇచ్చునో వాఁడు ఉత్తమజాతియందు పుట్టిన గొప్ప గుఱ్ఱమునెక్కి సుఖముగా యమునియింటికి పోవును. మాఘమాసమునందు గొడుగు దానమిచ్చునట్టివాఁడు పొడలేని నీడగలదారిని యమలోకమును పొందును. వస్త్రదానముచేసినవారు మంచి వస్త్రములనుధరించి ఆ యమపట్టణమునుపొందుదురు. పల్లకీని గుఱ్ఱమును దానముచేయుట చేత దారి నడచుటవలని శ్రమ కొంచెమైననులేక మిక్కిలి సుఖముగా యమునిలోకమును పొందుదురు. పానుపుపీట పీనినిచ్చుటచేత శ్రమలేక క్రమముగాపోయి యమపట్టణమును పొందుదురు. తోపులు వేయించినవాడు చల్లని చెట్లనీడగల మార్గమున యమలోకమును పొందును. పూలదండలు దానముచేయువారు పుష్పకవిమానము నెక్కిపోవుటచేత యమలోకమును పొందుదురు. దేవళములు కట్టించువారును సన్యాసులకు మఠములు గట్టించి యిచ్చువారును చక్కజేయించువారు లేక పాడుబడిపోయిన మండపములను బాగుచేయించువారును మంచి యిండ్లలో ఆటలాడుచు అందందు నిలిచి నిలిచి దారిబడలిక తీర్చుకొనుచు యమునియింటిని పొందుదురు. దేవపూజ అగ్నిపూజ గురుపూజ బ్రాహ్మణపూజ తల్లిదండ్రుల పూజ చేయువారు తమ యిష్టము వచ్చిన మార్గమున పూజింపబడుచు యమునియింటిని పొందుదురు. మాఘమాసమునందు దీపారాధనము చేయువారు దివిటీలచేత ఎల్ల దిక్కులను వెలుగ జేయుచు యమపట్టణమును పొందుదురు. గృహదానము చేయుటచేత సుఖముగా యమలోకము నొందుదురు. గోధా

కామసమృద్ధేన పథా గచ్ఛతి గోప్రదః, యే త్వన్నపానపానీయదాతారో యాంతి సత్పథా. ఆర్తౌషధప్రదాతార స్సుఖం యాంతి నిరామయాః, విశ్రమ్యమాణా గచ్ఛంతి గురుశుశ్రూషణే రతాః. పాదశౌచప్రదానేన శీతలేన పథా వ్రజేత్, సదాభ్యంగం తు యో దద్యాత్ మాఘమాసే ద్విజన్మనామ్. మనోజ్ఞతురగారూఢ స్సుఖం యాతి యమాలయమ్, హేమరత్నప్రదానేన విమానేనైవ గచ్ఛతి. రూపాఢ్యానడ్వాహదానేన రథయానేన గచ్ఛతి, సర్వకామసమృద్ధాత్మా భూమిదానేన గచ్ఛతి. అన్నదానప్రదానేన పిబన్ ఖాదన్ స గచ్ఛతి, తాంబూలం యే ప్రయచ్ఛంతి మాఘమాసే విశేషతః. శోభితేన పథా యాంతి సుగంధివదనాశ్చ తే, ప్రాతర్మాఘే నరస్స్నాత్వా ఘృతదానం కరోతి యః, జ్యోతిర్మయేన యానేన వైవస్వతపురం వ్రజేత్, కూష్మాండం యో ద్విజేంద్రాయ మాఘే స్నాత్వా సమర్పయేత్. హేమశుభ్రవిమానేన సుఖం యాతి యమాలయమ్, తండులాఢకదానేన యమలోకం సుఖం వ్రజేత్. ఓషధ్యః ఫలపాకాంతా

---

నము చేసినవాఁడు తానుకోరినవన్నియుంగల మంచిమార్గమున యమలోకమునకు పోవును. ఎవరు అన్నదానము మంచినీళ్లదానమును చేయుదురో వారు మంచిమార్గమున యమలోకము పొందుదురు. వ్యాధులచేత పీడింపబడువారికి మందిచ్చినవారు వ్యాధిలేనివారై సుఖముగా యమలోకమును పొందుదురు. గురుశుశ్రూషయందు అక్కఱగలవారు అచ్చటచ్చట మార్గాయాసమును తీర్చుకొనుచు యమలోకమునకు బోవుదురు. కాళ్లు కడుగుకొన నీళ్లిచ్చుటచేత చల్లనిమార్గమున యమలోకమును పొందుదురు. మాఘమాసమునందు ఎవ్వఁడు బ్రాహ్మణులకు తలంటుస్నానము చేయించునో వాఁడు అందమైన గుఱ్ఱము నెక్కి సుఖముగా యమునియింటికి పోవును. బంగారు రత్నములు ఇచ్చుటచేత విమానముమీదనే యమలోకమునకు పోవును. రూపాయలను గోవును ఇచ్చుటచేత రథముపై నెక్కి యమలోకమునకు పోవును. భూమినిచ్చుటచేత మనస్సునందు ఏకొఱతయును లేక యమలోకమును పొందును. అన్నము పెట్టుటచేత భోజనము చేయుచు మంచినీళ్లుత్రాగుచు యమునియింటిని పొందును. మాఘమాసమునందు విశేషముగా తాంబూలదానము చేయువారు మంచిపరిమళముతోఁడి ముఖముతో ఒప్పిదమైన మంచిమార్గమున యమునిగృహమును పొందుదురు. మాఘమాసమునందు తెల్లవారి స్నానముచేసి నేయి దానముచేయువాఁడు ఎవఁడో వాఁడు జ్యోతిస్స్వరూపమైనవాహనము నెక్కి యమలోకమును పొందును. ఎవఁడు మాఘమాసమునందు స్నానముచేసి బ్రాహ్మణునకు గుమ్మడికాయ దానము చేయునో వాఁడు నిర్మలమైన బంగారువిమానము నెక్కి సుఖముగా యమలోక

మాఘమాసే ఫలంతి యాః, తాసాం దానేన సర్వాసాం సర్వభోగసమ న్వితః. ఖాదన్నశ్నన్యథాకామ మంతకాలయ మాప్నుయాత్, విశే షేణ విరాజంతే మాఘస్నానరతా జనాః. ఇత్యాదిదానని రతైః మాఘ స్నానపరైస్తథా, నానాదానరతైశ్చాపి నానావ్రతపరాయణైః. వై వస్వతస్య నగరీ పరిపూర్ణా సమంతతః, విశేషా ధర్మరాజేన పూజ్యంతే తత్రభోగినః. విశేషేణ విరాజంతే మాఘస్నానరతా నరాః, విమానా న్యథచిత్రాణి శతశోఽథసహస్రశః. ఏవంసుకృతిభిఃపూర్ణా రాజధానీయమ స్యసా, ఏతాన్ సుకృతినో దృష్ట్వా విమానస్థానినాత్మజః. ప్రత్యుద్యయా గతైస్సార్థం సముత్థాయ నిజాసనాత్, కృతాంజలిపుట స్తేషాం సపర్యా మకరోద్యమః. స్వాగతాసనదానేన పాద్యార్ఘ్యేణ ప్రియేనచ, ధన్యా యూయం మహాత్మాన స్స్వాత్మనో హితకారిణః. యేన దివ్యసుఖార్థాయ భవద్భి స్సుకృతం కృతమ్, ఇదం విమాన మారుహ్య దివ్యస్త్రీభోగభూ షితమ్. స్వర్గం గచ్ఛధ్వ మమలం సర్వకామసమన్వితమ్, ఇతి తేనాభ్య

---

మును పొందును. బియ్యము కందులు దానముచేయుటచేత సుఖముగా యమలోకమును పొందును. పండగానేనళించునట్టి యేమూలికలు మాఘమాసమునందు ఫలించునో వానిని దానముచేయుటచేత ఎల్లకలుములతో కావలసినవస్తువులను భక్షించుచు సుఖముగా పోయి యమలోకమును పొందును. మాఘస్నానముచేయు నిష్ఠగలజనులు యమలోక మందు మిక్కిలి వెలుగుదురు. ఇటువంటి దానములుచేయుటయందు మిక్కిలి ఆసక్తిగల వారిచేతను మాఘస్నానము చేయుటయందాదరముగల వారిచేతను, మరియు ననేకవిధ ములైన నోములు నోచినవారిచేతను, ఆయమపట్టణము చక్కఁగా నిండుకొని యుండును. అందలి పుణ్యాత్ములు యమునిచేత విశేషించి పూజింపఁబడుదురు. అందు మాఘస్నానముచేసినవారే మిక్కిలి ప్రకాశింతురు. అచ్చట నూరులయు వేలయు సంఖ్యలుగల విచిత్రములైన విమానములు అనేకములుగలవు. ఈవిధముగా ఆయమపట్ట ణము పుణ్యాత్ములచేత నిండియుండును. యమధర్మరాజు విమానములందు కూర్చుండి వచ్చుచున్న పుణ్యాత్ములను జూచి సింహాసనమునందుండి లేచి తనభటులతోగూడ ఎదు ర్కొనును. మరియును అతడు చేతులుజోడించుకొని ఆపుణ్యాత్ములను కుశలప్రశ్న చేసి అర్ఘ్యమును పాద్యమును ఆసనమును ఇచ్చి ప్రేమతో మర్యాదచేయును. ఇదిగాక ఓమహాత్ములారా మీరు మంచిమనస్సుతో పరోపకారము చేసినధన్యులరు. మీరు స్వర్గ మునందలి సుఖముకొరకు పుణ్యములను జేసినవారు కాబట్టి యిప్పుడు ఈవిమానముల నెక్కి దేవతాస్త్రీలతోడను సమస్త భోగములతోడను గూడుకొనినదియు నిర్మలమైనది

సుజ్ఞాతా స్స్వర్గలోకం ప్రయాంతి తే, యేతు ప్రయాగే మజ్జంతి మాఘ మేకం నరోత్తమాః. తే బ్రహ్మలోకం గచ్ఛంతి ఋజుమార్గేణ శోభనమ్, కించిదభ్యుదితే సూర్యే మాఘమాసే నిమజ్జ్యచ. విష్ణుధర్మరతాశ్శిష్టాః పురుషసూక్తం పఠంతియే, తే విష్ణులోకం గచ్ఛంతి ఋజుమార్గేణ శోభనమ్. అన్యేసుకృతినస్సర్వే విమానేన యమాంతికమ్, గత్వా తేనాభ్యనుజ్ఞాతా గచ్ఛంతి త్రిదివంతతః. అన్యే సుకృతిన స్సంతి విమానస్థా స్సహస్రశః, సంయమిన్యాః ప్రదేశేషు తాన్ నవిద్మోఽత్రవర్ణితుమ్. ఉద్యానమధ్యే కదళీవనమధ్యే స్థితా వయమ్, ఏతాన్ సుకృతినోదృష్ట్వా వయం ధన్యా హి మాతరః. నేత్రసాఫల్యమస్మాకం జన్మసాఫల్యమప్యభూత్, ఏతాన్ సుకృతినో దృష్ట్వా వయం ధన్యామహే జనాః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే కన్యకాకథిత
యమపురవృత్తాంతంనామ అష్టమోఽధ్యాయః.

---

యం ఎల్లకోరికలను లభింపజేయుఃదియం పైన స్వర్గమునకుపొందు అని చెప్పను. అట్లు యమునిచేత సెలవుపుచ్చుకొని స్వర్గలోకమును పొందుదురు. ఎవరు ప్రయాగయందు ఒకమాఘమాసము స్నానముచేయుందురో వారు కాల్లకు మెత్తగానుండు మార్గమునబోయి బ్రహ్మలోకమును పొందుదురు. ఏమహాపురుషులు మాఘమాసమందు ప్రొద్దుపొడుచుచుండఁగా స్నానముచేసి వైష్ణవధర్మమునం దాసక్తులై పురుషసూక్తపారాయణము చేయుందురో వారు మెత్తనిమార్గమున శుభకరమైన విష్ణులోకమును పొందుదురు. తక్కిన పుణ్యవంతులెల్లను విమానములెక్కి యమలోకమునకు పోయి యమునియుత్తరవువలన నందుండి స్వర్గమునకు పోదురు. ఆయమలోకమునందు అక్కడక్కడ అనేకులు పుణ్యాత్ములు కలరు. వారిని అందరినిఇట్టిట్టివారు అనివిమర్శించిచెప్పుటకుమాకు శక్తిచాలదు.

ఓతల్లులారా! మేము ఆయమలోకమునందలి పెంపుడువనములోనుండెడుఅరటితోటయందుండి అటువంటి పుణ్యాత్ములను జూచి కృతార్థులమైతిమి. మాఘస్నానము వలని ఫలముచే మాకన్నులును జన్మములును సఫలమయ్యెను. ఇప్పుడు చెప్పిన పుణ్యాత్ములనెల్లనుజూచి కృతార్థులము కాజాలితిమి. అని యిట్లు కన్యకలు తమతల్లులతో చెప్పిరి.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు కన్యకలు యమలోకవృత్తాంతమును దెలుపునదియయిన ఎనిమిదవయధ్యాయకథ.

## నవమోఽధ్యాయః.

కన్యాః.—తత్ర యే పాపకర్మాణ స్తేషాం దుఃఖం బ్రువామహే, మాతరో బాంధవా స్సర్వే శృణుధ్వం ధైర్యమాస్థితాః. తత్ర యే క్రూర కర్మాణః పాపా దానవివర్జితాః, తే ఘోరేణ పథా యాంతి దక్షిణేన యమాలయమ్. షడశీతిసహస్రాణి యోజనానా మతీత్య తత్, వైవస్వత పురం జ్ఞేయం నానారూపమివస్థితమ్. సమీపస్థమివాభాతి నరాణాంపుణ్య కర్మణామ్, పాపినామతిదూరస్థం పథా రౌద్రేణ గచ్ఛతామ్. తీవ్రకంటక యుక్తేన శర్కరానిచితేనచ, క్షురధారానిభై స్తీవ్రైః పాషాణై ర్నిహితే నచ. క్వచిత్పంకేన మహతా మండూకై శ్చైవ ఘూత్కృతైః, లోహసూచీ నిభైర్దర్భై స్సంఛన్నేనపథా క్వచిత్. తటప్రపాతవిషమైః పర్వతై ర్వృక్ష సంకులైః, ప్రతప్తాంగారయుక్తేనయాంతిమార్గేణదుఃఖితాః. క్వచిద్విషము గర్తైశ్చ క్వచిల్లోష్టైశ్చ పింగలైః,సుతప్తవాలుకాభిశ్చపథి తీక్ష్ణైశ్చ శంకు

---

## తొమ్మిదవ యధ్యాయము.

కన్యకలమాటలు.—ఓ అమ్మలారా ! ఓ చుట్టములారా ! మీరు ఎచ్చరికతో వినుఁడు. ఆయమలోకమునందు ఎవరు పాపులో వారుపడునట్టి బాధలను చెప్పెదము. ఈలోకమునందు చెడ్డపనులను చేయువారును దానములుచేయనివారునునైన పాపాత్ములు ఎవరో వారు దక్షిణముఖముగా పోవునదియు భయమును గలుగజేయునదియునైన త్రోవను ఆలోకమునకు పోదురు. అందుగల యమునిపట్టణము ఎనుబదియారువేల యోజనముల విరివికలది. అది నానావిధరూపములుగలదానివలెనేయుండును, అట్టియాపట్టణము పుణ్యాత్ములగువారికి దగ్గరనున్నట్లుండును. గడుసైనమార్గమున పోవునట్టి పాపాత్ములకు ఎంతోదూరమున నున్నట్లుండును. అచ్చటి దారులలో కొన్ని చురుకైన ముండ్లచేతను, కొన్ని కరకయిన గులకరాళ్లచేతను, కొన్ని మంగలకత్తులవంటి కత్తెరరాళ్లచేతను, కొన్ని మిక్కుటమైన అడుసుచేతను, కొన్ని క్రూరములైన కప్పలచేతను, కొన్ని సూదులను బోలిన దర్భగడ్డిచేతను కప్పబడియుండును. ఏటవలుగానుండు చరులచేత ఒడ్డోరకములై బహువిధములయిన వృక్షములచేత ఇరుకటములైయుండు కనుమల మార్గముననే పాపాత్ములగువారు ఆలోకమునకు పోవుదురు. అట్లువారుపోవునపుడు మిక్కిలిదుఃఖపడుదురు. ఇదిగాక ఆయమపట్టణము లోతైన పాడుగుంటలచేతను, కాలికాలి పచ్చపారినమట్టి పెళ్లలచేతను, మిక్కిలికాలుచున్న ఇసుకచేతను, సూదిమొనవంటి మొనలు

భిః, అనేకశాఖానుచితై ర్వ్యాప్తం వనశతైరపి. కృష్ణేన మహతా మార్గ మనాలంబేన కుత్రచిత్, అయశ్శృంగాటకై స్తప్తైః క్వచిద్దావాగ్నినా పురః. క్వచిత్తప్తశిలాభిశ్చ క్వచిద్వ్యాప్తం హిమేనచ, క్వచిద్వాలుక యా వ్యాప్త మాకంఠాంతః ప్రవేశయా. క్వచిత్తీవ్రాంబునా వ్యాప్తం క్వచిత్కారీషవహ్నినా, సింహైర్మృగైశ్చ శార్దూలై ర్దంశగ్రీవైశ్చదా రుణైః. క్వచిన్మహాజలూకాభిః క్వచిచ్చాజగరైః పునః, మక్షికాభిశ్చరౌ ద్రాభిః క్వచిత్సర్పైర్విషోల్బణైః. మత్తమాతంగయూథైశ్చ బలోన్మత్తైః ప్రమాదిభిః, పంథాన ముల్లిఖద్భిశ్చ తీక్ష్ణశృంగై ర్మహావృషైః. మహా శృంగైశ్చ మహిషై రుష్ట్రైర్మత్తైశ్చ రాసభైః, డాకినీభిశ్చరౌద్రాభి ర్వి కరాళైశ్చ రాక్షసైః. వ్యాధిభిశ్చ మహాఘోరైః పీడ్యమానా వ్రజంతిచ, మహాధూళీవిమిశ్రేణ మహాచండేన వాయునా. మహాపాషాణవర్షేణ పీడ్య మానా వ్రజంతిచ, మహతా పాంసువర్షేణ పూర్యమాణా రుదంతిచ. మహా మేఘరవైర్ఘోరై ర్విత్రాస్యంతో ముహుర్ముహుః, నిశితాయుధవర్షేణ

---

గల మేకులచేతను నిండుకొన్న మార్గములుగలదై యుండును. ఆమార్గములగుండపోవునట్టి పాపులు ఎడములేక పెనగొన్న కొమ్మలచే చీకట్లుపుట్టించుచున్న అడవులతోగూడు కొన్నవియు మిక్కిలి కాలుచున్నవియునైన నాలుగు మార్గములుకలియుచోటులయందు ఎదుట కార్చిచ్చు మండుచుండగా కాలుచున్న రాళ్లచేతను, అంతటను కమ్ముకొన్న మంచుచేతను, మెడలదాక దిగబడునట్టియిసుకచేతను, కాగితెర్లుచున్న నీళ్లచేతను, మిక్కిలి తపింపజేయుచున్న పిడక నిప్పులచేతను, మెడలుకరచి గాయముచేయుటచేత భయంకరములైన సింహములు పెద్దపులులు మొదలగు మృగములచేతను, పెద్దపెద్ద జలగలచేతను, కొండ చిలువలచేతను, క్రూరములైన యీగలచేతను, విషము గ్రక్కుచున్న నాగుబాముల చేతను, మదించిన యేనుగు గుంపులచేతను, బలముచేత క్రొవ్వి దేహములు తెలియక త్రోవను కోరాడునట్టి వాడిమొనల కొమ్ములుగల యెద్దుల చేతను, నిడుపాటికొమ్ములతో మైమరచి తిరిగెడు దున్నపోతులచేతను, ఒంటెల చేతను, క్రొవ్వినగాడిదలచేతను, క్రూరములైన శాకిని ఢాకిని మొదలుగాగల దయ్యములచేతను, రెండేసితలలుగలరాక్షసులచేతను, మిక్కిలి భయంకరములైన నానావిధవ్యాధులచేతను, బాధింపబడుచు యమపట్టణమునుగూర్చి పోదురు. మరియు దుమ్ములు చెరుగుచు చాలవడిగావీచునట్టి గాలిచేతను, మట్టుమీరినరాళ్లవానచేతను పీడింపబడుచు కొలదికిమీరిన మట్టివానలో మునిగిదుఃఖించుచు, మాటిమాటికి ఉరుమునట్టి ఉరుములగొప్ప చప్పుళ్లకు ఉలికిపడుచు, పదును మీరిన కత్తులవానకురిసి దేహముయొక్క అవయవము

భిద్యమానాశ్చ సర్వతః, మహాఘోరాంబుధారాభిః సేవ్యమానా రుదంతిచ. మహతా శీతమరుతా ఉష్ణేన పరుషేణచ, సమంతా త్పీడ్యమానాశ్చ శుష్యంతిచ రుదంతిచ. ఇత్థం రౌద్రేణ మార్గేణ పాథేయ రహితేనచ, నిరాలంబేన మార్గేణ నిర్జనేన సమంతతః. అవిశ్రయేణ మహతా నిర్గతాప్యాశ్రయేణచ, తమోరూపేణ కష్టేన సర్వదుఃఖాశ్రయేణచ. నీయంతే దేహిన స్సర్వే విమూఢాః పాపకారిణః, యమదూతైర్మహాఘోరై స్తదాజ్ఞాకారిభి ర్బలాత్. ఏకాకినః పరాధీనాః మిత్రబంధువివర్జితాః, శోచంతస్స్వాని కర్మాణి రుదంతశ్చ ముహుర్ముహుః. ప్రేతభూతా వివస్త్రాశ్చ శుష్కకంఠోష్ఠతాలుకాః, కృశాంగా భయభీతాశ్చ దహ్యమానాః క్షుధాగ్నినా.బద్ధాశ్శృంఖలయా కేచి దుత్తానాః పాదయోర్నరాః, ఆకృష్యంతేఘుష్యమాణా యమదూతై ర్బలోత్కటైః. ఉరస్యధోముఖాశ్చాన్యే కృష్యమాణాస్సుదుఃఖితాః, కేశ్యాపాశేనబద్ధ్వైవ సమాకృష్యంతిదుర్జనాః. లలాటే చాంకుశేచాన్యే ప్రోతాఃక్లిశ్యంతి దేహినః,ఉత్తానకంటకపథాక్వచిద్దు ర్వారవర్త్మనా. పశ్చాద్బాహుని

లన్ని తెగి చిల్లులతిత్తులు కాగా ఉప్పునీళ్ల వానలోతడిసి అందువల్ల కలుగుమంటలకు ఓర్వలేక యేడ్చుచు ఈదరగాలివలనిచలికివణకుచు, నిప్పుగాలివలని వేంద్రము చేతతాపముపుట్టి నాలుకలెండగా అంగలార్చుచు పోవువారై దారిబత్తెము లేకయుం, జనసంచారములేక పోవుటచేత దిక్కుగానకయుం, చీకటియే స్వరూపముగా గలిగి యెల్లదుఃఖములకును పుట్టిన యిల్లయిన కఠినమార్గమునందు యమునియంత్తగువుచొప్పున మిక్కిలి క్రూరులైన యమదూతలుతీసికొనిపోగా మూఢులగుపాపాత్ములు యమపట్టణమును చేరుచుందురు. ఇంతేకాక యమునిదూతలు చచ్చిపోయిన పాపాత్ములను కొందఱను ఒంటరిగాను పరాధీనముగాను చెలికాండ్రను చుట్టములనువిడిచితాము బ్రతికియున్నప్పుడు చేసిన పాపపునులనుతలచితలచి అయ్యోఅనియేడ్చుచుండగా చచ్చిదిగంబరులై నోటతడిలేకగొంతెండి పెదవులెండి దవుడలుఅంటుకొనిపోగా బక్కటిల్లిన దేహములును, అత్యంతమైన భయమునుగలిగి చెప్పరానిఆకటిచేత తపించుచుండగా యమలోకమునుపొందింపుదురు. మరి కొందరను కాళ్లకుసంకెళ్లువేసి యీడ్చుకొనిపోదురు. ఇంక కొందరను కుయ్యోమొఱ్ఱో అనుచుండగా కడుపులలో తలలుతురిగియుం, వెంట్రుకలను యమపాశములచేత పెనచి కట్టియుం ఈడ్చుకొనిపోదురు. కొందరను నొసటఅంకుశమును గ్రుచ్చి నాటినముండ్లుగల మార్గమునను చొరరానిసంకటపుమార్గమునను ఈడ్చుకొనిపోదురు. కొందరను పెడరెక్క

బద్ధాశ్చజఠరేణ ప్రపీడితాః, ఆబద్ధశ్శృంఖలాభిశ్చహస్తయోశ్చసుకీలితాః.
గ్రీవాపాశేనకృష్యంతః ప్రయాంత్యన్యే సుదుఃఖితాః, జిహ్వాయాంరజ్జు
మాబధ్య కృష్యంతే దుర్జనా నరాః. కట్యామప్యర్ధచంద్రేణ తక్ష్యమాణా
ఇతస్తతః, శిశ్నేనవృషణం బద్ధ్వా నీయంతేఽన్యేహిరజ్జునా నాసాం నిబ
ధ్య రజ్జ్వాచ సమాకృష్యంతిచాపరే, భిన్నాః కపోలయోరజ్జ్వా కృష్యం
తేఽన్యే తథోష్ఠయోః. విభిన్నాశ్చోదరోఽన్యేతు తప్తశృంఖలయో
నరాః, కృష్యంతే కర్ణయోశ్చాన్యే విభిన్నాశ్చుబుకేపరే. భిన్నపాదా
గ్రహస్తాన్యే భిన్నకంఠోష్ఠతాలుకాః, సభిన్నవృషణాశ్చాన్యే భిన్నస
ర్వాంగసంధయః. ప్రభిద్యమానా కుంతైశ్చ భిద్యమానాశ్చ సాయకైః,
ఇతస్తతః ప్రధావంతి క్రందమానా నిరాశ్రయాః ముద్గరైర్లోహదండై
శ్చ హన్యమానా ముహుర్ముహుః, క్రకచైర్వివిధైర్ఘోరైర్జ్వలితాగ్ని
సమప్రభైః. భిండివాలైశ్చ భిద్యన్తే స్రవంతః పూయశోణితమ్, సక్షు
తాః క్రిమిదష్టాశ్చ నీయంతేవివశానరాః. యాచమానాశ్చసలిల మన్నం
చాపి బుభుక్షితాః, ఛాయాంప్రార్థయమానాశ్చ శీతార్తాశ్చానలంతథా.

---

లు విరిచికట్టియు, చేతులకు సంకెళ్లువేసియు, మిక్కుటమైన ఆకటిచేత బాధపడుచుం డగాకొనిపోదురు. కొందరినుగొంతులకు ఉరిబోసియు, నాలుకలకుదారములు పోసియు, వారుమిక్కిలి దుఃఖపడుచుండగా కొనిపోదురు. మరికొందరు పాపాత్ములను పిరు దులకు ఇరుప్రక్కలను అర్ధచంద్రాకారములైన ఆయుధములచేత ఒత్తిపట్టి పురుషావయ వముచేత బీజములనుబిగగట్టియు, కొందరుపాపాత్ములను ముకుద్రాళ్లుకట్టియు, కొంత మందిని చెక్కిళ్లయందును పెదవులందును దారములను గ్రుచ్చియు, కొంతమందిని కడు పులలో మండుచున్న యినుప సలాకలు గ్రుచ్చియు, కొంతమందిని చెవులుగడ్డములు పగులదీసికట్టి నెత్తురుకార్చుచును, కొందరను కాళ్లుచేతులను బద్దలువారకొట్టియు, కొందరను మెడలు దవుడను పెదవులు పగిల్చియు, కొందరను పట్టలు నలియగొట్టియు, యమభటులు ఈడ్చుకొనిపోదురు. మరికొందఱు పాపాత్ములు ఈటెలచేత పొడువ బడినవారును, బాణములచేత గ్రుచ్చబడినవారునునై దిక్కుగానకయేడ్చుచు ఇటునటు పరుగెత్తుచుండగా, ఇనుపకట్ల గుదియలచేతను, ఇనుపబడితలచేతను మాటిమాటికి కొట్టబడువారును, మండుచున్న నిప్పువలె వెలుగుచు భయంకరముగాతోచునట్టి నానా విధములైన రంపములచేత కోయబడువారును, విడిచివాటుగుదియలచేత నెత్తురువెళ్లగా కొట్టబడువారును, బహువిధములగుపురుగులచేత గాయములువడ కరపింపబడువారును, ఆక లిగొని అన్నమునీళ్లు అడుగుచు పరవశులై యుండువారును, ఎండతాపమును సహింప లేక చల్లనినీడగోరువారును, మంచుచేత చలిగొని చలికాచుకొనుటకై అగ్గియడుగువా

దానహీనాః ప్రయాంత్యేవ పథి పాథేయవర్జితే, సంజా గృహీతపాథేయా స్సుఖం యాంతి యమాలయమ్. ఏవంతథానికృష్టేన ప్రాప్తాః ప్రేతపురం యథా, ఆజ్ఞాపితా స్తథా దూతై ర్నివేద్యంతే యమాగ్రతః. తత స్తే పాపకర్మాణ స్తు పశ్యంతి భయానకమ్, పాపావష్టబ్ధనయనా విపరీతాత్మ బుద్ధయః. దంష్ట్రాకరాళవదనం భృకుటీకుటిలేక్షణమ్, ఊర్ధ్వకేశం మహాశ్మశ్రుం ప్రస్ఫురత్స్వాధరోష్ఠకమ్. అష్టాదశభుజం క్రుద్ధం అంజనాచలసన్నిభమ్. సర్వాయుధోద్యతకరం బ్రహ్మదండేన తర్జితమ్. మహామహిషారూఢం దీప్తాగ్నిసమలోచనమ్, రక్తమాల్యాంబరధరం మహామేరు మివోచ్ఛ్రితమ్. ప్రళయాంబుదనిర్ఘోషం పిబంతమివసాగరమ్, గ్రసంతమివ త్రైలోక్య ముద్గిరంతమివానలమ్. మృత్యుంచతత్సమీపస్థం కాలానలసమప్రభమ్, కాలంచానలసంకాశం కృతాంతంచ భయానకమ్. మారీచోగ్రా మహామారీ కాళరాత్రీచ దారుణా, వివిధా వ్యాధయః కష్టా నానారూపా భయావహాః. శక్తిశూలాంకుశధరాః పాశచక్రాసి

---

రును, దానములుచేయమిచేత దారిబత్తెముగానక దూతలచేత కొనిపోబడుచుండుదురు. సత్పురుషులో అనిన, మార్గవ్యయమునకు కావలసినపదార్థములుగలిగి సుఖముగా యమపట్టణమునుగూర్చిపోదురు. పాపాత్ములగువారు మార్గమునందు ఎంతశ్రమపడిపోవుదురో అంతనీచముగా యముని ఎదుట దూతలచేత తెలుపబడుదురు. అంతట ఆపాపాత్ములు పాపములతోడి చూపులుకలవారు కనుక మారుపడినబుద్ధియుమనస్సునుగలవారై కేవలము భయంకరమైన ముఖమును, బొమముడిచేత వక్రమైనచూపులును, బిరుసై నిక్కిన వెండ్రుకలును, పొడవైనగడ్డమును, అదరుచున్న పెదవులును, పదునెనిమిది భుజములును గలిగి మిక్కిలి కోపించినవాడును, కాటుకకొండవలె ఉన్నతమై నల్లనైన ఆకారముగల వాఁడును, మండుచున్న నిప్పులవలెనుండు కన్నులుగలవాఁడును, ఎఱ్ఱనిపూలదండలను ఎఱ్ఱని వస్త్రములను ధరించినవాఁడును, మేరుపర్వతమువలె మిక్కిలిపొడుగైనవాఁడును, ప్రళయకాలపు మేఘధ్వనివంటి కంఠధ్వనిగలవాడును నై మూఁడులోకములను మ్రింగువానివలె నిప్పులు గ్రక్కుచున్న యమధర్మరాజునుజూతురు. మరియు ఆయమధర్మరాజు ప్రళయకాలపుఅగ్నిహోత్రునివలె ప్రకాశించుచుప్రాణులనెల్ల చంపునట్టిదైనమృత్యుదేవతయు, అగ్నివలె వెలుగుచున్న కాలపురుషుడును, భయమును పుట్టించువారైనమారి మహామారియను శక్తులును, క్రూరత్వముగల కాళరాత్రియను శక్తియు, అనేకవిధములైన భయములను పుట్టించునట్టి కష్టాధిదేవతలును, రోగములును తన్నుచేరి కొలువుచేయుచుండగా, శక్తి, శూలము, అంకుశము, పాశము, చక్రము, ఖడ్గము అనబడిన ఆయుధములను, ప్రాణ

ధారిణః, వజ్రదండధరా రౌద్రాః క్రూరబాణధనుర్ధరాః. అసంఖ్యాతా మహావీరాః క్రూరాంజనసమప్రభాః. సర్వాయుధోద్యతకరాః యమదూతా భయానకాః, అనేన పరివారేణ సంవృతం ఘోరదర్శనమ్. యమం పశ్యంతి పాపిష్ఠాః చిత్రగుప్తంచ భీషణమ్, నిర్భర్త్సయతిచాత్యంతం యమస్తాన్ పాపకర్మణః. చిత్రగుప్తస్తు భగవాన్ ధర్మవాక్యైన బోధయేత్, భోభోదుష్కృతకర్మాణః పరద్రవ్యాపహారిణః. గర్వితారూపగర్వేణ పరదారాభిమర్శకాః, యత్స్వయం కురు తేకర్మ తద్భుక్తేఽచ స్వయంనరః. తత్కిమాత్మోపభోగార్థం భవద్భిర్దుష్కృతంకృతమ్, ఇదానీంకింప్రతప్యధ్వం దహ్యమానాస్స్వకర్మభిః భుంజధ్వం తానికర్మాణి నాత్ర శేషోఽస్తి కస్యచిత్, ఏతేచ పృథివీపాలాః సంప్రాప్తా మత్సమీపతః. స్వకీయైఃకర్మభిర్ఘోరైః దుష్ప్రాజ్ఞాబలగర్వితాః, భోభోనృపాదురాచాః ప్రజావిధ్వంసకారిణః. అల్పకాలస్య రాజ్యస్య కృతే కిందుష్కృతంకృతమ్, రాజ్యలోభేన మోహేన బలాదన్యాయతః ప్రజాః. యద్దండితాఫలం తస్య

---

బాధకములైనబాణములను, విండ్లనుధరించి, భయంకరులై కానవచ్చు కింకరులచేతను, వజ్రదండములనుధరించిన పార్శ్వచరులచేతను, మిక్కిలిపరాక్రమముగలిగి కాటుకకొండలవలెనల్లగా గానవచ్చు దేహచ్ఛాయతో ఎల్ల ఆయుధములనుపూనిన క్రూరులైనపరిజనులచేతను సేవింపబడుచున్నవాడై చిత్రగుప్తునితోగూడ పాపాత్ములకు కానవచ్చుచుండును. అట్లు కానబడెడు యమధర్మరాజు మిక్కిలి పాపాత్ములగువారిని మిక్కిలి బెదరించుచుండును. షడ్గుణైశ్వర్యసంపన్నుడైన చిత్రగుప్తుడు ధర్మవాక్యములను బోధించును. ఎట్లు అనగా —ఓపాపాత్ములారా! మీరు పరులద్రవ్యము నపహరించితిరి. చక్కదనముచేతగర్వించి పరస్త్రీలయందు అపేక్షపడితిరి. కనుక మీరు చేసినపనులకు దగినశిక్షను అనుభవింపవలసినది. మీరుఅల్పసౌఖ్యమునుగోరి చేసినపాపమునుతప్పక అనుభవింపవలెను. మునుపు చేసిన పాపమును అనుభవింపవచ్చితిరే, ఇందుకు దుఃఖపడనేల? చేసినదాని అనుభవించి తీరవలెగాని విచారపడితీరునా? ఇదిగో చూడుడు. ఈరాజులు తెలివిమాలి తమబలముచేత గర్వించి క్రూరములైనపాపకృత్యములను చేసియిప్పుడు మాయెదుటికి తేబడియున్నారు. చెడు నడవడిగలిగి జనులను నశింపజేసిన ఓరాజులారా! మీరు కొంతకాలముమాత్రము ఉండునట్టిప్రభుత్వమునునమ్మి యెన్నో క్రూరకృత్యములను జేసితిరి. ఆప్రభుత్వమునందలి ఆశచేత న్యాయమువిచారింపక జనులను అక్రమముగా దండించితిరి. స్వప్రయోజనమునకైరాజ్యమునభూమినిపనిచెరిచితిరి. అటువంటిచెడునడతలుగలిగి జనులనుహింసించిన మీరు అందులఫలమునంతయు అనుభవింపుడు. మునుపు మీరు ఎన్నోచెడ్డపనులుచేసి ఆర్జించినవాని

భుంజధ్వమధునానృపాః, కృతరాజ్యం కళత్రంచ యదర్థమశుభంకృతమ్.
తతస్సర్వంపరిత్యజ్య యూయమేకాకినస్తథా, త్వద్బంధూన్నాత్రపశ్యా
మో ప్రజ్ఞావిధ్వంసితాః ప్రజాః. యమదూతై స్తర్జ్యమానా హ్యధునా
కీదృశం భవేత్, ఏవం బహువిధై ర్వాక్యై రుపలబ్ధా యమేనతు. శో
చంతి స్వానికర్మాణి తూష్ణీం తిష్ఠంతి పార్థివాః, ఇత్యధర్మం సముద్దిశ్య
నృపాణాం ధర్మరాట్పునః. తత్పాపపంకశుద్ధ్యర్థ మిదంవచన మబ్రవీత్,
భోభోచండమహాచండ గృహీత్వా నృపతీనిమాన్. విశోషయధ్వంపా
పేభ్యః క్రమేణ నరకాగ్నిషు, తతశ్శీఘ్రం సముత్థాయ నృపాన్ సంగృ
హ్య పాదయోః. భ్రామయిత్వాతివేగేన ప్రక్షిప్యోర్ధ్వం ప్రగృహ్య
చ, సర్వప్రాణేన మహతా సుప్రతప్తశిలాతలే. ఆస్ఫాలయంతి తరసా
మహావాయురివ ద్రుమాన్, తతశ్చ రక్తస్రోతాంసి స్రవంతే నిర్ఝరీ
కృతాః. నిస్సంజ్ఞశ్చ తదా దేహో నిశ్చేష్టశ్చ ప్రజాయతే, తతశ్చ వా
యునా స్పృష్ట శ్శనైరుచ్ఛ్వసితే పునః. కన్యాః.— మాతరశ్శృణు వ
క్ష్యామో నరకా స్సంఖ్యయా బహూన్, పాపినాం పాపశుద్ధ్యర్థం
పురా సృష్టాన్ స్వయంభువా. తతః పాపవిశుద్ధ్యర్థం క్షిప్యంతే నరకా

---

నెల్లనువిడిచి యిప్పుడు ఒంటరులై చిక్కితిరిగాని మీచుట్టములను స్నేహితులను వెంటదీసి
కొని రానేరరైతిరి. కనుక యిప్పుడు కింకరులు బెదరింపగా దుఃఖపడి ప్రయోజనములేదు.
అనియిట్లు యమధర్మరాజు చిత్రగుప్తునిచేత బహువిధముల జెప్పించుచుండగా ఆరాజు
లు తమతమ పాపకర్మములను దలచుకొని దుఃఖించుచు ఊరక ఉందురు. అంతట యమ
ధర్మరాజు ఆరాజుల పాపకృత్యములను విచారించి ఆపాపములకు తగిన దండనలను
నిర్ణయించి, ఓరిచండా! ఓరిమహాచండా! అని తనకింకరులనెల్ల పేరులవరుసను బిలిచి
ఈరాజులను దీసికొనిపోయి నరకములనెడు అగ్నులయందు తగులవేయుండు అని
ఆజ్ఞాపించును. ఆకింకరులు తక్షణమే పాపులగు రాజులయొక్క కడకాళ్లుపట్టి త్రిప్పి
అతివేగముగా పైకి ఎగురవేసి ప్రాణములుపోకుండ పట్టుకొని చక్కగా కాలిన
బండలమీద పెద్దగాలి చెట్లను ఊదియూచి విరుగఁద్రోచునట్లు జాడించి జాడించి
పడవేయుచుందురు. పిమ్మట ఆపాపులు దేహములు తూంట్లుపడఁగా నెత్తురులు
గ్రక్కుకొందురు. అప్పుడు వారిదేహములు తెలివితప్పగా కదలకయుండును. వెంటనే
కొంచెము చల్లగాలి వీచును. అంతట యెప్పటివలె ఊపిరి విడుతురు. ఓ తల్లు
లారా! ఇట్లు పాపాత్ముల పూర్వపాపములను తొలగించి పరిశుద్ధులనుగా జేయు
టకై బ్రహ్మదేవుడు నిర్మించిన నరకములు అనేకములు గలవు. వానినెల్లను చెప్పెదము

ర్ణవే. అష్టావింశతి రేవాథ తీతా నరకకోటయః, సప్తమస్య తటస్యాం తే ఘోరేతమసిసంస్థితాః. ఘోరాఖ్యా ప్రథమా కోటిః సుఘోరా తదధస్స్థితా, అతిఘోరామహాఘోరా ఘోరరూపాచపంచమీ. షష్ఠీ తరళతారాఖ్యా సప్తమీచ భయానకా, అష్టమీకాళరాత్రీచ నవమీచ భయోత్కటా. దశమీచ తతశ్చండా మహాచండా తతోప్యధః, దండకోలాహలా చాన్యా ప్రచండా నరకాధికా. కరాళా నికరాళాచ వజ్రా వింశతికాస్మృతా. త్రికోణా పంచకోణాచ సుదీర్ఘా పరివర్తులా, సప్తభౌమాష్టభౌమాచ దీప్తామాయేతిచాష్టమీ. ఇత్యేతాః క్రమతః ప్రోక్తా అష్టావింశతి రేవతాః, అతిక్రూరతరాఘోరాః పాపినాం యాతనాప్రదాః. ఇత్యేవంసర్వకోటీనాం పంచపంచైవనాయకాః, ప్రత్యేకం సర్వకోటీనాం నామతస్తాన్నిబోధత. రౌరవః ప్రథమస్తేషాం రుదంతే యత్ర దేహినః, మహారౌరవపీడాభిర్మహాంతోపి రుదంతిచ. తమశ్శ్వే

---

వినుండి. అనిచెప్పి ఆకన్యకలు పాతకములు తొలగిపోవుటకై పాపులగువారు సముద్రమువలె మేరగానరాని నరకములను ఇట్లు చెప్పనారంభించిరి. ఈలోకమునందు ప్రసిద్ధములైన నరకములు ఇరువది యెనిమిది కోట్లుగలవు. అందు ఏడవకోటి తుదను ఘోర అను పేరుగల అంధకార నరకకోటికలదు. దానిలో పాపులు వేయబడుచున్నారు. ఈ చెప్పిన నరకములలో మొదటికోటి ఘోర అనబడును. దానికవతలిది సుఘోర దాని వెంబడిగి అతిఘోర దానికి పిమ్మటిది మహాఘోర అని చెప్పబడును. ఈనాలుగింటికి క్రింద అయిదవది ఘోరరూపయందురు. ఆరవది తరళతార, ఏడవది భయానక, ఎనిమిదవది కాళరాత్రి, తొమ్మిదవది భయోత్కట, పదియవది చండ, పదునొకండవది మహాచండ, పండ్రెండవది దండకోలాహల, పదుమూడవది నరకకోటిలో అధికమైన ప్రచండ అని యనబడును. ఆవల కరాళ వికరాళాదులు ఆరు నరకకోట్లు కలవు. ఇరువదవది వజ్రయని చెప్పబడును. దానికి అవతల ఎనిమిది నరకకోట్లు గలవు. అవి క్రమముగా త్రికోణ, పంచకోణ, సుదీర్ఘ, పరివర్తుల, సప్తభౌమ, అష్టభౌమ, దీప్త, మాయ అనబడును. ఇట్లు క్రమముగా ఇరువదిఎనిమిదినరకకోట్లు చెప్పబడును. అవి మిక్కిలి క్రూరములు భయంకరములు పాపులకు యాతనను కలుగజేయునవియునై యుండును. ఈనరకకోటులలో అయిదయిదు ఒక్కొక్కకోటికి ప్రధానములై యుండును. అన్నికోటుల యొక్కయు పేరులవరుసను ప్రత్యేకముగా తెలిపెదము వినుడు. మొదటిది రౌరవము, అందు దేహధారులు విడ్చుచుందురు. రెండవది మహారౌరవము; అందు ప్రాణులు మిక్కిలి యేడ్చుచుందురు, మూడవది తమము, నాలవది శ్వేతము, అయిదవది

తస్తథా చోష్ణః పంచాద్యా నరకాః స్మృతాః. సుఘోరస్సుదమ స్తీక్ష్ణో కర్మసందీపనశ్శరః. మహామాయాతి రోమశ్చ సుభీమశ్చ సుకంటకః, తీవ్రవేగః కరాళశ్చ వికరాళః ప్రకంపనః. మహాపద్మస్సువక్త్రశ్చ కాలసూత్రః ప్రతర్దనః, సూచీముఖస్సునేమిశ్చఖాదక స్సుప్రదీపకః. కుంభీపాకస్సుపాకశ్చ కూపశ్చాతప దారుణః, అంగారరాశిర్భవనో సృక్పూయో ప్రోదక స్తతః. విణ్మయాస్తుందిశకునిః మహాసంవర్తకః క్రతుః, తప్తజంతుః పంకలేపః పూతిమాంసో ద్రవః పునః. ఉచ్ఛ్వాసస్తు నిరుచ్ఛ్వాసః సుదీర్ఘః కూటశాల్మలః, అరిష్టస్సుమహానాదః ప్రధావస్సుప్రతాపనః. ఋక్షో గజో వృకశ్శల్యః సింహవ్యాఘ్రమృగాదనాః, సూకరశ్వానమహిష వృషమేషఖరాననాః. గ్రాహకుంభీరనక్రాఖ్యాః సర్పః కూర్మశ్చ వాయసః, గృధ్రోలూకజలూకాశ్చ శాలూరః కపికర్కటాః. గండకః పూతివక్త్రశ్చ రక్తాక్షః పూతిమృత్తికః, కణధూమస్తుషాగ్నిశ్చ క్రిమిణాం నిచయ స్తథా. అమేయశ్చాప్రతిష్ఠశ్చ రుధిరాన్న శ్వభోజనః, లాలాభక్షాత్మభక్షౌశ్చ సర్వభక్షస్సుదారుణః. సంకటస్సువిశాలశ్చ వికటఃకంటకః

---

ఉష్ణము, ఇది మొదలుకొని నరకములు క్రమముగా చెప్పబడును వినుము. సుఘోరము, సుతమము, తీక్ష్ణము, కర్మసందీపనము, శరము, మహామాయము, అతిరోమము, సుభీమము, సుకంటకము, తీవ్రవేగము, కరాళము, వికరాళము, ప్రకంపనము, మహాపద్మము, సువక్త్రము, కాలసూత్రము, ప్రతర్దనము, సూచీముఖము, సునేమి, ఖాదనము, సుప్రదీపకము, కుంభీపాకము, సుపాకము, కూపము, ఆతపదారుణము, అంగారరాశి, అసృక్పూయభవనము, ప్రోదకము, విణ్మయము, తుంది, శకుని, మహాసంవర్తకము, క్రతువు, తప్తజంతువు, పంకలేపము, పూతిమాంసము, అద్రవము, ఉచ్ఛ్వాసము, నిరుచ్ఛ్వాసము, సుదీర్ఘము, కూటశాల్మలము, అరిష్టము, సుమహానాదము, ప్రధావము, సుప్రతాపనము, ఋక్షము, గజము, వృకము, శల్యము, సింహము, వ్యాఘ్రము, మృగాదనము, సూకరము, శ్వానము, మహిషము, వృషము, మేషము, ఖరాననము, గ్రాహము, కుంభీరము, నక్రము, సర్పము,కూర్మము, వాయసము, గృధ్రము,ఉలూకము, జలూకము, శాలూరము, కపి, కర్కటకము, గండకము, పూతివక్త్రము, రక్తాక్షము, పూతిమృత్తికము, కణధూమము, తుషాగ్ని, క్రిమినిచయము, అమేయము, అప్రతిష్ఠము, రుధిరాన్నము, శ్వభోజనము, లాలాభక్షణము, ఆత్మభక్షణము, సర్వభక్షణము, సుదారుణము, సంకటము, సువిశాలము, వికటము, కంటకము, పురీషకము,

పునః. పురీషకకటాహాశ్చ కష్టావై తరణీనదీ. సుతప్తో లోహశంకుశ్చ నిష్ఠాపూయప్రపూరణః, అసితాళవనం ఘోరం అస్థిభంగప్రపీడనమ్. నీలాయనేక్షుయంత్రాణి కూటపాశప్రమర్దినీ, మహాచూర్ణిసుచూర్ణీచ తప్తలోహమయ స్తథా. పర్వతఃక్షురధారాఖ్యా తథాచ మలపర్వతః,మూత్రవిష్ఠాంధకూపాశ్చ పూయకూపశ్చ శాతనః.ముసలోలూఖలోయంత్ర శిలాశకటలాంగలిః, తాళపత్త్రాసిగహనం మహామశకమండపః. సమ్మోహనోతిభంగశ్చ తప్తశూలమయోగదః, బహుదుఃఖం మహాదుఃఖం కశ్మలంశమలంమలమ్. హాలాహలాదికూపశ్చ భీమకూపోయమానుగః, ఏకపాదో ద్విపాదశ్చ త్రిపాదశ్చచిరంతమః. అష్టావింశతి రిత్యేతత్క్రమశః పంచకాఃస్మృతాః, కోటీనామానుపూర్వ్యేణ పంచపంచైవనాయకాః. రౌరవాద్యా విస్ఫురంతి నరకాణాం శతం స్మృతమ్, చత్వారింశత్సమధికం మహానరక మండలమ్. యేషు పాపాః ప్రపచ్యంతే నరాఃకర్మానురూపతః, యాతనాభి ర్విచిత్రాభి రాకర్మప్రశయాద్భయమ్. మలప్రక్షాళనార్థంతు అగ్నౌ ధామ్యంతి ధాతవః,తద్వత్పాపక్షయాంత్పాపా శ్శుధ్యంతే నరకాగ్నిషు. ఏవం క్లిష్టా విశుద్ధాశ్చ సావశేషేణ కర్మణా, తతః క్షితిం సమాసాద్య జాయంతే దేహినః పునః. స్థావరా వివిధాకారా

---

కటాహము, కష్టమైన వైతరణీనది, సుతప్తము, లోహశంకువు, విష్ఠాపూయప్రపూరణము, ఘోరమైన అసితాలవనము, అస్థిభంగప్రపీడనము, నీలాయనేక్షుయంత్రములు, కూటపాశప్రమర్దిని, మహాచూర్ణి, సుచూర్ణి, తప్తలోహమయము, పర్వతము, క్షురధార, మలపర్వతము, మూత్రకూపము,విష్ఠాకూపము, అంధకూపము,పూయకూపము, శాతనము, ముసలము, ఉలూఖలము, యంత్రము, శిలాశకటము, లాంగలి, తాళపత్త్రాసిగహనము, మహామశకమండపము, సమ్మోహనము, అతిభంగము, తప్తశూలమయము, గదము, బహుదుఃఖము, మహాదుఃఖము, కశ్మలము, శమలము, మలము, హాలాహలాదికూపము, భీమకూపము, యమానుగము, ఏకపాదము, ద్విపాదము, త్రిపాదము, చిరంతమము, అనునివి యిరువదియెనిమిది నరకకోట్లలో ముఖ్యములైన అయిదేసినరకములు. ముందు చెప్పబడిన కోట్లసంఖ్యలనరకములలో ఈఅయిదేసి మిగుల గొప్పవి. రౌరవాదులైన నరకముల మొత్తములో నూటనలుపది నరకములలోబడిన పాపాత్ములు నిప్పులో కాచబడినలోహపాత్రములవలె పరిశుద్ధులగుదురు. ఇట్లునరకములలో పడిపరిశుద్ధులగువారు కర్మశేషమును అనుభవించుటకై భూలోకమునందు దేహధారులయి పుట్టుచుందురు. గడ్డిపొదలు మొదలుగాగల భేదములచేత స్థావరములైపుట్టి అందులదుఃఖములను అనుభ

స్తృణగుల్మాదిభేదతః, తత్రానుభూయ దుఃఖాని జాయంతే కీటయోనిషు. నిష్క్రాంతాః కీటయోనిభ్యో జాయంతే పక్షిణస్తథా, సంక్లిష్టాః పక్షియోనిభ్యో సంభవంతి మృగాదిషు. మృగదుఃఖమతిక్రమ్య జాయంతే పశుయోనిషు, క్రమాద్గోయోనిమాసాద్య జాయంతే మానవాఃపునః. ఏతావన్మాత్ర మస్మాభిః శ్రుతం దృష్టం యమాలయే, యాతనా నరకా ఘోరాః పాపినశ్చైవ మాతరః. అశ్రుతాన్యప్యదృష్టాని శతశోఽథ సహస్రశః, జ్ఞాతుం ద్రష్టుంచ తత్సర్వ మస్మాభిర్నైవ శక్యతే.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే
యమపురవృత్తాంతకథనం నామ
నవమోఽధ్యాయః.



వించి అవతల పురుగులుగా పుట్టుదురు. ఆపురుగుపుట్టుకవల్లనుండి పక్షిజన్మమునుపొందుదురు. ఆపక్షిజన్మమునందు కలిగెడు దుఃఖములనెల్ల అనుభవించి పిమ్మట మృగజన్మమును పొందుదురు. ఆమృగజన్మమువలని దుఃఖములనెల్లను అనుభవించిన పిమ్మట గోజన్మమును పొందుదురు. ఆగోజన్మమునుండి క్రమముగా మరల మనుష్యులై పుట్టుదురు. ఓయమ్మలారా! మేము యమలోకమునందు చూచినవియు వినినవియునైన విషయములు ఇవి. ఈచెప్పబడిన నరకములన్నియు పాపాత్ములకేగాని పుణ్యాత్ములకు కాదు. అచ్చట మేముచూచినవియు వినినవియునైన నరకములు మరియు ననేకములుకలవుగాని అవి యిట్టివని తెలిసికొనుటకును చూచుటకును మేము చాలినవారము కామైతిమని కన్యకలు చెప్పిరి.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు యమలోక
వృత్తాంతమును వివరించునదియైన తొమ్మిదవయధ్యాయకథ.



## దశమోఽధ్యాయః.

మాతరః.—అలమేతావదస్మాకం శ్రుత్వానరకయాతనాః, సీదంతి సర్వగాత్రాణి హృదిభీతిః ప్రవర్తతే. స్మారంస్మారం మనోఽస్మాకం ముహుర్ముహ్యతిమాద్యతి, అంతర్భయాతిరేకేణ రోమకంచుకితా వయమ్. శ్రుత్వాయమపురాధ్వానం ప్రాణాః కంఠగతాహినః, అంతస్తాపాకులాశ్శశ్వదుద్విగ్నమనసోభవన్. తాస్సమాశ్వాస్య తాః కన్యా ఇదంవచనమబ్రువన్, మాభైష్టమాతరస్సర్వా యుష్మాకంపుణ్యగౌరవాత్. దేశేఽస్మిన్ భారతేపుణ్యే జన్మలబ్ధంసుదుర్లభమ్, అత్రజన్మసహస్రాణాం సహస్రైరపిమాతరః. కదాచిల్లభ్యతే జంతుర్మానుష్యం పుణ్యసంచయాత్, మాఘస్నానైకనిష్ఠానాం నకించిదపి దుర్లభమ్. అత్రైవ పరమాముక్తిర్భుక్తయశ్చాపి పుష్కలాః, కర్మభూమిరియంప్రోక్తా తతోఽన్యా భోగభూమయః. తపస్తప్యంతియతయో జుహ్వంతేచాత్రయజ్వనః, దానానిచాత్రదీయంతే పరలోకార్థమాదరాత్. అత్రైవ మాఘస్నానంచ ధన్యాః కుర్వంతి కేచన,

---

## పదియవ యధ్యాయము.

**తల్లులమాటలు.**—ఓబిడ్డలారా! మీరు చెప్పిననరకబాధలను వినుటయే చాలుననిపించుచున్నది. వానిని విననప్పుడే మాదేహములు వణకుచున్నవి. మనస్సులందు దిగులు పుట్టుచున్నది. అవి పలుమారు తలపునకువచ్చుటచేత మనసులు కలతనొందుచున్నవి. ఆదిగులుచేతమాదేహములు పరవశములై గగుర్పాటు నొందుచున్నవి. ఆయమపట్టణమునకుపోవు మార్గమును విన్నందున మ ప్రాణములు కంఠగతములైనవి. ప్రాణములు తమతావును విడుచుటవల్ల మనసులందు తాపము హెచ్చి ముందువెనుక తోచకున్నది. అని యీవిధముగా తల్లులు దిగులుపడి మాటలాడుచుండగా విని కన్యకలు వారిని ఓదార్చి, ఓతల్లులారా! మీరు భయపడకుడు. మీరు మిక్కిలి పుణ్యముచేసినవారు. కనుకనే లోకోత్తరమైన యీ భరతఖండమునందు దుర్లభమైన మనుష్యజన్మమెత్తితిరి. జీవుడు అనేకజన్మములందుచేసిన పుణ్యఫలముచేతగాని మానవజన్మము పొందనేరడు. అయినను మాఘస్నానము చేయువారికి అది దుర్లభము కాదు. వారికి కొరతలేని భోగములును ముక్తియును ఈలోకమునందే లభించును. ఈభరతఖండము కర్మభూమియనియు ఇతరఖండములు భోగభూములు అనియు చెప్పబడును. అనేకులు ఋషులు తపస్సులుచేయుటయు అనేకులు సత్పురుషులు యజ్ఞములుచేసి సోమయాజులగుటయు సకలదానములనుచేసి స్వర్గలోకమును పొందుటయు ఈ భరతఖండమునందేగాని మరియెక్కడను కాదు. మరికొందరు పుణ్యాత్ములు మాఘస్నానములు చేయుటయును ఇక్కడనే. ఈభూమియందు

బ్రహ్మత్వమమరేశత్వం దేవత్వంమానుషంతథా. లభంతేఽత్ర తపఃకృత్వా నరాః కర్మానురూపతః, సర్వేషా మేకరూపానా మయం దేశః పరఃస్మృతః. యతస్స్వర్గశ్చమోక్షశ్చ తపస్సంప్రాప్య తేనరైః, దేశేఽస్మిన్ భారతేవర్షే ప్రాప్యమానుష్య ముద్భవమ్. నకుర్యాదాత్మనశ్శ్రేయః తేనాత్మాపిసువంచితః, మనుష్యత్వేపివిప్రత్వం యః ప్రాప్యాతీవదుర్లభమ్ః. నకరోత్యాత్మనశ్శ్రేయః కస్తస్మాదప్యచేతనః, తతః కాలాంతరాద్యాతిమానుష్యమతిదుర్లభమ్. తత్సంప్రాప్యతథా కుర్యాన్నగచ్ఛేన్నరకం యథా, కదా భారతమభ్యేత్యమాఘమాసే బహిర్జలే. ఉషఃకాలే నిమజ్జామ ఇతివాంఛంతినిర్జరాః. గాయంతి దేవాః కిలగాయకాని ధన్యాస్తుయేభారతభూమిభాగే, స్వర్గాపవర్గాస్పదమార్గభూతేభవంతిభూయః పురుషాస్సురత్వాత్. జానీమనైతత్క్వవయంవిలీనే స్వర్గప్రదే కర్మణిదేహబంధమ్, ప్రాప్స్యామధన్యాః ఖలుతేమనుష్యా యేభారతేనేంద్రియ వర్గహీనాః. తస్మాన్మా

---

తపస్సు చేయువారు తమతమ కర్మానుసారముగా బ్రహ్మత్వమును ఇంద్రత్వమును దేవత్వమును మనుష్యత్వమును బొందుచున్నారు. కాబట్టి యెల్ల దేశములలోను ఈదేశము మిక్కిలి శ్రేష్ఠమైనదని చెప్పబడుచున్నది. ఇదిగాక ఈభరతఖండమునందు ప్రాణులు అనిత్యమైన మనుష్యశరీరమును పొంది దానివలన తపస్సిద్ధిని స్వర్గమును మోక్షమును పొందుచున్నారు. ఎవఁడు తనమంచికై తపస్సును చేయఁడో వానికి మంచి కలుగదు. ఏమనుష్యుఁడు సర్వోత్కృష్టమైన బ్రాహ్మణజన్మముసెత్తి మోక్షసాధనమైన తపస్సును చేయ నేరఁడో వానికంటె తెలివిమాలినవాఁడు ఎవఁడును కాడు. అట్టివాడు నరకమును పొంది పిమ్మట కొంతకాలమునకు మిగులదుర్లభమైన మానవజన్మమును మరల పొందును. ఆజన్మమునందు తపసుచేసినయెడల నరకమును పొందనేరడు. మరియు ఈభరతఖండముమహిమ వినుఁడు. దేవతలు సర్వదా భారతవర్షమునందుబుట్టి మాఘమాసమునందు తెల్లవారిలేచి ఊరివెలుపలనుండు పుణ్యజలములలో స్నానముచేయుభాగ్యము మనకెన్నడు కలుగును అనుకొనుచుందురు. ఇంతేకాదు, అయ్యో! మనము ఈభరతఖండమునందు స్వర్గాదిభోగములకు సాధనమైన మనుష్యదేహమునుపొంది యెరుగముగదా? కన్నుముక్కునోరు మొదలుగాగల యింద్రియములలో దేనికిని ఒచ్చెములేక స్వర్గమునకును మోక్షమునకును సాధనమగుచున్న భూమియందు వర్తించు మహాపురుషులుగదా పుణ్యాత్ములు? అట్టి భూలోకమును మనము ఎట్లు పొందగలము. అని స్వర్గమునుపొంది అందుండి భూమికి అవతరించువారి చరిత్రములను దేవతలగువారు కీర్తనలుగాజేసికొని పాడుచుందురు. కాబట్టి మీరు భయపడకుఁడు,

భైష్ట మాభైష్ట కురుధ్వం ధర్మమాదరాత్, గృహీతదానపాథేయ స్సుఖం యాతి యమాంతికమ్. అన్యథా క్లిశ్యతేజంతుః పాథేయరహితే పథి, ఇతిజ్ఞాత్వానరఃపుణ్యం కుర్యాత్పాపం విసర్జయేత్. పుణ్యేనయాతి దేవత్వ మధర్మాన్నరకం వ్రజేత్, యేమనాగపి దేవేశం ప్రపన్నాశ్శరణం శివమ్, తేపిఘోరం నపశ్యంతి యమస్యసదనంనరా, నారాయణం పరం దేవం సచ్చిదానందవిగ్రహమ్. యజధ్వంబాంధవాయూయం విముక్తిం యదివాంఛథ, భావనామయమేతద్వై జగత్ స్థావర జంగమమ్. విద్యు ద్విలోలంవిజ్ఞాయ తం యజధ్వం జనార్దనమ్, మాకురుధ్వ మహంకారం విద్యుల్లేఖాశ్శ్రియోవృథా. శరీరంమృత్యుసంయుక్తం జీవితంచాపిచంచ లమ్, రాజాదిభిర్ధనంగ్రాహ్యం సంపదఃక్షణభంగురాః మాతరః కిం నజా నీధ్వ మాయుషోర్ధం తు నిద్రయా, హృతంచ భోజనాద్యైశ్చ కియ దాయు స్సమావృతమ్. కియదాయుర్బాల్యతయా వృద్ధత్వాచ్చ కియద్ధృ తమ్,కియద్విషయభోగైశ్చ కదాధర్మాన్కరిష్యథ. బాలభావేచ వార్ధక్యే

శ్రద్ధతో ధర్మమును చేయుండు. యమలోకమునకు పోవునపుడు దారిబత్తెముగానక యిడుమలపడువాడు పాపాత్ముడేకాని పుణ్యాత్ముడు కాదు. పుణ్యాత్ముడు దారివెచ్చమునకు ఏకొరతయంలేక సుఖముగాబోయియమలోకమునుపొందును. ఇది తెలిసి మానవుడు ఎల్లవిధములచేతను పాపమును తొలగించి పుణ్యమును సంపాదింప ప్రయత్నింపవలెను. మనుజుడు పుణ్యముచేత సద్గతిని పాపముచేత దుర్గతిని పొందును. ఎవరుకొంచెమైన భగవద్ధ్యానముచేయందురో వారు భయంకరమై కానవచ్చు యమలోకమును జూడరు. ఓ చుట్టములారా! మీరు మోక్షమును కోరెదుపక్షమున తన్నుమీరిన వస్తువు లేనివాడును సచ్చిదానందస్వరూపుఁడునైన శ్రీమన్నారాయణుని సేవింపుడు. ఇచ్ఛాస్వరూపమై స్థావరములు (ఉన్నతావుననుండి కదలనివి) జంగమములును (సంచరించు స్వభావముగలవియును) అయిన ప్రాణులతో గూడుకొని యుండెడి యీప్రపంచము మెరపువలె అస్థిరమైనదియని తెలిసికొనుము. మెరుపుతీగవలె క్షణకాలములో కానరాకపోవునవియైన సంపదలను నమ్మి గర్వింపకుఁడు. దేహము చావుతో గూడుకొన్నది. బ్రతుకు శాశ్వతముకాదు. ధనము రాజులు మొదలగువారిచేత చిక్కునది. సంపదలు క్షణకాలములో నశించునవి. ఇవియిట్లుండగా జీవితకాలములో సగమునిద్రచే గడచిపోవును. తక్కిన సగములోను భోజనముచేయుట మొదలగుపనులచేత కొంతకాలము పోవుచున్నది. మిగిలినకాలమునందు బాల్యముచేతను ముసలితనముచేతను మంచిసెబ్బరలు తెలిసికొను సామర్థ్యముచాలక కొంతకాలము కడచును, ఇన్నిటిచేత పోయినదిపోగా

న లభేతాచ్యుతార్చనమ్. వయస్యేవచ ధర్మంచ కురుధ్వ మనహంకృతాః, మావినశ్యథ సంసారగర్తే మగ్నా భయంకరే. వపుర్వినాశనిలయ మాపదాం పరమం పదమ్, శరీరం రోగనిలయం మలాద్యైరపి దూషితమ్. కిమర్థం శాశ్వతధియా పాపం కురుత మాతరః, అసారభూతే సంసారే నానాదుఃఖసమన్వితే. విశ్వాసే నోపగంతవ్యో నిశ్చయం నాశ మేష్యథ, శృణుధ్వం బాంధవా స్సర్వే సత్యమస్మాభిరుచ్యతే. కాయస్సన్నిహితాపాయః పూజ్యఏవ జనార్దనః, యజధ్వంసతతంవిష్ణుం మానుష్య మతిదుర్లభమ్. కోటిజన్మసహస్రేషు స్థావరాదిషు బాంధవాః, సంభ్రాంతస్యచ మానుష్యం కథంచి త్పరిలభ్యతే. తత్రాపి దేవతాబుద్ధిః దానబుద్ధిశ్చమాతరః, యోగబుద్ధి స్తథాన్యాణాం జన్మాంతరతపఃఫలమ్. మానుష్యం దుర్లభంప్రాప్య యో విష్ణుంనార్చయేత్క్వచిత్, ఆత్మానమాత్మనాహంతి కోఽన్య స్తస్మాదచేతనః. దంభాచారంపరిత్యజ్య యజధ్వం చక్రపాణినమ్, భూయోభూయో హితంబ్రూమో భుజ ముద్యమ్య భక్తితః. విష్ణుస్సర్వా

---

మిగిలిన జీవితకాలము విషయాసక్తిచేత కడచిపోవుచున్నది. ఇందు మీరు ధర్మము చేయుంకాలముఏది? పసితనమునందును ముసలితనమునందును భగవంతునిసేవ లభింపదు కనుక యౌవనదశయందే అహంకారమును వదలి ధర్మమును కావింపుడు. సంసారమనెడి భయంకరమైన పాడుగుంటలో దిగబడి నశింపబోకుడు. ఈదేహము నాశమునకుచోటు. దుఃఖములకు ఉనికిపట్టు. రోగములకు ఇల్లు. మలమూత్రాదులచేత రోతయైనది. ఇటువంటిదేహమును శాశ్వతమనితలచి పాపకృత్యములు చేయనేల? ఓ అమ్మలారా ! సారములేనిదియు పెక్కుదుఃఖములతో కూడుకొనినదియు నైన సంసారమునందు నమ్మకము ఉంచరాదు. నమ్మకమును ఉంచినయెడల నాశముపొందుట నిశ్చయము. ఓచుట్టములారా ! మాచేత చెప్పబడునదియంతయు నిజము. చక్కగా వినుఁడు. శరీరము చెడునది. విష్ణువు పూజింపదగినవాడు. మనుష్యజన్మము మిక్కిలి దుర్లభము. కాబట్టి మీరు ఎల్లప్పుడు శ్రీహరిని పూజింపుడు. స్థావరాదిరూపముల చేత అనేకకోటిజన్మములెత్తి తుదకు బహుప్రయాసముచేత ఈజన్మము ఎత్తవయ్యెను. అట్టిఈమనుష్యజన్మమునందును దేవతాభక్తియు దానములుచేయుటయందలి ఆసక్తియు యోగాభ్యాసము చేయవలెననుబుద్ధియు కలుగుట పూర్వజన్మమునందు చేసిన తపస్సుయొక్క ఫలముగాని యితరముకాదు. పొందరాని మానవదేహమును పొందియు ఒకానొకప్పుడైన విష్ణువును ఆరాధింపనివాడు తన్నుతాను చంపుకొనెడి జడుడు అగును. మాటిమాటికి చేతులు చాచి హితము చెప్పుచున్నాము. వినుడు. మీరు

త్మనా పూజ్య స్త్వ్యజ్యాసూయా తథాన్యభిః, అనారాధ్య జగన్నాథం సర్వ దాతార మీశ్వరమ్. సంసారసాగరే మగ్నాః కథంపారంగమిష్యథ, బహుధాత్ర కిముక్తేన మాతరశ్శ్రూయతామిదమ్. కిం వేదైః కింతపోభిర్వా కింయజ్ఞై రుత్తదక్షిణైః, అహన్యహని గోవిందకీర్తనం పరిశ్రూణ్వతామ్. కింపుత్రదారైః కింభృత్యైః కింగృహక్షేత్రబాంధవైః, అహన్యహని గోవిందకీర్తనం పరిశ్రూణ్వతామ్. తస్మాద్యూయం భయం త్యక్త్వా కురుధ్వం కేశవార్చనమ్, పిబధ్వమమలం శుద్ధం సాలగ్రామశిలాజలమ్. కురుధ్వ ముపవాసంచ వాసరేషు మధుద్విషః, స్నానం కురుధ్వమనిశం మకరస్థే దివాకరే. కురుధ్వం భర్తృసేవాంచ భీతిస్త్యజ్యాచ మాతరః, ఏకాదశీతిథిః పుణ్యా సర్వపాపప్రణాశనీ. పక్షేపక్షే సమాయాతి కింనువో నరకాద్భయమ్, పుణ్యదాయీ పునర్మాఘే బహిస్తోయే నిమజ్జతామ్. వర్షేవర్షే సమాయాతి కిన్నువో నరకాద్భయమ్, ఏతావదుక్త్వా మాత్రా

కపటపు నడవడిమాని సుదర్శనచక్రమును ధరించిన శ్రీవిష్ణుమూర్తిని పూజింపుడు. సర్వవిధముల చేత ఓర్వలేనితనమును వదలి శ్రీవిష్ణుమూర్తిని ఆరాధించుట మానవులకు ధర్మము. సమస్తము నిచ్చువాడును, సర్వలోకములకు ఈశ్వరుడును అయిన భగవంతుని పూజింపక సంసారసముద్రమునందు మునిగినవారు ఎట్లు దరిజేరగలరు. వేయిమాటలేల మేమిప్పుడు చెప్పునట్టిమాటను వినుడు. వేదములచేతను తపస్సులచేతను సంపూర్ణదక్షిణలతోడి యజ్ఞములచేతను ప్రయోజనము లేదు. ప్రతిదినము తప్పక శ్రీమన్నారాయణుని కీర్తనములను వినుడు. కొడుకులు పెండ్లాలు వారికొరకైన పనులు ఇల్లు నేల చుట్టములు వీరివలన ప్రయోజనములేదు. మీరు ప్రతిదినమును తప్పక శ్రీవిష్ణుమూర్తి కీర్తనలను వినుడు. మీదచెప్పిన వేదములు మొదలగువానిచేతను పెండ్లాము బిడ్డలు మొదలగువారిచేతను ప్రయోజనములేదు. కాబట్టి మీరు జంకులేక విష్ణుమూర్తిని ఆరాధనముచేయుడు. నిర్మలమును పరిశుద్ధమునైన సాలగ్రామతీర్థమును పానముజేయుండు హరివాసరములయందు ఉపవాసముచేయుడు. సూర్యుడు మకరరాశిగతుడు కాగానే అనగా మాఘమాసము రాగానే ఎడతెగక స్నానముచేయుండు. ఓతల్లులారా! భయములేక మీ పెనిమిట్ల సేవచేయుండు. ఎల్ల పాపములను నశింపజేయునదియైన ఏకాదశి ప్రతిపక్షమునందును వచ్చుచున్నదే మీకు నరకమువలని భయమేల? పుణ్యము నిచ్చునదియైన మాఘమాసమునందు ఊరిబయటి పుణ్యజలమునందు స్నానముచేయుండు. అట్టి మాఘమాసము ప్రతిసంవత్సరమును వచ్చుచున్నదే. మీకు నరకమువలని భయమేల? అని యిట్లు కన్యకలు తమతల్లులకు చెప్పి మరలమరల చెప్పుచు మాఘస్నాన

ణాం కన్యకాఃపురరేపహి, మాఘస్నానోపవాసాది ధర్మదానాని చక్రిరే. ఏతావదూచు ర్భాతృభ్యః కన్యాః కమలలోచనాః, యమలోకస్య వృత్తాంతం తన్మయా వర్ణితంతవ. మాఘమాసకృతమజ్జనో జనః పారిజాత కుసుమై రలంకృతః, అప్సరఃకుచతటీనిపీడితః క్రీడతి త్రిదశనందనేవనే.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే కన్యకాకృతభ్రాతృ బంధుధర్మోపదేశో నామ దశమోఽధ్యాయః.

---

## ఏకాదశోఽధ్యాయః.

దిలీపః.—షడశీతిసహస్రాణి యోజనానా మతీత్యతత్, వైవస్వత పురం జ్ఞేయం నానారూప మిహస్థితమ్. తత్రైతాభిః కతిదినై ర్గతమాగత మప్యథ, శరీరమాసాం కన్యానా మతిష్ఠత్కథ మవ్రణమ్. భగవన్ముని శార్దూల వదనిస్సంశయం మమ, వసిష్ఠః-శృణు రాజన్ ప్రవక్ష్యామి గు

ములను హరివాసరములయందు ఉపవాసమును మరియు నానావిధ ధర్మములను దానములను చేయుచుండిరి. నేనును ఆయమలోకవృత్తాంతమును నీకు వివరించి చెప్పితిని. మాఘమాసమునందు స్నానముచేసినమానవుడు కల్పవృక్షపు పువ్వులచేత అలంకరింప బడినవాడును అప్సరసల రొమ్ములచేత ఒరయబడినవాడునునై దేవతల దయిన నందనవన మునందు క్రీడించుచుండును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు నరకబాధలనువిని దిగులొందినతల్లులకు కన్యకలు ధర్మోపదేశము చేయుటను తెలుపునట్టిదైన పదియవ అధ్యాయకథ.

---

## పదునొకండవ యధ్యాయము.

దిలీపునిమాటలు.—ఓభగవంతుడైన గురువర్యా! యమపట్టణము ఇచ్చటికి ఎనుబది యారువేలయోజనములదూర మున్నదనియు బహువిధములగానవచ్చునదియనియు తెలి యనాయెను. అట్టియమపట్టణమునకు ఈచెప్పబడినకన్యకలు ఎన్నిదినములలో పోయి వచ్చిరి. వారిశరీరములు వారువచ్చునంతవరకు ఎట్లు చెడకయుండెను. ఈవిషయమును నాకు విశదముగా తెలియజెప్పుము.

వసిష్ఠునిమాటలు.—ఓగొప్పబుద్ధిగల దిలీపా! నీవడిగినరహస్యమును చెప్పెదను

హ్యమేతన్మహామతే. ఆమండలం కృతయుగే శరీరం నావసీదతి, పాదోన మండలం త్రేతాయుగే తిష్ఠతి తద్వపుః. అర్ధమండలపర్యంతం తిష్ఠతి ద్వాపరే యుగే, కళా శరీరం మర్త్యానాం తిష్ఠత్యాపాద మండలమ్. కృతే చతుర్గుణా బుద్ధిస్త్రేతాయాం త్రిగుణా స్మృతా, ద్వాపరే ద్విగుణా బుద్ధిః కలావేకగుణా స్మృతా. ద్వాదశాహాత్పరం మర్త్యా గచ్ఛంతి యమ సాదనమ్, ఇతీరితం తు యత్సద్భిః పాపినామేవ తం నృప. ఇదం చ శృణు రాజేంద్ర గుహ్యాద్గుహ్యం బ్రవీమి తే, యథా యమభటా శ్శీఘ్రం గచ్ఛంత్యాయాంతి వాయువత్. ఈశ్వరానుగ్రహాదేవం గచ్ఛంత్యాయాంతి కేచన, విష్ణోరనుగ్రహాదేవం గచ్ఛంత్యాయాంతి కేచన. బ్రహ్మణోనుగ్రహాదేవం గచ్ఛం త్యాయాంతి కేచన, యమస్యానుగ్రహాదేవ కన్యా యమనికేతనమ్. నరకాణ్ యాతనాం స్తత్ర దృష్ట్వా చ పునరాగతాః, మాసమాత్రం శరీరాణి రక్షితాని స్వమాతృభిః. తథా కృతయుగే తస్మాచ్ఛరీరాణి స్థితానిచ, దోషోలంకరణాత్పూర్వం ప్రే

---

వినుము. ప్రాణము పోయిన దేహము కృతయుగమునందు నలువది దినములదాక చెడక యుండును. త్రేతాయుగమునందు ముప్పదిదినములదాక చెడకయుండును. ద్వాపరయుగమునందు యిరువదిదినములదాక చెడకయుండును. కలియుగమునందు పదిదినములవరకు చెడకయుండును బుద్ధికుశలత కృతయుగమునందు నాలుగుపాళ్లును. త్రేతాయుగమునందు మూడుపాళ్లును, ద్వాపరయుగమునందు రెండుపాళ్లును, కలియుగమునందు ఒకపాలును కలిగియుండును. చచ్చిన పండ్రెండుదినములకు పిమ్మట మనుష్యులు యమలోకమును పొందుదురు. అని పెద్దలు చెప్పుదురు. అది పాపాత్ములవిషయముగాని పుణ్యాత్ములవిషయముకాదు. మిక్కిలి రహస్యమైన మరియొకవృత్తాంతమును చెప్పెద వినుము. యమభటులు గాలివలెనే అతిశీఘ్రముగా వచ్చుచు పోవుచుందురు. యమలోకమునకు పోవువారును ఆప్రకారముగానే కొందరు శివానుగ్రహమువలన అతిశీఘ్రముగా వచ్చిపోవుచుందురు. మరికొందరు విష్ణుదేవుని యనుగ్రహమువలన అతిశీఘ్రముగా వచ్చిపోవుచుందురు. కొందరు బ్రహ్మఅనుగ్రహమువలన అతిశీఘ్రముగా వచ్చిపోవుచుందురు. ఈకన్యకలు యమునిఅనుగ్రహమువలననే కొనిపోబడి ఆయమలోకమును అందలి నరకములను ఆనరకములందు పాపులు పొందునట్టి యాతనలను జూచివచ్చిరి. వీరు యమలోకమునకు పోయినపిమ్మట ముప్పదిదినములుదాక వీరిదేహములను తల్లులు కాపాడుచుండిరి. కృతయుగమైనందున అంతపర్యంతము దేహములు చెడకయుండెను. మృతినొందినవానిదేహమును అలంకరించినపిమ్మటనే ప్రేతత్వదోషముగాని అంతకు

తస్య నవిధీయతే, ప్రేతాలంకరణా దూర్ధ్వం శవస్పృష్టిర్విధీయతే. మా
ఘస్నానోపవాసాది మహాపుణ్యాధికాజనాః, ఏవంగచ్ఛంతి చాయాంతి
పుణ్యంసర్వత్ర కారణమ్. పుష్కరోనామ విప్రేంద్రః పురాగత్వాయమా
లయమ్, ఉత్థాపయిత్వానరకాన్నరాన్ నారకిణోబహూన్. ఆగత్యపున
రద్యాపి స్వగృహేపూర్వవత్స్థితః,త్రేతాయుగేకదాచిత్తు రామేరాజ్యం
ప్రశాసతి. ద్విజస్య కస్యచిత్పుత్రో మృతోగత్వాయమాలయమ్, పున
ర్జీవపృథుకః కిమేతన్న శ్రుతంత్వయా. దేవకీతనయః కృష్ణో గురోస్సాం
దీపనేస్సుతమ్, గ్రాహగ్రస్తం చిరాద్గృహ్య పునస్స్వగురవేదదా. తథా
చాన్యేజనాః కేచిద్యమలోకాత్సమాగతాః, సంశయోత్రనకర్తవ్యః కిం
భూయశ్శ్రోతుమిచ్ఛసి. దిలీపః. పుష్కరోనామవిప్రేంద్రః కుత్రత్యఃకథమా
గతః, ఉత్తారితాః కథం తేన నరకేభ్యోపి పాపినః. రామరాజ్యేద్విజసుతః
కింమృతః కథమాగతః, భగవాన్ దేవకీపుత్రో గురోస్సాందీపనేస్సుతమ్.

---

ముందు ప్రేతత్వదోషమును ఆశవమునకు అంటును లేదు. మాఘస్నానము హరివాసర
మునందలి యుపవాసము మొదలగువానివలని పుణ్యముచేత అధికులగుజనులు ఈప్రకా
రము పోవుచు వచ్చుచునుందురు. కాబట్టి అన్నిటికి పుణ్యమే కారణము. పూర్వకాల
మునందు పుష్కరుడను బ్రాహ్మణశ్రేష్ఠుడు యమలోకమునకుపోయి నరకబాధలను పొం
దుచున్న మానవులను అనేకులును ఆనరకములవలన నుండి ఉద్ధరించి మరల భూలోకము
నకువచ్చి యెప్పటివలెనే తనయింట సుఖముగానుండెను. త్రేతాయుగమునందు శ్రీరాము
డు రాజ్యముచేయుచుండగా ఒకానొకబ్రాహ్మణునికి ఒకడే కొడుకు గలిగియుండి ఆపి
న్నవాడు చచ్చి యమలోకమునకు పోయి మరల బ్రతికెను. ఈకథను నీవువినలేదా?
దేవకీదేవికొడుకైన శ్రీకృష్ణమూర్తి తనగురువైన సాందీపునికొడుకు మొసలిచేత మ్రింగ
బడి చనిపోగా ఆవల బహుదినములకు ఆచిన్నవానిని యమలోకమునుండి తీసికొనివచ్చి
తనగురువునకు సమర్పించెను. వీరుగాక ఇంకననేకులు యమలోకమునకుపోయి మరల
వచ్చియున్నారు. కనుక ఈకన్యకల రాకకు నీవు సందేహింపపనిలేదు. ఇంక నేమివిన
గోరెదవు అనెను.

దిలీపునిమాటలు.—ఓవసిష్ఠమహామునీ! పుష్కరుడను బ్రాహ్మణుడు ఎవడు? ఎక్క
డనుండువాడు? అతడు ఎట్లు చచ్చెను? అతనిచేత నరకములోనున్న పాపులు ఎట్లు
ఉద్ధరింపబడిరి? రాముడురాజ్యము చేయునపుడు బ్రాహ్మణునికొడుకు ఏలచచ్చెను? ఎట్లు
మరల బ్రతికి వచ్చెను; భగవంతుడైన కృష్ణుడు మొసలికడుపులో జీర్ణించిన తనగురువు

జీర్ణం గ్రాహోదరే బాలం ఆనయామాస వై కథమ్, శ్రోతుమిచ్ఛామి విస్తారా ద్వసిష్ఠారుంధతీపతే. ఏతత్ప్రశ్నత్రయం సమ్యగ్బ్రూహి మే బ్రహ్మనందన. వసిష్ఠః. శృణు రాజన్ ప్రవక్ష్యామి పుష్కరస్య మహాత్మనః, చరితం సర్వపాపఘ్నం శృణోత్వవహితో భవాన్. నందిగ్రామే వసన్ ధీమాన్ పుష్కరోనామ వై ద్విజః, నిజానుష్ఠాననిరత స్సర్వభూతహితే రతః. మాఘస్నానరతో నిత్యం నిత్యంస్వాధ్యాయతత్పరః, హరేరారాధనం కాలే సకుర్వన్నాన్యమానసః. ఆస్తేతత్ర మహాయోగి సకుటుంబోగ్నిహోత్రకృత్, అప్రమేయమహావిష్ణో కృష్ణదామోదరాచ్యుత. గోవిందానంత దేవేశేత్యాహ సోకేవలంనృప, దేవతారాధనంత్యక్త్వా తస్య విప్రస్యనిత్యశః. నాన్యేషు రమతే నిత్యం స్వప్నేష్వపిమహామతే, అథ వైవస్వతో రాజా ప్రాహదూతాన్ భయంకరాన్. గత్వైవంపుష్కరం విప్రం నందిగ్రామనివాసినం, తమానయధ్వమిత్యేవ తేపిగత్వాభువంతతః ప్రగృహ్యత మజానంతో యమలోకం గతాన్నృప, తమాయాంతం యమోదృష్ట్వా పుష్కరం భీతమానసః. ప్రత్యుత్థాయాసనం గృహ్య ప్రవేశ్యస్వాసనేమునిమ్, భర్త్సయామాసతాన్ దూతాన్ భవద్భిః కిమనుష్ఠి

కొడుకును ఎట్లు బ్రతికించెను? ఆతనిని మొసలియేల మ్రింగెను? ఇదియంతయు సమగ్రముగా వినగోరునట్టి నాకు ఈమూడుప్రశ్నలకును ఉత్తరములు సెలవిమ్మని అడిగెను.

వసిష్ఠునిమాటలు.-ఓదిలీపా! ఎల్లపాపములను పోగొట్టజాలిన నడవడికల మహాపురుషుడగు పుష్కరునిచరిత్రము హెచ్చరికతో వినుము. నందిగ్రామమునందు పుష్కరుడు అనుబ్రాహ్మణుడు వాసముచేయుచుండెను. ఆతడు మిక్కిలి బుద్ధిశాలి. తానుచేసికొవలసిన అనుష్ఠానములయందు అక్కరగలవాడు. ఎల్లభూతములకు మేలుచేయ నిచ్ఛగలవాడు. ఎల్లప్పుడు మాఘస్నానము చేయుటయందు ఆసక్తిగలవాడు. సదా వేదాధ్యయనము చేయువాడు. ఇతరచింతలేకుండ శ్రీవిష్ణుమూర్తిని ఆరాధించుచుండువాడు. ఇట్టిచరిత్రముగల ఆపుష్కరమహాముని నందిగ్రామమునందు కుటుంబసమేతముగా నివసించి శ్రౌతాగ్నులను వేల్చుచు, అప్రమేయ (కొలదియిడరానివాడా) మహావిష్ణూ, కృష్ణ, దామోదర, అచ్యుత, గోవింద, అనంత, దేవేశ (దేవతలకు ప్రభువైనవాడా) అని భగవంతునినామములను స్మరించుచు నుండెను. ఆతనిమనసు సదా దేవపూజయందే గాని కలలోనైన నితరవిషయములందు చొరదు అట్లు ఆతడు వర్తించుచుండగా ఒకనాడు యమధర్మరాజు నందిగ్రామమునందుండెడు పుష్కరుడను బ్రాహ్మణుని తీసికొనిరండు

తమ్, తత్రాన్యః పుష్కరోనామ తం ప్రత్యుక్తంనుయా భటాః కిమయం సర్వధర్మజ్ఞో విష్ణుభక్తో విశేషతః, మాఘస్నానపరోనిత్య ముపవాసపరాయణః. మత్సమీపమిహానీతో భవద్భిః పాపచేతసైః, తానేవంభర్త్సయిత్వాథ ప్రేతరాజస్తమబ్రవీత్. పుత్రదారాదయస్సర్వే రుదంతిభృశమాకులాః, గచ్ఛత్వమితిసోప్యాహ పుష్కరస్తు వృకోదరమ్. పుష్కరః. భగవన్నరకాన్ సర్వాన్ ద్రష్టుమిచ్ఛామి తానహమ్, పాపినోయేషు పచ్యంతే యాతనాదేహమాస్థితాః. తతోవైవస్వతస్తస్మై పుష్కరాయ మహాత్మనే, నరకాన్దర్శయామాస శతశోథసహస్రశః. రౌరవం రౌద్రమత్యర్థం మహారౌరవ మేవచ, శ్వభోజనంవిశసనం ఘోరకర్దమ మేవచ. అసిపత్త్రవనం ఘోరం కుంభీపాకం భయావహం, క్రిమిశం క్రిమిభక్షంచ తథావైతరణీంనదీమ్. కరంభవాలుకంచైవ లాలాభక్షంచ వీచిమత్, సూకరంరోదనంచైవ తప్తవాలుక మేవచ. ఏతేషునరకేష్వేవపచ్యంతేపాపి

---

అని భయంకరులైన తనకింకరులకు ఆజ్ఞాపించెను. వారు ఆయాజ్ఞచొప్పున భూలోకమునకు వచ్చి పుష్కరునిబట్టి యమపట్టణమునకు గొనిపోయిరి. అప్పుడు యమధర్మరాజు ఈపుష్కరుని తేజస్సును జూచి భయపడి ఎదురు గావచ్చి మర్యాదచేసి పిలుచుకొని పోయి తన సింహాసనమునందు కూర్చుండబెట్టి కింకరులనుజూచి, ఒరీ! మీరలు ఏమిపని చేసితిరి. ఆగ్రామమునందు పుష్కరుడనువాడు మరియొకడుండగా వానిని తెమ్మంటిని. మీరు వానినివదలి ఈమహాత్ముని గొనివచ్చితిరి. ఈయన ఎల్లధర్మములను గుర్తెరిగినవాడు. విశేషించి విష్ణుభక్తుడు. ఎల్లప్పుడు మాఘస్నానము చేయుటయందు అక్కరగలవాడు. హరిదినములయందు ఉపవాసము చేయువాడు. ఇట్టి మహానుభావుడు పాపచిత్తులైన మీచేత ఇచ్చటికి తేబడెను అని యిట్లు పలికి ఆకింకరులను అదలించి పిమ్మట పుష్కరునిజూచి ఓమహానుభావా! నీపెండ్లాము బిడ్డలు మొదలగువారు నిన్నుగూర్చి మిక్కిలిదుఃఖింతురు. కాబట్టి నీవు శీఘ్రముగ భూలోకమునకు పొమ్ము. అనగా పుష్కరుడు యిట్లు పలికెను.

పుష్కరునిమాటలు.—ఓభగవంతుడగు యముడా! పాపాత్ములగునరులు యాతనాశరీరములను పొంది నరకములందు బాధింపబడుదురుగదా? ఆనరకములను జూడవలెనను కోరిక నాకుగలదు. ఈకోరికను నెరవేర్పవలెనని పుష్కరుడు అడుగగా, యముడు మహాత్ముడైన ఆపుష్కరునికి మిక్కిలిభయంకరమైనరౌరవము, మహారౌరవము, శ్వభోజనము, విశసనము, ఘోరకర్దమము, ఘోరమైన అసిపత్త్రవనము, భయమును పుట్టించునట్టి కుంభీపాకము, క్రిమిశము, క్రిమిభక్షణము,వైతరణీనది,కరంభవాలుకము, లాలాభక్ష్యము, వీచిమత్తు, సూకరము రోదనము,తప్తవాలుకము, మొదలైన నరకములు

నోఽనిశం, తత్ర తాన్ పతితాన్ దృష్ట్వా పీడ్యమానాన్ స నారకాన్. శూలోపరిగతాన్ వ్యాఘ్రై ర్భక్ష్యమాణాంశ్చ దుఃఖితాన్, కరంభవాలుకే తప్తాన్ క్రిమిభిర్భక్షితానపి తప్తకుంభే నిపతితా నసిభిస్తు విదారితాన్, అసిపత్త్రవనైశ్ఛిన్నాన్ క్రకచైర్దారితానపి. ముద్గరైస్తాడ్యమానాంశ్చ సంక్లిన్నాన్ ఘోరకర్దమే, ఉచ్చైర్నిపాత్యమానాంశ్చ తథా శీతలపీడితాన్. ఏతా నన్యాంశ్చ తత్రస్థాన్ నారకాన్ యాతనాగతాన్, దృష్ట్వాతిదుఃఖితో భూత్వా పుష్కరస్తానువాచహ. పుష్కరః. కిం తత్ర న కృతం పుణ్యం భవద్భిః పూర్వజన్మసు, తేనాత్ర యాతనాసంస్థా దుఃఖితా నిత్యమాకులాః. నారకాః. నాస్మాభిస్సుకృతం కించి త్కృతం తత్ర మహీతలే, తేనాత్ర యాతనాసంస్థా దహ్యామో దుఃఖితా భృశమ్. పరదారేషు నిరతాః పరద్రవ్యాపహారిణః, పరహింసాపరా నిత్యం దహ్యామ స్తేనవై వయమ్. పరీవాదః కృతోఽస్మాభిః పరేషాం నాపవాదినామ్, నిందితాశ్చ తథా విప్రా దహ్యామ

---

లను జూపెను. ఆనరకములయందు పాపాత్ములు ఎల్లప్పుడు తపింపజేయబడుచుండిరి. అప్పుడు ఆనరకములలోపడి పీడింపఁబడుచున్నవారును, కొఱ్ఱులందు దిగవేయబడినవారును, పెద్దపులులచేత తినబడుచు దుఃఖించువారును కరంభవాలుకమను నరకమునందు తపించుచున్నవారును, పురుగులచేత తినబడుచుండువారును, తప్తకుంభము అనునరకమునందు పడియున్నవారును, కత్తులచేత నరకబడుచున్నవారును, అసిపత్త్రవనమునందు కోయబడుచున్నవారును, రంపములచేత కోయబడువారును, గొడ్డండ్లచేత మోదబడువారును, ఉప్పుబురదయందు దిగవేయబడినవారును, ఉన్నతప్రదేశములనుండి త్రోయబడువారును, చలిచేత పీడింపబడినవారును, యాతనాదేహమునుపొంది ఇంకను అనేకవిధములైన యాతనలను పొందుచున్నవారునైన పాపాత్ములనెల్లను జూచి, పుష్కరుడు మిక్కిలి దుఃఖము నొందినవాడై ఆనారకులతో నిట్లు పలికెను.

పుష్కరునిమాటలు.—ఓనారకులారా! పూర్వజన్మములందు మీచేత కొంచెమైన ధర్మము చేయబడకపోనేల? మీరు ధర్మము చేయకపోవుటచేతనేకదా యాతనాశరీరములను పొంది యిట్లు నరకములలో ఎడతెగనిసంకటములు పడుచున్నారు.

నారకులమాటలు.—ఓపుణ్యాత్ముడా! మేము భూలోకమునందు కొంచెమైన పుణ్యము చేసినవారము కాము. కనుకనే యిచ్చట యాతనాదేహములనుబొంది వేగుచు మిక్కిలి దుఃఖపడుచున్నాము. మేము ఇతరులపెండ్లాలను ఆశించినవారమును, పరులద్రవ్యమును అపహరించినవారమును, పరులను హింసించుటయందు ఆసక్తులమునునైనందున

స్తేనవై వయమ్. తత్రార్థహేతో రస్మాభిః కృతమధ్యయనం తథా, తథై వాధ్యాపనం తేన దహ్యామ స్తేనవై వయమ్. భృత్యవర్గేష్వభుక్తేషు భుక్తమస్మాభి రాదరాత్, అన్నమగ్రే తథామృష్టం తేన దహ్యామహేవ యమ్. మాఘేస ర్వేషు మజ్జత్సు నవయం కృతమజ్జనాః, కించిదభ్యుదితే సూర్యే దహ్యామ స్తేనవై వయమ్. అపృథక్పాకనిరతా నిత్యంచాహుత వహ్నయః, అస్నానభోజినోనిత్యం దహ్యామ స్తేనవై వయమ్. గోకులస్య తృషార్తస్య ధావతోజనసమ్ముఖమ్, వయమాచరితా విఘ్నం దహ్యామ స్తేన వై వయమ్. గవాగ్రాసమదత్వాతు తత్తీరాదానతత్పరాః, జాతా స్స్వపోషణరతాః దహ్యామ స్తేనవై వయమ్. బ్రాహ్మణేభ్యః ప్రతిశ్రుత్య నదత్తం లోభకారణాత్, అస్మాభి స్తేన దోషేణ దహ్యామోఽత్రవయం ద్విజ. దానేష్వభిరతానిత్యం అర్థిభ్యో ధార్మికంప్రతి, విఘ్నమాచరి తా స్తత్ర దహ్యామ స్తేనవై వయమ్. త్యక్తదారవ్రతభ్రష్టాః పరదారర తా స్తథా, పరాస్వభిరతా స్త్రీషు దహ్యామ స్తేనవై వయమ్. నిక్షేపహారి

---

ఇట్లు నరకములందు వేగుచున్నాము. ఏమియెరుగనివారిపై లేనిపోని నిందలుమోపియు, సజ్జనులగు బ్రాహ్మణులను నిందించియు, ఇట్లు నరకములందు వేగుచున్నాము. భూలోక మునందు ధనాపేక్షచేత వేదమును చదివియు, అట్లు అధ్యయనము చదివించి ధనముపుచ్చు కొనియు, ఇట్లు నరకములోపడి వేగుచున్నాము. పరిచారకుల సమూహములు వస్తుపడియుండగా వారికంటె ముందు స్వచ్ఛమైన అన్నమునుతిని ఇట్లు నరకము లలో వేగుచున్నాము. మాఘమాసమునందు సూర్యోదయకాలమున ఎల్లవారును స్నాన ములుచేయుచుండగా మేము స్నానముచేయక ఇట్లు నరకములోపడి వేగుచున్నాము. ప్రత్యేకముగా వంటచేసికొనక సంఘాన్నమునుతినియు, ఎప్పుడును అగ్నిహోత్రములు చేయకయు, స్నానముచేయకయే సర్వదా భోజనముచేసియు, ఇట్లు నరకములలో వేగు చున్నాము. మేము దప్పిగొని నీళ్లకట్టుకై పరుగెత్తుచున్న గోవులను పోనీక యడ్డగించి నీళ్లుత్రాగనియ్యనందున ఇట్లు నరకములోబడి వేగుచున్నాము. మేము మమ్ముకాపాడు కొనుటయందే అక్కరగలవారమై పసులకు మేతవేయక వానిపాలుమాత్రము పిండు కొని త్రాగి ఇట్లు నరకములోబడి వేగుచున్నాము. ఓబ్రాహ్మణోత్తమా ! బ్రాహ్మణు లకు ఆశపెట్టి ఆయాశను తీర్పనివారమై ఇట్లు నరకములోబడి వేగుచున్నాము. దానములను తీసికొనుటయందు దానశక్తిగలవారమై ఇతరులైన యాచకులకు ఎవ్వరికిని ఏమియు నియ్యకుండ దాతకు బోధించినవారము గాన మేము ఈనరకములలో బడి వేగుచున్నాము. పెండ్లాలను విడిచిపెట్టినవారమును, వ్రతములను నడపనివారమును, పరుల

ణోజాతా తథామిత్త్రద్రుహోవయమ్, కూటసాక్షిగతా_స్తత్ర దహ్యామ స్తేనవైవయమ్. తవకింబహునో_క్తేన అస్మాభిర్యదనుష్ఠితమ్, పాతకంద్వి జవర్యేహ దహ్యామ స్తేనవైవయమ్. పుష్కరః.—సకృచ్ఛనార్చితో దేవో భవద్భిః కిం జనార్దనః, త_త్తేనాత్రేదృశం ప్రాప్తాం దశాంయూయంభయా నకామ్. సమ_స్తలోకనాథోర్యై రర్చితః పురుషో_త్తమః, తేషాంము_క్తిరపీ హాస్యా త్కిముపాపక్షయోన్నృణామ్. ప్రణతిర్న కృతప్రాయో భవద్భిః పురుషో_త్తమే, తేనయూయమిదంప్రాప్తా నరకంభృశదారుణమ్. అరణ్యే సంతిపత్త్రాణి నద్యాం స్వాదూదకానిచ, సంతిహస్తాచ పాదౌచ కథంనా రాధ్యతేహరిః. కిమత్రహాహాకారేణ యుష్మాక మధునాహరిమ్, స్మరతా హర్నిశం విష్ణు మశేషదురితాపహమ్. అహమత్రైవ నామాని కీ_ర్తయా మిజగత్పతేః, తానివఃశ్రేయసే నిత్యం భవిష్యంతి న సంశయః. నారకాః.— ఆత్మపాపేనతప్తానా మస్మాకమకృతాత్మనామ్, తవాంగస్పర్శసంభూతో

పెండ్లాలను కోరినవారమును, పతివ్రతలయందు ఆస_క్తిగొన్నవారము నైనందున మేము ఈనరకములలోబడి యిట్లు వేగుచున్నాము. నిక్షేపములను అపహరించినవారమును, మిత్త్రులకు కీడుచేసినవారమును, తప్పుసాక్షులైనవారమును అగుటచేత మేము ఈనరకము లోబడి యిట్లు వేగుచున్నాము. ఓబ్రాహ్మణో_త్తమా! వేయిమాటలేల మాచేత ఏయే పాపములు చేయబడినవో ఆయాపాపములకు తగిన నరకములలోబడి ఇక్కడ మేము వేగుచున్నాము.

పుష్కరునిమాటలు.—ఓనారకులారా! ఇటువంటిభయంకరమైనయవస్థ మిమ్ము పొందుటకు మీరు ఒకానొకప్పుడైనను శ్రీమన్నారాయణుని అర్చించినవారుకారో ఏమో? ఎవరిచేత సర్వలోకములకు ప్రభువైనభగవంతుడు పూజింపబడునో వారికి పాపములుతొలగును. మోక్షములభించును. తరుచుగా మీరు భగవంతునికి నమస్కారముకూడ చేసియుండరు. కనుక మీకు మిక్కిలిక్రూరమైనయిట్టినరకము సంప్రాప్తమాయెను. అడవియందు పత్త్రి సమృద్ధిగా కలదు. ఏళ్లయందు మంచినీళ్లున్నవి. చేతులును కాళ్లును బాగుగానున్నవి. ఏల శ్రీహరి ఆరాధింపబడడు. అట్లు శ్రీహరిని ఆరాధింపక ఇప్పుడు ఇక్కడ ఊరక మొరపెట్టిన ఏమిప్రయోజనము. ఎల్లపాపములను పోగొట్టునట్టి శ్రీహరిని రేలుంబగల్లు ధ్యానముచేయుండు. నేనును ఇక్కడ లోకనాయకుడైన ఆహరినామస్మరణమును చేసెదను. ఆనామస్మరణముచేత మీకు మేలుగలుగుటకు సంశయము లేదు.

నారకులమాటలు.—మామాపాపములచేత వేగుచున్న పాపాత్ములమైన మమ్ము పుణ్యపురుషుడవైన నీదేహముమీదుగా వచ్చుగాలి మిక్కిలి సుఖింపజేయుచున్నది. ఓ

వాయురాహ్లాదయత్యలమ్. అత్ర సంస్థియతాం బ్రహ్మన్ క్షణమప్యద్య నస్సుఖమ్, యథా భవతి ధర్మాత్మన్ దుఃఖాభిహతచేతసామ్. దర్శనేనాపి తే బ్రహ్మన్ సంజాతా తుష్టిరద్య నః, అహో దయా తవ బ్రహ్మన్ పాపిష్వపి హి జాయతే. యమః.—గచ్ఛ పుష్కర ధర్మాత్మన్ దృష్టా హి నరకాస్త్వయా, రోరూయతే హి తే భార్యా దుఃఖశోకపరిప్లుతా. పుష్కరః.-కథం గచ్ఛామి భగవన్ గత్వా వా తత్ర కిం సుఖమ్, శ్రూయంతే శృణు వాచోఽత్ర నారకాణామహర్నిశమ్. కింకరైర్హన్యమానానాం పతతామగ్నిసంచయే, రక్ష మాం రక్షరక్షేతి కేషాంచిచ్చాప్రియతే ధ్వనిః. యథా సమస్తభూతాత్మా విష్ణుస్సర్వేశ్వరో హరిః, ఆరాధ్యతే మయా నిత్యం తేన ముచ్యంతు నారకాః. యథా సర్వగతో విష్ణుః విష్ణౌ సర్వం ప్రతిష్ఠితమ్, తథా తేనాద్య సత్యేన సద్యో ముచ్యంతు నారకాః. కృష్ణాచ్యుత జగన్నాథ బ్రహ్మరుద్రేంద్రవందిత,

---

బ్రాహ్మణోత్తమా ! క్షణకాలమైన మాకు సౌఖ్యముగానుండును గాన ఇక్కడ ఉండుము. ఓ ధర్మాత్ముఁడవైన బ్రాహ్మణుఁడా! దుఃఖముచేత తపించుచున్న మాకు నీదర్శనము చేతనే ఇప్పుడు సంతోషము కలుగుచున్నది. ఔరా ! నీదయ పాపులమైన మాయందు గూడ కలిగెనుగా.

యమునిమాటలు.—ధర్మాత్ముఁడవైన ఓ పుష్కరుఁడా ! నీవు నరకము లెల్లను చూచితివికదా! ఇఁక భూలోకమునకు పొమ్ము. నీ పెండ్లాము దుఃఖముచేతను శోకముచేతను తపించి ఏడ్చుచున్నది.

పుష్కరునిమాటలు.—ఓ భగవంతుఁడగు యముఁడా! నేను భూలోకమునకు ఎట్లు పోదును. పోయినసుఖమేమి. కింకరులచేత కొట్టబడుచున్నవారును, నిప్పులలో బడుచున్నవారునునైన నారకులు మమ్ము రక్షింపుము మమ్ము రక్షింపుము అని మొరపెట్టునట్టిధ్వని వినఁబడుచున్నది చూడు. సమస్తభూతములలోను ఆత్మయైయుండువాఁడును, సర్వేశ్వరుఁడును, అంతట నిండుకొనియున్నవాఁడును నగు శ్రీమన్నారాయణుఁడు నాచేత ఏరూపముతో పూజింపఁబడెనో ఆరూపముతోవచ్చి యీనారకుల నెల్లను నరకముల నుండి విడిపించునుగాక. ఏ భగవంతునియందు సర్వమును ఉన్నదో, ఎవడు సర్వమునందు పొందియుండునో ఆవిష్ణుమూర్తి యిప్పుడే యీ నారకులనెల్లను విడిపించునుగాక. బ్రహ్మరుద్రుఁడు ఇంద్రుఁడు వీరిచేత సేవింపఁబడుచున్న ఓ లోకనాయకా ! ఓ కృష్ణా ! ఓ అచ్యుతా ! ఈ పీడింపబడుచున్న నారకులనెల్ల నరకములవలన నుండి విడిపించి రక్షింపుము.

పాహిసర్వానిమానార్తాక్ నరకే యాతనాగతాక్. వసిష్ఠః—శ్రుత్వా నామానితత్రస్థాః పుష్కరోక్తాని వై హరేః, నారకానరకాన్ముక్తా స్తత్క్షణా దేవపార్థివ. ఊచుశ్చపుష్కరం ప్రీత్యా యతోముక్తా స్తతోవయమ్,తస్మా త్తే కీర్తిరతులా లోకేవిస్తారమృచ్ఛతు.యమోఽతి విస్మయావిష్టః పుష్కరం ప్రాప్యపార్థివ, వరేణచ్ఛందయామాస జీవితేశః ప్రహృష్టధీః. మేదినీం ప్రాప్యధర్మాత్మక్ తిష్ఠ తత్రాపి సర్వదా, న విద్యతే భయంమత్త స్సుహృదామపి తేద్విజః. మాహాత్మ్యం తవయోప్యత్ర నిత్యం స్మరతి మానవః, అపమృత్యుభయం తస్య మత్ప్రసాదాన్నవిద్యతే. ఉక్తోవైవస్వతే నైవం పుష్కరో భువమేత్యసః, సమాస్తే పూర్వవత్స్వస్థః పూజయక్ పురుషోత్తమమ్. ఏతన్మయోపదిష్టంతే పుష్కరస్య మహాత్మనః, మాహాత్మ్యం సంస్మరేద్యస్తు సద్యః పాపక్షయోభవేత్. ముక్తిశ్చ నరకాద్విష్ణోర్నామ సంకీర్తనాదిహా, యథాహి జాయతే విద్వాక్ తథోక్తంచ

---

**వసిష్ఠునిమాటలు.**- ఓదిలీపమహారాజా! అక్కడ నరకములందున్న పాపులు అందరును పుష్కరునిచేత పలుకబడిన శ్రీవిష్ణునామములను విని ఆక్షణమందే నరకములనుండి విడువబడినవారలై, ఓమహాత్మా! నీయనుగ్రహామువలన పాపులమైన మేము నరకములనుండి విడువంబడితిమి. కాఁబట్టి యీడులేనిదియుం స్వచ్ఛమైనదియుం నైన నీకీర్తిలోకమునందు ఎల్లయెడల వ్యాపించునుగాక యని పుష్కరునిగూర్చి పలికిరి. అందులకు యముధర్మరాజు మిక్కిలి ఆశ్చర్యమును పొందినవాఁడును సంతోషించిన మనసుగలవాడునునై పుష్కరునిజూచి నీకుకావలసిన వరమునుకోరుము ఇచ్చెదను, అని చెప్పి, ఓధర్మాత్ముడవైన పుష్కరుడా! నీవు భూలోకమునకుపోయి సుఖముగా నుండుము. నావల్లనగుభయము నీకు లేకపోవుటయేగాక నీమిత్త్రులకు సైతము లేకపోవును. ఏమానవుడు ఎల్లప్పుడు నీమహిమను తలచుచుండునో వానికి నాయనుగ్రహామువలన అపమృత్యువు కలుగదు. అని యిట్లు చెప్పి యముఁడు పంపఁగా పుష్కరుఁడు భూలోకమునకు వచ్చి మునుపటివలె శ్రీహరినారాధించుచు నెమ్మదిగా నుండెను. ఓరాజా! ఈపుణ్యాత్ముఁడైన పుష్కరుని చరిత్రమును నాచే నీకు చెప్పఁబడెను. ఇట్టి యీపుష్కరచరిత్రమును ఎవడుతలచునో వానిపాపములు అప్పుడే నశించిపోవును. ఇప్పుడు విష్ణునామసంకీర్తనమువలన నారకులు నరకములవలననుండి విడుదలయైనవృత్తాంత మంతయుం నీకు తెలియఁ జెప్పితిని. ఇట్లు భగవంతుని నామములను తలచుటవలనిఫలము ప్రత్యక్షముగా తోచుచుండఁగా ఆప్రధానపురుషుని నామములను స్మరించుటచేత అనేకజన్మములందు

తవానఘ. స్వల్పాపినామస్మృతిరాదిపుంసః క్షయంకరోత్యాహితపాప రాశీన్, ప్రత్యక్షతః కింపునరత్రదృష్టం సంకీర్తితే నామ్ని జనార్దనస్య.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే
పుష్కరస్య నారకవిమోచనంనామ
ఏకాదశోఽధ్యాయః.

---

## ద్వాదశోఽధ్యాయః.

వసిష్ఠః.—శృణుద్విజకుమారస్య రామరాష్ట్రనివాసినః,పునరాగమనంతస్య యమలోకాద్భూపిమితే. అయోధ్యానామ నగరీ సర్వలక్షణ సంయుతా,త్రిషులోకేషు విఖ్యాతాసూర్యాన్వయవివర్ధనీ.ఆసీన్నరవరో రామస్తస్యాంవై భ్రాతృభిస్సహ,ప్రముమోదసుఖీరాజ్యంధర్మేణ పరిపాలయన్.తతఃకతిపయాహస్సు గతేషుజరఠోద్విజః,శవంబాలముపాదాయ రాజద్వారముపాగమత్. రుదన్ బహువిధావాచ స్నేహాక్షరసమన్వితాః, అసకృత్పుత్రపుత్రేతి వాక్యమేతదువాచసః కిన్నుమేదుష్కృతం

---

సంపాదింపబడిన పాపములు తొలగునని మరల చెప్పనేల? అది తనంతటనే స్పష్టమగుచున్నది.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు పుష్కరుఁడు
నారకులను నరలకములనుండి విడిపించుటను తెలుపునట్టిదైన
పదునొకండవ అధ్యాయకథ.

---

## పండ్రెండవ యధ్యాయము.

వసిష్ఠమహాముని మాటలు.—ఓదిలీపమహారాజా! రాముని రాజ్యమునందు వాసముచేయుచున్న బ్రాహ్మణునికొమరుడు యమలోకమునుండి మరల వచ్చినకథను చెప్పెదను వినుము. సకల శుభలక్షణములతోను గూడినదియు, మూడులోకములందు ప్రసిద్ధి పొందినదియు, సూర్యవంశపురాజులచేత వర్ధిల్లునదియు నైన అయోధ్యాపట్టణమునందు శ్రీరాముఁడు రాజై తన తమ్ములతోడ రాజ్యమును పాలించుచుండఁగా, ఒకముసలి బ్రాహ్మణుఁడు చనిపోయిన బాలుని శవమును రాజద్వారమునకు తెచ్చిపెట్టుకొని ప్రేమను దెలుపునట్టి మాటలుచెప్పి యేడ్చుచు తనకుగల కొడుకు వాఁడు ఒకఁడే కనుక

కర్మ పూర్వదేహాంతరే కృతమ్, యదహం పుత్త్రమేకం త్వాం పశ్యామి నిధనంగతమ్. అప్రాప్తయౌవనం బాలం పంచవర్షసమన్వితమ్, అకాలే కాలమాపన్నః దుఃఖాయమమనందనః. నస్మరామ్యుక్తమనృతం నచహింసాంస్మరామిచ, సర్వేషాంప్రాణినాం పాపం నకదాచిన్నవిద్యతే. కేనమే దుష్కృతేనాద్య బాలఏవమమాత్మజః, అకృత్వా పితృకార్యాణి గతో వైవస్వతక్షయమ్. రామస్య దుష్కృతం కించి న్మహాదస్తినసంశయః, రాజద్వారే మరిష్యామి పత్న్యాసార్థ మనాథవత్. భ్రాతృభిస్సహితో రాజా దీర్ఘమాయురవాప్నుయాత్, రాజదోషై ర్విపద్యంతే ప్రజాహ్యవిధిపాలితాః. అసద్వృత్తేహి నృపతా వకాలే మ్రియతేజనః, సువ్యక్తం రాజదోషోయం భవిష్యతి నసంశయః. ఏవం బహువిధై ర్వాక్యై ర్నిందమానోముహుర్ముహుః, రాజానందుఃఖసంతప్త స్సుతంతమభిగూహతి. తథానుకరణం తస్య ద్విజస్య పరిదేవనమ్, శుశ్రావ రాఘవస్సర్వదుఃఖశోకసమన్వితః. సుదుఃఖేనాభిసంతప్తో మంత్త్రిణస్సము

కొడుకాకొడుకా అని పిలుచుచు ఈవిధముగా పలికెను. నేను పూర్వజన్మమునందు ఎటువంటి పాపమును జేసితినో ఆపాపఫలమువలన నేను ఊగదెలియనివాఁడవును అయిదేండ్ల ప్రాయముగలవాఁడవును అయిన నిన్ను చావగా జూచుచున్నాను. నాకు దుఃఖము కలుగుటకై కాలముగానికాలమునందు నాకొడుకు చనిపోయెను. నేను అబద్ధమును తలపను పలుకను, ప్రాణులను హింసింపను, హింసింపఁదలపను. ఏప్రాణుల యొక్క పాపమును ఏమాత్రమును నాయందు లేదు. ఏపాపముచేతనో ఇప్పుడు నా కొడుకు నాకుచేయవలసిన పితృకార్యములను చేయక పసివాఁడైయే యమపట్టణమును బొందెను. రామునిదైన పాపము ఏమాత్రమో విశేషించియున్నది. అందులకు సంశయము లేదు. నేను దిక్కుమాలినవానివలెనే నాభార్యతోడ రాజునగరివాకిటబడి చనిపోయెదను. రాజైనరాముఁడు తమ్ములును దానును దీర్ఘాయుష్మంతుఁడై బ్రతుకనిమ్ము. ప్రజలు రాజ్యపరిపాలనములేని రాజుయొక్కదోషముచేతనే నాశము పొందుదురు. రాజు మంచినడవడి లేనివాఁడు అగునెడ జనులు అకాలమునందు చచ్చిపోదురు. ఈబాలమరణదోషము రాజుదే యని స్పష్టముగా తోఁచుచున్నది. సందేహము లేదు. ఈవిధముగా ఆబ్రాహ్మణుఁడు అనేకవిధములైన మాటలుచెప్పి రాజును నిందించుచు చనిపోయిన కొడుకుపై గుడ్డకప్పి పరితపించుచుండెను. ఇట్లు చెప్పి, చెప్పి ఏడ్చుచున్న ఆబ్రాహ్మణుని మొరనువిని శ్రీరామదేవుఁడు మిక్కిలి విచారమును పొందినవాఁడై పరితపించుచు తనమంత్రులనెల్లను సమ్ముఖమునకు పిలిపించుకొనెను. అప్పుడు

పాహ్వాయత్. తతోవైమంత్రిభిస్సార్ధ మష్టావిప్రాప్రవేశితాః, మార్కండేయోథమౌద్గల్యో వామదేవశ్చ కాశ్యపః. కాత్యాయనోథ జాబాలి ర్గౌతమో నారద స్తథా, ఏతే ద్విజర్షభాస్సర్వే చాసనేషూపవేశితాః. తేషాంసముపవిష్టానాం సర్వేషాం దీప్తతేజసామ్, రాఘవస్సర్వమాచష్ట ద్విజోయముపరోదితి. తస్యతద్వచనంశ్రుత్వా రాజ్ఞోదీనస్య నారదః, ప్రత్యువాచ తతోవాక్యం మునీనాం సన్నిధౌనృపమ్. శృణు రాజన్యథా కాలే ప్రాప్తోయంబాలసంక్షయః, శ్రుత్వా కర్తవ్యతాం రామ కురుష్వ రఘునందన. పురా కృతయుగే రామ బ్రాహ్మణావై తపస్వినః, అబ్రాహ్మణ స్తతోరాజన్నతపస్వీకథంచన. త్రేతాయుగేప్యవర్తంతే బ్రాహ్మణాః క్షత్రియాశ్చయే, తతోతప్యంతతేసర్వే శుశ్రూషామపరేజనాః. తతో ద్వాపరసంజ్ఞాతే తపోవైశ్యాన్ సమావిశేత్, యుగేషుత్రిషు రాజేంద్ర ధర్మంచక్రుర్ద్విజాతయః. భవితా శూద్రయోన్యాంహితపశ్చర్యాకలౌ యుగే, నశూద్రో లభతేధర్మ ముగ్రం తప్త్వా నరర్షభ. ఏకోవిషయప ర్యంతే తవరాజన్మహాత్తపః, శూద్రస్తప్యతి దుర్బుద్ధిస్తేన బాలవధోహ్య

---

ఆమంత్రులతోగూడ మార్కండేయుఁడు, మౌద్గల్యుఁడు, వామదేవుఁడు, కశ్యపుఁడు, కాత్యాయనుఁడు, జాబాలి, గౌతముఁడు, నారదుఁడు అనుసీయెనమండ్రు బ్రహ్మఋషులునువచ్చి తమతమకు తగినపీఠములందు గూర్చుండిరి. అట్లు కూర్చుండి మిక్కుటమైన తేజస్సులతో వెలుగుచున్న మహామునులను జూచి, నగరివాకిట బ్రాహ్మణుఁడు ఏడ్చుచున్నాఁడే అందులకు కారణము, ఏమియని శ్రీరామచంద్రుఁడు అడిగెను. అడుగగా నారదుఁడు రామునిదీనత్వముతోడి ప్రశ్నమునకు తగిన యుత్తరము చెప్పగలవాడై ఆమునులయెదుట, ఓరాజోత్తమా! అకాలమునందు ఈబాలుఁడు చనిపోయినందులకు గలకారణమును చెప్పెదను వినుము. చెప్పునట్టివిషయమును విని పిమ్మట అందులకు తగినఆలోచన చేయుము. మునుపు కృతయుగమునందు బ్రాహ్మణులే తపస్సుచేయుదురు. బ్రాహ్మణుఁడు కానివాఁడు ఎంతమాత్రము తపస్సుచేయఁడు. త్రేతాయుగమునందు బ్రాహ్మణులును క్షత్రియులును తపస్సుచేయుదురు. వారికంటె ఇతరులైన వైశ్యశూద్రులు వారికి శుశ్రూషలుచేయుచుందురు. పిమ్మట ద్వాపరయుగమునందు వైశ్యులుకూడ తపస్సుచేయుదురు. ఇట్లు మూఁడుయుగములందును ద్విజాతులనఁబడు బ్రహ్మక్షత్రియవైశ్యులు ధర్మమును నడపగా కలియుగమునందు శూద్రులుకూడ తపస్సుచేయుదురు. శూద్రుఁడు ఉగ్రముగా తపస్సుచేసియును అందులఫలమునుమాత్రముపొందనేరఁడు. కనుక ఇప్పుడు నీవు ఏలునట్టిదేశమునందు ఎక్కడనో ఒకశూద్రుఁడు దుర్బుద్ధియై తపస్సుచేయుచున్నాఁడు,

యమ్. యోహ్యధర్మంచకురుతే విషయే పార్థివస్యహి, కరోతి నృపశా ర్దూల పురేవాదుర్మతిర్నరః. తీవ్రంసనరకంయాతి సచరాజానసంశయః, సత్యంపురుషశార్దూలమార్గస్వవిషయంసుఖమ్. దుష్కృతం యత్ర పశ్యే థాస్తత్ర యత్నం సమాచర, ఏవంతే ధర్మవృద్ధిశ్చ నృణాం చాయు ష్యవర్ధనమ్. భవిష్యతి నరవ్యాఘ్ర బాలశ్చాయంహి జీవతి, నారద స్యతుతద్వాక్యం శ్రుత్వామృతమయంతదా. ప్రహర్ష మతులంలేభే లక్ష్మ ణం చేదమబ్రవీత్, బాలస్యతుశరీరంతు తైలద్రోణ్యాం నిధాయచ. య థానశీయతేబాల స్తథాసౌమ్యవిధీయతామ్, ఏవంసందిశ్య కాకుత్స్థో లక్ష్మణం శుభలక్షణమ్. మనసాపుష్పకంధ్యాయదాగచ్ఛేతిమహాయశాః, ఆజగామ ముహూర్తేన సమీపం రాఘవస్య తత్. అభివాద్య మునీం స్తాంస్తు విమానం సోధ్యరోహత, ధనుర్గృహీత్వా తూణీరే ఖడ్గంచ రుచిరప్రభమ్. ప్రాయాత్ప్రతీచీమమలాం విచిన్వంశ్చ సమంతతః, ఉత్తరా మగమచ్ఛ్రీమా దిశం హిమవదావృతామ్. అపశ్యమానస్తత్రాపి స్వల్పీయోపిచ దుష్కృతమ్, పూర్వామపి దిశం సర్వా మసౌపశ్య న్న

---

ఆకారణముచేత ఈబాలుడు మృతిపొందెను. తానేలు నట్టిదేశమునందు గాని పట్టణమునం దుగాని ఎవఁడు ఏపాపముచేసినను అది రాజుదేగాని వేరుకాదు. కనుక ఆపాపమువలన పట్టణమును ఏలునట్టి రాజు శీఘ్రముగా నరకమును పొందును. కాబట్టి నీవు ఇప్పుడు నీదేశమునందు ఏచోట అట్టిదోషముగలిగియున్నదో దానిని చక్కగా వెదకించి తెలిసి కొనుటకు తగినయత్నముచేయుము. ఇట్లు చేసినయెడల పుణ్యము పెరుగును. ప్రజలకు ఆయుస్సు హెచ్చును. ఈబాలుడును బ్రదుకును. అనియిట్లు నారదుడుచెప్పిన అమృత మువంటి మాటలు విని మిక్కిలి సంతోషించినవాడై రాముడు లక్ష్మణునిజూచి, ఓయీ లక్ష్మణా! ఈబాలకుని దేహము చెడక యుండునట్లు నూనె కొప్పెరయందు పెట్టింప వలసినది. అని లక్ష్మణునికి ఉత్తరువుచేసి తనమనసులో పుష్పకవిమానము రావలెనని తలచెను. తలపగానే ఒకముహూర్తకాలములో పుష్పకము వచ్చి యెదుటనిలిచెను. అం తట రాముడు ఆమునులకు నమస్కరించి వారిచేత సెలవుపుచ్చుకొని పుష్పకముపై నెక్కి ధనుస్సును అమ్ములపొదులను మూపునధరించి తళతళలాడుచున్న పట్టాకత్తిని చేత పుచ్చుకొని పడమటి దిక్కునుగూర్చి వెడలి ఆదిక్కునందు ఎల్లయెడల వెదకి, హిమ వత్పర్వతముచే జుట్టుకోబడిన ఉత్తరపుదిక్కునకు మరలి అందునుకొంచెమైనదోషమును కనిపట్టలేక తూర్పుదిక్కునకుపోయి సందుగొందులనెల్ల వెదకిచూచి, అందుండి నిర్మ లమై అద్దమువలె ఎల్లవృత్తాంతములను కనబరచునట్టిదైన దక్షిణపుదిక్కునజేరి అచ్చటి

రాధిప, ప్రవిశుద్ధ సమాచారా మాదర్శతల నిర్మలామ్. దక్షిణాం దిశ మాక్రమ్య తతో రాజర్షినందనః, సశైలస్యోత్తరేపార్శ్వే దదర్శసుమహా త్సరః. తస్మిన్సరసి తప్యంతం తాపసం సుమహత్తపః, దదర్శ రాఘవశ్శ్రీ మాన్ లంబమానమధోముఖమ్. రాఘవస్తముపాగమ్య తప్యంతం తప ఉత్తమమ్, ఉవాచచ తతో వాక్యం ధర్మస్త్వమసి సువ్రత. బ్రాహ్మణో వాసిభద్రంతే క్షత్రియోవాసి దుర్జయః, వైశ్యోవా యదివా శూద్ర స్సత్యమేవ బ్రవీహి మే. కౌతూహలాత్త్వాం పృచ్ఛామి రామోదాశర థిర్హ్యహమ్, తస్యతద్వచనంశ్రుత్వా రామస్యాక్లిష్టకర్మణః. అవాక్ఛిరా స్తథాభూత్వా వాక్యమేత దువాచహ, శూద్రం మాం విద్ధి కాకుత్స్థ శంబుకంనామనామతః. దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశాః, వదతస్తస్య శూద్రస్య ఖడ్గంతు రుచిరప్రభమ్. వికృష్య కోశాద్విమలం శిరశ్చిచ్ఛేద రాఘవః, తస్మిన్ శూద్రే హతే దేవా స్సేంద్రాస్సాగ్నిపురోగ మాః. సాధుసాధ్వితి కాకుత్స్థం ప్రశశంసు ర్ముహుర్ముహుః, సుప్రీతా శ్చాబ్రువన్ దేవాః రామం సత్యపరాక్రమమ్. సురకార్యమిదం సౌమ్య సుకృతంతే మహామతే, గృహాణత్వంవరం రామ యత్త్వమిచ్ఛస్యరిందమ.

---

కొండలయుత్తరపార్శ్వమునందు ఒకపెద్దసరస్సునుజూచి దానియందు పాదములుపైకెత్తుకొని తలక్రిందుగావ్రేలుచు ఘోరమైనతపస్సుచేయుచున్నవాని నొకనిఁజూచి వాని దగ్గరపోయి ఓయిపుణ్యాత్ముడా! నీవెవరు, బ్రాహ్మణుడవా? క్షత్రియుండవా? వైశ్యుడవా? లేక శూద్రుడవా? నాతో నిజముచెప్పుము. నిన్నుజూచినమూర్తిమత్తయినధర్మమువలెనున్నావు. నీవృత్తాంతమును వినగోరి నిన్ను అడుగుచున్నాను. నేను దశరథునికొడుకును. రాముడు అనువాడను. అని యిట్లు అడుగుచున్న రామునిమాటలనువిని దక్షిణపు దిక్కునకు తలనుమళ్లించి ఆతపస్సుచేయువాఁడు ఇట్లు పలికెను. ఓరాఘవా! నేను శూద్రుడను. నాపేరు శంబుకుడు. ఈదేహముతోనే దేవత్వమునుపొందగోరియిట్లు తపస్సు చేయుచున్నాను అనెను. ఆమాట చెవినిసోకగానే రాముడు తళతళమెరయుచున్నట్టి పట్టాకత్తిని ఒరనుండిదూసి ఆశూద్రునితల కరుక్కున నఱికెను. అట్లు నఱకబడి శూద్రుడు చనిపోవుచుండగా యింద్రుడు మొదలుగాగల దేవతలందరు అగ్నిహోత్రుని ముందుంచుకొనివచ్చి రామచంద్రా మేలుమేలు అని మాటిమాటికి శ్లాఘించుచు సంతోషముతో ఇట్లనిరి. సాధువృత్తిగల ఓరాఘవా! ఇది దేవకార్యము. నీవు మేలైనది. శత్రుసంహార

దేవానాంభాషితం శ్రుత్వా రాఘవస్సుసమాహితః, ఉవాచ ప్రాంజలిర్వాక్యం సహస్రాక్షపురోగమాః. యస్మిన్మహూర్తే కాకుత్స్థ శూద్రోయంవినిపాతితః,తస్మిన్ ముహూర్తే విప్రోఽసౌ జీవేనసముయుజ్యత, స్వస్తి ప్రాప్నుహి భద్రంతే సాధు యాస్యామహే వయమ్. ఇత్యుక్త్వా ప్రయయుర్దేవా రామోపి స్వపురంయయౌ, దృష్ట్వా ద్విజసుతం తత్ర లబ్ధప్రాణం నిరామయమ్. ప్రహర్షమతులం లేభే సానుజో రాఘవస్తదా, సుహృష్టా స్సుఖినో విప్రాః ప్రశశంసుశ్చ రాఘవమ్. అహో ధన్యోసి రాజేంద్ర యత్తే ధర్మమతిర్దృఢా, ధర్మధీర్దుర్లభానౄణాం విశేషేణ మహీభృతామ్. క్షత్రియోయ స్స్వధర్మేణ పృథివీమనుశాస్తివై, సలోకే లభతే వీరో యశఃప్రేత్యచ సద్గతిమ్. బ్రహ్మణ్యశ్శాస్త్రవిచ్చాపి శూరశ్చ త్వం రఘూద్వహా, అప్రమత్త స్సదాదక్షః పృథివీం పరిపాలయ. ఏవం సంప్రార్థితో విప్రైః రామోరాజ్యమపాలయత్, బాలేన తే

కుడవైన రామచంద్రా! నీకు వలసినవరము నడుగుము ఇచ్చెదము అనగా, రాఘువుడు ఆదేవతలమాటలను విని సెమ్మది నొందినవాడై చేతులుమోడ్చి దేవేంద్రుడు మొదలగు వారితో ఓదేవతలారా మీకు నాయందు అనుగ్రహముకలిగియున్నయెడ ఆబ్రాహ్మణ కుమారుఁడు బ్రతుకునట్టుగా వరముదయచేయుఁడు. ఇదేనాకు ఇష్టమైనవరము అనగా దేవతలు విని ఎప్పుడు నీచేత శూద్రుడు నరకబడెనో అప్పుడే బ్రాహ్మణకుమారుడు బ్రతికినాడు. నీకు మేలుకలుగుగాక. మేము పోయివచ్చెదము. అనిచెప్పి దేవతలు తమ లోకమునకు పోయిరి. రాముడు తన పట్టణమునకుపోయి అచ్చట ప్రాణములువచ్చి యే రోగమునులేకయుఁన్న బ్రాహ్మణకుమారుని జూచి తనతమ్ములును తానును మిక్కిలి సంతోషమును పొందినవాఁడయ్యెను. బ్రాహ్మణులందరును చాలసంతోషించినవారై ఓరారాజశ్రేష్ఠుఁడా! నీధర్మబుద్ధి యెంతదృఢమైనది? మానవులకు ఇట్టిధర్మబుద్ధి కలుగుట దుర్లభము. అందును రాజులకు కలుగుట మిక్కిలి దుర్ఘటము. ఏరాజు ధర్మముతప్పక రాజ్యమునేలునో ఆరాజు వీరుడును మంచికీర్తిని సద్గతిని పొందువాడును అగును. వేదమునందు చెప్పబడిన ధర్మములను నడపువాడవును శాస్త్రార్థములను ఎరిగినవాడవును శూరుడవును మరాకులేనివాడవును సమర్థుడవునునై భూమిని పాలింపుము. అని యిట్లు బ్రాహ్మణులు పొగడుచుండగా శ్రీరాముడు రాజ్యమేలెను. బ్రాహ్మణుడును పసివాడైన కొడుకును వెంటబెట్టుకొని తనయింటికిపోయెను. అని యిట్లు వసిష్ఠుఁడు ప్రీతినొందిన

నశిశునా బ్రాహ్మణస్స్వగృహం యయౌ. వసిష్ఠః. గతానోర్ద్విజపుత్రస్య పునరాగమనంమయా, ఉక్తంశృణుష్వకృష్ణస్య గురుపుత్రసమాగమమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, శ్రీరామకృత మృత బ్రాహ్మణపుత్రజీవితకథనంనామద్వాదశోఽధ్యాయః.

---

## త్రయోదశోఽధ్యాయః.

అవంతీపురమిత్యస్తి ద్విజబృందసమాకులమ్, నదీనదసమాయుక్తం నానావృక్షోపశోభితమ్. యోజనాయామవిస్తారం ధనధాన్యసమాకులమ్, వేదశాస్త్రార్థతత్వజ్ఞైర్మహద్భిశ్చవిరాజితమ్. తస్మిన్నేవపురేరమ్యే సాందీప ఇతివిశ్రుతః, ప్రఖ్యాతగుణసంపన్న స్స్వాశ్రమాచారతత్పరః సర్వలక్షణసంపన్నో వేదవేదాంగపారగః, సత్యవాగనసూయశ్చ శౌచాదిగుణసంయుతః. మితాశీమితదృష్టిశ్చ మితవాక్యోమితప్రభః, జితేం

---

బ్రాహ్మణకుమారుఁడు యమలోకమునుండి మరల వచ్చినకథను చెప్పి, ఇక కృష్ణుని గురువైన సాందీపునికొడుకుయొక్క రాకను చెప్పెదను వినుమనెను.

ఇది శ్రీ పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు శ్రీరాముడు చచ్చిన బ్రాహ్మణకుమారుని బ్రతికించువిధమును తెలుపునట్టిదైన పండ్రెండవ అధ్యాయకథ.

---

## పదుమూఁడవ యధ్యాయము.

అవంతియని యొకపట్టణము గలదు. అదిబ్రాహ్మణసమూహములచేత నిండుకొన్నదియు, ఏర్లతోను పడమరగా పారునట్టియేర్లతోను గూడినదియు, పలు తెరగుల వృక్షములచేత అందగించునదియు, ఆమడ వెడలుపును ఆమడనిడివియు గలదియు, ధనములతోను ధాన్యములతోను నిండుకొన్నదియు, వేదములయు శాస్త్రములయు అర్థములను సమర్థముగా నెరిగిన పెద్దలచేత వెలుఁగునదియునై యుండును. అటువంటియాపట్టణమునందు సాందీపుడుఅనుబ్రాహ్మణుడొకడుకలడు. ఆయనపొగడదగినమంచిగుణములు గలవాడును తాను అవలంబించియుండు గృహస్థాశ్రమమునందు నడపదగినఆచారములను క్రమముగా నడపువాడును, ఎల్లశుభలక్షణముల కలిమిగలవాడును, వేదములను వేదాంగములను తుదముట్ట చదివినవాడును, నిజముపలుకువాడును, అసూయలేనివాడును, శుచిత్వము మొదలైన గుణములతోగూడుకొన్నవాడును, మితమైన ఆహారమును మితమైన చూపును మితమైన మాటలును అమితమైన తేజస్సునుగలవాడును, ఇంద్రియనిగ్రహము చేసినవాడును, కోప

ద్రియో జితక్రోధ స్తపోధ్యయనతత్పరః. దేవద్విజగురూణాంచ పూజక శ్చదృఢవ్రతః. స్థిరబుద్ధిః స్థిరారంభః శాంతశ్శాంతః ప్రసన్నధీః, సర్వభూత హితైషీచ సర్వదోషవివర్జితః.తస్మిన్నవంతినగరే సకుటుంబో వసచ్చిరమ్ కాలేన తస్య సంజాతః పుత్రోవంశవివర్ధనః. కుమార స్తస్య మతిమాన్ చంద్రబింబసముద్యుతిః, లాలితో వవృధే మాత్రా పితు రానందవర్ధనః. కృతోపనయన స్సోథ విద్యాంజగ్రాహ బాలకః, కదాచిన్మాఘమాసేతు ప్రభాతేపౌర్ణిమాతిథౌ, సబ్రహ్మచారిభిస్సార్థం ప్రభాసేస్నాతుమభ్యగాత్, తత్రాచమ్యవిధానేన జలమధ్యేస్థితో జపత్.కృష్ణాచ్యుతనిమజ్జామిప్రభాతేస్మిన్ శుభోదకే, అనేన మాఘస్నానేన సుప్రీతో మాం సముద్ధర. ఇత్యుదీర్య జలేమగ్న స్సవయోభిస్సహైవతు, తీరమారురుహుస్స్నాత్వాతేసర్వేవిప్రబాలకాః.సాందీపస్యకుమారోయం నకదాచిత్సముత్థితః, సుహృదోస్య సమాగత్య తయోః పిత్రోర్న్యవేదయన్.కృష్ణాచ్యుత నిమజ్జామి ప్రభాతేస్మిన్ శుభోదకే,అనేనమాఘస్నానేన సుప్రీతోమాంసముద్ధర. ఇత్యుక్త్వా వస్సుతోమగ్నో జలేన పునరుత్థితః, ఇత్యాకర్ణితమాత్రేణ

---

మును గెలిచినవాఁడును, తపస్సునందును వేదమును చదువుటయందును ఆసక్తుఁడైన వాఁడును, దేవతలను బ్రాహ్మణులను గురువులను పూజించువాఁడును, దృఢమైన నియమము గలవాడును, నిలుకడైన బుద్ధిగలవాడును, మానని ప్రయత్నము గలవాడును, ఓర్పు గలవాడును, నెమ్మదిగలవాడును, దేటయైనబుద్ధిగలవాడును, ఎల్లప్రాణులకు మేలుగోరువాడును, ఎల్లదోషములచేతను విడువబడినవాడునునై కుటుంబముతోడ ఆయవంతిపట్టణమునందు చిరకాలము వాసముచేయుచుండెను. ఆకాలమునందు ఆయనకు వంశమును వృద్ధిపొందించువాడును బుద్ధిమంతుడును చంద్రబింబమువలె వెలుగునట్టివాడును నైన కొమారుడు ఒకడు కలిగెను. ఆకొమారుడు తల్లిలాలనచేసిపెంపగా తండ్రికి సంతోషమును పెంచువాడై పెరుగుచు ఉపనయనముకాగా ఎల్లవిద్యలను చదివెను. అట్టియాబాలుఁడు ఒకానొక మాఘమాసమునందు పున్నమనాటి తెల్లవారి తనతోడి బ్రహ్మచారులతోగూడ ప్రభాసతీర్థమునందు స్నానముచేయబోయి అందు ఆచమనముచేసి శాస్త్రమునందు చెప్పబడినవిధమున నీటినడుమనిలిచి "ఓకృష్ణా! అచ్యుతా! నేటితెల్లవారి యీపుణ్యజలమునందు స్నానము చేయుచున్నాను. ఈమాఘస్నానముచేత నీవు సంతుష్టినొందినవాడవై నన్ను ఉద్ధరింపుము" అను నీయర్థముగల మంత్రమునుచెప్పి తనచెలికాండ్రతోడ నీళ్లలోమునిగెను. అనంతరము ఆబాలకులందరు స్నానముచేసి గట్టెక్కిరి. సాందీపునికొడుకుమాత్రము మునిగినవాడు లేవకపోయెను. ఆసమాచారమును వానిస్నేహితులైన ఆచిన్నవాండ్రు వచ్చివానితల్లిదండ్రులతో చెప్పిరి. ఈమాటలను విన్నమాత్ర

తస్మాత్తాన్యపతద్భువి. శనైరాశ్వాసితా తస్య మాతా బంధుభిరుత్థితా, పునః ప్రభాస ముద్దిశ్య పర్యధావత దుఃఖితా. ముహురుత్పతితా సాధ్వీ ముహుఃపతితవిహ్వలా, ముహురాలీయ్య తేశోకా స్మృహుః క్రోశతి రోదతి. సా తీవ్రశోకసంతప్తా విలలాపాకులేంద్రియా, సాందీపనస్తు భగవాన్ సంతశ్శోకం నిగృహ్యాచ. తస్య మిత్రాణి చాహూయ శుశ్రావచ పునః పునః, కథంకథంను తేనోక్తం కథ్యతాంచ పునః పునః. కృష్ణాచ్యుత నిమజ్జామి ప్రభాతేస్మిన్ శుభోదకే, అనేనమాఘస్నానేనసుప్రీతో మాం సముద్ధర. పద్యమేతత్పఠన్ శశ్వత్స్వస్థచిత్తో భవన్మునిః, శ్లోకార్థోనవృథా భూయాత్కృష్ణఏవ సరక్షతు. ఇతి భార్యాం సమాశ్వాస్య సుఖేనన్యవ సచ్చిరమ్, అథశూరసుతో రాజన్ పుత్రయోస్సమకారయత్. పురోధసా బ్రాహ్మణేన యథావ ద్ద్విజసత్కృతిమ్, తేభ్యోదాద్దక్షిణాగావో రుక్మమాలాస్వలంకృతాః. అలంకృతేభ్యస్సంపూజ్య సవత్సాః క్షౌమమాలినీః, యాఃకృష్ణరామజన్మర్క్షే మనోదత్తా మహామతిః. తాశ్చ ప్రాదాదనుస్మృత్య కంసేనాపహృతాః పురా, తతశ్చలబ్ధసంస్కారౌ ద్విజత్వంప్రా

---

ముచేతనే ఆబాలకునితల్లి మేనుమరచి నేలఁబడెను. అప్పుడు చుట్టుపక్కములందరువచ్చి తగిన యుంపచారములుచేసి ఆమెను లేవనెత్తిరి. అంతట ఆమె కొడుకును తలచుకొని మాటిమాటికి పడుచు లేచుచు ప్రభాసతీర్థమునుగూర్చి పరుగెత్తుచు పరవశత్వమును పొందుచు శోకమునందుమునిగి మాటిమాటికి ఎన్నువలుపెట్టుచు ఏడ్చుచు కలతనొందిన యింద్రియములుగలదై (మనసునందు కలవరము నొందినదై) తపించుచుండెను. ఆపిన్న వానితండ్రియగు సాందీపనుడు సద్గుణసంపత్తిగలవాడు గనుక దుఃఖమును లోపల అణచుకొని పిన్నవానిచెలికాండ్రను పిలిచి ఎట్లు ఎట్లు మావాడు స్నానముచేసినవిధమును చెప్పుడు అని పలుమారుఅడిగి వారు అతడు స్నానముచేయునప్పుడుచెప్పినమంత్రమును చెప్పి ఈశ్లోకమును చెప్పుచుమునిగెను. అని చెప్పగా విని దానిని తానుచదువుకొనుట చేత మనసునందలి కలవరమును పోగొట్టుకొని ఆశ్లోకార్థము వ్యర్థముకాకుండ శ్రీకృష్ణుడే వానిని రక్షించును గాక అని చెప్పి భార్యను ఓదార్చి చిరకాలము సుఖముగానుండెను. ఓరాజా! పిమ్మట శూరుని కొడుకైన వసుదేవుడు తన కొడుకులైన కృష్ణబలరాములకు తనపురోహితునిచేతను తక్కిన బ్రాహ్మణులచేతను యథావిధిగా ఉపనయనము చేయించి ఆబ్రాహ్మణులకు దక్షిణగా బంగారు సరిపెణలచేత అలంకరింపబడిన గోవులను ఇచ్చెను. అంతేకాదు మునుపు బలరాముడు పుట్టినప్పుడును కృష్ణుడుపుట్టినప్పుడును కంసునిచేత అపహరింపబడినవై తనమనసులో దానము చేయబడినగోవులు ఎన్నిగలవో వాని నన్నిటిని వస్త్రములచేతను పువ్వుదండలచేతను అలంకరించి అట్లుఅలంకరించుచున్న

వ్యసువ్రతౌ, గర్గాద్యదుకులాచార్యాద్గాయత్రీవ్రతమాస్థితౌ. ప్రభవౌ సర్వవిద్యానాం సర్వజ్ఞౌ జగదీశ్వరౌ, నాన్యసిద్ధామలం జ్ఞానం గ్రాహమానౌ నరేశ్వరౌ. అథో గురుకులేవాస మిచ్ఛంతావధిజగ్మతుః, కాశ్యాం సాందీపనం నామ అవంతీపురవాసినమ్. తమేవాసాద్య తౌ దాంతౌ గురువృత్తి మనిందితామ్, గ్రాహయంతౌ ప్రభౌ పాదౌ భక్త్యా దేవ మివావృతౌ. తయోర్ద్విజవరస్తుష్ట శ్శుద్ధభావానువృత్తిభిః, ప్రోవాచ నిఖిలాన్వేదా న్సాంగోపనిషదో గురుః. సరహస్యం ధనుర్వేదం ధర్మం న్యాయంయథాతథా, తథాచాన్వీక్షికీంవిద్యాం రాజనీతించతద్విధామ్, సర్వం తదమరశ్రేష్ఠౌ సర్వవిద్యాప్రవర్తకౌ, సకృన్నిగదమాత్రేణ తౌ సంజగృహాతుర్నృప. అహోరాత్రై శ్చతుష్షష్ట్యా సంయుతౌ తావతీః కలాః, గురుదక్షిణయాచార్యం ఛందయామాసతుర్నృప. ద్విజస్త యోస్తం మహిమానమద్భుతం సమీక్ష్య రాజన్నతిమానుషీం మతిమ్,

---

బ్రాహ్మణులకు దానము చేసెను. అనంతరము ఉపనయనము చేసికొని ద్విజత్వమును పొంది దీక్షను వహించిన రామకృష్ణులు యాదవులకు గురువైన గర్గునివలన గాయత్రీ వ్రతమును పొందినవారును, ఎల్ల విద్యలకు జన్మస్థానమైనవారును, సర్వమును గుర్తెరిగిన వారును, లోకమునకు ప్రభువులును, ఇతరులకు పొందశక్యముగాని నిర్మలమైన జ్ఞానమును పొందుచున్నవారును, రాజులునై గురువునింటనుండి విద్యాభ్యాసము చేయగోరి దేశాంతరమునకుబోయిరి. అట్లుపోయి ఇంద్రియనిగ్రహముగలవారై కాశిచేరి అవంతీపట్టణమునందు వాసముచేయుచుండిన సాందీపనుడను బ్రాహ్మణునిజేరి శ్లాఘింపదగిన అతడు తమకుగురువు అగునట్టివృత్తిని అనగా శుశ్రూషను చేయబూనుకొన్నవారై ఆయనపాదములను భక్తితో ఒత్తుచు ఆయనను దేవునివలెనే యెంచి కొలిచియుండిరి. ఆబ్రాహ్మణశ్రేష్ఠుడును వారినిష్కపటస్వభావముచేతను అనుసరణముచేతను సంతోషించి వారికి వేదములను వేదాంగములను ఉపనిషత్తులను రహస్యములతోగూడినధనుర్వేదమును ధర్మశాస్త్రములను న్యాయశాస్త్రమును నీతిశాస్త్రమును ఇంకనుగలసమస్తశాస్త్రములను దేవశ్రేష్ఠులును ఎల్లవిద్యలను నడపువారునైన ఆరామకృష్ణులకు చెప్పెను. వారు వానినన్నిటిని ఒక్కొక్కసారి చెప్పుటచేతనే గ్రహించుచువచ్చిరి. అట్లు అరువదినాలుగుకళలను అరువదినాలుగు దివసములలో చదివిరి. ఓయిదిలీపా! ఆవిధముగా, బలరామకృష్ణులు విద్యాభ్యాసము కాగానే గురువైన సాందీపనుని గురుదక్షిణ యేమికోరెదరు అని అడిగిరి. ఆయన వింతయైన వారిప్రభావమును మనుష్యులయందు కానరానిబుద్ధివిశేషమును

సంమంత్ర్యాపత్న్యా సమహార్ణవే మృతం బాలం ప్రభాసే వరయాంబభూ
వ. తథేత్యథారుహ్య మహారథౌ రథం ప్రభాసమాసాద్య దురంతవిక్రమౌ,
వేలాముపవ్రజ్య నిషీదతుః క్షణం సింధుర్విదిత్వార్హణమాహరత్తయోః.
తమాహ భగవానాశు గురుపుత్రః ప్రదీయతామ్, యోసావిహత్వయా
గ్రస్తో బాలకో మహతోర్మిణా. సముద్రః. నాహార్షిత్వమహం దేవ దైత్యః
పంచజనో మహాన్, అంతర్జలచరః కృష్ణ శంఖరూపధరోఽసురః, జలమా
విశ్యతం హత్వా గృహ్యతామిత్యువాచ సః, తతస్సజల మావిశ్య హత్వా
తం జలవాసినమ్. విదార్య హృదయం తస్య నాపశ్యదుదరేఽర్భకమ్, తదంగ
ప్రభవం శంఖమాదాయ రథమారుహత్. తతస్సంయమనీం నామ యమస్య
దయితాం పురీమ్, గత్వా జనార్దనశ్శంఖం ప్రదధ్మౌ సహలాయుధః.
శంఖనిర్హ్రాదమాకర్ణ్య ప్రజా స్సంయమనో యమః, తయోస్సపర్యాం
మహతీం చక్రే భక్త్యుపబృంహితామ్. ఉవాచ వచనం కృష్ణం సర్వభూ
తాశయాలయమ్. లీలామానుషయోః కృష్ణ యువయోః కరవాణి కిమ్.

---

జూచి తన పెండ్లాముతో ఆలోచించి సముద్రముతో చేరిన ప్రభాసతీర్థమునందు మునిగి చని
పోయిన కొమారుని తెచ్చి యియ్యగోరెను. మిక్కుటమైన పరాక్రమముగలవారును మహా
రథులును అగువారు అట్లే కానిమ్మని మరునాడు తెల్లవారి లేచి రథమునెక్కి ప్రభాస
తీర్థమునుగూర్చిపోయి సముద్రపుగట్టున రథమును దిగగానే సముద్రుడు వీరిరాకయెరిగి
పీరుచేయునట్టి అర్చనలను అంగీకరించెను. అంతట భగవంతుడైన శ్రీకృష్ణమూర్తి
సముద్రునిజూచి నీవు మాగురువుకుమారుని నీగొప్ప అలలచే లోపలికి లాగుకొన్నావట.
అతనిని ఇప్పుడు మాకు తెచ్చియిమ్మని అడిగిరి.

సముద్రునిమాటలు.—ఓస్వామీ! నేను ఆబాలుని అపహరింపలేదు. నానీటిలో
వాసముచేయుంవాడును శంఖముయొక్క రూపమువంటి రూపమును ధరించినవాడునునైన
పంచజనుడు అను అసురుడు ఆబాలుని అపహరించెను. నీవు నీళ్లలోచొచ్చి వానినిచంపి
బాలునితీసికొనిపొమ్మని చెప్పెను. వెంటనే కృష్ణుడు నీళ్లలోజొచ్చి అందుఉండెడుపంచజ
నునిచంపి వానిరొమ్ముపగులగొట్టి చూచి వానికడుపునందు పిన్నవానిని కానక వాని దేహము
నందు పుట్టినశంఖమును పుచ్చుకొని మరల రథమెక్కి యమునికి ప్రియమైనసంయమని
యను పట్టణమునుగూర్చిపోయి బలరామునితోగూడిన శ్రీకృష్ణమూర్తి శంఖమును ఊదె
ను. ప్రజలను ధర్మముచేత నియమించుచున్న యముడు ఆశంఖధ్వని విని ఎదురుకొని
వచ్చి భక్తితో గొప్పమర్యాదచేసి ఆయిరువురినిపూజించి ఎల్లభూతముల హృదయము
లందును ఉండునట్టివాడైన శ్రీకృష్ణమూర్తితో ఓస్వామీ! వేడుకకై మానవదేహమును
ధరించినమీరు వచ్చినపనియేమి? నాకు ఏమి ఆజ్ఞాపించెదరు అనెను.

శ్రీభగవాన్. గురుపుత్రమిహానీతం నిజకర్మనిబంధనమ్, అనయస్వమహారాజ మచ్ఛాసనపురస్కృతః. తథేతి తేనోపనీతం గురుపుత్రం యదూత్తమౌ, దత్వా స్వగురవే భూయో గృహ్ణీష్వేతి తమూచతుః. గురుః. సమ్యక్సంపాదితో వత్సౌ భవద్భ్యాం గురునిష్క్రియః, గురోర్వ్యష్టిద్విధః కోను కామానామవశిష్యతే. గచ్ఛంత స్వగృహం వీరౌ కీర్తిర్వామస్తు పావనీ, గురుణైవ మనుజ్ఞాతౌ జవేనానిలరంహసా. ఆయాతాం స్వపురీం యాతౌ పర్జన్యనినదేనవై, సమనందన్ ప్రజాస్సర్వా దృష్ట్వా రామజనార్దనౌ. అపశ్యంతౌ బహ్వాహాని నష్టలబ్ధధనా ఇవ. వసిష్ఠః. ఇత్థం ప్రభాసే సలిలే ప్రభాతే నిమజ్య పర్వణ్యపి మాఘమాసే, కృష్ణప్రభావాత్పునరాజగామ సాందీపనస్తస్యమునేః కుమారః అన్యేపి పునరాయాతా యమలోకాదనేకశః, దేవతానుగ్రహం ప్రాప్య మయావక్తుం న శక్యతే. దిలీపః. సమ్యగుక్త మహోచిత్ర మేతత్ప్రశ్నత్రయం

---

శ్రీకృష్ణునిమాటలు.—ఓయి యమధర్మరాజా! నీవు నాయుంత్తరువును నడిపెడు పక్షమున తనకర్మానుసారముగా ఇచ్చటికి తేబడియుండు మాగురువుకొడుకును మాకు తెచ్చియిప్పింపుము. అనిచెప్పిన, ఆతడు అట్లేయిచ్చెదనని పిలిపించి ఒప్పించిన గురువుకొడుకును తోడుకొని తమగురువునొద్దకువచ్చి ఆయనకు సమర్పించిరి. అందులకు గురువు మిక్కిలి సంతోషించి ఓయి కృష్ణబలరాములారా! మీరు గురుపూజ చక్కగజేసితిరి. మీవంటివారికి గురువునైన నాకు ఇంకను కోరదగినది యేమి ఉన్నది. నాకోరికలు అన్నియు తీర్చితిరి. నిర్మలమైనకీర్తి మీకు కలుగును. మీరు మీయింటికి పొండు. అని చెప్పి అనుజ్ఞయియ్యగా ఆయనచేత సెలవుపుచ్చుకొన్నవారై రామకృష్ణులు గాలియొక్క వేగమువంటి వేగముతోను ఉరుముయొక్క ధ్వనివంటి ధ్వనితోను తమరథమును నడపుకొని తమపట్టణమునుగూర్చి పోయిరి. అప్పుడు ఆపట్టణపుజనులందరు అనేకదినములనుండి చూడకయున్న రామకృష్ణులను పోయినధనమును పొందినవారివలెనే చూచి సంతోషించిరి.

వసిష్ఠునిమాటలు.—ఈవిధముగా మాఘమాసమునందు పున్నమనాటి తెల్లవారి ప్రభాసతీర్థమునందు స్నానముచేయబోయి నీళ్లలోమునిగిపోయిన సాందీపునికొడుకైన ఆచిన్నవాడు కృష్ణునిమహిమవలన యమలోకమునుండి మరలవచ్చెను. ఇంకను అనేకులు యమలోకమునకుపోయి దేవతల యనుగ్రహముపొంది మరలివచ్చియున్నారు. వారినందరను పేరులవరుసను చెప్పుటకు నేను శక్తుడనుకాను.

దిలీపునిమాటలు.—ఓమునీశ్వరా! నేనడిగిన మూడుప్రశ్నములకును లెస్సగా

మునే. సూర్యాన్వయానా మవనీపతీనాం కోటీరరత్నాంచితపాదుకాయ, ఇక్ష్వాకుగోత్రైకహితే రతాయ నమో వసిష్ఠాయ మునీశ్వరాయ.
సూతః.—ఇతి కృత్వా నమస్కారం గురవే మునిపుంగవాః, ఉపర్యుపరి మాఘస్య మాహాత్మ్యశ్రవణోత్సుకః, దిలీపో నృపతిశ్శ్రీమాన్ శ్రేయసే యతమానసః, పునః పప్రచ్ఛ ధర్మాత్మా వసిష్ఠం మునిపుంగవమ్. దిలీపః.- మృగవిషాణమునేశ్చరితం మునే కథయ లోకహితాయ మహాత్మనః, స్పర్శభాషణదర్శనసంశ్రయాదఖిలపాపభిదః ఖలు తాదృశః.

ఇది శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే, శ్రీకృష్ణకృత
గురుపుత్రజీవితకథనం నామ
త్రయోదశోఽధ్యాయః.



ఉత్తరము చెప్పితిరి. ఇది మిక్కిలి వింతగానున్నది. అనిపలికి సూర్యవంశపురాజులయొక్క కిరీటములయందలి రత్నములచేత అలంకరింపబడిన పాదుకోళ్లుగలవాడును, ఇక్ష్వాకు కులమునందు పుట్టినవారికి మేలుచేయగోరునట్టివాడును, మునిశ్రేష్ఠుడును అయిన వసిష్ఠునికొరకు నమస్కారము అని నమస్కరించెను.

సూతునిమాటలు.—ఓ మునిశ్రేష్ఠులారా! ఇట్లు ఆదిలీపుడు గురువునకు నమస్కారముచేసి అందుమీద మాఘమాహాత్మ్యమును వినగోరినవాడునునై వసిష్ఠుని జూచి, ఓ గురువర్యా! మిక్కిలి పుణ్యాత్ముడైన మృగశృంగమహాముని చరిత్రమును కడవెళ్ల చెప్పవలెను. సత్పురుషులను తాకినను వారితో మాటలాడినను వారిదర్శనము చేసినను వారిదాపున చేరినను ఎల్లపాపములను నశించునుగదా అనిచెప్పి మరల నమస్కారముచేసెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు కృష్ణుడు
గురుపుత్రుని బ్రతికించునట్టివృత్తాంతమును తెలుపునట్టిదైన
పదుమూడవ అధ్యాయకథ.



## చతుర్దశోఽధ్యాయః.

వసిష్ఠః.—కృతగురుకులవాసో బ్రహ్మచారీ యథావ న్నిశిత మఖిల వేదాఙ్గలక్షణాఙ్గతానధీత్య, అథ నిజగురుణోక్తాం దక్షిణాంచ ప్రదత్వా కృతవిధిరమలాత్మా తేన ముక్తో గృహాయ. ఉచథ్యఇచ్ఛత్స్వసుతాం ప్రదాతుం వత్సాయ తాం కుత్ససుతో మునీంద్రః, ఉద్వోఢుమైచ్ఛ న్మృగశృంగనామా మునీశ్వరః ప్రాఙ్మనసావృతాం తామ్. ప్రదాతుకామః కన్యాం తా ముచథ్యస్సమలంకృతామ్, ఆహూయాచక్రే విప్రేంద్రా నంకురార్పణ మాదితః. కుత్సపుత్రవివాహార్థ మానయామాస వై మునీన్, ఆజగ్మురఖిలా స్తత్ర మునయో బ్రహ్మవాదినః. జైమిని ర్జమదగ్నిశ్చ కపిలో రైభ్యఏవచ, సుమతి ర్వామదేవశ్చ జాబాలిః కాశ్యపోభృగుః. పర్వతశ్శరభంగశ్చసుతీక్ష్ణోఽగస్త్యఏవచ, ఆపస్తంబోఽథ మాండవ్యో సత్యః కాత్యాయన స్తథా. కశ్యపశ్చైవహారీతో అంగిరాః పైలఏవచ, మౌద్గల్యో గౌతమశ్చైవ కణ్వః కాణోత్రిరేవచ. ఏతేచాన్యేచ బహవో వివాహార్థం సమాగతాః, కుత్సః పరమధర్మాత్మా మధుపర్కపురస్సరమ్.

---

## పదునాలవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.-ఆమృగశృంగుడు గురువునింట వసించి గురువునకు శుశ్రూషచేయుచు శాస్త్రమునందు చెప్పబడినచొప్పున బ్రహ్మచారిధర్మమును పూని అన్నివేదములను వ్యాకరణము మొదలుగాగల లక్షణశాస్త్రములను చదివి పిమ్మట తనగురువుకోరిన దక్షిణనుఇచ్చి, ఆగురువుగుండ గోదానవ్రతము నడపుకొన్నవాడై నిర్మలమైన అంతఃకరణముతోవచ్చి తనయిల్లుచేరెను. అప్పుడు ఉచథ్యుడు తనకొమార్తెను కుత్సునికొడుకైన ఆమృగశృంగునికి ఇయ్యనిశ్చయించెను. మృగశృంగుడును మునుపు తనచేత కోరబడినదైన ఆకన్యకనే పెండ్లాడువాడయ్యెను. అంతట ఉచథ్యుడు కన్యాదానము చేయగోరినవాడై తనకొమార్తెను అలంకరించి బ్రాహ్మణులను రప్పించి తొలుత అంకురార్పణముచేసెను. కుత్సుడును తనకొడుకుపెండ్లికి ఎల్లమునులను పిలిపింపగా వేదాధ్యయనసంపన్నులైన మునులందరును వచ్చిరి. అట్లువచ్చిన జైమిని, జమదగ్ని, కపిలుడు, రైభ్యుడు, సుమతి, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, భృగువు, పర్వతుడు, శరభంగుడు, సుతీక్ష్ణుడు, ఆపస్తంబుడు, మాండవ్యుడు, సత్యుడు, కాత్యాయనుడు, కశ్యపుడు, హారీతుడు, అంగిరసుడు, పైలుడు, మౌద్గల్యుడు, గౌతముడు, కణ్వుడు, కాణుడు, అత్రి అనువారికిని, ఇతరులైన యనేకులు ఋషులకును మిక్కిలి ధర్మాత్ముడైన

సమ్యగభ్యర్చయామాస భక్ష్యభోజ్యైరనేకధా. శుభే ముహూర్తేసు
దినే సులగ్నే మనోజ్ఞలాజాజ్యకుశైస్సమిద్భిః,హుత్వాగ్నిమగ్రే మహాత్మా
మృషీణాంచక్రే వివాహం విధివత్సకుత్సః. దృష్ట్వాచథ్యస్య కన్యాయాః
పాణిగ్రహణమంగళమ్, సువృత్తాయాస్తు తత్సఖ్యః తిస్రోప్యత్ర తమా
యయుః. కమలా విమలాచైవ సురసాచసుమధ్యమా, అస్మాకం పాణిర
ద్యైవ గృహ్ణీష్వ ద్విజపుంగవ. యదిపాణిం సగృహ్ణాసి శాపోత్ర భవి
తాతవ, ఇతితాసాం వచశ్శ్రుత్వా వత్సశ్చిరమచింతయత్.ఏకకాలే సము
ద్వోఢుం యుక్తం వా యుక్తమేవవా, ఇతిచింతాపరే తస్మిన్ మృగ
శృంగే మహాత్మని. ఋషీణాం మహాత్మాం మధ్యే వేదవ్యాస స్తమబ్ర
వీత్, గృహ్ణీష్వపాణిమాసాంచదోషస్తత్రనవిద్యతే. సందేహంమాకురు
ష్వాత్ర కృతపూర్వస్త్వయంవిధిః, పురా నృపస్య మాంధాతుః పంచా
శత్సంఖ్యకన్యకాః. ఏకస్మిన్నేవ దివసే ఉపయేమేచ సౌభరిః, పునర్దక్ష
సుతాశ్చైవ సోమోప్యుదవహత్కిల. ఇతివ్యాసవచశ్శ్రుత్వా తత్రతా

---

ఆకుత్సమహాముని మధుపర్కము మొదలగునవి యిచ్చి పూజించి భక్ష్యములును భోజ్య
ములునునైన ఆహారవస్తువులచేత తృప్తిపొందించి మంచిదినమును మంచిలగ్నమునైన
మంచిముహూర్తమునందు ఆమహర్షులయెదుట పరిపేలాలు నెయ్యి దర్భ సమిధలు వీటి
చేత హోమముచేయించి శాస్త్రమునందు చెప్పబడిన చొప్పున వివాహము కావించెను.
మంచినడవడి గలిగిన ఆయుంచథ్యుని కూతురియొక్క పెండ్లివేడుకనుజూచి, కమల విమల
సురస అనుదాని చెలిమికత్తెలైన కన్యకలుముగ్గురు మృగశృంగునితో ఓబ్రాహ్మణోత్త
ముడా! ఇప్పుడే మమ్ముగూడ చేపట్టుము. నీవు ఇప్పుడు మమ్ము పరిగ్రహింపనిపక్ష
మున నీకు శాపము సంభవించును అనిరి. అదివిని మృగశృంగుడు ఏకకాలమునందు
అనేకులను పెండ్లాడుట తగునోతగదో అని చాలసేపు ఆలోచింపసాగెను. అప్పుడు ఆత
ని అభిప్రాయము తెలిసికొని అచ్చటవచ్చియున్న ఋషులనడుమ కూర్చుండిన వేదవ్యాస
మహాముని యిట్లుపలికెను. ఓమృగశృంగుడా! ఈకన్యకలనుగూడ యిప్పుడే పెండ్లా
డుము. అది తప్పుకాదు. ఈవిషయమునందు నీవు సందేహించవలదు. ఇట్లు ఇంతకుము
నుపుకూడ జరిగియున్నది. అదియెట్లనగా, పూర్వకాలమునందు మహారాజైన మాం
ధాతకు ఏబదిమంది కొమార్తెలుకలరు. వారిని అందరను ఒక్కనాడె సౌభరి అనుమహా
ముని పెండ్లాడెను. ఇదిగాక దక్షప్రజాపతి కొమార్తెలను ఇరువదియేడ్వురను చంద్రు
డు ఏకకాలమునందే పెండ్లాడలేదా? అని వ్యాసమహాముని చెప్పినమాటను విని

సామపిద్విజః, క్రమేణపాణింజగ్రాహకృత్వాహోమంవిధానతః. బ్రాహ్మో వివాహ ఉత్కృష్టో విప్రాణామపిహి శ్రుతిః,తస్మాద్బ్రాహ్మవివాహేన చత స్రోప్యగ్రహీ స్మునిః. ఇత్థం వివాహే విహితే సవత్సః సంభావయామాస మునీననేకాన్, మునీశ్వరాస్తే విహితాశిషస్తమామంత్ర్య జగ్ముర్నిజపర్ణ శాలాః. దిలీపః.—చతుర్ణామపివర్ణానాం వివాహాః కతిచిత్స్మృతాః, ఆచ క్ష్వ యది గుహ్యంమే వసిష్ఠారుంధతీపతే. వసిష్ఠః—శృణు రాజన్ ప్రవ క్ష్యామి వివాహాన్ క్రమశస్తవ, వివాహా బ్రాహ్మదైవర్షిప్రాజాపత్యాసు రాస్తథా. గాంధర్వో రాక్షసశ్చాపి పైశాచోష్టమ ఉచ్యతే, బ్రాహ్మో వైవరమాహూయ యత్రకన్యాస్వలంకృతా. దీయతేతత్సుతఃపూయా త్పురుషానేకవింశతిం, యజ్ఞార్థమృత్విజేదైవ స్సుజహోతి చతుర్దశ. వరా దాదాయ గోద్వంద్వం ఆర్షస్సజః పునాతి షట్, సహోభౌ చరతాం

---

మృగశృంగుడు అప్పుడే క్రమముగా హోమముచేసి అగ్నిసన్నిధియందు ఆముగ్గురు కన్యకలను పెండ్లాడెను. బ్రాహ్మణులకు బ్రాహ్మవివాహము ఉత్తమము అని వేదమునందు చెప్పబడియున్నదిగనుక ఆమృగశృంగుడు నలుగురు కన్యకలను బ్రాహ్మవిధిచేతనే పెండ్లా డెను. ఇట్లు పెండ్లి క్రమముగాజరిగినపిమ్మట పెండ్లికొడుకుతండ్రియైన వత్సమహాముని పెండ్లికివచ్చినమహామునులకు అందరకు తగినమర్యాదలు చేయగా వారు పెండ్లికొడు కును పెండ్లికూతురును ఆశీర్వదించి తమతమనివాసములనుగూర్చి పోయిరి.

దిలీపునిమాటలు.—అరుంధతి పెనిమిటియైన వసిష్ఠమహామునీ! బ్రాహ్మణులు మొద లగు నాలుగువర్ణములవారికి ఎన్నివిధముల పెండ్లిండ్లు చెప్పబడియున్నవి నాకు తెలియ జెప్పుము.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా! వివాహము లెన్ని విధములుకలవో వాని నన్నిటిని క్రమముగా చెప్పెదను వినుము. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసు రము, గాంధర్వము, రాక్షసము, పైశాచము, అని వివాహములు ఎనిమిదివిధములు గలవి. అందు కన్యకను వస్త్రాభరణములచేత చక్కగా నలంకరించి వరునిపిలిచి యిచ్చి చేయు వివాహము బ్రాహ్మము. అట్లు వివాహముచేయబడిన యిల్లాలికి పుట్టినకొడుకు ఇరువది యొక్కతరములవారిని పరిశుద్ధులనుగా జేయును. యజ్ఞముకొరకు యజ్ఞముచేయించు వానికి కన్యనిచ్చి చేయువివాహము దైవము. ఆదంపతులకు పుట్టినకొడుకుపదునాలుగుతర ములవారినిపరిశుద్ధులజేయును. పెండ్లికొడుకువలనఒకజతగోవులనుపుచ్చుకొని కన్యనిచ్చి చేయువివాహము ఆర్షము. ఆదంపతులకుపుట్టిన కుమారుడు ఆరుతరములవారిని పరిశుద్ధు

ధర్మమిత్యుక్త్వా దీయతేర్థినే. యత్రయాదీయతేకన్యాతజ్జోపంశాగ్ పునా తిపట్, చత్వారవతేవిప్రాణాం ధర్మాఃపాణిగ్రహాస్మృతాః. ఆసురఃక్రయ ణంద్రవ్యైః గాంధర్వోన్యోన్యమైత్రతా, ప్రసహ్య కన్యాహరణం రాక్షసోనిందితస్మృతామ్. ఛలేన కన్యాహరణం పైశాచో గర్హితోష్టమః, ప్రాయః క్షత్రవిశాముక్తాః గాంధర్వాసురరాక్షసాః. అష్టమస్తేషు పాపిష్ఠః పాపిష్ఠానాంహి సంభవేత్, సవర్ణయా కరో గ్రాహ్యో ధార్యః క్షత్రియయా శరః. ప్రతోదో వైశ్యయా ధార్యోవాసాంతో శూద్రయాసహ, అసవర్ణాస్వేషవిధిః స్మృత ఉత్కృష్టవేదనే. సర్వాభిస్తు సవర్ణాభిఃపాణిగ్రాహ్యస్త్వయంవిధిః, ధర్మైర్వివాహైర్జాయంతేధర్మ్యాఏవశతాయుషః. తస్మాద్బ్రాహ్మో వివాహస్తు బ్రాహ్మణానాం విశిష్యతే, ప్రాజా

లనుచేయుంను. వరునితో మీరిరువురుగూడి ధర్మముచేయుండు అనిచెప్పి కన్యనిచ్చి చేయుం వివాహము ప్రాజాపత్యము. ఆదంపతులకు పుట్టినకొమారుడు ఆరుతరములవారిని పావనులనుజేయుంను. ఈ చెప్పబడిన నాలుగువిధములవివాహములును బ్రాహ్మణులకు తగినవి. ధనముపుచ్చుకొని కన్యనిచ్చువివాహము ఆసురము. పెండ్లికొడుకును పెండ్లికొమార్తెయుం ఒకరికొకరు ప్రియపడి చేసికొను వివాహము గాంధర్వము. వరుడు బలాత్కారముగా కన్యకను అపహరించితెచ్చిచేసికొను వివాహము రాక్షసము. ఇది పెద్దలగువారిచేత అంగీకరింపబడదు. మోసముచేసి కన్యకను తీసుకొనిపోయి చేసికొనువివాహము పైశాచము. ఇది అధమము. ఈవెనుక చెప్పబడిన నాలుగువివాహములలోను గాంధర్వము ఆసురము రాక్షసము అను వివాహములు తరచుగా రాజులకును వైశ్యులకును తగినవని చెప్పుదురు. ఎనిమిదవదైన పైశాచము పాపమునుకలుగజేయునది గనుక పాపాత్ములకే అది ఒనగూడును. బ్రాహ్మణుడగువాడు తన వర్ణమునందు పుట్టిన (బ్రాహ్మణ) కన్యను చేయిపట్టుకొనియుం, రాచకన్యను బాణమును పట్టుకొనియుం, వైశ్యకన్యను సెలగోలను పట్టుకొనియుం; శూద్రకన్యకను కోకకొంగుపట్టుకొనియుం, పెండ్లాడవలెను. ఈవిధి అన్యవర్ణ స్త్రీపరిగ్రహామునందు చక్కగా తెలియవలసి చెప్పబడెను. కాబట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులలో నెవరుగాని తమతమ జాతికన్యకలను పెండ్లాడునపుడు చేయిపట్టుకొవలసినదేవిధి. ఎవరెవరికి ఏదేది ధర్మమని విధింపబడియున్నదో వారువారు ఆయా ధర్మముతప్పక పెండ్లిచేసికొన్నచో నాదంపతులకు పుట్టినకొడుకులే ధర్మము నుండి తొలగనివారును నూరేండ్లు జీవించువారును అగుదురు. కనుక బ్రాహ్మణులకు బ్రాహ్మ్యవివాహమే ముఖ్యముగా చెప్పబడెను. మునుపు చెప్పిన సౌభరియనుమహాముని ప్రాజాపత్యవిధిని వివాహముచేసికొనెను.

పత్యోర్వివాహోఽపి సతుసౌభరిణా కృతః. దిలీపః.—కిమర్థముపయేమే చ
సౌభరిర్భగవానృషిః, పంచాశత్కన్యకాః పూర్వమేతద్విస్తరతో వద.
వసిష్ఠః. కాంపిల్యనగరే పూర్వం సౌభరిర్నామవై ద్విజః, సర్వవేదార్థతత్త్వ
జ్ఞస్సర్వభూతదయాపరః. యోగాభ్యాసరతో నిత్యం విషయేషు పరా
ఙ్ముఖః, ఆదౌ చాంద్రాయణం చక్రే పునర్మాసోపవాసకృత్. జీర్ణపర్ణా
శనః పశ్చాన్నిరాహారస్తతః పునః, అంతర్జలే పునస్థిత్వా ద్వాదశాబ్ద
మతప్యత. తస్మిన్సరోవరే రమ్యే హ్యగాధే నిర్మలాంభసి, మత్స్యోఽస్తి శబ
రో నామ్నా మత్స్యయూథసమన్వితః. సర్వేషామేవ మత్స్యానా మ
గ్రణీ రుచిరాకృతిః, శరవేగగతిశ్చైవ తేజసా నయనప్రియః. పుత్రైః
పౌత్రైర్నప్తృభిశ్చ భార్యాభిర్మాతృబాంధవైః, భ్రాతృభిః పితృభిస్సార్థ
మితశ్చేతశ్చ ధావతి. తం దృష్ట్వా చింతయామాస మత్స్యేంద్రం సౌభరి
ర్మునిః, అనేక దుహితృ దౌహిత్ర సంతత్యా పరివారితః. అతీవ రమమా
ణోఽసౌ ఉత్పాదయతి నః స్పృహామ్, భార్యాదుహితృదౌహిత్ర పుత్ర
పౌత్రైశ్చ నప్తృభిః. విహరామ వయంచైవ మితి కృత్వా మతిం మునిః,

---

దిలీపునిమాటలు.- మునుపుషడ్గుణైశ్వర్యసంపన్నుడైన సౌభరిమహర్షి యేబదిమంది కన్యకలను ఏలపెండ్లాడెను? ఆవృత్తాంతమును సవిస్తరముగా నాకు తెలియజెప్పుము.

వసిష్ఠునిమాటలు.—పూర్వకాలమునందు కాంపిల్యము అనుపట్టణములో సమస్త వేదార్థములను గుర్తెరిగినవాడును సకలప్రాణులయందు కృపగలవాడును యోగాభ్యాసముచేయుటయందు అక్కరగలవాడును, ఎప్పుడునువిషయములయందలి యిచ్ఛలేనివాడును అయిన సౌభరియనెడు బ్రాహ్మణుడు ఉండెను. ఆయన తొలుత చాంద్రాయణవ్రతమును పూనియుం పిమ్మటమాసోపవాసవ్రతమును అవలంబించియుం అటుపిమ్మట నేలరాలిన పండుటాకులను తినియుం తపస్సుచేసి, పిమ్మట ఆహారమేలేక నీళ్లలోమునిగి పండ్రెండేండ్లు తపస్సుచేసెను. చాలలోతై రమ్యమై ఒప్పునట్టి ఆసౌభరి తపస్సుచేయుచున్న సరస్సులోని నీటిలో శబరము అను చేపయొకటికలదు. అది అనేకములైన చేపలగుంపులతో గూడుకొని ఎల్ల చేపలకురాజై అందమైన ఆకారముతో బాణముపోవునట్టు అతివేగముగా రెక్కలు జాడించి పారాడుచు కొడుకులతోను మనుమలతోను పెండ్లాలతోను తల్లివంకవారును తండ్రివంకవారును నైన చుట్టములతోను తోబుట్టువులతోను గూడి సుఖించుచుండగా జూచి సౌభరి ఈచేప పుత్త్రులు పౌత్త్రులు మొదలగుసంతాన సమృద్ధితో మెలగుటనుచూడగా ఇట్లుమెలగవలె ననుకోరిక నాకును బుట్టుచున్నది. కనుక

ఉత్థితస్సలిలా త్తస్మా న్మునిర్వికటవేషకృత్. నిర్దేష్టుకామః కన్యార్థం మాంధాతారముపాగమత్, ఋషేరభ్యాగమం శ్రుత్వా సముత్థాయా సనాన్నృపః. అర్ఘ్యాదిభి స్సమభ్యర్చ్య కల్పయామాస చాసనమ్, ఆసనే సమ్యగాసీనో నృపంసౌభరిరబ్రవీత్. నిర్దేష్టుకామోస్మి నరేంద్ర కన్యాః ప్రియంత్విదంమే ప్రణయం వ్యభాంక్షీః, నహ్యర్థినః కార్యవశా దుపేతాః కాకుత్స్థవంశే విముఖాః ప్రయాంతి. శతార్ధకన్యా స్తవ సౌమ్య సంతి తాసాం మమైకాం నృపతే ప్రయచ్ఛ. ఇతిశ్రుద్వా మునేర్వాక్యం మాంధాతామనునందనః, జర్ఝరీకృతసర్వాంగం విలోక్యవికటాకృతిమ్. ప్రత్యాదేశ భయా త్తస్మా చ్ఛాపభీత్యాచ పార్థివః, సాంత్వపూర్వమిదం వాక్య మువాచ వినయాన్వితః. శృణుష్వ మునిశార్దూల క్షత్రియాణాం కులస్థితిమ్, కన్యాదృష్టిప్రియోయస్తు కులీనోరూపవా న్యువా. సర్వలక్షణసంపన్న స్తస్మై కన్యా ప్రదీయతే, క్షత్రియాణామియంరీతిః కాచిదాసీన్ మునీశ్వర. భగవన్ మునిశార్దూల కిం కుర్మః పునరుచ్యతామ్, ఆకర్ణ్య రాజ్ఞోవచన మితిప్రత్యాహ సౌభరిః. యద్యేవం క్షత్రి

---

నేనునుఇట్లు క్రీడించెదనని అప్పుడే నీళ్లలోనుండిలేచి బయటికివచ్చి పెండ్లియాడవలెనను తలపుగలవాడై తనవికారవేషములోనే మాంధాతయను మహారాజునింటికిపోగా ఆమహారాజు ఈతనిరాకవిని సింహాసనమునుండి లేచి యెదురుగావచ్చి అర్ఘ్యము పాద్యము మొదలైనయుపచారములతో పూజించి పీటవేసి కూర్చుండబెట్టెను. అంతట సౌభరి, ఓ మహారాజా! కాకుత్స్థవంశస్థులగురాజులను యాచించునట్టి యాచకులు తమ కోరికను తీర్చుకొనకపోయి యెరుగరు. కాబట్టి నేను కన్యకను అడుగగోరి నీయొద్దకు వచ్చినాను. నీకు ఏబదిమందికొమార్తెలు కలిగియున్నారు, వారిలో నొకదానిని నాకు ఇయ్యవలయును. అది ఒకతె నన్ను వరించునట్లు నీవు అంగీకరించిన జాలును. అనగా, రాజు ఈమునమాటకు ఎదురాడిన ఏమి ముప్పువచ్చునో ఏమిచెప్పకున్న శపించునో అనుభయముచేత ఎల్ల అవయవములతోడను దేహము వణకుచుండగా సౌభరిని జూచి మిక్కిలి వినయముతో, ఓఋషీశ్వరా! రాచవారికులమర్యాద యేమనగా, కన్యక చూపునకు ఇంపైనవాడును మిక్కిలి చక్కదనము గలవాడును మంచికులమునందు బుట్టినవాడును ఇంకను గలశుభలక్షణములన్నియు గలిగినవాడునైన వరునకే కన్యకను ఇయ్యవలసినది. ఇతరునికి ఇయ్యరాదు. ఇదియొక నిర్బంధము మాకు కలదు. ఇందులకు నేనేమి చేయుదును, అనుకూలమైన మార్గమును మీరే అనతియ్యవలసినది అనెను, అదివిని సౌభరి

యారీతి ర్నృప ధన్యావయంపునః, తస్మా ద్వర్షధరం రాజ న్నాహూ
యాంతఃపురస్థితమ్. మాం ప్రదర్శయ కన్యానాం యది తాసాం రుచిర్భ
వేత్, తదాదిశసుతాంరాజ న్నోచేద్యాస్యే యథాగతమ్. మునేస్త
ద్వాక్యమాకర్ణ్య తథాస్త్వితి నృపోత్తమః, ఆదిదేశ తమాహూయ
సవోఁ్యవర్షధరం తదా. అంతఃపురం విశన్నేవ భగవాన్ మునిసత్తమః,
దేవగంధర్వసిద్ధేభ్యోప్యతిరూపధరో భవత్. అంతర్వర్షధరోవిప్రం
నినాయ నృపశాసనాత్, తాసాం ప్రదర్శయామాస మునీంద్రం
మదనోపమమ్. భవతీనాం పితా ప్రాహ ఇమం యావృణుతే పతిమ్,
తస్మైతాం ప్రదదామీతి తాః ప్రతిప్రాహ కంచుకీ. శ్రుత్వా కంచు
కినోవాక్యం తంచ దృష్ట్వా మనోహరమ్, సానురాగాస్తతః కన్యాః పరి
వార్య తమబ్రువన్. అహంభార్యాస్మ్యహంభార్యా స్మ్యహంభార్యేతి
తం మిథః, ఇతి కన్యా స్సమావవ్రుః వాశితాఇవ వారణమ్. మాంధాతా
నృపతిర్దృష్ట్వా కుమారీణాం మనోరథమ్, దిదేశసకలాఏవ తస్మైసౌభర
యే తదా. కృత్వా వివాహంవిధివ ద్విధిజ్ఞ స్సమహాముని:, ఆదాయ
రాజకన్యాస్తా జగామస్వనివేశనమ్. సౌధసోపానసంయుక్తం వలభీమండ

---

మహాముని మీరాజధర్మము ఇట్టిదైనయెడ మేము కృతార్థులమైతిమి. అంతఃపుర
మునందుండెడు కొజ్జాను ఒకనిని పిలిపించి నన్నుకన్యకలకుజూపను ఉత్తరువుచేయుము.
వారికి నాయందు ఇష్టము కలిగినయెడ నాకిచ్చి పెండ్లిచేయుము. లేనియెడ నేనువచ్చిన
దారి పట్టుకొని పోయెదను అనెను. రాజు అందులకు సమ్మతించి ఒకనపుంసకుని బిలి
పించి ఆమునీశ్వరుని అంతఃపురమునకు పిలుచుకొనిపొమ్మని చెప్పగా మునీశ్వరుడును
వానివెంట అంతఃపురమునకుపోవుచు దేవతలకంటెను గంధర్వులకంటెను సిద్ధులకంటెను
చక్కదనముగల రూపమును ధరించెను. అట్టిమాఋషిని కొజ్జావాడు రాచకన్నెలు
ఉండెడుచోటికి పిలుచుకొనిపోయి వారికి చూపి మీతండ్రి మీలో యీమునీశ్వరుని
ఎవరు వరింతురో వారిని ఈయనకు ఇచ్చి పెండ్లిచేయదలచియున్నాడు. అనగా, కన్య
కలు మిక్కిలి చక్కదనముగల ఆమునినిచూచి మోహమునొందినవారై ఈయనకు నేను
భార్యనయ్యెదను అనుచు అందరును వచ్చి చుట్టుకొనిరి. ఇట్లు ఆడు ఏనుగులగుంపు
మదముచేత అతిశయించిన మగయేనుగును చుట్టుకొనునట్లు కన్యకలందరును చుట్టుకొనగా
వారి తండ్రియైన మాంధాతృ మహారాజు వారి యిష్టముచొప్పున అందరను ఆయనకే
ఇచ్చి పెండ్లిచేసెను. సౌభరి ఆవిధముగా మాంధాతకూతులను పెండ్లాడి వారిని పిలుచు
కొని తనయాశ్రమమునకు పోయి దేవశిల్పియైన విశ్వకర్మను రావించి అతనిచేత ఏబది

పాన్వితమ్, స్ఫటికస్తంభసంయుక్తం చంద్రశాలావిరాజితమ్. దాసీదా
స సమాయుక్తం హేమప్రాకారసంయుతమ్, విచిత్రద్వారకవాటాఢ్యం
రత్నవాతాయనోజ్జ్వలమ్. రత్నతోరణ సౌవర్ణ పతాకాభి స్సముజ్జ్వ
లమ్, పృథక్పృథగసంబాధం హర్మ్యప్రాకారసంకులమ్. ధనధాన్య
సమృద్ధంచ సర్వోపకరణాన్వితమ్, కారయామాస సర్వాసాం ప్రత్యే
కం భవనోత్తమమ్. విశ్వకర్మాణమాహూయ సౌభరిశ్శిల్పినాంవరమ్,
గృహేషు తేషు తాః కన్యా వ్యాదిష్టాః పరమర్షిణా. సుఖమూషుస్స్వర
స్త్రీవ త్సర్వసంపత్సమన్వితాః, ఏకదా దుహితృస్నేహా త్సమాకృష్ట
మనా నృపః, సౌభరేస్తస్య జామాతు రాశ్రమం ప్రాపదశ్రమః. సౌవర్ణ
శాలా స్స్ఫురదంశుమాలాం ప్రాసాదమాలాం బహుహేమసాలామ్,
ఆలోలమాలా మమలాం విలోక్య నృపోఽభవ ద్విస్మితచిత్తవృత్తిః.
అథైకభవనం రాజా ప్రవిశ్యాపశ్యదాత్మజామ్, సా సంభ్రమేణ పితరం
సమాలింగ్య ననామహ, తత్స్నేహాత్తా ముపాచేతి సుఖేనస్థీయతేకిము,

---

మండపములతోడను స్ఫటికముల కంబములతోడను మేడలమీది యుప్పరిగలతోడను
ఊడిగము చేయునట్టి స్త్రీపురుషజనులతోడను బంగారుప్రాకారములతోడను చిత్తరు
వులు చెక్కబడిన ద్వారబంధములతోడి తొట్టికట్లతోడను రత్నములు చెక్కిన కిటికీల
తోడనుగూడి వెలుగుచుండెను. మరియు రత్నాలతోరణములచేతను టెక్కెములచేతను
ఒప్పుచుండెను. విశాలములును ఒకదానితో నొకటి సంబంధములేనివియు నయిన ప్రాకా
రములు గలిగియుండెను. కావలసినధనమును ధాన్యములును గలిగియుండెను. ఇంటికి
కావలసిన ఉపకరణములు అన్నియు పొరుగు అపేక్షలేకయుండెను. ఇట్టి సర్వసమృద్ధి
గల మేడలయందు సౌభరి తనభార్యలనునిచి వారితోడ సుఖము లనుభవించుచు హాయి
గా నుండెను. ఆరాచకొమార్తెలును తమ పెనిమిటిచేత ఒనగూర్పబడిన సకలసంపద
లను అనుభవించుచు దేవతాస్త్రీలా అనునట్టుగా కాపురములు చేయుచుండిరి. అటు
కొంతకాలము జరగగా ఒకనాడు మాంధాత తనకొమార్తెలను అల్లుని చూడగోరి సౌభరి
ఆశ్రమమునకుపోయి నిగనిగలాడు బంగారుచవికలయొక్క వెలుగులచాలును మేడల
బారులును అనేకములైన బంగారుకోటలును అంతటను వ్రేలుచున్న పూలదండలును
గల నిర్మలమైన ఆయాశ్రమమునుజూచి ఆశ్చర్యము నొందినవాడై అందు ఒకయిల్లు
చొచ్చి ఆయింటనున్న కొమార్తెనుజూచెను. ఆచిన్నది తండ్రిని జూచి మిక్కిలి సంభ్ర
మముతో లేచి తండ్రికి మ్రొక్కి ఆలింగనము చేసికొనెను. అంతట రాజు అమ్మా!
సుఖముగనున్నావా? నీపెనిమిటి నీయందు ప్రీతిగలిగియున్నాడా? ఎప్పుడైన నన్నును

ఉత స్నిహ్యతి తేభర్తా కిం మాంస్మరసి మాతరమ్. ఇతిపృష్టా సుతా తేన పితరంపునరబ్రవీత్, మృష్టాన్నం మృదుశయ్యాచ వస్త్రాణ్యాభరణానిచ. తిలాజ్యధాన్య లవణ దధిక్షీర మధూనిచ, ధనాని మూలద్రవ్యాణి ఫల మూలానిచేంధనమ్. రసాయనానిసర్వాణి భోజ్యానివివిధానిచ, సర్వా శ్చ సంపదస్సంతి మద్గార్హస్థ్యసమం నహి. ఇదమేకం మహద్దుఃఖం వక్ష్యామి శృణు హేపితః, మయ్యేవ స్నేహవాన్భర్తా విహాయాన్యా స్సహోదరీః. అత్రైవ నియతం భుఙ్క్తే శేతేత్రైవ నిశాసుచ, ఇదమేకం మహద్దుఃఖం అన్యత్కించి న్నవిద్యతే. ఇత్యుక్తో నృపతిః పుత్ర్యా ద్వితీయం భవనం గతః, ఏవం సమస్తభవనం ప్రాప్య ప్రాప్య మహీపతిః సుతాభిస్తాభిరిత్యుక్త స్సంతోషం పరమంయయౌ, ఆశ్చర్యమేతదాలో క్య విస్మయోత్ఫుల్లలోచనః. ఉవాచసౌభరింరాజా దృష్టోద్య మహిమా తవ, అదృష్టపూర్వః కుత్రాపి సిద్ధభావోయ మద్భుతః. వసత్వం ముని

---

మాతల్లిని తలచుకొందువా? అని యడిగెను. అందుకాకూతురు నాయనా! పరిశుద్ధ మైన యన్నమును మెత్తనిపానుపును మంచి కోకలును కావలసిన సొమ్ములును నూనె నెయ్యి బియ్యము పప్పు ఉప్పు పాలు పెరుగు తేనె మొదలుగాగలపదార్థములును ధన మును ఇంకను కావలసిన ముఖ్యవస్తువులును పండ్లు కందమూలములు వంటచెరకులు నానావిధములైన రసాయనములును భుజింపదగిన బహువిధవస్తువులును మొదలుగాగల సకలభాగ్యములును నాకు గలవు. నాకాపురమువంటి కాపురము లోకములో నెక్క డను ఉండదు. ఐనను నాపెనిమిటి నాయందే ప్రీతిగలవాడై నన్నువిడువక వర్తించుచు నాతోడబుట్టువులను కన్నెత్తి చూడకయున్నాడు. ప్రతిదినము భోజనముచేయుటయు ప్రతిరాత్రియందును పండుకొనుటయు ఇక్కడనేకాని మరియెక్కడను కాదు. నాకు గల సుఖము నాతోడబుట్టువులకును లేకపోయెనే అను ఈయొక చింతతప్ప మరియే విధమైనచింతయు నాకులేదు. అని చెప్పగా విని రాజు అక్కడనుండి రెండవకొమార్తె యింటికి పోయెను. ఆమెయు మొదటికూతురు చెప్పినట్టే చెప్పెను. ఇట్లు ఆరాజు అందరుకొమార్తెలయిండ్లకును క్రమముగాపోయి అందరును ఇట్లే తమకాపురపురీతు లను చెప్పగా విని మిక్కిలి సంతోషించెను. ఇట్లు ఆ యపూర్వమైన వింతలుజూచి అందువలని సంతోషముచేత తేటపారినచూపులుగలవాడగుచు తన అల్లుడైన సౌభరి మహామునిని చూచి ఓమహాత్మా! నీమహిమను జూచితిని. ఇటువంటి వింతను ఇంతకు మునుపు ఎక్కడను చూచి విని యెరుగను. నాకొమార్తెలతోడ నీవు ఎల్లప్పుడును ఇక్కడే

శార్దూల మత్పుత్రీభిశ్చ సంతతమ్, ఇతి సంతోష్య విప్రేంద్రం జగామ స్వపురం నృపః. అథ కాలేనతాఃకన్యాః ప్రత్యేకం తనయత్రయమ్, లేభిరే మునిశార్దూలాత్ జ్వలత్పావక తేజసః. ఏవంపుత్రాశ్చ పౌత్రాశ్చ నప్తారో బహవోభవన్, ఏవంసహస్రసంతాన స్సౌభరిర్మునిసత్తమః. సంసార సౌఖ్యభుక్తస్తు చిరకాలం నిజాశ్రమే, ఏవం ద్వాదశమాఘూవై జల మగ్నేన తిష్ఠతా. కృతస్సౌభరిణా రాజన్ ఏవం స్యాన్మాఘవైభవాత్, ఏవం వ్యాజేన సిద్ధ్యంతి మాఘాః పుణ్యవతాం నృణామ్. సౌభరేరిద మాఖ్యానం యే శృణ్వంతి నరోత్తమాః, తేషాం న సంతతిచ్ఛేదో భవితా నాత్రసంశయః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే సౌభరిచరితంనామ
చతుర్దశోఽధ్యాయః.



శాపురము చేయుచుండును. అనిచెప్పి అల్లుని సంతోషపెట్టి రాజు తనపట్టణమునకు పోయెను. అంతట కొంతకాలమునకు ఆరాచకొమార్తెలు మునిశ్రేష్ఠుడైన సౌభరివలన తలా ముగ్గురేసి కొడుకులను అగ్నియొక్క తేజస్సువంటి తేజస్సుగలవారిని పడసిరి. ఈ విధముగా కొడుకులు కొమకులకొడుకులు మనుమలు మునిమనుమలును అనేకులుపుట్టి కుటుంబము మిక్కిలిపెరిగెను. ఇట్లు సౌభరి తన ఆశ్రమమునందు చిరకాలము సంసార సౌఖ్యమును అనుభవించెను. ఓదిలీపమహారాజా! పండ్రెండు మాఘమాసములు నీళ్లలో మునిగి తపస్సుచేసెను గనుక ఆమాఘమాసములయందలి తపస్సువలని ఫలము ఈవిధ ముగా అతనికి సిద్ధించెను. ఇట్టి నిమిత్తముచేతనే పుణ్యాత్ములైన మానవులకు మాఘఫలము సిద్ధించును. ఈ సౌభరికథను ఏయుత్తములు వినుదురో వారిసంతతికి ఎప్పుడును నా శము కలుగదు. ఈవిషయమునందు సంశయము లేదు.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు సౌభరి
చరిత్రమును తెలుపునట్టిదైన పదునాలవ అధ్యాయకథ.



## పంచదశోఽధ్యాయః.

వసిష్ఠః.—వివాహం విధివత్కృత్వా మృగశృంగో మహామునిః, గార్హస్థ్యం సమ్యగచర ద్వేదోక్తేనైవ వర్త్మనా. తస్య గార్హస్థ్యసదృశం నాస్తి లోకే ప్రదృశ్యతే, సువృత్తా కమలాచైవ విమలా సురసా తథా. పాతివ్రత్యరతా నిత్యం పతిశుశ్రూషణేరతాః. తథైవ తస్య భార్యాణాం పాతివ్రత్యసమం నహి, ఏవం తాభి స్స ధర్మాత్మా సమ్యగ్ధర్మం చకారహ. దిలీపః.—పతివ్రతాలక్షణంచ గృహస్థాశ్రమలక్షణమ్, విస్తరా చ్ఛ్రోతు మిచ్ఛామి బ్రూహి మే మునిసత్తమ. వసిష్ఠః.—శృణు రాజన్ ప్రవక్ష్యామి గృహస్థాశ్రమలక్షణమ్, సదాచారవతా పుంసా జితౌ లోకా వుభావపి. బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ ధర్మమర్థంచ చింతయేత్, కాయక్లేశం తదుద్భూతం ధ్యాయీంత మనసాచిరమ్. నైరృత్యామిషువిక్షేప మతీత్యాభ్యధికం

---

## పదునైదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—మహామునియైన మృగశృంగుడు శాస్త్రమునందు చెప్పబడిన చొప్పున వివాహము చేసికొని వేదమార్గము తప్పకుండ గృహస్థధర్మమును నడపెను. అతని గృహస్థత్వమునుబోలిన గృహస్థత్వము ఈలోకమునం దెక్కడను కనబడదు. అతని భార్యలైన సువృత్త కమల సురస అనువారు ఎల్లప్పుడును పతివ్రతాధర్మమునందు అక్కరగలవారును పెనిమిటికి శుశ్రూష చేయుటయందు ఆసక్తిగలవారునైయుందురు. ఆమృగశృంగునిభార్యలయొక్క పాతివ్రత్యమువంటి పాతివ్రత్యము లోకమునం దెవరియందును లేదు. ఇట్టినడవడిగల ఆభార్యలతోడ అతడు లెస్సగా స్వధర్మమును నడపుచుండెను.

దిలీపునిమాటలు.—ఓమునీశ్వరా! గృహస్థాశ్రమలక్షణమును పతివ్రతాలక్షణమును సవిస్తరముగా వినవలెననుకోరిక నాకు కలదు కాబట్టి విశదముగా తెలియజెప్పుము.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా! మంచి నడవడిగల మనుష్యునిచేత ఇహపరలోకములు రెండును గెలువబడుచున్నవి. కనుక, ఆమంచినడవడికి ఆధారమైన గృహస్థాశ్రమముయొక్క ధర్మమును చెప్పెదను వినుము. గృహస్థుడగువాడు తెల్లవారుజామున లేచి ధర్మమును అర్థమును విచారించి వానివలని దేహాశ్రమమును తన మనసులో దీర్ఘముగా ఆలోచించి పిమ్మట గ్రామమునకు నైరృతిదిక్కునుగూర్చి బయలుదేరి అమ్మువేటు

భువి, దూరాదావసథాన్మూత్రం పురీషం చ విసర్జయేత్. దివాసంధ్యాసు కర్ణస్థ బ్రహ్మసూత్ర ఉదఙ్ముఖః, అంతర్ధాయ తృణైర్భూమిం శిరః ప్రావృత్య వాససా. వాచం నియమ్య యత్నేన నిష్ఠీవోచ్ఛ్వాసవర్జితః, తిష్ఠేన్నాతిచిరం తత్ర పురీషం నావలోకయేత్. గృహీతశిశ్నశ్చోత్థాయ శౌచం కుర్యాదతంద్రితః, ఆయాజికైస్తృణైశ్శుష్కైస్సమృజ్యోత్థాయ సత్వరః. గృహీతశిశ్నో వామేన కరేణ దృఢమగ్రతః, నశౌచకరణాత్పూర్వం ముంచేదేషవిధిస్స్మృతః. శౌచంకుర్యాత్ప్రయత్నేన గంధలేపాపనుత్తయే, ఉద్ధృతాభిర్మృద్భిరద్భి ర్యథాసంఖ్యం సమాచరేత్. తీర్థే శౌచం నకుర్వీత కుర్వీతోద్ధృతవారిణా, దూరంజలాశయాత్కుత్ర నసమక్షం ద్విజన్మనామ్. అరత్నిమాత్రకజలం త్యక్త్వా కుర్యాదనుద్ధృతే, మలప్రక్షాళితం తోయం నస్పృశేన్నయథాజలమ్. పశ్చాత్తచ్ఛోధయేత్స్థానం అన్యథా హ్యశుచిర్భవేత్, ఏకాలింగే గుదేపంచ తథా వామకరే దశ. దద్యాచ్చ పంచతత్పృష్ఠే ఉభయోస్సప్తమృత్తికాః,

---

దూరమునకంటె అవతలపోయితనయింటికిదూరముగా మూత్రపురీషములను విడువవలెను. ఆమూత్రపురీషములను విడుచునప్పుడు తెల్లవారిగాని సంధ్యవేళగాని యజ్ఞోపవీతమును చెవికిచుట్టి ఉత్తరపు మొగమై తలను వస్త్రముచేత కప్పుకొని గడ్డిచేత ఆవరింపబడిన భూమియందు గూర్చుండి మాటలాడక ఊపిరివిడువక క్రాసియుమియుక విశేషకాలము ఊరకకూర్చుండక మలమూత్రములను విడిచి ఆమలమును చూడకుండపురుషచిహ్నమును చేత నవలంబించి లేచి యెచ్చరికతో శౌచము చేసికొనవలెను. ఆశౌచము చేసికొనునపుడు తొలుత యజ్ఞకార్యము మొదలగువానికి ఉపయోగింపని యెండిన గడ్డిపోచలచేత ముడ్డితుడుచుకొని ఎడమచేత పురుషచిహ్నము నవలంబించి దుర్గంధమంతయును బొత్తిగా పోవునట్లు మట్టితోను జలముతోను లెక్కచొప్పున ప్రక్షాళనము చేసికొనవలెను. ఆప్రక్షాళనమును నదులలోను కొలకులలోను రేవులలోదిగి చేయరాదు. అందలి నీళ్లు బయటికి తెచ్చుకొని చేయవలసినది. జలప్రదేశమునకు ఎదుటను బ్రాహ్మణునికి ఎదుటను చేయరాదు. జలమును బయటికి తెచ్చుకొనుటకు పాత్రము లేనియెడల రేవునకు కొంత ఎడముగా వెడలి మూరెడులోతుగలయుదకమునందు ఆయుదకము జలాశయములో కలియకుండ కట్టకట్టి ప్రక్షాళనము చేసికొని ఆపిమ్మట ఆచోటిని శుద్ధిచేయవలెను. అట్లు చేయనియెడల అదిఅపరిశుద్ధమగును. ఒకసారిలింగమును అయిదుమారులు గుదమును పది మారులు ఎడమచేతిని ఆరెండవచేతి వెనుకభాగమును అయిదుమారులును మరల రెండు

శౌచమేవం సునిర్వర్త్య పాదశౌచం సమాచరేత్, దేశాంతరంగతః పశ్చాత్పాదయోః పంచపంచచ. హస్తౌచ క్షాళయేత్సప్త సప్తభిర్మృజ్జలైర్ద్విజః, బద్ధ కచ్ఛశిఖః పశ్చాదాచమే దుపవీతవాన్. అంతర్జానుశ్శుచౌదేశే ఉపవిష్ట ఉదఙ్ముఖః, ప్రాశ్య బ్రాహ్మణ తీర్థేన ద్విజో నిత్యముపస్పృశేత్. పూర్వంగండూషయేత్పశ్చాదాచమేచ్చ విధానతః, సపవిత్రేణ హస్తేన కుర్యాదాచమనక్రియామ్. నోచ్ఛిష్టం తత్పవిత్రంతు భుక్తోచ్ఛిష్టంతు వర్జయేత్, ఉత్థాయ నేత్రే ప్రక్షాళ్య దంతకాష్ఠం సమాచరేత్. (ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశు వసూనిచ, బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వంనోదేహివనస్పతే.) ఇతిమంత్రం సముచ్చార్య పశ్చాదాచమనంచరేత్, ఆచమ్యైవం తతఃపశ్చాద్దంతధావనమాచరేత్. ఉపవిశ్య శుచౌదేశే ప్రాఙ్ముఖోదఙ్ముఖోపివా, దంతకాష్ఠం శాస్త్రసిద్ధం గృహీత్వా మంత్రపూర్వకమ్. ఆప్యాయస్వేతి మంత్రేణ

---

చేతులు ఏడుమారులును మట్టిచే కడుగుకొని పిమ్మట కాళ్లు కడుగుకోవలయును. పిమ్మట ఆచోటువిడిచి మరియొకచోటికిపోయి అయిదేశిమారులు కాళ్లనుమట్టిచేతశుద్ధిచేసికొని అవతల రెండుచేతులను మట్టిచేత ఏడేసిమార్లు శుద్ధిచేసి కడుగుకోవలెను. ఇట్లు పరిశుద్ధుడై బ్రాహ్మణుడు వస్త్రము చక్కగా కట్టుకొని జుట్టువిడిచి ముడివేసికొని జన్నిదమును ఉపవీతము చేసికొని పిమ్మట ఆచమనము చేయవలెను. అవల మోకాళ్లు ముందరికి అణచుకొని ఉత్తరముఖముగా పరిశుద్ధమైనచోట కూర్చుండి బ్రహ్మతీర్థముగుండ ఆచమనము చేయావలెను. ఆయాచమనమును తొలుత జలము పుక్కిలించియాచి పిమ్మట చేయవలసినది. మరియు ఆచమనము చేయునప్పుడు చేత పవిత్రము వేసికోవలెను. ఆచమనము చేసి అయినపిమ్మట నీళ్లచేత కన్నులు తుడుచుకొని పండ్లుతోముకొనెడి పుల్లను కడిగి చేతపట్టుకొని "ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశు వసూనిచ, బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వంనోదేహి వనస్పతే." (ఓవృక్షశాఖా! నాకు ఆయుస్సును బలమును యశస్సును తేజస్సును బిడ్డలను పసులను ధనమును వేదార్థజ్ఞానమును ధారణాపటిమైన బుద్ధిని నీవు ఇమ్ము.)అను అర్థముగల మంత్రమునుచెప్పి ఆచమనము చేసి పండ్లు తోముకోవలెను. అపండ్లు తోముకొనునపుడు పరిశుద్ధమైన ప్రదేశమునందు ఉత్తరపుమొగముగాగాని తూర్పుమొగముగాగాని కూర్చుండవలెను. పల్లుతోముకొను పుల్ల శాస్త్రసిద్ధమైనదిగా ఉండవలెను. అట్టిపుల్లను మునుపుచెప్పిన మంత్రమును ఉచ్చరించుచు పుచ్చుకొని "ఆప్యాయస్వ" ఇత్యాదిమంత్రముచేత దంతధావన

ఆచరేద్దంతధావనమ్, అష్టమ్యాంచ నవమ్యాంచ పంచదశ్యాంచ జన్మని. తైలం మాంసం వ్యవాయంచ దంతకాష్ఠంచ వర్జయేత్, ద్వాదశ్యాం ప్రతిపత్ షష్ఠ్యో ర్మాతా పిత్రోర్మృతేహని. దంతకాష్ఠంచ తైలంచ వర్జయేన్మైథునక్రియామ్, ఋతుస్నాతాంనగచ్ఛేతమాతాపిత్రోర్మృతేహని. ద్వాదశ్యాంచ చతుర్దశ్యాం ఋతుగామీ నదోషభాక్, కంటకక్షీరవృక్షోత్థం ద్వాదశాంగుళ మవ్రణమ్. కనిష్ఠాంగుష్ఠవత్ స్థూలం, పూర్వార్ధ కృతకూర్చకమ్, శుచిర్ద్వాదశగండూషై ర్నిషిద్ధదివసేషుచ. తృణపర్ణైస్సదా కుర్యాత్ భోజనేఽభక్ష్య భక్షణే, ఆచమ్య ప్రయతస్సమ్యక్ప్రాతః స్నానం సమాచరేత్. పవమానానువాకేన తథాచ ద్రుపదాదివ, అన్యైరబ్లింగమంత్రైశ్చ ప్రోక్ష్య స్నాయా దనంతరమ్. స్నాత్వా తీరం సమాసాద్య స్థిత్వాచమ్య విధానతః, స్థిత్వా పునఃపూర్వముఖ ముత్తరస్యోథవాద్విజః. పాదాద్వా యుగ్మతః కృత్వా పూరయేదుద

---

ముచేయవలెను. ఇదిగాక అష్టమినాడును నవమినాడును పున్నమనాడును తానుపుట్టిన నక్షత్రము నాడును గృహస్థుడగువాడు అభ్యంగమును మాంసభక్షణమును మిథునకర్మమును దంతధావనమును మానవలెను. ద్వాదశి పాడ్యమి షష్ఠి ఈతిథులయందును తల్లిదండ్రుల శ్రాద్ధదినములందును దంతధావనమును అభ్యంగమును మిథునకర్మమును కూడదు. తల్లిదండ్రుల శ్రాద్ధదినమునందు ఋతుస్నానముచేసిన భార్యతోడనైనను కూడరాదు. ఋతుస్నానముచేసిన భార్యతోడ ద్వాదశినాడును చతుర్దశినాడును పొందినను దోషము లేదు. పండ్లుతోముకొనుపుడక ముండ్లుగలచెట్టునందుండిగాని పాలుగలచెట్టునందుండిగాని గ్రహింపవలయును. ఆపుడక పండ్రెండంగుళములపొడుగు గలిగి బుడుపులులేనిదియును చిటికెనవ్రేలి లావు గలదియునై యుండవలెను. దానిమొదలు చిత్తరువువ్రాయు తూలికవలె నుండునట్లు మెత్తపడ నలియగొట్టి పండ్లుతోముకోవలెను. ఏదినములలో పండ్లు తోముకోకూడదని శాస్త్రమునందు చెప్పబడియుండునో ఆదినములయందు పండ్రెండుమార్లు పుక్కిలించుటచేతనే పరిశుద్ధి. ఐనను భోజనపదార్థములలో భుజించఁగూడనిపదార్థములయొక్క భక్షణమువలన కలుగుమురికిపోవుటకై గడ్డిపోచ ఆకుమొదలైనవానిచేత దంతధావనము చేయవలెను. ఇట్లు ముఖశుద్ధి కాగానే ఆచమనము చేసి పరిశుద్ధుడై ప్రాతస్స్నానము చేయవలసినది. ఆస్నానకాలమందు 'పవమానస్సువర్జనః' అను అనువాకము చేతను, 'ద్రుపదాదివ' అను మంత్రముచేతను, మరికొన్ని అబ్లింగములు అనఁగా ఆపోహిష్ఠాదిమంత్రములచేతను ఉదకమును చల్లుకొని అనంతరము స్నానముచేసిన గట్టెక్కి శాస్త్రవిధిచొప్పున ఆచమనముచేసి ఉత్తరముఖముగానైనను తూర్పు

కాంజలిమ్, గోశృంగమాత్రముద్ధృత్య జలమధ్యే జలంక్షిపేత్. యేన తీర్థేనగృహ్ణీయాత్తేనతీర్థేనతర్పయేత్, దేవతీర్థేనవై దేవాన్ ఋషితీర్థే నవై ఋషీన్. పితౄంశ్చ పితృతీర్థేన స్నానాంతే తర్పయేత్క్రమాత్, ఉత్థాయ వాససీశుక్లే శుద్ధేతు పరిధాయవై. ఉత్తరీయం సదాధార్యం బ్రాహ్మణేన సదాశుచిః, శిఖాం బద్ధ్వా తతః పశ్చాత్ప్రక్షాళ్యాద్భి ర్మృదా సహ. ఆచమ్య ప్రయతో భూత్వా హ్యూర్ధ్వపుండ్రంచ ధారయేత్, భస్మితేన త్రిపుండ్రంచ గోపీచందనమృత్తికా. ఊర్ధ్వం నకారయేద్భస్మ మృదా తిర్యఙ్న ధారయేత్, భసితే నోర్ధ్వపుండ్రంచ సదాతిర్యక్చయోద్విజః. ధారయేన్నరకే ఘోరే వసేదాకల్పసంక్షయాత్, ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రంవా పూర్వాచరితమాచరేత్. మంత్రవత్ప్రాణానాయమ్య సప్తవ్యాహృతిపూర్వకమ్, తర్జనీ మధ్యమాస్పృష్టా నాసికా ప్రాణసంయమః. అమంత్రక మసల్లాపం ప్రాణాయామం

---

ముఖముగానైనను రెండుపాదములను ఒకటిగా చేర్చుకొని నిలువబడి దోసిట నీళ్లుపట్టుకొని గోశృంగప్రమాణముగాఎత్తి(కనుబొమ్మల పొడుగున కెత్తి) నీళ్ళనడుమ విడువవలయును. మరియు బ్రాహ్మణునిచేత వ్రేళ్ల కొనలయందు దేవతీర్థమును రెండు చిటికెనవ్రేళ్లనడుమను ఋషితీర్థమును బొట్టనవ్రేలికిని చూపుడు వ్రేలికిని నడుమ పితృతీర్థమును బొట్టనవ్రేలిమొదట బ్రహ్మతీర్థమును ఉండునుగనుక ఈచెప్పబడిన దేవతలు మొదలగు వారలకు ఆతీర్థములగుండ తర్పణము చేయవలెను. అందువలన వారు తృప్తిపొందుదురు. కనుక స్నానముచేసికాగానే దేవతీర్థమువలన దేవతలకును ఋషితీర్థమువలన ఋషులకును పితృతీర్థమువలన పితృదేవతలకును తర్పణముచేసి అంతట నీళ్లలోనుండి వెలుపలికివచ్చి తెల్లగాఉదికి యెండవేసిన మడిబట్టలనుగట్టుకొని ఉత్తరీయమును పైనివేసికొని జుట్టు చక్కగా ముడివేసికొని పిమ్మట రెండుచేతులను లెస్సగా మట్టివేసితోమి కడుగుకొని పరిశుద్ధుడై ఆచమనముచేసి ఊర్ధ్వపుండ్రమును ధరించి పిమ్మట భస్మముచేత త్రిపుండ్రమునైనను మృత్తుచేత గోపిచందమునైనను ధరింపవలెను. భస్మముచేత ఊర్ధ్వపుండ్రమును (నిలువుబొట్టును) మృత్తుచేత తిర్యక్పుండ్రమును (అడ్డబొట్టును) ధరింపగూడదు. ఎవడు భస్మముచేత ఊర్ధ్వపుండ్రమును ధరించునో వాడు ప్రళయపర్యంతము నరకమునందు వసించును. ఊర్ధ్వపుండ్రమునుగాని తిర్యక్పుండ్రమునుగాని తమపెద్దలు ధరించినదానిని తాము ధరింపవలెను. పుండ్రధారణము అయినపిమ్మట తర్జనీ మధ్యమాంగుష్ఠములచేత ముక్కుపట్టుకొని "ఓంభూః" అనుమంత్రముచేత ప్రాణములను బంధించి విడిచి పిమ్మట

పరిత్యజేత్, ప్రాణానేవం సమాయమ్య సంధ్యోపాస్తిం సమాచరేత్. ఆపోహిష్ఠే త్యృచా కుర్యాత్ మార్జనంతు కుశోదకైః, పూర్వంసప్రణవైః పాదైః పశ్చాదర్ధాంశత స్తథా. తతస్సప్రణవై ఋగ్భి స్సర్వాభిశ్చ తతఃపరమ్, భువి మూర్ధ్ని తథా కాశే మూర్ధ్న్యాకాశే తథా భువి. ఆకాశే భువిమూర్ధ్నిప్యా న్మార్జయేచ్చ కుశోదకైః, పరిషిచ్యాద్భిరాత్మానం వ్యాహృతీభి స్తథాచమేత్. ఆపోహిష్ఠేతి తిసృణాం సింధుద్వీప ఋషిస్స్మృతః, ఛందోనుష్టు బ్దేవతాశ్చ ఆపోవై పరికీర్తితాః. ఆత్మానం ప్రోక్షణే శుద్ధే వినియోగ ఉదాహృతః, ఏవంసమ్మృజ్యం విప్రేంద్ర స్తతో మంత్రవదాచమేత్. ఋగ్యజుస్సామవేదాంశ్చ ప్రత్యేకం ప్రణవాన్వితాన్, ప్రీణాతు స్వాహే త్యుచ్చార్య త్రిః పీత్వాప ఉపస్పృశేత్. అంగుష్ఠమూలదేశేన ఓష్ఠౌ తిర్యగ్ద్విరున్మృజేత్, అథర్వాంగిరసస్స్మృత్యస్మృత్యైవ బ్రాహ్మణానిచ. పాదౌ హస్తౌచ సంప్రోక్ష్య తావస్యాగ్రం సముపస్పృశేత్, సంహితాభి స్త్రిభిః పూర్వ మంగుళీభిర్ద్విజోత్తమః.

---

సంధ్యావందనమును ప్రారంభింపవలెను. ఆపోహిష్ఠయను ఋక్కుచేత దర్భలతో నీళ్లు చల్లుకోవలెను. ఆనీళ్లు చల్లుకొనునపుడు ఆ ఋక్కుయొక్క మొదటి నాలుగు పాదములు ప్రణవమును ముందుజేర్చియు వెనుకటి నాలుగుపాదములను ప్రణవము చేర్పకయు చెప్పి పిమ్మట ప్రణవమును ముందుజేర్చి అన్నిఋక్కులను చెప్పుచు భూమియందును శిరస్సునందును అట్లే ఆకాశమునందును శిరస్సునందును మరల భూమియందును ఆకాశమునందును శిరస్సునందును దర్భవలని నీళ్లను చల్లి పిమ్మట తన శరీరమునందంతటను చల్లుకొని, "ఓం భూర్భువస్సువః" అను వ్యాహృతిమంత్రమునుచెప్పి నీళ్లుచుట్టి ఆచమనము చేయవలెను. ఆపోహిష్ఠయనునది మంత్రము సింధుద్వీపుడు ఋషి. అనుష్టుప్ఛందస్సు. అప్పులు (నీళ్లు) దేవత. ఈమంత్రమునకు నీళ్లు చల్లుకొనుట వినియోగము. ఇట్లు బ్రాహ్మణుఁ డగువాడు సమ్మార్జనము చేసికొని పిమ్మట మంత్రపూర్వకముగా ఆచమనము చేయవలెను. పిమ్మట ప్రణవముతో గూడిన ఋగ్యజుస్సామ వేదములను ప్రీణాతు స్వాహా అని చెప్పుచు ఒక్కొక్క వేదమును ఒక్కొక్కసారి ఉచ్చరించి మూడుసారులు ఆచమనముచేసి బొటనవ్రేలి మొదటితో రెండు పెదవులను అడ్డముగా రెండుమార్లు తుడుచుకొని ఆథర్వాంగిరములను మంత్రములను బ్రాహ్మణము లనబడు మంత్రములను స్మరించి రెండుకాళ్లపైని రెండుచేతులపైని నీళ్లు చల్లుకొని మూతితుడుచుకొని కర్మములను నడపునట్టి క్రమము నెరిగినపండితులు తొలుత ఒకటితో నొకటి

ఇతిహాసపురాణాని కల్పా౯ గాథాన్నృపోత్తమ. నారాశంసాశ్చ సం స్మృత్య కార్యవిద్భిరుపస్పృశేత్, తర్జన్యంగుష్ఠయోగేన నాసారంధ్రైః పృథక్పృథక్. సూర్యశ్చ ఇతిమంత్రేణ మంత్రితం ప్రాశయేజ్జలమ్, కరాభ్యాం తోయమాదాయ గాయత్ర్యాచాభిమంత్రితమ్. ఆదిత్యాభిముఖ స్తిష్ఠ౯ త్రిభిరూర్ధ్వముధఃక్షిపేత్, పూర్వాంసంధ్యాంసనక్షత్రా ముపాసీత యథావిధి. గాయత్రీ మభ్యసేత్తావ ద్యావ దాదిత్యదర్శనాత్, మంత్రైస్సవితృదైవత్యై రుపస్థాయ కృతాంజలిః. ప్రాతస్సంధ్యాంచ గాయత్రీం సావిత్రీంచ సరస్వతీమ్, కామోమన్యురకార్షీశ్చ సర్వదేవేభ్యఏవచ. షట్ప్రదక్షిణమావృత్య నైవంచైవాభివాదయేత్, ఆత్మపాదౌ తథాభూమిం సంధ్యాకాలేఽభివాదయేత్. యశ్చసంధ్యాముపాసీత శ్రద్ధయావిధివన్నరః, నతస్య కించిదప్రాప్యం త్రిషులోకేషువిద్యతే. సంధ్యాకర్మావసానేతు హోమం కుర్యాద్యథావిధి, దినశూన్యం నకుర్వీత యత్కించిద్దానవాన్భవేత్. దివసస్యాదిమేభాగే కృత్యమేతదుదీరి

---

చేరుకొన్న మూడువ్రేళ్లచేత ఇతిహాసములను కల్పసూత్రములను విశేషకథలను నారాశంసా అనుమంత్రములను తలఁచి నీళ్లనుముట్టి కాళ్లుచేతులు మొదలగు అవయవములను తుడుచుకొందురు. బొటనవ్రేలియొక్కయుం చూపుడువ్రేలియొక్కయుం చేరికకలపుడిసిటితో నీళ్లెత్తి ముక్కురంధ్రములను వేఱువేఱుగా తాకించి విడిచి సూర్యశ్చ అనుమంత్రముచేత మంత్రింపబడినజలమును పుచ్చుకోవలెను. పిమ్మట దోసిట నీళ్లెత్తుకొని సూర్యునికి ఎదురుగానిలిచి గాయత్రిచేత అభిమంత్రించి పైకెత్తి క్రిందపడునట్లుగా ముమ్మారు విడిచి శాస్త్రమునందుచెప్పబడినచొప్పున నక్షత్రములతోకూడిన ఆకాశమును చూచుచు ప్రాతస్సంధ్యను స్తోత్రము చేయవలెను. అనగా ప్రొద్దుపొడువకమునుపే యథావిధిగా ఇట్లు సంధ్యావందనము చేయవలెను. అటుపిమ్మట సూర్యుడు చక్కగాకనబడునంతవరకు గాయత్రీజపముచేసి అంతట సూర్యదేవతాకములైన మంత్రముచేత ఉపస్థానముచేసి ప్రాతస్సంధ్యను గాయత్రి సావిత్రి సరస్వతి అనుమంత్రాధిదేవతలను కామోకార్షీత్ అనుమంత్రమును ప్రార్థించి, ఎల్లదేవతలకొరకును ఆరుప్రదక్షిణములుచేసి తనయడుగులుమోపినందుకు భూమికి నమస్కారము చేయవలెను. ఎవడు శాస్త్రపద్ధతితప్పక శ్రద్ధతో సంధ్యావందనము చేయునో వానికి పొందరానిది మూడులోకములలోను కలుగదు. సంధ్యావందనము అయినపిమ్మట యథావిధిగా హోమము చేయవలెను. దినము వ్యర్థముపోకుండ కలకొలదిని ఏమాత్రమైన దానముచేయవలెను. పగటికాలమును ఎనిమిది భాగములుగా భాగించుకొని అందు మొదటిభాగమునందు ఈకర్మములను చేయవలెను.

తమ్, ద్వితీయేతు తథాభాగే వేదాభ్యాసో విధీయతే, సమిత్పుష్ప కుశాదీంశ్చ సంభారానాహరేద్ద్విజః. తృతీయేచ పునర్భాగే న్యాయాద్విత్తంచ దార్జయేత్, అక్లేశేన శరీరస్య యదృచ్ఛాలాభమాహరేత్. షణ్ణాంతు కర్మణాం మధ్యే త్రీణి కర్మాణి జీవికా, యాజనాధ్యాపనేచైవ విశిష్టాచ్చ ప్రతిగ్రహః. చతుర్థేచ తథాభాగే మధ్యాహ్నస్నానమాచరేత్, మధ్యాహ్నే విధివత్స్నాత్వా స్నానాంగం తర్పయేత్పునః. దేవానృషీన్పితౄంశ్చైవ తత్తత్తీర్థేన తర్పయేత్, ఆపోహిష్ఠేతిమంత్రేణ సంప్రోక్ష్యనిజమూర్ధని. ఆపఃపునంతు మంత్రేణ మంత్రితంప్రాశయేజ్జలమ్, ఆపఃపునంతు మంత్రస్య ఋషిరాపః ప్రకీర్తితాః. ఛందోనుష్టుప్తథాదేవీ దేవతా ఇత్యుదీరితా, వినియోగస్త్వపాంపానే పునర్మంత్రవదాచమేత్. కరాభ్యాం తోయమాదాయ గాయత్ర్యాచాభిమంత్రితమ్, అర్ఘ్యమేకం రవేర్దద్యా త్సావిత్రీంచ జపేత్పునః. సావిత్ర్యాతు యథాశక్తి రుపస్థాయ దివాకరమ్, ప్రదక్షిణం సమావృత్య నమస్కృత్యోపవిశ్యచ. దర్భేషు దర్భపాణిభ్యాం సహితాభ్యాం కృతాంజలిః,

---

రెండవభాగమునందు వేదాభ్యాసము చేయుచు సమిధలు పువ్వులు దర్భమొదలగు వస్తువులను సంపాదించుకొనవలెను. మూడవభాగమునందు దేహమునకు శ్రమము కలుగకుండ దొరకినమట్టుకు కొంచెముద్రవ్యము సంపాదించుకొనవలసినది. బ్రాహ్మణునికి ఏర్పరుపబడిన యజ్ఞములు చేయుట యజ్ఞములు చేయించుట వేదములు చదువుట వేదము చదివించుట దానములు ఇచ్చుట పుచ్చుకొనుట అను ఆరుకర్మలలో యజ్ఞము చేయించుట వేదము చదివించుట యోగ్యులవలన దానము పుచ్చుకొనుట అను నీమూడును బ్రదుకుతెరువులుగా ఏర్పరుపఁబడినవి. నాలుగవభాగమునందు మధ్యాహ్నస్నానమును ఆస్నానాంగములైన దేవర్షి పితృతర్పణములను ఆయాతీర్థములగుండ చేసి ఆపోహిష్ఠ అనుమంత్రముచేత తలపై జలముచల్లుకొని పుడిసిట జలమెత్తి ఆపఃపునంతు అను మంత్రముచేత అభిమంత్రించి పుచ్చుకొనవలెను. ఈమంత్రములకు అప్పులు ఋషియు అనుష్టుప్పు ఛందస్సును జలమును పుచ్చుకొనుట వినియోగమునుగా చెప్పఁబడియున్నది. ఆటుపిమ్మట మంత్రమునుచెప్పి ఆచమనముచేసి దోసిట నీళ్లెత్తుకొని గాయత్రిచేత అభిమంత్రించి సూర్యునిగూర్చి యెత్తివిడిచి అనంతరము గాయత్రీజపముచేసి తనశక్తికొలదిని సూర్యోపస్థానముచేసి అంతట ప్రదక్షిణ నమస్కారములనుచేసి దర్భాసనముపై కూర్చుండి పవిత్రమును ధరించి చేతులు జోడించుకొని బ్రహ్మయజ్ఞము కొరకు

స్వాధ్యాయంతు యథాశక్తి బ్రహ్మయజ్ఞార్థ మాచరేత్, ఋక్సామాథర్వ వేదోక్తాన్ జపేన్మంత్రాన్యథావిధి. జపిత్వైవం తతః కుర్యా ద్దేవర్షి పితృతర్పణమ్, ఉపవీతీనివీతీచ ప్రాచీనావీతిమానపి. తత్తత్తీర్థేన సర్వేషాం భూతానాం జలదో భవేత్, జలదేవా న్నమస్కృత్య గృహంగత్వా సమాహితః. కుర్వీత దేవపూజాంచ జపయజ్ఞా దనంతరమ్, ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్. బ్రాహ్మణః పూజయేత్పంచ పంచయజ్ఞపరాయణః, వైశ్వదేవం తతః కృత్వా బలీనపి యథావిధి. తతః పంచమహాయజ్ఞాన్ కుర్యాద్భూతబలింతతః, కాక శ్వాన బలించైవ దత్వామ్ముం మంత్ర ముచ్చరేత్. (శ్వానౌద్వౌ శ్యామశబలౌ వైవస్వత కులోద్భవౌ, తాభ్యామన్నం ప్రదాస్యామి రక్షేతాం పథి మాం సదా.) దేవామనుష్యాః పశవోవయాంసి సిద్ధా స్సయక్షోరగదైత్యవర్గాః, ప్రేతాఃపిశాచా స్తరవ స్సమస్తా యేచాన్న మిచ్ఛంతి మయాద్యదత్తమ్. పిపీలికాఃకీటపతంగికాద్యాః బుభుక్షితాః కర్మనిబంధబద్ధాః, ప్రయాంతు తే తృప్తిమిదం మయాన్నం తేభ్యోవిసృష్టం సుఖినఃప్రయాంతు. యేషాన్న మాతానపితానబంధు ర్నచాన్నదాతా నతథాన్నమస్తి, తత్తృప్తయే

---

తనశక్తికొలది వేదము పఠించి యథావిధిగా ఋక్కుయజుస్సు సామము అనబడు మూడువేదములందును చెప్పబడిన మంత్రములు శాస్త్రవిధిచొప్పున జపముచేసి పిమ్మట ఉపవీతిగా దేవతర్పణమును నివీతిగా ఋషితర్పణమును ప్రాచీనావీతిగా పితృతర్పణమును క్రమముగాచేసి అటుపిమ్మట ఎల్లభూతములకును జలప్రదానముచేసి జలదేవతలకు మ్రొక్కి యింటికి వచ్చి నెమ్మదిగా దేవతార్చనచేయ బూనుకొన్నవాడై సూర్యుని పార్వతిని విష్ణువును వినాయకుని శివునిని క్రమముగా అర్చనచేసి వైశ్వదేవముచేసి యథావిధిగా బలులుపెట్టి పిమ్మట పంచమహాయజ్ఞములను భూతబలిని చేయవలెను. అటుపిమ్మట, "శ్వానౌద్వౌ శ్యామశబలౌ వైవస్వతకులోద్భవౌ, తాభ్యామన్నం ప్రదాస్యామి రక్షేతాం పథిమాం సదా" అనుమంత్రమును చెప్పి, కాకికి కుక్కకును బలియిచ్చి ఆవల దేవతలు పక్షులు సిద్ధ యక్ష సర్పరాక్షసులు ప్రేతములు పిశాచములు వృక్షములు మొదలగుప్రాణులలో ఏప్రాణులు అన్నమును గోరుచుండునో ఆప్రాణులెల్లను నాచే నియ్యబడెడి యీయన్నముచేత తృప్తిపొందవలెను. చీమలు పురుగులు తేనెటీగలు మొదలైనవి పూర్వముచేసిన చెడ్డపనులవలన తక్కువజన్మమునొంది ఆకలిగొనియుండునవి యన్నియు నాచేత నియ్యబడునట్టి యీ యన్నమును దిని తృప్తిపడి సుఖింపవలయు. ఎవరు తల్లిదండ్రులు చుట్టములు అన్నము పెట్టువారును లేమిచే

న్నంభువిదత్తమేతత్తేయాంతు తృప్తింముదితాభవంతు. ఇత్యుక్త్వాసర్వ
భూతేభ్యో బలిందద్యాత్పృథక్పృథక్, తతఆచమ్యవిధివచ్ఛ్రద్ధయాప్రీ
తిమానసః. ద్వారావలోకనంకుర్యా దాతిథ్యగ్రహణాయవై, గోదోహ
కాలమాత్రేతు భాగ్యాల్లబ్ధేతిథౌయది. దేవవత్పూజయేద్భక్త్యా యథా
శక్త్యన్నపానతః, భిక్షాంచ భిక్షవేదద్యా ద్విధివద్బ్రహ్మచారిణే ఆకల్పి
తాన్నాదుద్ధృత్య సర్వవ్యంజనసంయుతః, యతిశ్చ బ్రహ్మచారీచ పక్వా
న్నస్వామినావుభౌ. తయోరన్నమదత్వాతు భుక్త్వా చాంద్రాయణం
చరేత్, యతిహస్తే జలం దద్యా ద్భైక్ష్యం దద్యాత్పునర్జలమ్.
తద్భైక్ష్యం మేరుణా తుల్యం తజ్జలం సాగరోపమమ్, సత్కృత్య భిక్ష
వేభిక్షాం యే ప్రయచ్ఛంతి మానవాః. గోప్రదానసమంపుణ్య మిత్యా
హభగవాన్యమః, మాతాపితా గురుర్బంధు ర్గర్భిణీ వృద్ధబాలకాః. అతి
థ్యభ్యాగతేష్వేషు భుక్తవత్సు తతో గృహీ, ఉపలిప్తే శుచౌదేశే పాద

---

అన్నము గానక యుండురో వారి తృప్తికై నేనిచ్చునట్టి యీయన్నముచేత తృప్తిపొంది సుఖింతురుగాక. అను అర్థముగలశ్లోకములను పఠించి, అన్నిటికిని వేరువేరుగా బలిని యియ్యవలెను. ఇట్లు భూతబలిచేసి పిమ్మట ఆచమనముచేసి శ్రద్ధతోడను ప్రేమతోడను గూడిన మనసుతో అతిథిపూజకొరకు ఎవరైన వత్తురేమో యని తనయింటివాకిట కొంతసేపునిలిచి చూడవలెను. ఆవు దూడను విడిచి పాలుపితుకునంతటికాలము అట్లు అతిథిరాకకు ఎదురుచూచి అంతటిలో తన యదృష్టమువలన అతిథిదొరకినయెడ ఆయనను భక్తితో దేవుని పూజించునట్లు పూజించి తనశక్తికొలది అన్నపానములిచ్చి పిమ్మట యతికిని బ్రహ్మచారికిని భిక్షచేసి, అనగా యతియును బ్రహ్మచారియును ఒకయింటనుండి వంటచేసికొని భోజనము చేయువారుకారు గనుక వారికి తనయింట వండబడిన పప్పు కూర చారు మొదలగువానితోడ అన్నమియ్యవలెను. ఇట్లు ఇయ్యక భోజనముచేసినయెడల అందులకు ప్రాయశ్చిత్తముగా చాంద్రాయణవ్రతమును నడపవలెను. యతికి భిక్షసేయునపుడు తొలుత చేతికి నీళ్లిచ్చి అన్నకబళమునుంచి అది భుజించినపిమ్మట మరల చేతికి నీళ్లియ్యవలెను. అట్లు చేయబడినభిక్ష మేరువుతోసమానముగా పెరుగును. ఆజలము సముద్రముతో సమానముగా పెరుగును. ఇట్లు యతికి ఏగృహస్థులు భిక్షచేయుదురో ఆగృహస్థులు గోదానముచేసినఫలమును పొందుదురని షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన యముఁడు చెప్పెను. గృహస్థుఁడగువాఁడు తల్లి తండ్రి గురువు చుట్టములు కేకటియైనస్త్రీలు ముసలివారు పసిబిడ్డలు అతిథి అభ్యాగతుఁడు వీరందరు భోజనము

ప్రక్షాళనంతతః, పంచార్ద్రో భోజనం కుర్యా త్ప్రాఙ్ముఖో మౌన మాస్థితః. ప్రయత శ్శుద్ధపాత్రేషు వాగ్యతోన్న మకుత్సయన్, ప్రాణాగ్ని హోత్రవిధినా భుంజీయా దాత్మశుద్ధయే సాయంప్రాత ర్ద్విజాతీనాం అగ్నిహోత్రసమం విదుః, నైకసాక్షీ తతోశ్నీయా ద్భిన్నపాత్రే తథైవచ. ఏకఏవతు యోభుఙ్క్తే విమలే కాంస్యభాజనే, చత్వార స్తస్య వర్ధంతే ఆయుః ప్రజ్ఞాయశో బలమ్, ఏకస్మిన్నేవ పాత్రేస్యా ద్దంపత్యో ర్భోజనంయది, పంచాశచ్ఛ తాదూర్ధ్వం పలసంఖ్యా వినిర్మితే. అన్యథా పృథగేవ స్యా ద్దంపత్యోః పాత్రభోజనమ్, యోభుఙ్క్తేనుపవీతేన యస్తుభుఙ్క్తే స్త్రియాసహ. భుఙ్క్తేయఃకన్యయాసార్థం భుక్త్వాచాంద్రాయణం చరేత్, ఏకస్మిన్నేవ పాత్రేయ ద్దంపత్యో ర్భోజనం యది. సహభోజన మిత్యాహు స్తస్మాత్త త్పరివర్జయేత్, దర్వ్యాదేయం ఘృతం పక్తం సమ స్తవ్యంజనానిచ. పాత్రాన్నం కించిదాదాయ ధర్మరాజా

---

చేసిన పిమ్మట చక్కఁగా అలుకఁబడిన పరిశుద్ధప్రదేశమునందు కాళ్లుచేతులు కడుగుకొని ఆచమనముచేసి పరిశుద్ధుఁడై కూర్చుండి మౌనముతో నిర్మలమైన పాత్రమునం దుంచఁబడినయన్నమును లోపములు విచారింపక ఆత్మశుద్ధికొరకు ప్రాణాహుతిపూర్వకముగా భుజింపవలెను. ఉదయ సాయంకాలములయందు అగ్నిహోత్రము లెట్లో అట్లు భోజనమును నియతమని తెలియవలయును. ఒంటరిగాను వేఱువేఱు పాత్రములయందును భుజింపరాదు. ఎవఁడు కంచుపాత్రము ఒకటియందే భోజనముచేయునో వానికి ఆయుస్సు బుద్ధి కీర్తి బలము అనునీనాలుగును వర్ధిల్లును. ఒకపాత్రమునందే ఆలుమగలు ఇరువురును భుజింపవలయునన్నయెడల నూటయేబదిపలములకంచుతో చేయఁబడిన పాత్రకావలెను. అట్లు కానియెడల దంపతులు వేరువేరు పాత్రములలోనే భుజింపవలెను. ఎవఁడు ఉపనయనము కానివానితోడను ఆడువారితోడను పెండ్లికానిపడుచుతోడను పొత్తున భుజించునో వాఁడు చాంద్రాయణవ్రతమును నడపవలెను. జన్నిదమును దండగా వేసికొనియును ఆడువారిపొత్తునను పసిబిడ్డలపొత్తునను భుజించి చాంద్రాయణవ్రతమును నడపుటచేత ఆదోషమును పోగొట్టుకొనునుగాని భార్యాభర్తలిద్దరును ఒకపాత్రమునందు భుజించిన పాపమును పోగొట్టుకోనేరడు. కనుక పెండ్లాముతో పొత్తునభుజింపరాదు. ఆకుఁలో అన్నము వడ్డింపగానే ఆయన్నములో కొంచెము చేతపుచ్చుకొని అన్నివ్యంజనములతోడ గరిటెతో తేబడిన నేయిపోసికలిపి "నమాంతాన్ ప్రణవాదీంశ్చబలిందత్వాప్రదక్షిణే, యత్రక్వచనసంస్థానాంక్షుత్తృష్ణోపహతాత్మనామ్. భూతానాంతృప్తయే తోయ మిదమస్తు యథాసుఖమ్; యమాయేదంనమశ్చిత్రగుప్తాయేదం

యవై బలిమ్, దత్వాచ చిత్రగుప్తాయ భూతేభ్య ఇదముచ్చరేత్. నమాంతా న్ప్రణవాదీంశ్చ బలిందత్వా ప్రదక్షిణే, యత్రక్వచనసంస్థానాం క్షుత్తృష్ణోపహతాత్మనామ్. భూతానాం తృప్తయే తోయ మిద మస్తు యథాసుఖమ్, యమాయేదం నమశ్చిత్రగుప్తాయేదం నమోనమః. స్వాహాంతా న్ప్రణవాద్యాశ్చ నామ్నామంత్రేనభోజయన్, జిహ్వయా చ గ్రసేదన్నం దశనేన న దంశయేత్. అశ్నీయాత్తన్మనా భూత్వా పూర్వంతు మధురంరసమ్, లవణామ్లౌతథామధ్యే కటుతిక్తేతతస్తతః. పశ్చాత్తుద్రవమశ్నీయా న్మధ్యేతు కఠినాశనమ్, అంతేపునర్ద్రవాశ్నీతు బలారోగ్యేన ముంచతి. అష్టాగ్రాసా మునేర్భక్ష్యా ష్షోడశారణ్యవాసినః, ద్వాత్రింశతం గృహస్థస్య యథేష్టం బ్రహ్మచారిణః. నింద్యాచ్ఛాస్త్రనిషిద్ధంతు భక్ష్యభోజ్యాదికం ద్విజః, అభోజ్యం ప్రాహురాహారం శుష్కం పర్యుషితం తథా. భుక్త్వాచమ్య యథోక్తేన విధానేన సమా

---

నమోనమః.” అనుశ్లోకములను ఉచ్చరించుచు యమునకు చిత్రగుప్తునకు భూతములకును బలిగానిచ్చి సమస్తభూతములతృప్తికొరకు నాచేతనియ్యబడిన యీయన్నము అగుగాక యని యముని చిత్రగుప్తునిగూర్చి నమస్కారముచేసి, ఓమ్ అనునది మొదటను స్వాహా అనునది కడపటనుగల ప్రాణాది మంత్రములను చెప్పుచు ప్రాణాహుతులను తీసికొని భోజనము చేయవలెను. ఆప్రాణాహుతులు తీసికొనెడి అన్నమును నాలుకతోచప్పరించి మ్రింగవలెను గాని పండ్లతోనొక్కి నమలకూడదు. అట్లు భోజనము చేయునపుడు ఇతర విషయములందు బుద్ధినిపొందనియ్యక తొలుత కమ్మనిపదార్థములను ఆవల ఉప్పుపులుసు గలపదార్థములను పిమ్మట కారము ఒగరు గలపదార్థములను అటుపిమ్మట ద్రవపదార్థములను కఠినపదార్థములను కడపట మరల ద్రవపదార్థములను పుచ్చుకొనవలెను. ఇట్లు భోజనముచేసినయెడ బలమును ఆరోగ్యమును దేహమును వదలకయుండును. మరియు ఆహారనియమము ఎట్లనఁగా మునీశ్వరుఁడు అనఁగా సన్యాసి ఎనిమిదికబళములను, అడవియందు వాసముచేయునట్టివాఁడు(వానప్రస్థుఁడు) పదియారుకబళములను,గృహస్థుఁడగువాఁడు ముప్పదిరెండుకబళములను, ఇష్టమువచ్చినన్నికబళములను బ్రహ్మచారియు భుజింపవలసినది. కబళము అనఁగా పిడికిలికొలదిగా చేయఁబడినపిడుచ. ఈనియమమునుమాని శాస్త్రమునందు కూడదనిచెప్పఁబడినభోజనపదార్థములు మొదలగువానిని గ్రహింపరాదు. ఎండిపోయినఅన్నమును చల్దియన్నమును భుజింపరాదని పెద్దలు చెప్పుదురు. కనుక అట్టియన్నమును భుజించుటయు యుక్తము కాదు. బ్రాహ్మణుఁ డగువాఁడు ఈ చెప్ప

హితః. శోధయన్ముఖహస్తౌ చ మృదాద్భిర్ఘర్షణైరపి, ద్విరష్టవారం గండూష్య దంతలగ్నవిశోధనమ్. తృణపర్ణాప్సుదాకుర్యాద్భోజనే భక్ష్యభక్షణే, ఉచ్ఛిష్టపాత్రముత్సార్య మండలం పరిశోధ్యచ. ఆచమ్యప్రయతోభూత్వా కించిదార్ద్రేణపాణినా, ముఖ్యాన్ ప్రాణాన్ సమాలభ్య నాభిం పాణితలేనచ. అంగుష్ఠమాత్రఃపురుష ఇతిమంత్రేణ మంత్రవిత్, ఉదకేనాంగులీంసించే దర్ఘ్యమంగుష్ఠకే జలమ్. ఆచమ్య చోర్ధ్వబాహుస్సన్ ఆదిత్యాభిముఖస్తతః, శ్రద్ధాయామితి మంత్రైస్తు ఉపతిష్ఠేద్దివాకరమ్. తస్యేదంవిదుష ఇతివాప్యుపతిష్ఠేత భాస్కరమ్, శుద్ధః ప్రశాంతచిత్తస్తు కృతాసనపరిగ్రహః. అభీష్టదేవతానాంతు కుర్వీత స్మరణం తతః, పునరాచమ్య హృష్టాత్మా కుర్యాత్తాంబూలభక్షణమ్. భుక్త్వోపవిష్టో విశ్రాంతో బ్రహ్మకించిద్విచారయేత్, సచ్ఛాస్త్రాదివినోదేన ధర్మమార్గావిరోధినా. ఇతిహాసపురాణాభ్యాం షష్ఠసాప్తమికంనయేత్, అష్టమే లోకయాత్రాహి బహిస్సంధ్యాతతఃపునః. సూర్యేస్తశిఖరం ప్రాప్తే పాదశౌచ

---

బడినచొప్పున భుజించి ఆచమనముచేసి చేయి నోరు కడుగుకొనునపుడు చేతులను చక్కగా మట్టివేసితోమి కడుగుకొనిపదియారుమారులు పుక్కిలించి భోజనకాలమునందు ఏదైన పండ్లసందులలో చిక్కుకొని యున్నయెడల గడ్డిపరకచేతగాని ఆకు ఈనెచేతగాని గ్రుచ్చి తీసివేసి మరల చేయికడుగుకొని ఆచమనముచేసి తానుభుజించిన ఆకును ఎత్తి శుద్ధిచేసినపిమ్మట తిరుగా ఆచమనముచేసి పరిశుద్ధుడై చేయి కొంచెముతేమచేసికొని శ్వాసమువిడువక కూర్చుండి అరచేత నాభిప్రదేశమును తడవి "అంగుష్ఠమాత్రః పురుషః" అను మంత్రమునుచెప్పి చేతివ్రేళ్లను నీళ్లతో తడిపి బొటనవ్రేలిగుండ అర్ఘ్యమునువిడిచి ఆచమనముచేసి చేతులు పైకెత్తుకొని సూర్యునిజూచుచు "శ్రద్ధాయాంప్రాణే" అను అయిదుమంత్రములచేతను "తస్యేదంపురుషః" అను మంత్రముచేతను సూర్యుని ఉపాసనచేసి నిర్మలమును శాంతిపొందినదియునైన మనసుతో పీటమీద కూర్చుండి తనయిష్టదేవతలను ధ్యానముచేసి ఆచమించి సంతోషమునొందిన మనసుగలవాడై తాంబూలము వేసికొని భోజనము చేయుటవలని ఆయాసము తీరునట్లు కొంతసేపు కూర్చుండి పిమ్మట కొంచెము వేదాంతవిచారము చేయవలెను. ఆటుపిమ్మట ధర్మమార్గములను విరుద్ధముగాని శాస్త్రవిచారముచేతను ఇతిహాసపురాణములచేతను పగటియొక్క ఆరవభాగమును ఏడవభాగమునుగడపి ఎనిమిదవభాగమందు లోకమర్యాదను అనుసరించినపనులను జరుపుకొని తర్వాత సాయంకాలసంధ్యావందనమునకై ఊరివెలుపలికిపోయి ప్రొద్దు

క్రియాన్వితః, బహిస్సంధ్యా ముపాసీత కుశపాణి స్సమాహితః. సాది
త్యాం పశ్చిమాం సంధ్యా మర్ధాస్తమితభాస్కరామ్, ప్రాణానాయమ్య
సంప్రోక్ష్య మంత్రేణాబ్దైవతేనతు. సాయమగ్నిశ్చ ఇత్యుక్త్వా ఋషిచ్ఛం
దోధిదైవతమ్, వినియోగం సముచ్చార్య మంత్రితం తజ్జలం పిబేత్.
అగ్నిశ్చేత్యనువాకస్య ఋషిస్సూర్య ఇతిస్మృతః, ఛందస్తు దేవీగాయత్రీ
అగ్నిర్వై దేవతా స్మృతా. వినియోగ స్త్వపాంపాన ఇతి పీత్వా ద్విరా
చమేత్, ప్రత్యఙ్ముఖోపవిష్టస్తు వాగ్యత స్సుసమాహితః. ప్రణవ
వ్యాహృతీ యుక్తాం గాయత్రీంతు జపేత్పునః, అక్షసూత్రం సమా
దాయ సమ్యగాతారకోదయాత్. వారుణీభి స్తదాదిత్య ముపస్థాయ
ప్రదక్షిణమ్, కుర్వన్ దిశో నమస్కృత్య నమస్కుర్యా ద్దివాకరమ్. దిగీ
శాంశ్చ నమస్కుర్యా త్తత్తన్మంత్రై స్సమాహితః, ఆసీనస్తుజపేత్సాయం
జప్త్వాతిష్ఠన్నదోషభాక్. ఉపాస్యపశ్చిమాంసంధ్యాం హుతాగ్నిస్తాను
పాస్యచ, భృత్యైః పరివృతో భుక్త్వా నాతితృప్తోథ సంవిశేత్. సాయం
ప్రాతర్వైశ్వదేవః కర్తవ్యోబలికర్మచ, అనశ్నతాపిసతత మన్యథాకిల్బిషీ

---

గ్రుంకు సమయమునందు చేత పవిత్రమును ధరించుకొని నెమ్మదిగా ప్రొద్దుగ్రుంకి గ్రుంక
కమును పే ప్రాణాయామము చేసి జలదేవతాకమైన మంత్రముచేత జలమును ప్రోక్షించు
కొని "అగ్నిశ్చ" అనుమంత్రమును ఋషిచ్ఛందాది దైవవినియోగములతోడ ఉచ్చ
రించి ఆమంత్రముచేత అభిమంత్రించిన ఉదకమును పుచ్చుకొవలెను. అగ్నిశ్చ అను
మంత్రమునకు ఋషి సూర్యుడు. ఛందము గాయత్రి. అగ్నిహోత్రుడు దేవత. జల
మును పుచ్చుకొనుట వినియోగము. అని చెప్పబడుచున్నది. ఈమంత్రముచేత ఉదక
మును పుచ్చుకొని రెండుమారులు ఆచమనముచేసి పడమటిముఖముగా తిరిగి కూర్చుండి
మౌనమును పూని చలింపనిమనసుతో నక్షత్రములు చక్కగా కనబడునంతవరకు జప
మాలను చేతబూని ప్రణవపూర్వకమును వ్యాహృతిసహితము నైన గాయత్రీజపముచేసి
పిమ్మట వరుణదేవతాకములైన మంత్రములచేత సూర్యుని ఉపాసనచేసి ప్రదక్షిణము
చేయుచు దిక్కులకు నమస్కరించి తర్వాత స్వస్థచిత్తుడై ఆయామంత్రములచేత సూర్యు
నికిని దిక్పతులకును నమస్కారములు చేయవలెను. సాయంకాలమునందు కూర్చుండియే
జపము చేయవలసినది. ఒకవేళనిలువబడి జపముచేసినను తప్పుకాదు. ఇట్లు సాయం
సంధ్యావందనముచేసి అయినపిమ్మట ఆకాలమునందు చేయవలసిన అగ్నిహోత్రకార్య
ములనుచేసి పరిచారకులతోగూడ మితముగా భోజనముచేయవలయును. గృహస్థుడగు
వాడు తాను రాత్రిభోజనము చేయనివాడైనను సాయం ప్రాతఃకాలములు రెంటియం

భ వేత్, అతిథించాగతం దృష్ట్వా స్వశక్త్యా పరిపూజయేత్. ప్రక్షాళ్య పాణి పాదౌ చ భుక్త్వా సాయంతనే గృహీ, గచ్ఛేచ్ఛయ్యాం మహాఖ్యుద్వీ ముప ధానసమన్వితామ్. స్వగృహే ప్రాక్శిరాశ్శేతే శ్వశురే దక్షిణ శ్శిరాః, ప్రత్యక్శిరాః ప్రవాసేతు న కదా చిదుదక్శిరాః. రాత్రి సూక్తం జపేత్ స్మృత్వా దేవాశ్చ సుఖశాయినః, మంత్రంచ గారుడంజప్త్వా సార్పమం త్రం తథాజపేత్. నమస్కృత్వావ్యయంవిష్ణుం సమాధిస్థం స్వపేన్నిశి, అగస్త్యోమాధవశ్చైవ ముచికుందో మహాబలః. కపిలో ముని రాస్తీకః పంచైతే సుఖశాయినః, మాంగల్యం పూర్ణకుంభంచ శిరఃస్థానే నిధాప యేత్. వేదికైర్గారుడైర్మంత్రై రక్షాం కృత్వా స్వపేత్తతః, ఋతుకా లాభిగామీ స్యా త్స్వదారనిరతస్సదా. నిషిద్ధదివసా న్హిత్వా గచ్ఛే ద్యుగ్మాసు రాత్రిషు, ప్రదోష పశ్చిమౌ యామౌ వేదాభ్యాసేన తౌ న యేత్. యామద్వయే శయానస్తు బ్రహ్మభూయాయ కల్పతే, ఏతత్సర్వ

---

దును వైశ్వదేవమును భూతబలి మొదలగుబలులిచ్చు కార్యమును మానరాదు. మానిన యెడ దోషియగును. తనయింటికి వచ్చిన అతిథిని చూచినతోడనే తనశక్తి కొలదిని ఆదరణతో పూజింపవలెను. మరియు గృహస్థుడు సాయంకాలమునందు భోజనము చేసి కాళ్లుచేతులు కడుగుకొని ఇరుగడలను తలగడలుగల మెత్తని పానుపు మీదికిపోయి తనయింటనైనయెడ తూర్పుతలాపిగాను అత్తవారి యింటనైన పక్షమున దక్షిణపుతలాపిగాను ఇతరప్రదేశములకు పోయినయెడ పడమటితలాపిగాను పండుకో వలయును. ఎప్పుడును ఉత్తరపుతలాపిగామాత్రము పండుకోరాదు. పండుకొనునప్పుడు రాత్రిసూక్తమును జపించి సుఖముగ శయనించినవారైన దేవతలనెల్లను తలచి గరుడదేవతాకమైన మంత్రమును జపించి సమాధియందుండువాడును నాశములేని వాడును నైన విష్ణుమూర్తినితలచి నమస్కరింపవలెను. అగస్త్యుడు శ్రీలక్ష్మీపతియగు విష్ణుడు చాలబలవంతుడైన ముచికుందుడు కపిలాచార్యుడు ఆస్తీకుడు వీరైదుగురును సుఖముగ శయనించువారు. శయనించునపుడు మంగళకరమైన నీళ్లునించిన కుండను తలాపితట్టు ఉంచుకోవలెను. అటుపిమ్మట వేదమునందు చెప్పబడిన చొప్పున గరుడు నిసంబంధమైన మంత్రములనుచెప్పి రక్షచేసికొని నిద్రపోవలెను. ఎల్లప్పు డును తనభార్యయందు ఆసక్తిగలిగి ఋతుకాలమునందు పొందదగును. అందును శ్రోపుడు దినములను మాని తక్కినయుగ్మరాత్రులయందు పొందుట యుక్తము. ఇది గాక గృహస్థుడు రాత్రులలో తొలుజామును కడపటిజామును వేదముచదువుట మొద లగువానితో గడపవలెను. తక్కినరెండుజాములును శయనించి బ్రహ్మత్వము నొందినవాని

మశేషేణ కృత్వాజాతం దినేదినే, కర్తవ్యం గృహిణా సమ్య గ్గృహస్థా శ్రమలక్షణమ్. అశేషవేదోదితసచ్చరిత్ర మేతద్గృహస్థాశ్రమలక్షణం తే, ఉక్తం సమాసేన సవిస్తరంతే పతివ్రతానాం శృణు లక్షణాని.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే
గృహస్థాశ్రమలక్షణకథనంనామ
పంచదశోఽధ్యాయః.

---

షోడశోఽధ్యాయః.

శృణు రాజన్ ప్రవక్ష్యామి సతీనాముత్తమం వ్రతమ్, శృణ్వతీనాం మనో ధర్మే లీయతే స్మృగిదృశామ్. అనంతోదారమార్గేణ గతి రుక్తా ద్విజన్మనామ్, యాంతాంగతి మవాప్నోతి ధ్రువంస్త్రీ పతిసేవయా. కురూపోవా సురూపోవా దుస్స్వభావోథవాపతిః, రోగీవాథ పిశాచోవా మద్యపః క్రోధనోపివా. దుశ్శీలోవా సుశీలోవా సధనో నిర్ధనో

---

వలెనే నిర్వంచవలెను. ఈసర్వకార్యములను లోపములేకుండ ప్రతిదినమును నడపుట గృహస్థునికి విధి. ఇదియే మంచి గృహస్థాశ్రమలక్షణము. ఓ దిలీపమహారాజా ! ఎల్ల వేదములయందును చెప్పబడిన యీగృహస్థాశ్రమలక్షణమును నీకు సంగ్రహముగా తెలి యజెప్పితిని. ఇక పతివ్రతాలక్షణమును చెప్పెదను వినుము. అని వసిష్ఠుడు పలికెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు గృహస్థధర్మమును
నిరూపించునదియైన పదియేనవ అధ్యాయకథ.

---

పదియారవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా ! స్త్రీలకు ఉత్తమమైన వ్రతమును విశదముగా చెప్పెదను నీవు వినుము. ఏయాడువారు ఈధర్మమును విందురో వారిమనసు ధర్మము నందే పొందియుండును. బ్రాహ్మణులకు మేరలేని సరళమైన ఆనగా, మంచిమార్గమునందు వర్తించుటచేత ఏగతిగలుగునని శాస్త్రములయందు చెప్పబడియున్నదో అట్టిగతిని పెని మిటియొక్క సేవచేత ఆడుదిపొందును. ఇదితప్పదు. పెనిమిటియగువాడు అందములేని వాడైనను అందగాడైనను చెడుగుణములుగలవాడైనను రోగియైనను దయ్యపుచర్యలు గల వాడైనను కల్లుత్రాగువాడైనను కోపస్వభావము గలవాడైనను చెడ్డనడవడిగలవాడైనను

పివా, మూకోఽన్ధో బధిరోవాపి రౌద్రో దారిద్ర్యవానథ. కదర్యః కుత్సితోవాపి కాతరః కితవోపివా, లలనాలంపటోవాపి కుష్ఠరోగాది విగ్రహీ. సతతం దేవవత్పూజ్యః సాధ్వ్యావాక్కాయకర్మభిః, నజాతువిప్రియంభర్తుః స్త్రియా కార్యం కదాచన. బాలయావా యువత్యావా వృద్ధయావాపి యోషితా, మాతాపితృ సుహృద్భ్రాతృ పుత్రపౌత్రాభివృద్ధయా. పారిబర్హాప్తధనయా సర్వావస్థాసుసర్వదా, నస్వాతంత్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేసతి. అహంకారంచ కామంచ క్రోధలోభౌ విహాయచ. మనసోరంజనంపత్యుః కార్యమన్యస్య వర్జనమ్. సకామం వీక్షితాప్యన్యైః ప్రియైర్వాక్యైః ప్రలోభితా, స్పృష్టావాజనసమ్మర్దే న వికారముపైతియా. పురుషం సేవతేనాన్యం మనోవాక్కాయకర్మభిః, దైన్యేన ప్రార్థితావాపి గృహీతాపి బలేనవా. వస్త్రాద్యై ర్వాసితావాపి నైవాన్యం భజతే సతీ, ప్రలోభితా పరేణార్థైః స్సాసతీ లోకభూ

---

ధనముగలవాడైనను ధనములేనివాడైనను మూగవాడైనను గ్రుడ్డివాడైనను చెవిటివాడైనను ఎల్లప్పుడు భయమును చూపువాడైనను పేదవాడైనను లోభియైనను కుచ్ఛితుడైనను భయపడుస్వభావముగలవాడైనను జూదరియైనను ముండలమారియైనను కుష్ఠరోగము మొదలగువానిచేత వికారముపొందిన దేహముగలవాడైనను ఎల్లప్పుడు మనస్సుచేతను వాక్కుచేతను కర్మములచేతను పూజింపదగినవాడుఅగును. ఒకానొకప్పుడైనను పెనిమిటికి ప్రియముకాని పనిచేయుట ఆడుదానికి తగదు. ఇల్లాలు పసిదైనను ఈడువచ్చినదైనను ముసలిదైనను తల్లిదండ్రులు స్నేహితులు అన్నదమ్ములు కొడుకులు మనమలు వీరిలో ఎవరిచేత పోషింపబడుచున్నదైనను రాజయోగ్యములైన భోగవస్తువులను తనవారివలన పడసినదైనను ఇంటియందు మిక్కిలి స్వల్పమైనపనినిగూడ తానుగా స్వతంత్రించి చేయగూడదు. గర్వమును లేనిపోనికోరికలు కోరుటను కోపమును పిసినిగొట్టుతనమును మాని పెనిమిటిని సంతోషపెట్టవలెను. ఇతరుని సాంగత్యమును వదలుట ముఖ్యమైనపని. ఏయాడుది ఇతరపురుషులచేత మోహముతో చూడబడినదియు, ప్రియమైన మాటలచేత ఆశపుట్టింపబడినదియు, జనులరాపిడిచేత ఇతరులదేహముసోకినదియు అయినను వికారమును పొందక యెప్పటివలెనే యుండునో, ఏయిల్లాలు మనస్సుచేతను మాటలచేతను పనులచేతను ఇతరపురుషునితలపదో, ఏస్త్రీ దీనత్వముచేత ప్రార్థింపబడినదిగాని బలాత్కారముగా పట్టబడినదిగాని వస్త్రములు మొదలైనవానిచేత కప్పబడినదిగాని అయినను ఇతరునిపొందదో, పరపురుషునిచేత రూకలచేత ఆశ పుట్టింపబడినదయ్యును చలింపకయుండునో అట్టియిల్లాలు లోకమునకు అలంకారమువంటిదగును.

షణా. బలేనాపహృతాసాధ్వీ పరేణ స్వగృహేకృతా, పాతకీవాభవేద్ధైర్యా ద్బ్రహ్మచర్యపరాయణా. బలాత్కారం గృహీతాచే త్ప్రాణానపి పరిత్యజేత్, సాకైవల్య మవాప్నోతి కులకోటిం సముద్ధరేత్. వీక్షితా వీక్షతేనాన్యై ర్హసితానహసత్యపి. భాషితావానభాషేత సాసాధ్వీసాధులక్షణా. రూపయౌవనసంపన్నా గృహకృత్యేషు కోవిదా, స్వానురూపం నరందృష్ట్వా నయాతివిక్రుతింసతీ. రూపవంతంనరందృష్ట్వా కురూపం చాత్మనఃపతిమ్, పతింస్వమేవసేవేత కామబుద్ధ్యా పతివ్రతా. యాసాశ్రియాచపార్వత్యా భారత్యావంద్యతేఽనిశమ్, సురూపం తరుణంరమ్యం కామినీనాంచవల్లభమ్. యానేచ్ఛతి పరంకాంతం విజ్ఞేయాసామహాసతీ, తాడ్యమానానిశంభర్త్రా కోపేనచ ప్రమాదతః. నిందితా దుష్టవచనైః భర్త్రినతావా పునఃపునః, బంధూనాం చ గృహంవాపి నైవయాతి పతివ్రతా. పరంయా స్వపతేశ్చాపి సావమన్యేత పద్మజా, దేవోమను

ఏయిల్లాలు పరపురుషుడు బలాత్కారముగా పట్టితీసికొనిపోయి తనయింటిలో నుంచుకొన్నను మిక్కిలి ధైర్యముతో పురుష సంబంధములేని వ్యాపారమునందు ఇచ్ఛగలిగి మెలగుచు పాపాత్ముడైన యట్టిపురుషునిచే బలాత్కారముగా పట్టబడియు, వానితో గూడక ప్రాణములను విడుచునో ఆయిల్లాలు మోక్షమును పొందుటయేగాక తనకులము వారినెల్ల ఉద్ధరించును. ఏయాడుది తన్ను ఇతరులుకోరి చూచినను తాను తలయెత్తి చూడకయు నవ్వినను నవ్వకయు మాటలాడినను మాటలాడకయు నుండునో అది యోగ్యతా లక్షణములు గల యుత్తమురాలు. చక్కదనమును వయస్సునుగలిగి ఇంటిపనులయందు నేర్పుగలదైన యేయిల్లాలు తనవలె చక్కదనము మొదలైనవిగల పురుషుని జూచియును మన్మథవికారమును పొందకుండునో, చక్కదనముగల యితరపురుషుని జూచియు, కురూపియైన తన పెనిమిటిని జూచుచునే ఇతడే మన్మథుడని తలచి యేయిల్లాలు తానే సేవించునో, ఆయిల్లాలే పతివ్రత. అట్టి పతివ్రతకు లక్ష్మీదేవియును పార్వతీదేవియును సరస్వతీదేవియును సదా మ్రొక్కుదురు. మంచి చక్కదనముగలవాడును యౌవనము గలవాడును నాగరికత గలవాడును కోరికగల స్త్రీలకు ప్రియము పుట్టించువాడును కంటికి ప్రియమైనవాడును నైన యితరపురుషునిజూచి యిచ్ఛింపని యిల్లాలు మహాపతివ్రతయని తెలిసికోవలసినది. పెనిమిటిచేత కోపమువలనగాని పరాకువలనగాని ఎల్లప్పుడు కొట్టబడుచున్నదైనను చెడ్డమాటలచేత తిట్టబడినదైనను తనకు మిక్కిలి కావలసినచుట్టముల యిండ్లకైన పోకయుండునో అట్టియాడుది పతివ్రతయనిపించుకొనును. ఏస్త్రీ యితరుడెంతటివాడైనను తన పెనిమిటికంటె గొప్పవాడని తలపదో ఆమె లక్ష్మీదేవియగును. ఆడువారికి దేవుడు గాని మానవుడుగాని

ష్యో గంధర్వస్సతీనాంకోఽపి నప్రియః. సతిరేవ ప్రియస్త్రీణాం బ్రహ్మాది భ్యోపి సర్వశః, భుక్తే-భుక్తే చ యాపత్యౌ దుఃఖితే దుఃఖితాచయా. ముదితే ముదితాత్యర్థం ప్రోషితే మలినాంబరా, సుప్తే పశ్చాచ్చ యాః శేతే పూర్వమేవం ప్రబుధ్యతే. భక్తింశ్వశురయోఃకుర్యాత్పత్యుశ్చాపి విశేషతః, ధర్మకార్యేఽనుకూలత్వ మర్థకార్యేపి సమ్మతమ్. ప్రాగల్భ్యం కామకార్యేషు శుచిత్వంనిజవిగ్రహే, మంగళంసమ్మతం పత్యుః సతతం ప్రియభాషణమ్. భావ్యం మంగళకారిణ్యా గృహామండనశీలయా, గృహోపస్కరసంస్కార సజ్జయా ప్రతివాసరమ్. క్షేత్రాద్వనాద్వాగ్రామాద్వా గృహం భర్తారమాగతమ్, ప్రత్యుత్థా యాభివందేత ఆసనేనోదకేనచ. ప్రసన్నభాండమృష్టాన్నైః కాలేభోజనదాయినీ, సంయతాగుప్తధాన్యాచ సుసంమృష్టనివేశనా. గురూణాంపుత్త్రమిత్త్రాణాం వధూనాం

---

గంధర్వుడుగాని తనపెనిమిటికంటె యితరుడు ప్రియుండు కానేరడు. కనుక బ్రహ్మమొదలగు దేవతలకంటెను పతివ్రతయగుస్త్రీకి తనపెనిమిటి ప్రియమైనవాఁడు అగును. ఏ యాఁడుది పెనిమిటిసుఖమనుభవించఁగా తానును సుఖమొందుచు దుఃఖమనొందినప్పుడు దుఃఖమును పొందుచు సంతోషించినప్పుడు మిక్కిలిసంతోషించుచు దూరప్రయాణము చేసినప్పుడు మైలబట్టకట్టుకొని అలంకారము చేసికొనకయుండునో అది మంచి యిల్లాలనబడును. పెనిమిటి పండుకొని నిద్రపోయినపిమ్మట నిద్రపోవుచు పెనిమిటి నిద్రనుండి లేవకముందే లేచుచు ఉండునట్టి యిల్లాలు మహాపతివ్రత యనిపించుకొనును. ఏ స్త్రీ పెనిమిటికంటె విశేషముగానెంచి అత్తమామలయెడ భక్తినిచేయునో, ఏ స్త్రీ పెనిమిటిచేయునట్టి ధర్మకార్యములయందు అనుకూలతయు ధనమునార్జించు పనులయందు సమ్మతియు కామకార్యములయందు యత్నములేక కలుగు శృంగారచేష్టావిశేషమును తనదేహమునందు పరిశుద్ధత్వమును గలిగియుండునో, ఏ స్త్రీ పెనిమిటికి మేలును సమ్మతమును ప్రియమునైన మాటలే యెల్లప్పుడు నాడుచుండునో అట్టిస్త్రీ మహాపతివ్రతయని కొనియాడబడును. మరియు మంచియిల్లాలు కాదగిన శుభకార్యముల నడపునదియు, ఇంటిని శృంగారించు స్వభావముగలదియు, ప్రతిదినము ఇంటిపనిముట్లను శుద్ధిచేయుటయందు ఆసక్తిగలదియునై యుండవలయును. పెనిమిటి చేనినుండిగాని అడవినుండిగాని ఊరికిపోయియుండిగాని యింటికివచ్చినయెడ లేచి యెదురుగా పోయి మ్రొక్కి పీటవేసి కాళ్లుగడిగి పిమ్మట పరిశుద్ధముగా వంటచేసిన యన్నముపెట్టి వేళకు భోజనముచేయించునదియు, నియమముగలిగినదియు, వెనుకటికి ధాన్యమును చేర్చిపెట్టునదియు, ఇల్లు పరిశుద్ధముగా నుంచుకొనునదియు, పెద్దలకును కొడుకులకును

కర్మకారిణీ, ఆశ్రితానాంచభృత్యానాం దాసీదాసజనస్యచ. అతిథ్యభ్య గతానాంచ భిక్షుకాణాంచ లింగినామ్, ఆసనే భోజనేదానే సన్మానే ప్రియభాషణే. తత్తద్గుణానుసారేణ ప్రాప్తకాలే యథోచితమ్, దత్తా యా సర్వథాభావ్యం భార్యయా గృహముఖ్యయా. గృహవ్యయాయ యద్ద్రవ్యం దిశేత్పత్న్యైః కరే పతిః, నివర్త్య గృహకార్యాణి కించి ద్బుధ్యావశేషయేత్. త్యాగార్థమార్జితద్రవ్యే లోభాత్కించి న్నధా రయేత్. భర్తురాజ్ఞాం వినానైవ స్వబంధుభ్యోందిశేద్ధనమ్. అన్యాలాప మసంతోషం పరవ్యాపారజాం కథామ్, అతిహాసాతిరోషౌచ క్రోధస్థా నంచ వర్జయేత్. యచ్చభర్తానపిబతి యచ్చభర్తా నఖాదతి, యచ్చభర్తా నచాశ్నాతి సర్వంతద్వర్జయేత్సతీ. తైలాభ్యంగం తథాస్నానం శరీరో ద్వర్తనక్రియామ్, మార్జనంచైవ దంతానా మలకానాంచ కర్తనమ్. ఏతానిసర్వకృత్యాని నకుర్యాత్ప్రోషితేప్రియే, భోజనం వసనం నిద్రా

---

కావలసినవారికిని వారివారి పెండ్లాలకును తగినమర్యాదలను చేయునదియు, తనదాపున చేరినవారికిని కొలువుడుగాండ్రకును, ఊడిగపుపనిచేయునట్టి పనివాండ్రకును పనికత్తెలకును అతిథులకును అభ్యాగతులకును సన్యాసులకును కడుపు పోసికొనుటకై సన్యాసులైన వారికిని తటస్థపడినప్పుడు వారివారిగుణములను అనుసరించి అందులకు తగినట్టు పీటవేసి కూర్చుండబెట్టి అన్నముపెట్టి అడిగినదేదైనను ఇచ్చి తగినట్టు మర్యాదచేసి మంచిమాటలాడునదియునై యుండునట్టి యిల్లాలు పతివ్రతలలో ఉత్తమురాలగును. ఎల్లవిధములచేతను సమర్థురాలును ఇంటికి ముఖ్యురాలునైన భార్యచేత చేయదగిన యింటివెచ్చమునకై భర్త యేద్రవ్యమునుయిచ్చునో ఆద్రవ్యమును భార్యకొంచెమని యెంచక యింటికి తగినమాత్రమును ఉపయోగించుకొని కొంతమిగిలించియుంచవలెను. యాచకులకు ఇచ్చుటకై సంపాదింపబడినద్రవ్యములో కొంచెమైనను లోభత్వముచేత దాచియుంచకూడదు. తనకు కావలసినచుట్టములకు భర్తయుత్తరువులేక యేమియు నియ్యరాదు. ఇతరులతో ముచ్చటలాడుటయు, సంతోషములేకుండుటయు, ఇతరులనడవళ్లనుగూర్చి తలపోసికొనుటయు, మిక్కుటముగా నవ్వుటయు, అధికకోపమును కోపమురాదగినచోటును ఉత్తమురాలైనయిల్లాలు విడిచిపెట్టవలయును. తనపెనిమిటి దేనిని త్రాగడో దేనినిభోజనము చేయడో అట్టివానినెల్లపతివ్రతయైన తానును త్రాగక భోజనముచేయక యుండవలెను. పెనిమిటి పరదేశమునకుపోయినప్పుడు పతివ్రతయైనయిల్లాలు తలంటికొనుట స్నానముచేయుట నలుగుపెట్టుకొనుట పండ్లుతోముకొనుట తలదువ్వుకొనుట అను నీపనులనన్నిటిని మానుకోవలసినది. ఇదిగాక పెనిమిటియెదుటనుండునపుడు భోజనముచేయుటయు, వస్త్రము కట్టుకొనుటయు, చక్కగా నిద్రపోవుటయు, వాహనములను ఎక్కుటయు, పూనికలో

పరిధానంచ వాహనమ్. ప్రారంభమండనానాంచ నకుర్యా త్పత్యు రగ్రతః, ప్రవిశే చ్చైవ యా వహ్నిం గతేభర్తరి పంచతామ్. చింతితే నైవముదితా హృదయేహర్ష పూరితా, ననిర్బంధేనదుఃఖేన క్రోధేనాన్య భయేనచ. నాపుత్త్రతాయాదుఃఖేన నారోహేత్పతినాచితిమ్, సర్వసౌ భాగ్యసంయుక్తా సర్వకార్యసమృద్ధినీ. ఆత్మానంచ స్వభర్తార మేకపిండ మనీషయా, యానుగచ్ఛతిభర్తారం సారోహే ద్బ్రహ్మణఃపదమ్. బాల పుత్త్రానచారోహే ద్గణికావా రజస్వలా, సందిగ్ధగర్భిణీవాపి నారోహే త్పతినా చితిమ్. తావత్ప్రభృతినారీణాం మాసిమాస్యార్తవం భవేత్, ప్రథమేహనిచండాలీ యథావర్యా తథాంగనా. ద్వితీయేహని విప్రాహి యథావై బ్రహ్మఘాతినీ, తృతీయేహ్ని తదర్ధేన చతుర్థే శుద్ధిమాప్ను యాత్. స్నానంశౌచం తథాంగానాం రోదనం హసనం తథా, యాన మభ్యంజనంనారీ ద్యూతంచైవానులేపనమ్. దివాస్వాపంవిశేషేణ తథా వై దంతధావనమ్, మానసం మైథునంవాపి వాచికం దేవతార్చనమ్. వర్జ

సొమ్ములను దెచ్చి యలంకరించుకొనుటయుం తగదు. ఏయిల్లాలు పెనిమిటి చనిపోగానే అతనితోడ అగ్నిప్రవేశము చేయదలచునో అది మనస్సున సంతోషము పొంగగా సహ గమనము చేయవలెను. పెనిమిటి పోయినప్పుడు సహగమనము చేయకున్న నలుగురును ఏ మనుకొందురో అనునిర్బంధముచేతగాని చూచిచూచి నిప్పులలోఎట్లుపడవచ్చును అనుదుః ఖముచేతగాని ఎవరిమీదనేనిగల కోపముచేతగాని ఒకరివలనిభయముచేతగాని కొడుకులు లేకపోయిరే అనుదుఃఖముచేతగాని సహగమనముచేయకూడదు. పెనిమిటితన్నుకోరదగిన యెల్లశుభలక్షణములతోడను గూడినదియుం, ఎల్లపనులను నెరవేర్చుకొనినదియుం, తనకును ఒకపిండముకలుగవలెనను బుద్ధితో ఎవతె సహగమనముచేయునో ఆయిల్లాలు బ్రహ్మపద విని పొందును. ఆయినను పసిబిడ్డతల్లియు భోగముదియుం ముట్టుదియుం గర్భిణియను సందే హములోచినదియుం సహగమనము చేయకూడదు. ఇంతేకాదు. సాధారణముగా స్త్రీలు నెలనెలను ముట్టగుదురు. ఆముట్టయినప్పుడు తొలునాడు చండాలస్త్రీవలెను, రెండవ నాడు బ్రహ్మహత్యచేసిన బ్రాహ్మణస్త్రీవలెను, మూడవనాడు బ్రహ్మహత్యచేసిన పాప ములో సగముపాపము గలదానివలెను ఉండి నాలుగవనాడు పరిశుద్ధురాలగును. ముట్ట యిన యాడుది స్నానము అవయవములను శుద్ధిచేసికొనుట ఏడ్పు నవ్వు ఎక్కడికైన ప్రయాణమై పోవుట తలంటు జూదమాడుట గంధముపూసికొనుట పగలు నిద్రపోవుట చక్కగా పండ్లుతోముకొనుట మనసునందైనను పురుషునితోడి కూటమిగోరుట దేవ తార్చనావిషయమును నోటచెప్పుట దేవతాదులకు నమస్కరించుట ఈకార్యములను

యేత్సర్వయత్నేన నమస్కారం రజస్వలా, రజస్వలాయాస్సంస్పర్శం భాషణంచతయాసహ. శేషాన్నభోజనంచైవ వర్జయేచ్చ రజస్వలా, అరణ్యాగమనంచైవ బహిః పర్యటనం తథా. నదీసంతరణం చైవ తైలాభ్యంగం విలేపనమ్, కించిన్నఖాదయేచ్ఛబ్దం నఖానాంచైవ కృంతనమ్. ఛేదయేన్నఫలాదీని రజ్జుకృత్యంచ వర్జయేత్, శిశూన్నభోజయేచ్చైవ నభుంజ్యాచ్ఛిశుభిస్సహ. గోదోహనం నకుర్వీత నపశ్యేచ్ఛశి భాస్కరౌ, నత్యజేన్మలవద్వాసః కేశాన్నైవచ శోధయేత్. క్షాళనంభుక్తపాత్రస్య క్షాళనం పాదపద్మయోః, ముఖక్షాళనగండూషై ర్మలమూత్రవిసర్జనమ్. రజస్వలైతాని కుర్యాద్బహిర్దేశే క్వచిద్గృహాత్, చతుర్థదివసే ప్రాప్తే నిద్రాస్థానం విలేపయేత్. గోమయేన జలేనాపి భుక్తస్థానంచ శోధయేత్, చతురంగుళికం ఖాత్వా పూరయేదన్యయా మృదా. శయ్యోపధాన వస్త్రాణి దద్యాత్సంక్షాళనాయవై, రజకాయ స్వయం పశ్చాద్గచ్ఛేత్స్నానార్థమాపగామ్. స్వయమేవాథవా కుర్యా

---

సర్వప్రయత్నములచేతను విడిచిపెట్టవలెను. తాను బహిష్ఠయైనను మరియొకముట్టుదానిని తాకుటయు అట్టిదానితో మాటలాడుటయు అది భోజనముచేయగా మిగిలిన యన్నమును భోజనము చేయుటయు కూడదు. మరియు ముట్టుది అడవులకుపోరాదు. యథేచ్ఛముగా బయట తిరుగరాదు. ఏటిలో దిగగూడదు. శరీరమునకు నూనెరాచుకోగూడదు. నలుగుపెట్టుకోరాదు. కొంచమైనను చప్పుడుగలుగునట్లు తినుబండమును తినగూడదు. గోళ్లు తీసివేయగూడదు. పండ్లు మొదలైనవానిని తరుగగూడదు. త్రాడుపేనరాదు. బిడ్డలకు అన్నముపెట్టరాదు. బిడ్డలను పొత్తునపెట్టుకొని భోజనము చేయరాదు. ఆవులకు దూడలను విడువరాదు. సూర్యచంద్రులను చూడరాదు. మైలబట్టను విడువరాదు. తలదువ్వుకోరాదు. అన్నము తిన్నపాత్రను కడుగుట కాళ్లుచేతులు కడుగుకొనుట మొగము కడుగుకొనుట పుక్కిలించియూచుట మలమూత్రములను విడుచుట ఈపనులను ఇంటికివెలుపలదూరప్రదేశమునందేగాని నొకప్పుడైనను ఇంటిలో చేయగూడదు. ఇట్లు మూడుదినములుగడపి నాలుగవనాడు ప్రొద్దున తాను పండుకొన్నతావును అలికి తాను భోజనముచేసినప్రదేశమును పేడతోనైనను వట్టినీళ్లతోనైనను శుద్ధిచేసి నాలుగు వ్రేళ్లలోతు త్రవ్వి ఆమట్టిని ఎత్తివేసి చదరముచేసి చక్కగాఅలికి తాను పరుచుకొన్న వస్త్రములను కట్టుకొన్నవస్త్రమును చాకలవానికి ఉదుకవేసి పిమ్మట తాను నదికి స్నానము చేయబోవలెను. చాకలవాడు దొరకనియెడ తనవస్త్రములను తానే ఉదుకుకొ

ద్వస్త్రనిర్ణే జనాదికమ్. అథవా మలవద్వాసః పక్త్వా క్షారోదకేనచ, పూర్వం నినిజ్యతద్వస్త్ర మన్యచ్ఛయ్యాదికంచయత్. నఖాంశ్చ ఘర్షయే ద్గ్రావ్ణా పాణిపాదసముద్భవాన్, ద్వాత్రింశత్ క్షాళయేన్మృద్భి ర్గుహ్య ముద్భి రజస్వలా. దంతా న్సంశోధయే త్పశ్చా త్తృణరాజసముద్భవైః, అపామార్గేణవా కుర్యా ద్భస్మనావా విశోధయేత్. ద్వాత్రింశద్భి రపఃకుర్యా ద్గండూషై రాస్యశోధనమ్, ధాత్రీఫలోదకాన్యేవ ఘర్షయే న్మూర్ధజేషుచ. ఉద్ధృతేనోదకే నైవ శిరోదేహ మలాదికమ్, క్షాళయే త్తీరదేశేతు తీర్థే స్నాయా త్తతఃపరమ్. త్రింశన్నిమజ్యవై పూర్వం ఉత్తీ ర్యశయనాదికమ్, ద్వాత్రింశ క్షాళయిత్వాథ స్వయం స్నాయా త్పున స్తథా. ఏకోచ్ఛ్వాసేనయత్నేన ద్వాత్రింశద్వారమేవవా, నమస్కృత్య వివస్వంతం గృహం యాయా దధోముఖా. స్నాత్వాన్యపురుషం నారీ నపశ్యే దాత్మనః పతిమ్, స్మరతీ మనసా సాధ్వీ నపశ్యేదర్భకానపి శిశూన్. ప్రమాదాదన్యపురుషం యదిపశ్యేద్రజస్వలా, వీక్షయేద్భాస్కరం దేవం పతిరూపం మనస్వినీ. బ్రహ్మకూర్చం పిబేత్పూర్వం పంచగవ్య మథాపి

---

వచ్చును. అట్లు తానే ఉదుకుకొనెడు పక్షమున మైలగుడ్డలను తొలుత చవుటిమట్టి నీటిలోతడిపి యుండుకపెట్టి యుండికి పిమ్మట పరుచుకొన్న గుడ్డలను ఉదుకవలెను. అటు పిమ్మట కాలిగోళ్లను రాతితో రాచి కడుగుకొని ముప్పదిరెండుమార్లు మట్టితోను నీళ్లతోను గుహ్యస్థానమును శుద్ధిచేసికొవలెను. అనంతరము గడ్డిపోచవలని పుల్లతోనైనను ఉత్తరేణువేరుతోనైనను అవిలేనియెడ బూడిదతోనైనను పండ్లు చక్కగా తోముకొని ముప్పదిరెండుమార్లు పుక్కిలించి మొగముకడుగుకొని ఉసిరికకాయపిండితో తలపులుముకొని నదిలోనుండి చెంబుతో నీళ్లుముంచి తెచ్చుకొని ఒడ్డుననే తలమురికియు దేహము నందలిమురికియుం కడుగుకొని పిమ్మట నీళ్లలోదిగి స్నానముచేయవలెను. అట్లు నీళ్లలో దిగి ముప్పదిమార్లు మునిగి అనంతరము పరచుకొన్నవియుం కట్టుకొన్నవియు నైన వస్త్రములను ముప్పదిరెండుమార్లు జాడించి పిండి మరల ముప్పదిమారులు మునుగవలెను. స్నానముచేయునపుడు ఊపిరివిడువక ముప్పదిమారులైనను ముప్పదిరెండుమారులైనను మునిగి సూర్యునికి మ్రొక్కి తలవంచుకొని తనయింటికిపోయి చేరవలసినది. స్నానము చేసినతోడనే తనపెనిమిటినితలచుచు ఇతరపురుషుని తలయెత్తి చూడకయుం పసిబిడ్డలను చూడకయుం ఇంటికిపోవలసినది. ఒకవేళ పరాకుచేత పరపురుషుని జూచినయెడ అప్పుడే తనపెనిమిటిరూపమును తలచుచు సూర్యునికిమ్రొక్కి తనపరిశుద్ధికై ముందు బ్రహ్మకూర్చజలమును (పదునాలుగువర్భపోచలచే ముడిచినకూర్చమువలని జలమును)

వా, కేవలం త్వథవా గవ్యం క్షీర మాత్ర విశుద్ధయే. పశ్చాత్పయః ప్రాశనంచ భుక్తపిండంగ్రసేత్సతీ, శిశూనాంప్రేక్షణేదోషో నాస్తీతి మునయోవిదుః. అలంకృతా సుప్రయతా సమ్యృష్టసుఖభోజనా, భర్తారమనుగచ్ఛేత తమేవ మనసా స్మరన్. న గచ్ఛేత్తాం స్రవద్రక్తాం యదిగచ్ఛేత్ స్మరాతురః, తత్ర యోజాయతేపుత్ర స్సోఽభిశస్తః ప్రకీర్తితః. గర్భిణీస్యాద్యదానారీ నియమేన సదావసేత్, కృతరక్షా సుభూషాచ పతిపూజనతత్పరా. కుస్త్రియా నాభిభాషేత శూర్పవాతంచ వర్జయేత్, మృతవత్సాదిసంసర్గం పరాన్నంచ విసర్జయేత్. బీభత్సాం కించిదీక్షేత నరౌద్రాం శృణుయాత్కథామ్, గురువాత్యుష్ణ మాహార మతిక్షార మసక్తికమ్. తీక్ష్ణంక్షీణకరంవస్తు వర్జయే ద్వ్యంజనాదికమ్, కఠినాన్నంనసేవేత తథైవ విషమాసనమ్. ఏతేనవిధినాసాధ్వీ శోభనం పుత్త్రమాప్నుయాత్, నాతియత్నవతీభూయా ద్గృహకృత్యేషుగర్భిణీ. నిశ్రేణ్యాం నైవగేహాళ్యాం

పుచ్చుకొని పిమ్మట పంచగవ్యమును పుచ్చుకోవలసినది. అటుకానిపక్షమున అచ్చము ఆవుపాలునైన పుచ్చుకొనవచ్చును. అటుపిమ్మట మంచినీళ్లను కొంచెము త్రాగి ఆవల అన్నపుకబళమును పుచ్చుకోవలెను. అన్నకబళమును పుచ్చుకొన్నపిమ్మట పసిబిడ్డలను జూచినను దోషములేదు. అనంతరము చక్కగా అలంకరించుకొని నియమముతో పరిశుద్ధమైన అన్నమును భుజించినదై పెనిమిటిని మనసులో తలచుచు అతనిచేరబోవలెను. అట్లుచేరినభార్య స్రవించుచున్న మట్టునెత్తురుగలదైనయెడ భర్త దానినిపొందకూడదు. ఒకవేళ కామాతురుడై పొందినయెడ ఆకూటమివలన బుట్టినకొడుకు అభిశస్తుడు (పరస్త్రీగమనము మొదలగు దోషములచేత దూషింపబడినవాడు) అని చెప్పబడును. స్త్రీ గర్భిణియైనప్పుడు నియమమునందు ఏమరక యుండవలెను. ఆనియమము ఎట్టిదిఅనగా, తన్ను పోషించుకొనుటయందును చక్కగా అలంకరించుకొనుటయందును పెనిమిటిసేవయందును అక్కరగలిగియుండవలెను. దుష్టస్త్రీలతో ముచ్చటలాడరాదు. చేటగాలి సోకనీయకూడదు. చావుబిడ్డలగన్నది మొదలైనవారితో గూడరాదు ఇరుగుపొరుగువారు పెట్టినయన్నమును భుజింపరాదు. రోతపుట్టించు విషయములను జూడరాదు. భయంకరములైనకథలను వినరాదు. మందమును మిక్కిలిఉష్ణమును కారమును ఇంపుకానిదియునైనయాహారమును పుచ్చుకోకూడదు. మిక్కిలి కృశింపజేయుపదార్థమును అటువంటి కూరలు మొదలైనవానిని బిరుసైన అన్నమును ఎచ్చుతక్కువలుగా నుండుపీట మొదలగువానిని గ్రహింపరాదు. ఈచొప్పున నడచుకొనునట్టియిల్లాలు సుఖముగామంచి కొడుకును కనును. మరియు గర్భిణియైనది గృహకృత్యములయందు మిక్కిలిప్రయత్న

ముసలోలూకలాదిషు, రజస్వలాయాస్స్నాతాయాః నదృష్టిర్గోచరా భవేత్. ఏవమాదిసమాచారా గర్భిణ్యాఃపరికీర్తితాః, అనేనవిధినాసాధ్వీ శోభనం పుత్రమాప్నుయాత్. అన్యథా గర్భపతనం స్తంభనం వాపి జాయతే, ఈర్ష్యారాగసముద్భూతా విద్యమానేపి మత్సరే. అప్రియం నైవకర్తవ్యం సపత్నీషు కదాచన, నవసేద్దూరతః పత్యుః స్థేయాద్వల్లభసన్నిధౌ. నిర్దిష్టేచ మహాభాగే వల్లభాభిముఖా వసేత్, కథ్యమానా కథా భర్త్రా సాదరం శృణుయాత్సదా. సంభాషమాణా భర్తారం నాతిక్రమ్య వదేత్క్వచిత్, ఆహూతా సత్వరం గచ్ఛే ద్రతిస్థానం రతోత్సుకా. శాస్త్రాది కౌశలం విద్యా కలాప్రాగల్భ్య మేవచ, దర్శయంతం పతిం దృష్ట్వా భవేదానందనిర్భరా. భర్తుస్సమీపే నస్థేయా సోద్వేగివ్యగ్రచిత్తయా, గాత్రభంగంనకుర్వీత నహాసం నక్షుతంతథా. న కండూయేత బాహుభ్యాం దశ్యదంతాపరైః క్వచిత్, భర్త్రినతా నింది

ముగలిగి ప్రవర్తింపగూడదు. నిచ్చెనయెక్కుట గడపలు అలంకరించుట రోకండ్లెత్తిదంచుట రోళ్లదొర్లించుట మొదలగుపనులు చేయగూడదు. బహిష్ఠయైనస్త్రీ స్నానముచేసి వచ్చుచుండగా చూడగూడదు. ఈ చెప్పబడినచొప్పున గర్భిణీస్త్రీలును నడచుకొనవలెను. నడచుకొన్నపక్షమున సుఖముగా మంచికొడుకును కనుదురు. ఇట్లునడచుకోనిపక్షమున కడుపు దిగబడిపోవుటగాని కనప్రొద్దులైనప్పుడు పిండము బయటరాక నిలబడిపోవుట గాని కలుగును. గర్భిణియైనది సవతులుండినయెడ వారియందు అంతకుముందున్న ఓర్వలేనితనము మొదలైనవానివలన గలిగిన విరోధమునుమాని ఒకానొకప్పుడైనను వారికి అప్రియముగా ప్రవర్తింపరాదు. ఇదికాక కడుపులోనుండునట్టి యిల్లాలు పెనిమిటికి దూరముగా నుండగూడదు. పెనిమిటిదగ్గరనే యుండవలసినది. పెనిమిటి యేమిచెప్పునో దానిని వినవలెనను తలపుతో అతనియెదుటనే యుండవలెను. పెనిమిటి యేదైనపుణ్యకథను చెప్పుచున్నయెడ మిక్కిలి యక్కరతో ఎల్లప్పుడు ఆకథను వినుచుండవలెను. పెనిమిటితో ముచ్చటలాడుచు ఆయన చెప్పినమాటకు విరుద్ధముగా ఏమియు చెప్పకయుండవలెను. పెనిమిటిపిలిచినప్పుడు క్రీడాస్థానమునకు క్రీడయందలి యుత్సాహముతో శీఘ్రముగా పోవలెను. శాస్త్రములు మొదలగువానియందు నేర్పును, చతుర్దశవిద్యలు అరువదినాలుగు కలలు వీనియందలి సామర్థ్యమును కనబరచుచున్న పెనిమిటిని జూచినప్పుడు మిక్కిలి సంతోషింపవలెను. పెనిమిటియెదుట కలతను పొందియు వేగిరపాటు గలదియు నైనమనసుతో నుండగూడదు. ఒళ్లువిరుచుకోగూడదు. పకపక నవ్వరాదు. తుమ్మకూడదు. చేతులతో గీరుకోరాదు, పెదవులు కొరకుకోరాదు. పెనిమిటి

తాత్యర్థం తాడితాప్రేయసా ప్రియా. వ్యథితాపి భయం త్యక్త్వా కంఠే గృహీతవల్లభమ్, ఉచ్చైర్నరోదనం కుర్యాన్నైవాక్రోశేజ్జనం ప్రతి. పలాయనం న కర్తవ్యం నిజగేహాద్బహిః క్వచిత్, కుపితే త్వయి మే దేవ కా గతిః క్వ చ యామ్యహమ్. మయా యత్కృతమజ్ఞాతం జ్ఞాతం వా తత్క్షమస్వ భోః, పతిరేవ గతిః స్త్రీణామితి వేదవిదో విదుః. ఇత్యాదిలక్షణం వాక్యం స్నేహజన్యం వదేత్సదా, సంగృహ్య పాణిమస్యాహం కిం సుఖం కిం ప్రియా వహమ్. హా తేన విధినా నష్టా నైవం బ్రూయాత్కదాచన, ఉత్సవాదిషు బంధూనాం గంతవ్యం సదనం యది. ప్రాప్యానుజ్ఞాం తదా పత్యుః పత్యౌ దేశాంతరే గతే, వధూర్జీవనరక్షార్థం కర్మ కుర్యాదనిందితమ్. కృత్వా భర్తా యథా వృత్తిం వ్రజేద్దేశాంతరం తథా, పతికల్పితయా వృత్త్యా వర్తేత గృహమేధినీ. శ్వశ్రూశ్వశురయోః పార్శ్వే నిద్రాం కార్యాన్యతో నహి, ప్రత్యహం పతివార్తా చ విచేతవ్యా ప్రయత్నతః దూతాః ప్రస్థాపనీయాశ్చ పత్యుః క్షేమోపలబ్ధయే, దేవతానాం ప్రసిద్ధానాం

---

బెదరించినను మిక్కిలి తిట్టినను కొట్టినను అప్రియములాడినను సంకటపెట్టినను భయపడక పెనిమిటిని కౌగిలించుకొని గట్టిగా గొంతెత్తియేడువక యిరుగు పొరుగు వారితో నామగడు కొట్టెను తిట్టెను అని చెప్పుకొనక యిల్లువిడిచి బయట పరుగెత్తక స్వామీ మీరుకోపించిన నాకుగతియెవ్వరు నేను ఎక్కడికిపోదును. నేను తెలిసి తెలియక చేసిన తప్పును మన్నింపుడు, స్త్రీలకు భర్తయే గతియని వేదార్థమునెరిగిన విద్వాంసులు చెప్పుచున్నారే అని యిటువంటి మంచిమాటలనుచెప్పి తన పెనిమిటికోపము అణగునట్లు చేయవలెను. కోపము చల్లారినపిమ్మట అతనిచేయిపట్టుకొని నేను యేమిచేయుదును. ఏదిమీకు సుఖమైనది. మీకు ఇష్టమైనది ఏది. సెలవిమ్మని అడుగవలెను. అట్లుచేయక పాడుదేవుడు నన్ను ఇటువంటి మగవానితో కూర్చెనే యని దైవమును నిందింపరాదు. తనకు కావలసినచుట్టములయిండ్ల ఏమైన వేడుకలు జరుగునప్పుడు తాను వారియిండ్లకు పోవలెనన్న పెనిమిటివలన సెలవుపుచ్చుకొనిపోవలెను. పెనిమిటి దేశాంతరమునకు పోయినప్పుడు పెండ్లాము తనజీవనముకొరకు నలుగురు సరియనదగినమంచిపనులు చేయవలసినది. పెనిమిటి దేశాంతరమునకు పోవునపుడు తన్ను ఏవ్యాపారముచేయ నియమించిపోవునో ఆవ్యాపారమునే చేయవలసినది. మరియు అత్తమామలయొద్ద పండుకొని నిద్రింపవలెగాని మరియొక్కడను పండుకోగూడదు. ప్రతిదినమును తనపెనిమిటియొక్క కుశలవర్తమానము తెలిసికొనుటకై తగినవారిని ప్రయాణముచేసిపంపవలయును. పెనిమిటి సుఖముగావచ్చి యిల్లుచేరవలెనని ప్రసిద్ధులైన దేవతలను పూజింపవలెను. ఎవతెపెనిమిటి యితరదేశము

కర్తవ్య ముపపూజనమ్. ఏవమాదివిధాతవ్యం సత్యాప్రోషితనాథయా, స్వేచ్ఛాపర్యటనం చైవ పరపుంసోంగమర్దనమ్. అటనం చైకవస్త్రేణ నిర్లజ్జాత్వం వృథాగతిః, ఏవమాదీని కర్మాణి వర్జయేద్గృహమేధినీ. నిర్వర్త్య నిజకార్యాణి దేహం ప్రక్షాళ్య వారిణా, హరిద్రాలేపనం కృత్వా కుర్యాన్మండన ముజ్జ్వలమ్. సమీపంప్రేయసోగచ్ఛేద్వికసన్ముఖపంకజా, పాదసంవాహనం కృత్వా రమయేత్తం పతిం శనైః. అనేన నారీ వృత్తేన మనోవాక్కాయసంయుతా, ఇహాగ్ర్యాం కీర్తిమాప్నోతి పరలోకే పరాంగతిమ్. పాతివ్రత్యరతా నారీ యద్గృహే వర్తతే సతి, గృహే తత్రైవ నివసేదన్యథా వనగో భవేత్. ఇత్యాదిధర్మనయనీతిగుణోత్తరాభిస్తాభిస్సహైవ చిరకాలమసౌ మునీంద్రః, సంసారసౌఖ్యనిరతో ప్యమలాంతరాత్మా చక్రేతిరాత్రచయనక్రతువాజపేయాన్.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, పతివ్రతాధర్మ
కథనం నామ షోడశోఽధ్యాయః.

---

నకు పోయియుండునో ఆయాడుది ఈ చెప్పిన కార్యములను చేయవలెగాని ఇచ్ఛవచ్చినట్లు తిరుగుచుండగూడదు. పరపురుషులను తాకి కాళ్లుపిసుకుట మొదలగుపనులు చేయగూడదు. ముట్టయినప్పుడు బయట తిరుగగూడదు. సిగ్గుమాలినతనమును పనిలేక యొకరి యింటికిపోవుట అనునిట్టి చెడ్డపనులనుమానవలెను. ఇదిగాక మంచియిల్లాలు ప్రతిదినమును తాను చేయవలసిన పనులను చేసికొని ఒళ్లుకడుగుకొని పసుపుపూసికొని చక్కగా అలంకరించుకొని చిరునగవుతోడి మొగముతో తన ప్రియునియొద్దకు పోయి ఆయన కాళ్లుపిసికి పిమ్మట ఆయనతోఁగూడి రమింపవలెను. ఇట్లు నియమముతో తన ధర్మమునునడపునట్టి పతివ్రత ఈలోకమునందు మేలైనకీర్తిని పరమునందుసద్గతిని పొందును. ఇట్టిపతివ్రతాధర్మమునందు అక్కరగలయిల్లాలు ఏయింటియందుండునో ఆయింట పురుషుడు వాసము చేయవలసినది. అట్టియిల్లాలులేనియెడల ఆయింటిలో నుండుటకంటె అడవికిపోయియుండుట మంచిది. ఈచెప్పబడిన పతివ్రతాధర్మముగలవారును నీతిగలవారును మంచి గుణములుగలవారును అయిన తనభార్యలతోఁ గూడుకొన్నవాఁడై మృగశృంగమహాముని సంసారసుఖమునందు ఆసక్తిగలవాడై నిర్మలమైన చిత్తవృత్తితో అతిరాత్రచయనము వాజపేయము మొదలైన యజ్ఞములను చేసి కృతార్థుఁడయ్యెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు పతివ్రతాధర్మమును
తెలియజేయునదియైన పదియారవ అధ్యాయకథ.

## సప్తదశోఽధ్యాయః.

వసిష్ఠః.—ఏవం గృహే నివసతో మృగశృంగమహామునేః, కాలేన మహిషీ తస్య సువృత్తా సుషువే సుతమ్. తతః పితృఋణాన్ముక్తః కృతార్థో మునిపుంగవః, మునిశ్చకార తత్కాలే జాతకర్మచ నామచ. భవిష్యత్కర్మసదృశం మృకండురితి విశ్రుతమ్, యద్విశంకా మృగగణాః కండూయంతేఽస్యవిగ్రహే. తస్మాన్మృకండు రిత్యస్య నామ చక్రే స్వయం పితా, కులోద్వహో గుణనిధి ర్జ్వలత్పావకసన్నిభః. కృతోపనయనః పిత్రా బ్రహ్మచర్యపరాయణః, అధ్యేష్ట వేదానఖిలా న్మృది ర్గురుకులే వసన్. గురుణానుమతః పశ్చా ద్ద్వితీయాశ్రమ మగ్రహీత్, ముద్గలస్య మునేః కన్యా ముపయేమే మరుద్వతీమ్. కమలాపి తతః కాలా దసూత సుత ముత్తమమ్, ఆచారేణ శ్రుతేనైవ విద్యయా వినయేనచ. సర్వత శ్చోత్తమో యస్మా త్తస్మా దుత్తమ ఇత్యభూత్, స పిత్రా కృతసంస్కారః కృతోపనయన స్సుతః. అధీత్య వేదా నఖిలాన్ ఉపయేమే

---

## పదియేడవ యధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఈప్రకారము మృగశృంగమహాముని గృహస్థాశ్రమమునందు వర్తించుచుండగా కొంతకాలమునకు ఆయనభార్యలలో ముఖ్యురాలైన సువృత్త అను నామె ఒకకుమారునికనెను. అంతట అతడు పితృఋణమును తీర్చుకొన్నవాఁడు అగుట చేత కృతార్థుడై ఆచిన్నవానికి జాతకర్మము జేసి కాగలకార్యమునకు తగినట్టు ఇక మీద తపస్సుచేయఁనట్టి యితనిదేహమును మృగములు భయములేక యొరసికొని పోగలవు. అను తలపుచేత మృకండుడు అను నామకరణముచేసెను. పిమ్మట ఆమృకండుడు తనకులము నుద్ధరించువాఁడును ఎల్ల మంచిగుణములకును ఉనికిపట్టయినవాఁడును అయి తనతండ్రి తగినయీడున ఉపనయనముచేయగా బ్రహ్మచారియై పరిశుద్ధుడై గురువు యొక్క యింట్లుచేరి యెల్ల వేదములనుచదివి పిమ్మట గురువుచేత సెలవుపుచ్చుకొని ముద్గలుడను మునీశ్వరునికూతురైన మరుద్వతియను కన్యకను పెండ్లాడి గృహస్థాశ్రమమును పొందెను. మృగశృంగుని భార్యలలో మఱియొకతెయైన కమలయును పిమ్మట కొంత కాలమునకు ఉత్తముఁడు అనుకొడుకునుగనెను. ఆతఁడు ఆచారముచేతను వేదార్థముల వినికిచేతను చదువుచేతను అడకువగల నడవడిచేతను ఇవిగాక ఇతరములైన విషయముల చేతను ఉత్తముఁడై తనపేరును సార్థకము చేసికొనువాడై తండ్రి ఉపనయనము మొదలైన వైదికక్రియలు ఆయాకాలములయందు క్రమముగా నడపగా వేదము మొదలగునవి చదువుయోగ్యతను పొంది యెల్ల వేదములను చదివి శాస్త్రమునందు చెప్ప

విధానతః. కాంతాలకాంతా కమనీయరూపా కణ్వస్యకన్యా కమలాయతాక్షీ, కళ్యాణశీలా విమలాభిధానా కుటుంబినీసాభవదుత్తమస్య. విమలాపిసుతంలేభే సుమతిం నామవిశ్రుతమ్, సుమతిస్సకలాన్వేదా నధీత్య గృహవానభూత్. సత్యాఖ్యాతస్య భార్యాభూత్సుమంతో స్తనయా శుభా, సురసాపి తతఃకాలే సువ్రతం సుషువేసుతమ్. సువ్రత స్సురసాసూనుః సర్వాన్వేదానధీత్యచ, దక్షిణాం గురవేదద్యా ద్ద్వితీయాశ్రమమగ్రహీత్. ధర్మపత్నీ బభూవాస్య పృథోఃపుత్రీ ప్రియంవదా, సుమతే రుత్తమస్యాపి సువ్రతస్యమహాత్మనః. సర్వానయాజయత్పుత్రాః క్రతుభిస్సాంగదక్షిణైః, తేచ శుశ్రూషయాసర్వే నిత్యం చక్రుః పితుః ప్రియమ్. ఆభిస్స్నుషాభిశ్శుభలక్షణాభిః శుభైస్సుతైస్తైశ్శ్రుతిపారగైశ్చ, భార్యాభి రుత్కృష్టగుణోత్తరాభిః చకారగార్హస్థ్యముపాస్యమానః. ప్రత్యేకమభవన్పుత్రా బహవో వేదపారగాః, భార్యాభిశ్చస్నుషాభిశ్చ పుత్రైః పౌత్రైరయంమునిః. మాఘమాసేతు సంప్రాప్తే ప్రాతఃకాలే నిమజ్జతి,

---

బడినచొప్పున అందమైన ముంగురులును మనోహరమైన ఆకృతియుం తామరపువ్వులవలె విశాలములైన కన్నులును మంచి స్వభావముగల కణ్వుని కూతురైన విమల యనుదానిని పెండ్లాడెను. మృగశృంగుని మూడవభార్యయైన విమల యనునదియుం సుమతియను పేరిచేత ప్రసిద్ధుడైన యొక కొడుకును గనెను. ఆసుమతి యనువాఁడును ఎల్ల వేదములను చదివి గృహస్థుఁడాయెను. అతనికి సుమంతుమహాముని కూతురైన సత్యయను కన్యక భార్యఆయెను. అటుపిమ్మట కొంత కాలమునకు మృగశృంగుని నాలవభార్యయైన సురసయుం సువ్రతుడను పేరుగల కొడుకును కనెను. సురసకొడుకైన ఆసువ్రతుఁడు ఎల్ల వేదములను చదివి గురువునకు దక్షిణయిచ్చి గృహస్థాశ్రమమును వహించెను. పృథుమహాముని కూతురైన ప్రియంవద యనునది వానికి పెండ్లామయ్యెను. అట్లు మృగశృంగునికి నలుగురుభార్యలయందును బుట్టిన నలుగురుకొడుకులలోను సుమతి ఉత్తముడు సువ్రతుడు అను ముగ్గురికిని వేరువేరుగా వేదము తుదముట్ట చదివినవారగుకొడుకులు అనేకులు పుట్టిరి. ఆకొడుకులందరిచేతను వారు సంపూర్ణదక్షిణలతోడి యజ్ఞములనుచేయించిరి. ఈ చెప్పబడిన కుమారులందరును తమతమ తండ్రులకు ప్రియములైన కార్యములను చేయుచుండిరి. మృగశృంగుఁడు ఈచెప్పబడిన మంచిలక్షణములుగల కోడండ్రతోను, వేదశాస్త్రముల యందు నిపుణులైన కొడుకులతోను, మేలైనగుణములుగల భార్యలతోను గృహస్థాశ్రమ ధర్మమును క్రమముగా నడపుకొనుచుండి మాఘమాసము రాగానే మీదచెప్పిన పెండ్లాలు కోడండ్రు కొడుకులు మనుమలు వీరందరితోను తెల్లవారుసమయమునందు స్నానము

మోఘం న కురుతే మాఘం కదాచిదపి సద్విజః. మాఘమాసేతు సంప్రాప్తే స్నానం దానం శివార్చనమ్. వ్రతాని నియమాశ్చైవ గృహస్థాశ్రమలక్షణమ్, ఇతి మత్వా ద్విజశ్రేష్ఠో మాఘమాసే నిమజ్జతి. ఏవం సంసారసౌభాగ్య మనుభూయ మహామునిః, పుత్త్రేషు భార్యాంనిక్షిప్య సమారోప్యాగ్ని మాత్మని. దృష్ట్వాపత్యస్య చాపత్యం వపుర్దృష్ట్వాథజర్ఝరమ్, తపోనిధి స్తప స్తప్తుం తపోవనముపేయివాన్. పర్ణాశనా త్పల్వలవారిపానా దుద్వేజితః కర్కశభూమివాసాత్, సమానధర్మో మృగయూథమధ్యే చరన్ చిరం బ్రహ్మపదం ప్రపేదే. సంభావిత స్తత్ర చతుర్ముఖేన సమేయివాన్ బ్రహ్మసనాథపీఠమ్, సేనార్జితా నప్రతిమా ననంతాన్ భోగాననేకాన్బుభుజే మునీంద్రః. తతః కదాచి త్ప్రళయావసానే ప్రాప్తే పునః శ్వేతవరాహకల్పే, భూత్వాజపుత్త్రో ఋభునామధేయ శ్చక్రే నిదాఘాయ విముక్తియోగమ్. చతస్ర స్తస్య భార్యాస్తా శ్శీలవృత్తసమన్వితాః,

---

చేయుఁచువచ్చెను. ఒకానొకప్పుడైనను ఆ బ్రాహ్మణుడు మాఘస్నానము చేయక ఊరకుండి యెరుగడు. మరియు మాఘమాసము రాగానే స్నానముచేయుట దానముచేయుట శివపూజ చేయుట నోములునోచుట మొదలైననియమములు నడపవలెననునది గృహస్థాశ్రమము నందుండువానికి విధియనితలఁచి యా బ్రాహ్మణోత్తముఁడు మాఘస్నానము చేయుచుండును. ఈవిధముగా ఆమృగశృంగమహాముని సంసారసుఖమును అనుభవించి పిమ్మట భార్యలను కొడుకులయొద్దనుంచి తనయందు అగ్నిసమారోపణముచేసికొని తన కొడుకులు సంతానముగలవారగుటను తన దేహము ముదిసి సళ్లిపోవుటనుజూచి తాను తపస్సు చేయుటకై తపస్సునకు ఉనికిపట్టైన తపోవనమునకు పోయి చేరెను. అట్లు తపోవనముచేరిన ఆమృగశృంగమహాముని ఆకులు తినుటవలనను పడియలనీళ్లు త్రాగుటవలనను రాళ్లు మొదలగువానిచేత ఒత్తుకొనునట్టి గట్టినేలలయందలి ఉనికివలనను గాసినొందినవాఁడై మృగములగుంపులతో జేరి వానిధర్మముగలవాఁడై అనఁగా ఆమృగములవలెనే ఆకులు అలములుతిని పడియలనీళ్లుత్రాగి వంగి చేతులు నేలమోపి సంచరించుచు బహుకాలము గడపి పిమ్మట బ్రహ్మలోకమునుపొంది అచ్చట బ్రహ్మచేత మర్యాదచేయబడి ఆ బ్రహ్మయొక్క సింహాసనముతో సమానమైన ఉన్నతపీఠమునందు గూర్చుండి యీ లోకమునందు తాను సంపాదించుకొన్న ఈడులేనివియుం మేరలేనివియునైన సుకృతములవలన గలిగిన అనేకభోగములను అనుభవించెను. పిమ్మట చిరకాలమునకు కల్పాంతముకాగా శ్వేతవరాహకల్పమునందు మరల ఋభువు అను నామధేయముతో బ్రహ్మకుమారుడై పుట్టి నిదాఘుడు అనువానికి మోక్షమును ఉపదేశముచేసెను. అట్టి మృగశృంగమహా

పుత్రేషు వ్రతచారిణ్యో దినానికతిచిత్‌స్థితాః. తతస్తు చరమేభాగే జరయాధవళీకృతాః, కుబ్జావిరళదంతాశ్చ ప్రణష్టేంద్రియవృత్తయః. అభూవన్నథ తాదృష్ట్వా మృకండుర్మునిసత్తమః, అనపత్యో మరుద్వత్యామిదమేవమచింతయత్. అహం సదారో గచ్ఛామి మాతృభిస్సహధూర్జటేః, రాజధానీం శివోయత్ర కర్ణేజపతితారకమ్. అథ తద్దేశభూపాలో నామ్నా రాష్ట్రవివర్ధనః, కాశీయాత్రాం సముద్దిశ్య ప్రతస్థే బహుసైనికః. తేనసార్థేన మహతా తేనజగ్ముశ్శనైశ్శనైః. మృకండుః.—మాత్రా పిత్రా పరిత్యక్తా యేత్యక్తానిజబంధుభిః, యేషాంక్వాపిగతిర్నాస్తితేషాం వారాణసీగతిః. జరయా పరిభూతాయే వ్యాధిభిర్వికలీకృతాః, యేషాం క్వాపిగతిర్నాస్తితేషాంవారాణసీగతిః. పాపరాశిభిరాక్రాంతా యేదారిద్ర్యపరాజితాః, యేషాంక్వాపిగతిర్నాస్తి తేషాంవారాణసీగతిః. సంసారపరిభూతాయే యే బద్ధా పాపకర్మభిః, యేషాంక్వాపిగతిర్నాస్తితేషాం వారాణసీగతిః. యేచయోగపరిభ్రష్టా యేతపోజ్ఞానవర్జితాః, యేషాం

---

మునియొక్క భార్యలు నలుగురును మంచిస్వభావముతోను మంచినడవడితోను మంచి మంచి నోములునోచుచు కొన్నాళ్లు తమకొడుకులయొద్దగడపి పిమ్మట ముసళ్లయి అందులకు తగినట్లు నరసి తెల్లబడిన కండ్రుకలును నల్లి ముడుగుకొన్న దేహములును పండ్లు రాలిపోయిన బొక్కినోళ్లును వ్యాపారములుడిగిన ఇంద్రియములును గలిగియుండిరి. అప్పుడు పెద్దకొమారుండైన మృకండుమహాముని వారలనుజూచి తనభార్యయైన మరుద్వతియందు సంతానము వడయలేక యిట్లు చింతించెను. ఎచ్చట శివుడు తారకమంత్రమును చనిపోవుప్రాణులచెవిలో చెప్పునో అట్టిశివస్థానమైన కాశీపట్టణమునకు నేను నా పెండ్లామును తల్లులను పిలుచుకొనిపోయెదను. అని యాలోచించుచుండగా ఆదేశము నేలెడు రాష్ట్రవివర్ధనుడు అనురాజు తనదండుతోడ కాశీయాత్ర చేయదలచి ప్రయాణమాయెను. ఆసమూహముతోడ వారును మెల్లమెల్లగా పోవువారై బయలుదేరిరి.

మృకండునిమాటలు.—ఎవరు తల్లిదండ్రులచేతను చుట్టములచేతను విడువబడి ఎక్కడను గతి కానకుందురో వారికి కాశిగతియగును. ఎవరు ముసలితనముచేత గాసిల్లుచుందురో ఎవరురోగములచేత పరాధీనులై యుందురో అట్టిదిక్కుమాలినవారికెల్లను కాశిదిక్కగును. పాపములచేతచుట్టుకొబడినవారును పేదరికముచేత డస్సినవారును ఎవరో ఆ దిక్కుమాలినవారికి కాశిదిక్కగును. సంసారబంధమునందు తగులుకొని సంకటపడువారును పాపకృత్యములుచేసి చిక్కులబడువారునుఎవరో ఆదిక్కుమాలినవారికి కాశిదిక్కగును. యోగాభ్యాసమునందు నిష్ఠచెడినవారును తపస్సు జ్ఞానముఅనునవిలేనివారును ఎవరో ఆ

క్వాపిగతిర్నాస్తి తేషాం వారాణసీగతిః. అచికిత్స్యపరాక్రాంతా క్షయాపస్మారకుష్ఠినః, యేషాం క్వాపిగతిర్నాస్తి తేషాం వారాణసీగతిః. దరిద్రస్య కుభార్యస్య కుపుత్రస్య కురూపిణః, యేషాం క్వాపిగతిర్నాస్తి తేషాం వారాణసీగతిః. భజ్యంతే పాపకర్మాణి యత్ర విశ్వేశసన్నిధౌ, పాపాని యత్ర దహ్యంతే కృతాన్యన్యత్ర దేహినామ్. అతో మహాశ్మశానం తదగతీనాం పరాగతిః, సంసారసర్పదష్టానాం విషయక్ష్వేడమోహినామ్. జంతూనామవివేకానాం శివో నాథః పరాగతిః, కాశీప్రాప్తిరయం యోగో న యోగోష్టాంగసంయుతః. కాశీప్రాప్తిస్తపశ్చర్యా న పర్ణాశనతాతపః, కాశీవాసో మంత్రజపః కాశీవాసశ్శివార్చనమ్. కాశీప్రాప్తిరయం స్వర్గో నాప్సరోభిస్సమాగమః, కాశీప్రాప్తిరయం సౌఖ్యం నేంద్రియార్థ సమాగమః. మాతా కాశీ పితా కాశీ గురుః కాశీ సుతశ్చ సా, బంధుః కాశీ తథా విద్యా సర్వం కాశీచ సర్వదా. ధర్మార్థకామదా కాశీ ప్రాప్తస్య మమ సాంప్రతమ్, కాలః కాలాంజనాకారః కింకరిష్యతి సానుగః. కః కామః కో మదః క్రోధః

---

దిక్కుమాలినవారికి కాశిదిక్కగును. చికిత్సచేత మాననివైనక్షయముపిచ్చి పెద్దరోగమును గలిగిన యేజనులకు ఎందునుగతిలేదో అట్టిగతిమాలినవారికి కాశిగతియగును. దరిద్రునికి అయోగ్యురాలైన పెండ్లాముగలవానికి చెడ్డకొడుకులు గలవానికి చక్కదనము లేనివానికి నీచకులమునందుబుట్టినవానికి నీచస్వభావముగలవానికి కాశి గతియగును. ఏవిశ్వేశ్వరుని సన్నిధానమునందు పాపకర్మములు భంగమునొందింపబడునో ఎక్కడ చేయబడిన పాపములు కాల్పబడునో అట్టిమహాశ్మశానము అనబడు కాశి మరియెక్కడను దిక్కుగానని ప్రాణులకు సర్వోత్తమమైన గతియగును. సంసారమనెడి పాముచేత కరవబడినవారికిని విషయసుఖములనెడు విషము తలకెక్కినవారికిని మరియు తెలివిమాలినజంతువులకును విశ్వనాథుడైనశివుడే ఉత్తమగతియగును. ఈచెప్పబడిన కాశిని పొందుటయే యోగము గాని యమాదులైన యెనిమిదియంగములతోడను అభ్యాసముచేయునట్టి యోగము యోగముకాదు. కాశిని పొందుటయే తపస్సు. ఆకుఅలములతిని చేయుతపస్సుతపస్సుకాదు. కాశియందుండుటయే మంత్రమును జపమును శివపూజయునగును. ఈకాశియందు వసించుటయే స్వర్గముగాని అప్సరస్త్రీలతోడికూటమిగలస్వర్గము స్వర్గముకాదు. కాశియందు వాసముచేయుటయే సౌఖ్యముగాని శబ్దాదివిషయములవలనగలుగు సుఖము సుఖముకాదు. తల్లి తండ్రి గురువు కొడుకులు చుట్టములు విద్య అనబడునవియన్నియు కాశియేగాని ఇతరముకాదు. కాశినిచేరినయెడ ధర్మము అర్థము కామము అను మూడుపురుషార్థములను ఇప్పుడు నాకు ఆకాశియేయిచ్చును. నల్లనికాటుకవంటి యాకారముగల యముడు

కోలోభః కాప్యహంకృతిః, కింమాత్సర్యం కిమజ్ఞానం పాపంకింజడతాచ కా. కాశ్యాంనివసతాంపుంసాం కాలకాల యుతాత్మనామ్, వదన్నిత్యం సమాత్యాంణా మధ్వఖేదానుత్తయే. శనైర్వారాణసీంప్రాప్య మృకండు స్సహమాతృభిః, ప్రాపవారాణసీం విప్రో మృగశృంగమునేస్సుతః. అవిలంబంప్రథమతో మణికర్ణ్యాం విధానతః, సచేలమపి మజ్జ్యాథ కృతసంధ్యాదిసత్క్రియః. సంతర్ప్య దేవఋష్యాదీన్ తిలపుష్పాక్షతోదకైః, తీర్థవాసాదిన స్సర్వాన్ సంతర్ప్యచ పృథక్పృథక్. అమృతస్వాదుపక్వాన్నైః పాయసైశ్చ సశర్కరైః, దీనానవాథాన్ సంతర్ప్య పశ్చాద్ధుండీవినాయకమ్. అన్వలింపత్తతో భక్త్యా హ్యాజ్యసిందూరకర్దమైః, నివేద్య మోదకాన్పంచ పంచయన్ తం నిజంజనమ్. రాగద్వేషౌ విసృజ్యాథ తతో తత్క్షేత్ర మావిశత్, సర్వావరణదేవాంశ్చ పూజయామాస శక్తి

---

తనకింకరులును తానును నన్ను ఏమిచేయగలడు. కాశియందు కాపురముచేయు సత్పురుషులకు కామము ఎక్కడిది మదము ఎక్కడిది కోపము యెక్కడిది లోభత్వ మెక్కడిది మాత్సర్యము ఎక్కడిది అజ్ఞానము జడత్వము అనునివి ఎక్కడివి. యమునికి యముడైన విశ్వనాథునిమనస్సునందు నిలుపుకొన్న కాశీవాసులకు మీదచెప్పిన యమునివలని భయమును కామము మొదలగు దుర్గుణములును కలుగనేకలుగవు. అనియిట్లు ప్రతిదినము తనతల్లులకు దారినడుచుటవలని బడలికతోచకుండుటకై చెప్పుచు నడుచుచుండును. ఇటు మెల్లమెల్లగా నడచిపోయి కాశీపట్టణముచేరి మృగశృంగమహామునికొడుకైన మృకండుమహాముని కొంచెమైన ఆలస్యముచేయక వెంటనే మణికర్ణికయందు యథావిధిగా వస్త్రములువిడువక స్నానముచేసి పిమ్మట సంధ్యావందనము మొదలగు సత్కార్యము లన్నియు జరపినవాడై ఆనంతరము నువ్వులు పువ్వులు అక్షతలు నీళ్లు వీనితో దేవతలు ఋషులు మొదలగువారినిగూర్చి తర్పణములుచేసి అచ్చటి తీర్థవాసుల నందరిని భోజనకృత్యములచేతను వేరువేరుగా తృప్తినొందించి దరిద్రులను దిక్కుమాలిన వారిని అమృతమువలె కమ్మగావండబడిన అన్నములచేతను చక్కెరచేర్చివండబడిన పరమాన్నములచేతను తృప్తిపరచి అటుపిమ్మట భక్తిపూర్వకముగా దుండివినాయకునికి నెయ్యిపోసిమెదిపిన సిందూరపుపూతపూసి అర్చించి తమవారెందరో అందరను లెక్కపెట్టుకొని ఒక్కొక్కరు ఆయిదేసి కుడుములచొప్పున ఆ దుండివినాయకునికి నైవేద్యముపెట్టి తరువాత ఒకరియందు ప్రీతి ఒకరియందు విరోధము అనునవి లేక ఆ కాశీక్షేత్రమును ప్రవేశించి తమ శక్తికొలదిని ఆచుట్టుపట్టులనున్న దేవతలనెల్లను

తః. తతో విశ్వేశ్వరం దేవం నత్వాస్తుత్వా మహామనాః, క్షేత్రోపవాసం విధివచ్చకార సహమాతృభిః. జాగరేణ నిశాం నీత్వా విశ్వనాథస్య సన్నిధౌ, ప్రభాతే విమలేస్నాత్వా మణికర్ణ్యాం సమాహితః. నైత్యకం కర్మజాతంచ నిర్వర్త్య నియతశ్శుచిః, మహద్భిర్బ్రాహ్మణైస్సార్థం శైవాగమవిశారదైః. లింగం సంస్థాపయామాస స్వనామ్నా సర్వసిద్ధిదమ్, ప్రత్యేకం స్థాపయామాసుస్తాశ్చతస్రశ్చమాతరః. స్వస్వనామాని లింగాని ముక్తిదాని విలోకనాత్, దుండివిఘ్నేశ్వరస్యాగ్రే మృకండీశ్వరదర్శనాత్. సిద్ధ్యంతి సర్వకార్యాణి కాశీవాసోపి సిద్ధ్యతి, తస్య లింగస్యపురతః సువృత్తేశ్వరదర్శనాత్. నాభిభూతోథవిఘ్నౌఘైస్సువృత్తో జాయతే నరః, తస్య ప్రాచ్యాంకమలయా స్థాపితం లింగముత్తమమ్. తద్విలోకనమాత్రేణ నరోభవతి నిర్మలః, దేహాళీ విఘ్నరాజస్య సన్నిధౌ విమలేశ్వరః. దర్శనాత్తస్య లింగస్య విమలంజ్ఞానమాప్నుయాత్, ఈశానాత్తస్య లింగస్య సురసేశ్వరదర్శనాత్. అవాప్య సురసామ్రాజ్యం

---

పూజించి, పిమ్మట విశ్వనాథస్వామినిగూర్చి నమస్కరించి స్తోత్రముచేసి ఆమృకండుడు తన తల్లులును తానును యథావిధిగా క్షేత్రోపవాసముచేసి శ్రీవిశ్వనాథుని సన్నిధిలో నాటిరాత్రి జాగారముచేసి మరునాటి తెల్లవారి క్రమముచొప్పున మణికర్ణికాఘట్టమునందు స్నానముచేసి పరిశుద్ధుడును నియమముగలవాడునై కలవరములేనిమనసుతో ప్రతిదినము చేయదగినవైన సంధ్యావందనము మొదలగువానినిచేసి శైవాగమము చక్కగా తెలిసిన గొప్పబ్రాహ్మణులతోగూడ ఎల్లకోరికలను నెరవేర్చునట్టిదైన లింగమును తనపేర ప్రతిష్ఠచేసెను. అంతట ఆతనితల్లులైన నలుగురును తమతమపేళ్లుచెప్పి ఒక్కొక్కరు ఒక్కొక్కలింగమునుగా దర్శనమాత్రముచేతనే మోక్షము నియ్యగల నాలుగులింగములను ప్రతిష్ఠచేసిరి. దుండివినాయకునియెదుట నిలువబడియుండు మృకండీశ్వరుని దర్శనముచేయుటవలన ఎవరికిగాని తలచినపనులన్నియు నెరవేరుటగాక కాశియందలి ఉనికియు సిద్ధించును. ఆలింగమునకు ఎదుటనుండు సువృత్తేశ్వరుని దర్శనమువలన మనుష్యుడు పనిచెరుపువలని తొందరనుపొందడు. మంచినడవడికలవాడు అగును. ఆలింగమునకు తూర్పున కమలచేత స్థాపింపబడిన కమలేశ్వరలింగమును దర్శనముచేసిన మాత్రముచేతనే మనుష్యుడు పరిశుద్ధుడు అవును. దుండివినాయకుని గుడిగడపదగ్గర ప్రతిష్ఠ చేయబడిన విమలేశ్వరుని దర్శనము చేయుటవలన మానవుడు నిర్మలజ్ఞానమును పడయును. ఆవిమలేశ్వరలింగమునకు ఈశాన్యపుమూలయందు ప్రతిష్ఠచేయబడిన సురసేశ్వరునిదర్శనము చేయుటవలన దేవతాప్రభుత్వమును పొంది కాశియందే మోక్షమును

కాశ్యాం ముక్తో భవిష్యతి, మరుద్వత్యార్చితం లింగం మణికర్ణ్యాస్తు పశ్చిమే. తస్య దర్శనమాత్రేణ స మర్త్యోఽమర్త్యతాం వ్రజేత్, ఏవం లింగాని సంస్థాప్య తస్థుః కాశ్యాంతు వత్సరమ్. పునఃపునశ్చతత్క్షేత్ర మతిథీకృత్య నేత్రయోః, విచిత్రంచ పవిత్రంచ తృప్తింనాపి జగామసః. తీర్థ యాత్రాం ప్రతిదినం తత్ర కుర్వా సవత్సరమ్, సప్రాప సర్వతీర్థాని తిష్ఠ కాశ్యాం పదేపదే. అథైకదా తా మణికర్ణికాయాం మాధ్యందినస్నాన విధిం విధాయ, ప్రదక్షిణీకృత్య శివాలయంతజ్జాతశ్రమా ఘూర్ణదృశః స్మరంత్యః. స్వాం తేశివంవిశ్వజగన్నిదానంని పేతురుర్వ్యాంశరణంభ వేతి, భవేశ శంభో శివశూలపాణే క్రోశంత్యేవం మృగశృంగభార్యాః. కాశీ పతిః కారుణికః కరాభ్యా మాదాయమూర్ధాన మతీవ తాసామ్, అగమ్య వేగా ద్వ్యగపచ్ఛతాసా మోంకారమోంకారయతిస్మ కర్ణే.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే మృగశృంగస్య
బ్రహ్మాపదప్రాప్త్యాదికథనం నామ సప్తదశోఽధ్యాయః.

---

పొందగలడు. మృకండునిభార్యయైన మరుద్వతి మణికర్ణికకు పడమటితట్టు ఒకలింగమును ప్రతిష్ఠచేయించెను. ఆలింగమును దర్శనము చేసినమనుష్యుడు తనమనుష్యత్వమును పోగొట్టుకొనును. ఈవిధముగా మృకండుడు మొదలగువారు లింగమునునిలిపి కాశిలోనే సంవత్సరకాలము ఉండిరి. అంతట మృకండుమహాముని అప్పుడప్పుడు విచిత్రమును పవిత్రమునైన ఆకాశీక్షేత్రమును కన్నులారచూచియుతృప్తిపొందినవాడు కాకపోయె ను. ఆసంవత్సరకాలమును ప్రతిదినము అచ్చట తీర్థయాత్ర చేయుచు (అచ్చటిపుణ్య తీర్థములయందు స్నానముచేయుచు) కాశియందలి పుణ్యతీర్థములు అన్నిటియందును మాటిమాటికి స్నానముచేసినవాడాయెను. అంతట ఒకనాడు ఆమృకండునిభల్లులు మణి కర్ణికయందు మధ్యాహ్నస్నానముచేసి శివాలయమునకు ప్రదక్షిణముచేసి ఆప్రదక్షిణము చేయుటవలని ఆయాసముచేత కన్నులు తిరుగుడుపడగా తమ మనసులయందు ఎల్లలోక ములకును ఆదికారణమైన విశ్వేశ్వరుని తలచి సమస్తమును కావించువాడవును సుఖమును కలుగజేయువాడవును శుభములను ఇచ్చువాడవును శూలము చేతియందు గలవాడవునైన ఓస్వామీ! మాకు రక్షకుడవు అగుము అని మొరపెట్టుకొనుచు కళతప్పి నేలబడిరి. అప్పుడు మిక్కిలిదయగల కాశీవిశ్వనాథుడు వచ్చి వారితలలను తనచేతులతో ఎత్తిపట్టి ఆనలుగురిచెవులయందును ఒక్కసారే ఓం ఓం అని చెప్పి ఓంకారమును ఉపదేశించెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మృగశృంగుని
బ్రహ్మపదప్రాప్తి మొదలుగాగల వృత్తాంతమును దెలుపునదియైన
పదునేడవ అధ్యాయకథ.

## అష్టాదశోఽధ్యాయః.

వసిష్ఠః.-మృకండుర్విధివత్కృత్వా మాతృణామౌర్ధ్వదైహికమ్, ఉవాస సుచిరం కాలం కాశ్యామేవ మహామనాః. తస్య పుత్రో మహాతేజా మార్కండేయ ఇతిస్మృతః, ప్రసాదాదేవరుద్రస్య మరుద్వత్యామజాయత. మార్కండేయో మునిశ్శ్రీమా నారాధ్య తపసాశివమ్, దీర్ఘమాయుశ్శివాల్లబ్ధ్వాదదర్శప్రళయాన్ బహూన్. దిలీపః.—అనపత్యోమరుద్వత్యాం మృకండురితిహి త్వయా, ప్రోక్త శ్శివప్రసాదేన పశ్చాదాప సుతం కథమ్. కథం దీర్ఘాయురభవ త్కథమీశః ప్రసేదివాన్, విస్తరాచ్ఛ్రోతుమిచ్ఛామి వదైతన్మునిపుంగవ. వసిష్ఠః.-శృణురాజన్ ప్రవక్ష్యామి మార్కండేయసముద్భవమ్, అనపత్యో మృకండుశ్చ తపస్తప్తుం తపోవనమ్. యయౌ సభార్యో గోమత్యా స్తీరే పుణ్యతమే శుభే, తత్ర త్రిషవణస్నాయీ త్రికాలం శివమర్చయన్. త్ర్యంబకేతి చ మంత్రేణ తర్పయన్ పితృదేవతాః, ఫలాహారోభవేన్మాసం మాసాద్వాపర్ణభక్షకః.

---

## పదునెనిమిదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—మృకండుమహాముని పరలోకగతలైన తల్లులకు యథావిధిగా ఉత్తరక్రియలుచేసి కాశిలోనే చాలకాలము వాసము చేయుచుండెను. అనంతరము అతనికి శివుని అనుగ్రహమువలన మరుద్వతియందు మిక్కిలి తేజస్సుగల మార్కండేయుండు అనుకొడుకు పుట్టి శివునిఆరాధించి ఆదేవునియనుగ్రహమువలన దీర్ఘాయుష్మంతుడై బహుప్రళయములను జూచెను.

దిలీపునిమాటలు.—ఓవసిష్ఠమహామునీ! ముందు మృకండుడు మరుద్వతివలన సంతానము పడసినవాడుకాడని చెప్పితివి. పిమ్మట శివుని యనుగ్రహమువలన కొడుకునుపడసెను అనిచెప్పితివి. అతడు శివప్రసాదమువలన కొడుకును ఎట్లుకనెను? ఆకొడుకు ఎట్లు దీర్ఘాయుస్సును పొందెను? అతనికి ఎట్లు శివుడు ప్రత్యక్షమాయెను? ఆవృత్తాంతమంతయు సవిస్తరముగా వినగోరెదను నాకు దయచేసి చెప్పుము.

వసిష్ఠునిమాటలు.—ఓ దిలీపమహారాజా! వినుము. మార్కండేయుని పుట్టుకను చెప్పెదను. బిడ్డలులేనివాడగు మృకండుడు బిడ్డలకై తపస్సుచేయగోరి తన పెండ్లాముతోగూడ గోమతియను ఏటియొడ్డునందలి తపోవనమునకుపోయి ఆయేటిలో ముప్పూట స్నానముచేసి "త్ర్యంబకం యజామహే" అనుమంత్రముచేత శివుని అర్చించుచు పితృదేవతలకు తర్పణము చేయుచు పండ్లే ఆహారముగాఁ జేసికొని ఒకనెలయు ఆకులు

మాసౌద్వావాతపే తిష్ఠన్ వర్షాస్వభ్రావకాశగః, హేమంతే చ హిమే వా
సీత్తతః పంచాగ్నిమధ్యగః. ఏవం యుగాయుతం తేపే రవావిన్యస్తలోచనః,
తత్తపోద్విగ్నసంతప్తస్వపదచ్యుతభీరుభిః. సురైః సురేశప్రముఖైః స్పృ
ష్టా విఘ్నాః పరాజితాః, ఘోరేణ తపసా తస్య త్రిజగల్లోభమాయయా.
ఊష్మణా తస్య తపసః ప్రధూపిత మివాభవత్, తతః ప్రసన్నో భగవాన్
దేవైస్సంప్రార్థిత శ్శివః. గాయమానో నృత్యమానః స్తూయమానైశ్చ
చారణైః, అభిహృష్ట స్సురైః పుష్పై ర్నందనారామసంభవైః. ఆశీర్వా
దాన్ పురశ్శృణ్వన్ మునిభిస్సముదీరితాన్, దేవయోషిద్భుజలతా సమా
ధూతైశ్చ వీజితైః, ఏవం ప్రభావై ర్విశ్వేశః ప్రాదురాసీ త్తపోనిధిః.
శివః.-మునే మృకండో తపసా తవాహం ప్రీతో వరం దాతు మభీప్సితం తే,
సమాగతో యత్సహసైవ గౌర్యా మత్తో వరా న్వాచయ భార్యయా త్వమ్.
వసిష్ఠః.-శ్రుత్వా వచ శ్శంభుసమీరితం తత దున్మీల్య నేత్రే మునిపుంగవో సౌ,

ఆహారముగా జేసికొని రెండు నెలలును పిమ్మట ఆహారములేక ఎండలో నిలిచి రెండు నెలలును ఉండి ఆవల వానకాలమునందు వానలో తడియుచు బయట నిలిచియు మంచు కాలమునందు మంచులో నిలిచియు ఆటుపిమ్మట సూర్యునిజూచుచు పంచాగ్నిమధ్యమునందు నిలిచియు పదివేలయుగములు తపస్సు చేసెను. అంతట ఆతపస్సునకు దేవేంద్రుడు మొదలుగాగల దేవతలు తమతమపదవులు చెడునేమోయని మనస్సులందు కలతనొందినవారై అనేక విఘ్నములు చేసిరి. ఆవిఘ్నములెవ్వియు నెరవేరినవి కావయ్యెను. ఈమృకండుడు చేయు తపస్సుచేత మూడులోకములును తక్కువపడినవాయెను. ఆతపస్సుయొక్క వేంద్రమువలని పొగ మూడులోకములందును వ్యాపించెను అంతట భగవంతుడైనశివుడు దేవతలచేత ప్రార్థింపబడినవాడై ఆడుచు పాడుచు పొగడుచు అప్సరసలు గంధర్వులు సిద్ధులు చారణులు వెంటరాగా నందవనములోని కల్పవృక్షముల పువ్వులను దేవతలు చల్లగా మహర్షులందరు ఆశీర్వదించుచు ముందునడవగా బంగారు కామలతోడి వింజామరలు వీచుచు దేవతాస్త్రీలు పార్శ్వములందురాగా మరికొందరు దేవతలు విసనకఱ్ఱలతో వీవగా మహావైభవముతో మృకండునియెదుట సాక్షాత్కరించెను.

శివునిమాటలు.—ఓయి మృకండుమహామునీ నీతపస్సుచేత నేను సంతోషించితిని. నీకు ఇష్టమైనవరమును ఇయ్యదలచి పార్వతితోగూడ వచ్చినాను. నీవు భార్యతో గూడుకొన్నవాడవై వలసినవరమును అడుగుము.

వసిష్ఠునిమాటలు.-అనియిట్లు శివుడు సెలవియ్యగా విని మృకండుమహాముని తపో

ముక్తాపరాగాద్రిసమానభాసం ముగ్ధేందుమౌళిం ఫణిరాజచూడమ్. కర్ణావతంసీకృత నాగరాజం చతుశ్శ్రివా కల్పితకంఠభూషమ్, వసంత మందానిలకంపితద్రుమప్రవాళశోభాధరమచ్ఛదంతకమ్. లలాటనేత్రానలదహ్యమానమారం స్ఫురత్స్ఫాటిక చారుమూర్తిమ్, ప్రమథ్యమానార్ణవ పూర్వజాతహాలాహలగ్రాస కరాళకంఠమ్. హిమాద్రిజాతా కుచకుంకుమాంకవక్షస్థ్సలాలోల శివాక్షమాలమ్, మాణిక్య కేయూర మయూఖజాలైర్హస్తైశ్చతుర్భి స్ఫురశాఖకల్పైః. స్వభక్తవాంఛాఫల దానమోఘాన్ పాశాంకుశాది ప్రహరాణ్ దధానమ్, ఇతి ప్రసన్నం గిరిజాసహాయం దృష్ట్వా మృకండుః పరిపూర్ణ హర్షః, తుష్టావ వాచాం మనసోఽతి దూరసుదూర మాత్మాంఘ్రిసరోజభాజామ్. మృకండుః —జయ దేవ మహాదేవ జయేశ్వరమహేశ్వర, జయ సర్వసురశ్రేష్ఠ జయసర్వసురాధిప. జయ ప్రకృతికల్యాణ జయ ప్రకృతిసాధక, జయప్రకృతిదూ

నిష్ఠుమాని మెల్లగా కనులుతెరచి శివుని దర్శనముచేసెను. ఇట్లు ముత్యాలదుమ్ముచేత కమ్మఁబడిన కొండవంటిశరీరము గలవాఁడును బాలచంద్రుని తలనుధరించినవాఁడును ఆదిశేషునిసిగ పువ్వుగా జేసికొన్నవాఁడును మఱియు సర్పములు హారములు చెవిపోగులు గలవాఁడును వసంతకాలమునందలి మెల్లని చల్లగాలిసోకగా కదలుచున్న చిగురుటాకులనుబోలిన పెదవిగలవాఁడును తెల్లనిపండ్లుగలవాఁడును నొసటికంటినిప్పుచేత కాల్పబడిన మన్మథుడు గలవాఁడును మిక్కిలి మెరయుచున్న పటికపురాళ్లవలె ఒప్పునట్టి తెల్లనిశరీరము గలవాఁడును చక్కగా తరువబడిన సముద్రమునందు తొలుతబుట్టిన హాలాహలము అనువిషమును త్రాగుటచేత భయమును గలుగజేయునట్టి నల్లని మెడగలవాఁడును పార్వతీదేవియొక్క రొమ్ములందు పూయబడిన కుంకుమముచేత గురుతు పెట్టబడినవై రొమ్మునందు వ్రేలుచున్న రుద్రాక్షసరములు గలవాఁడును రత్నములు చెక్కిన భుజకీర్తుల వెలుగుగలవియు కల్పవృక్షములవలె భక్తులకోరికలను ఇచ్చునవియు నైన నాలుగుచేతులందు పాశము అంకుశము మొదలగు ఆయుధములను ధరించినవాఁడునునై సాక్షాత్కరించిన పార్వతీభర్తయగుమహాదేవుని దర్శనముచేసి మృకండుమహాముని సంతోషించినవాఁడై వాక్కునకు మనసునకును అందనివాఁడును దనపాదకమలములను సేవించునట్టి భక్తులకు దాపున నుండువాఁడును నైన ఆదేవుని నిట్లు పొగడెను.

## మృకండునిచేత చేయఁబడిన శివస్తోత్రము.

ఓ దేవా మహాదేవా ఈశ్వరా మహేశ్వరా సర్వోత్కృష్టుడవై యుండుము. ఎల్ల దేవతలలోను శ్రేష్ఠుడవును ఎల్లదేవతలకురాజవును ప్రకృతిజనులకెల్ల మేలుచేయువా

రాంఘ్రి, జయప్రకృతిసుందర. జయామోఘమహామోఘ జయామోఘ మనోరథ, జయామోఘ మహాలీల జయామోఘ మహాబల. జయ విశ్వజగన్నాథ జయవిశ్వ జగన్మయ, జయవిశ్వజగద్ధాతః జయవిశ్వ జగత్పతే. జయ శాశ్వతి మత్త్రాత జయశాశ్వతికాలయః, జయశాశ్వతి కాగార జయశాశ్వతికాసుకృత్. జయాత్మత్రయనిర్మాత్రి జయాత్మత్రయ పాలినీ, జయాత్మత్రయ సంహర్త్రి జయాత్మత్రయనాశకే. జయావలోకనాయత్తజగత్కారణబృంహణ, జయాపేక్ష కటాక్షోత్థ హుత భుగ్భుక్తభౌతిక. జయాత్మసూక్ష్మవిజ్ఞేయ స్వాత్మసూక్ష్మదశోజ్జ్వల, జయ స్థూలాంశశక్త్యంశ వ్యాప్తసర్వచరాచర. జయాసనైక విన్యస్త విశ్వతత్త్వసముచ్చయ, జయాపాశ్రితసంగతు సంవిధానపటీయసీ. జయోన్మూలితసంసార విషవృక్షాంకురోద్గమ, జయాగ్రదేశికైశ్వర్య వీర్యకా

డవును మాయయే సాధనముగా గలవాఁడవునునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుఁడవై యుండుము. అవిద్యకు ఎడముగానుండు పాదములు గలవాఁడవును స్వభావము చేతనే అందమైనవాఁడవును వ్యర్థుడవు కానివాడవును వ్యర్థులు కానివారిలో గొప్పవాడవును వ్యర్థము కాని కోరికలు గలవాఁడవునైన స్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. వ్యర్థము కాని గొప్పవిలాసము గలవాఁడవును వ్యర్థము కాని యెక్కువ బలముగల వాఁడవును ఎల్లలోకములకును ప్రభువవును ఎల్లలోకములు నైనవాఁడవునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. ఎల్లలోకములను ధరించినవాఁడవును ఎల్ల లోకములకు మిత్రుడవును ఎన్నడునుండెడి తండ్రియు ఎన్నడును చెడని యునికిచోటు గలవాడవును ఎప్పుడును చెడని ఆకృతిగలవాడవును ఎప్పుడునుండెడి జీవమును కలుగజేయువాడవునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. ఆత్మత్రయమును కల్పించుదానవును ఆత్మత్రయమును పాలించుదానవును ఆత్మత్రయమును అణచివేయు దానవునునైన యోపరమేశ్వరీ! నీవు సర్వోత్కృష్టురాలవై యుండుము. చూపుచేతనే యెల్లలోకముల ప్రకాశమునకు కారణమును కల్పించువాఁడవును ప్రేమతోడి కడకంటి చూపులవలనఁబుట్టిన నిప్పుచేత భుజింపబడినభూతముల యనుభవములు గలవాఁడవును సూక్ష్మబుద్ధిచేత తెలిసికోదగినవాఁడవును స్వకీయాత్మయందే సూక్ష్మముగ వెలుగువాఁడవును స్థూలాంశములు శక్త్యంశములునై వ్యాపించిన చరములును అచరములునైనభూతములు గలవాఁడవును ఆసనయోగమునందే ముఖ్యముగా నుంచబడిన సమస్తతత్త్వముల సమూహము గలవాఁడవును ఆశ్రయించినవారిని ఏలుకొనుటయందుగల వ్యాపారసామర్థ్యము గలవాఁడవును సంసారవిషవృక్షముయొక్క మొలకను వేళ్లతో పెల్లగించువాడ

ర్యవిజృంభణ. జయ శశ్వద్బహీంభూతనిరస్త పరభైరవ, జయప్రణుత పంచార్థ ప్రయోగపరమామృత. జయ పంచార్థ విధ్యాన సుధాస్రోత సురూపిణి, జయాతిఘోరసంసార మహారోగభిషగ్వర. జయగాఢాకులజ్ఞానతమఃపటలచంద్రికే, జయత్రిపురకాలాగ్ని జయత్రిపురభైరవ. జయ త్రిగుణనిర్ముక్త జయత్రిగుణమర్దన, జయప్రమథసాహస్రిక జయ సర్వప్రబోధక. జయప్రచురదివ్యాన్నే జయప్రార్థితదాయిని, క్వదేవతే పరంధామ క్వవయం క్వచనోవచః. తథాపి భగవద్భక్త్యా స్తువంతంపశ్య మాం భృశమ్. సకలభువనభూతభావనాభ్యాం జననవినాశవిహీన విగ్రహాభ్యామ్, నరవరయువతీవపుర్ధరాభ్యాం సతతమహం ప్రణతోఽస్మి

---

వును ఎదుటతోఁపించెడి ఐశ్వర్యవీర్యవ్యాపారములయొక్క విజృంభణముగలవాఁడవును మాటిమాటికి వెలిగా జేయబడుటచేత తిరస్కరింపబడిన శత్రువులకు భయంకరుఁడవును మిక్కిలికొనియాడబడిన అయిదువిధములైన యింద్రియార్థములయొక్క యుపయోగము నందు మేలైన అమృతమువంటివాఁడవునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. అయిదైన యింద్రియార్థములనెరిగినవారికి ప్రణవనాద మనెడు అమృత ప్రవాహమే మంచిరూపముగాగలదానవైన యోతల్లీ! నీవు సర్వోత్కృష్టురాలవై యుండుము. మిక్కిలి భయంకరమైన సంసారమనెడి పెద్దరోగమునకు శ్రేష్ఠుడైనవైద్యుడా! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. మిక్కిలి గాఢమైన కలవరమునిచ్చెడు అజ్ఞానమనెడి చీకటి సముదాయమునకు వెన్నెలవైన యోజగదంబా! నీవు సర్వోత్కృష్టురాలవై యుండుము. త్రిపురములకు ప్రళయకాలపు నిప్పువంటివాఁడవును త్రిపురములకు భయంకరుఁడవును నైన స్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. సత్వరజస్తమములనెడు మూడుగుణములచేత విడువబడినవాఁడవును సత్వరజస్తమములనెడు మూడుగుణములను అణచివేసినవాఁడవునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుడవైయుండుము. అనేకులైన ప్రమథగణములు గలవాఁడవును సమస్తమును తెలియజేయువాఁడవునైన యోస్వామీ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము. మిక్కుటమైన పరిశుద్ధమునైన అన్నమునిచ్చిన (అన్నపూర్ణవైన) దానవును కోరినకోరికలనిచ్చెడుదానవునైన యోయంబా! నీవు సర్వోత్కృష్టురాలవైయుండుము. ఓస్వామీ! మీరెక్కడ మేలైన మీ తేజస్సెక్కడ మేమెక్కడ మామాటలెక్కడ మీకును మాకును మాస్తోత్రములకును ఎంతో తారతమ్యముగలదు. అయినను భగవంతులైన మీయందలి భక్తిచేత స్తోత్రము చేయుచుండెడి నన్ను మిక్కిలి కటాక్షింపుడు. ఎల్లలోకములయందలి ప్రాణులయందును వాత్సల్యముగలవారును పుట్టుకయు నాశమును లేనిశరీరములు గలవారును

శంకరాభ్యామ్. త్వద్భృత్యభృత్యభృత్యానాం భృత్యభృత్యత్వ ముత్తమమ్, కింపరైరపరైర్భూయాద్భక్తిః పాదాంబుజద్వయే. తస్మాత్ప్రసీద భక్తాయ త్వత్పదాంబుజయోస్సదా, భూయోభూయో మహాదేవ భక్తిం దేహి మమత్వయి. ఏవంస్తుతో మహాదేవో మహాదేవీ మృకండునా, సంతుష్టావాహతుః ప్రీతౌ మృకండుం భార్యయాసహ. మత్తోవరం గృహాణేతిసోఽపివవ్రే వరంద్విజః, యతో మే భగవన్ దేవీ తుష్టశ్చేత్పరమేశ్వర. అనపత్యోఽహమిచ్ఛామి పుత్రంత్వత్తో జగత్పతే. ఈశ్వరః.-కిమిచ్ఛసిపుత్రం త్వం నిర్గుణం చిరజీవినమ్, అహోస్విదేకంసుగుణం సర్వజ్ఞం షోడశాబ్దికమ్. ఇత్యుక్తస్సోఽపి ధర్మాత్మా నాహమిచ్ఛామి నిర్గుణమ్. అల్పాయురపిపుత్రో మే సర్వజ్ఞోఽస్తుజగత్పతే. ఈశ్వరః.-తర్హి తే భవితా పుత్రః షోడశాయుస్సుధార్మికః, సర్వజ్ఞో గుణవాన్ లోకే కీర్తిమాన్ జ్ఞానసాగరః. ఏవముక్త్వా యయౌ దేవః సోఽపి లబ్ధవరో మునిః,

---

రాజదేహమును రాజస్త్రీదేహమును ధరించినవారును నైన పార్వతీపరమేశ్వరు లగు మీకు నేను ఎల్లప్పుడును మ్రొక్కువాడనైతిని. మీ సేవకులకు సేవకులైనవారియొక్క సేవకులకు సేవచేయుట యుత్తమము. మీ పాదకమలములయందు భక్తికలిగియుండగా ఇతరులతో నేమియు ప్రయోజనములేదు. కాబట్టి ఓస్వామీ! మీ పాదకమలములయందు భక్తికలుగునట్లు భక్తుడ నగునాకు అనుగ్రహింపుడు. అని యిట్లు మృకండుమహాముని స్తోత్రముచేయగా, పరమేశ్వరుడు పార్వతియు తానును భార్యతోగూడిన మృకండునితో ఓయీ! నీకు నావలనివరము ఏది కావలెనో దానిని అడిగి పుచ్చుకొనుము అని సెలవిచ్చెను. అంతట మృకండుడు ఓలోకనాయకుడైన స్వామీ! నీవు నాయెడల ప్రీతి గలవాడవు అయినపక్షమున నేను బిడ్డలు లేనివాడనై యున్నాను. నాయందు దయచేసి నీకు భక్తుడు కాగల కొడుకొకడు కలుగునట్లు వరమిమ్ము. ఇదియే నాకోరిక అనిచెప్పెను. అందులకు శివుడు నీవు కొడుకు కావలెనంటివే గుణహీనుడును దీర్ఘాయుష్మంతుడును అయినకొడుకు కావలెనా? మిక్కిలి తేజస్సుగలవాడును మంచిగుణములు గలవాడును అన్నియు తెలిసినవాడును అల్పాయుష్కుడును అయినకొడుకు కావలెనా? అని యడుగగా, పుణ్యాత్ముడగు మృకండుమహాముని దీర్ఘాయుష్మంతుడైనను గుణహీనుడగుకొడుకును నేను ఒల్లను. అల్పాయుష్కుడైనను అన్నివిషయములు తెలిసికోజాలిన గుణవంతుడగుకొడుకే నాకు కావలెను. అట్టివానినే నాకు దయచేయుము. అనగా, శివుడు అట్టే కానిమ్ము నీకు కలిగెడుకొడుకు బుద్ధిమంతుడై ధర్మాత్ముడై అన్నియు తెలిసినవాడై లోకములో గుణవంతుడు అనిపించుకొని కీర్తియు జ్ఞానమును గలవాడై పదియారేండ్లు

ప్రకామసంతుష్టమనాః ప్రయయౌ నిజమాశ్రమమ్. భార్యా తస్యాచి రాదాసీ దంతర్వత్నీ మరుద్వతీ, విధివద్విహితే తేన గర్భాధానస్యకర్మణి. తతః పుంసవనం తేన స్యందనాత్ప్రాక్తుభేదినే, గృహ్యోక్తవిధినా స మ్య క్కృతం పుంసో వివర్ధయే. సీమంతో ప్యష్టమేమాసి గర్భరూప సమృద్ధికృత్, సుఖప్రసవసిద్ధ్యేవ తేనకారిక్రియావిధిః. శతతారాఖ్య నక్షత్రే సర్వసౌభాగ్యసంయుతే, కేంద్రే గురౌ శుభేలగ్నే సుగ్రహేష్వ యుతేషుచ. ఆదిష్టందీపయన్ దీప్త్యా సర్వారిష్టవినాశకృత్, తనయ స్తప నాకారో మరుద్వత్యామజాయత. దేవదుందుభయో నేదుః ప్రసేదు స్సర్వతో దిశః, మృకండుతనయం ద్రష్టుం దేవర్షిః ప్రాతరాగతః. బ్రహ్మాది భిస్సురైస్సార్ధం ఋషిభిర్వేదవాదిభిః, తిలోత్తమాద్యప్సరసో దేవేం ద్రాద్యమరా అపి. వేదవ్యాసాదిమునయః తం చాత్యర్థం సమాయయుః, జాతకర్మ స్వయం వ్యాస శ్చక్రే సర్వానుమోదితః. నామకర్మ తతశ్చక్రే మునిస్సత్యవతీసుతః, ఋషయో దేవగంధర్వాః బ్రహ్మావిష్ణు మహే

జీవించియుండును. అని సెలవిచ్చి పరమేశ్వరుఁడు అంతర్ధానమాయెను. మృకండుఁడు అట్లు వరమును పడసి మనసున చాల సంతోషించి తనయాశ్రమమునకుపోయెను. పిమ్మట కొంతకాలమునకు అతనిభార్యయైన మరుద్వతి గర్భిణియై ఆచిహ్నములు కొన్నికొన్ని కానరాగా కడుపు దిగపడిపోవుట మొదలగు తొందరలు ఏవియు కలుగకుండ ఒక శుభదినమునందు పురుషశిశువు కడుపునందు వర్ధిల్లుటకై గృహ్యసూత్రమునందు చెప్ప బడినచొప్పున క్రమముగా పుంసవనమునుచేసి పిమ్మట గర్భము పూర్ణమగునట్టి ఎనిమిదవ నెలయందు సుఖముగా ప్రసవించుటకై సీమంతమును యథావిధిగా కావించెను. అటు పిమ్మట కనప్రొద్దులై గురువు ఉచ్చస్థానమునందుండగా తక్కినగ్రహములు తమతమ స్వస్థానములందు నుండగా ఎల్లశుభలక్షణములలోను గూడిన మంచిలగ్నమునందు శత భిషఙ్నక్షత్రమున మరుద్వతి ఒక సుపుత్రుని కనెను. ఆశిశువు ఎల్లకీడులు నశెడి చీక ట్లను తొలగించునట్టి సూర్యబింబమువలె స్వచ్ఛమైన తేజస్సుచేత దిక్కులను వెలి గించుచు నుండెను.

అప్పుడు దేవదుందుభులు మ్రోగెను. దిక్కులయందెల్లను తేటదనము మీరెను. తిలోత్తమ మొదలుగాగల అప్సరసలు ఆడిరి. దేవేంద్రుడు మొదలుగాగల దేవతలు వేద వ్యాసుడు మొదలుగాగల ఋషులును మిక్కిలి తమకముతో ఆబిడ్డను చూడవచ్చిరి. ఆవచ్చిన ఋషులలో ముఖ్యుడగు వేదవ్యాసమహాముని ఆబిడ్డనికి జాతకర్మముచేసి పిమ్మట పదునొకండవనాడు యథావిధిగానామకరణమును చేయించెను. అంతట ఋషులును దేవ

శ్వరాః. తతోర్చితాః పునర్జగ్ముః విస్మయంతో యథాగతమ్, తతో నారద ఆగచ్ఛ న్మృకండుసుతమీక్షితుమ్. మృకండుర్నారదం దృష్ట్వా ప్రత్యుత్థాయాసనాదిభిః, పూజయిత్వా యథాన్యాయం విశ్రాంతం ప్రసమీక్ష్యచ. అంకే నివాసయామాస మృకండుస్స్వాత్మసంభవమ్, మార్కండేయం నారదోపి లక్షణైశ్శోభనైర్యుతమ్. సర్వాంగం పరిమృజ్యైనం లక్షణాని పరీక్ష్యచ, ఆపాదమస్తకం జ్ఞాత్వా షణ్ణవత్యంగుళాత్మనా. ఉవాచ నారదోవాక్యం గృహీత్వాబాలకంకరే, సంపన్నోఽయం తవసుతో లక్షణై స్సర్వసౌఖ్యదైః. సర్వావయవశోభాభిః చిరంజీవిత్వసూచకైః, కుంభమత్స్యధ్వజాంభోజ శంఖచక్రాదిలక్షణైః. పాణిపాద తలోద్భూతైరయుతాయురయం మునే, లోకేఽస్య సదృశో నాస్తి పరమాయుస్తు షోడశ. ఇత్యుక్త్వా నారదశ్శీఘ్రమాగా త్స్వమాశ్రమపదం యయౌ, మృకండురపి తచ్ఛ్రుత్వా స్మృత్వా భర్గేరితం వరమ్. నిష్క్రామణం చతుర్థేస్య మాసి పిత్రా కృతం గృహాత్, అన్నప్రాశన మష్టార్ధే

---

తలును గంధర్వులును బ్రహ్మవిష్ణుమహేశ్వరులును మృకండునిచేత పూజింపఁబడినవారై ఆశ్చర్యపడుచు తమతమనివాసములకు పోయిరి. పిమ్మట నారదమహాముని వచ్చి ఆకుమారునిజూడగా మృకండుడు అతనినిజూచి ప్రత్యుత్థానముచేసి శాస్త్రమునందుచెప్పబడిన చొప్పున అర్ఘ్యము పాద్యము మొదలగు షోడశోపచారములతోను పూజించెను. ఆనారదుడును దారిబడలికదీర కొంచెము సేపు కూర్చుండి పిమ్మట మృకండుని తొడపై కూర్చున్న సర్వశుభలక్షణములుగల మార్కండేయుని జూచి అతనిసర్వావయవములను తనచేతితో నిమిరి ఎల్లశుభలక్షణములను పరీక్షించి తొంబదియారుఅంగుళముల దేహము గలవాడు అగుటచే పాదములు మొదలు తలదాక ఎగాదిగజూచి, ఆమార్కండేయుని చేయి తనచేతితో పట్టుకొని మృకండునితో, ఓమునీశ్వరా! నీకుమారుడుఎల్లసుఖములను కలుగజేయునట్టి మంచిలక్షణములచేత గొప్పవాడు చిరంజీవిత్వమును తోపింపజేయునట్టి ఎల్ల అవయవములకాంతులచేతను అడుగులయందును అరచేతులయందును గల కుంభరేఖ మత్స్యరేఖ ధ్వజరేఖ పద్మరేఖ శంఖరేఖ చక్రరేఖ మొదలైన రేఖాలక్షణములచేతను పదివేలయేండ్ల ఆయుష్షుకలవాడుగా తోచుచున్నాడు. ఈలోకమునందు ఈచెప్పబడిన శుభలక్షణములచేత వీనికి సమానుడులేడు. అయినను వీనికి పూర్ణాయుస్సు పదియారేండ్లే అగును. అని యిట్లుచెప్పి నారదమహాముని తనయాశ్రమమునుగూర్చి పోయెను, మృకండుడు ఆనారదునిమాటలువిని శివునిచేత ఇయ్యబడినవరమునుదలచి ఆచిన్నవానికి నాలుగవనెలపుట్టగానె ఇంటనుండి పొరుగూరికి పంపి నిద్రచేయించి రప్పించినవాడై ఆరవనెలయందు అన్నప్రాశనముచేసి రెండున్నరసంవత్సరమునకు తలవెండ్రుకలుతీయించి

చూడాహ్యబ్దార్ధకద్వయే. కర్ణవేధం తతః కుర్యా చ్ఛ్రవణర్క్షే సకర్మ
విత్, బ్రహ్మతేజోభివృద్ధ్యర్థం పంచమేబ్దే వ్రతం దదౌ. ఉపాకర్మ తతః
కృత్వా వేదానధ్యాప్య కృత్స్నశః, నమస్కారే బ్రాహ్మణానాం సద్వైనం సము
చోదయత్. యదా యత్ర ద్విజాన్ పశ్యే ద్యాన్ కాంశ్చి ద్విజసత్త
మాన్, నమస్కురుష్వ తాన్ సర్వాన్ దీర్ఘాయుస్తే భవిష్యతి. ఆశీర్భి
ర్ద్విజేంద్రాణా మమోఘైర్బ్రహ్మవాదినామ్, ఆయుః కల్పప్రమాణం
తే భవితా నాత్ర సంశయః. దీర్ఘాయుర్భవ సౌమ్యేతి ప్రయుంజంత్యా
శిషశ్చ తే, ఇతి పిత్రా సమాదిష్టో దివారాత్రమతంద్రితః. నమస్కరోతి
సర్వత్ర సర్వాన్విప్రాన్ సమర్చయన్, అభివాదయతస్తస్య బ్రాహ్మణా
నేవమన్వహమ్. దశపంచవర్షాణి వ్యతీయుః పుణ్యకర్మణః, అథైకదా
సమాయాతాః మృకండోరాశ్రమం శుభమ్. ఋషయ స్సప్తవిఖ్యాతాః
మార్కండేయం దిదృక్షవః, మృకండురపి తాన్ పూజ్య స్థాపయిత్వాసనే
షు చ. సుతం చ వందనే తేషాం మృకండు ర్వ్యాదిశన్మునిః, మార్కండే
యో నియుక్తోఽథ పిత్రా తానభ్యవాదయత్. షణ్మునీనభివాద్యాథ వసిష్ఠం

---

పిమ్మట శ్రవణనక్షత్రమునందు చెవులుకుట్టించి అవల అయిదవసంవత్సరమునందు బ్రహ్మ
వర్చస్సు వృద్ధియగుటకుగాను ఉపనయనమును కావించి, అనంతరము ఉపాకర్మ చేసి,
ఎల్లవేదములను చదివించి, కొడుకును జూచి, ఓరినాయనా! ఎక్కడనైనను సరే నీవు
చూచిన బ్రాహ్మణులకెల్లను నమస్కారము చేయుచుండుము. నీవు దీర్ఘాయుష్మంతుడవు
అగుదువు. వేదవాదులైన బ్రాహ్మణులయొక్క వ్యర్థములుకాని ఆశీర్వాదములచేత నీకు
ప్రళయపర్యంతమైన ఆయుస్సుకలుగును. ఇందుకు సందేహము లేదు. నీవు ఎవరికి నమ
స్కారము చేయుదువో వారు, ఓ మంచిబిడ్డా! నీవు దీర్ఘాయుష్మంతుడవు అగుము అని
దీవింతురు. అని యిట్లుచెప్పి మృకండుమహాముని మార్కండేయుని బ్రాహ్మణులకు నమ
స్కారము చేయబంపెను. ఇట్లు తండ్రిచేత చక్కగా ఉపదేశించి పంపబడినవాడై
మార్కండేయుండు పగళ్లయందును రాత్రులయందును ఎచ్చరికతో అన్నియెడలను కన
బడిన బ్రాహ్మణులకెల్లను నమస్కరించుచుండెను. ఈవిధముగా ప్రతిదినము బ్రాహ్మణనమ
స్కారము చేయుచురాగా అతనికి పదియేనేండ్లు ఆయెను. అటుపిమ్మట ఒకానొక
నాడు సప్తమహర్షులు మార్కండేయుని చూడదలంచి మృకండుని యాశ్రమమునకు
వచ్చిరి. మృకండుడు వారిని తగినపీఠములయందు కూర్చుండబెట్టి పూజించి తనకొడుకైన
మార్కండేయుని వారలకు నమస్కారముచేయ నియమించెను. అంతట తండ్రిచేతనియ
మింపబడిన మార్కండేయుండు వారలకు నమస్కారములుచేసెను. అందు ముందు వసిష్ఠ
డు తప్ప తక్కినఆర్గురుమునులకును మ్రొక్కి పిమ్మట వసిష్ఠునికి మ్రొక్కపోగా వసిష్ఠుడు

వందితుం యయౌ. కురుష్వ మా వందనం మే నిషిద్ధ ఇతి సాధ్వసాత్, కృతాంజలిపుటం ప్రహ్వాం వసిష్ఠం భ్రాంతచేతసః. తేతమూచు ర్నిషిద్ధః కిమభివాదనతత్పరః, ప్రణామాయాగతో విప్రో ననిషిద్ధః కదాచన. తై రేవ ముక్తో భగవా న్వసిష్ఠ స్తానువాచహ. సర్వే మోఘాశిషో యూయ మసత్యావాగిరో భవన్. ఇత్యేవముక్తా మునయో వసిష్ఠేన మహాత్మనా, తమేవం పునరూచు స్తే మృషాలాపాః కథం వయమ్. అస్మాభి రనృతం ప్రోక్తం కదాకుత్ర వదస్వనః. వసిష్ఠః.—పరతో వత్సరాదస్మా ద్వర్తమానా న్మృతిర్ధ్రువమ్. మృకండుసూనో రస్యైవ యుష్మాభిస్తు మృకండుజః, ఆయుష్మా న్భవ సౌమ్యేతి వర్ధితో మునిరాశిషా. విచార్యతాం స ఆయుష్మాన్ కథంస్యాదితి సత్తమః, తచ్ఛ్రుత్వా వచనం తస్య వసిష్ఠస్య మహాత్మనః. తేఽపశ్య న్ప్రణిధానేన పరతో వత్సరాన్మృతిమ్, తేమనస్యన్వతప్యంత కింకుర్మో వయ మిత్యుత. వసిష్ఠః పునరూచే తా న్మాభైష్టా మునయో నృప, అహంచ యూయం గచ్ఛామో బ్రహ్మాణం పద్మసంభవమ్. తం చాప్యయం నమస్కుర్యా త్కిన్నువక్ష్యతి లోకకృత్, తచ్ఛ్రుత్వా

---

నాకు నీవు మ్రొక్కకుమని నిషేధించెను. అంతట మార్కండేయుఁడు భయముచేత తత్తర పడుచు చేతులుకట్టుకొని నిలువబడగా ఆ మూర్గురుఋషులును నమస్కరించుటయందు అక్కరగలవాడైన బాలుని నమస్కరింపవలదని నిషేధించెదవేమి? బ్రాహ్మణుడు తనకు నమస్కరింపవచ్చినవారిని ఎప్పుడును వలదనరాదు. అనగా ఆఋషులనుజూచి పూజ్యుడైన వసిష్ఠమహాముని మీరందరును ఉపయోగములేని దీవనలు దీవించువారు. మీమాట లన్నియును అసత్యములు. అని యిట్లు వసిష్ఠమహాముని పలుకగా వారు మేము ఎట్లు అసత్యవాదులము. మేము ఎప్పుడు ఎక్కడ అబద్ధము చెప్పితిమి చెప్పుము అని యడిగిరి.

వసిష్ఠునిమాటలు.—ఈసంవత్సరము వెళ్లగానే పైసంవత్సరము మొదట ఈచిన్నవానికి తప్పక చావువచ్చును. మీరున్ను ఇతనిని దీర్ఘాయుష్మంతుడవు కమ్మని దీవించితిరి. ఇతడు మీదీవనలవల్ల ఎట్లు దీర్ఘాయుష్మంతుడగును అని ప్రత్యుత్తరము చెప్పెను. ఆఋషులు మహాత్ముడైన వసిష్ఠునిమాటవిని అవునవును ఇతనికి పైసంవత్సరమున చావు నిజమే. ఇది మనము విచారింపక వ్యర్థపుఆశీర్వచనములు చేసితిమి. ఇఁక నిందుల కేమి చేయవచ్చును అని విచారపడసాగిరి. అప్పుడు వసిష్ఠమహాముని ఆఋషులను జూచి మీరు భయపడకుడు. నావెంటరండు. మనమందరము బ్రహ్మయొద్దకుపోయి ఈచిన్నవానిని ఆయనకు మ్రొక్కింతము. ఇతడు మ్రొక్కగానే బ్రహ్మ యేమిచెప్పునోవిని అటు

సహాతేనైవ కార్యం విచిసుమో వయమ్. తతో వసిష్ఠప్రముఖాః బ్రహ్మా ణం సముపాగతాః, ఏతస్మిన్నేవ కాలేతు బ్రహ్మాదేవైస్సవాసవైః చరాచరాత్మకైస్సర్వైస్సేవ్యమానో జగత్పతిః, ఆస్తే సభాయాం విశ్వస్య జగతః కార్యసిద్ధయే. ఋషయశ్చ మరీచ్యాద్యాః మునిశ్చాపి మృకండుజః, తేఽపి బ్రహ్మాణమాసాద్య ప్రణేముర్వినయాన్వితాః. వంద్యమానా యథా తేతు మార్కండేయ మచోదయన్, తైశ్చోదితో వవందేసౌ విధాతుశ్చరణౌ ప్రభో. ఆయుష్మాన్భవ సౌమ్యేతి వర్ధితో విధినాశిషా, అభివాద్య మునీనన్యాన్ తత్రస్థానానుపూర్వశః. ఆశీర్భిర్వర్ధితస్తైశ్చ తస్థౌ విరచితాంజలిః, వసిష్ఠస్త్వథ తానాహ మునీనన్యానృషీంశ్చషట్. ప్రహసన్సర్వతో వీక్ష్య మునీనామాననానిసః, తాతధాతరమీభిస్త్వం మృషావాదీ మునీశ్వరైః. భూతసృష్టిపరోఽస్మాకం పౌర్వాపర్యవిచారతః, వసిష్ఠేనైవముక్తాస్తే మునయో బ్రహ్మణాసహ. కథంవయంమృషాలాపా ఇతి బ్రహ్మాణమబ్రువన్. బ్రహ్మా.—కథమేతానృషీన్మాం త్వం బ్రవీషి మృషవాదినః, ఉక్తమస్మాభిరనృతం యత్కించిద్బ్రూహి నో మునే.

---

పిమ్మట తగిన యాలోచన బ్రహ్మతోనే చేయుదము అనెను. అందులకు వారు సరియని యొప్పుకొనిరి. అంతట వసిష్ఠుడు మొదలైన ఋషులందరు మార్కండేయుని బిలుచుకొని బ్రహ్మయొద్దకు బోయిరి. అప్పుడు బ్రహ్మ ఇంద్రునితోగూడిన సకలదేవతలతోడను చరములును (సంచరించునవియును) అచరములును (సంచరింపనివియును) అయిన పశువులు పర్వతములు మొదలైనవానితోడను గూడుకొని లోకములయొక్క కార్యములు నెరవేరుటకై విచారించుచు కొలువుండెను. మరీచి మొదలుగా గలఋషులు మార్కండేయునితోడ బ్రహ్మయెదుటికి పోయి మేము నమస్కరించునపుడు మాతో గూడ నీవును అతివినయముతో బ్రహ్మకు నమస్కరింపుము అని చెప్పిరి. అతడును అట్లే నమస్కరించెను. ఆ బ్రహ్మదేవుడు నాయనా నీవు దీర్ఘాయుష్మంతుడవు అగుము అని మార్కండేయుని దీవించెను. అంతట మార్కండేయుడు అక్కడ నున్న ఋషులకందరికి నమస్కరించి వారిచేత అట్లే దీవనలనుపడసి తేజోభివృద్ధిగలవాడై చేతులు కట్టుకొని నిలువబడెను. అంతట వసిష్ఠమహాముని తనవెంటవచ్చిన ఆర్గురుఋషులను అక్కడనున్న ఋషులను చూచినవ్వుచు బ్రహ్మతో ఓతండ్రీ! ఈమునులందరు అబద్ధమాడినట్లు నీవును అబద్ధమాడితివి. ఇందువల్ల ముందువెనుకలు విచారించి ప్రాణులనుపుట్టించునట్టి నీవుకూడ వీరితోడివాడవు అయితివి. అనగా, ఋషులందరు బ్రహ్మనుజూచి మనము అబద్ధము చెప్పినవారమనుట యెట్లు అని అడిగిరి. బ్రహ్మయు వసిష్ఠునితో మేము అబద్ధము చెప్పినాము అంటివే అదియెట్లు అని వసిష్ఠుని అడిగెను.

వసిష్ఠః.—శృణుధ్వమృషయస్సర్వే పరమేష్ఠిన్ శ్రుణుష్వమే, యూయం సర్వే మృషాలాపాః స్వభావా త్సత్యవాదినః. విశ్వప్రపంచనిర్మాణపారవశ్యా న్మృషాభవత్, రజోతిరక్తే మనసి విచారో నావపద్యతే. పరతో వత్సరాదస్మా ద్వర్తమానాత్సురోత్తమ, ఆయుఃక్షయోఽస్య సంప్రాప్తస్తవాసీన్న మృషా భవేత్. యథాస్తుసత్యవచన స్తథాకురుత సువ్రత, తేనైవముక్తో భగవాన్ బ్రహ్మా మునిగణైస్సహ. అపశ్యత్ ప్రణిధానేన సత్యాయదహముక్తవాన్, కథమస్య ప్రతీకార మితిచింతాపరోఽభవత్. ఇతిచింతయత స్తస్య మతిరాసీన్నృపోత్తమ, ఆయుర్దాయవిధా నాన్యమ్మృతేపశ్యామిశంకరాత్. స్వపదాంభోజభక్తానా మాత్మన స్సదృశంవయః, ఆత్మనస్సదృశాన్భక్తాన్ సర్వాన్ పురా త్రిపురాంతకః. మాంచ విష్ణుం గరుత్మంతం శుకం ప్రహ్లాద మేవచ, హనూమంతం బలిం బాణం ధ్రువం వ్యాసం విభీషణమ్. చక్రే యస్మాదృతే తస్మా న్నాన్యం పశ్యామి శంకరాత్, ఇతినిశ్చిత్యమనసా బ్రహ్మాకృత్వాతమంకగమ్. వామే నాలింగనం మూర్ధ్ని న్యస్య సవ్యేతరంభుజమ్, ప్రేమ్ణాచ మూర్ధ్న్యుపాఘ్రాయ ప్ర

---

వసిష్ఠుడు చెప్పుచున్నాడు.—ఓసమస్తమునులారా! ఓ బ్రహ్మదేవుడా! నేనుచెప్పెద వినుడు. మీరందరును నిజమే మాటలాడు స్వభావము గలవారుగానుండియు ఇప్పు డబద్ధము చెప్పినవారలైతిరి. బ్రహ్మయొక్కమాట సకలము సృజించుటయందలి పరాకుచేత అబద్ధమాయెను. మనసునందు రజోగుణము మించినందున ముందే ఈవిచారము తోచకపోయెను. ఓదేవతా శ్రేష్ఠుడవగు బ్రహ్మదేవుడా! ఈజరగెడు సంవత్సరము కడపట ఈచిన్నవానికి చావుసిద్ధించును. నీమాటయును అబద్ధము కాదు. కాబట్టి మీమాటనిజము అగుటకు ఉపాయముమేదో దానిని చేయుము అనగా, బ్రహ్మకొంచెము ఆలోచించి అవును నేనును బొంకినవాడనే ఇందులకు ఏమిచేయవచ్చును అనుచింతగలవాడై కొంతసేపు చింతించి పిమ్మట తెలివితెచ్చుకొని శివుడు స్వకీయులైన భక్తులకు తనకు సమానమైన వయస్సును ఆయుస్సునుయిచ్చి చావులేకుండజేయుటను తానుజూచియున్న విషయము జ్ఞప్తికిరాకమునుపు శివుడు నన్ను విష్ణువును గరుత్మంతుని శుకుని ప్రహ్లాదుని హనుమంతుని బలిచక్రవర్తిని బాణుని ధ్రువుని వ్యాసుని విభీషణుని చిరాయువులనుగా జేసెను. కాబట్టి ఆయుస్సునిచ్చుటకు శివునికంటె ఇతరుడెవడును నాకు కానరాడు అని నిశ్చయించి ఆమార్కండేయుని దేహమును ఎడమచేతితో కౌగిలించుకొని కుడిచేయి అతనితలపైనుంచి ప్రేమతో మాడుపట్టుమూర్కొని యీచెప్పబోవునట్టిప్రతిజ్ఞను

తిజ్ఞామకరోదిమామ్, కర్మణా మనసా వాచా శివభక్తోయదీశ్వరః. అహం సత్యేన తేనాస్మై దద్యా దాయుశ్శతంశివః, అర్చామ్యహంస్థిరైరంగై ర్నాన్యంభర్గాదృతేష్టదమ్. తేన సత్యేపి దేవోస్మై దద్యాదాయు శ్శతంశివః, నాన్యం స్తౌమిమహేశానా దృతేసర్వేప్సితప్రదమ్. నాన్యంనమామి గౌరీశాదృతేసర్వేప్సితప్రదమ్, విధిరేవం ప్రతిజ్ఞాయ మార్కండేయమువాచహ. గచ్ఛ వారాణసీంవత్స తపశ్చర సమాహితః, స్వభక్తాఖిలదశ్శంభుర్యేవంప్రీతోభవిష్యతి. బ్రహ్మణైవంచుభిహితో మార్కండేయః ప్రణమ్యతమ్, అవతీర్యవిధేర్లోకాదంతికంస్వపితుర్యయౌ. ఏవందేపితరౌ సోఽథ తద్వృత్తాంతం నివేద్యచ, షణ్మాసాన్మరణంతస్య మృకండుః ప్రేత్యవిహ్వలః. అతీవ శోకదీనాత్మా విలలాపాకులేంద్రియః, మాతాచాస్య మహాభాగా రురోదభృశవిహ్వలా. నష్టలోకావుభావాస్వా మావాంపుత్త్రత్వయావినా, ఆవాంకథమదృష్ట్వాత్వాం కథంజీవామ పుత్రక. పుత్రహీనం

---

చేసెను. నేను మనసుచేతను వాక్కుచేతను కర్మచేతను శివభక్తుడనైనపక్షమున ఈసత్యముచేతనే ఈచిన్నవానికి నూరేండ్లాయుస్సు శివుడు ఇచ్చుగాక. ఎల్లకోరికలను ఇచ్చునట్టి శివునికంటె ఇతరదైవమును నిజముగా నాచేతులతో నేను పూజింపను. ఈసత్యముచేతనే ఈచిన్నవానికి శివుడు నూరేండ్లాయుస్సును ఇచ్చునుగాక. ఎల్లకోరికలను ఇచ్చునట్టి మహాదేవునికంటె ఇతరుని నేను పొగడను. ఎల్లకోరికలను ఇచ్చునట్టి గౌరీపతియైన శివునికంటె ఇతరుని నేను పొగడను. ఈసత్యముచేతనే ఈచిన్నవానికి శివుడు నూరేండ్లాయుస్సును ఇచ్చునుగాక. అనియిట్లు బ్రహ్మదేవుడు ప్రమాణపూర్వకముగా శివునిప్రార్థించి, మార్కండేయునితో ఓ చిన్నవాడా! నీవు కాశికి పొమ్ము. అచ్చట తనభక్తుల కోరికలను ఇచ్చునట్టి శివుడు సంతోషించునట్టుగా నియమముతో తపస్సుచేయుము అని చెప్పెను. ఇట్లు మార్కండేయుడు బ్రహ్మచేత నియమింపబడినవాడై ఆయనకు నమస్కారముచేసి, అందుండి భూలోకమునకు వచ్చి తల్లిదండ్రులవద్దచేరి వారికి నమస్కరించి బ్రహ్మలోకమునందు జరిగినవృత్తాంతమంతయును వారితోచెప్పెను. మృకండుడు అప్పటికి ఆరునెలలకు కొడుకునకు చావుకాలము అని తెలిసికొని చావుకాలము సమీపించెనే అని మిక్కుటమైన శోకముచేత నొచ్చినమనసుగలవాడును ఇంద్రియముల స్వాధీనత తప్పినవాడునునై ప్రలాపింపసాగెను. మార్కండేయునితల్లియును మిక్కిలి పరవశురాలై ఓరినాయనా! నీవు లేకపోయినయెడ ఇహపరలోకములు రెండును మాకు లేనివేయగును. నిన్నుచూడక మేమిరువురమును ఎట్లు జీవింతుము అని స్మృతితప్పి పడిపోయెను. అప్పుడు మృకండుడు దల్లిదండ్రులకు కొడుకు

జగచ్ఛూన్యం మాతాపిత్రోరితి శ్రుతిః. పుత్రహీనాః క్రియాస్సర్వా నిష్ఫలా ఇతి మే మతిః, లోకా న సంత్యపుత్రస్య నాస్త్యపుత్రస్య తత్సుఖం. గార్హస్థ్యం నాస్త్యపుత్రస్య సర్వశూన్యమపుత్రతా. అపుత్రతా మహద్దుఃఖం మహద్దుఃఖం కుపుత్రతా, ద్వాభ్యామపి మహద్దుఃఖం సత్పుత్రమరణం సుత. కిం కుర్వామ మహేశాన హా కృపా నాస్తి హా విభో, అపరాధం మయా కిం తే కే పురా విప్రయోజితాః. మాతరః పితరః పుత్రైః మయా పాపాత్మనా విధే, కేషామపహృతం ద్రవ్యం బ్రాహ్మణానాం మయా పురా. నిరాకృతః కిన్వతిథిః విశేషాన్నక్తమాగతః, బలైశ్వర్యవతో దృష్ట్వా దృష్ట్వా చ బహుపుత్రిణః. సుపుత్రిణశ్చ దృష్ట్వా హా మీర్ష్యయానుహతో నుకిమ్, యతినో నిందితాః కిన్ను యతినిందాత్కులక్షయః. పరదారా మయా దృష్టాః కిన్ను దుష్టేన చేతసా, సద్యః కులక్షయకరం పరదారాభిమర్శనమ్. మరుద్వతీ.—గావో మయా కృతాః కిన్ను వివత్సాః క్షీరలుబ్ధయా, మాతృహీనా మయా వత్సాః కృతా మాతృస్తనంధయాః. నసంతి మమ పుత్రా మే సపత్న్యా బహు

---

లేని లోకము లేనిదేయని చెప్పుదురు. కొడుకు లేనివారికి చేయబడు క్రియలన్నియు వ్యర్థములేయని నేను తలచెదను. పుత్రులులేనివారికి లోకములును లోకసుఖములును లేవు. పుత్రులులేనివానికి గృహస్థత్వము లేదు. కనుక కొడుకులు లేమి సర్వశూన్యము అగును. ఓ కొడుకా! తలిదండ్రులకు కొడుకులు లేమి మిక్కిలి దుఃఖము. అట్లే చెడ్డకొడుకుల కలిమియు మిక్కిలి దుఃఖము. ఆ రెంటికంటె మంచికొడుకుయొక్క చావు మిక్కిలి దుఃఖము. ఓ పరమేశ్వరా! మేము ఏమి చేయుదుము. స్వామీ! మాయందు నీకు దయలేక పోనేల? పూర్వకాలమునం దేమైన నీయెడ అపరాధము చేసితిమా? దైవమా! పాపాత్ముడైన నాచేత ఏ తల్లిదండ్రుల బిడ్డలు ఎడబాపబడిరో కదా, నేను పూర్వజన్మమునందు, బ్రాహ్మణులధనమును అపహరించితినో, రాత్రిపూట వచ్చిన యతిథిని విచారింపక వెడలగొట్టితినో, మిక్కిలి బలమును ఐశ్వర్యమును గలవారిని అనేకులు బిడ్డలుగల వారిని మంచిబిడ్డలుగలవారిని చూచిచూచి ఓర్వలేకపోతినో, యతులను నిందించుట వలన కులము నశించునందురు కాబట్టి నేను యతినింద యేమైనచేసితినో, చెడుతలపుతో పరులపెండ్లాలను జూచితినో, పరులపెండ్లాలను ముట్టుట అప్పుడే కులమును నాశముచేయునదిగదా? అని యిట్లు ఎన్నువలు పెట్టి యేడువసాగెను. అంతట మరుద్వతియు కళదేఱి, ఓ దైవమా! నేను పాలకు ఆసపడి అంటపిదికి ఆవుదూడలను చంపితినా? పాలుత్రాగెడు పసిబిడ్డల తల్లులను ఎడబాపితినా? నాకు బిడ్డలులేకుండగా నాసవతులకు మాత్రము అనేకులుబిడ్డలు కలుగవచ్చునా, అను ఓర్వలేనితనముచేత సవతులలో

వోభవన్, ఇతీర్ష్యయా సపత్నీభిః కింమయా కలహః కృతః. రూపవంతం నరందృష్ట్వా విరూపం చాత్మనః పతిమ్, నిర్ధనం ధనినం వాకిం ఆశోచి మనసా మయా. జారసంభోగరతయా సంపూజ్య పతిమాదరాత్, వంచయిత్వా తు తం పశ్చాత్సుప్తం జారాంతికం గతమ్. గృహద్రవ్యవినాశేన భర్త్రాజ్ఞా లంఘనేనచ, పరవేశ్మప్రవేశేన క్లేశితః కిం మయా పతిః. విలప్యైవ ముభౌ పుత్ర మాలింగ్యరురుదుర్భృశమ్, మార్కండేయోఽపి తౌ దృష్ట్వా పిత రావతిదుఃఖితౌ. ఉవాచ పితరం కిం వా కారణం శోకమోహయోః, పుత్రస్య వచనం శ్రుత్వా సుశ్లక్ష్ణమధురాక్షరం. ఉవాచ కారణం తస్య మృకండు శ్శోకమోహయోః, తవ హేతో రహం వత్స శోచామి శృణు కారణమ్, ఆయుష్షోడశవర్షాంతం త్వాం వదంతం పినాకినా, తస్య సంవత్సరస్యాస్య షోడశీయస్య పుత్రక. పశ్చాద్వ్యతీయుష్షణ్మాసా ఇతో మాసాః పరంతుషట్, షట్చైవ తేచ తే మాసాః షట్క్షణా ఇవ నందన. స కాలోఽయ మనుప్రాప్త స్తస్మా చ్ఛోచామి నందన, అచక్షుషో హ్యపుత్రస్య విద్యతే మహదంతరమ్. అచక్షుష స్త్వయం లోకః కేవలం తమసావృతః, సర్వేలోకా

---

పోట్లాడితినా? రూపవంతుడైన పరపురుషుని జూచి నా పెనిమిటి చక్కనివాడు కాడు ధనికుడును కాడు అని మనసులో కక్కసపడితినా? జారునితో భోగింపగోరి పెనిమిటికి ఆదరము గలదానివలెనే శుశ్రూషచేసి శీఘ్రముగా నిద్రపుచ్చి నిద్రపోవుచున్న పెనిమిటిని వంచించి జారపురుషుని చేరబోతినా? ఇంటిద్రవ్యములను పాడుచేయుటచేతను చెప్పినమాట మీరుటచేతను పొరుగిండ్లు తిరుగుటచేతను పెనిమిటిని దుఃఖపెట్టితినా? అని పలవరింపసాగెను. ఇట్లు తల్లిదండ్రులు ఇద్దరును కొడుకును కౌగిలించుకొని మిక్కిలి దుఃఖించిరి. అప్పుడు మార్కండేయుడు వారినిజూచి, మీకు ఇంతదుఃఖమును అజ్ఞానమును కలుగుటకు కారణమేమి అని యడుగగా, మిక్కిలి ప్రియమును ఇంపైనదియునైన కొడుకుమాటను విని మృకండుడు తమకుగలిగిన శోకమోహములకు కారణమును ఇట్లని చెప్పెను. ఓరి అబ్బి! మేము నీకుగానే దుఃఖపడుచున్నాము. నీకు శివుడిచ్చినఆయుస్సు పదియారేండ్లు. ఇప్పుడు పదియారవయేడు పుట్టి ఆరునెలలైనవి. ఇక ఆరునెలలే నీకు గల ఆయుస్సు. ఆ యారునెలలును ఆరునిమిషములుగా కడచును. ఆయుస్సుతీరునట్టి యా కాలము సంభవించెనే యని దుఃఖించుచున్నాము. కన్నులులేనివానితో బిడ్డలు లేనివానిని పోల్తురుగాని ఆయిరువురికిని మిక్కిలి తారతమ్యము కలదు. ఏమిఅనగా కన్నులులేనివానికి ఈలోకము మాత్రమే కేవలము చీకటికమ్మినట్లుండును. బిడ్డలు

అపుత్రస్య హ్యంధేన తమసావృతాః, పిత్రైవంకథితంశ్రుత్వా మార్కండేయోఽబ్రవీదిదమ్. మన్నిమిత్తం పితశ్శోకం కదాచిదపి మాకృథాః, శివేనైవ హ్యనాయుష్యం మమ దత్తం పురారిణా. సఏవ మే యథా కుర్యా జ్జరామరణవర్జితమ్, యతిష్యేహం తథా తాత యథాయాస్యామ్యమర్త్యతామ్. సమారాధ్య జగన్నాథం తపసా వరదం ప్రభుమ్, మృత్యుంజయం విరూపాక్షం సర్వేషాం సర్వదం సతాం, కాలకాలం మహాకాలం కాలకూటవిషాదినమ్. ఇతి శ్రుత్వా వచస్తస్య పితరావతి హర్షితౌ, క్లేశం శోకం పరిత్యజ్య ప్రహృష్టావూచతుస్సుతమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే మార్కండేయ
జననాదికథనంనామ అష్టాదశోఽధ్యాయః.



---

లేనివానికి ఎల్లలోకములును చీకటిచేత కప్పబడినట్లుండును. ఇట్లుచెప్పిన తండ్రి మాటలు మార్కండేయుండు విని ఓ నాయనా! మీరు నాకుగాను ఎప్పుడు దుఃఖపడ నక్కరలేదు. నాకు మేలుకలుగుటకే శివునిచేత అల్పాయుస్సు ఇయ్యబడెను. ఏయత్నము చేత నాకు ముదిమియు చావును లేనిస్థితిని శివుడు దయచేయునో, నేను ఏప్రయత్నముచేత మనుష్యత్వమును పోగొట్టుకొందునో, అట్టి విశేషప్రయత్నముతో తగిన వ్రతమును పూనెదను. అదియెట్లు అనగా, లోకములకు ఏలినవాడును మృత్యువును జయించినవాడును, నొసట కన్నుగలవాడును, ఎల్లసజ్జనులకును వలయువానినెల్ల నిచ్చువాడును, యమునికి యముడైనవాడును, ప్రళయకాలమునందు యమునివంటివాడును కాలకూటము అనువిషమును త్రాగినవాడును, అగు శ్రీమహాదేవుని సేవించెదను. అని పలికిన కుమారునిమాటను విని తల్లిదండ్రులు మిక్కిలి సంతోషించి ఆయాసమును దుఃఖమును విడిచి సంతోషముతో కొడుకునుజూచి యిట్లు పలికిరి.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మార్కండేయుని
జన్మము మొదలగుకథలను దెలుపునదియైన
పదునెనిమిదవ అధ్యాయకథ.



## ఏకోనవింశోఽధ్యాయః.

మృకండుః.—ఆపదో నాశనాయ మహానోగస్సమీరితః, మృత్యుంజయస్య దేవస్య సమారాధనలక్షణమ్. తద్గచ్ఛ శరణం తాత నాతః పరతరం హితమ్, సద్యస్సిద్ధిప్రదే క్షేత్రే తపసారాధ్య శంకరమ్. ప్రీణయిత్వాతతస్సిద్ధిం సమేష్యసి చ పుత్రక, గచ్ఛ గోదావరీం రమ్యాం తత్రాశ్రమపదం శుభమ్. సిద్ధిక్షేత్రం వరం ప్రాహుర్మునయస్సిద్ధివేదినః, గోదావరీతటం గత్వా సిద్ధిక్షేత్రవరం ప్రభోః. సమారాధయ దేవేశం త్ర్యంబకం త్రిపురాంతకమ్, కిం న శ్రుతం త్వయా తాత శ్వేతకేతుర్యథా పురా. పాశితః కాలపాశేన రరక్ష త్రిపురాంతకః, శిలాదతనయం మృత్యుగ్రస్తం పుష్టాబ్దమస్తకమ్. శివో నిజపదే చక్రే నందినం విశ్వనందినమ్, క్షీరోదమథనోద్భూతం ప్రళయానలసన్నిభమ్. పీత్వా హాలాహాలం ఘోరమరక్షద్భువనత్రయమ్, జలంధరం మహాదర్పం హృత త్రైలోక్యసంపదమ్. చరణాంగుష్ఠరేఖోత్థం జలమధ్యే సుదర్శనమ్, ప్రదాయ విష్ణవే శూలం స్వయం జగ్రాహ వైష్ణవమ్.

---

## పందొమ్మిదవ అధ్యాయము.

మృకండుని మాటలు.—అయ్యా, మాయిరువురి దుఃఖమును మానుటకు మృత్యువు గెలిచినవాడైన శ్రీ మహాదేవుని సేవయనెడి గొప్ప మేలు నీచే చెప్పబడెను. కాబట్టి అంతకంటె యితరమైనదెక్కడను మేలును లేదు. ఇపుడే అందులకై పొమ్ము. బిడ్డా! ఇప్పుడే కార్యము నెరవేరునట్టి పుణ్యక్షేత్రమునందు తపస్సుచేత నీవు శివుని ఆరాధించి సంతోషింపజేసి కార్యసిద్ధిని పొందుము. అబ్బీ! నీవు ఇప్పుడు గోదావరీనదీతీరమునకు బోయి అచ్చట మంచి ఆశ్రమమును జేసికొనుము. కార్యసిద్ధినెఱిగిన మహామునులు గోదావరిగట్టుననుండు ప్రదేశము పుణ్యక్షేత్రము అని చెప్పుదురు. కనుక నీవచ్చటికిపోయి మూడుకన్నులుగలవాడును త్రిపురములను నాశముచేసినవాడును దేవతలకు దేవుడైన శివుని ఆరాధింపుము. నాయనా! పూర్వకాలమునందు శ్వేతకేతువనువాడు యముని పాశములచేత కట్టుబడగా శివుడు ఆకట్టు వదలించి అతనిని రక్షించె నన్నకథను నీవు వినలేదా? శిలాదుని కొడుకును లోకమును సంతోషపెట్టువాడునైన నందీశ్వరుడు యెనిమిదేండ్లప్రాయమున మృతిపొందగా అతనిని తనదైన ఉత్తమస్థానమునందు నిలిపి రక్షించెను. ఇదిగాక పాలసముద్రమును తరువగాపుట్టిన ప్రళయకాలమునందలి అగ్నివలె క్రూరమైనదగు హాలాహాలము అనువిషమును మ్రింగి మూడులోకములను శివుడు రక్షించెను. జలంధరుడనువాడు మూడులోకముల సంపదను అపహరించి మిక్కిలి గర్వించియుండగా ఆజలంధరుని కాలిబొట్టనవ్రేలి గీరయందుపుట్టిన సుదర్శనచక్రమును జలమధ్యమునందు విష్ణువునకు ఇచ్చి,

విష్ణునాసహితశ్శంభుర్నిజఘానజలంధరమ్. దిలీపః. సుదర్శనంహరేశ్చక్రమితిలోకేషువిశ్రుతమ్, శివస్యతుత్రిశూలంచత్వయాకథముదీరితమ్. శివేన ప్రార్థితం చక్రం శైవందత్తంచ విష్ణవే, త్రిశూలంవిష్ణునాదత్తం శంభవే వైష్ణవంచతత్. జలంధరాసురఃకోవా కింవీర్యః కింపరాక్రమః, ఏతత్కథయ యోగీంద్ర విస్తరాచ్ఛృణ్వతోమమ. వసిష్ఠః.—అగ్నిజిహ్వోహిరణ్యస్యదశమస్తనుజఃపురా, ఆసీదసురరాడస్య నామ్నాభీతిమగాజ్జగత్. తస్యపుత్రోభవన్నామ్నాసూకరోఽసురరాట్బలః, బ్రహ్మదత్తవరోయోఽభూజ్జలంధరఇతిశ్రుతః. తపసాప్రీణయిత్వాతుబ్రహ్మాణం పరమేష్ఠినమ్, దేవాసురోరగాదీనామాయుధైశ్చాప్యవధ్యతామ్. అగాధాంతర్జలేవాసమపిలబ్ధ్వా ప్రజాపతేః, త్రీఁల్లోకాన్స్వవశేకృత్వాదేవాన్ నిర్జిత్యసోఽసురః. జేతుకామశ్శివంవిష్ణుం యయౌకైలాసవారిధీః, నారదాచ్ఛ్రుతవృత్తాంతౌ పూర్వమేవశివోహరిః. తద్భీత్యాప్రాపతుర్మేరౌమానసంసరఉత్తమమ్, ప్రవి

---

తాను విష్ణుసంబంధమైన శూలమును చేతబట్టి విష్ణువుతో గూడుకొన్నవాడై శివుడు చంపెను. కనుక నీవు శివుని ఆరాధింపుము అని మృకండుడు తనకొమారునితో జెప్పెను.

దిలీపునిమాటలు.—ఓ వసిష్ఠమహామునీ సుదర్శనచక్రము విష్ణువుది అనుటయు త్రిశూలము శివునిది అనుటయు మూడు లోకములయందును ప్రసిద్ధము. శివసంబంధమైన చక్రము విష్ణువు ప్రార్థింపగా విష్ణువునకు శివునిచేత నియ్యబడెననియు, విష్ణుసంబంధమైన త్రిశూలము విష్ణువుచేత శివునికి నియ్యబడెననియు నీవు చెప్పితివి. అదియెట్లు? జలంధరుడను రాక్షసుడు ఎవడు! వానివీర్యము ఎటువంటిది? అదియంతయు సవిస్తరముగా వినవలెనను కోరిక నాకు కలదు విశదముగా చెప్పుము.

వసిష్ఠునిమాటలు.—పూర్వకాలమునందు హిరణ్యుడనువాని పదియవకొడుకైన అగ్నిజిహ్వుడనువాడొకడు ఉండెను. ఆరాక్షసరాజు పేరు విన్నమాత్రముచేతనే మూడు లోకములును భయపడుచుండును. ఆయగ్నిజిహ్వునికి దుష్టుడైన సూకరుడను రాక్షసరాజుకొడుకాయెను. వాడు బ్రహ్మను తపస్సుచేత మెప్పించి దేవతలు రాక్షసులు నాగులు మొదలగువారిచేతను వారివారి ఆయుధములచేతను చావులేకుండునట్లుగాను మిక్కిలిలోతైన నీళ్లలో వాసముచేయునట్లుగాను వరములుపొందినవాడై జలంధరుడు అనగా ప్రసిద్ధి చెందెను. ఆజలంధరుడు తనకు బ్రహ్మవలన వరములు లభించినపిమ్మట దేవతలనుజయించి మూడులోకములను స్వాధీనము చేసికొని శివునిని విష్ణువును జయింపగోరినవాడై వారు ఉండుచోట్లగు కైలాసమునకును పాలసముద్రమునకును పోగా, అంతకుముందే వానిరాక నారదునివలన విని శివకేశవులు ఇరువురును వానికి వెరచి మేరుపర్వతమునందలి మానససరో

శ్యాంతర్జలం దేవావంతర్ధానముపేయుషౌ. అథాసురో మార్గమాణ శ్చచార భువనత్రయమ్, మార్గమాణస్యతౌ దేవౌ దివ్యంవర్షశతంయయౌ. తావపశ్యన్న్యయౌచింతాం క్వగతౌ మమవైరిణౌ,నతావజ్జయతో రాజ్యం మమనాస్తీతిసోఽసురః. ఏతస్మిన్నేవకాలేతు జలాంతర్గూఢవాసినౌ, చింతామవాపతుర్భీతౌ తద్వధోపాయమాత్మని. తయోశ్చింతయతోరేవం ప్రాదురాసీత్తతోభయోః, అభయజ్ఞో యతోవిష్ణు స్త్రిశూలం మనసాకరోత్. గుణావస్థా త్రిశూలాత్మా లోకేశక్తిత్రయాత్మకమ్, శివఃకాలాంతకంచక్రం దక్షిణాంగుష్ఠరేఖయా. వినిర్మమేసంకల్పః క్షణేకాలానలాత్మకమ్, తచ్చక్రంహారయేదత్వా స్వకీయం శ్రీపతేశ్చయత్. త్రిశూలం స్వయమాదత్తే వినిమయ్యస్థితౌతథా, కాలేతస్మిన్మునిశ్శ్రీమాన్ నారదోభ్యేత్యసాదరః. శివవిష్ణ్వోశ్చవృత్తాంత మసురాయన్యవేదయత్,అసురశ్శ్రుతవృత్తాంత స్సుమేరుమనిలోయథా. హృష్టోయయౌతద్వధేప్సుర్బ్రహ్మదత్తవరోఽద్భుతః, ప్రవిశ్య సోఽసురః క్రుద్ధో మానసంసర ఉత్తమమ్.

---

పరమునందు నీళ్లలో దాగియుండిరి. అటుపిమ్మట ఆరాక్షసుడు వారినివెదకుచు మూడు లోకములను దిరుగుచుండగా నూరుదేవతాసంవత్సరములు కడచెను. వారు తనకు కనబడకపోవుటచేత నాకువిరోధులైన శివకేశవులు ఇరువురును ఎక్కడపోయిరి. వారిని జయించునంతవరకు నాకు త్రిలోకరాజ్యము లేనిదేయని యాలోచించుచుండెను. ఇట్టి సమయమునందు నీళ్లలో రహస్యముగా వాసముచేయుచున్న శివవిష్ణువు లిద్దరును వానిని చంపునట్టియుపాయము ఏదియని యాలోచించుచుండగా తగిన యుపాయము ఒకటి వారికి అప్పుడు తోచెను. అది యేమియనగా, తమకు భయములేమిని తెలిసికొన్నవాడైన విష్ణువు శివునిదైన త్రిశూలమును తనమనసులో ధ్యానముచేసి స్వాధీనము చేసికొనెను. లోకమునందలి త్రిగుణావస్థలైన త్రిశూలమే స్వరూపముగా గలవాడగు శివుడు ఉత్సాహప్రభుమంత్రశక్తులు మూడును గలిగినదియు యమునిదైన చంపజాలినదియు ప్రళయకాలాగ్నియే స్వరూపముగా గలదియునైన సుదర్శనచక్రమును తనకుడికాలిబొటనవ్రేలి రేఖచేత క్షణకాలములోనే కలుగచేసి విష్ణువద్దనున్న తనత్రిశూలమును తాను పుచ్చుకొనెను. ఇట్లిద్దరును ఆయుధములను మార్చుకొని ఇకచేయవలసినపని యేమియని యాలోచించుచుండు సమయమునందు సంపన్నుడైన నారదమహాముని మిక్కిలి యక్కరతో పోయి శివవిష్ణువులవృత్తాంతమును జలంధరాసురునికి తెలియజేసెను. అంతట ఆయసురుడు ఆట్టైపొంగి మేరుపర్వతముమీదికిపోవునట్టి గాలివిధమున కదలి బ్రహ్మదేవునివలని వరబలముగలవాడు గనుక మిక్కిలి కోపముతో పోయి ఆ మానససరస్సునందు ప్రవే

మార్గమాణోవనే దేవా నదదర్శహరంహరిమ్, తౌ దేవావసురం దృష్ట్వా
యావన్నోతిష్ఠతేజలాత్. తావదుత్థాయతౌ దేవౌ పశ్యంతౌ తిష్ఠతస్తటే,
సోప్యంతర్జలగో దేవావపశ్యదసురస్తతః. ఉన్మమజ్జ తతః క్రుద్ధః హంతు
కామౌ సురోత్తమౌ, యావదారోహయేత్తీర మసుర స్తావదాశుతౌ.
చిచ్ఛేదతుశ్శిరస్తస్య శూలచక్రాయుధౌ సురౌ, హత్వాతమసురం దేవౌ
రరక్షతురిదంజగత్. సుదర్శనం హరిఃపశ్చాత్తత్సమారాధ్య శంకరమ్,
నేత్రాబ్జార్చనయా చక్రే స్వకీయం పురవైరిణః. ఏవం వినిమయో జాతో
పురాచక్రత్రిశూలయోః, ఏవం తత్కథితం సర్వం యత్పృష్టం తే నరో
త్తమ. శృణు భూయః పురారాతే ర్మహిమానం సుతానఘ, వాయ్వగ్ని
విష్ణుసోమాత్మశరంసంధాయ కార్ముకే. అధిష్ఠాయ రథస్యాధో వృషరూప
ధరంహరిమ్, దేవఃపురత్రయంశంభు రదహత్పత్రివహ్నినా. అంధకంయ
స్త్రిశూలాగ్రే ప్రోతం వర్షాయుతం దధత్, త్రైలోక్యైశ్వర్యసమ్మూఢం
శోషయామాస భానునా. కామం దృష్టినిపాతేన త్రైలోక్యవిజయో

శించి నీళ్లలో మునిగి శివవిష్ణువులను వెదకసాగెను. అదితెలిసి వారు వానికి కనబడకయే నీళ్లలోనుండి వెలుపలికి వచ్చి ఆ సరస్సుగట్టునందు నిలిచి వానిని చంపుటకు సిద్ధపడినవారై వాడు నీళ్లలోనుండి బయటికి వెడలునప్పుడే వానితలను శూలచక్రముల చేత నరకివేసిరి. ఇట్లు అసాధ్యుడైన యారాక్షసుని చంపి లోకముల భయమును పోగొట్టినవారైరి. పిమ్మట విష్ణువు శివుని కన్నులనెడి కమలములచేత పూజించి ఆయనచేత చక్రమును పుచ్చుకొని ఆయనదైన త్రిశూలమును ఆయనకు ఇచ్చెను. ఇట్లుపూర్వకాలమునందు చక్రత్రిశూలములకు మార్పుగలిగెను. అని వసిష్ఠుడు దిలీపునితో చెప్పి మరల మార్కండేయునిగూర్చి మృకండుడు చెప్పినమాటలు చెప్ప నారంభించెను. మృకండుడు, ఓబిడ్డా! ఇంకను ఆశివునియొక్క ప్రభావమును చెప్పెదను వినుము. పూర్వకాలమునందు వాయువును అగ్నియు విష్ణువును చంద్రుడనుచేరి యొకబాణముకాగా ఆబాణమును వింటియందుకూర్చి తనరథముక్రింద వృషభరూపముతో విష్ణువు ఆనికై నిలువగా ఆబాణాగ్నిచేత త్రిపురములను కాల్చెను. ఇదిగాక మూఁడులోకముల ఐశ్వర్యమునుపొంది గర్వించియున్న అంధకుడు అనురాక్షసుని తనశూలముతో గ్రుచ్చియెత్తి వేయిసంవత్సరములు సూర్యకిరణములు చక్కగా తాకునట్లుపట్టి ఆకిరణములవేడిమిచేతనే వాడు కాలిబూడిదయగునట్లు చేసెను. ఇదిగాక మూఁడులోకములను గెలుచుటచేత గొప్పను వహించిన మన్మథుని వానిపదవిని బ్రహ్మమొదలగు దేవతలందరు చూచుచుండగా కంటిచూపు

ర్జితమ్, చక్రే చానంగపదవీం వీక్షమాణేష్వజాదిషు. తం బ్రహ్మాద్యైక కర్తారం మేఘవాహనమవ్యయమ్, ప్రయాహి విశ్వశరణం విశ్వరక్షామణిం శివమ్. వసిష్ఠః.—శ్రుత్వా పితుర్వచో రాజన్ మార్కండేయో యయౌ శుభామ్, గోదావరీం సరిచ్ఛ్రేష్ఠాం గౌతమేనాభిపూజితామ్. తస్యానద్యాస్తటే శుద్ధే దక్షిణే నమృకండుజః, లింగం సంస్థాప్యవిధివన్మహాత్మా విశ్వపూజితః. కుర్వన్ త్రిషవణస్నానం త్రికాలం శివమర్చయన్, స్తువన్ త్రికాలంభూతేశం తిష్ఠన్యోగసమాధినా. కాలకాలంమహాకాలం కాలాతీతం కలాత్మకమ్, జగద్యోనిం జగద్వంద్యం జగత్కారణమీశ్వరమ్. ఏవం స్వమంతరాత్మానం ధ్యాయన్ విశ్వేశ్వరం విభుమ్, సుతోమృకండోర్యోగీంద్ర సమాధిస్థోభవన్మునిః. ఏవం తస్యమునేః కాలష్షణ్మాసాదధికో యయౌ, ఏతస్మిన్నేవకాలేతు బ్రహ్మా లోకపితామహః కైలాసమగమచ్ఛ్రీమాన్ దేవర్షిగణసేవితః, అభివాద్య మహేశానం దక్షిణా

---

చేతనే భస్మముచేసెను. అటువంటి బ్రహ్మమొదల వారికి ముఖ్యకర్తయును ఇంద్రుడైనవాడును నాశములేనివాడును సర్వమునకు రక్షకుడును ప్రపంచమును రక్షించునట్టి రత్నమైనవాడును నైన శివునిగూర్చి పొమ్ము అని చెప్పెను.

వసిష్ఠునిమాటలు.—ఓ దిలీపమహారాజా! మార్కండేయుడు ఈమీదచెప్పినవిధముగా తండ్రిచెప్పినమంచిమాటలు విని నదులలో శ్రేష్ఠమైనదియు గౌతమమహామునిచే పూజింపబడినదియునైన గోదావరికిపోయి గొప్పవాడును ఎల్లవారిచేత పూజింపబడినవాడును నైన యామార్కండేయుడు ఆయేటి దక్షిణపుగట్టునందు లింగమును స్థాపించి శాస్త్రప్రకారము ప్రతిదినము మూడుకాలములయందు స్నానముచేసి పూజించుచు స్తోత్రముచేయుచు సమాధియోగముచేత వర్తించుచునుండెను. మరియు అతడు యమునికి యముడును ప్రళయకాలమునందు పెద్ద యముడగువాడును కాలమును మీరినవాడును కలలు గలవాడును (అనగా) సకలవిద్యాస్వరూపుడును లోకమునకు పుట్టుచోటైనవాడును లోకములకు మ్రొక్కదగినవాడును లోకములకు కారణమైనవాడును నైన శివుని తనమనసునందు అంతరాత్మగాను సర్వవ్యాపకుడుగాను సర్వమునకు ప్రభువునుగా నిశ్చయించి ధ్యానించుచుండెను. ఇట్లు మృకండుమహాముని కొడుకైన ఆమునిశ్రేష్ఠుడు మౌనమును ధరించినవాడును సమాధియందున్నవాడును నైయుండగా అతని జీవితకాలమైన ఆరునెలల కాలమునకంటె అధికకాలము కడచెను. అట్టికాలమునందు సంపన్నుడును లోకములకు తాతయునైన బ్రహ్మదేవుడు దేవగణములును మునిగణములును తన్నుగొలిచిరాగా కైలాసమునుగూర్చిపోయి దక్షిణా

మూర్తిమీశ్వరమ్. ప్రణమ్యశిరసా దేవం వాగ్భిరగ్ర్యాభిరస్తువత్, అథ
ప్రసన్నో భగవా నంబికాపతిరబ్జజమ్. ఉవాచపద్మసంభూత కింతేఽభిలషి
తంవద, ఇత్థంప్రసాదాభిముఖం వేధాభవమథాబ్రవీత్. భవతాదత్తమా
యుః కిం కథంషోడశవార్షికమ్, మార్కండేయాయ మునయే తన్నజా
నామి శంకర. మృకండు స్తత్పితా ధీమాన్ ఉపాయజ్ఞో నమస్కృతౌ,
బ్రాహ్మణానాం సదా పుత్రం సమచోదయదన్వహమ్. నమస్కుర్వన్
ద్విజాన్సర్వాన్ తైరాశీర్భిస్సమేధితః, నమస్కృతోఽహం తేనాపి వర్ధిత
శ్చాశిషా మయా, జ్ఞాపితోఽహం వసిష్ఠేన పూర్వవృత్తాంత మాదితః,
అహంచ తేచమునయో యథానస్యామశంకర. తథాప్రసీదదేవేశ మిథ్యా
శీర్వచనావయమ్, వచోమిథ్యా యదిభవే దస్మాకం త్రిపురార్దన. లోకా
మిథ్యాభవేన్నూనం భవాన్ మిథ్యాభవిష్యసి, సప్తవారం మయాచా
స్యత్వాయురస్తు శతాధికమ్. ఉక్తంకృతా ప్రతిజ్ఞాయా తాం సత్యాం
కురు శంకర, ఇతిప్రసాదితశ్శంభు స్సస్మార స్వకృతంపురా. బ్రహ్మాణం తం

---

మూర్తియు మహేశానుడును ఈశ్వరుడునైన శివునిగూర్చి కులగోత్రములు చెప్పి నమ
స్కరించి మంచిమాటలచేత స్తోత్రముచేసెను. అంతట పార్వతికి పెనిమిటి యైనశివుడు
ప్రత్యక్షమై బ్రహ్మను జూచి ఓయి బ్రహ్మదేవుడా! నీకోరికయేమో తెలియజెప్పుము.
అని యడుగగా, బ్రహ్మ, ఓశంకరా! నీవు మార్కండేయునకు పదియారేండ్లే ఆయు
స్సుగా అనుగ్రహించిన వర్తమానము నేనెరుగను. బుద్ధిమంతుడును ఉపాయము తెలిసిన
వాడునైన యామార్కండేయుని తండ్రి మృకండుడు ప్రతిదినమును చూచిన బ్రాహ్మ
ణులకెల్ల నమస్కరించునట్లు తనకుమారుని నియమించియుండెను. ఆతడును తండ్రియని
మించినచొప్పున ఎల్లప్పుడు బ్రాహ్మణులకు నమస్కరించుచు వారిదీవనచేత వర్ధిల్లుచు
నుండి, ఒకనాడు నాకు నమస్కారము చేసెను. నేనును తక్కినవారివలెనే దీర్ఘాయు
ష్మంతుడవు కమ్మని దీవించితిని. అంతట వసిష్ఠుడు నాకు ఆపిన్నవాని పూర్వవృత్తాంత
మును తెలియజేసెను. కాబట్టి నేనును ఆమునులును చేసినయాశీర్వచనములు చెడక ఫలిం
చునట్లనుగ్రహింపవలెను. ఓస్వామీ! మా దీవనలు ఫలింపనియెడల మామాటలు అబద్ధ
ములగును. మామాటలు అబద్ధములైనపక్షమున లోకములన్నియు అబద్ధములగును.
అందువల్ల నీవును అబద్ధమగుదువు. నేను ఆచిన్నవానిని సామాన్యముగా ఒకసారిదీవించి
యూరకుండక యేడుమార్లు నీవు నూరేండ్లు జీవింపుము అని పలికితిని. కనుక ఎట్లయిన
నామాటనిజమగునట్లు అనుగ్రహింపుము. అని యీవిధముగా బ్రహ్మదేవుడు వేడుకొనగా
శివుడు తానుమునుపు చేసిన మార్కండేయుని జీవితకాలనిబంధనమును తలచుకొని బ్రహ్మను

విసృజ్యాథ స్వయమారుహ్య గోవృషమ్, పార్వత్యాసహితశ్శంభు ర్దేవ
గంధర్వకిన్నరైః. ప్రాదురాసీన్మునే స్తస్య తపసా తోషితశ్శివః, ఏతస్మి
న్నేవకాలేతు మార్కండేయో మునీశ్వరః. ప్రాతఃకాలేతు తాంపూజాం
కృత్వాస్తోతుంప్రచక్రమే, శివపూజాంచనిర్వర్త్య తద్దినేస్తోతుముద్యతః.
ఆజగామచ తం దేశం కాలో మృత్యుసహాయవాన్, వృత్తరక్తాంతనయ
నః సర్పవృశ్చికరోమవాన్. దంష్ట్రాకరాళవదన శ్చూర్ణితాంజనసప్రభః,
సమాగమ్యచ తస్యాంసే కాలపాశమవాసృజత్. కంఠార్పితమహాపాశో
మార్కండేయ స్తమబ్రవీత్, కాల తావత్ప్రతీక్షస్వ కాలం మమ మహా
మతే. నివర్తయామ్యహం యావ న్మహాస్తోత్రం జగత్పతేః, శివస్తోత్ర
మనిర్వర్త్య న కదాచిద్వ్రజామ్యహమ్. నస్వపామి నభోజ్యామీ త్యే
తన్మే వ్రతమాహితమ్, న జీవితం కళత్రంవా నరాజ్యంచ తథాసుఖమ్.
ప్రియంమమయథాతీవ శివస్యతు పరం స్తవమ్, అనర్చితశివౌ నష్టౌ మమ
హస్తౌ కదాచన. అగమ్యశాలయా పాదౌ భగ్నౌ మమమతౌ సదా,

పోమ్మని సెలవిచ్చిపంపి, వెంటనే పార్వతీదేవితోడ తాను వృషభవాహనమునెక్కి దేవతలు గంధర్వులు కిన్నరులును వెంబడింపగా మార్కండేయుండు తపస్సుచేయుచున్న తావునకుబోయి అతని తపస్సునకు మెచ్చుకొని అతనికి ప్రత్యక్షమాయెను. ఆకాలమునందు మార్కండేయుండు ఉదయకాలపు పూజచేసి శివునిస్తోత్రముచేయ నారంభించెను. అప్పుడే యముడు శివపూజనడపి శివునిస్తోత్రముచేసి మృత్యువును తోడుచేసికొని గుండ్రనైన మిడిగ్రుడ్లును ఎఱ్ఱనైన కడకన్నులును పాములనుబోలినవియును తేళ్ళనుబోలినవియునైన దేహమునందలి వెండ్రుకలును కోరపండ్లచేత భయంకరమైన ముఖమును నూరిన కాటుకనుబోలిన దేహవర్ణమునునై మార్కండేయునియొద్దకు వచ్చి తనపాశమును అతనిమెడకు తగిలించెను. అట్లు మార్కండేయుండు యమపాశములకు చిక్కియును భయపడక యమునితో ఓయి యముడా! నీవు మిక్కిలి బుద్ధిమంతుడవు. నేను లోకములకెల్ల ప్రభువైన శివుని స్తోత్రము చేయుచున్నాను. ఈస్తోత్రము ముగియునంతవరకు నాజోలికిరాకుము. ఈశివస్తోత్రము నెరవేరక నేనిక్కడనుండికదలను. నిద్రపోను. భోజనముచేయను. ఇది నాకు తొలగనివ్రతము. ఇదిగాక నాకు ప్రాణమునందుగాని పెండ్లామునందుగాని సుఖమునందుగాని శివస్తోత్రమునందుగల ప్రీతియుండదు. ఒకానొకప్పుడైనను శివుని పూజచేయనియెడల నాచేతులను లేనివిగా నెంతును. శివుని ఆలయమును గూర్చి పోనినాడు నాకాళ్లను విరిగినవానిగా నెంతును. శివుని దర్శనముచేయని

అనీక్షితశివేనేత్రే మమాంధేతేనసంశయః. అతత్ స్తుతిపరాజిహ్వాభిన్నా హ్వాతు మతామమ, అనమిత్వా శివో మూర్ధ్నా యన్నమూర్ధా హతో మమ. లింగప్రదక్షిణవిధాయోదేహో మమనాలుకత్, మనోవిస్మృత గౌరీశం తన్మనో నాస్తిమేసదా. ఏతన్మయోక్తంసంస్తవ్యం కర్మణా మనసా గిరా, సత్యేనానేన మేదేవః ప్రసీదతు మహేశ్వరః. యథా చ నానృతం వాక్య మహమేతదిహోక్తవాక్, సత్యేనానేన సతతం ప్రసీదతు మహేశ్వరః. తమబ్రవీత్తతః కాలో మార్కండేయం హసన్మునిమ్. న శ్రుతంతు త్వయామన్యే పూర్వవృద్ధసమీరితమ్. పూర్వేవయసియో యత్నం న కరోతి విమూఢధీః, స పశ్చాత్తప్యతే జీర్ణః స్వార్థభ్రిష్టఇవాధ్వగః. మాసాష్టకేన తత్కుర్యాద్యేన వర్ష స్సుఖంవ్రజేత్, పూర్వేవయసి తత్కుర్యాద్యేన వృద్ధస్సుఖం వ్రజేత్. యావజ్జీవంతు తత్కుర్యాద్యేనప్రేత్య సుఖంవ్రజేత్, శ్వఃకార్య మద్యకుర్వీత పూర్వాహ్ణే

---

సమయమునందు నాకన్నులను చెడినవానిగా నెంతును. శివుని స్తోత్రముచేయనికాలమునందు నానాలుకను తెగిపోయినదానినిగా తలతును. శివునికి మ్రొక్కనినాడు నాతలను చక్కగా నుండినను తెగిపోయినదని యెంతును. ఏదినము నాదేహము శివుని ప్రదక్షిణమునకు ఉపయోగింపకపోవునో ఆదినము అది ప్రాణములు లేనిబొందిగా నెంతును. శివునిస్తోత్రము చేయనినాడు నామనసు ఉండియు లేనిదేయని తలతును. ఇది అబద్ధము కాదు. మనస్సుచేతను వాక్కుచేతను కర్మముచేతను నేను నిజమేచెప్పుచున్నాను. ఈనా నిజముచేతనే శ్రీమహాదేవుడు నాకు ప్రత్యక్షము కాగలడు. నేనెప్పుడును అసత్యముపలుకను. ఈయసత్యముపలుకకుండుటచేతనే నాకుశివుడు ప్రత్యక్షమగును. కనుక నాయందు దయచేసి ఈశివస్తోత్రము ముగియునంతవరకు నన్ను ఏమియు ఆనకుము. అని మార్కండేయుడు పలుకగా, యముడు విని నవ్వుచు, ఓ చిన్నవాడా! నీవు మునుపటిపెద్దలమాటలువిన్నవాడవుకావా ఏమి? ఏబుద్ధిహీనుడు చిన్ననాడే తానుకృతార్థుడగుటకు ప్రయత్నముచేయడో వాడు పిమ్మట దారిబత్తెము కోలుపోయిన బాటసారివలె పశ్చాత్తాపమును పొందును. ఎనిమిదినెలలు పాటుపడిన మనుష్యుడు సంవత్సరమంతయు సుఖము ననుభవించునట్లు పిన్ననాడు తగిన ప్రయత్నములుచేసి పాటుపడినవాడు ముసలితనము వచ్చినప్పుడు సుఖముగా జీవించును. మానవుడు ఏ కార్యముచేత ఎల్లకాలము జీవింపవచ్చునో అట్టికార్యమును చేసి సుఖింపవలసినది. రేపు చేయవలసినపనిని నేడును మాపటిపూట చేయవలసినపనిని రేపటిపూటను చేసికోవలెనుగాని ఇప్పుడు చేయకపోయిన

చాపరాఙ్ముఖమ్. న హి ప్రతీక్షతే కాలః కృతమన్వకృతాకృతమ్, ఇదం కృత మిదం కార్య మిదంమను కృతాకృతమ్. ఏవమూహా సమాయుక్తం కృతాంతః పరికర్షతి, నాప్రాప్తకాలో మ్రియతే విద్ధశ్శరశతైరపి. కుశాగ్రేణాపిసంస్పృష్టః ప్రాప్తకాలో న జీవతి, చక్రవర్తిసహస్రాణి పురందరశతానిచ.మయానీతాని కర్తవ్యో నాత్ర మన్యుస్త్వయానఘ, ఇత్యేవం వచనం తస్య కాలస్యామోఘవర్తినః. మార్కండేయస్తమూచేదం శివస్తోత్రపరాయణః, యే స్తోత్రవిఘ్నం కుర్వంతి శివస్తోత్రరతాత్మనామ్. తే ఽచిరేణ వినశ్యంతిత్వాదృతో వారయామ్యహమ్, యథైవ రాజాభృత్యానాం శాస్తా రాజైవ నేతరః, తథైవశివభక్తానాం శాస్తాసపరమేశ్వరః. భిందంతిశైలానుదధీన్ పిబంతివ్యత్యాసయంతి క్షితిమంతరిక్షమ్, తృణీకృతబ్రహ్మపురందరాణాం కిందుష్కృతం శంకరకింకరాణామ్. నమృత్యుర్నతథాదూతా న యమో యమదూతకాః. న చాన్యే శివభక్తానాం భవంతి

---

నేమి రేపుచేసికోరాదయని తగినకాలమును ఎదురుచూచుచుండరాదు. కనుక నీవుస్తోత్రముచేసి యగునంతవరకు నేను కాచుకొనియుండను. ఇది చేసిఆయెను. ఇదిచేయవలెను. ఇది చేయబడుచున్నది. ఇది చేయబడలేదు. అనువిషయము నాకుసరిపడదు. అని యిట్లు చెప్పుచు మార్కండేయుని మెడకుతగిలించినత్రాటిని లాగుచు యముడు మార్కండేయునితో, ఓయి పుణ్యాత్ముడా! మానవుడు చావుకాలమురానిది అనేకబాణములచేత దేహము తూంట్లుపడపొడిచినను చావడు. చావుకాలము వచ్చినయెడ దర్భపోచకొన తాకిన మాత్రముననే చచ్చును. వేలకొలది చక్రవర్తులును నూరులకొలది యింద్రులును నాచేత యమలోకమును పొందింపబడిరి. కనుక ఈవిషయమునందు దుఃఖింపకుము. అని యిట్లు ఎదురులేక విజృంభించి మాటలాడుచున్న యమునిమాటలు విని శివుని స్తోత్రమునందలి పట్టును మానక, ఓయి యముడా! శివుని స్తోత్రముచేయుటయందు అక్కరగలవారి ప్రయత్నమునకు విఘ్నముచేయువారు శీఘ్రకాలములోనే నశింతురు. కాబట్టి నేను నిన్ను విఘ్నముచేయకుమని చెప్పితిని. రాజైనవాడు తనభృత్యులకు తానే శిక్షకుడైనట్లు శివభక్తులకు శివుడుతప్ప ఇతరులు శిక్షకులుకాజాలరు. శివభక్తులు కొండలనుపిండిచేయను సముద్రపునీళ్లనుత్రాగను భూమిని ఆకాశమును క్రిందుమీదుచేయను జాలియుండుదురు. బ్రహ్మను ఇంద్రునిసైతము తృణప్రాయముగా నెంచునట్టివారు. అటువంటి శివభక్తులకు పాపము అనునదియెక్కడిది? వారినిఎవరైనను ఏమిచేయగలరు. ఇదిగాక శివునిభక్తులకు చావులేదు. యమదూతలు యముడనువారు లేదు. శివభక్తులకంటె గొప్పవారు లేనేలేరు.

ప్రభవిష్ణవః, కింనశ్రుతంత్వయా కాలవాక్యమేత న్మనీషిణామ్. నృణా
మీశ్వరభక్తానాం న భవంత్యాపదః క్వచిత్, బ్రహ్మాదయోఽపి తాన్భక్తా
నశక్తాహంతుమీశ్వరాః. సఏవం తర్జితస్తేన కాలః కాలాంజనాకృతిః,
కాలాగ్నిరివ చుక్రోధ ఘృతసిక్త ఇవానలః. క్రోధరక్తాంతనయనో రుషే
త్యాహమహామునిమ్, యావంతయేవ గంగాయాః సికతా విప్ర దుర్మతే.
తావంతఏవబ్రహ్మాణో విష్ణవః శూలపాణినః, తథాసురాధిపా సంఖ్యా
మయా కాలేనసంహృతాః. కింవాత్ర బహునోక్తేనపశ్య మేవిక్రమంపరమ్,
మయాత్వంకాలపాశేనకంఠేబద్ధోఽసిసాంప్రతమ్. సపాతుత్వాంమహాదే
వో యస్యభక్తస్త్వమీదృశః, తంమునింతర్జయిత్వేవంకాలగ్రస్తముపాగ
మత్. కాలేనగ్రస్యమానోఽసౌధ్యానేనాభూచ్ఛివస్స్వయమ్, లింగాదథ
సముత్తస్థౌ మార్కండేయంసమాహ్వాయత్. బ్రహ్మణాభ్యర్థితః పూర్వ
ముమయాసహ శంకరః, అనిర్దేశ్యవయోరూప శ్చంద్రార్ధకృతశేఖరః.
గర్జన్ మేఘరవోదగ్రహుంకృతేనపతత్క్షణాత్, ఉద్ధృత్యపాదకమలం ప్ర

---

ఓయముఁడా! ఈశ్వరభక్తులు అగువారికి ఒకానొకప్పుడైనను ఆపదకలుగదు. అనిపెద్దలు చెప్పునట్టిమాటలు నీవు వినలేదా ఏమి? కోపమువచ్చినమాత్రముననే శివభక్తులను చంపుటకు బ్రహ్మమొదలగువారుగూడ సమర్థులుకారు. ఈవిధముగా మార్కండేయుఁడు బెదరింపగా యమధర్మరాజు ప్రళయకాలమునందలి అగ్నిహోత్రునివలెను నేయిపోయగా మండునట్టి అగ్నివలెను మండిపడుచు నల్లనైన కాటుకవంటి ఆకారమును కోపముచేత ఎఱ్ఱనైన కన్నులును గలవాఁడై మార్కండేయునితో నిట్లు పలికెను. ఓరి దుర్బుద్ధిగల బ్రాహ్మణచిన్నవాఁడా! గంగానదిలోని యిసుకను ఎంచినయెడ ఎంతమొత్తమో అంత మొత్తముగల బ్రహ్మలు శివులు విష్ణువులు ఇంద్రులును యముఁడనైన నాచేత చంపబడిరి. ఇక వేయిమాటలేల? శ్లాఘ్యమైన నాపరాక్రమమును జూపెదను చూడుము. ఇప్పుడు నీవు మెడయందు నాపాశము తగులుకోగా చిక్కుపడియున్నావు. ఈనిర్బంధము వలననుండి నీవు భక్తిచేయునట్టి యామహాదేవుఁడే రక్షింపనిమ్ము. అని యిట్లు యముఁడు మార్కండేయుని బెదరించి ఆయన మెడను తగిల్చినపాశమును బిగదీసిలాగెను. అప్పుడు మార్కండేయుఁడు తన మనస్సును చలింపకుండ శివునియందే నిలిపి లింగమునకు దిగువ తట్టుగా నిలువబడియుండెను. అంతట మును పు బ్రహ్మచేత వేడుకోబడినవాఁడును ఆట్టిది ఇట్టిది అనినిర్ణయించిచెప్పశక్యముగానివయస్సును ఆకారమునుగలవాఁడును అర్ధచంద్రుని శిఖయందు ధరించినవాఁడునునైన శివుఁడు పార్వతీసమేతుఁడై లింగమునుండి వెడలి ఉరుము ఉరిమినట్లు భయమును పుట్టించుచున్న హుం అనుధ్వనితో నిక్కి యమునిరో

జహారభుజాంతరే, పాదతాడనభిన్నాంగో నిపపాతయమః క్షితౌ. ఊర్ధ్వాననోవివృత్తాస్యో నాసాకుహరభీషణః, విప్రకీర్ణప్రహరణో విద్రుతవ్యాధిసైనికః. కాలోరఃపాదతాడోరుశబ్దమాకర్ణ్య భైరవమ్, ధ్యానాన్నివృత్తస్సమునిః పురోఽపశ్యత త్ర్యంబకమ్. బ్రహ్మవిష్ణ్వింద్రచంద్రాద్యాన్ దేవాన్ భీమగణాం స్తథా, దూరేచ పతితం కాలం కృతాంతం భీషణాకృతిమ్. దృష్ట్వా హృష్ట్వా విస్మయిత్వా కృత్వాశిరసి చాంజలిమ్, మనసా తన్మయో భూత్వా హృష్టరోమతనుర్మునిః. భూమౌ పతిత్వా నమ్రశ్చ తుష్టావ పరమేశ్వరమ్. మార్కండేయః.—రత్నసానుశరాసనం రజతాద్రిశృంగనికేతనం శింజినీకృతపన్నగేశ్వర మచ్యుతానలసాయకమ్, క్షిప్రదగ్ధపురత్రయం త్రిదశాలయైరభివందితం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. పంచపాదపపుష్పగంధి పదాంబుజద్వయ

---

మ్మును తనకాలితోఁ తన్నెను. ఇట్లు శివుడుతన్నినతన్నుచేత అవయవములసంధులు వదలగా యముడు భూమిమీదపడి పైకి నిక్కిన మొగముగలవాడును తెరవబడిననోరుగలవాడును కొండగుహలవలె కానవచ్చు ముక్కురంధ్రములచేత భయమును కలుగజేయువాడును అంతటను తాకిన దెబ్బగలవాడును భయపడి పారిపోయిన వ్యాధిసేనలు గలవాడును ఆయెను. మార్కండేయుండు యమునిరొమ్ముతాకిన శివుని కాలిదెబ్బయొక్క భయంకరమైన గొప్పచప్పుడువిని శివధ్యానమునుమాని తనయెదుటనున్న శివుని జూచి వెంటనే బ్రహ్మను విష్ణువును ఇంద్రుడు చంద్రుడు మొదలుగా గలదేవతలను ప్రమథగణములను ప్రాణులను తుదముట్టించువాడుగానుండినట్టి భయంకరమైన ఆకారముతో దూరముగా పడియుండిన యముని చూచి సంతోషించి యాశ్చర్యపడి చేతులుజోడించుకొని తలవంచి శివునికి మ్రొక్కి మనస్సున సర్వమును శివస్వరూపమే యనితలచి యందువలని సంతోషాతిశయముచేత దేహమునందలి వెండ్రుకలు నిక్కపొడుచుకొనగా నేలసాగిలబడి మ్రొక్కి యాశివుని నిట్లని స్తోత్రముచేయ నారంభించెను.

### మార్కండేయకృతమృత్యుంజయస్తోత్రము.

మేరుపర్వతము విల్లుగాను ఆదిశేషుడు అల్లెత్రాడుగాను వెండికొండశిఖరము ఉనికిపట్టుగాను విష్ణువు ఆగ్నేయాస్త్రముగాను చేసికొని త్రిపురములను అతిశీఘ్రముగా కాల్చివేసి దేవతలచేత పొగడబడినవాడగు చంద్రశేఖరుని (చంద్రుని తలపువ్వుగాధరించిన శివుని) ఆశ్రయించితిని. ఇక నన్ను యముడు ఏమిచేయగలడు. మందారము పారిజాతము సంతానము కల్పకము హరిచందనము అను అయిదుదేవవృక్షముల పువ్వులవలని మంచివాసనచేత పరిమళించుచున్న పాదకమలముల జంటచేత ప్రకాశించు

శోభితం పాలలోచన జాతపావక దగ్ధమన్మథవిగ్రహమ్, భస్మదిగ్ధకళే బరం భవనాశనం భవమవ్యయం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. మత్తవారణముఖ్యచర్మకృతోత్తరీయ మనోహరం పంకజాసన పద్మలోచన పూజితాంఘ్రి సరోరుహమ్, దేవసింధు తరంగ శీకర సిక్తశీతజటాధరం చంద్రశేఖరమాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః. కుండలీకృత కుండలేశ్వర కుండలం వృషవాహనం నారదాది మునీశ్వరస్తుత వైభవం భువనేశ్వరమ్, అంధకాంతకమాశ్రితామర పాదపం త్రిగుణాత్మకం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. యక్షరాజసఖం భవాక్షభుజంగహారవిభూషితం శైలరాజసుతా పరిష్కృత చారువామకళేబరమ్, క్ష్వేళనీలగళం పరశ్వథధారిణం మృగధారిణం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. భేష జం భవరోగిణా [illegible]ఖిలాపదామపహారిణం దక్షయజ్ఞ వినాశనం దురితా

---

వాడును, నొసటికంటినిప్పుచేత మన్మథుని దేహమును కాల్చినవాడును, జన్మములను నశింపజేయువాడును, సర్వమును నాశము చేయువాడును, నాశములేనివాడునైన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమి చేయగలడు. మదించినయేనుగైన యసురునితోలు ఉత్తరీయముగా జేసికొనుటచేత మనోహరుడైనవాడును, బ్రహ్మచేతను విష్ణువుచేతను పూజింపబడిన పాదకమలములుగలవాడును, దేవగంగయందలి అలలవలనితుంపురులచేత తడిసి చల్లగానుండు జడలనుధరించినవాడునైన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమిచేయగలడు. గుండ్రముగా జేయబడిన సర్పరాజును చెవిపోగులుగా ధరించినవాడును, ఎద్దువాహనముగాగలవాడును, నారదుడు మొదలగు మునీశ్వరులచేత పొగడబడిన విభవము గలవాడును, లోకనాయకుడును, అంధకాసురుని చంపుటయందు యముడైనవాడును, ఆశ్రయించినవారికి కల్పవృక్షమువలె కోరినకోరికల నిచ్చువాడును, సత్త్వరజస్తమములనెడు మూడుగుణములుగలవాడునైన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమి చేయగలడు. కుబేరునికి మిత్రుడును, జ్ఞానవీర్యాది గుణములచేతను రుద్రాక్షములచేతను పాములహారములచేతను అలంకరింపబడినవాడును, పర్వతరాజుకూతురైన పార్వతీదేవిచేత అలంకరింపబడి ఒప్పిదమైన యెడమభాగము గలవాడును, విషముచేత నల్లనైన మెడగలవాడును, గండ్రగొడ్డలి ధరించినవాడును, జింకను చేతియందుంచుకొన్నవాడును అయిన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమి చేయగలడు. జన్మములనెడు రోగములచేత బాధపడువారికి ఔషధమైనవాడును, ఎల్లయాపదలను పోగొట్టువాడును, దక్షునియజ్ఞమును చెరిచినవాడును,

పహం త్రివిలోచనమ్, భుక్తిముక్తిఫలప్రదం సకలాపదామపహారిణం చంద్రశేఖరమాశ్రయే మమకింకరిష్యతి వై యమః. భక్తవత్సలమర్చితాం నిధిమక్షయం హరిదంబరం సర్వభూతపతిం పరాత్పర మప్రమేయ మనూపమమ్, సోమవారి నభోహుతాశన సోమపా ద్యఖిలాకృతిం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. విశ్వసృష్టివిధాయకం పునరేవపాలన తత్పరం సంహరంత మపి ప్రపంచ మశేషలోక నివాసినమ్, క్రీడయంతమహర్నిశం గణనాథయూథసమావృతం చంద్రశేఖరమాశ్రయే మమ కింకరిష్యతి వై యమః. సంసారసర్పదష్టానాం జంతూనా మవివేకినామ్, చంద్రశేఖరపాదాబ్జస్మరణం పరమౌషధమ్. రుద్రం పశుపతిం స్థాణుం నీలకంఠముమాపతిమ్, నమామి శిరసా దేవం కింనోమృత్యుః కరిష్యతి. నీలకంఠం విరూపాక్షం నిర్మలం నిరుపద్రవం, నమామిశిర

---

పాపములను పోగొట్టువాడును, మూడుకన్నులుగలవాడును, ఇహమునందు సుఖానుభవములును, పరమునందు మోక్షమును అనెడు ఫలములను ఇచ్చువాడును, ఎల్ల యాపదలను పోగొట్టువాడును నైనచంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమిచేయగలడు. భక్తులయందు వాత్సల్యము గలవాడును, తన్ను పూజించువారికి ధనస్థానమైనవాడును, క్షయము లేనివాడును, దిగంబరుడైనవాడును, ఎల్లప్రాణులకు ప్రభువును, ఉత్కృష్టవస్తువులలోనెల్ల ఉత్కృష్టుడైనవాడును, మేరలేనివాడును, ఈడులేనివాడును, చంద్రుడు జలము ఆకాశము అగ్ని సోమయాజి మొదలుగాగల అష్టమూర్తులు గలవాడునైన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమిచేయగలడు. సమస్తలోకములసృష్టిని చేయువాడును, వెంటనే ఆలోకములను పాలింపగోరువాడును, పిమ్మట వానిని నశింపజేయువాడును, ఎల్లలోకములందు నుండువాడును, ప్రమథగణములచేత చుట్టబడినవాడై రాత్రులయందును పగళ్లయందును ఎల్లప్పుడు వినోదించువాడును నైన చంద్రశేఖరుని ఆశ్రయించితిని. ఇక యముడు నన్నేమిచేయగలడు. సంసారమనెడి పాముచేత కరవబడినవారును, వివేకము మాలినవారును నైన ప్రాణులకు చంద్రునిసిగపువ్వుగాజేసికొన్న శ్రీమహాదేవుని పాదకమలములను స్మరించుట మిక్కిలి మంచిదైన మందు. దుఃఖములను తొలగించువాడును పశువులవలె జ్ఞానహీనులైన ఏప్రాణులను ఏలుకొనువాడును, ప్రళయకాలమునందుగూడ చలింపకయుండువాడును విషముచే నల్లనైన కంఠముగలవాడును ఉమాదేవికి భర్తయైనవాడును నైన మహాదేవునిగూర్చి మ్రొక్కెదను. నన్ను మృత్యువు ఏమిచేయగలదు. నీలమైన కంఠము గలవాడును, సూర్యచంద్రాగ్నులే మూడుకన్నులుగాగలవాడును, పరిశుద్ధుడును, ఉపద్రవము లేనివాడును నైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను. నన్ను మృత్యుదేవత ఏమిచేయగలదు. నల్లని కంఠ

సాదేవం కింనోమృత్యుఃకరిష్యతి. కాలకంఠం కలామూర్తిం కాలాగ్నిం కాలనాశనమ్, నమామిశిరసాదేవం కింనోమృత్యుః కరిష్యతి. అనంతమవ్యయంశాంత మక్షమాలాధరం హరమ్, నమామి శిరసాదేవం కింనోమృత్యుఃకరిష్యతి. ఆనందంపరమంనిత్యం కైవల్యపదకారణమ్, నమామి శిరసాదేవం కింనోమృత్యుఃకరిష్యతి. దేవదేవంజగన్నాథందేవేశంవృషభధ్వజమ్, నమామిశిరసాదేవం కింనోమృత్యుఃకరిష్యతి. స్వర్గాపవర్గదాతారం సృష్టిస్థిత్యంతకారణమ్, నమామిశిరసాదేవం కింనోమృత్యుఃకరిష్యతి. గంగాధరం శశిధరం శంకరం శూలపాణినమ్, నమామి శిరసాదేవం కింనోమృత్యుః కరిష్యతి. భస్మోద్ధూళితసర్వాంగం నాగాభరణ భూషితమ్, నమామిశిరసాదేవం కింనోమృత్యుః కరిష్యతి. శివేశాన మహాదేవ వామదేవ సదాశివ, కల్పాయుర్దేహి మేపూర్ణం యావదాయురరోగతామ్. మార్కండేయకృతంస్తోత్రం యఃపఠేచ్ఛివసన్నిధౌ,తస్యమృత్యు

---

ముగలవాడును కలలే స్వరూపముగాగలవాడును ప్రళయకాలమునందు అగ్నియగువాడును యముని నాశము చేయువాడునునైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను. నన్నుమృత్యువు ఏమిచేయగలదు. తుదిలేనివాడును నాశములేనివాడును శాంతుడును రుద్రాక్షమాలికను ధరించినవాడును పాపములను హరించువాడునునైన మహాదేవునికి మ్రొక్కెదను. నన్ను మృత్యువు ఏమిచేయగలదు. సంతోషస్వరూపుడును సర్వోత్కృష్టుడును శాశ్వతుడును మోక్షస్థానమును పొందుటకు కారణమైనవాడును నైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను నన్నుమృత్యుదేవత ఏమిచేయగలదు. దేవతలకుదేవుడును లోకములకు ప్రభువును దేవతలలోపల ఈశ్వరు డనబడువాడును ఎద్దుటెక్కెము గలవాడునునైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను. నన్ను మృత్యుదేవత ఏమిచేయగలదు. స్వర్గమును మోక్షమును ఇచ్చువాడును, లోకములసృష్టికిని ఉనికికిని నాశమునకును కారణమైనవాడునునైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను నన్నుమృత్యుదేవత ఏమిచేయగలదు. గంగను చంద్రుని తలనుధరించినవాడును సుఖమును కలుగజేయువాడును నైన శ్రీమహాదేవుని సేవించెదను నన్నుమృత్యువు ఏమిచేయగలదు. విబూదిచేత దుమ్మెగయుచున్న యెల్ల అవయవములు గలవాడును పాముల సొమ్ములచేత అలంకరింపబడినవాడునునైన శ్రీమహాదేవునికి మ్రొక్కెదను నన్ను మృత్యుదేవత ఏమిచేయగలదు. అని మార్కండేయుండు స్తోత్రము చేసి శుభస్వరూపుడవును ఐశ్వర్యము గలవాడవును గొప్పదేవుడవును అర్ధదేహము స్త్రీరూపముగా గలిగి వెలుగువాడవు నైన, ఓ సదాశివా! ప్రళయాంతపర్యంతము బ్రతికియుండునట్టి పూర్ణాయుర్భును బ్రతికినన్నాళ్లు రోగములేమియు దయచేయుము అని మృత్యుంజయుండైన సాంబశివుని వేడెను. అని యిట్లు మార్కండేయునిచేత చేయబడినస్తోత్రమును

భయంనాస్తి సత్యంసత్యంవదామ్యహమ్. ఇతి స్తుతో మహాదేవో మార్కండేయేనధీమతా, ప్రసాదాభిముఖోభూత్వా మార్కండేయమువాచహ. కల్పాయుర్దేహిమే యస్మా దిత్యహం ప్రార్థితస్త్వయా, ప్రతిజ్ఞాతా పద్మభువా సప్తవారంయతోమునే. అతోఽహం తే ప్రదాస్యామి సప్తకల్పాయు రుత్తమమ్, సర్వాభీష్టప్రదాభక్తి ర్మమ దత్తా తవానఘ. ఇతిదత్వా వరంశంభు ర్మార్కండేయాయభూపతే, సాంత్వయిత్వా ధునావాచా తత్రైవాంతరధీయత. మార్కండేయో మహాతేజా దేవదేవ ప్రసాదతః, అమృతత్వ మనుప్రాప్య దదర్శ ప్రళయార్ణవహ్వాన్. పునస్స్వమాశ్రమంప్రాప్య మార్కండేయో మహామునిః, మాతరం పితరం నత్వా షణ్మాసాంతికవాసరే. స్వనాశదుఃఖశోకాబ్ధిమగ్నౌ తావాజుహావసః, లబ్ధ్వాయుస్సప్తకల్పాంత మాగతం త్రిపురద్విషః. ఆలింగ్యపితరౌ పుత్రం పునః పశ్చాన్ముదాభృశమ్, ఆనందబాష్పధారాభిః శీతాభిరో మహార్ణవౌ. నన్వశోచయతాం పుత్ర మాత్మనో సుఖజీవనమ్, ఏలంలబ్ధ

ఎవడు శివునిసన్నిధియందు పఠించునో వానికి మృత్యుదేవతవలని భయములేదు. ముమ్మాటికి ఇది నిజమే అని నేను చెప్పుచున్నాను. అని యిట్లు మార్కండేయునిచేత స్తోత్రముచేయబడిన శ్రీమహాదేవుడు అతనియందు దయగలవాడై యొక్కమాట చెప్పెను. ఓయి మార్కండేయుండా! నీవు కల్పాంతమువరకును ఆయుస్సు కావలెనని కోరితివి. బ్రహ్మదేవుడు అంతకు ఏడంతల యాయుస్సు నియ్య ప్రతిజ్ఞచేసికొనియున్నాడు కనుక నీకు నేను ఏడుకల్పములు కడచునంతదాక జీవించునట్లు దీర్ఘాయుస్సును ఇచ్చుచున్నాను. నాయొక్కభక్తియైనది నీకు ఎల్లకోరికలను ఇచ్చును. అని యిట్లు మార్కండేయునికి వరమిచ్చి యూరడించి యచ్చటనే అంతర్ధానమాయెను. అంతట దేవదేవుడైన శివుని యనుగ్రహమువలన మార్కండేయుండు చావులేనివరమును పొంది మిక్కిలి తేజస్సుగలవాడై పెక్కు ప్రళయములను జూచెను. అట్టిమార్కండేయుండు తల్లిదండ్రులను వదలిపోయిన ఆరునెలలకు శివానుగ్రహమునుపొంది దీర్ఘాయుష్మంతుడై ఆరవనెల కడపటి దినమునందు మరల తనయాశ్రమముచేరి తల్లిదండ్రులనుజూచి నమస్కరించి తననాశమునుగూర్చి మిక్కిలి దుఃఖపడుచున్న ఆయిరువురతోను నేను శివునివలన ఏడుకల్పములదాక జీవించునట్లు వరము పొందివచ్చినాను అనిచెప్పి సంతోషపెట్టెను. తల్లిదండ్రులును కొడుకును కౌగిలించుకొని అందువలన గలిగిన సంతోషాతిశయముచేత కన్నులయందు ఆనందబాష్పములురాలగా గగుర్పాటునుపొందినవారలై కొడుకు అల్పాయుస్సుగలవాడయ్యెగదా యనుచింతనుమానినవారై సుఖముగానుండిరి. ఈవిధముగా మహాముని

వరశ్చంభో ర్మార్కండేయో మహామునిః, శుశ్రూషయానయత్కాలం మహాంతం పాదయో స్తయోః. గతేబహుతిథేకాలే సేవయాపితృపాదయోః, పితృభ్యా మప్యనుజ్ఞాత స్తీర్థయాత్రాపరో౽భవత్, తీర్థయాత్రా ప్రసంగేన పృథివీమటతాఖిలామ్, అనేకమాఘావిహితా గంగాద్యాసు నదీషుచ. మునినాసకృతానైవ మాఘా స్తీర్థేషు భూతలే, నతానిసంతి తీర్థాని అపిబ్రహ్మాండగోళకే. మృగశృంగస్య విప్రస్య మాఘస్నానరతస్యచ, ఇత్థంభాగ్యవతీజాతా సంతతి ర్మాఘగౌరవాత్. అనేకమాఘావిహితామహాత్మనా మృకండుపుత్త్రేణ మృడార్పితాత్మనా, అనేకలోకప్రళయాః సమీక్షితా స్సను స్తలోకేషు సదావిహారిణా.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే,
మార్కండేయచరిత్రకథనంనామ
ఏకోనవింశో౽ధ్యాయః.



---

యైన మార్కండేయుడు శివునివలన వరముపడసి చిరకాలము తల్లిదండ్రుల పాదసేవ చేయుచునుండి పిమ్మట వారియనుమతినిపొంది తీర్థయాత్ర చేయుట యను నెపముచేత భూమియం దెల్లయెడలను తిరుగుచు గంగ మొదలుగాగల పుణ్యతీర్థములయందు స్నానముచేయుచు బహునదులయందు బహు మాఘస్నానములు చేసెను. ఈభూమండలములో అతడు మాఘస్నానముచేయని పుణ్యనది యొక్కటియైనను ఉండదు. మాఘస్నానము చేయుటయందు ఆసక్తిగల మృగశృంగమహామునికి మాఘస్నానమువలని పుణ్యవిశేషమువలన ఇటువంటి యదృష్టముగల సంతానము కలిగెను. అనేకమాఘస్నానములు చేయుటచేత మిక్కిలి మహిమగలవాడును శివునియందు సమర్పింపబడిన మనసుగలవాడునైన మార్కండేయమహాముని ఎల్లలోకములయందును ఎల్లప్పుడును సంచారముచేయుచు అనేకములైన లోకప్రళయములను జూచుచు చిరకాలము జీవించియుండెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు
మార్కండేయునిచరిత్రమును దెలుపునట్టిదైన
పందొమ్మిదవ అధ్యాయకథ.



## వింశోఽధ్యాయః.

దిలీపః.—హరపాదహతే కాలే సర్వలోకభయంకరే, కథం సమభవల్లోకా ఏతన్మే బ్రూహి సత్తమ. వసిష్ఠః.—కాలే వినిహతే భూమిః ప్రజాభారేణపీడితా, పూరితాభూత్తదామర్త్యైర్యథాసాంగులి మంతరా. అథ బ్రహ్మాదయో దేవాః ప్రీణయిత్వా పినాకినమ్, కాలంసజీవయామాసుః ప్రసాదాచ్ఛూలపాణినః. శివః.—అద్యప్రభృతిహే కాల మద్భక్తాన్మావలోకయ, క్రూరదృష్ట్యా కృపాదృష్ట్యా పూజయస్వాత్మసమ్మితాన్. శివేనైవ మనుజ్ఞాతః ప్రణమ్య వృషభధ్వజమ్, శివాజ్ఞాం శిరసా ధృత్వా స్వం లోకంపునరభ్యగాత్. యథాపూర్వం శశాసేమాః ప్రజా ధర్మేణసూర్యజః. దిలీపః.—ఇక్ష్వాకువంశగురవే నమస్తుభ్యంమహాత్మనే, తీర్థానాం ముఖ్యతాం బ్రూహి మాఘస్నానరతాత్మనామ్. వసిష్ఠః.—శృణు రాజన్ ప్రవక్ష్యామి తీర్థవైభవముత్తమమ్, యచ్ఛ్రుత్వా ముచ్యతే జంతుః పాపౌఘఘనకంచుకాత్. సంప్రాప్తే మాఘమాసేతు యత్ర

---

## ఇరువదవ యధ్యాయము

దిలీపునిమాటలు.—ఓవసిష్ఠమహామునీ! అన్నిలోకములకును భయముకలుగఁజేయువాఁడైన యముఁడు శివుని కాలితన్నుచే చచ్చినపిమ్మట లోకము లెట్లుండెను నాకు తెలియ జెప్పుము.

వసిష్ఠునిమాటలు.—అట్లు యముఁడు చంపబడఁగా లోకమునందు త్రెలిడుటకైన సందులేకుండ ప్రజలు నిండుకొనిరి. అప్పుడు భూమి ఆప్రజలబరువును వహింపలేక బాధపడుచుండెను. అంతట బ్రహ్మ మొదలగు దేవతలు శివునిప్రార్థించి ఆయన యనుగ్రహమువలన మరల యముని బ్రదికించిరి.

శివునిమాటలు.—అప్పుడు శివుఁడు యమునిచూచి ఓయియముఁడా! ఇదిమొదలుకొని నాభక్తులను క్రూరపు చూపునఁ జూడవలదు. వారిని నావంటివారనియెంచి దయతోడి చూపుతో నన్ను పూజించినట్లు పూజింపుము. అని యిట్లు శివుఁడు ఆజ్ఞాపింపగా ఆతని ఆజ్ఞను శిరసావహించి సెలవుపుచ్చుకొని తనలోకమునకు మరలిపోయి యముఁడు మునుపటివలెనే ధర్మముతప్పక పాపులగు జనులను శిక్షించుచుండెను.

దిలీపునిమాటలు.—ఇక్ష్వాకువంశస్థులకెల్లను గురువైన ఓవసిష్ఠమహామునీ! మహాత్ముఁడవైన నీకు మ్రొక్కెదను. మాఘస్నానము చేయుటయందు ఆసక్తిగల పుణ్యాత్ములకు ముఖ్యములైన తీర్థములమహిమను సెలవిమ్ము.

వసిష్ఠునిమాటలు.—ఓమహారాజా! ఉత్తమమైన యేతీర్థవైభవమును వినుటచేత జంతువులు పాపసమూహమనెడి కవచమువలననుండి విడువబడునో ఆతీర్థవైభవమును

క్వాపిబహిర్జలే, తత్సర్వమృషయః ప్రాహుః గంగాజలసమంనృప. తథాపి వక్ష్యేముఖ్యాని మాఘస్నానవిశేషతః, నదీతో నదతశ్చైవ క్షేత్రత స్తీర్థత స్తథా. ప్రథమంతీర్థరాజస్తు ప్రయాగాఖ్యంతుతేనృప, పాపౌఘ నాశకృద్దేవయక్షకిన్నరసేవితః. వేదశాస్త్రపురాణాని వేదాంతో మునిభిస్సహ, నిర్ణయంతే శౌనకాద్యై ర్యత్రసత్త్రాణితేనిరే. రాజర్షేస్తు నిమే ర్యత్ర శంబభూవాత్మదర్శనాత్, నృపతే నైమిశారణ్యం వసన్మానవమోక్షదమ్. తత్రస్నాత్వా యథాశక్తి గత్వాముచ్యేతబంధనాత్, శమంత పంచకం యత్ర దేవప్రీతికరం సదా. భీష్మద్రోణముఖా యత్ర భారతాః కురవో యుధి, కాలేన నిధనం గత్వా యుధ్వా కైవల్యమాప్నుయుః. ప్రవిశ్య తత్కురుక్షేత్రం త్వంకురుక్షేత్ర మాత్మనః, సార్థకోటిత్రయం యత్ర తీర్థానాంవాయురబ్రవీత్. దివిభువ్యంతరిక్షేచ తానిసంతీహాభూ

---

చెప్పెదను వినుము. మాఘమాసము రాగానే ఊరిబయట ఎక్కడనైననుసరే స్నానము చేయుటకు జలమంతయు గంగానదియందలి జలముతో సమానమగునని ఋషులు చెప్పుచున్నారు. అయినను మాఘస్నానము చేయుటకు ముఖ్యములైన కొన్నితీర్థములను చెప్పెదను. ఈభూమియందు తూర్పుసముద్రమునందు చేరునట్టి నదులలోను పడమటి సముద్రమునందు చేరునట్టినదులలోను పుణ్యక్షేత్రములలోను పుణ్యతీర్థములలోను మొదట ఎన్నదగినదియు శ్రేష్ఠమైనతీర్థమును ప్రయాగయనునది. ఇదిగాక పాపసమూహములను నాశముచేయునదియు దేవతలచేతను యక్షులచేతను కిన్నరులచేతను సేవింపబడునదియు ఏదో, ఎచ్చటమునులు శాస్త్రములు పురాణములు వేదాంతములును మునులతోఁగూడి ప్రసంగింతురో, ఎచ్చట శౌనకుడు మొదలగుఋషులు సత్త్రయాగములను చేసిరో ఏదిరాజర్షియైన నిమిచక్రవర్తికి తన్నుజూచుటచేత మేరలేని ఆనందమును కలుగజేసెనో అట్టి నైమిశారణ్యమనెడి పుణ్యక్షేత్రమునందుండి తనశక్తికొలదిని అచటితీర్థములలో స్నానముచేసిపోవునట్టిమనుష్యుడు సంసారబంధమువలననుండి విడువబడును. దేవతలకు ప్రీతినికలుగజేయునదియైన శమంతపంచకము అనుపుణ్యతీర్థముకలదు. అందుస్నానముచేసినమానవుడు పుణ్యాత్ముడగును. ఎచ్చట భీష్ముడు ద్రోణుడు మొదలుగాగల భరత వంశమువారి యోధులును కురువంశస్థులైన దుర్యోధనుడు మొదలగువారును యుద్ధము చేసి చచ్చి మోక్షమునుపొందిరో అట్టికురుక్షేత్రమునకుబోయి దానిని సొంతపునేలగా జేసికొనుము. పూర్వకాలమునందు వాయుదేవుడు ఎక్కడ మూడుకోట్ల ఏబదిలక్షలతీర్థములు గలవనిచెప్పెనో ఆభూలోకస్వర్గలోకములయందును అంతరిక్షమునందును గల

తలే, స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారమపావృతమ్. గంగాద్వారమితిఖ్యాతం పాపఘ్నంపృథివీతలే, నృప సంగమ్య తదిదం క్షేత్రే త్వం స్నానమాచర. పాపాన్ త్యక్త్వాఖిలాన్‌స్వర్గం గత్వా తత్ర సుఖీ భవ, అవంతికాపురీరమ్యా సర్వపాపప్రణాశనీ. తస్యాంమృతానాంమర్త్యానామచ్యుతత్వందదాశివః, తాంగత్వా మాసిమాఘేత్వం స్నాత్వాముక్తో భవేన్మలాత్. అయోధ్యా నామనగరీ సూర్యాన్వయవివర్ధినీ, మోక్షదాచసదాన్యాణాం స్నాత్యాణాంసరయూతథా. యత్రదాశరథీ రామో హరిర్భూత్వా హ్యమూన్జనాన్, ధర్మేణ పాలయన్సర్వాన్ లక్ష్మణాద్యనుజైస్సహ. స్థాపయన్ చతురోవర్ణాన్ స్వేస్వేవర్త్మని రాఘవః, ఏకాదశసహస్రాణాం వర్షాణాం పాలయన్ ప్రజాః. రాజవంశాంశ్చతగుణాన్ స్థాపయిత్వాదివంగతః, తీర్థపాషాణకాష్ఠేభ్యో ఋతేశుష్కేభ్య ఏవచ. అన్యాంత్సర్వాన్ జీవయుక్తాన్ సరయ్వాంత్యక్తవర్ష్మిణః, స్వర్గేలోకేస్థాప

తీర్థములన్నియుం ఈక్షేత్రమునందే కలవు. స్వర్గమును పొందుటకును బిడ్డలను గనుటకును మోక్షమును బొందుటకును మార్గమై పాపములను నశింపజేయునదియునైన గంగాద్వారము అనునది యీభూమండలమునందు గలదు. నీవు అచ్చటికిపోయి ఆక్షేత్రమునందు గంగలో స్నానముచేసి యెల్ల పాపములను తొలగించుకొని స్వర్గమునకుబోయి అచ్చట సుఖింపుము. అవంతియను రమ్యమైనపట్టణ మొకటికలదు. అది యెల్లపాపములను నశింపజేయునది. ఆపట్టణమునందు చచ్చినవారికి శివుడు మోక్షపదవి నిచ్చును. నీవాపుణ్యక్షేత్రమునకుపోయి మాఘమాసమునందు అక్కడి పుణ్యతీర్థములలో స్నానముచేసి పాపమును పోగొట్టుకొనుము. సూర్యవంశపురాజులను వృద్ధిపొందించునదియైన అయోధ్యయనుపట్టణము గలదు. అది తనయందు వాసముచేయువారికి మోక్షము నిచ్చునది. అట్లే దానివెంబడి ప్రవహించునట్టి సరయువు అనునదియు తనయందు స్నానము చేయువారికి మోక్షము నిచ్చునట్టిదై యున్నది. ఏపట్టణమునందు శ్రీవిష్ణుమూర్తి రాముడు అనుపేర దశరథునికి కొడుకైపుట్టి లక్ష్మణుడు మొదలగు తమ్ములతో ఎల్లజనులను ధర్మము తప్పక యేలుచు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాలుగు వర్ణములజనులను వారివారి ధర్మములయందు ప్రవర్తింపజేయుచు రాజవంశములను మునుపటికంటె నూరంతలు గుణము గలవానిగా చేసి నిలిపి పదునొకండువేలయేండ్లు ప్రభుత్వముచేసి కడపట యెండినమ్రాకులు రాళ్లు నీళ్లు మొదలగునవితప్ప తక్కినప్రాణులనెల్లను సరయూనదిలోముంచి స్వర్గమునుబొందించి పిమ్మట తాను తన ఉనికిపట్టయిన

యిత్వా స్వంధామ ప్రాప సోఽచ్యుతః. మాఘేసరయ్వాంయేస్నాంతి కుర్వంతి పితృతర్పణమ్, సహస్రవార్షికీం తృప్తిం ప్రయాంతి శ్రాద్ధకర్మతః. స్నాత్వాసరయ్వాం యేమాఘే అయోధ్యాయాం నృపోత్తమ, మాసోపవాసం కుర్వంతి తేషాం పుణ్యఫలంశృణు. భుక్త్వా సువిపులాన్ భోగాన్ భూమౌ దృష్ట్వా స్వసంతతిమ్, అంతేవిమానమారుహ్య మానవా స్స్వర్గమాప్నుయుః. అస్త్యన్యచ్చ మహత్పుణ్యం నామ్నా మధువనంనృప, మృతాయత్రనరాస్సర్వే ప్రాప్నుయు ర్విష్ణురూపతామ్. తదుత్తరే నదీపుణ్యా యమునా సూర్యసంభవా, కృష్ణాంగా నృప కృష్ణస్య సంతతామోదకారిణీ. తస్యాం స్వర్గసరిత్సఖ్యాం హంత్ర్యాం పాపాని సర్వశః, యేమాఘేస్నాంతికాళింద్యాం తే సర్వేహరిరూపిణః. ద్వారావతీ పురీరమ్యా ప్రఖ్యాతా భువనత్రయే, ద్వారాణి యస్యాశ్చత్వారి విద్యంతేద్వారకా స్మృతా. యస్యాంవసన్ సకృష్ణాఖ్యః పాండవా న్పరిపాలయన్, భువో భారం లఘుకుర్వన్ భారతాన్ కురువంశజాన్. కైవల్యమనయత్సర్వాన్ స్వయం చాగా త్పరంపదమ్, అస్యాం తీర్థేషు సం

---

వైకుంఠమునకు బోయెనో ఆయయోధ్యాపట్టణమునందు వాసము చేయువారెవరో ఆ సరయూనదిలో స్నానముచేసి పితృతర్పణాదులు చేయువారెవరో వారి పితృదేవతలు వేయిసంవత్సరముల శ్రాద్ధక్రియలవలన పొందునంతటి తృప్తిని పొందుదురు. ఓయి రాజశ్రేష్ఠా! అయోధ్యాపట్టణమునందు కాపురముండి సరయూనదిలో స్నానముచేయుచు మాసోపవాసము చేయునట్టివారిపుణ్యమును చెప్పెదను వినుము. అట్లు మాసోపవాసము చేయువారు ఈలోకమునందు మిక్కుటమైన భోగములననుభవించి సంతతిని పడసినవారై కడపట విమానమునెక్కి స్వర్గమునకు పోవుదురు. ఇదిగాక మిక్కిలి పుణ్యమైన మధువనము అనునది యొకటికలదు. ఆవనమునందు చనిపోయినవారు విష్ణుస్వరూపమును పొందుదురు. దానికి ఉత్తరపుతట్టు సూర్యునివలనపుట్టిన యమునానది నల్లనినీళ్లు గలిగి కృష్ణునకు సదా సంతోషముచేయుచు పరిశుద్ధమై యుండును. గంగతోకలసి యెల్లపాపములను నశింపజేయునట్టి ఆయమునానదియందు స్నానముచేయువారు అందరును తప్పక విష్ణుస్వరూపమును పొందుదురు. ఏపట్టణము నాలుగుదిక్కులను నాలుగువాకిళ్లు గలుగుటచేత ద్వారవతియని చెప్పబడెనో ఆపట్టణము మూడులోకములయందును ప్రసిద్ధి వహించినదై రమ్యమైయుండును. ఆపట్టణమునందు విష్ణుమూర్తి కృష్ణుడను పేరితో వాసముచేయుచు పాండవులను కాపాడును. భూభారము తొలగింపగోరి భారతయుద్ధమును కలుగజేసి భరతవంశస్థులైన కౌరవులతోడ లోకములోని దుష్టరాజులనెల్లను స్వర్గమును

ప్రాప్య స్నాత్వా త్వం మకరేగవౌ, దేవాన్ పితౄన్ ఋషీంశ్చైవ తర్పయిత్వాచ భక్తితః. దానాని దత్వా విప్రేభ్య శ్చిరంజీవస్వ సాన్వయః, మాయావతీ పురీ రాజన్ క్షేత్రే త్వమరసేవితే. మలప్రహారిణీ నామ్నా నదీ తస్యోత్తరేశుభా, ప్రహంతిచ మలంన్యాణాం స్నాత్యాణాం పాపకర్మణామ్. మలప్రహారిణీ నామ్నా తేన సా ప్రథితా భువి, స్నాత్వా మలప్రహారిణ్యామ్ దత్వాదానానిశక్తితః. ఉపోష్యరజనీ మేకాం పరేద్యుశ్శ్రాద్ధకర్మవిత్, తస్యాం పరివసేన్మాఘు మింద్రస్య సదనే వసేత్. సరస్వత్యాం నరఃస్నాత్వా సరస్వత్యా ప్రసాదతః, సుషుమ్నా బ్రహ్మరంధ్రేణ ప్రాప్నోతి పరమంపదమ్. గంగాసాగరసంగే యో మాఘే స్నాతినరోత్తమః, దత్వాతిలాన్ బ్రాహ్మణేభ్యో కృష్ణాం గాంచ సదక్షిణామ్. పితౄన్ శ్రాద్ధేన నిర్వర్త్య బ్రహ్మలోకేమహీయతే, శృణురాజన్ పురీరమ్యా కాంచీనామపురోత్తమా. యత్రాస్తే కమలాకాంతః కమలాస్యాబ్జషట్పదః, భువిసత్యవ్రతంనామ క్షేత్రంతత్ప్రథితంభువి. యత్కించి

---

పొందించి కడపట తానును పరమపదమును జేరెనో, అట్టి ద్వారకాపట్టణమునకుపోయి అచ్చటి పుణ్యతీర్థములతో మకరమాసమునందు స్నానముచేసి దేవఋషిపితృతర్పణములు చేసి బ్రాహ్మణులకు చేయదగిన దానములెల్లను చేసి నీవు నీ వంశస్థులతోడ చిరకాలము జీవింపుము. మరియు దేవతలచేత సేవింపబడునదియైన మాయావతి యను పట్టణమొకటి కలదు. ఆపుణ్యక్షేత్రమునకు ఉత్తరపుతట్టు మలప్రహారిణి అనబడు పుణ్యనదియొకటి యున్నది. తనయందు స్నానముచేసిన పాపులయొక్క పాపములను నశింపజేయునది యగుటచేత దానికా పేరుగలిగెను. ఆనదియందు స్నానముచేసి శక్తికొలదిని దానములు చేసి ఒకనాటిరాత్రి ఉపవాసముండి మరునాడు తీర్థశ్రాద్ధమును మాఘస్నానమును చేసినమనుష్యుడు స్వర్గలోకమును పొందును. మరియు సరస్వతీనదియందు స్నానము చేసినట్టయిన సరస్వతి యనుగ్రహముచేత సుషుమ్నయనునాడిగుండ బ్రహ్మరంధ్ర ద్వారమునవెడలి పరమపదమును పొందును. గంగా సాగర సంగమమునందు (గంగ సముద్రమునందు కలియుచోట) మాఘస్నానముచేసి బ్రాహ్మణులకు నువ్వులను నల్లగోవును దక్షిణతోగూడ దానముచేసి శ్రాద్ధమువలన పితృదేవతలను తృప్తిపొందించునట్టి మానవుడు బ్రహ్మలోకమునందు ఉండును. ఓ రాజా! వినుము. కాంచియను పేరుగల రమ్యమైన పట్టణ మొకటికలదు. ఆపట్టణమునందు శ్రీలక్ష్మీప్రియుండైన విష్ణుమూర్తివాసము చేయుచుండును. భూలోకమునందు సత్యవ్రతక్షేత్రమనగా ప్రసిద్ధినొందిన ఆ కాంచీ

త్కురుతేపుణ్యం కోటికోటిగుణంభవేత్. పుణ్యకోటిరితిఖ్యాతం తత్ప్రసిద్ధంనృపోత్తమ, యస్యదక్షిణదిగ్భాగే పుణ్యావేగవతీనదీ. బ్రహ్మాయజ్ఞవిఘాతార్థమతివేగంకరోతియా, తేనైవలోకేవిఖ్యాతానదీవేగవతీశుభా. సత్యవ్రతేమహాక్షేత్రే తీర్థానాంత్రిశతానిచ, షష్ట్యుత్తరాణి రాజేంద్ర తేషుమాఘేనరోత్తమ. స్నాత్వాదత్వా యథాశక్తి ముచ్యతే సర్వపాతకైః, త్ర్యంబకంతు తతఃక్షేత్రం త్రివిష్టపఫలప్రదమ్. గోదావరీపుణ్యతటేదక్షిణేగౌతమాస్పదమ్, యత్రశప్తఃపురావజ్రీ గౌతమేనస్మరాతురః. అహల్యా జారదోషేణ సహస్రభగలాంఛనః, అహల్యాపి శిలాభూతా యత్రశప్తానరోత్తమ. యత్ర శుక్రః పురా తప్త్వా యుగానామయుతం శుచిః, న్యగ్రోధస్కంధబద్ధాంఘ్రిర్లంబమానో హ్యధోముఖః. స్థూలాగ్నికణ ధూమాగ్రం పిబన్నుగ్రం తపోనిధిః, తోషయామాస గౌరీశముగ్రేణ తపసా మునిః. మృతసంజీవనీం విద్యాం శివానాప మహాత్మనః, తత్ర స్నాత్వా తు యోవిప్రః పితౄన్సంతర్ప్యవారిణా. జపేచ్చత్ర్యంబకంమంత్ర మపమృత్యుజయం పరమ్, శృణుతస్యాః ఫలంరాజన్ మంత్ర

---

పట్టణమునందు ఏమాత్రము పుణ్యముచేసినను అది కోటికోటియంతలు హెచ్చుగాపెరుగును. కనుకనే అచ్చటి విమానమును పుణ్యకోటి యనుపేరు గలిగియున్నది. దేనికి దక్షిణపుతట్టు పావనమైన వేగవతియనునది గలదో ఆసత్యవ్రతక్షేత్రమునందు పూర్వకాలమునందు బ్రహ్మచేయునట్టి యజ్ఞమునుచెరుచుటకై వేగముగా ప్రవహించినందున వేగవతి యనుపేరుపొందిన యానదియు అదిగాక మున్నూటఅరువదితీర్థములును గలవు. ఆపుణ్యతీర్థములయందు మాఘస్నానముచేసి తనశక్తికొలదిని దానమునుచేయువాడు పాపములవలన విడువబడినవాడై స్వర్గమును బొందును. త్ర్యంబకము అనుపుణ్యక్షేత్రము ఒకటి కలదు. అది మూడులోకములందును మోక్షమును కలిగించునది. మరియు గోదావరినదియొక్క దక్షిణపుగట్టునందు పావనమైన గౌతమాశ్రమముకలదు. అందుపూర్వకాలమునందు గౌతమమహాముని తనభార్యయగు అహల్యతోడ వాసముచేయుచుండి మన్మథావేశముచేత అహల్యను పొందిన దేవేంద్రుని దేహమంతయు యోనులుగాను అహల్యరాయిగాను శపించెను. ఆగౌతమాశ్రమమునందు శుక్రుడు ఒకమఱ్ఱికొమ్మకు కాళ్లుతగిలించుకొని తలక్రిందుగా వ్రేలుచు వేండ్రమును గొప్పగొప్ప నిప్పురవలుగలదియునైన పొగను ఆహారముగాజేసికొని యుగ్రమైన తపస్సుచేసి మెప్పించి మహాత్ముడైన శివుని వలన మృతసంజీవని యను విద్యనుపడసెను. ఆయాశ్రమమునందు బ్రాహ్మణుడగువాడు స్నానముచేసి పితృతర్పణములుచేసి అపమృత్యువును పోగొట్టునట్టిదైన త్ర్యంబక

స్యాస్య చయత్ఫలమ్. కాలాపమృత్యుం నిర్జిత్య చిరంజీవీ భవేన్నరః, సంప్రాప్తే మాఘమాసేతు స్నాత్వా గోదావరీజలే. సప్తజన్మార్జితైః పాపైర్విముక్తో ధర్మమాప్నుయాత్, గిరిః కాలాత్మకోనామ రాజన్ శృణు మహాద్భుతః. యత్రార్ణవసముద్భూతం కాలకూటంపురాంతకః, పీత్వాత జీర్ణయామాస దేవానాం హితకామ్యయా. గిరేరుత్తరత స్తస్య పంపానామనదీశుభా, పంపానామపురీతస్యా దక్షిణంకూలమాస్థితా. తస్యాంతుయో నరస్నాత్వా పంపాయాముదితేరవౌ, మాఘమాసే వసేత్పురాం తస్యాం తస్మిన్ గిరావపి. మాఘమాసమనుక్తోఽపి సదాచారరతస్సదా, అగ్నిపూజారతోనిత్యం నిత్యంచాతిథిపూజకః. సయాతి శివసాయుజ్యం యోగినా మతిదుర్లభమ్, తతఃపరం ప్రభాసంచ క్షేత్రం పరమ పావనమ్. యత్రలింగోద్భవశ్శంభు రభవల్లోకభూతయే, శృణు రాజన్ కథాం దివ్యాం బ్రహ్మహత్యాఘనాశనీమ్. పురైకదా శిరశ్ఛిత్వా బ్రహ్మణో మధ్యమం శివః, బ్రహ్మహత్యాపరాభూతః పాణిసంసక్తమస్తకః. బ్రహ్మహత్యావ్రతం చర్తుం విచచార మహీమిమామ్,

---

మంత్రమును జపింపవలసినది. అట్టిబ్రాహ్మణుడు మిక్కిలి మహిమగలవాడై ఆమంత్రఫలముచేతయమునిని కాలమృత్యువునుజయించి చిరజీవియగును. మాఘమాసమునందు గోదావరిజలమునందు స్నానముచేసి యేడుజన్మములయందు కలిగిన పాపములచేత విడువబడిన నరుడు పుణ్యాత్ముడగును. మిక్కిలి వింతయైన కాలాత్మకమను కొండగలదు. ఆకొండయందుండి మునుపు సముద్రమునందు బుట్టిన కాలకూటము అనువిషమును శివుడు మ్రింగి జీర్ణముచేసికొనెను. అట్టికొండకు ఉత్తరపుతట్టు పంపయనుపేరుగల మంచియేరుగలదు. దానిదక్షిణపుగట్టునందు ఆపేరుగలిగినపట్టణము గలదు. ఆపట్టణమునందుగాని కొండయందుగాని నిలిచి మాఘమాసమునందు సూర్యోదయకాలమున ఆయేటిలోస్నానముచేయుచు అచ్చట అగ్నిపూజయును అతిథిపూజయును చేయుచు ఎవ్వడు కాలముగడుపునో అట్టి పుణ్యాత్ముడు యోగులకుకూడ పొందరాని శివసాయుజ్యమును పొందును. ఆపంపానదికి అవతల ప్రభాసము అను పుణ్యక్షేత్రముకలదు. అచ్చట లోకులకు మేలుగోరి శివుడు లింగరూపమున ఆవిర్భవించెను. ఓ రాజా! ఈవిషయమునందు బ్రహ్మహత్యమొదలగు మహాపాతకములనెల్లను పోగొట్టెడికథ యొకటిగలదు చెప్పెదను వినుము. పూర్వకాలమందు ఒకానొకప్పుడు శివుడు బ్రహ్మయొక్క అయిదవతలను నరకి ఆబ్రహ్మహత్యవలన వెరచినవాడై నెత్తిని చేతులుపెట్టుకొని, ఈబ్రహ్మహత్య తొలగునట్టి వ్రతము ఏదియగునని భూమండలమంతయును తిరిగి విచారించుచుండెను.

దిలీపః.—కించిచ్ఛేద శిరశ్శంభుర్బ్రహ్మణో మధ్యమం రుషా, బ్రహ్మాచతుర్ముఖోలోకే వేదశాస్త్రేషుపఠ్యతే, మధ్యంశిరఃకథమభూద్బ్రహ్మణో వద తంమునే. వసిష్ఠః—అగ్రే నేదం జగత్కించిత్సర్వం స్థావరజంగమమ్, నదిశో నాంతరిక్షంచ నద్యశ్చ పృథివీచ న. సత్తామాత్రం భవేత్కించిత్సదసద్వ్యక్తివర్జితమ్, ఇచ్ఛాశక్తిరభూత్తస్మాద్దిశశ్శూన్యముదైక్షత. తదాజజ్ఞే అహంకారః సృష్ట్యాదేః కారణంపరమ్, తథావిష్ణౌ హరిహరావూచతుశ్చ పరస్పరమ్. పంచవక్త్రోహమేవైకః లోకే నాన్యత్ర విద్యతే, ఇత్యాగ్రహేణావష్టభ్య పరస్పరరుషైషిణౌ. తతః కోపసమావిష్టౌ బభూవతురమర్షిణౌ, యుయుధాతేవిధిహరౌ దివ్యంవర్షశతం నృప. కోపాకులోహరస్సోఽథ శిరశ్చిచ్ఛేద వేధసః, కనిష్ఠికరజాగ్రేణ వామహస్తస్య మధ్యమమ్. హరాహతశిరాః పశ్చాచ్చతుర్వక్త్రో భవేద్విధిః, ప్రకృతం శృణురాజేంద్ర కపాలంపాణినాదధత్. లోకేకపాలభిక్షేతి భిక్షామటతి

---

దిలీపునిమాటలు.—ఓయి మునీశ్వరుడా! శివుడు బ్రహ్మతలను కోపముతో నరుకుటకు కారణమేమి? లోకమునందలి వేదశాస్త్రములయందు బ్రహ్మ నాలుగుమొగములు గలవాడని చెప్పబడుచున్నది. బ్రహ్మయొక్క నడిమితల నరకబడి యేమాయెను.

వసిష్ఠునిమాటలు.—పూర్వకాలమునందు స్థావరములును జంగమములునైన ప్రాణులుగల యీలోకము దిక్కులు ఆకాశము నదులు భూమి ఇవియన్నియు నామరూపములులేక పోయినవయ్యెను ఇదిసత్తు ఇది అసత్తు అనునది తెలియక సత్తమాత్రమునిలిచియుండెను. అట్టియెడ ఇచ్ఛాశక్తి పుట్టెను. అంతట దిక్కులెల్లను ఏమియులేనివై కనబడెను. పిమ్మట సృష్టికి మూలకారణమైన అహంకారము పుట్టెను. ఆలాగుననే విష్ణునియందు బ్రహ్మరుద్రులు ఇద్దరును అయిదు తలలుగలవారై పుట్టి ఒకరినొకరు చూచుకొని లోకమునందు అయిదుమొగములుగలవాడను నేను ఒకడనే ఇతరుడొకడు కలడా అని యిట్లు పరస్పరము కోపముచేత వాదాడివాదాడి పిమ్మట యుద్ధముచేయ నారంభించిరి. అట్లు దేవమానముచేత నూరుసంవత్సరములు శివబ్రహ్మలు యిద్దరును యుద్ధముచేసి కడపట శివుడు మిక్కిలి కోపించినవాడై బ్రహ్మయొక్కనడిమితలను తన ఎడమచేతి చిటికెనవ్రేలిగోటిచేత నరికెను. ఇట్లు శివునిచేత తెగగొట్టబడిన తలగల వాడైనందున అదిమొదలు బ్రహ్మ నాలుగుముఖములు గలవాడాయెను. ఇక ఇప్పటికథ యేమియనగా, అటుపిమ్మట శివుడు బ్రహ్మయొక్కతలపుఱ్ఱెను చేతబట్టుకొని ఆ బ్రహ్మహత్యాదోషముచేత లోకమునందు కపాలభిక్ష చేసికొనుచు మెలగుచుండి ఒకానొకప్పుడు దారువను గొప్ప

శంకరః. అటకాభిక్షాంకదాచిత్సః ప్రాప దారువనంమహత్, సర్వలోకమనోహారీ రూపలావణ్యశేవధిః. రూపేణమోహయామాస ఋషిపత్నీస్సహస్రశః, ఋషీణాం పత్న్యో దృష్ట్వా కామమోహభ్రమం యయుః. గృహకృత్యానిసంత్యజ్య మదనాతురతాడితాః, సర్వాఃపరవశాభూత్వా తమేవానుయయుస్త్రియః. విస్రంసత్కేశవసనా విస్రస్తాభరణస్రజః, తాదృష్ట్వా మునయస్సర్వే క్రోధావేశవశానుగాః. శేపుస్తే పరమేశానం సమేత్య యుగపన్నృప, ఛిత్త్వాలింగంపతత్వస్య భూమౌ సవృషణంహఠాత్. శప్తస్యైవం పశుపతేః బ్రాహ్మణైరపతత్తథా, శేఫస్సవృషణో భూమ్యాం పాతాళతలమూలవాన్. లీలాసృష్టజగత్కోటిః కోపదగ్ధపురత్రయః, అనుమేనే బ్రహ్మశాపం విప్రాణాం హితకామ్యయా. తస్మిన్నేవావిశచ్ఛంభుర్లింగే సర్వాత్మనా నృప, శివానువిష్టతల్లింగ మాపాతాళతలావధి. దిశశ్చ విదిశోవ్యాప్య భువనానిచతుర్దశ, రోదసీ తేజసా పూర్య అత్యతిష్ఠద్దశాంగులమ్. తేజసా తస్యలింగస్య జగత్స్థావరజంగ

---

యడవికి పోయెను. అప్పుడు ఎల్లలోకులకును మోహమును బుట్టించెడి చక్కదనము గలిగినదియుం మంచిఆకృతికలిగినదియుం లావణ్యమునకునిధియుం నైన ఒకఋషిభార్య యాశివునిజూచి మోహించెను. పిమ్మట అచ్చటిఋషులభార్యలనేకులు శివునిజూచి మోహమునొందినవారై తమతమ గృహకృత్యములుకూడ మానుకొని మన్మథవేదనచేత పీడింపబడినవారు గనుక పరవశలై శివునివెంబడించి పోసాగిరి. ఇట్లు శివుని వెంబడించి జారినకొప్పులతోను వీడినచీరలతోను రాలిన సొమ్ములతోను పువ్వుదండలతోను పోవుచుండెడితమయిల్లాండ్రనుజూచి అచ్చటిమునులందరును మిక్కిలి కోపావేశమును పొందినవారై ఈశివునియొక్క పురుషచిహ్నము వృషణములతోడ తెగి నేలబడునుగాకయని శపించిరి. ఈవిధముగా మునులు శపింపగానే శివునిలింగము వృషణములతోడతెగి నేలబడి పాతాళమునందు పాదుకొనెను. వేడుకవలె అనేకకోట్ల లోకములను సృజించినవాడును కోపాగ్నిచేత కాల్పబడిన త్రిపురములుగలవాడును నైన శివుడు బ్రాహ్మణులు తన్ను శపించినను వారికి మేలు చేయగోరినవాడై వారిచ్చిన శాపమును అంగీకరించి తానును ఆలింగమునందే ఐక్యమై పోయెను. అట్లు శివుడు ఆవేశించిన యాలింగము పాతాళమునందు నాటుకొన్నదియుం ఎల్లదిక్కులునుండి పదునాలుగు లోకములయందును వ్యాపించిన తేజస్సుగలదియుంనై భూమిమట్టమునకు మీద పదిఅంగుళముల పొడుగుగలదై యుండెను. ఓరాజా! ఆలింగముయొక్క తేజస్సుచేత స్థావరములును జంగమములు నైన సమస్త

మమ్, సంక్షోభ మగమత్సర్వ మత్యసహ్యానభూమిప. మునయోరో మశాద్యాశ్చ బ్రహ్మవిష్ణ్వాదయస్సురాః, భూరాది సర్వలోకస్థా యోగి నో మునయ స్తథా. బ్రహ్మాణం తే పురస్కృత్య తల్లింగ ముపగమ్యచ, తపసా పూజయా భక్త్యా స్తుత్యా శ్రుత్యర్థసారయా. తోషయామాసు రత్యుగ్ర ముగ్రముగ్ర గణేశ్వరమ్, శంభో శివేశ దేవేశ నమస్తే ప్రణతార్తిహాః. ఉపసంహార తే తేజో జగత్సర్వం వినశ్యతి, ఇతిస్తుతో జగత్కర్తా విష్ణునా చ సురేశ్వరః. అబ్రవీ త్సకలాన్ దేవాన్ బ్రహ్మ విష్ణుపురోగమాన్, అద్యప్రభృతి హే దేవా స్సాన్నిధ్యం మమ సర్వదా. లింగే భవతు మర్త్యానాం పురుషార్థప్రదాయకమ్, శ్రుతి స్మృత్యాదిత్తైర్మార్గై ర్బాహ్మణానాం సమృద్ధయే. పూజయస్వ విధేమ్మాం త్వం యజ్ఞదానతపోవ్రతైః, శ్రుతిస్మృతిప్రణీతేన మార్గేణ గరుడ ధ్వజ. పూజయస్వ క్షత్రియాణా మృద్ధయే త్వం స్వసిద్ధయే, వసిష్ఠం వామదేవం చ మార్కండేయం భృగుం శుకమ్. క్షాత్రాణా మృద్ధయే

---

ప్రాణులకు ఉనికిపట్టయిన లోకమంతయు కలతనొందెను. మరియు రోమశుడు మొదలుగాగల మహామునులను బ్రహ్మ విష్ణువు మొదలుగాగల దేవతలును భూలోకము మొదలగు పదునాలుగులోకములందు నుండెడి యోగీశ్వరులు మనీశ్వరులు మొదలగు వారును బ్రహ్మదేవుని ముందు పెట్టుకొని ఆశివలింగమునొద్దకువచ్చి తపస్సుచేతను పూజల చేతను సేవచేతను వేదాంతార్థసారమైన స్తోత్రముచేతను మిక్కిలి భయంకరుడును గణేశుని ముందుంచుకొన్నవాడు నైన శివుని సంతోషింపజేసిరి. అప్పుడు దేవతలకు ప్రభువైన విష్ణుదేవుడు లోకములకు సుఖమును గలుగజేయువాడవును మహైశ్వర్యము గలవాడవును దేవతలకు ప్రభువైనవాడవు నైన ఓశివా! నీకు మ్రొక్కెదము. నీ తేజస్సు చేత లోకమంతయు నశించుచున్నది గనుక ఆ తేజస్సును నీలోనణచుకొనుము. అని వేడు కొనగా, బ్రహ్మ విష్ణువు మొదలుగాగల దేవతలనందరను జూచి, శివుడు, ఓ దేవత లారా! నేడుమొదలుకొని మానవులకు సకలపురుషార్థములను ఇచ్చునట్టిదైన నాసన్ని ధానము లింగమైయుండును. ఓబ్రహ్మదేవుడా! వేదశాస్త్రములందు చెప్పబడిన యజ్ఞ ములచేతను దానములచేతను తపస్సులచేతను వ్రతములచేతను బ్రాహ్మణుల మేలుకొరకు నీవు నన్ను పూజింపవలసినది. ఓవిష్ణూ! రాజులయభివృద్ధికొరకు నీ కార్యములు నెరవేరుట కొరకును నీవు నన్ను పూజింపుము. ఓవిష్ణూ! నీవు క్షత్రియులవృద్ధికై వసిష్ఠుడు వామ దేవుడు మార్కండేయుడు భృగువు శుకుడు అనువారిని శిష్యులనుగా జేసికొనుము.

శిష్యాన్ గృహాణత్వం జనార్దన. అగస్త్యం గౌతమంచైవ దధీచిం భృగుమేవచ, అఘోరం వామదేవంచ దక్షమత్రించకశ్యపమ్, శిష్యానేతాన్ గృహాణ త్వం బ్రహ్మన్ బ్రాహ్మణవృద్ధయే, ఇతి దత్వా వరా న్శంభు ర్బ్రహ్మావిష్ణో ర్నృపోత్తమ. తస్మిన్ లింగే స్వయం రుద్రః ప్రవిశ్యాత్మనిసందధే, వ్రతదానతపోయజ్ఞై రిష్ట్వా బ్రహ్మా తతః పరమ్. శిష్యాంశ్చ ప్రతిజగ్రాహ అగస్త్యాదిఋషీన్నృప, పూజయిత్వా తతో విష్ణు ర్యజ్ఞదానతపోవ్రతైః. లింగేశివంరతశ్శిష్యాన్ తథాజగ్రాహవిశ్రుతాన్, శిష్యద్వారా బ్రహ్మవిష్ణూ యాజయాంచక్రతుః క్షితౌ. బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ లింగేరుద్రం సనాతనమ్, ప్రకృతం శృణు రాజేంద్రతీర్థానాం వైభవం మహత్. నరనారాయణక్షేత్రం నదీమోఘవతీమను, ఓంకారరూపోభగవా న్యత్ర సాక్షాత్స్వయం హరిః. బ్రహ్మణే కథయత్పూర్వం సృష్ట్యర్థం భ్రాంతచేతసే, ఓంకార మమృతం బ్రహ్మ జగత్సృష్ట్యేకకారణమ్. ఓఘవత్యాం నరస్స్నాత్వా చోంకారమభిపూజ్యచ, తర్పయిత్వా పితౄన్ శ్రాద్ధైర్విష్ణులోకే మహీయతే. గోకర్ణంచ మహాక్షేత్రం

---

ఓబ్రహ్మా! నీవు బ్రాహ్మణులవృద్ధికై అగస్త్యుడు గౌతముడు దధీచి భృగువు అఘోరుడు వామదేవుడు దక్షుడు అత్రి కశ్యపుడు అనువారిని శిష్యులనుగా గ్రహింపుము. అని యిట్లు చెప్పి శివుడు బ్రహ్మవిష్ణువులకు కోరిన వరములనిచ్చి తాను ఆలింగమునందు ఐక్యమైపోయెను. ఓదిలీపమహారాజా! అంతట బ్రహ్మ వ్రతములచేతను దానములచేతను యజ్ఞములచేతను లింగమును పూజించి అగస్త్యుడు మొదలగుఋషులను శిష్యులనుగా జేసికొనెను. అట్లే విష్ణువును యజ్ఞదానతపోవ్రతములచేత లింగమైన శివుని పూజించి ప్రసిద్ధులైన శిష్యులను పరిగ్రహించెను. ఇట్లు బ్రహ్మవిష్ణువులు శిష్యులను కలుగజేసికొని వారిగుండ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను లింగమునందున్న శివుని ఆరాధించునట్లు కావించిరి. ఓదిలీపుడా! ఇది లింగావతారకథ. ఇక యిప్పటితీర్థములమహిమను చెప్పెదను వినుము. ఓఘవతియను ఏటిగట్టున నరనారాయణక్షేత్రము అనునదియొకటికలదు. అచ్చట ప్రణవస్వరూపుడును షడ్గుణైశ్వర్య సంపన్నుడునునైన శ్రీవిష్ణుదేవుడు పూర్వము సృష్టిచేయుటకై భ్రమనొందిన మనసుతోనున్న బ్రహ్మకు అమృత స్వరూపమును పరబ్రహ్మస్వరూపమైనదియు లోకసృష్టికి కారణమైనదియు నైన ఓంకారమును ఉపదేశించెను. ఎవడు ఆయోఘవతీనదియందు స్నానముచేసి దానిగట్టున ఆవిర్భవించి

మోక్షదం మోక్షకాంక్షిణామ్. అర్థదంచార్థకామానామత్రసర్వప్రదే శుభే, స్నాతిగోకర్ణకే మాఘే గోకర్ణేశం సమర్చయేత్. యో నరస్సలభే ల్లోకాన్ పుణ్యాన్ కామధుగక్షయాన్, గోకర్ణంగోకర్ణమితి స్నానకాలే జపేన్నరః. గోకర్ణస్నానజం పుణ్యం సంప్రాప్నోతినసంశయః, పురుషోత్తమ మనుప్రాప్య గోదావర్యామినోదయే. స్నాత్వాదత్వా యథాశక్తి విష్ణు లోకే మహీయతే, భృగుకచ్ఛం మహాక్షేత్రం సర్వపాపప్రణాశనమ్. స్నాత్వాదత్వాయథాశక్తి విష్ణులోకేమహీయతే, భృగుతుండంపుష్క రంచ భువ్యస్తిక్షేత్ర ముత్తమమ్. మాఘమాసే నరోయాతి స్నానేనాత్ర త్రివిష్టపమ్, శృణు రాజన్విరూపాక్షం తుంగభద్రానదీతటే. యత్ర సాక్షా ద్విరూపాక్షో వసత్యంబికయా సహ, వాలినేంద్రసుతేనాపి సుగ్రీవేణేన సూనునా. అంజనాసూనునా దేవః పూజితో మునిభిస్సహ, దేవానా మసు

---

యుండెడి ఓంకారమును పూజించి తీర్థశ్రాద్ధములచేత పితృదేవతలను తృప్తిపొందించునో వాడు విష్ణులోకమునందు చేరి సుఖపడును. గోకర్ణము అను గొప్పపుణ్యక్షేత్రముకలదు. అది మోక్షముకోరువారికి మోక్షమును ధనమునుకోరువారికి ధనమును ఇచ్చునది. ఇట్లు కోరినఫలములనెల్లనుఇచ్చునట్టిదైన ఆగోకర్ణక్షేత్రమునందు మాఘమాసమున స్నానముచేసి అచ్చట నెలకొనియుండెడు గోకర్ణేశుని అర్చించినమనుష్యుడు కామధేనువువంటిదైన ఆక్షేత్రమహిమవలన నశింపని పుణ్యలోకములను పొందును. ప్రతిదినము స్నానకాలమునందు గోకర్ణము గోకర్ణము అని జపించునట్టిపురుషుడు గోకర్ణమునందు స్నానముచేసినఫలమును పొందును. అందులకు సందేహములేదు. పురుషోత్తమము అను పుణ్యక్షేత్రమునకుబోయి ప్రొద్దునలేచి గోదావరీనదియందు స్నానముచేసి తనశక్తికొలదిని దానముచేయువాడు విష్ణులోకమును పొందును. ఎల్లపాపములు నశింపజేయునదియగు భృగుకచ్ఛమను గొప్పపుణ్యక్షేత్రము ఒకటికలదు. ఆభృగుకచ్ఛమునందు స్నానదానములను శక్తికొలదిని చేయునట్టివాడు విష్ణులోకమును పొందును. ఈభూలోకమునందు భృగుతుండము అనుసరస్సును పుష్కరము అను పుణ్యక్షేత్రమును కలవు. అచ్చటికి పోయి ఆసరస్సునందు స్నానముచేసినవాడు స్వర్గమును పొందును. ఓదిలీపమహారాజా! వినుము. తుంగభద్రయను ఏటిగట్టున విరూపాక్షము అను పుణ్యక్షేత్రముగలదు. అచ్చట పార్వతీసమేతుడై విరూపాక్షుడు అనబడు శివమూర్తి ప్రత్యక్షముగా నెలకొనియుండును. ఆదేవుడు ఇంద్రునికొడుకైన వాలిచేతను సూర్యునికొడుకైన సుగ్రీవునిచేతను అంజనాదేవి కొడుకైన హనుమంతునిచేతను మునులతోడ పూజింపబడెను.

రాణాంచ పురాసురమూర్ధని. అసురైర్నిర్జితాదేవాశ్శివంశరణమాయ యుః, సురార్థమసురాన్ హత్వా దత్వాపీయూషముత్తమమ్. సంస్థాప్య చ సురాన్సర్వా నుమయాసహ శూలధృత్, రిరంసురవనీమేత్య తుంగ భద్రానదీతటే. రమయామాసశైలేస్మిన్ ఋశ్యమూకే మహీధరే, తుంగ భద్రాపయస్స్నానం పానం హరిహరార్చనమ్. దానంతపోజపోహోమో నాల్పస్య తపసః ఫలమ్, యస్స్నాతి తుంగభద్రాయాం మాఘమాస్య రుణోదయే. త్రిస్సప్తకుల ముద్ధృత్య సూర్యలోకే మహీయతే, సహ్యా ద్రిజా తతఃపుణ్యా కావేరీ విశ్రుతాభువి. శ్రీరంగంచ మహద్ధామ విష్ణో రాయతనం మహత్, విభీషణహితార్థాయ వైకుంఠాత్పుష్కరేక్షణః. శ్రీరంగేశమహద్ధామ్ని నిత్యంవాసమరోచతాత్, అస్మిన్నర్థే పురావృత్త మాఖ్యాతం కథయామితే. రామోదాశరథీరాజన్ లంకాయాం రాక్ష సేశ్వరమ్, విభీషణం స్థాపయిత్వా స్వంధామప్రాపమాధవః విష్ణుపూజా

పూర్వకాలమునందు దేవతలకును రాక్షసులకును యుద్ధము కలిగినప్పుడు ఆయుద్ధము నందు దేవతలు రాక్షసులకు ఓడిపోయి శివుని శరణుచొచ్చిరి అప్పుడు శివుడు దేవతలకై రాక్షసులనుజంపి వారు అపహరించుకొన్న అమృతమును దేవతలకిచ్చి వారిని స్వస్థముగా నుండుడని చెప్పిపంపి తాను పార్వతితోడ భూమియందు తుంగభద్రానదిగట్టున ఋష్య మూకపర్వతమునందు క్రీడింప నిచ్ఛగలవాడై నిలిచెను. కనుక తుంగభద్రలోని నీళ్లతో స్నానముచేసి ఆనీళ్లనుత్రాగి దానిగట్టుననుండెడి హరిహరులను అర్చించి దానములను జపములను హోమములను చేయువారికి అధికతపస్సులు చేసినఫలము లభించును ఎవడు మాఘమాసమునందు ప్రొద్దునలేచి తుంగభద్రానదిలో స్నానముచేయునో వాడు తన వారిని ఇరువదియొక వంశములవారిని పరిశుద్ధులనుగాజేసి ఉద్ధరించి తాను సూర్యలోక మును పొందును. సహ్యపర్వతమునందు బుట్టినదియు ఆతుంగభద్రకంటె పుణ్యమైనది యునైనకావేరి అనునది భూమియందు ప్రసిద్ధిజెందినదై యున్నది. ఆకావేరినదుమ శ్రీ రంగము అనుపేరుగలిగి మిక్కిలి ప్రకాశించునట్టి గొప్పవిష్ణుస్థానము ఒకటికలదు. కమల ములవంటి కన్నులుగలవాడు అనబడువిష్ణుదేవుడు విభీషణునికి క్షేమము గలుగజేయుట కొరకు వైకుంఠమునందుండి శ్రీరంగనాథుడు అనుపేరుతో ఆదివ్యస్థలమునందు నిత్య నివాసము చేసెను. ఈవిషయమునందు పురాతనకథయొకటికలదు. ఆకథను చెప్పెదను వినుము. ఓదిలీపమహారాజా! దశరథునికొడుకైన శ్రీరాముడు భూమియందు అవతరించి లంకాపట్టణమందున్న రాక్షసరాజైన రావణుని చంపి విభీషణుని ఆలంకారాజ్యమునందు

వ్రతపరో విష్ణుపూజార్థమాదరాత్, విష్ణోస్సమీపమగమ ద్వైకుంఠే సవి
భీషణః. శ్రీభగవాన్.- లంకాదత్తామయాతుభ్యం త్వంకిమర్థ మిహాగతః,
ఇత్యుక్తో వాసుదేవేన విభీషణఉవాచహ. త్వామనారాధ్య దేవేశ నాహం
భోక్ష్యామి మే వ్రతమ్, భవదభ్యర్చనం దేహి భగవన్భవనాశనమ్. విభీ
షణేనైవముక్తో భగవాన్ కమలేక్షణః, ప్రాతరాగత్యనియతం గత్వాఖే
చర యాన్వహమ్. అర్చయిత్వాచ మాం భక్త్యా గచ్ఛ రాజ్యంచపాలయ,
విష్ణునైవంచాభిహితో విభీషణఉవాచహ. ప్రజాః పాలయతాం రాజ్ఞా
మవకాశో న విద్యతే, క్షణమాత్రోపి దేవేశ నాగతిస్తేవద ప్రభో. యోరా
జాసుప్రమాదేన ప్రజానాంచ హితాహితమ్, ఆసనస్థస్సదా సద్భిర్నా
లోకయతిమూఢధీః. సయాతినరకాన్ ఘోరాన్ రౌరవాదీన్నసంశయః,
భగవంస్త్వం మయాసార్ధ మాగచ్ఛారాధ్యతాయుతమ్. అవశ్యం యది
కర్తవ్యం ప్రజానాం పరిపాలనమ్, రాజ్యమేవ పరిత్యజ్య నోచేత్త్వామర్చ
యామ్యహమ్. విభీషణేనైవముక్తో భగవానాహతంపునః, ఆగచ్ఛామి త్వ

---

నిలిపి తనకు స్వస్థానమైన వైకుంఠమునకుపోయెను. విష్ణుపూజ చేయుటయందు నియమము గలవాడైన ఆవిభీషణుడు విష్ణువునుపూజించుటకై వైకుంఠమునందుండెడి విష్ణుని సన్నిధానమునకు మిక్కిలి యక్కరతో పోయెను. అప్పుడు విష్ణువు ఆతనినిజూచి చెప్పుచున్నాడు. ఓవిభీషణా! నేను నీకు లంకాపట్టణమును ఇచ్చి ఏలుకొమ్మనిచెప్పితినే అది మాని యిప్పుడు ఇక్కడికి ఏల వచ్చినావు. అని విష్ణుదేవుడు అడుగగా విభీషణుడు చెప్పుచున్నాడు. దేవతలకు దేవుడైన ఓస్వామీ! నిన్నుపూజింపక భోజనముచేయకూడదు అను వ్రతమును పూనియున్నాను. జన్మములను నశింపజేయునదియైన నీపూజ నాకు కలుగనిమ్ము. అని ప్రార్థింపగా, విష్ణుదేవుడు విభీషణునితో నీవు ప్రతిదినమును తెల్లవారి ఆకాశమార్గమున ఇక్కడికి వచ్చి నన్ను భక్తితో పూజించిపోయి నీరాజ్యమును పాలించుకొనుము అనెను. అందులకు విభీషణుడు ప్రజలను ఏలునట్టి రాజులకు కొంచెమైనను తీరిక యుండదు. ఇక నాగతియేమి సెలవిమ్ము. ఏరాజు సింహాసనమెక్కి ప్రజలమంచి సెబ్బరలనుగూర్చి యోగ్యులైన సభికులతో ఆలోచింపక రాజ్యముచేయునో అటువంటి బుద్ధిహీనుడు రౌరవము మొదలుగాగల ఘోరములైన నరకములను పొందును. అందుకు సందేహములేదు. కనుక ఓస్వామీ! నేను ప్రజలను పాలింపవలయుననుట ఆవశ్యకమైనయెడల నీవు నావెంటవచ్చి యారాధనతో కూడినవాడవు అగుము. అట్లు కాని పక్షమున నేను నారాజ్యమునే వదలుకొని నిన్ను అర్చించుచు నిచ్చట నుండెదను. అని యిట్లు విభీషణుడు చెప్పగా అతనితో శ్రీవిష్ణుదేవుడు అట్లయినపక్షమున నీవు ఎక్కడ

యాసార్థం యత్రత్వంనివసిష్యసి, ఏవముక్తే హరౌ రాజన్ పుణ్యశ్లోకో విభీషణః. సౌవర్ణపేటికాం కృత్వా స్వర్ణప్రాకారతోరణామ్, సర్వాలంకారశోభాఢ్యా మథోవాచ విభీషణః. అతిష్ఠేమంపేటికాగ్రం నయామిత్వామహంవిభో, విభీషణేనైవముక్తో భగవాన్ భక్తవత్సలః. పేటికాం ప్రణవాకారాం మధ్యవాస వృషాకపిః. విభీషణోమహాదేవం పేటికాసహితంహరిమ్. యయౌఖేచరమార్గేణ లంకామభిముఖీ క్షణాత్, అథ మధ్యంగతేపూష్ణి శ్రీరంగేస్థాప్య పేటికామ్, క్రియామశేషామకరోత్కావేర్యాం శుద్ధమానసః, ఉద్ధర్తుం పేటికాం భూయో నాశక్తస్స విభీషణః, తదారోదీత్సుదుఃఖార్తో రాజ్యవ్యాపారకాతరః, నమస్తే దేవదేవేశ శార్ఙ్గపాణే జనార్దన. ప్రసీద తవభక్తస్య లఘుర్భవ సురోత్తమ, ప్రార్థితో దుఃఖితేనైవం భగవాన్ పద్మలోచనః, మద్వచశ్శృణువక్ష్యామి మాచ శోకే మనః కృథాః, మనోహారమిదం క్షేత్రం వైకుంఠాన్మందిరాదపి. అతోహం నత్యజే క్షేత్రమిదం కైవల్యసాధనమ్, కవేరకన్యాగం

నుండగలవో అచ్చటికి నీవెంటనే నేను వచ్చెదను. అంతట పావనమైన కీర్తిగలవాడైన విభీషణుడు ఒక బంగారుపెట్టెనుచేసి దానికి సమస్తములైన అలంకారములతోడను బంగారుప్రాకారమును గోపురమును ఏర్పరచి, ఓయేలినవాడా! నీవు ఈ బంగారు ప్రాకారములోని పెట్టెలో వేంచేయుము. నేను దీనితోనే నిన్ను ఎత్తుకొని నా పట్టణమునకు పోయెదను. అనగా, ఆ శ్రీహరి భక్తులయందు వాత్సల్యముగలవాడు గనుక ఆతని మాటను త్రోయక ప్రణవాకారమైన ఆబంగారుపెట్టెయందు నివసించెను. వెంటనే విభీషణుడు పెట్టెతోగూడ శ్రీవిష్ణుదేవుని ఎత్తుకొని ఆకాశమార్గమున లంకాపట్టణమునుగూర్చి పోవుచు కావేరినదిని జూచి అప్పటికి మధ్యాహ్నకాలమైనందున ఆనది యందు స్నానముచేసి మాధ్యాహ్నిక క్రియలన్నియు నడపుకొనగలవాడై శ్రీరంగక్షేత్రమందున పెట్టెనుదించి తన అనుష్ఠానమును తీర్చుకొని మరల పెట్టెను ఎత్తుకొనుటకు శక్తుడు కాకపోయెను. అట్లు విభీషణుడు పెట్టెను ఎత్తనుశక్తిచాలనివాడై రాజ్యవ్యాపారములు చెడుననుభయము గలవాడై ప్రయాణమునకు భంగమువచ్చెనే యికనేమి చేయుదును అనియేడ్చుచు దేవతలకు దేవుడవును శార్ఙ్గము అనువిల్లు చేతియందు గలవాడవును దుష్టజనులను పీడించువాడవునునైన ఓయేలినవాడా! నీకు మ్రొక్కెదను నీసేవకుడనైన నాయందు దయచేసి తేలికైనవాడవగుము. అనియిట్లు దుఃఖించుచు వేడుకొనుచున్న విభీషణునియందు భగవంతుడైన విష్ణుదేవుడు అనుగ్రహముగలవాడై ఓయి విభీషణా! ఊరక మనసునొవ్వ దుఃఖింపక నామాటనువినుము. ఇది శ్రీవైకుంఠమునందలి నాయింటికంటె రమ్యమైన ప్రదేశముగా నున్నది. ముక్తిసాధనమైన యిట్టిపుణ్య

గాయా అధికా ప్రతిభాతిమే హితంవాపి ప్రవక్ష్యామి విభీషణశ్రుణుష్వ హా, యథైకాబ్దార్చనఫలం లప్స్యసే మమ రాక్షస. కృతత్రేతాద్వాప రేషు స్వరూపేణ కలౌయుగే, వైశాఖే వాయురూపేణ పూర్ణిమా మాసిసంగతా. విశాఖయా యదాసాస్యా ద్రాకా సోమగ్రహోపమా, తస్యామాగత్య విధివ దారాధయవిభీషణ. ఇత్యుక్తో వాసుదేవేన మహా త్మా స విభీషణః, సుప్రీత శ్చాగమల్లంకాం ররక్ష సకలాః ప్రజాః. తదా ప్రభృతి కావేరీ దక్షిణా స్వర్ధునీస్మృతా, శ్రీరంగ మవిముక్తంచ దాక్షిణం పరిచక్షతే. తస్మాత్త్వమపి రాజేంద్ర యత్రక్వాపి బహిర్జలే, కావేరీం మనసాస్మృత్వా మాఘస్నానం సమాచర. మాసే మృగార్కే కావేరీ కించి దభ్యదితే రవౌ, స్నానాయాగచ్ఛమే పాపం సర్వమాశు వినాశయ ఇమంమంత్రజపం స్నాయా ద్యత్ర కుత్ర బహిర్జలే. కావేరీ స్నానజం పుణ్యం సంప్రాప్నోతి న సంశయః.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, తీర్థమాహాత్మ్య కథనం నామ వింశోఽధ్యాయః.

---

క్షేత్రమును నేను విడువజాలను. అదిగాక ఈకావేరీనది గంగానదికంటె హెచ్చైనదని నాకుఁ దోచుచున్నది. కాబట్టి నీకు నేను హితముచెప్పెదను. నామాటవినుము. నీవు కృత త్రేతా ద్వాపర యుగములయందు ఈరూపముతోను కలియుగమునందు వాయు రూపముతోను ప్రతివైశాఖశుక్లపూర్ణిమయందును ఇచ్చటికి వచ్చి నన్ను ఆరాధించి పొమ్ము. ఆ ఒకనాటి యారాధనము నీకు సంవత్సరకాలము ఆరాధించినఫలము నిచ్చును. విశాఖనక్షత్రముతోఁగూడినదైన వైశాఖశుక్ల పూర్ణిమరాగా వచ్చి యథావిధిగా నన్ను ఆరాధింపుము. అని యిట్లు విష్ణుదేవుడు ఆనతియ్యగా మహాత్ముడైన విభీషణుడు చాల సంతోషించినవాడై లంకాపట్టణమునకు పోయిచేరి యెల్లప్రజలను పాలించెను. అదీ మొదలుకొని కావేరి లక్షిణగంగానదియనియు, శ్రీరంగము దక్షిణకాశియనియు చెప్పబడుచున్నవి. కాబట్టి ఓదిలీపమహారాజా! నీవు గ్రామమునకు వెలుపలనుండెడి ఏజలప్రదేశమునందైనను కావేరియనితలచి మాఘస్నానముచేయుము. ఎవడు మాఘ మాసమునందు సూర్యోదయమగుచుండగా కావేరినదిని తలచుకొని "స్నానాయాగచ్ఛ మే పాపం సర్వమాశు వినాశయ" ఓకావేరీ స్నానమునకై రమ్ము నా పాపమంతయు శీఘ్రముగా నశింపజేయుము. అను నీమంత్రమును చెప్పుచు ఊరికి వెలుపలనుండు చెరువుకొలను మొదలగు జలాశయములందు ఎచ్చటనైనను స్నానముచేయునో వాఁడు కావేరియందు స్నానమును చేసినఫలమునొందును. సందేహములేదు.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు తీర్థమాహా త్మ్యమును వివరించునదియైన యిరువదవ అధ్యాయకథ.

## ఏకవింశోఽధ్యాయః.

వసిష్ఠః.—మానసాన్యపితీర్థాని వక్ష్యామిశృణుపార్థివ, యేషుసమ్యజ్నరస్స్నాత్వా ప్రయాతిపరమాంగతిమ్. సత్యంతీర్థంక్షమాతీర్థంతీర్థమింద్రియనిగ్రహః, సర్వభూతదయాతీర్థం తీర్థమార్జవమేవచ. దానంతీర్థందమస్తీర్థం సంతోష స్తృప్తిరేవచ, బ్రహ్మచర్యం పరంతీర్థ మక్రోధ స్తీర్థముచ్యతే. మనశ్శుద్ధిః పరంతీర్థం తపస్తీర్థమనుత్తమమ్, ఆచార్యోపాసనం తీర్థం శౌచంతీర్థమనుత్తమమ్. వైరాగ్యం పరమం తీర్థ మసక్తం విషయేషుచ, సుతీర్థం సమచిత్తత్వం తీర్థమాత్మనిదర్శనమ్. సత్సంగతిఃపరంతీర్థం తీర్థానాముత్తమోత్తమమ్, సత్యాదీనాంచ తీర్థానాం లక్షణం శృణుపార్థివ. యస్యశ్రవణమాత్రేణ సర్వస్నానఫలం లభేత్, అనుద్వేగకరం హృద్యం సజ్జనానందకారణమ్. ఏవం లక్షణసంయుక్తం సత్యం ప్రాహుర్మనీషిణః, సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయా న్న బ్రూయాత్సత్యమప్రియమ్. ప్రియంచానృతమబ్రూయా దేషధర్మస్సనాతనః, తప్యం

---

## ఇరువదియొకటవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓదిలీపుఁడా! దేనియందు లెస్సగా స్నానముచేసినమనుష్యుఁడు ఉత్తమగతినిపొందునో ఆమానసములైన తీర్థములను చెప్పెదను వినుము. సత్యము, ఓర్పు, ఇంద్రియముల నిగ్రహించుట, ఎల్లప్రాణులయందును దయ, క్రమముతప్పకనడచుకొనుట, దానము, క్లేశము నోర్చునట్టి స్వభావము, సంతోషము, తృప్తి, బ్రహ్మచర్యము, కోపములేమి, ద్రోహచింతలేమి, మనస్సున కపటములేమి, తపస్సు, గురువును పూజించుట, శుచిత్వము, వైరాగ్యము, విషయాసక్తిలేమి, సమచిత్తత, సమస్తప్రాణులను తనవలెనే చూచుకొనుట, సత్పురుషులతోడి సహవాసము, అనునివియే ఉత్తమోత్తమములైన తీర్థములు. ఈసత్యము మొదలగు తీర్థములను సేవించుటయే పుణ్యతీర్థస్నానము చేయుట. ఈతీర్థములయొక్క లక్షణములను చెప్పెదనువినుము. దేనినివినినమాత్రముచేతనే సమస్తతీర్థములలోను స్నానముచేసినఫలము లభించునో మనసునకు కలవరము పుట్టింపనిదియును మనసునకు ఇంపైనదియును సత్పురుషులకు సంతోషము కలుగజేయునదియును యేదో అది సత్యముఅని పండితులుచెప్పుదురు. అట్టిసత్యమును విన్నమాత్రముచేతనే ఎల్లతీర్థములయందును స్నానముచేసినఫలము లభించును. కనుక సత్యము చెప్పవలయును అసత్యమును ప్రియముగా నుండవలయును. ప్రియముకాని సత్యమును చెప్పరాదు. ప్రియమైనదని అసత్యమును చెప్పకూడదు. ఈధర్మము అనాదియైనదని తెలి

తమేకతో బాహుం చందనేన సముక్షితమ్. ఉభయం తత్సమం పశ్యేత్క్షమేయం పరికీర్తితా, సత్యవాన్బలవానాఢ్యో మాన్యో లోకగురుర్మహాన్. ప్రతివక్తుం ప్రహర్తుం చ శిక్షితుం సాధితుం చ యః, నిందితస్తాడితో వాపి దుర్బలేన కృశేన చ. న గృహ్ణాతి రుషోద్వేగం సా క్షమా పరికీర్తితా, ఇంద్రియాణాం ప్రవృత్తిర్హి విషయేషు స్వభావజా. నానుయాతి మనస్తాని నిగ్రహస్తూచ్యతే బుధైః, ధ్యానసంస్థాను సమాబద్ధం బుద్ధ్యాకాశం మనోహృది. తిష్ఠత్యచలతాం యావత్తావత్స్వస్థో భవేన్నరః, మన ఏవం నిగృహ్ణీయాదింద్రియానుగతం చలమ్ విషయేభ్యస్సమాహృత్య సతీర్థఫలమశ్నుతే, సర్వభూతేషు యో భూమౌ స్థావరేషు చరేషు చ. దుఃఖిస్స్యాద్దుఃఖితం దృష్ట్వా సుఖిస్స్యాత్సుఖితం నరమ్, క్షుధితః క్షుధితం వాపి పూర్ణం పూర్ణమనా భవేత్. తాడితస్తాడితం దృష్ట్వా ఋషీభూతమృషిర్భవేత్, సర్వభూతేషు చైవం తు దయా వద్భిః ప్రకీర్తితమ్. ఏవం దయావాన్పురుషో విశే

---

సికోవలెను. ఒకచేయినిప్పునందును ఒకచేయి మంచిగంధమునందును ఉంచి వానివలని వేడిమిని చల్లదనమును సమముగా నెంచుట ఏదికలదో అది క్షమ అనబడును. ఎవడు తనకంటెతక్కువైనవానిచేత నిందింపబడియు బలములేక చిక్కినవానిచేత కొట్టబడియు బదులు నిందించుటకును కొట్టుటకును (లేక) తగినదండనచేయుటకును తానుపట్టినపట్టు సాధించుటకును చాలియుండియు వికారము పొందక యుండునో వాడే నిజముగలవాడును బలముగలవాడును సంపన్నుడును పూజ్యుడును లోకులకందరకు ఆచార్యుడును మిగుల గొప్పవాడును అగును. అట్టివానిసమానమే క్షమ అని చెప్పఁబడును. ఇంద్రియములకు విషయములయందలిప్రవృత్తి సహజముగదా, అట్టిప్రవృత్తిని మనసునందు పొందకుండుట అనునదియే ఇంద్రియనిగ్రహము అని పెద్దలుచెప్పుదురు. ఎవనిమనసునందు ధ్యానముచేత చలింపక స్థిరపడిన బుద్ధియనెడి ఆకాశమును పొందియుండునో వానియొక్కయునికి అచలత. ఆయచలత యెంతపర్యంతము కలిగియుండునో అంతపర్యంతము మనుష్యుడు నెమ్మదిగలవాడగును. ఎవడు చంచలములైనవిషయములననుసరించి పోవుచుండెడి యింద్రియములను విషయములవలననుండి త్రిప్పునో వాడు తీర్థయాత్ర చేసినఫలమును పొందును. ఎవడు ఈభూమియందుగల స్థావరములును (వృక్షములు మొదలగునవి) జంగమములును (తిరిగెడు మనుష్యులు మొదలగునవి) అయినప్రాణులయందు దుఃఖపడువానినిజూచి దుఃఖపడుచు సుఖపడువానినిజూచి సుఖమును పొందుచు ఆకలిగొన్నవానినిజూచి ఆకలిగొన్నవానివలె నుండుచు ఎందునను కొరతలేనివానినిజూచి కొరతపడకయుండుచు తన్నబడినవానినిజూచి తన్నబడినట్లుండుచు ఋషివలె విచారములేకయున్నవానిని జూచి ఋషివలె నుండుచు మెలగునో ఆపుణ్యపురుషుడు సర్వప్రాణులయందును దయగలవాడు అనబడును అని దయాస్వరూపము నెఱిగినవారు చెప్పు

షేణ విశుద్ధ్యతి. అతోఽన్యథా వర్తమానః కోటిసంవత్సరావధి, గంగాజలనిమగ్నోఽపి నరో శుద్ధ్యేత్కదాచన. యథా మనస్తథా వాణీ యథావాణీ తథా క్రియా, ఏతదార్జవమిత్యుక్తం సర్వతీర్థఫలప్రదమ్. అన్యథా సంతమాత్మానం మన్యతే సత్సు భాషతే, కిం తేన నకృతం పాపం చోరేణాత్మాపహారిణా. మిత్రే సుహృది విశ్వస్తే యో మనస్యహితం స్మరేత్. ముఖే మందస్మితం వాచి మృదువా క్రూరకర్మకృత్. పుత్రపౌత్ర గృహక్షేత్ర ధనధాన్యసమృద్ధిమాన్. అచిరాద్దుఃఖితో భూత్వా నిర్వంశో జాయతే తతః. యః ప్రయచ్ఛత్యనుదినం భిక్షామన్నంచ పుష్కలమ్, తిలధేన్వన్న హేమాంబు భూగవాశ్వాదిషోడశ. యథావిభవవిస్తారం స తీర్థఫలమశ్నుతే, అభయం సర్వభూతేభ్యో యో దదాతి దయాపరః. స స్నాతి సర్వతీర్థేషు న హింసాపరవాన్నరః, మనోమృత్యుర్మనుష్యాణాం మనశ్శత్రు ర్మనో భయమ్, తన్మనోదమనం ప్రాహు ర్ద

---

దురు. అట్టివాఁడు మిక్కిలి పరిశుద్ధుఁడగును. ఇటువంటిదయ లేనివాఁడు కోటిసంవత్సరములు బ్రతికియుండి గంగ మొదలగు పుణ్యతీర్థములలో స్నానము చేసియుం పరిశుద్ధుఁడు కానేరఁడు. ఈ చెప్పఁబడిన లక్షణములుగలదే దయ అనఁబడును. మనసున తలచినట్టే మాట చెప్పుటయుం మాట చెప్పినట్టే నడచుకొనుటయుం ఆర్జవము అని చెప్పఁబడును. ఆయార్జవము ఎల్ల తీర్థములయందును స్నానము చేసినఫలము నిచ్చును. తన్ను తానే యోగ్యుఁడనియెంచుకొని సత్పురుషులసభలో గొప్పగాఁ జెప్పుకొనునట్టి మనుష్యుఁడు తన్ను తాను దొంగిలించిన దొంగ అగును. అట్టివాఁడు ఏపాపమునకైన పాలుపడును. తన్ను నమ్మిన స్నేహితుని యెడల కీడు తలచువాఁడును నవ్వుమొగముగలిగి తిన్నని మాటలాడుచు క్రూరకృత్యములు చేయువాఁడును ఎవఁడో, వాఁడు కొడుకులు మనములు ఇండ్లు పంటభూములు ధనములు ధాన్యములు మొదలగువానిచే వర్ధిల్లునట్టివాఁడయినను అల్పకాలములోనే అవి యన్నియుం నశింపఁగా దుఃఖమును పొందును. పిమ్మట వానివంశమును లేకపోవును. భిక్షుకులకు భిక్షమును అతిథులకు అన్నమును ఎవఁడు సమృద్ధముగా పెట్టునో, నువ్వులు ఆవులు అన్నము బంగారు నీళ్లు భూమి ఎద్దు గుఱ్ఱము మొదలగువానిని యిచ్చుట అనెడి పదియారుదానములను తనకలిమికి తగినట్టు ఎవఁడు చేయునో వాఁడు తీర్థయాత్రలెల్లను చేసినఫలమును పొందును. దయాళువై ఎల్లప్రాణులకును అభయమిచ్చునట్టివాఁడు అహింసయందు అక్కఱగలవాఁడు కాబట్టి సకలతీర్థములయందును స్నానము చేసినవాఁడు అగును. మనుష్యులకు చంపునట్టి దేవతయుం శత్రువును ఎల్లవిధముల భయములును మనస్సే అగును.

మం తత్త్వవిదో నృప, విషయేషు యథా భూయాన్మనసో వాసనాక్షయః.
తథా మనోభవేన్ముక్త్యై బంధాయైవా వృథా నృప, మన ఏవ మనుష్యా
ణాం కారణం బంధమోక్షయోః. మనోనిగ్రహవాన్యోగీ యత్ర కుత్రా
శ్రమే రతః, స తీర్థభూతో లోకానాం దర్శనస్పర్శనాదిభిః. సంతోషా
మృతతృప్తస్య సంతుష్టం యస్య మానసమ్, దాసీభూతం జగత్సర్వం
తస్య శత్రుర్న విద్యతే. ధరణీకశిపూచైవ చీనాంబరదిగంబరే, కదన్నే
వా రసాన్నే వా పుత్రాదీనాం సుఖేమృతౌ. అర్థానాం సిద్ధ్యసిద్ధ్యోశ్చ
తథా మానావమానయోః, లాభాలాభే సుఖే దుఃఖే యస్య చిత్తం సమం
భవేత్. స సంతోషయుతో విద్వాన్ సర్వత్ర సుఖమాప్నుయాత్, తృ
ప్తితీర్థం ప్రవక్ష్యామి యస్మిన్ స్నాయీ సదాశుచిః ధనధాన్యగృహక్షే
త్రపుత్రపౌత్రార్థసంపదః, యా తృప్తిర్నశ్వరా సా స్యాత్క్షణికా క్షణభం

---

ఆ మనస్సును స్వాధీనము చేసికొనుటయే దమము అని తత్త్వము తెలిసిన పెద్దలు చెప్పుదురు. మరియు మనసును విషయములయందు వ్యాపింపఁజేయునట్లు ఆవిషయవాసనలేక వైరాగ్యమునందు మనుపరచినపక్షమున అదియే మోక్షమునకును కారణము అగును. విషయములయందు మనసుతగులుట బంధమునకు కారణముఅగును. ఏదైన నొకయాశ్రమమునందుండి మనస్సును లోపరచుకొనెడి పురుషుఁడు యోగీశ్వరుఁడు అనిపించుకొనును. అటువంటి యోగీశ్వరుఁడు చూచుటచేతను తాఁకుటచేతను లోకులకు తీర్థస్వరూపుఁడై తీర్థయాత్రవలనిఫలమును ఇచ్చుచుండును. అమృతమునుబోలిన సంతోషముచేత తృప్తిపొందిన సంతుష్టమానసునకు లోకమంతయు సేవకునివంటిదగును. అట్టి మహాపురుషునికి పగవాఁడు కలుగఁడు పట్టినేలయందు పండుకొనుటయందును మెత్తనిపానుపుమీద పండుకొనుటయందును మంచివెలగల వస్త్రములు కట్టుకొనుటయందును దిసమొలతో నుండుటయందును చెడు అన్నము తినుటయందును ఉప్పు పులుసు కారము వగరు చేదు తీపు అను ఆరురసములతోనుకూడిన పరిశుద్ధమయిన అన్నము తినుటయందును కొడుకులు మొదలగువారికి సుఖము కలుగుటయందును చావుకలుగుటయందును కోరినవస్తువులు దొరకుటయందును దొరకకుండుటయందును మానమునందును అవమానమునందును లాభమునందును నష్టమునందును సుఖమునందును దుఃఖమునందును ఎవనిమనసు సమముగానుండునో ఆమహాత్ముఁడు సంతోషముతో కూడినవాఁడును విద్వాంసుఁడును అగును. అతనికి ఎల్లయెడల సుఖమే కలుగును. తృప్తియనుతీర్థమును చెప్పెదను వినుము. మనుష్యుఁడు ఏతీర్థమునందు మునిగి సదా పరిశుద్ధుఁడును ధనము ధాన్యము గృహము క్షేత్రము కొడుకులు మనుమలు అనునవి కలవాఁడుఅగునో అట్టిచెడని తృప్తియనెడి తీర్థము క్షణకాలమే ఉండునదియనియు క్షణకాలములోనే నశించునది యనియు

గుర్ర. ఇతి నిశ్చిత్య మతిమాన్ జ్ఞానతృప్తి మవాప్నుయాత్, జ్ఞానామృతేన తృప్తస్యా ద్విరక్తస్య బహుస్సుఖాత్. బ్రహ్మాదీనాంసుఖంయావత్తావత్తద్గోష్పదాయతే, బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి తీర్థం పరమపావనమ్. లక్షణం బ్రహ్మచర్యస్య శృణు వక్ష్యామి తేనృప, శ్రవణంకీర్తనం కేళిః ప్రేక్షణంగుహ్యభాషణమ్.సంకల్పోఽధ్యవసాయశ్చక్రియానిర్వృతిరేవచ, ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః. శోభాలంకారవస్త్రైశ్చ వసితం భూషితం ద్రుతమ్, వివిక్తే స్మరతః పుంసః స్త్రీయోగం మైథునాత్పరమ్. ద్యూతంపాణికృతంసాకం దారుపీఠేవరాటికామ్, చతురంగతయాం కేళిః సకృన్మైథునసాధనమ్. వసిష్ఠః—మాత్రా స్వస్రా దుహిత్రావా నైకశయ్యాసనో వసేత్, బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి. హస్తాభినయసంజ్ఞాభి ర్నయనాలోకచేష్టితైః, నర్మాలాపస్మితయుతం ప్రేక్షణం మైథునాత్పరమ్. వ్యంగోక్తి ర్జనతాలోకే వివిక్తే గుహ్యభాష

---

బుద్ధిమంతుఁడగువాఁడు తనలోతాను నిశ్చయించుకొని జ్ఞానమువలనిదైన తృప్తిపొందినవాఁడు కావలెను. అట్టిజ్ఞానమనెడి అమృతమువలన తృప్తిపొంది ఇతరములయిన విషయసుఖములవలన విరక్తినొందినవానికి బ్రహ్మమొదలగువారు పొందునట్టి సుఖమంతయు మిక్కిలి కొంచెపుసుఖముగా తోఁచును, ఇట్టిదే తృప్తి. ఇక మిక్కిలి పావనమయిన బ్రహ్మచర్యము అను తీర్థమును వివరించెదను. దానిలక్షణమును వినుము శ్రవణము (వినుట) కీర్తనము (కొనియాడుట) కేళి (ఆట) ప్రేక్షణము (చూచుట) రహస్యసంభాషణము (రహస్యముగా మాటలాడుట) సంకల్పము (తలచుట) అధ్యవసాయము (ఉత్సాహము) క్రియానిర్వృతి (పనులనుమానుట) అనునివి మిథునకర్మకు అష్టాంగములు (ఎనిమిదిఅంగములు) అనబడును. ప్రకాశించుచున్న సొమ్ములను కోకలను ధరించుటయు స్త్రీపురుషులు రహస్యస్థలమునందు మన్మథప్రేరితులై కూడుటయు మిథునకర్మములకు ఒక అంగమగును. ప్రాచికలకపైగవ్వలు చేతబూని పందెము వేసిజూదమాడుటయు చదరంగమాడుటచేత ప్రొద్దుపుచ్చుటయు మిథునకర్మమునకు ఒక అంగమయిన కేళియగును. తల్లితోడఁబుట్టినది కూతురు ఇటువంటివారితోడనైనను ఒకపరుపునందు పండుకొనుటగాని ఏకపీఠమునందు కూర్చుండుటగాని తగదు. అందువలన ఇంద్రియసముదాయము బలీయమైనది గనుక విద్వాంసునినయినను విషయేచ్ఛకు లాగును. చేసైగలు చేయుటతోడను కనుసైగలు చేయుటతోడను పరిహాసపు మాటలతోడను కూడిన చూపు మిథునకర్మమునకు ఒక అంగమయిన ప్రేక్షణము అగును. అనేకులు కూడియుండునపుడు వేరు అర్థము నిచ్చునట్లు తమయభిప్రాయమును తెలిపెడి మాటలాడుటయు ఏకాంతమునందు రహస్య

ణమ్, ఉభయాభిమతవ్యక్తి వచనం గుహ్యభాషణమ్. తయాత్మాభిమతే దత్తే మనసా మైథునక్రియామ్, నిద్రావిరహితం కుర్యాత్సంకల్పో మైథునాత్పరమ్ హానిం మృత్యుం క్షయం నాశ మనవేక్ష్య ధియాత్మనః, ప్రారభే న్నిశ్చయాత్కర్మ వ్యవసాయస్సమీరితః. తుంగౌ స్తనౌ సుసంపీడ్య వక్షసా పరిరభ్య చ, నసంయోగః క్రియా ప్రీతి స్సానివృత్తిరుదాహృతా. ఏతన్మైథునమష్టాంగం యః పరిత్యజ్య వర్తతే, తద్బ్రహ్మచర్యం పరమం సర్వకామైకసాధనమ్. ఏకభుక్తమధశ్శయ్యా బ్రహ్మచర్యమహింసనమ్, వ్రతచర్యా తపశ్చర్యా కృచ్ఛ్రచాంద్రాయణాదికమ్. దేవపూజా మంత్రజపో దశైతే నియమాస్స్మృతాః, సర్వేషామేవ జీవానాం కర్మణా మనసా గిరా. బుద్ధ్యా హింసాం న కుర్వంతి అహింసైవం ప్రకీర్తితా, పితృమాతృసుహృద్వర్గే గుర్వాచార్యేషు బంధుషు. మాతులశ్వశురార్యేషు యేష్వసచ్చరితేష్వపి, క్రోధశీలో భవేన్నైవ సోఽక్రోధస్తూచ్యతే బుధైః. పుణ్యపాపానభిజ్ఞత్వం మనసా చింతయన్నఘమ్, పరాపవాదం పైశు

---

ముగా మాటలాడుటయు ఉభయుల అభిప్రాయములకు తగినట్టు సంకేతముగా మాటలాడుటయు మిథునకర్మమునకు ఒక అంగమయిన రహస్యము. ఆఁడుది మగవాని యిష్టమునకు అనుకూలమయిన మాటచెప్పగానే మిథునకర్మమును గూర్చి నిద్రసయితము లేకుండ మనసు విచారించుట మిథునకర్మమునకు ఒక అంగమయిన సంకల్పము. కీడు వచ్చుటను చావువచ్చుటను నాశమువచ్చుటను మనసునతలపక మనోనిశ్చయముచేత కార్యమును నడపబూనుట వ్యవసాయము అనఁబడును. ఉన్నతములగు స్తనములను మర్దించి ఱొమ్ముతో ఱొమ్ము ఒరసికొనునట్లు కౌఁగిలించుకొని కలయికమాత్రములేని వ్యాపారముతోడి ప్రీతినివృత్తి అనబడును. ఈచెప్పఁబడిన ఎనిమిదిఅంగములు గలమిథునకర్మమును మానియుండెడి వృత్తియే ఎల్లకోరికలకు ముఖ్యసాధనమైన బ్రహ్మచర్యము. అట్టి బ్రహ్మచర్యమునకు ఒంటిపూట భోజనముచేయుట దిగువపండుకొనుట వేదాధ్యయనము చేయుట హింసచేయకుండుట వ్రతముల నడపుట తపస్సుచేయుట కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగునది దేవతార్చనము మంత్రములను జపించుట అను నీపదియును నియమములు అనబడును. హింసచేయకుండుట అనగా, ఎల్లజీవులయందును పనులచేత గాని మనసుచేతగాని మాటలచేతగాని బుద్ధిచేతగాని బాధకలుగజేయకుండుట. అక్రోధము అనగా, తల్లిదండ్రులు స్నేహితులసమూహము పూజ్యులగు పెద్దలు ఆచార్యులు చుట్టములు వీరియందును, మేనమామ కన్యనిచ్చినమామ మొదలగువారియందును వారు అక్రమముగా ప్రవర్తించువారుగా నుండినను సహించి కోపము చేయకయుండుట. నృశంసుఁడు అనగా, పుణ్యపాపములను విచారింపకుండుటయు పాపకృత్యములను మనసున తల

న్యం పరద్రోహపరాయణః. కాఠిన్యం చింతయంశ్చిత్తే హృది పారుష్యవాక్సదా, ఏవంవిధదురాచారస్స నృశంసః ప్రకీర్తితః. నృశంసః కీర్తితో రాజన్నానృశంస్యమతోన్యథా, ఇహాముత్రార్థవైరాగ్యాద్వేదాంతశ్రవణేన చ. నిత్యానిత్యవిచారేణ మనోనిర్మలతామియాత్, ఏవం మనోమలత్యాగాచ్ఛుద్ధో భవతి నాన్యథా. మనశ్శుద్ధిమతః పుంసో బ్రహ్మాదీనాంచ యత్సుఖమ్, తదనంతసుఖస్యాస్య తత్సుఖం గోష్పదాయతే. తస్మాన్మనోమలత్యాగః సర్వతీర్థఫలప్రదః, మనసో నిగ్రహేణైవ శరీరస్యతు మోక్షణాత్, ఇంద్రియాణాం నిరోధేన నాకాదీనాంచ నిగ్రహాత్, ఆహారవర్జనాచ్చైవ యుక్తాహారనిషేవణాత్. యుక్తస్వప్నావబోధేన యత్తపస్తత్తపో విదుః, ఏతత్తపః పరంతీర్థం సకళం నిష్కళంతు వా. హరింహరం రవిం శక్తి మపివా చింతయేత్సుధీః, సాంగం సముద్రం సన్యాసం సఋషి

---

చుటయుం ఇతరులయందు లేనిపోని నేరములు పెట్టుటయుం చాడీలు చెప్పుటయుం పరులకు ద్రోహము చేయ దలచుటయుం మనసునందు కఠినత్వము కలిగియుండుటయుం ఎల్లప్పుడు కఠినపుమాటలాడుచుండుటయుం అనునిట్టి చెడ్డనడవడిగలవాఁడు. ఈ చెప్పఁబడిన చెడ్డ నడతలు ఏవియుం లేకుండుట ఆనృశంస్యము అనఁబడును. ఈలోకపువిషయములయందలి వైరాగ్యమువలనను పరలోకవిషయములయందలి వైరాగ్యమువలనను వేదాంతముల వినికివలనను ఇదినిత్యము ఇదిఅనిత్యము అనువిచారణచేయుటవల్లను మనస్సుయొక్క నిర్మలత్వము కలుగును. ఇట్లు మనస్సునందలిమాలిన్యమును తొలగించుటవలన మనుష్యుఁడు పరిశుద్ధుఁడుఆగును. లేనియెడ పరిశుద్ధుఁడు కాఁడు. మనశ్శుద్ధిగలపురుషుఁడు బ్రహ్మాదులుపొందునట్టి సుఖమును మీరినసుఖమును పొందును. కనుక అట్టివానికి బ్రహ్మాదులసుఖము మిక్కిలి యల్పముగా తోఁచును. అందువల్లమనస్సునందలి మాలిన్యమును తొలఁగించుకొనుట ఎల్లతీర్థములవలనిఫలమును పొందించును. మనస్సును లోబరచుకొనుటవలనను శరీరసుఖములను విడుచుటవలనను ఇంద్రియములను అణగబట్టుటవలనను స్వర్గము మొదలగువానిని లక్ష్యము చేయకుండుటవలనను అయుక్తమయిన ఆహారమును విడుచుటవలనను యుక్తమయిన ఆహారమును భుజించుటవలనను అనుభవించు సుఖముల నన్నిటిని కలవలె తలంచుచు నడపునట్టి వ్రతము తపస్సు అనఁబడును. ఈతపస్సే సర్వోత్తమమయిన తీర్థము. విద్యతోఁగూడినదిగాని కూడనిదిగాని మంచి తెలివి గలిగియున్నయెడ అది సర్వోత్తమమైన జ్ఞానతీర్థము అనఁబడును. విష్ణువుశివుఁడు సూర్యుఁడుశక్తి ఈదేవతలను ప్రత్యక్షముగాగాని వీరిప్రతిమలను గాని బుద్ధిమంతుఁడగువాఁడు ధ్యానింపవలసినది. మరియుం మనుష్యుడగువాఁడు అంగన్యాసకరన్యాసములతోడను ఋషిచ్ఛందదైవతములతోడను మంత్రములను

చ్ఛందదైవతమ్. జపేన్మంత్రం నరస్సోఽపి సర్వతీర్థఫలం లభేత్. అవి చారితరమ్యేషు స్త్రీదేహేష్వపి రాగిణామ్, మాయారమ్యతరా ప్రీతిర్జాయతే హ్యవివేకినామ్. ఇయం పశ్యతి మాంనారీ పరిరంభంచ వాంఛతి, ఇత్యేవం మన్యతే రాగీ నాంతర్వస్తువిచారవాన్. పురుషోఽయమియం స్త్రీతి పృథఙ్నాస్తి వివేకినామ్, ఆత్మైవ భాతి సర్వత్ర బాహ్యాంతఃపరిపశ్యతామ్. జలతీర్థేన కిం తస్య కోటిసంఖ్యేన భూపతే, ఆచార్యోపాసనం తీర్థం పరం కైవల్యసాధనమ్. అధ్యాప్య వేదం వేదాన్వస్షడంగపదక్రమాన్, ఆచార మాచారయతి సోఽయమాచార్య ఉచ్యతే. పితుర్వా యదివా జ్యేష్ఠా త్పితృభ్రాతుశ్చ పార్థివ, వేదశాస్త్రాణి గాయత్రీంగృహ్ణీయాన్నియమాద్వ్రతీ.ఏతేభ్యోనబుతేఽన్యేభ్యో అన్యజాతిభ్య ఏవచ, దేవీంనప్రతిగృహ్ణీయాద్వేదాన్వా వేదమేవవా. అధీత్య పూర్వం స్వాంశాఖాం సషడంగపదక్రమామ్, అన్యాంశాఖామధీయీత

---

జపించెడి జపమువలన సర్వతీర్థములఫలమును లభించును. కాముకులయిన అవివేకులకు విచారణచేయమిచేత రమ్యములుగా తోచునట్టి స్త్రీలదేహములయందు మాయచేత సొంపై ప్రీతిపుట్టుచున్నది. అందువల్ల ఆయవివేకియగు పురుషుఁడు ఈయాఁడుది నన్ను చూచుచున్నది. నాయాలింగనమును కోరుచున్నది. అని యిట్లుతలచుచు అంతర్వస్తువైన పరతత్త్వమును విచారింపడు. వివేకులగు పురుషులకు వీడుమగవాడుఇదిఆడుది అను భేదము లేదు. కాబట్టి వారు లోపలను వెలుపలను అంతటను పరమాత్మయే వర్తించుచున్నాడని తలతురు. ఓరాజా! జలరూపమయిన తీర్థములు కోట్లకొలది గలవు. వానివలన నేమి ప్రయోజనము. ఆచార్యుని సేవించుట అనెడి తీర్థము మిక్కిలి మేలైనదియు మోక్షమునకు సాధనమును అగును. ఆచార్యుడు అనగా, శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము అను ఆరంగములతోడను గూడినవియు పదక్రమముల తోగూడినవియునైన వేదములను చదివించి ఆ వేదములయందు చెప్పబడినచొప్పున నడచుకొన నేర్పునట్టి పురుషుడు ఎవడో అతడు. బ్రహ్మచారి అగువాఁడు తండ్రివలనగాని అన్నవలనగాని పినతండ్రి పెదతండ్రులవలనగాని వేదశాస్త్రములను గాయత్రిని గ్రహింపవలయును. ఈచెప్పబడిన తండ్రి మొదలగువారికంటె ఇతరులవలనగాని ఇతరజాతివారివలనగాని గాయత్రినిపొందరాదు. అన్ని వేదములనుగాని ఒక వేదమునుగాని శిక్షాదులైన ఆరు అంగములతోగూడిన స్వశాఖావేదమును పదక్రమములతోడ చదివి పిమ్మట చదువవలసినది. అట్లుగాక అన్యశాఖావేదమును తొలుత చదివినపక్షమున పాపాత్ముడగు.

అన్యథాకిల్బిషీభవేత్. యస్స్వశాఖాంపరిత్యజ్య అన్యశాఖాముపాసతే శాఖాఖండ స్స విజ్ఞేయో వర్జ్యఃకర్మసు శూద్రవత్, స్వజాతేర్మంత్రసం బంధం పిండసంబంధమేవచ, కన్యాదానం పైతృకంచ సమ్యగ్దద్యాత్స్వ జాతయే. న స్త్రీణాం పృథగాచార్యో భర్తారంశ్వశురంవినా, స్వతంత్ర తానతస్యాస్తు కదాచిదపిభూమిప. కన్యాం రక్షేత్పితాపూర్వం భర్తార క్షేత్తతఃపరమ్, పుత్రశ్చావార్ధకేరక్షేత్పిత్రోర్భక్తిసమన్వితః పుత్రాభావే ధవాభావే దేవరేషు వసేత్తతః తేషాం కులస్య చాభావే భర్తృజ్ఞాతి కులే వసేత్. అన్యత్రవాసోనారీణాం మహాదోషాయకల్పతే, ఆచార్యా య ప్రియాం కుర్యాత్ప్రాణైరపి ధనైరపి. అనుక్తసేవీసతత మింగితజ్ఞో వసేత్సదా, శౌచమాచార్యశుశ్రూషాం భక్త్యాయః కురతేనరః. సగచ్ఛే ద్బ్రహ్మణో లోకం యాతో నావర్తతే పునః, శౌచంతుద్వివిధంప్రోక్తం బాహ్యమభ్యంతరం శుభమ్. మృజ్జలాభ్యాం బహిశ్శుద్ధి రాంతరం బ్రహ్మ చింతనమ్, అనిష్కల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ నరస్యాంగార

---

ఎవడు స్వశాఖాధ్యయనము చేయక అన్యశాఖాధ్యయనముచేయునో వాడు శాఖాఖండుడు (తనశాఖను తెగనరకినవాడు) అనబడును. అట్టివాడు ఎల్లక్రియలయందును శూద్రునివలె విడువదగినవాడగును. మంత్రసంబంధమును పిండసంబంధమును స్వజాతియందే కలుగవలసినది. కాబట్టి కన్యాదానములు పైతృకమును స్వజాతివానికే ఇయ్యవలసినది. స్త్రీలకు పెనిమిటి మామ తప్ప వేరే ఆచార్యుడులేడు. ఒకానొకప్పుడయినను స్త్రీకు స్వతంత్రతలేదు. స్త్రీలు పసితనమునందు తండ్రిచేతను వయస్సు వచ్చినపిమ్మట పెనిమిటి చేతను ముసలితనమునందు కొడుకులచేతను రక్షింపబడుదురు. తల్లిదండ్రులయందు భక్తిగల కొడుకుగాని పెనిమిటిగాని లేనిఆడుదానికి పెనిమిటి తోడబుట్టినవారియొద్ద నుండదగును. వారును ఆవంశస్థులును లేకపోయినయెడల పెనిమిటి దాయాదులయింట నుండవలసినది. అట్లుగాక అన్యస్థలములలో వాసముచేయుట ఆడువారికి మంచిదికాదు. ఎవడయినను సరే తనప్రాణమును ధనమును ఆచార్యుని విషయమునందు ఉపయోగింపవలసినది. ఆచార్యునిచేత నీవు నన్ను సేవింపుము అని చెప్పబడకయే ఆచార్యుని అభిప్రాయము తెలిసికొని ఎల్లప్పుడు సేవించుచు నుండవలసినది. ఎవడు పరిశుద్ధుడై భక్తితో గురువునకు శుశ్రూషచేయునో వాడు పునరావృత్తిలేని బ్రహ్మలోకమును పొందును. పరిశుద్ధతయు అభ్యంతరము బాహ్యము అని రెండు విధములై యుండును. మట్టిచేతను జలముచేతను చేతులు కాళ్లు శుద్ధి చేసికొనుటయు స్నానము చేయుటయు బాహ్యశుద్ధి. బ్రహ్మవిచారము చేయుట ఆంతరశుద్ధి. దోషములేని మనసుగలవాడు కాసివానికి ఎల్లతీర్థ

కస్యైవ సదాక్షీరాభిషేచనమ్. స్వదేహసుతజాయాసు నిర్మమో నిర
హంకృతిః, అశక్తి విషయే ష్వేవ యస్త్వతేషుచ సర్వదా. సూర్యా
చంద్రమసోరూపసాన్నిధ్యం దర్శితం భవేత్, వైరాగ్య మేతద్భూపాల
వ్యాహృతం తే మయోత్తమమ్. యోగే జ్ఞానేచ వైరాగ్యే సాంఖ్యే
వేదాంతసమ్మతే, దుర్వాసనాక్షయేవాపి సంగనాశేఘసంక్షయే. సత్సంగ
తిర్గతిర్నౄణాం నాన్యథా గతిరిష్యతే, అతస్సంసారనాశాయ కుర్యాత్స
త్సంగతింసదా. ఆచారాల్లభతేలక్ష్మీ రాచారో హంత్యలక్షణమ్, ఆచా
రాద్రూపతాం ప్రాహు ర్ముక్తిమాచారవాన్ లభేత్. వృత్తమేవ సతాం
రక్షే ద్వృత్తమేతిచ యాతిచ, అక్షీణోవృత్తః తక్షీణో వృత్తతస్తు హ
తో హతః. ఆచారహీనంనపునంతివేదా యద్యప్యధీతా స్సహషడ్భిరంగైః,
ఛన్దాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడాన్ శకుంతా ఇవ జాతపక్షాః.
తస్మాదాచారవాన్ లోకే సర్వతీర్థమయో భవేత్, సురాభాండే యథా

---

మూలయందు చేయుస్నానమును బొగ్గునకునల్లదనముపోగొట్టుటకై పాలతో అభిషేకము
చేసినట్లు అగునుగాని ప్రయోజనములేదు. ఎవ్వడునుతన దేహమునందును పెండ్లాముబిడ్డల
యందును మోహము లేనివాడును అహంకారము లేనివాడును తనశక్తికిమీరిన పనుల
యందు ప్రవేశింపనివాడును ఎవడో వానిచేత సూర్యచంద్రులరూపములు దగ్గరనే చూడ
బడినవి అగును. ఓరాజా! ఉత్తమమైన యీవైరాగ్యము నీకు చెప్పితిని. యమనియ
మాదియోగములందును జ్ఞానమునందును వైరాగ్యమునందును వేదాంతసమ్మతమైన సాం
ఖ్యమునందును దుర్విషయములందలి ఉపేక్ష నశించుటయందును దుష్టసాంగత్యము లేక
పోవుటయందును పాపమునశించుటయందును మనుష్యులకు సత్పురుషులతోడి సహవాస
మే గతిగాని మరియొకగతి కానరాదు కనుక సంసారసంబంధము తొలగుటకై ఎల్లప్పు
డు సత్పురుషులతోడ సాంగత్యము చేయవలెను. సదాచారమువలన సంపద కలుగును.
అవలక్షణములు తొలగును. చక్కదనము వచ్చును. మోక్షము లభించును అని
పెద్దలు చెప్పుదురు. సత్పురుషులకు సదాచారమును కాపాడుకొనుట ముఖ్యము. ఆ
సదాచారము లేకపోయినపక్షమున పురుషుడు చెడును. కలిగియున్నపక్షమున చెడక
వర్తించును. ఆచారముచేత తక్కువైనవానిని ఆరు అంగములతోడ చదువబడిన వేద
ములుగూడ పరిశుద్ధునిగా చేయనేరవు. అట్టివానిని చావుకాలమునందు ఆచదువబడిన
వేదములు రెక్కలువచ్చినపక్షులు గూండ్లను విడిచిపోవునట్లు విడిచిపెట్టిపోవును. కనుక
ఆచారముగలవాడే లోకమునందు సకలతీర్థస్వరూపుడు అగును. సదాచారము లేని
వానియందుండెడి వేదార్థములవినికి యనునది కల్లుకుండలోని నీళ్లవలెను తక్కు తాకిన

తోయం శ్వస్పృష్టంచయథాపయః. ఊషరేచ యథా వారిన్యస్తం హీనే తథాశ్రుతమ్, అద్రోహేణైవభూతానాం వర్తతేయోద్విజోనృప అతిథిస్స భవేద్ధాతుర్విష్ణోశ్చ హరేరపి, మానసేష్వపితీర్థేషు యోనరస్స్నాతి బాహ్యకే. జలేనహిభవేచ్ఛుద్ధోయథామండూకకచ్ఛపౌ,నశరీరమలత్యాగాన్నరో భవతి నిర్మలః. విషయేష్వపిసంసక్తిర్మనసోమలముచ్యతే, విషయేషువిరాగస్య మనసో మలనాశనమ్. చిదానందార్ణవేస్నాతో రాగాది మలనాశనే, సంప్రబోధ జలేరాజన్ కైవల్యమచిరాల్లభేత్. ఏతత్తే కథితం రాజన్ మానసం తీర్థలక్షణమ్, యస్యశ్రవణమాత్రేణ జ్ఞానయజ్ఞ ఫలం లభేత్.

ఇతి శ్రీపాద్మపురాణే మాఘమాహాత్మ్యే మానసతీర్థ
ప్రభావాద్యభివర్ణనంనామ ఏకవింశోఽధ్యాయః.

---

పాలవలెను. చవుటినేలయందలి జలమువలెను ఉండును. ప్రాణులయెడల ద్రోహచింత లేక వర్తించునట్టి బ్రాహ్మణుఁడు ఎవడో వాఁడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు అతిథివలె పూజింపదగినవాఁడగును. ఈచెప్పబడిన మానసతీర్థములయందు స్నానముచేసినమనుష్యుడు పావనుడగును గాని మనశ్శుద్ధిలేక బయటి తీర్థములతో స్నానముచేసినపక్షమున ఆస్నానము చేసినవాడు కప్ప తాబేలు ఎల్లప్పుడు నీళ్లలోనే ఉండియు ఎట్లుపావనములుకావో అట్లే పావనుడు కానేరరుడు. దేహముమీది మురికిపోగొట్టుకొన్నమాత్రముచేతనే మనుష్యుడు పరిశుద్ధుడు కానేరడు. శబ్దము మొదలగువిషయములయందు మిక్కిలి యాసక్తికలిగియుండుట మనోమలము అనియు ఆవిషయములయందు విరక్తికలిగియుండుట మనోమలము నశించుట అనియు చెప్పబడును. శబ్దాదివిషయములయందలి అనురాగము అనెడిమురికిని నశింపజేసి మంచితెలివియనెడి జలముతో గూడిన జ్ఞానానంద మనెడి సముద్రమునందు స్నానముచేసినవాడు శీఘ్రకాలములోనే కైవల్యమును పొందును. ఓరాజా! దేనివినికిచేత జ్ఞానమును యజ్ఞముచేసినఫలమును లభించునో అటువంటి యీమానసతీర్థలక్షణమును నీకు చెప్పితిని అని వసిష్ఠమహాముని దిలీపమహారాజుతో చెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మానసతీర్థ
[illegible]

## ద్వావింశోఽధ్యాయః.

దిలీపః.—సమానముదకంతీర్థం హీనాధిక్యవివర్జితమ్, కేషాం కథంచిదాధిక్యం హైన్యం కేషాంకథంభవేత్, వసిష్ఠః.సర్వేషామేవతీర్థానాం శ్రేష్ఠత్వే కారణంశృణు, యథాశరీరస్యోద్దేశాః కేచిన్మధ్యతమాయథా. తథాపిపృథివీదేశాః కేచిత్పుణ్యతమాస్మృతాః, ప్రభావాదద్భుతాద్భూమే స్సలిలస్యచ తేజసా. పరిగ్రహాన్మునీనాంచ తీర్థానాం పుణ్యతా స్మృతా, తస్మాద్భూమేషు తీర్థేషు మానసేష్వపి నిత్యశః. ఉభయేష్వపియస్స్నాతి సయాతిపరమాంగతిమ్. దిలీపః. తీర్థాన్యనుసరన్విద్వాన్ కిం కుర్యాన్నియమైశ్చకః, కింసదారో స్తువిధినా కేనహావిధినాచరేత్. తీర్థేషుకఃపరిత్యాజ్యః కించిద్గ్రాహ్యంద్విజోత్తమ, ఏతత్కథయవిప్రేంద్ర శ్రోత్వతోమమతత్వతః. వసిష్ఠః నియమాదీన్ప్రవక్ష్యామి వదతోమేనిశామయ,యైర్లభ్యంతీర్థయాత్రాది సతీర్థఫలదంశుభమ్. ఏకభుక్తమథశ్శయ్యా

---

### ఇరువదిరెండవ అధ్యాయము.

దిలీపునిమాటలు.—ఓ మునీశ్వరా! తీర్థము అనునదియంతయుం నీళ్లయుంనికిచేత సమానమైనదే ఐయుండగా కొన్నిటికి ఆధిక్యమును కొన్నిటికి హీనత్వమును ఎట్లుకలుగును. అని దిలీపుడు వసిష్ఠుని అడిగెను.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా!ఎల్లతీర్థములకును శ్రేష్ఠత్వముకలుగుటకు కారణమును చెప్పెదను వినుము. శరీరధారణమునుబట్టి మనుష్యులలో కొందరు అధికులు కొందరు అల్పులు అనుభేదము కలుగజెప్పనట్లు భూమియందలి క్షేత్రవిశేషములను బట్టి కొన్నితీర్థములు మిక్కిలి పుణ్యములు అని చెప్పబడును. నీళ్లతేటదనమువలనను ఆశ్చర్యకరమైన ప్రభావములవలనను మునులు పరిగ్రహించుటవలనను తీర్థములకు పవిత్రత్వము చెప్పబడును. కనుక భూసంబంధమైన తీర్థములయందును మనస్సంబంధమైన తీర్థములయందును ఎవ్వడును ఎవడు స్నానముచేయునో వాడు సర్వోత్కృష్టమైన సద్గతిని పొందును.

దిలీపునిమాటలు.—ఓమునిశ్రేష్ఠుడా! విద్వాంసుడు అగువాడు పుణ్యతీర్థములను సేవించునపుడు ఏనియమములు గలవాడుకావలెను? ఏమేమిచేయవలెను? భార్యతోగూడినవాడు ఏనియమముచేత ప్రవర్తింపవలెను? తీర్థములలో వదలదగినవి యేవి? వదలరానివియేవి? ఇది అంతయుం వినగోరుచున్నాను విశదముగా చెప్పుము.

వసిష్ఠునిమాటలు.—ఎవరిచేత తీర్థయాత్రాదిఫలము పొందబడునో వారు నడపదగిన నియమములు మొదలగువానిని నాకు తెలిసినవట్టుకు వివరించి చెప్పెదవినుము. ఒంటిపూట

తైలాభ్యంగస్యవర్జనమ్, పరాన్నంపరపాకంచ నిషిద్ధస్యచ భక్షణమ్. ఆరుహ్యాగమనంనాగ గోశ్వాది సురసేవనమ్, అతీవదూరగమనం కాయక్లేశకరంచతత్. సంవాసోమ్లేచ్ఛదేశేషు పుళిందానాంచ ఖర్వటే, నిషిద్ధగ్రామదేశేషునివాసోఽవశ్యమేవచేత్. వసేత్కులాలభవనే చక్రదండపరిష్కృతే, యస్మిన్దినేవిశేత్తీర్థం తత్పూర్వేద్యుర్నృపోత్తమ, సంకల్ప్యవిధివత్స్నాత్వా నిత్యకృత్యం విధాయచ సంకల్ప్యోపవసేద్రాత్రౌ జాగృయాత్పుణ్యకీర్తనైః. తత్పరేద్యుః పిత్యాన్ శ్రాద్ధైస్తర్పయిత్వార్థకల్పతః, దానాని దద్యాద్విప్రేభ్యో వేదవిద్భ్యస్స్వశక్తితః. సంప్రార్థ్యచాత్మనోభీష్టం బ్రాహ్మణాన్భోజయేత్తతః, స్వశక్త్యా దక్షిణాందత్వా నివసేచ్ఛ దినత్రయమ్. ఏవంసదారో యఃకుర్యా త్తీర్థయాత్రాం నృపోత్తమ సర్వపాపైర్వినిర్ముక్త స్సముక్తిం లభతేచిరాత్. సదారో వర్జయేత్తీర్థం ఋతుసంవేశనం ద్విజః, ఋతుసంవేశనత్యాగా త్తీర్థేదోషో న విద్యతే.

---

భోజనమును పట్టికేలనుపంపుకొనుటయు తలంటు విడిచిపెట్టుటయు ఒకరియింటగాని ఒకరువండగాగాని భోజనము చేయకుండుటయు ముఖ్యములు. తినరాని అన్నమునుతినుటయు ఏనుగు గుఱ్ఱము ఎద్దు మొదలగువానిని ఎక్కిపోయి దేవతలనుసేవించుటయు దేహమునకు బడలికకలుగునట్లు బహుదూరము నడచుటయు తురకలదేశమునం దుండుటయు బోయపల్లెలయందుండుటయు ఇవిగాక నిషిద్ధములైన గ్రామములందును దేశములందును వాసముచేయుంటయు వీనినిమానవలెను. ఈచెప్పబడిన నిషిద్ధములైన ఊళ్లలో తప్పకఉండవలసినపక్షమున చక్రముచేతను చక్రముత్రిప్పెడుకఱ్ఱచేతను బాగుపరుపబడిన కుమ్మరయింటిలో ఉండవలసినది. ఏదినము పుణ్యతీర్థమునందు స్నానముచేయుందుమో నాటి తొలిదినము శాస్త్రమునందు చెప్పబడినచొప్పున సంకల్పముచేసి స్నానముచేసి నిత్యము చేయదగిన సంధ్యావందనము మొదలగుకార్యములను నడపి మరల సంకల్పముచేసి ఉపవాసముఉండి రాత్రియంతయు పుణ్యకథలచేత ప్రొద్దుపుచ్చుచు జాగారముచేయవలెను. ఆమరునాడు కల్పోక్తప్రకారముతీర్థశ్రాద్ధములుచేసి పితృదేవతలను తృప్తిపరిచి తనశక్తికొలదిని వేదములను చదివించి బ్రాహ్మణులకు దానములను ఇచ్చి పిమ్మట తనయిష్టము చొప్పున బ్రాహ్మణులను ప్రార్థించి పిలుచుకొనివచ్చి భోజనముపెట్టి తనకు కలకొలదిని దక్షిణలిచ్చి ఆపుణ్యతీర్థమునందు మూడుదినములుండి ఆవల పోవలసినది. ఓరాజా! ఎవడు ఈచెప్పబడినమేరకు భార్యతోగూడ తీర్థయాత్ర చేయునో వాడు ఎల్లపాపములచేతను విడువబడినవాడై శీఘ్రకాలములోనే మోక్షమునుపొందును. ఋతుసంవేశనము (ఋతుప్రవేశము) అయిన తీర్థమును బ్రాహ్మణుడు అగువాడు భార్యయును తానును వదలి ఆఋతుసంవేశనముయొక్క విడుపువలన తీర్థమునందు దోషముఉండదు గనుక పిమ్మట

ఋతుసంవేశనాత్తీర్థే తత్రకృచ్ఛ్రఉపోషణే, చాతుర్మాస్యవ్రతేచైవ తథామాసోపవాసకే. చాంద్రాయణాది కృచ్ఛ్రేషు నైషాం ఫలమవాప్నుయాత్, నృణాం పాపకృతాం పాపం సర్వంతీర్థేవినశ్యతి, హేమ్నామలం యథావహ్నౌ ధౌతస్య విమలం భవేత్, షడంశాంశం స లభతే యఃపరార్థం స గచ్ఛతి. శ్రుతిం గృహీత్వా వక్ష్యామి విధానంయస్యతచ్ఛృణు, కుశైఃప్రతికృతింకృత్వా ప్రాణాన్ స్థాప్య విధానతః విధాయ నామధేయంచ జన్మనామర్క్షమేవచ, ఆత్మనస్తస్య సంకల్ప్య తమాలింగ్య నిమజ్జ్యచ. మంత్రస్నానవిధానజ్ఞో మంత్రస్నానపురస్సరమ్, మృత్స్నాస్నానవిధానేన స్నాయాదేవాఘమర్షణమ్. ఉపవాసదినే కుర్యాద్వపనం పాపనాశనమ్, శిరోగతానిపాపాని తీర్థేనశ్యంతిక్షౌరతః మాఘతీర్థప్రసంగేన తీర్థయాత్రా మయోదితా, ఏవం నియమమాస్థాయ మాఘస్నానం సమాచరేత్. మాఘస్నాయీ నరో దద్యాన్నిత్య

---

ఆతీర్థమును సేవింపవలసినది. ఋతుసంవేశనముగల తీర్థమునందు స్నానముచేయుటవలన కృచ్ఛ్రము ఉపవాసము చాతుర్మాస్యము మాసోపవాసము చాంద్రాయణము మొదలగు వ్రతములు చేయుటవలని ఫలముకలుగదు కాబట్టి అట్టియెడలతీర్థసేవచేయరాదు. బంగారును అంటిన మురికి నిప్పులోపుటము వేయగానే పోయి యెట్లు బంగారు నిర్మలమగునో అట్లు పాపులను జనులపాపమంతయు తీర్థములవలన నశింపగా తాము పరిశుద్ధులగుదురు. ఒకరికొరకు తీర్థయాత్ర చేయువానికి ఆయాత్రాఫలమునందు ఆరుపాళ్లలో ఒకపాలు లభించును. ఆతీర్థయాత్ర చేయువిధమును శ్రుతిప్రమాణములతోడ నీకుతెలియజెప్పెదను వినుము. తీర్థయాత్ర చేయువాడు యేపురుషునినిమిత్తము తాను తీర్థయాత్ర చేయబోవుచున్నాడో ఆపురుషుని ప్రతిరూపమును దర్భలతో చేసి ఆప్రతిరూపమునందు శాస్త్రపద్ధతి చొప్పున ప్రాణప్రతిష్ఠ చేసి పేరును నామనక్షత్రమును జన్మనక్షత్రమును చెప్పి తాను సంకల్పముచేసి ఆప్రతిరూపమును ఆలింగనముచేసికొని నీళ్లలో మునిగి మంత్రస్నానవిధమును గుర్తెరిగి ముందు మంత్రస్నానమును మృత్తికాస్నానమును చేసి పిమ్మట సర్వపాపములను తొలగించునదియైన శుచిస్నానమును చేయవలెను. తలనుపొందిన పాపములు పుణ్యతీర్థములయందు క్షౌరము చేసికొనుటచేత తొలగిపోవును. కాబట్టి ఆపాపములు నశించుటకై ఉపవాసదినమునందు క్షౌరమును చేసికొని స్నానముచేయవలెను. ఇప్పుడు ఈతీర్థయాత్రావిషయమును మాఘస్నానముయొక్క ప్రస్తావమునుబట్టి చెప్పితిని. ఈచెప్పిన నియమములోనుండి మాఘస్నానము చేయవలసినది. మాఘస్నానము చేయువాడు

దానం స్వశక్తితః, బదరీఫలం చ కదళీఫలమామలకీఫలమ్. క్షీరందధి మధుక్షారం శర్కరాంచ గుడం తథా, జాతీఫలం పిప్పలీంచ క్రోష్టం శుంఠీంచ జీరకమ్. కార్పాసం కంబళం వస్త్ర ముపవీతం కమండలుమ్, సిద్ధాన్నపూర్ణం కాంస్యంచ శర్కరా గుడసంయుతమ్. శర్కరా గుడ పానీయం జంబీరఫలమేవచ, నారంగం మాతులుంగంచ పుష్పాణిసురభీణిచ గోపీమృదంచ శంఖంచ దేవోపకరణానిచ, సాలగ్రామ శిలాం కృష్ణాం స్ఫాటికం లింగమేవచ. వినాయకంచదుర్గాంచ సూర్యకాంతంచ చండికామ్, దదాత్యేతానియోమాఘే సవైకుంఠేమహీయతే. అథవా జాయతే భూమౌ చక్రవర్తిశిరోమణిః, అవంధ్యం దివసంకుర్యా ద్దేనకేనచ వస్తునా. నియమేన నరోమాఘే కించిదభ్యుదితే రవౌ, స్నాత్వాసం తర్ప్య దేవాదీన్ పుష్పాక్షతతిలాదిభిః. నైష్ఠికంకర్మనిర్వర్త్య స్థండిలే ప్రతిమాసువా, ఆవాహనేనాసనేన పాద్యార్ఘ్యమధుపర్కకైః. స్నాన వస్త్రోపవీతైశ్చ గంధపుష్పాక్షతాదిభిః, ధూపదీప సునైవేద్యతాంబూ

---

తనకుకలకొలదిని నిత్యదానము చేయవలెను. అందు రేగుపండ్లు అరటిపండ్లు పాలు పెరుగు తేనె ఉప్పు చక్కెర బెల్లము జాజికాయలు పిప్పళ్లు గెనుసుగడ్డ సొంటి జీలకఱ ప్రత్తి కంబళి వస్త్రము జన్నిదము సన్యాసులు నీళ్లుంచుకొనెడుపాత్రము సిద్ధమైన అన్నముతోనిండిన కంచుపళ్లెము చక్కెర బెల్లము వీనితో గూడిన కంచుపళ్లెము పానకము నిమ్మపండు కిత్తలిపండు మాదీఫలము మంచివాసనగల పువ్వులు గోపిచందనము శంఖము దేవతార్చనపాత్రములు నల్లని సాలగ్రామము స్ఫటికలింగము విఘ్నేశ్వరప్రతిమ దుర్గప్రతిమ సూర్యకాంతమణితో చేయబడిన చండికావిగ్రహము వీనిని దానము చేయవలసినది. ఇట్లు నిత్యదానము చేయుచు స్నానము చేయునట్టి పురుషుడు వైకుంఠమునందు వాసము చేయగలడు. ఒకవేళ వైకుంఠ మునుపొందక మరల భూమియందు పుట్టినను గొప్ప చక్రవర్తియగును. కనుక దినమును వ్యర్థము చేయక యేవస్తువునైన దానము చేయవలసినది. మరియు మాఘమాసమునందు ప్రొద్దుపొడుచుచుండగా నియమముతో స్నానము చేసి దేవతలు మొదలగువారికి పువ్వులు నువ్వులు అక్షతలు మొదలగువానిచేత తర్పణము చేసి నిత్యకర్మలైన సంధ్యావందనము మొదలగువానిని జరిపి దర్భ మొదలగువానిచేత అగ్నిహోత్రము నుంచుటకు చక్కపరుపబడిన ప్రదేశములందుగాని ప్రతిమలయందుగాని ఆవాహనము ఆసనము పాద్యము అర్ఘ్యము మధుపర్కము స్నానము వస్త్రము ఉపవీతము గంధము పుష్పము అక్షతలు ధూపము దీపము నైవేద్యము తాంబూలము ప్రకాశించునట్టిభూషణములు

లోజ్జ్వలభూషణైః. వాద్యగీతై ర్నృత్తభేదైః పురాణస్తోత్రపాఠనైః, ఏవమాద్యుపచారైశ్చ పూజయేన్మాధవం నృప. ఉక్తదానాని పశ్చాత్తు దద్యాద్భక్త్యాతుహృష్టధీః, కర్మణానేనయోమాఘస్నానమాచరతేవ్రతీ. అసౌ పుణ్యకృతాం లోకాన్ ప్రాప్య భుక్త్వాచ పుష్కలాన్, భోగాన్ దివ్యాన్ పునర్భూమౌ సామ్రాజ్యపదమశ్నుతే. వసిష్ఠః. శృణురాజన్ పురావృత్త మాఖ్యానం కథయామి తే, రంగనారదసంవాదం తీర్థయాత్రాఫలప్రదమ్. రంగః. సందేహం హృది కృత్వాతు పృచ్ఛామి త్వాం మునీశ్వర, సర్వసాధనసంపన్నో ధనధాన్యసమృద్ధిమాన్. అసాధనోవిత్తహీనో స్వధర్మనిరతశ్శుచిః, తౌ కథం యాస్యతస్స్వర్గం తన్మే కథయ విస్తరాత్. నారదః. ధనదానేనధనవాన్ సాధనైర్బహుభిశ్చరన్, ధర్మం ధర్మభృతాంలోకాన్ క్రమేణాంహో వివర్జితః. స్థిత్వా సుచిరకాలంచ నివసేదింద్రసన్నిధౌ, నిర్ధనో వేదసంపన్నో శ్రుతవాన్ ధైర్యవాన్కృతీ.

---

వాద్యము గీతము నృత్యము పురాణము స్తోత్రపఠనము ఇవి మొదలగు ఉపచారములతో శ్రీవిష్ణుదేవుని తొలుత పూజించి పిమ్మట ముందు చెప్పినదానములను భక్తితోసంతోషించినబుద్ధిగలవాడై ఇయ్యవలెను. ఈచెప్పబడినవిధమున మాఘస్నానము చేయునట్టినియమముగల పురుషుడు తాను చేసిన పుణ్యకర్మలచేత పుణ్యాత్ములుపొందెడిలోకములను పొంది కొరతలేనివియు శ్లాఘ్యములైనవియు నయిన భోగములను అనుభవించి మరల భూమియందు సకలసామ్రాజ్యమును అనుభవించును. అనిచెప్పి వసిష్ఠుడు దిలీపునిజూచి మరియును చెప్పుచున్నాడు. ఓరాజా! తీర్థయాత్రాఫలమును ఇచ్చునట్టిదైన రంగనారద సంవాదమనెడు పురాతనకథయొకటి కలదు. దానిని చెప్పెదను వినుము. పూర్వకాలమునందు రంగడు అని ఒకరాజుకలడు. అతడు నారదునిచూచి ఓమునీశ్వరా! నామనస్సునందు నొకసందేహము కలిగి నిన్ను అడుగవచ్చితిని. ఏమి యనగా, లోకమునందు ఎల్ల సాధనములును ధన ధాన్యములసమృద్ధియు గలవాడు ఒకడు. ఏసాధనమును లేకయుం ధనములేకయు ఉండి తనధర్మమునందు అక్కరకలవాడును పరిశుద్ధుడును అగువాడు ఒకడు. ఈయిరువురును కడపట స్వర్గమును పొందుచున్నారు. ఇదియెట్లు నాకు సవిస్తరముగా తెలియచేయుము అని అడిగెను. నారదుడు చెప్పుచున్నాడు. ధనవంతుడగువాడు ధనము ఇచ్చుటచేతను అనేకసాధనములచేత అనేకధర్మకార్యములు నడపుటచేతను ధర్మాత్ములు పొందునట్టి పుణ్యలోకములనుపొంది క్రమముగా పాపములచేతవిడువబడినవాడై తరువాత చిరకాలమున స్వర్గమునందు ఇంద్రునిసన్నిధానముచేరి సుఖమును పొందుచుండును. ధనములేనివాడు వేదములను చదివి వేదశాస్త్రార్థములను విని తాలి

జితేంద్రియో జితక్రోధః స్వానుకూలకళత్రవాౕ, ఏవంవిధ సమా చారః కృఛ్రచాంద్రాయణాదిభిః. జపహోమసురార్చాభి ర్వేదపా రాయణేనచ, దానేన దయయా చైవ పరయా సర్వజంతుషు. మనసా కర్మణా వాచా పరోపకరణేనచ, ఖిన్నేషుదయయాచాపి ముదా సత్క ర్మశాలిషు. ఉపేక్షయాకుచేష్టాసు కామాదీనాందమేనచ, ఏవమాదిభిర న్యైశ్చ ధనసాధనవర్జితైః. ధర్మంచరన్దరిద్రోఽపి బ్రహ్మసాయుజ్యమాప్ను యాత్, అత్ర తే కథయిష్యామి పురాతనమనుత్తమమ్. సంచారం కస్య చిద్రాజ్ఞః కస్యచిద్బ్రహ్మవాదినః, రాజ న్సురేంద్రసరసి రాజానం ధర్మవా హనమ్. నృత్యమానంచాప్సరోభి ర్గీయమానంచ కిన్నరైః, దివ్యయోషి త్పరివృతం దివ్యాభరణభూషితమ్ ముక్తా వైడూర్యసన్నద్ధ దివ్యచ్ఛ త్రేణ రాజితమ్, మాణిక్యమయదండేన ధ్రియమాణంచ మూర్ధని. చా మరైర్ధూయమానంచ వీజ్యమానంచతైర్జనైః, ఏవంవిధమపశ్యం తం రా

---

మిగలవాడును విద్వాంసుడును ఇంద్రియములను కోపమును గెలిచినవాడును తనకు అను కూలముగా నడచునట్టి భార్యగలవాడునై కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు వ్రతములచేతను జపము హోమము దేవతార్చనము మొదలగువానిచేతను వేదమును నియ మముతో పఠించుటచేతను తనకు కలిగినట్లు దానము చేయుటచేతను ఎల్లజంతువులందును గల మేలయిన దయచేతను మనస్సు వాక్కు కర్మము అనెడి త్రికరణములతోను పరు లకు ఉపకారము చేయుటచేతను దుఃఖముచేత నొచ్చినవారియందలి దయచేతను మంచి పనులు చేయువారియందలి ఆనందముచేతను కుచ్ఛితపుపనులను చేయుటయందలి యుపే క్షచేతను కామక్రోధాదులను అణచుటచేతను ఇంకను ఇట్టి ధనసాధనముల ఆపేక్షలేని క్రియలచేతను ధర్మము నడుపుచు దరిద్రుడైనను బ్రహ్మసాయుజ్యమును బొందును. ఈవి షయమునందు పూర్వకాలమునందు దేవేంద్రునిసభలో బ్రహ్మవేత్తయైన యొకబ్రాహ్మ ణునికిని ఒకానొకరాజునకును సమానమర్యాద జరిగినకథ గలదు. దానిని నీకు తెలియ జెప్పెదను వినుము. నేను మునుపు ఒకానొకప్పుడు దేవేంద్రునిజూడవలెనను కోరిక చేత స్వర్గమునకుబోయి అచ్చటి దేవసభలో అప్సరసలు ఆడగా కిన్నరులుపాడగా దేవతాస్త్రీలచేత చుట్టుకోబడినవాడును దివ్యములైన సొమ్ములచేత అలంకరింపబడిన వాడును శిరస్సునందు ధరింపబడుచున్న కెంపులుచెక్కినకఱ్ఱగలిగి ముత్యాలువైడూర్య మణులు వీనిచేత సిద్ధముచేయబడినగొడుగుచేత ప్రకాశించువాడును ఆదేవతాజనముచేత వీవబడి కదలుచున్న వింజామరలుగలవాడును నయిన ధర్మవాహనుడనురాజును

నం లోకవిశ్రుతమ్ యదృచ్ఛయాహం సంప్రాప్త స్సురశ్రేష్ఠదిదృక్షయా, తత్రైవ తస్యాభిముఖం శ్రుతిపాలం ద్విజోత్తమమ్. ఇంద్రాది లోకపాలైశ్చ విశ్వాదిత్యమరుద్గణైః, గుహ్యకైః కిన్నరైశ్చైవ స్వర్గస్థై రఖిలైః స్తుతమ్. తేజసాచ శ్రియా కాంత్యా ఓజసాచబలేనచ, అతిక్రమ్య స్థితం రాజన్ రాజానం ధర్మవాహనమ్. తం చాపశ్యమహం రాజన్ శ్రుతిపాలం ద్విజోత్తమమ్. రంగః. శ్రుతిపాలో దరిద్రస్తు స రాజా ధర్మవాహనః, ధర్మవాహన నామాస్మిన్ సధర్మో లోకపూజితః సోపి ద్విజవరోలోకే కథం ధర్మం పరం లభేత్, ఏతదిచ్ఛా మ్యహం శ్రోతుం పరమంచ మహాద్భుతమ్. నారదః శృణు రాజన్ పురావృత్త మృషీభ్యశ్చ మయాశ్రుతమ్, సూర్యాన్వయే మహారాజో యజ్ఞసేనఇతిశ్రుతః యస్య యజ్ఞైర్దేవదేవః యజ్ఞసాహ్యపరోఽభవత్, ఇనేనసహితో యజ్ఞ మియాజ బహుదక్షిణమ్. యజ్ఞసేన ఇతిఖ్యాతిం తేన లోకే గతోన్నృప, తస్యభార్యా మహాభాగా పాతివ్రత్యశిరోమణిః, పృథుకీర్తిర్మహీంభర్తు స్సుతా

---

ఆరాజునకు ఎదురు మొగముగానుండిన శ్రుతిపాలుడను బ్రాహ్మణశ్రేష్ఠుని జూచితిని. ఆశ్రుతిపాలుడును ఇంద్రుడు మొదలుగాగలదిక్పాలకులచేతను విశ్వేదేవతలచేతను ద్వాదశాదిత్యులచేతను ఇంకను గలదేవతాసమూహములచేతను గుహ్యకులు కిన్నరులు మొదలుగాగల స్వర్గమందుగలవారు అందరిచేతను పొగడబడినవాడు. తేజస్సుచేతను సంపదచేతను కాంతిచేతను ఉత్సాహముచేతను బలముచేతను ధర్మవాహనరాజును అతిక్రమించియుండువాడు. ఇటువంటిమహిమగల శ్రుతిపాలుడనెడి బ్రాహ్మణశ్రేష్ఠుని నేను చూచితిని అనగా రంగడు ఓనారదమహామునీ! శ్రుతిపాలుడు దరిద్రుడు ధర్మవాహనుడు రాజు. లోకములచేత పూజింపబడువాడగు ధర్మవాహనుడు తనకుదగిన పుణ్యలోకమును పొందెను. ఆబ్రాహ్మణుడు లోకమునందు మిక్కిలి మేలైనపుణ్యమును ఎట్లుపొందెను. మిక్కిలి వింతయయినదియు శ్రేష్ఠమయినదియు నయిన యీకథను నేను వినగోరెదను చెప్పుము. అని యడుగగా నారదుడు, ఓరాజా! పూర్వము నేను ఋషులవలనగూడ వినిన యీకథను చెప్పెదను. వినుము. సూర్యవంశమునందుబుట్టిన యజ్ఞసేనుడనురాజు ఒకడుకలడు. అతడు యజ్ఞములుచేయుటచేత దేవతలకు దేవుడైన భగవంతుడు యజ్ఞములకు తోడు పడుటయందు అక్కరగలవాడాయెను. సూర్యునితో గూడినవాడై విశేష దక్షిణలు గలయజ్ఞములను చేసినమహారాజు అగుటచేత అతడు లోకమునందు యజ్ఞసేనుడు అనగా ప్రసిద్ధినొందెను. అతనిభార్య మిక్కిలి పుణ్యాత్మురాలు. పతివ్రతాత్వముచేత ఉత్తమురాలు. పృథుకీర్తియను మహారాజుకూతురు. ఆమె యీలోకమునందు ఈడు

సా ప్రతిమా భువి, యా సౌభాగ్యనిధిర్నామ లోకే సోమకళాభవత్. యజ్ఞసేనస్య తస్యాసీత్తస్యాం వై ధర్మవాహనః, యజ్ఞసేనే దివం యాతే యజ్ఞసోపానసత్పథా. ధర్మవాహ స్తతో రాజా బభూవాతీవ విశ్రుతః, కళానిధిరభూత్తస్య గృహిణీ సూక్ష్మమూర్ధజా. కిం వర్ణ్యతే ప్రతాపోఽస్య యస్య భూమిపతేర్నృప, యుద్ధ్యత స్సమరే శూరైర్ధర్మో వాహనతాం గతః వృషసేనస్సుత స్తస్య వృషాంకపరివాపరః, విధాయ యువరాజానం తం ప్రజారక్షణే రతమ్. భార్యయా సహ ధర్మాత్మా తీర్థయాత్రాం వినిర్గతః, ధర్మవాహనమారుహ్య తయా సాకం మహీపతిః. వాజపేయాశ్వమేధాభ్యాం తీర్థేతీర్థే యజన్సురాన్, దదౌ దానాని తీర్థేషు మహాదానాని షోడశ. ఏవం సంసారయుక్తోఽపి తీర్థయాత్రాం చకార సః, ఏతస్మిన్నేవ కాలే తు శ్రుతిపాలో ద్విజోత్తమః. శ్రీవత్సవంశజో విప్రః శ్రీవత్సాంకస్య వల్లభః, పుత్రశ్శతధృతేర్నామ శ్రుతిపాలో ద్విజోత్తమః. శ్రుతిలక్షణయా నామ్నా భార్యయా చ సుతేన చ, వేదకారేణ నామ్నా చ స్నుషయా శీలభూషయా. సుఖం చతుర్భిస్తీర్థాదీన్ పరిచక్రామ మేదినీమ్, ఉంఛవృత్త్యైవ తీర్థేషు వర్తనం చ ప్రవర్తయన్. కందమూల

---

లేనిది. మనోహరత్వమునకు నిధివంటిది ఆమె పేరు సోమకళ, ఆమెవలన యజ్ఞసేన మహారాజునకు ధర్మవాహనుఁడు పుట్టెను. అనంతరము యజ్ఞసేనుఁడు యజ్ఞములనెడి మెట్లవలన అనగా, యజ్ఞములు అనేకములు చేసినఫలమువలన ఆకాశమార్గమున స్వర్గలోకమునకుఁ బోయెను. అట్లు తండ్రి స్వర్గస్థుఁడు కాగా ధర్మవాహనుఁడు రాజై మిక్కిలి ప్రసిద్ధివహించి కళానిధియను కన్యకను పెండ్లాడెను. ఆధర్మవాహనుని ప్రతాపము ఏమి చెప్పవచ్చును. అతఁడు శూరులగు వారితో యుద్ధము చేయునపుడు అతనికి ధర్మదేవతయే వాహనమైయుండును. అట్టి ఆరాజునకు రెండవవిష్ణువో అనదగిన వృషసేనుఁడు అనెడి కొడుకు కలిగెను. ఆకుమారునికి తగిన వయసురాగానే అతనిని యువరాజుగాచేసి ప్రజలను పాలింపనియమించి ధర్మవాహనుఁడు భార్యతోఁగూడ తీర్థయాత్ర చేయ బయలుదేరి భార్యయు తానును ధర్మవాహనమునెక్కి సంచరించుచు ప్రతితీర్థమునందును వాజపేయము అశ్వమేధము అనుయజ్ఞములచేత దేవతలను ఆరాధించుచు షోడశమహాదానములుచేయుచు ఈవిధముగా సంసారమును వదలకయే తీర్థయాత్ర చేసెను. ఆ కాలమునందే శ్రీవత్సవంశమున బుట్టిన శతధృతి యనువానికొమారుఁడును విష్ణుభక్తుఁడునైన శ్రుతిపాలుఁడను బ్రాహ్మణుఁడు శ్రుతిలక్షణ అనెడిభార్యతోను వేదకారి అను కొమారునితోను శీలభూష అనెడి కోడలితోను గూడి భూమియందుఁగల పుణ్యతీర్థముల నెల్లను సేవింప బయలుదేరి పంటచేలలో పరిగయేరుకొనుటచేతను కందమూలఫలములచేతను దేహ

ఫలాహారో భార్యాపుత్రస్నుషాన్వితః, త్రికాలమర్చయన్విష్ణుం జుహ్వన్నగ్నీంశ్చ సంధ్యయోః. తీర్థేతీర్థే చోపవసన్ జపన్మంత్రాంస్తు సిద్ధిదాన్, కృతత్రిషవణస్నానో ధ్యానయోగపరాయణః. అక్రోధనక్షమాసారః సర్వభూతదయాపరః, ఏవం యుక్తసమాచారః తీర్థయాత్రాం చకార సః. అనంతరం ధర్మవాహా స్తీర్థయాగ తపోవ్రతైః, పూతో విస్తార్య యశసా యయౌ నాకం జగత్త్రయమ్. శ్రుతిపాలోఽపి రాజేంద్ర తీర్థయాత్రాం చరన్సదా, భూమిం ప్రదక్షిణం కుర్వన్ ససుతస్త్రీస్నుషాన్వితః. స ప్రాప బ్రహ్మణో లోకం భార్యాపుత్రస్నుషాన్వితః, తత్ర కల్పముషిత్వాతు బ్రహ్మణా పరిమోదితః. తస్మాత్ప్రాప హరేర్లోకం వైకుంఠం విష్ణువల్లభమ్, ఉషిత్వా తత్ర కల్పంహి తతః కైలాసమభ్యగాత్. తత్ర కల్పముషిత్వాతు బలభిత్సదనంగతః, తత్రాప్యభిముఖో రాజ్ఞస్సముచ్ఛ్రితమహాసనే. దివ్యస్త్రీభిః పరివృతో దివ్యభోగసమన్వితః, అర్చ్యమాన స్సురేంద్రేణ కామధేనుప్రసూతిభుక్. తౌ మాఘజప్రభావేన సురేశాలయమాలయమ్. ఊషతుర్ముదితౌ తత్ర మయా దృష్టౌ నరోత్తమ,

---

పోషణముచేసికొనుచు ప్రతిదినము ప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము అనెడి మూఁడుకాలములయందును అగ్నిహోత్రములు చేసి శ్రీవిష్ణుదేవుని ఆరాధించుచు యాత్రాసిద్ధిని గలుగజేసెడి మంత్రములను జపించుచు ప్రతితీర్థమునందును ఉపవాసవ్రతమును జరుపుచు మూఁడుకాలములందును స్నానముచేసి యోగమును పూని కోపములేనివాఁడును ఓర్పుగలవాఁడును ఎల్లప్రాణులయందును దయగలవాఁడును అయి ఇటువంటి నడవడితో తీర్థయాత్ర చేసెను. పిమ్మట ధర్మవాహనుఁడు తీర్థయాత్రలు యాగములు తపస్సులు వ్రతములు అనువీనిచేత పరిశుద్ధుఁడై మూఁడులోకములయందును తన కీర్తి వ్యాపింపగా స్వర్గమునకుఁ బోయెను. శ్రుతిపాలుఁడు ఎల్లప్పుడుతీర్థయాత్ర చేయుచు పెండ్లాము కొడుకు కోడలు వీరితోడ భూప్రదక్షిణము చేసి ఆ పెండ్లాము కొడుకు కోడండ్రతోడ బ్రహ్మలోకమును పొంది అచ్చట కల్పము (బ్రహ్మకు ఒకదినముఅగునంత వరకును) ఉండి బ్రహ్మచేత సెలవుపుచ్చుకొన్నవాఁడై అక్కడనుండి వెడలి విష్ణులోకమైన వైకుంఠమునకు పోయి అచ్చటను ఒకకల్పము వాసముచేసి అవతల అందుండి కైలాసమునకు పోయి అక్కడ ఒకకల్పము గడపి అక్కడనుండి ఇంద్రలోకమునకు వచ్చెను. ఇట్లు ఇంద్రలోకమునకు వచ్చినశ్రుతిపాలుఁడు మిక్కిలి ఉన్నతమైనపీఠమునందు ధర్మపాలునికి ఎదురుగా కూర్చుండి దేవతాస్త్రీలచేత చుట్టుకొబడినవాఁడును దేవభోగములతోఁగూడినవాఁడును దేవేంద్రునిచేత పూజింపఁబడినవాఁడును కామధేనువువలన బుట్టినపదార్థములను భుజించువాఁడును నైయుండెను. ఇట్లు ఆయిరువురు మాఘస్నా

తస్మాత్త్వమపి రాజేంద్ర తీర్థయాత్రాం సదా కురు. మాఘస్నానం కురుష్వ త్వం పుణ్యతీర్థేష్వినోదయే, జానన్మాఘజపుణ్యస్య ప్రభావం నృపవిప్రయోః. దదస్వాన్నం నరవ్యాఘ్రి మాఘమాసే విశేషతః, పూజయ త్వం హరం విష్ణుం భక్త్యా భేదనవస్తుతః.తీర్థయాత్రాఫలేనైవ మాఘస్నానఫలేనచ, అక్షయం స్వర్గమాప్నోతి శివస్య వచనం యథా. వసిష్ఠః. శ్రుత్వా తస్య మునేర్వాక్యం నారదస్య మహాత్మనః,సరంగో నృపశార్దూలో భువి తీర్థాని సంచరన్. కేదారే సమ్మృతస్స్వర్గం యయౌ పుత్రాదిసంయుతః, ఏవం త్వమపి రాజేంద్ర మాఘస్నానసముద్భవమ్.జాన న్పుణ్యప్రభావంచ మాఘస్నానం సదా కురు, యః పఠేదిదమధ్యాయం పురాతన మనుత్తమమ్. విప్రాణాం సన్నిధౌ మాఘే సర్వతీర్థఫలం లభేత్, ఇమం యశ్శృణుయా న్నిత్యం ధర్మసారసముచ్చయమ్. అధ్యాయం జపవేళాంతే ప్రాప్నుయాద్ధర్మసంచయమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, తీర్థయాత్రాఫల వివరణం నామ ద్వావింశోఽధ్యాయః.

---

నమువలని ప్రభావముచేత స్వర్గమేయిల్లుగా అచ్చటనే సంతోషముగా కాలముగడపుచునాకు కానబడిరి. కావున ఓరాజా! నీవును సదా తీర్థయాత్ర చేయుము. సూర్యోదయకాలమునందు పుణ్యతీర్థములలో స్నానముచేయుము.మాఘమాసమున గలిగినపుణ్యముచే రాజును బ్రాహ్మణుఁడును పొందినమహిమను తలచుకొనుచు మాఘమాసమునందు విశేషముగా అన్నదానము చేయుము. భక్తితో భేదబుద్ధిలేక శివుని విష్ణువును ఆరాధింపుము. శివునిమాటమేరకు తీర్థయాత్రాఫలముచేతను మాఘస్నానఫలముచేతను ఎప్పుడు నశింపని స్వర్గలోకము కలుగును.

వసిష్ఠునిమాటలు. ఓదిలీపమహారాజా! మహాత్ముడైన నారదమహామునిచెప్పినమాటలను ఆరంగడు అనురాజు విని కొడుకులు మొదలగువారితోడ బయలుదేరి తీర్థయాత్ర చేయుచు కేదారక్షేత్రమునకుపోయి అచ్చటమృతినొందినవాఁడై స్వర్గమునుపొందెను. కనుక నీవును మాఘమాసమువలని పుణ్యప్రభావమును ఎరిగినవాడవై ఎప్పుడును మాఘస్నానముచేయుము. పురాతనమును సర్వోత్తమమునయిన యీయధ్యాయమును బ్రాహ్మణులసన్నిధానములో మాఘమాసమునందు ఎవడు చదువునో వానికి ఎల్లతీర్థములను సేవించినఫలము కలుగును. ధర్మసారముయొక్క రాశియైన యీయధ్యాయమును జపముచేసికొగానే ఎవడుప్రతిదినమును తప్పక వినునో వాడు ఎల్లపుణ్యములను పొందును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు తీర్థయాత్రాఫలమును వివరించునదియైన ఇరువదిరెండవఅధ్యాయకథ.

## త్రయోవింశోఽధ్యాయః.

వసిష్ఠః.—మాఘస్నానం మనుష్యాణాం కిం కిం నకురుతే యతః, పుత్రమిత్రకళత్రార్థరాజ్యస్వర్గఫలప్రదమ్. న మాఘాత్పరమో ధర్మో నార్థో మాఘాత్పరంతపః, కామో నమాఘాదపరో మోక్షో మాఘాత్పరో నహి. ఇయమేవ పరాహాని రుపసర్గోఽయ మేవహి, అభాగ్యః పరమం చైతన్మాఘస్నానంనయశ్చరేత్. దోషాః ప్రశమనం యాంతి మాఘస్నానాదినోదయే, పాతకాన్యపిపూర్వాణి సంకీర్ణాని నృపోత్తమ. పాతకాన్యానుపూర్వాణి విలయం యాంతి మాఘతః, అహో పుంసామహో మోహా అహో పుంసాప్రమాదతః. అస్నాత్వా మాఘమాసే యే యదన్యత్రకృతశ్రమాః, ఇదమేవహిమాంగల్య మిదమేవజనావనమ్. జీవితంసఫలంచైతన్మాఘే స్నాతిహిమానవః, సౌభాగ్యంచ మహాపుణ్యం మాఘస్నానసముద్భవమ్ అచింత్యవైభవంచిత్రం మహదాశ్చర్యమద్భుతమ్, పురాకశ్చిద్ద్విజోవిద్వాన్ సువ్రతోనామపాపకృత్. సపశ్చాచ్చర

---

### ఇరువదిమూడవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓదిలీపమహారాజా! మాఘస్నానము మనుష్యులకు కొడుకులను స్నేహితులను పెండ్లాలను ధనమును ప్రభుత్వమును స్వర్గమును కలుగజేయునదియైయుండగా మరిదేనిని కలుగజేయదు. అన్నిటిని కలుగజేయనేచేయును. మాఘమునకంటె అన్యముగా కామముగాని మోక్షముగాని లేదు. మాఘస్నానము చేయకపోవుటయే గొప్పచెరుపు. అదియే అపశకునము. అదియే గొప్పఅదృష్టహీనత. ప్రొద్దుపొడుపునందు లేచి చేయునట్టి మాఘస్నానమువలన దోషములు అన్నియు అణగిపోవును. పూర్వజన్మమునందు చేయబడి పెనచికొనియుండు పాపములును ఈజన్మమునందు చిన్నప్పటినుండి అనుసరించివచ్చిన పాపములును మాఘస్నానమువలన నాశము పొందును. ఔరా! లోకమునందలి జనుల అజ్ఞానమేమనవచ్చును. పరాకుపడినవారై మాఘమాసమునందు స్నానముచేయక ఇతరవిషయములయందు పాటుపడుచున్నారు. ఇకనైన మానవులు ఎచ్చరిక కలిగి మాఘస్నానము చేయవలసినది. ఇదియే మేలు. ఇదియే జనులకురక్షకము. దీనిచేత జన్మము సఫలమగును. మాఘస్నానమువలన గలిగెడి గొప్పపుణ్యమును సుభగత్వమును ఎంచతరముగాని మహిమ గలిగినవియు మాయగాలోచునవియు, మిక్కిలి వింతయైనవియు మనోహరమైనవియు నైయుండును. పూర్వకాలమునందును సువ్రతుడను పేరుగల బ్రాహ్మణుడు విద్వాంసుడై యుండియు పాపములుచేసి ముసలివాడయిన పిమ్మట

మేభాగే పశ్చాత్తాపసమాకులః, నర్మదాయాం మహానద్యాం దశాహ స్నానమాత్రతః. సప్తమన్వంతరం స్వర్గ మధ్యవాస సమృద్ధిమాన్, పునర్భూత్వా ద్విజో జజ్ఞే ప్రయాగం ప్రాప్యపుణ్యకృత్. మాఘస్నానం చకారైకో యథావన్నియమేస్థితమ్, తేన బ్రహ్మపదం ప్రాప్య తత్రకల్పం వ్యవస్థితః. భూమ్యాంపునర్ద్విజో భూత్వా నిజానుష్ఠానతత్పరః, కాశ్యా మవాపమరణం విశ్వనాథస్య సన్నిధౌ. తత్క్షణాదేవ విప్రోఽసావాప సాయుజ్య ముత్తమమ్. దిలీపః. కదావా సువ్రతో నామ్నా విద్వానపి విచక్షణః, పశ్చాత్తాపం కథం తస్య పాపకర్మం తతఃకథమ్. వసిష్ఠ వద విస్తార్య శ్రోతుం కౌతూహలంహి మే. వసిష్ఠః. శృణు రాజన్ప్రవక్ష్యామి సువ్రతస్య విచేష్టితమ్, శృణ్వతాం చైవ మర్త్యానాం సద్యః పాపహారం శుభమ్. అగ్రహారో మహానాసీ త్తళంగ ఇతి విశ్రుతః, నర్మదాయా స్తటే మధ్యే వేదవిద్భిరధిష్ఠితః. తృణైః కాష్ఠైః ఫలైః పర్ణైస్సమిత్పుష్ప కుశోదకైః, సంపూర్ణ స్సర్వసస్యైశ్చ నానాధాన్యై ర్విశేషతః. తటా

---

పశ్చాత్తాపమును బొందినవాడై గొప్పయేరైన నర్మదయందు పదిదినములు మాఘస్నానము చేసినమాత్రముచేతనే ఏడుమన్వంతరములకాలము మహావైభవముతో స్వర్గమునందుండి మరల భూలోకమునందు బ్రాహ్మణుఁడుగా పుట్టి ప్రయాగమునకుబోయి మాఘస్నానము చేసి తగిననియమముతో వర్తించి అందువలని పుణ్యముచేత బ్రహ్మలోకమును పొంది అక్కడ ప్రళయపర్యంతము ఉండి, పిమ్మట మరల భూమియందు బ్రాహ్మణుఁడై పుట్టి తానునడపవలసిన అనుష్ఠానములను నియమముతప్పక నడిపి కాశికిపోయి విశ్వనాథస్వామిసన్నిధిలో ప్రాణములు విడిచి అప్పుడే సర్వోత్తమమైన శివసాయుజ్యమును పొందెను.

దిలీపునిమాటలు. ఓవసిష్ఠమహామునీ! సువ్రతుఁడనువాఁడు ఎక్కడ నుండెను? చదువుకొన్నవాఁడును తెలిసినవాఁడును అయియుండి పాపకృత్యములు ఎట్లు చేసెను? పిమ్మట ఎట్లు పశ్చాత్తాపమును పొందెను? ఇదియంతయు చక్కగా వినవలెనను వేడుక నాకు కలదు. దానిని విశదముగా తెలియఁజెప్పుము.

వసిష్ఠునిమాటలు. ఓ రాజా! సువ్రతునియొక్కచరిత్రమును చెప్పెద వినుము. అది వినువారిపాపములను వినునప్పుడే పోగొట్టునట్టి మంచిచరిత్రము. నర్మదానదిగట్టున వేదములు తెలిసినవారికి ఉనికిపట్టయి తళంగము అని ప్రసిద్ధివహించిన గొప్ప అగ్రహారము ఒకటి కలదు. అదిగడ్డిదినుసులచేతను పంటచెరుకులచేతను పండ్లచేతను ఆకులచేతను సమిధలచేతను పువ్వులచేతను దర్భలచేతను నీళ్లచేతను నిండుకొన్నదియు ఎల్లపైరుల

కారామ సంపూర్ణ స్సుపుష్టైర్గోధనై రపి, ఆహితాగ్నిభి రప్యన్యైః పంచయజ్ఞపరైర్ద్విజైః. ధార్మికైస్తుములో విప్రై ర్ధనధాన్యసమాకులః, వేదఘోషేణ మహతా దిశో ముఖరయత్యపి. తస్మిన్నభూద్ద్విజవర స్సువ్రతోనామ పార్థివ, అధ్యైష్టవేదా నఖిలాన్ వేదీ వేదార్థమేవచ. ధర్మశాస్త్రార్థసంపన్నః పురాణేషు విచక్షణః, అంగాన్యధీత్య తర్కంచ జ్యోతిశ్శాస్త్రం తథైవచ. మీమాంసాద్వయమాలోక్య గీతశాస్త్రం విగాహ్యచ, ఆయుర్వేదం విగాహ్యాపి నృత్తశాస్త్రే కృతశ్రమః. అర్థశాస్త్రం సమాలోక్య శిల్పశాస్త్రం తథైవచ, గజాశ్వశాస్త్రమాలోక్య చతుష్షష్టికలా స్తథా. మంత్రశాస్త్రం తథా సాంఖ్యం యోగశాస్త్రం తథైవచ, నానాదేశలిపిశ్చైవ నానాభాషా స్తథైవచ. ధనార్జనార్థమేతాని తేనాధీతాని సర్వశః, తత్తద్గురుభ్యోనప్రాదాద్దక్షిణాం లోభమోహితః, ఆర్జయామాస కతిచిద్ధనధాన్యై రుపాయవిత్, అన్యాయతోఽర్థ

---

చేతను అనేకవిధములైన ధాన్యములచేతను విశేషించినదియును చెరువులు తోపులు చక్కగా బలిసిన ఆవులమందలు వీనిచేత నిండినదియు, ఆహితాగ్నులు (అగ్నిహోత్రముల నుంచుకొన్నవారు) అగువారును పంచయజ్ఞములను నడపుటయందు అక్కరగల యితరులునైన బ్రాహ్మణులచేతను ధర్మాత్ములైన బ్రాహ్మణులచేతను సందడించునదియు, ధనధాన్యములచేత నిండుకొన్నదియు మిక్కుటమైన వేదఘోషముచేత దిక్కులయందు ప్రతిధ్వని పుట్టించునదియునై యుండును. ఆయగ్రహారమునందు సువ్రతుడను బ్రాహ్మణశ్రేష్ఠుడుగలడు. అతడు ఎల్ల వేదములనుచదివి వేదార్థములను తెలిసికొన్నవాడును ధర్మశాస్త్రములను వానియర్థములను తెలిసికొన్నవాడును పురాణములయందు సమర్థుడును నై వేదాంగములైన శిక్షవ్యాకరణాదులును, తర్కము, జ్యోతిషశాస్త్రము, పూర్వమీమాంసాశాస్త్రము, ఉత్తరమీమాంసాశాస్త్రము, సంగీతశాస్త్రము, నృత్తశాస్త్రము, నీతిశాస్త్రము, శిల్పశాస్త్రము, గజశాస్త్రము, అశ్వశాస్త్రము మొదలగుశాస్త్రములనెల్లను అభ్యసించి అరువదినాలుగు కలలను నేర్చి మంత్రశాస్త్రమును చదివి సాంఖ్యశాస్త్రమును (తత్త్వసంఖ్యను తెలుపునట్టిశాస్త్రము) యోగశాస్త్రమును (యమనియమాదియోగములను తెలిపెడిశాస్త్రము) అలవాటుచేసికొని అనేకదేశములభాషలను వ్రాయను చదువను నేర్చెను. ఇట్లు ధనము సంపాదించుటకు కావలసినవానినెల్లను అభ్యసించియు లుబ్ధత్వముచేత ఆయాగురువులకు దక్షిణలు ఇయ్యక కొన్నియుపాయములచేత ధనమును ధాన్యములను సంపాదించి లోభియగుటచేత అంతటితో తృప్తిపొందక అన్యాయకృత్యములచేతనుగూడ ద్రవ్యమును ఆర్జింపనారంభించెను. ఇట్లు అనగా

లుబ్ధాత్మా కరోతిచ ధనార్జనమ్. ఏకోద్దిష్టం నవశ్రాద్ధం నగ్నప్రచ్ఛాదనం తథా, ఆర్ద్రం కృష్ణాజినం చైవం మహిషీం చోభయతోముఖీమ్. యానికానిచ దానాని దుర్దానానిచ నిత్యశః, ఆపణ్యవిక్రయం చక్రే తథాచారణ్యవిక్రయమ్. చండాలాద్యైరపి తథా ప్రతిగ్రహపరోఽభవత్, కన్యకావిక్రయం చక్రే గాం గృహీత్వాచ విక్రయమ్. తిలానాం తండులానాంచ సర్పిస్తైలాది విక్రయమ్, పరార్థే తీర్థగమనం పరార్థే దేవతార్చనమ్. భృతకాధ్యాపనం చైవ భోజనం పరవేశ్మని, లవణ క్షీరపక్వాన్న పానీయదధివిక్రయమ్. ఇత్యాదిభిర్బహూపాయై ర్ధనం సంపాద్య యత్నతః, నిత్య. నైమిత్తికం త్యక్త్వా న భుఙ్క్తే న దదాతిచ స్వధనంగణయామాసకియదస్తీతికర్హిచిత్, సహస్రశతనిష్కాణాం తేనార్జితమభూద్ధనమ్. ఏవంధనార్జనపరో జరయా జర్ఝరీకృతః, ఇంద్రియాణ్యపి సర్వాణి మందీభూతాని కాలతః. ఏవంబహుధనో విప్రోనభుఙ్క్తేనదదాతిచ, అశనాచ్ఛాదనక్లిష్టా భృత్యవర్గాభృశాతు

---

ఏకోద్దిష్టశ్రాద్ధముచు నవశ్రాద్ధమును నగ్నశ్రాద్ధమును తీసికొనియు, తడిపిన కృష్ణాజినదానము ఈనుచున్నబఱ్ఱెదానమును ఇంకనుగలతీసికోరానిచెడ్డదానములనెల్లను ఎల్లప్పుడు తీసికొనుచువచ్చియు, అంగడిపెట్టి బేరమాడియు, అడవులు నరకించి అమ్మియు మాలవాడు మొదలుగా ఎవరు ఏదానము ఇచ్చిన పుచ్చుకొనియు, కన్యకలనుఅమ్మియు, గోదానము పుచ్చుకొని తెచ్చిఅమ్మియు, నెయ్యినూనె మొదలగువానిని అమ్మియు, ఒకరికిగాను తీర్థయాత్ర చేసియు, ఒకరికిగాను దేవతార్చన చేసియు, జీతముపుచ్చుకొని వేదమును చదివించియు ఎప్పుడును అన్యులఇండ్లలోనే భోజనము చేసియు, ఉప్పు పాలు అన్నము నీళ్లు పెరుగు ఇట్టివస్తువులను అమ్మియు, ఇట్లు అనేకవిధములచేత నిత్యమును చేయదగిన స్నానము సంధ్యావందనము మొదలగుకర్మములను నిమిత్తమాత్రముచేత చేయదగినవైనశ్రాద్ధము మొదలైనకర్మములనువిడిచి సంపాదించికూడబెట్టినధనమును ఒకరికియ్యకయు తానుఅనుభవింపకయు అప్పుడప్పుడు ఎంతఉన్నదిఅని చేరినధనమునులెక్కపెట్టుచురాగా, తుదకు అతనిచేత ఆర్జింపఁబడినధనమంతయు నూరువేలవరహాలుఆయెను. ఈవిధముగా ధనమును సంపాదించుచు ముసలివాడై దేహముసడలగా కాలక్రమమున ఇంద్రియపటుత్వమును తగ్గగా, అనగా కన్నుకానరాకయు చెవులువినరాకయు కాళ్లునడవరాకయు చేతులతో పనులు చేయరాకయుం పోగా, మిక్కిలి ధనము గలవాడుగానుండియు తానుకడుపునకుతినకయు ఒకరికిపెట్టకయు కాలముగడపుచుండెను. అతనికొలువుడుకాండ్రందరుఅన్నవస్త్రములకు లేక మిక్కిలికష్టపడుచుఆకలిబాధవలనప్రతిదినమునుఅతనినితిట్టుచుందురు. మరియు

రాః. తంశపంతి ప్రతిదినం క్షుత్పీడాపరిబాధితాః, అశక్తః పునరుత్థాన గమ
నాగమనేషుచ. పునర్ధనార్జనాభావా త్సదా రోదితి దుఃఖితః, శయానఏవ
శయనే సర్వాన్స పతి వైరుషా. నశ్యత ధ్వంసత క్షిప్రం గచ్ఛత మ్రియతా
ధునా, నభుంజత నశక్నోమి వీక్షితుం భుంజతో మనాక్. ఇత్యాదిపరుషై
ర్వాక్యైర్మర్మభేదిభిరన్వహమ్, తుదత్యసౌ సుతాన్భ్రాతౄన్ భార్యాం
ప్రాణసమామపి. సమ్యక్సక్త్వాచ తేసర్వే భుంజతే క్రోశతః పురః, అనాదృ
త్యవచ స్తస్యమామేతి బ్రువతో ముహుః. శయానశ్శయనే విప్రో దంతా
కటకటాప్యచ, దీర్ఘముష్ణం వినిశ్వస్యవ్యదశద్రశనచ్ఛదమ్. భుంజంతశ్చహ
సంతశ్చ పిబంతశ్చ యథేచ్ఛయా, అపాంగవీక్షణేనాపి తం నేక్షంతేభృ
శాతురమ్. అసోఢమాన స్తత్సర్వ ముద్యహాం క్రోశనిస్వనమ్, ఏవమాకుల
చిత్తస్య వివేకః క్వచిదుత్థితః. అసత్ప్రతిగ్రహైశ్చైవ పుణ్యానాం చైవ
విక్రయైః, మయాతపో విక్రయాద్యై రేతద్ధనముపార్జితమ్. అద్యాపి శాంతి

అతడు ముసలివాడైనందున కూర్చుండి మరల లేచుటకును అటుఇటు తిరుగుటకును శక్తిలేని
వాడై మరిమరి ధనసంపాదనము లేకపోవుటవలన ఎల్లప్పుడు దుఃఖపడుచు ఏడ్చుచు పడక
యందు పండుకొనియే యింటనుండు వారినందరిని మీరు శీఘ్రముగా చెడిపొండి పాడైపొండి
ఎక్కడికైనపరుగెత్తిపొండి ఇప్పుడేచచ్చిపొండి నాసొత్తు మీరు తినకుడు. మీరు తినుచుం
డగా నేను కొంచెమైనను చూడలేను. అని యిటువంటి మర్మమును నాటునట్టి కఠినపుమా
టలచేత ప్రతిదినము కోపముతో తిట్టుచుండును. మరియు అతడు తనప్రాణమువలె ఆదరింప
దగిన పెండ్లామును కొడుకులను తోడబుట్టినవారిని తిట్టుచు పీడించుచుండగా వారు అందరు
ను ఎదుట మొరపెట్టుకొనుచుండెడి అతని మాటలను లక్ష్యము చేయక యిటువంటి మాటలు
పలుమారు చెప్పుట నీకు తగదు అని చెప్పుచు సకలపదార్థములను తెచ్చుకొని చక్కగా వండి
భోజనము చేయుచుందురు. అటువంటి సమయములయందు ఆ బ్రాహ్మణుడు పరుపునందు పం
డుకొని కటకట పండ్లు కొరుకుచు వేడి నిట్టూర్పులు విడుచుచు పెదవి కొరుకుకొనుచుండును.
ఆకొడుకులు మొదలగువారు అతనిని జూచినవ్వుచు ఇష్టము వచ్చినట్లు భోజనములు చేసి దప్పి
కలు త్రాగి అతని అవస్థను కడకంటి చూపులతోనైన ఆదరించి చూడకుండుదురు. ఇట్లు వారు
చేయుచున్నట్టి కృత్యములను సహింపక గొప్పచప్పుడు కలుగునట్లు గొంతెత్తి యేడ్చును. ఇట్టి వ్యా
కులము నొందిన మనస్సుగల ఆ బ్రాహ్మణునికి ఉన్నట్టుండి ఒక వివేకము కలిగెను. అంతట అతడు
తీసికోరాని చెడ్డదానములను తీసికొనుట చేతను పుణ్యములను విక్రయించుట చేతను తప
స్సును విక్రయించుట చేతను ఈ ధనము నాగుండ సంపాదింపబడినది. ఇప్పుడును నాకు

రో త్ప్రాన్న మమ తృష్ణాతిదుస్సహా. మేరుతుల్యసువర్ణాని అసంఖ్యాతాని వాంఛతి, అహో మనో మహాకష్టం సమస్తక్లేశకారణమ్. సర్వాన్ కామానవాప్యాపి పునరన్యాంశ్చ కాంక్షితః, జీర్యంతే జీర్యతః కేశా దంతాజీర్యంతిజీర్యతః చక్షుశ్శ్రోత్రంచజీర్యేతే తృష్ణైకాతరుణాయతే, మమేంద్రియాణిసర్వాణిమందభావం వ్రజంతిహి. బలంవిత్తంచజరసా తృష్ణాతరుణతాంగతా, త్యజంతిజీర్ణంలోకాశ్చ సుతాజీర్ణం త్యజంతిచ. సర్వేజీర్ణం త్యజంతీహ జీర్ణస్య నకుత స్సుఖమ్, సర్వేచాశానుబంధేన లఘుతాం యాంతి మానవాః. కష్టాశా వర్తతే యస్య స విద్వానప్యపండితః, నచ శాంతః ప్రమన్యుస్స్యా ద్ధీమానప్యతిమూఢధీః. శీలవా నప్యశీలస్య గుణవానపి నిర్గుణః, ఆశాభంగకరీ పుంసా మాశా జ్ఞేయాగ్ని సన్నిభా. సర్పిషా కాష్ఠభారేణ వర్ధ తేఽగ్నిశిఖాయథా, ఉపభోగేన కామేన హ్యాశా చోపరి వర్తతే. తామాశాం వహతః పుంస స్సుఖం

---

ఊరటగలుగలేదు. నాయాశ మిక్కిలియు సహింపరానిదిగానున్నది. మేరుపర్వతమువలె రాశిగానుండెడి లెక్కలేని వరహాలను నామనసు కోరుచున్నది. ఔరా! మనసు ఎంత చెడ్డది. ఎల్లదుఃఖములకు కారణమగుచున్నది ఎల్లకోరికలను పొందియు మరల నొకక్రొత్త కోరికను కోరుచున్నది. నేను ముసలివాఁడను అగుచుండగా వెండ్రుకలు ముడిసి నరయుచున్నవి. పండ్లుముడిసి రాలిపోవుచున్నవి. కన్నులు ముడిసి కానరాకపోవుచున్నవి. చెవులు వినబడకపోవుచున్నవి. ఇన్నియు నిట్లయినను ఆశయనునది ఒకటిమాత్రము మంచి వయసుగలిగియున్నది. నాయింద్రియములన్నియు మాంద్యమునుబొందినవిగదా యనిన ఆశ మాత్రము అట్టిది గాక వయసుపొందినదై యున్నది. ముసలితనముచేత బలముగూడ విడువబడుచున్నది. ముసలివానిని లోకులందరు విడుచుచున్నారు. అట్లు కొడుకులు చుట్టములు మొదలగువారందరు విడిచిపెట్టునట్టిముసలివానికి ఈలోకమునందు సుఖమెక్కడిది. సర్వజనులును ఆశయొక్కసంబంధముచేతనే చిన్నతనమును పొందుచున్నారు. నీచమైన ఆయాశ యెవనికి గలదో వాఁడు విద్వాంసుఁడుగానున్నను అవివేకియు తిన్ననివాఁడయినను మిక్కిలికోపముగలవాఁడును బుద్ధిమంతుఁడైనను బుద్ధిహీనుఁడును మంచినడవడిగలవాఁడైనను చెడ్డనడవడిగలవాఁడును మంచిగుణములు గలవాఁడైనను మంచిగుణములు లేనివాఁడును అగును. మనుష్యులకు కీడుగలిగించునది గనుక అది నిప్పువంటిదని తెలిసికోవలసినది. కట్టెలమోపు నెయ్యి ఈరెంటిచేతను నిప్పుమంట యెట్లువృద్ధిపొందునో అట్లు అనుభవించెడి కోరికచేత ఆశ మీదమీద పెరుగుచుండును. కాబట్టి ఆయాశను వహించిన పురుషునకు మూఁడులోకములయందును సుఖములేదు. ఆయాశను విడిచినమనుష్యునకు ఎల్లయెడలను

నాస్తి జగత్త్రయే, తామాశాం త్యజతః పుంస స్సర్వత్ర సుఖమేధతే. తస్మాదాశాం త్యజేత్ప్రాజ్ఞః యదిచ్ఛేచ్ఛాశ్వతం పదమ్, అలం తేజో యశశ్చైవ విద్యామానంచ విశ్రుతమ్. తథైవ సత్కులం జన్మ ఆశా హంత్యతివేగతః, ప్రాణా మాశాభిభూతానాం మాత్సర్య మిహ ఉద్యతే. కించిద్దత్వాపి చండాలోపి స్వాత్మ్యాదధికతాం గతః, ఆశాభిభూతా యే మర్త్యా మహామోహసముత్థితాః అవమానాదికం దుఃఖం న జానంత్యంతమప్యహో, మయా ప్యేవం బహుక్లేశై రేతద్ధనముపార్జితమ్, శరీరమపి జీర్ణంచ జరసా విహృతం బలమ్. ఇతః పరం యతిష్యామి పరలోకార్థమాదరాత్, ఏవం నిశ్చిత్య విప్రేఽస్మి న్ధర్మమార్గోత్సుకే సతి.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, సువ్రత
చరితంనామ త్రయోవింశోఽధ్యాయః.



---

సుఖము కలుగును. కాబట్టి ఎవడు శాశ్వతమైన పరమపదమును పొందగోరునో అట్టి బుద్ధిమంతుడు అగువాడు ఆశను విడవవలసినది. మిక్కుటమైన తేజస్సును కీర్తిని చదువును గొప్పతనమును ప్రసిద్ధిని సత్కులమునందు బుట్టుటను ఆశ అనునది అతిశీఘ్రముగ చెడగొట్టును. ఈలోకమునందు ఆశచేత తిరస్కరింపబడిన మనుష్యులకు మాత్సర్యము పుట్టును. చండాలుడు కొంచెము ఇచ్చినను తామిచ్చుటకంటె హెచ్చుగా నెంతురు. ఏ మనుష్యులు ఆశచేత తిరస్కరింపబడుదురో వారు మిక్కుటమయిన మోహమును పొందినవారు అగుదురు. అవమానము మొదలగువానివలని దుఃఖముయొక్క చివరనైనను ఎరుగరు. ఇది ఆశ్చర్యము. నేను బహుకష్టములుపడి యీధనమును సంపాదించితిని. ఈధనమును ఆర్జించుటయందే యీదేహము ముసలితనమునొందెను. ముసలితనముచేత బలము నశించెను. ఇకమీదనైనను అక్కరతో ఉత్తమలోకమును పొందుటకు యత్నము చేసెదను అని సువ్రతుడు తలచెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు సువ్రతునిచరిత్ర
మును తెలుపునట్టిదైన ఇరువదిమూడవ అధ్యాయకథ.



## చతుర్వింశోఽధ్యాయః.

వసిష్ఠః.—తస్యామేవ రజన్యాంతు చోర తస్కరా హ్యనేకశః, యథాపురం గృహేతస్య ప్రవిశ్యచ ససాధనాః తద్గృహేనిచితంతస్య దృష్ట్వా కాంచాదికంవసు, మధ్యరాత్రేతుతంవిప్రం సుతభార్యాస్నుషాదిభిః నిబంధయిత్వా బహుధా ధనాహరణతత్పరాః, అపహృత్య ధనం సర్వం అగచ్ఛన్నాతతాయినః చోరైరపహృతద్రవ్యో విలలాపాకులేంద్రియః, నధర్మార్థం నకామార్థం నమోక్షార్థం ధనార్జనమ్. న భుక్త్వా న మయాదత్తం కిమర్థంధనమార్జితమ్, శోషయిత్వాసుతాన్ జాయాం వంచయిత్వా సహోదరాన్. కృత్వా దైన్యంచ కార్పణ్యం దర్శయిత్వా ద్విజావళిమ్, ఇత్యకార్యశతంకృత్వామయాధనముపార్జితమ్. ప్రతిగృహీత్వావిక్రీతా గా మయాబహుశ స్తథా, ఏకాగౌర్న ప్రతిగ్రాహ్యా నద్వితీ

---

## ఇరువదినాల్గవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఈవిధముగా మనసునందు నిశ్చయించుకొని ఆబ్రాహ్మణుడు ధర్మమార్గమునందు ప్రయత్నముగలవాడు అగుచుండగా నాటిరాత్రియందే తూరుగు దొంగలు అనేకులు పట్టణముచొచ్చునట్లుగానే దొంగతనమునకు కావలసినసరముట్లతో అతని ఇంటియందుచొచ్చి ఆయింటిలోనుండెడి అతని ధనమునంతయు కాసులు మొదలగువానితోడ దోచుకొని ధనమును దొంగిలించుటయందు పూనికిగలవారై ఉండి, ఆదొంగలు అర్ధరాత్రమునందు ఆబ్రాహ్మణుని అతనిపెండ్లాముతోను కొడుకులతోను కోడండ్రతోను గూడ బహువిధములచేత కట్టివేసి ధనమునంతయుం దోచుకొనిపోయిరి. అట్లు దొంగలు తనధనమును అపహరించుకొనిపోగా సువ్రతుడు దుఃఖముచేత మైమరచినవాడై యెన్నువలుపెట్టి యేడువసాగెను. ఎట్లు అనగా, నాచేత సంపాదింపబడినధనము ధర్మమునకుగాని కామమునకుగాని మోక్షమునకుగాని ఉపయోగము కాకపోయెను. నేను అనుభవించినదియు ఒకనికియిచ్చినదియు కాదయ్యెను. ఇకను దొంగలకుగాక మరి యెవరికి నేను ఆర్జించినది. పెండ్లాము బిడ్డలను అన్నములేక తపించునట్లుచేసి అన్నదమ్ములను మోసపుచ్చి బ్రాహ్మణసమూహమునకు లుబ్ధత్వముచూపి చిన్నపుచ్చి ఈవిధముగా ఎన్నో చేయరానిపనులు చేసి నేను ధనమును సంపాదించితిని. ఆలాగుననే ఆత్మవంచనచేసియు ఏకేమో అకృత్యములు చేసితిని. అయ్యో! నేను చేయని అకృత్యము ఏదికలదు. ఎన్నోగోవులను దానముతీసికొని అమ్మితిని. ఒకగోవునే దానముతీసికోరాదు. రెండవదానినో అసిన ఒకానొకవృద్ధయినను దానముతీసికోరాదు. అట్టు

యా కదాచన. సాచ విక్రయమాపన్నా దహత్యాసప్తమంకులమ్, బహు
కాలార్జితంద్రవ్యం క్షణేనాపహృతంహ్యహో. ఇత్యజానన్నహం లోకే
దేవంపాపమకారిషమ్, క్లేశేనమహతాగత్వా దేశాద్దేశాంతరంభ్రమన్
ధనార్జనాదేవవశా దేకస్మిన్నపివాసరే,సమాహితధియా సన్ధ్యా క్షణంధ్యా
నోపాసితా మయా. అగర్భోవాసగర్భోవా ప్రాణాయామోపి నోకృత
గాయత్రీవేదజననీమయాజప్తాపినక్వచిత్. త్రిఃపీత్వాద్విరుపస్పృశ్యసమ
గాచమనంమయా, వాచికోపాంశుమనసం నత్వరేణమయాకృతమ్.పవి
త్రేణహస్తేననకృతస్త్రిపదాజపః,నారాధితో మయాదేవః పశుపాశవిమో
చకః.అమంత్రంవాసమంత్రంవా లింగస్యోపరినిక్షిపేత్,పత్రంవా పుష్ప
మేకంవాకులకోటింసముద్ధరేత్.నమయాతోషితోవిష్ణుస్సర్వపాపప్రణా
శనః, సర్వకామప్రదో నైవ విఘ్నరాజోమయార్చితః.సర్వరోగహరో
వో భగవాన్ భాస్కరోమయా,నమస్కృతోఽర్చితోనైవసుపుష్పార్ఘ్య
పురస్సరమ్. మహామంగళదాతౄణాం మహాదేవీమహేశ్వరీ,మయానా

---

వంటిఆవు విక్రయింపబడిన పక్షమున ఏడుతరములదాక విక్రయించినవాని వంశము
కాల్చును. ఇటువంటి పాపపుపనులుచేసి బహుకాలను సంపాదించినధనము క్షణక
ములో దోపుడుపోయెను. ఇది ఆశ్చర్యము. ఇట్లని తెలియక ఈచెప్పబడిన పాప
లను జేసితిని. ధనమును సంపాదింపవలెనని మిక్కిలి శ్రమముతో స్వదేశమునందు
పరదేశమునకు పోయి ఊరక తిరిగితిని. ఒకదినమునందైనను నెమ్మదిగలబుద్ధితో సంధ్య
వందనమునైనను చక్కగచేసియెరుగను. తుదకు ప్రాణాయామమయినను క్రమము
చేయనైతిని. వేదమాతయగు గాయత్రిని ఎన్నడును జపించినవాడనుకానైతిని. మూ
మారులు జలముపుచ్చుకొని రెండుమారులు జలముచేత తుడిచి లెస్సగా ఆచమన
చేయకపోతిని. ధనము సంపాదించవలెననెడి తొందరచేత ఏకాంతమందు భగవన్నా
మము పలుమారు తలవకపోతిని. పవిత్రమును చేతధరించి మూడుపాదములుగల
గాయత్రీజపమును చేసినవాడనుకాను. పశువులనుబోలిన భక్తులకు సంసారబంధమును
విడిపించునట్టి మహాదేవుని పూజింపను. మంత్రము చెప్పిగాని చెప్పకగాని కులము
నెల్లను ఉద్ధరింపగల శివలింగముమీద పత్రమైన పుష్పమైన వేసి యెరుగను. ఎల్లపా
ములను నశింపజేయునట్టి విష్ణుదేవునిబాగడి సంతోషపెట్టినవాడనుకాను. ఎల్లకోరిక
ఇచ్చునట్టివిఘ్నేశ్వరుని పూజింపనైతిని. ఎల్లరోగములను పోగొట్టుచు వెలుగునట్టి
ర్యుడు నాచేత పువ్వులు మొదలయిన పూజాద్రవ్యములతో పూజింపబడడు. మ్రొ
బడడు. మానవులకు మిక్కిలి మేలునిచ్చునదియు మాయయైనదియు శివునికి ప్రియు
లగునదియు నైన పార్వతీదేవి నాచేత పూజింపబడినది కాదు. దంచుట నూరుట

ధితా క్వాపినుహామాయామ్మృడప్రియా. ఆదిత్యమంబికాంవిష్ణుం గణనా థంమహేశ్వరమ్, బ్రాహ్మణాన్ పూజయేత్వంచ పంచయజ్ఞపరాయణాన్. పంచసూనాఘశమనాః పంచయజ్ఞాశ్చనో కృతాః, ప్రాపకస్స్వర్గలోకస్య నాతిథిస్సత్కృతోమయా. సకృన్నభిక్షవేభిక్షానదత్తాసస్యశాలినీ, హంత కన్యాతు నోదత్తా విధివద్బ్రహ్మచారిణే. యతిశ్చబ్రహ్మచారీచ పక్వాన్న స్వామినావుభౌ,తయోరన్న మదత్వాతు భుక్త్వాచాంద్రాయణం చరేత్. సుసూక్ష్మాణి విచిత్రాణి సోజ్జ్వలాన్యంబరాణిచ, నార్పితానిచ విప్రేభ్యో దివ్యాంబరసమృద్ధయే నయవాశ్చఘృతేనాక్తా స్సుసమిద్ధే హుతాశనే, హుతావై మంత్రపూతాశ్చ సర్వపాపాపనుత్తయే. శ్రీసూక్తం పవ మానంచబ్రాహ్మణంతు పరంశివమ్, నజప్తం పౌరుషం సూక్తం సూక్తం నారాయణాత్మకమ్. అశ్వత్థసేవానకృతాత్యక్త్వా హ్యరిక్త్రయోదశీమ్,

---

గుట వండుట ఊడ్చుట అను నీయయిదును పంచసూనములు (అయిదువిధములగు న హింసలు) అనబడును. ఈ అయిదింటి వలనను కలిగెడు పాపములు నశించుటకై సూర్యుడు అంబిక విష్ణువు విఘ్నేశ్వరుడు శివుడు అనునీ అయిదుగురు దేవతలను, బ్రహ్మయజ్ఞము (వేదము చదువుట) పితృయజ్ఞము (పితృదేవతలనుగూర్చి తర్పణము చేయుట) దేవయజ్ఞము (హోమము చేయుట) భూత యజ్ఞము (భూతములకు ప్రీతిగా అన్నమును పెట్టుట) మనుష్యయజ్ఞము (అతిథిపూజ చేయుట) అనునీ అయిదును పంచయజ్ఞములు అనబడును. ఈపంచయజ్ఞములు నడపునట్టి అయిదుగురు బ్రాహ్మణులను పూజింపవలసినది. అట్టిపూజలను నేనుచేయనైతిని. స్వర్గలోకమును పొందించువాడైన అతిథి నాచేత పూజింపబడినవాడు కాకపోయెను. ఒకానొకప్పుడయినను బిచ్చగానికి బిచ్చము వేసి యెరుగను. కన్యకయు క్రమముచొప్పున బ్రహ్మచారికి నాచేత ఇయ్యబడదు. అనగా నేను కన్యాదానము చేసినవాడను కాను. యతి బ్రహ్మచారి అను నీయిరువురును వండిన యన్నమునకు అధికారులు అనగా వంటచేసికొనువారు కారు ఎవరైన వంటచేసి పెట్టిన అన్నమునుభుజించువారు ఆయిద్దరికిని అన్నముపెట్టక భోజనము చేసినయెడల చాంద్రాయణవ్రతము చేయవలెను. అదియెరిగియు నేనువరికి అన్నము పెట్టినవాడను కాను. దివ్యములైన వస్త్రములసమృద్ధికై బ్రాహ్మణులకు నయమయినవియు నానావర్ణములుగలవియు ప్రకాశించునవియునైన వస్త్రములను ఇచ్చినవాడను కాను. ఎల్లపాపములుతొలగుటకై మంత్రములచేత పరిశుద్ధములుగా జేయబడిన యవలతోను నేతితోనుగూడిన మంచివస్తువులను అగ్నియందు వేల్చినవాడను కానైతిని. శ్రీసూక్తము పవమానసూక్తము బ్రహ్మసూక్తము పురుషసూక్తము నారాయణ సూక్తము అనుపంచసూక్తములను జపింపనైతిని. అప్పుడే పాపమును పోగొట్టునదియగు అశ్వత్థప్రదక్షిణము శనిత్రయోదశినాడును శుక్రవారమునాడును రా

సద్యః పాపహరంచాపి న రాత్రౌ చ భృగోర్దినే. స్నిగ్ధస్సుశీతలచ్ఛాయో
వృక్షో నారోపితః పథి, శయనీయం న చోత్కృష్టం మృదులాచ ప్రతూలి
కా. దీపదర్పణసంయుక్తం సర్వభోగసమృద్ధిదమ్, అజాశ్వ మహిషా
మేషా దాసీకృష్ణాజినంతిలాః. సకరంభాః తోయకుంభాః ఆసనం మృ
దుపాదుకే, పాదాభ్యంగం దీపదానం ప్రపాదానం విశేషతః. వ్యజనం
ఛత్ర తాంబూలం తథాన్యత్సుఖవాపకృత్, నిత్యశ్రాద్ధం భూతబలిం తథా
యతిసమార్చనమ్. విశంత్యేతాని దత్వా చ ప్రశస్తాని యమాలయే,
నయమం యమదూతంచ నయామీం యమయాతనామ్. పశ్యంత్యేతే
పుణ్యభాజో నైతచ్చాపి కృతంమయా, కృచ్ఛ్రచాంద్రాయణాదీని తథా
నక్తవ్రతానిచ. శరీరశుద్ధికార్యాణి నకృతాని క్వచిన్మయా, గవాంతృణం
చ నోదత్తం గోకండూశ్చన వైకృతా. నోద్ధృతా పంకమగ్నా గౌః గోలో
కసుఖదాయినీ, నార్థినః ప్రార్థితైరర్థైః కృతార్థాశ్చ మయాకృతాః. తులసీ
రోపితా నైవ విష్ణోరర్చన హేతవే, సాలగ్రామశిలాతీర్థం నపీతంశిరసాధృ

---

త్రికాలములందును తప్పతక్కిన వేళలలో చేయనైతిని. మిక్కిలి చేరికగలిగి చల్లని నీడయిచ్చు
నట్టిచెట్టును బాటలో నాటనైతిని. ఎల్లభోగముల సమృద్ధికలిగిన మంచిమెత్తనిదూదితో
కుట్టినపరుపును దీపము అద్దము వీనితోడ దానము చేయకపోతిని. మేక గుఱ్ఱము ఎనుము
గొఱ్ఱె పరిచారిక కృష్ణాజినము నువ్వులు పెరుగుకలిపిన పేలపిండితోగూడినమంచినీళ్ల
కలశములు పీట పాపకోళ్లు ఇట్టివానిని ఎవరికిని ఇయ్యకపోతిని. అడుగులకు చమురురాచ
నైతిని. దీపదానముచేయనైతిని. చలిపందిరి పెట్టింపనైతిని విసనకఱ్ఱ గొడుగు తాంబూ
లము ఇతరములయిన సుఖపరిమళములను గలుగజేయు వస్తువులు నాచేత ఇయ్యబడినవి
కావు. నిత్యశ్రాద్ధము భూతబలి యతిపూజ నాచేత చేయబడవు. ఈచెప్పబడినశ్లాఘ్య
ములగు క్రియలచేత దానములను ఇచ్చువారు యమలోకమును చేరరు యముని యమ
దూతలను యమునిసంబంధమైన యాతనలను పొందరు. కృచ్ఛ్రము చాంద్రాయణము మొద
లగునవియు రాత్రియొక్క పూటమాత్రము భోజనము చేసి చేయు వ్రతములను ఇంకను శరీ
రమునకు పరిశుద్ధికలుగజేయు కార్యములును ఒకానొకప్పుడైనను నాచేత చేయబడినవి
కావు. గోవులకు గడ్డివేసియెరుగను. గోవులకుశరీరమును దురదపోవ గీరియెరుగను. గోలో
కమునందు సుఖంపజేయునట్టి అడుసునందు దిగబడిన ఆవును లేవనెత్తినవాడను కాను.
యాచకులు అడిగినవస్తువులిచ్చి సంతోషపెట్టినవాడను కానైతిని; విష్ణుపూజకు ఉప
యోగించునట్టి తులసిని నాటకపోతిని. సాలగ్రామతీర్థమును త్రాగి కాని తలమీద చల్లు

తమ్. ఏకాప్యేకాదశీపుణ్యా తిథిర్నసముపోషితా, నోపోషితా శివారాత్రిశ్శివసాలోక్యదాయినీ. నవేదానచశాస్త్రాణి నతుదారాననోసుతాః, నక్షేత్రంనచహార్మ్యాది రాయాంతం నానుయాంతిహి. నశక్తశ్చేష్టితుంకించిత్కింకరిష్యామ్యతఃపరమ్, ఆసన్నాహంహహాజ్ఞాతా కృతాంతనగరీతుసా. కింకరోమి క్వగచ్ఛామి హాకష్టంసముపస్థితమ్,పరలోకస్య పాథేయం మమపుణ్యం న విద్యతే వైవస్వతప్రేరణయా యమదూతాపకర్షితః, నరకే పాత్యమానోహం కాంయామి యమయాతనామ్. ఇత్యంతస్తాపతప్తాత్మా శుష్కకంఠోష్ఠతాలుకః, అతివ్యాకులచిత్తోఽసౌ మనస్యేవమచింతయత్. జీవతాస్మిన్మయాలోకే సుకృతం కిముపార్జితమ్, ఇతిచింతయతస్తస్య మనసి ప్రతిభాప్యభూత్. అహో జ్ఞాత మహోజ్ఞాత మహోజ్ఞాత మిదం మయా, శ్లోకార్ధేన పురా ప్రోక్తం పరలోకసుఖావహమ్. వేదవ్యాసేన మునినా తత్కరిష్యామి సాంప్రతమ్, అన్యథా మమ వృద్ధస్య నాన్యచ్ఛ్రేయోఽపి విద్యతే. ధనార్జనార్థం కాశ్మీరం గచ్ఛతా దేశ

---

కొనిగాని యెరుగను. పావనమైన ఒక యేకాదశినాడైనను శివలోకమును పొందించునదియైన శివరాత్రినాడైనను ఒక్కప్రొద్దు ఉండకపోతిని. వేదములు శాస్త్రములు పెండ్లాలు బిడ్డలు పంటభూములు మేడలు మొదలుగా ధనము తుదగా గలసమస్తములు తాను దేహమును విడిచిపోవునపుడు వెంటరాబోవు. కదలమెదలశక్తి లేనివాడనైతిని. ఇకమీద నేనేమిచేయుదును నాకాటికి యమునిపట్టణము నాకుసమీపించినదగుచున్నది. అయ్యో! మిక్కిలి కష్టమువచ్చెనే ఏమిచేయుదును. ఎక్కడ పోదును. పరలోకమునకు పోవునట్టి నాకు దారిబత్తెము పాటియైన పుణ్యము లేదు. యమునియాజ్ఞచేత యమదూతలు వచ్చి నన్ను ఈడ్చుకొనిపోయి నరకమునందు పడద్రోయగా అప్పుడు నేను ఎటువంటియాతనను పొందుదునో అని యీప్రకారముగా విచారించుచు మనస్తాపముచేత తపించుచు గొంతుకు పెదవులునుఎండగా మిక్కిలి కలతనొందినమనసుగలవాడై, నేను ఈభూలోకమునందుండి యేమిపుణ్యమును సంపాదించితిని. అని యీవిధముగా ఆలోచించునపుడు ఆతనిమనసునందు ఒకవిధమైన తెలివిపుట్టె ఔరారా! వింత! పూర్వకాలమునందు పరలోకసుఖముకలుగునట్టిమార్గము వ్యాసమహర్షిచేత అర్ధశ్లోకములో చెప్పబడెను. ఆవిషయము ఇప్పుడు నాకుతలపునకు వచ్చెను.దానినిఇప్పుడు నేను చేసెదను. ముసలివాడనైననాకు దానికంటె ఇతరమయిన మేలేదియుం గానరాదు. ధనమును సంపాదించుటకై నేను కాశ్మీరదేశమునకు పోవుచున్నప్పుడు భాగీరథియన

ముత్తమమ్, దృష్ట్వా భాగీరథీతీరే బ్రాహ్మణా వేదపారగాః. మాఘస్నాన ముషఃకాలే కృత్వా తస్థు రనేకశః, తత్ర పౌరాణికే నోక్తం శ్లోకార్థార్థోధునోదితః. "మాఘే నిమగ్నాస్సలిలే సుశీతే విధూతపాపాస్త్రిదివం ప్రయాంతి", ఇతిశ్రుతంతత్రపురాపురాణంప్రమాణమేతత్కరణీయమేవ. ఇతి నిశ్చిత్య మనసా దృఢచిత్తస్స సువ్రతః, నర్మదాయాం నవదినం మాఘస్నానం చకారహ. కర్తుం తదప్యశక్తోఽథదశ మేహానినర్మదామ్,కథంకథంచిత్సంప్రాప్య స్నానంకృత్వా విధానతః. తీరమాసాద్యశీతార్తో గోవిందేతివదన్మృతః,తదానీమాగతంతస్య విమానం మేరుసన్నిభమ్. తదారుహ్య యయౌస్వర్గం సువ్రతో మాఘవైభవాత్, తత్ర మన్వంతరంస్థిత్వా పునర్భూమౌ ద్విజోఽభవత్.ప్రయాగే మాఘ మాసాద్య బ్రహ్మలోకముపేయివాన్, కల్పాంతే పునరాగత్య ద్విజో భూత్వా మహాకులే స పునర్మాఘమాహాత్మ్యా త్కాశ్యామీశో

---

బడెడి గంగానదిగట్టునందు తెల్లవారిలేచి మాఘస్నానము చేసి కూర్చుండిన వేదము తుదముట్టచదివినబ్రాహ్మణులను అనేకులను జూచితిని. అందు పురాణము చెప్పునట్టి బ్రాహ్మణుడు ఒకడు చెప్పినసగముశ్లోకముయొక్కఅర్థము ఇప్పుడు జ్ఞప్తికివచ్చినది. అది యెట్టిదనగా "మాఘే నిమగ్నా స్సలిలే సుశీతే విధూతపాపా స్త్రిదివం ప్రయాంతి" (మాఘమాసమున మిక్కిలి చల్లగానుండు నీళ్లలో స్నానముచేసినవారు పాపములను తొలగించుకొన్నవారై స్వర్గమును పొందుదురు.) అని యిట్లు చెప్పునప్పుడు నేను వింటిని. ఇట్లు ముందువిన్నపురాణమే నాకు ప్రమాణము. అదియే నేనుచేయదగిన పని. అని మనస్సున నిశ్చయించుకొన్నవాడై సువ్రతుడు కలవరములేనిమనసుతో నర్మదానదికిపోయి తొమ్మిదిదినములు మాఘస్నానము చేసెను. పదియవనాడు ఆస్నానమునైనను చేయుటకు శక్తిచాలక మెల్లమెల్లగా నడచి యెట్లెట్లో నర్మదానదికి పోయి యథావిధిగా స్నానముచేసి గట్టెక్కి చలికి ఓర్వజాలక గోవింద గోవిందయని పలుకుచు ప్రాణములు విడిచెను. అప్పుడు మేరుపర్వతమునుబోలిన బంగారువిమానము ఒకటిఅతనికై వచ్చెను. మాఘస్నానమహిమవలన సువ్రతుడు ఆవిమానము నెక్కి స్వర్గమునకు పోయి అచ్చట ఒకమన్వంతరకాలము ఉండి మరల భూలోకమునందు బ్రాహ్మణుడై అవతరించి ప్రయాగమునందు మాఘస్నానము చేసి అంతట బ్రహ్మలోకమునుపొందెను. అట్లు బ్రహ్మలోకమును పొందిన యాబ్రాహ్మణుడు ఆలోకమునందు ప్రళయకాలముదనుక నుండి పిమ్మట ఒక గొప్పవంశమునందు బ్రాహ్మణుడై పుట్టి కాశికిపోయి మాఘ

పదేశతః, తతోమృత్యుంజగామాసౌ శివసాయుజ్యముత్తమమ్. వసిష్ఠః. దశదినమపిమాఘే నర్మదాయాం నిమజ్జ్య త్రిదశపతిసమీపే తత్రమన్వంతరస్థః, పునరపి భువిజాతో మాఘవేకః ప్రయాగే ద్రుహిణపదమవాప్యైషీత్తత్రకల్పస్థితోఽభూత్. కమలభవనపూజ్యస్తత్ర కల్పావసానే పునరపి భువిజాత శ్శిష్టవంశేఽనురూపే, వ్రతనియమసమేతో మాఘమాసే యథావ న్మృతిమలభత కాశ్యాం సువ్రతో భూసురేంద్రః.

ఇతి శ్రీపాద్మే పురాణే - మాఘమాహాత్మ్యే - సువ్రత చరితంనామ చతుర్వింశోఽధ్యాయః.

---

## పంచవింశోఽధ్యాయః

వసిష్ఠః —శృణు రాజన్పునర్మాఘవైభవం కథయామి తే, సర్వేషామేవమాసానాంమాఘమాసఃపరస్మృతః. మాఘమాసస్యమాహాత్మ్యం కస్యమానస్యవిద్యతే, సంప్రాప్తేమాఘమాసేతు దేవర్షిపితృవల్లభే. భృశం

---

స్నానప్రభావమువలనను విశ్వనాథుని యందుపదేశమువలనను కాశిలోనే మృతిబొంది ఉత్తమమయిన శివసాయుజ్యమును పొందెను. ఇట్లు సువ్రతుఁడు అనుబ్రాహ్మణుఁడు పది దినములు నర్మదానదిలో స్నానముచేసి ఇంద్రునిసామీప్యమునుపొంది అచ్చట మన్వంతరకాలము ఉండెను. మరల భూమియందుఁబుట్టి ప్రయాగయందు ఒకమాఘమాసము స్నానముచేసి బ్రహ్మపదమునుబొంది అచ్చటఒకప్రళయము అగునంతదాక ఉండెను. ఆప్రళయమువరకు బ్రహ్మచేత పూజను బొందుచున్న యాబ్రాహ్మణుడు మరల భూలోకమునందు తనకుదగినఉత్తమబ్రాహ్మణవంశమునందు బుట్టి వ్రతములను నియమములను క్రమముగా నడుపుచున్నవాడై మునుపటిపలెనే మాఘమాసమునందు స్నానముచేసి కాశిలోనే మృతిబొంది శివసాయుజ్యమును పొందెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు సువ్రతుని చరిత్రమును తెలుపునట్టిదైన యిరువదినాలవ అధ్యాయకథ.

---

## ఇరువది ఆయిదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా!మరలమాఘమాహాత్మ్యమును చెప్పెదనువినుము.అన్నినెలలలోను మాఘముశ్రేష్ఠమైననెలయని చెప్పబడును. ఆమాఘమాసముయొక్కప్రభావము మరియేమాసమునకును లేదు. దేవతలకును పితృదేవతలకును ఋషులకును ప్రియమైన

క్రోశంతిపాపానిసముద్గచ్ఛతిభాస్కరే, నాశకాలోఽయమస్మాకం మాఘ మాసస్సమాగతః. అస్మిన్మర్త్యేసుఖంసర్వే వయంచిరముపస్థితాః, ఇతః పరంక్వగచ్ఛామిఇతిచింతాంప్రపేదిరే. బ్రహ్మహత్యానభేత్తవ్యా భవద్భిః పాపసంచయాః, నవేత్తిస్నానమాహాత్మ్యంలోకోఽయంపామరోహిభోః. పాణిపాదమనోవాగ్భిః యేనసంయతమాత్మనః, తీర్థస్నానఫలంతస్య భవత్యేవ నసంశయః. త్రివిధంకరణంచైతద్యస్యమర్త్యస్య సంయుతమ్, తీర్థస్నానఫలం తస్య తీర్థభూతస్య సర్వదా. అతోన్యథాచమర్త్యానాం జలజాత సధర్మిణామ్, కామాదిదోషదుష్టానాం తృష్ణాసూయామలాత్మనామ్. అనాచారవతాంనౄణాం తీర్థస్నానఫలంనహి, దేహేష్వృద్ధిమతాంసర్వే సుఖం వత్స్యామ సాంప్రతమ్. పాపాః. నజ్ఞాతం హ్యేతదస్మాభి ర్ధర్మసూక్ష్మపరంరహః, ధర్మసూక్ష్మం పరంగుహ్యం సర్పస్య పదపఙ్క్తివత్, ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం పరమాత్మవత్, జ్ఞానినస్తత్ప్రపశ్యంతి నహి సూక్ష్మదృశో వయమ్. శృణుధ్వం ధర్మసూక్ష్మం

---

మాఘమాసముగాగానే పాపములెల్లను సూర్యుఁడు ఉత్తరాయణమును పొందుచున్నాడు. మాకునశించు కాలమైన మాఘమాసము వచ్చెను. మేము చిరకాలము ఈమనుష్యలోకమునందు సుఖముగానుంటిమి. ఇకమీద యెక్కడికిపోదుము. అని యిట్లువిచారించి మొరపెట్టుకొనుచుండును. అప్పుడు బ్రహ్మహత్యవానితో, ఓపాపసమూహములారా! మీతోడ బ్రహ్మహత్యయెడబాయనిదైయుండును. ఈలోకము తెలివిమాలినది కాబట్టిమాఘస్నానమహిమనుఎరుగదు. ఎవడు కాలుసేతులచేతను మనోవాక్కులచేతను మనస్సును నియమించునో వానికి తీర్థస్నానము లభించును. సందేహములేదు. మూడువిధములయిన కరణములుఅనగా, మనస్సు వాక్కు కర్మముఅనునీమూడును ఏమనుష్యునికి ఒక్కటైయుండునో అట్టితీర్థస్వరూపుడైన పురుషునికి సర్వదా తీర్థస్నానఫలము కలుగును. (మనస్సు వాక్కు కర్మము అనునీమూడును ఒక్కటియై యుండుట అనగా, మనసున తలచునదియు నోటచెప్పునదియు చేతులతో చేయునదియుఁఒకటిగానుండుట) ఈచెప్పబడినవారుగాక నీళ్లలోనిజంతువులైన చేపలు మొదలగువానిబోలి కామము మొదలగు దోషములచేత దూషింపదగినవారును అత్యాశ ఓర్వలేనితనము వీనిచేత చెడినమనసులు గలవారును ఆచారములేనివారునునైన యితరజనులకు తీర్థస్నానమువలని ఫలముకలుగదు. కనుక అట్టివారి వృద్ధిపొందినదేహములయందు వసియింతము. అనగా, పాపములుకొనానుమిక్కిలి రహస్యమైన ఈధర్మసూక్ష్మమును మేము కానమైతిమి. పాముకాళ్లువరుసవలె ధర్మసూక్ష్మము మిక్కిలిరహస్యమైనది. గుహయందున్న పరమాత్ముని తెలియరాని విధమున ధర్మముయొక్క స్వభావమును తెలియరానిదైయుండును. అట్టిధర్మస్వరూపమును జ్ఞానులగు

తన్మాఘస్యాస్య విశేషతః. అకామో వా సకామో వా శ్రద్ధావానన్యథా భవేత్, పామరో వామరో వాపి జ్ఞానతో జ్ఞానతోపి వా. మూర్ఖో వాథ దురాచారో మహాపాపరతోపి వా, ప్రమాదేనాపి యస్స్నాతి మాఘస్నానమినోదయే. తస్య దేహనివాసం నో నాస్తి నాస్తి పునర్నహి, కేదారం సేతుమాగచ్ఛేత్ ప్రమాదేన పతేత్ జలే. మాఘమాసే విశేషేణ తస్యాస్తి స్నానజం ఫలమ్, యో మాఘే స్నాతి విధినా శ్రద్ధాసంకల్పపూర్వకమ్. తస్య స్వర్గోపవర్గో వా భవేన్నాత్ర విచారణా, పాపీయాన్ స్నాతి యో మాఘే యద్వా తద్వా యథా తథా. పునాతి సర్వపాపాని వివిధాని న సంశయః, ఆత్మహత్యాదిపాపాని మాఘస్నానేన భస్మసాత్. భవంతి స్నానమాత్రేణ కించిదభ్యుదితే రవౌ, దుర్లభో మాఘమాసోను బహుపుణ్యప్రదస్సదా. దేవైస్తేజః పరిక్షిప్తం మాఘమాసే జలే తథా, తస్మాత్పవిత్రమమలమశేషం సందహేత్క్షణాత్. నేదృశీసమరేరా

---

పెద్దలు తెలిసికొందురుగాని మేము తెలిసికోలేము. అయినను యీమాఘమాసముయొక్క సూక్ష్మధర్మమును సవిస్తరముగా చెప్పెదము వినుము. కోరిక లేనివాడు కోరికగలవాడు అక్కరలేనివాడు అక్కరగలవాడు ఏమి తెలియనివాడు అన్ని తెలిసినవాడు జ్ఞాని అజ్ఞాని తెలిసి తెలియనివాడు చెడ్డనడవడికలవాడు గొప్ప పాపకార్యములను జేయువాడు అనుని ట్టివారలలో ఎవడుగాని యెచ్చరిక తప్పియైనను మాఘమాసమునందు సూర్యోదయమునందు స్నానము చేసినపక్షమున అట్టివాని దేహమునందు ముమ్మాటికి మనకు ఉనికితగదు. మాఘమాసమునందు పరిమళ్లగనిమలమీదపోవుచు కాలుజారిమళ్లలోని నీళ్లలోపడి దేహము తడుపుకొన్నవానికిగూడ మాఘస్నానము చేసినఫలము కలదు. ఇక శ్రద్ధగలవాడై క్రమముచొప్పున సంకల్పము చేసి మాఘస్నానము చేసినవానికి స్వర్గమో మోక్షమో కలుగును అనువిషయమును విచారింపవలసినది యేమున్నది. నియమము చొప్పుననో మరి యేవిధముగానో మాఘమాసమునందు స్నానము చేసినవాడు పాపాత్ముడైనను ఎల్లపాపములను తొలగి పుణ్యాత్ముడగును. అందులకు సంశయము లేదు. మాఘమునందు ప్రొద్దుపొడుచుచుండగా స్నానము చేసినమాత్రముచేతనే తన్నుతాను హింసించుకొనుట మొదలుగాగల పాపములన్నియు భస్మమైపోవును. కనుక యెన్నరాని పుణ్యములను ఇచ్చునట్టిదైన మాఘమాసము యెప్పుడును పొందరానిది. మాఘమాసమునందు దేవతలచేత ఒక తేజస్సు జలమునం దుంచబడుచున్నది. ఆకారణముచేత తేటయైనదియు పావనమైనదియు నైన గంగాజలము క్షణకాలములో ఎల్లపాపములను మొదలంట నశింపజేయును. నిర్మలమయిన మనసుగల సత్పురుషులకు మాఘస్నానముచేత ఎట్టియుత్తమగతికలుగునో అట్టి

జ్ఞాం యుద్ధేనా ప్యపలాయినామ్, గతి స్స్యా ద్యాదృశీమాఘస్నానేన విమలాత్మనామ్. అతో౽స్మాకం భయంనిత్యం బ్రహ్మహత్యేన సంశయః, పాపాన్యేవం నృపశ్రేష్ఠ వివదంతః పరస్పరమ్. మాఘమాసేతు సంప్రాప్తే ప్రారంభంతే పలాయితుమ్, స్నాత్వా ప్రవాహతోయేషు మాఘస్నానం ప్రశస్యతే. అరోగిబలవాన్మర్త్యో నగృహే స్నానమాచరేత్, గృహేస్నానంబలవతో నిష్ఫలాయ ప్రకల్ప్యతే. వాపీకూపతటాకేషు ఫలంస్యాన్మధ్యమంతథా, అతిశీతజలస్నాన మతిపాతకనాశనమ్. నసౌఖ్యాల్లభతేపుణ్యం కాయక్లేశాదవాప్యతే, మంథనేన యథా క్షీరా న్నవనీతం ప్రజాయతే. మర్దనాదిక్షుదండానాం రసోయద్వత్ప్రజాయతే, తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే. మాఘస్నాయీ న సేవేత శీతార్తోర్వహ్నిసేవనమ్, శీతార్తోపి సేవేత నపరస్యాగ్నిసేవనమ్. బాలవృద్ధాతురాణాంతు నదోషాయ ప్రకల్పతే, సేవేత వహ్నిం శీతార్తః స్వయముజ్జ్వాల్యభూమిప. స్వకీయమపిసేవేత తృణాగ్నిం నకదాచన,

---

యుంత్తమగతి యుద్ధమునందు పోరాడునప్పుడు భయపడి పారిపోనిశూరులైన రాజులకు సైతము కలుగదు. కాబట్టి ఓ బ్రహ్మహత్యా మాకు భయము తప్పనిదైయుండును. అందుకు సందేహము లేదు. అనియీవిధముగా పాపములు తమలోతాము చెప్పుకొనుచు మాఘమాసమురాగానే పరుగెత్తనారంభించును. అట్టిమహిమగల మాఘమాసమునందు పారుచుండెడి నదులలో స్నానము చేయుట ఉత్తమము. రోగి కానివాడును దేహబలముగల వాడునైన పురుషుడు యింటిలో స్నానము చేయరాదు. బయటపోయిస్నానము చేయ శక్తిగలిగియుండి ఇంటస్నానము చేసినయెడల అందులఫలము కలుగదు. బావులయందును నూతులయందును చెరువులయందును స్నానముచేయుటవలన మధ్యమఫలము కలుగును. మిక్కిలి చల్లనినీళ్లలో స్నానముచేసినయెడ మిక్కుటపాపములు నశించును. దేహమును కష్టపెట్టుటవలన పుణ్యముగలుగునుగాని సుఖపెట్టుటవలన పుణ్యముకలుగదు. కనుకచలికి వెరవక చల్లనినీళ్లలోనే స్నానముచేయవలసినది. చిలుకుటచేతపాలయందు వెన్నయుంగాని గాడుటచేత చెరకునందుపాలును ఎట్లుకలుగునో అట్లుశరీరమును కష్టపెట్టుటచేతఅధికపుణ్యమును కలుగును. మాఘస్నానముచేయువాడు చలిగొన్నసమంటకాచుకోగూడదు. తానుమంటకాచుగొనగూడకపోవుటయేకాదు ఇతరులుమంటవేసి కాచుకొనునపుడుఆమంటదగ్గరగూడ చలికాచుకోరాదు. బాలురువృద్ధులురోగులును అగువారు చలిగొనిమంట కాచుకొనుటదోషముకాదు. అబాలవృద్ధాతురులైనను స్నానముచేసినపిమ్మట విశేషము చలిగానున్నయెడల మంటకాచుకోవచ్చును. అమంటయితరులువేసినదిగాని గడ్డిపోచలతో

పాదానతాపయేత్పృష్ఠం ముఖం పార్శ్వేనతాపయేత్, వాప్యాదీనామభావేతు ఘటేనోద్ధృత్యకూపతః తస్మిన్నావాహ్య దేవేశం రవింకృత్వానిమంత్రతః, గంగేతియమునే చేతి నదీరావాహ్య భక్తితః. తేన స్నాయాన్నరోమాఘే ఫలంప్రాప్నోతి పుష్కలమ్, పూర్వేద్యుస్సాయముద్ధృత్య కూపాత్తోయం ఘటోద్ధృతమ్. వాయునాతాడితం రాత్రౌ తత్స్నానంగాంగముచ్యతే, తన్నాస్తిపాతకంకించి న్మాఘస్నానవతాంనృణామ్. పాపంవినశ్యతిక్షిప్రం మాఘస్నానకృతాంనృప, ధామ్యమానం యథాహేమ వహ్నౌనిష్కల్మషంభవేత్. తథానిర్మలతాంయాంతి మాఘస్నానేనమానవాః, అగ్నౌప్రతాపితంసర్వం యథా శుద్ధం భవిష్యతి. భవిష్యంతి నరాస్సర్వే మాఘస్నానాత్తథానృప, దాహశక్తింస్వయం బ్రహ్మా వహ్నౌనిక్షిప్తవాన్పురా. పావనత్వం తథాతోయే సర్వేషాం ప్రాణినాంప్రభుః, ప్రోక్షిపన్నిర్జరాస్సర్వే స్వస్వతేజాంసి సర్వశః. మాఘమాసే విశేషేణ సర్వలోకహితాయతే, అగ్నిప్రవేశా ద్భాపానాం

---

వేసినదిగాని కారాదు. మఱియు చలికాచుకొనునప్పుడు అరకాళ్లవీపు ముఖము ప్రక్కలును కాచుకోరాదు. ఇదిగాక మాఘస్నానము చేయుటకు బావులు మొదలగునవి లేనిపక్షమున నూతినీళ్లు చేది యొకబానలో పోసి ఆనీళ్లయందు ఆవాహనమంత్రములచేత దేవతలలో పూజ్యుడైన సూర్యుని ఆవాహనముచేసి "గంగేచయమునేచైవగోదావరి సరస్వతి, నర్మదేసింధుకావేర్యౌ జలేఽస్మిన్ సన్నిధింకురు." అనునీమంత్రముచేత పుణ్యనదుల జలములను భక్తిపూర్వకముగా ఆవాహనముచేసి ఆ పావనమైన జలములచేత స్నానము చేయునట్టి మనుష్యుడు మాఘస్నానమువలని ఫలము ఎంతగలదో అంతయును పొందును. తొలునాటి సాయంకాలముననే నూతినుండి చేది బానలో నింపి పెట్టినజలము రాత్రియంతయు గాలిసోకుటచేత పరిశుద్ధమవును. ఆజలముచేత చేయుస్నానము గంగాస్నానము వంటిదగును. దానివలన మాఘస్నానము చేయువారికి కొంచెమయినను పాపముకలుగదు. మాఘస్నానము చేయువారి పాపము అతిశీఘ్రముగ నశించును. పుటము వేయుచుండగానే బంగారు వన్నె హెచ్చునట్టు మాఘస్నానముచేయగా మనుష్యులవన్నె హెచ్చి పావనులగుదురు. నిప్పునందు కాచబడుటచేత ఎల్లవస్తువులును పరిశుద్ధములు అగునట్లు మాఘస్నానముచేత ఎల్లమనుష్యులును పరిశుద్ధులు అగుదురు. పూర్వకాలమునందు బ్రహ్మదేవుడు నిప్పునందు కాల్చునట్టిశక్తిని ఉంచినట్లు జలమునందు సమస్తప్రాణులను పరిశుద్ధత్వమును పొందించుశక్తిని ఉంచినాడు. ఎల్లదేవతలును విశేషముగా మాఘమాసమునందు తమతేజస్సులను తీర్థములయందంతటను ఉంతురు. రాజులకు

సంగ్రామమరణాదపి. గోబ్రాహ్మణార్థం మరణా చ్ఛరణాగతపాలనాత్,
అధికంఫలమేతేభ్యో మాఘస్నానాత్తమాభృతామ్ అహన్యహనిదా
తవ్యా స్తిలాశ్శర్కరయాసహ, మాఘమాసే శ్రద్ధావాన్ షడ్రసా
న్నేనసద్విజాన్. ప్రయాగమాధవాకారాన్ భోజయిత్వా మహీతలే,
ఆయురారోగ్యమైశ్వర్యంవిద్యాం పుష్టిం యశశ్శ్రియమ్. సౌభాగ్యమతు
లంరూపం పుత్రపౌత్రాది సంతతిమ్, రూపలావణ్య మాధుర్య ధైర్య
గాంభీర్యసద్గుణామ్. శీలానుగుణ్య దాక్షిణ్య దయా వినయశాలినీమ్,
అప్సరఃప్రతిమాంసాధ్వీం స్త్రియమేతాదృశీంలభేత్ తైలాభ్యంగంమైథు
నంచ నిషిద్ధస్యచభక్షణమ్, చండాలపతితోదక్యా నగ్నపాషండభాష
ణమ్. అసంబంధప్రలాపంచ అసభ్యైస్సహభాషణమ్, గ్రామ్యోక్తిం
పరిహాసంచ పరాన్నం పరదూషణమ్ పరాపవాదంపైశున్యం పరరంధ్ర
విచారణమ్, అసూయాంచ పరేర్ష్యాంచ పరదారావలోకనమ్. చింతాం

---

అగ్నిచొచ్చుటకంటెను యుద్ధమునందు చచ్చుటకంటెను గోవులకయ్యును బ్రాహ్మ
ణులకయ్యును ప్రాణములు విడుచుట కంటెను, శరణుచొచ్చినవారిని కాపాడుట
కంటెను మాఘస్నానము అధికఫలమును ఇచ్చునది అగును. మాఘమాసమునందు ప్రతి
దినమును నువ్వులు చక్కెరకలిపి దానముచేయవలసినది. మాఘమాసముకడపట శ్రద్ధ
తో ఆరురసములతో గూడిన అన్నమును యోగ్యులైన బ్రాహ్మణులకు పెట్టి వారిని ప్రయా
గయందలి మాధవస్వామినిపోలినవారినిగా నెంచి భోజనముచేయించవలసినది. అట్లు
చేసినవానికి ఈలోకమునందు దీర్ఘాయుస్సు రోగములేమి ఐశ్వర్యము విద్య దేహబలము
కీర్తితేజస్సు ఈడులేని సుభగత్వము(కోరదగినతనము)చక్కదనము కొడుకులుకొమార్తెలు
మనుమలు మనుమరాండ్రు మొదలుగాగలసంతానము చక్కదనము దేహమునందలి
మెరుగు తిన్ననిమాటలు ధైర్యము గబ్బితనము మొదలైన మంచిగుణములు గలిగినదియుం
మంచినడత అందులకుదగిన మొగమోటము దయ అడకువయును గలిగినదియు అప్సర
స్త్రీని పోలినదియునైన పెండ్లామును లభించును. తలంటు స్త్రీసంగమము కూడనివస్తు
వులను భుజించుట చండాలురతోను పాపులతోను ముట్టుదానితోను నగ్నునితోను
(వేదములనుచదివి వేదమునందు చెప్పబడిన క్రమమును నడపక ఆవేదోక్తాచారములను
నిందించువాడు నగ్నుడు అనబడును) మాటలాడుట సంబంధములేని వ్యర్థపుమాట
లాడుట సభాయోగ్యులు కానివారితో మాటలాడుట బూతుమాటలాడుట ఒకరిని యె
గతాళిచేయుట అన్యులయన్నము తినుట ఒకరిని దూషించుట ఒకరిదగ్గర లేనిపోని నేర
ములెంచుట కొండెము చెప్పుట ఇతరుల తప్పులను విచారించుట ఇతరులగుణములందు

చ పరదారేషు పరద్రవ్యాభిలాషతామ్, స్మరణం పాపినాంచైవ పాపా
నాంచైవ చింతనమ్. ఏవమాదీనిచాన్యాని పరమర్మకరాణిచ, దేవతా
నిందనం చైవ గోబ్రాహ్మణవినిందనమ్. సంత్యజ్య ప్రయతో భూత్వా
మౌనవ్రతపరాయణః, అభీష్టదేవతాం ధ్యాయన్ బ్రహ్మాణంవా హరం
హరిమ్ అగ్నిం సోమం భాస్కరంచ దుర్గాంవిఘ్నేశమేవచ, బ్రహ్మచారీ
జితక్రోధో నిత్యం స్వాధ్యాయతత్పరః జితేంద్రియ స్సత్యపరో దయా
వాన్ సత్యసంగరః, మాతాపిత్రూణాం శుశ్రూషు ర్గురుపూజాపరాయణః.
సదాచారరతో దాంత స్త్రికాలం దేవపూజకః, కృత్వైవంనియమం విప్రో
రాజావైశ్య స్తథేతరః. మాఘే యస్స్నాతి రాజేంద్ర తస్య పుణ్యఫలం
శృణు, బ్రహ్మణశ్చహరేశ్శంభో రాకల్పమతిథిర్భవేత్. ఆతురో మానవో
మాఘే స్నానార్థం స్వాత్మనోద్విజమ్. కుర్యాత్ప్రతినిధిం తస్య యో
గక్షేమం ప్రకల్పయేత్. ధౌతవస్త్రద్వయం శ్లక్ష్ణం దేహప్రావరణంతథా,
దత్వాతుద్విపటిం శ్లక్ష్ణా ముపానచ్ఛత్రకుండికామ్. దత్వాప్రతినిధింతంచ

---

దోషములను పెట్టుట ఒకరినిచూచి ఓర్వలేకపోవుట ఇతరులభార్యలను చెడుతలపుతో
చూచుట పరస్త్రీలయందలి అపేక్షచేత దుఃఖపడుట పరులద్రవ్యమును అపహరింప
గోరుట పాపాత్ములగు వారిని ఎప్పుడును తలచుచుండుట పాపములయొక్క విచారము
ఇవిమొదలుగాగలవానిని ఇతరములైన పరులమర్మములను బయటవేయుపనులను దేవ
తలు గోవులు బ్రాహ్మణులు వీరినినిందించుటను విడిచి నియమముగలవాడై మౌనముగా
నుండు వ్రతమునుపూని తనయిష్టదేవతను ధ్యానించి పిమ్మట బ్రహ్మ విష్ణువు శివుడు అగ్ని
చంద్రుడు సూర్యుడు దుర్గ విఘ్నేశ్వరుడు ఈదేవతలను ధ్యానించి బ్రహ్మచారియు
కోపములేనివాడును ప్రతిదినము వేదాధ్యయనముచేయువాడును ఇంద్రియములను లోబరు
చుకొన్నవాడును సత్యమును తల్లిదండ్రుల సేవచేయువాడునునడపెడిప్రతిజ్ఞగలవాడును
గురువులను పూజించుటయందు అక్కరగలవాడును మంచి యాచారము నడపువాడును
తపస్సువలని క్లేశమును ఓర్చువాడును మూడుకాలములయందును దేవతార్చనము చేయు
వాడును ఐనబ్రాహ్మణుడుగాని రాజుగాని వైశ్యుడుగాని వీరికంటె ఇతరుడైన శూద్రు
డుగాని మాఘస్నానముచేసినయెడ అట్టివాడు బ్రహ్మ విష్ణువు మహేశ్వరుడు అనబడెడి
త్రిమూర్తులకు పూజ్యుడై ప్రళయమువరకును ఉండును. ఎవడైనను రోగబాధచేత అశ
క్తుడైయుండి మాఘస్నానముచేయదలచినపక్షమున తనకుమారుగా యొకనిచేతస్నానము
చేయింపవచ్చును. అట్లుతనకుగాను స్నానముచేయుబ్రాహ్మణునికి సన్నని మడుగుదోవతు
లనురెంటిని కప్పుడువస్త్రములనురెంటిని సన్ననిదుప్పటిని చెప్పులనుగొడుగునుచెంబును

భోజయేదాత్మనోగృహే, నైకవ్యంజనసంయుక్తం గుడమధ్వాజ్యసంప్లుతమ్. శర్కరాదధిగోక్షీర నానాఫలసమేధితమ్, కుటుంబభరణంతస్య కుర్యాద్ధాన్యాదిభి స్తథా ఏవం ప్రతినిధిం కృత్వా స్నాపయేన్మకరగభాస్కరే, సోపి స్వకృత్యం నిర్వర్త్య స్నానసంధ్యాదికం ద్విజః. పశ్చాత్స్నానం ప్రకుర్వీత పరార్థం ప్రయతోఽన్వహమ్, తద్గోత్రశర్మనామాది సంకల్ప్యచయథావిధి. తమేవ మనసా ధ్యాయన్ మంత్రస్నానపురస్సరమ్, దేవప్రార్థనసంయుక్తం తీర్థావాహనపూర్వకమ్. ఆమాఘాంతం ప్రయత్నేన నియమేన సదావసేత్, అంతే ప్రతినిధిర్విప్ర స్తస్మై సంకల్పపూర్వకమ్. స్వకృతస్నానజం పుణ్యం దద్యాదుదకపూర్వకమ్, ధౌతవస్త్రద్వయంచైవ ద్విపటీంచ సదక్షిణామ్. వస్త్రాలంకారసంయుక్తాం సవత్సాంగాం పయస్వినీమ్, శీలలక్షణశోభాఢ్యాం స్నాత్రే దద్యాత్సదక్షిణామ్. ఏవం యస్స్నాపయే న్మాఘే బ్రాహ్మణే నాత్మనేద్విజః, స్వయంకృతాదపి మహా త్యధికంఫలమాప్నుయాత్. శృణుభూప పరంగుహ్యం

---

ఇచ్చి తనయింటనే భోజనము చేయింపవలయును. అట్లు అనేకములైనవ్యంజనములతోను బెల్లము తేనె నెయ్యి వీనిచేత పక్వము చేయబడినపదార్థములతోను చక్కెర ఆవుపాలు ఆవుపెరుగు నానావిధములైన పండ్లు మొదలగువానితోను గూడిన అన్నముపెట్టి భోజనము చేయించుచు అతనికుటుంబమును ధాన్యము మొదలైన వానిని ఇచ్చి పోషింపవలయును. స్నానముచేయ శక్తిలేనివాడు ఈవిధముగా ఉపచరించి తనకు మారుగా మాఘస్నానము చేయను ఒకనినియమింపవలెను. ఆస్నానము చేయువాడును ప్రతిదినమును స్నానము సంధ్యావందనము మొదలుగాగలతననిత్యకృత్యములను జరపి పిమ్మట ఇతరునికిగాను స్నానముచేయవలెను. అట్లు స్నానము చేయునపుడు ఎవనికై తానుస్నానముచేయబోవుచున్నాడో వానిగోత్రము పేరు మొదలగువానిని చెప్పిసంకల్పము చేసివానినిమనసునందుతలచుచు మంత్రస్నానముచేసి దేవతాప్రార్థనమును తీర్థముల ఆవాహనమును కావించిపిమ్మటస్నానము చేయవలసినది. ఇట్లు మాఘమాసము కడవరకుజరపుచు ఎవనికిగాను తానుస్నానము చేయునో వానియొద్దనే యెల్లప్పుడునుఉండి కడపట సంకల్పపూర్వకముగా తానుచేసిన స్నానఫలమును వానికి దారపోయవలసినది అట్లు ధారాదత్తము చేయబడిన మాఘస్నానఫలమును యజమానుడగువాడు పుచ్చుకొని ఆబ్రాహ్మణునికి పరిశుద్ధమయిన దోవతుల జోడును దుప్పటిని అందులకు దగిన దక్షిణను వస్త్రము మొదలగు వానిచేత అలంకరింపబడిన సాధువైనలేగదూడతోడి పాడియావును ఇయ్యవలయును. ఇట్లుఎవడు తనకుగాను ఇతరునిచేత స్నానము చేయించి ఆఫలమును ధారాపూర్వకముగా తీసికొనునో వాడు తానే మాఘస్నానముచేసి పొందుటకంటె అధికఫలము పొందును. ఓ రాజా!

మాఘస్నానస్య వైభవమ్. సుకృతందుష్కృతంచైవ పాపినాంధర్మిణాం తథా, బ్రాహ్మణః క్షత్రియో వైశ్యో మాఘమాసే నిరంతరమ్. మాసోపవాసనియమం కృత్వా సంకల్పమేవచ, జితేంద్రియో జితక్రోధో జితనిద్రో జితశ్రమః. సదామౌనీ సదాధ్యానీజితరాగోఽవనీశయః, తిలాదీ తిలహోమీచ తిలదాతా తిలేశయః. దర్భపాణిర్దర్భశయః త్రికాలందేవపూజకః, సాయంప్రాతర్వైశ్వదేవః పంచయజ్ఞపరాయణః. ఏవమాది సదాచారో మాఘస్నాయీ యథావిధి, మాఘాంతరే త ముద్దిశ్య గాంచ దద్యాత్పయస్వినీమ్. శాలిప్రీహించ శాల్యంచ బ్రాహ్మణాన్భోజయేద్వ్రతీ, దత్వాతుదక్షిణాం తేభ్యో యథాశక్తిదయాపరః. ఆశిషో వాచయిత్వాతాన్ అనుజ్ఞాతశ్చతైః పునః, కుర్వీతపారణాంపశ్చాద్బంధుభిః ప్రీతమానసః. ఏవంయఃకురుతేమాఘంతస్య పుణ్యఫలంశృణు, సత్యలోకే విష్ణులోకే శివలోకే వసేద్వ్రతీ. సహస్రాక్షస్యలోకేచ చతుర్ష్వేతేషు భూమిప, ప్రత్యేకంసవసేద్ధర్మి కల్పానాం పంచవింశతిమ్ బాహ్యం

---

పాపులయొక్కయుంపుణ్యులయొక్కయుం దుష్కృతమును సుకృతమును అనుసరించి శ్రేష్ఠమయినదియుం రహస్యమయినదియునైన యీమాఘస్నానవైభవమును ఇంకను చెప్పెదను వినుము. బ్రాహ్మణుఁడుగాని రాచవాఁడుగాని కోమటివాఁడుగాని ప్రతిమాఘమాసమునందును మాసోపవాసనియమమును సంకల్పించుకొని ఇంద్రియములను కోపమును నిద్రను అణచినవాఁడును వ్రతమువలని క్లేశమును ఓర్చినవాఁడును ఎల్లప్పుడు మౌనము వహించి భగవంతునిధ్యానించువాఁడును విషయాసక్తిలేనివాఁడును వట్టినేలను పండుకొనువాఁడును నువ్వులనుదిని నువ్వులతో హోమము చేయుచు నువ్వులుదానమిచ్చుచు నువ్వులపై పండుకొనుచుండువాఁడును దర్భలుచేతఁబట్టుకొని అనఁగా, చేత పవిత్రము తొడిగి దర్భాసనము మీఁద పండుకొనుచుండువాఁడును మూఁడుకాలములందును దేవతార్చనము చేయువాఁడును రేపుమాపు వైశ్వదేవము చేయువాఁడును బ్రహ్మయజ్ఞము మొదలగుఅయిదు యజ్ఞములను చేయువాఁడునునై యథావిధిగా మాఘస్నానము చేయునట్టివాఁడు మాఘమాసముకడపట ఆమాఘమాసమునుద్దేశించిఒక పాడియావును దానము చేసి రాజనపువరిబియ్యమును వండించి బ్రాహ్మణులకుభోజనము పెట్టి భోజనము అయినపిమ్మట తనశక్తికొలఁదిని ఆబ్రాహ్మణులకు దక్షిణయిచ్చి ప్రాణులయందు దయగలవాఁడుఅగుచు వారిచేత ఆశీర్వచనములనుభోజనమునకు అనుజ్ఞనుపొంది పిమ్మట నెమ్మదితో చుట్టములును తానును పారణ చేయవలసినది. ఇట్లు మాఘస్నానము నడుపువాఁడు బ్రహ్మలోకము విష్ణులోకము శివలోకము ఇంద్రలోకము అనెడి నాలుగులోకములలోను ఒక్కొక్కలోకమునందు ఇరువదిఅయిదేసి కల్పములు

తమ్మలనాశాయ లోకానాంజ్ఞానసేతవే, తుభ్యమర్ఘ్యం ప్రదాస్యామి దే
హిమే స్నానజంఫలమ్. ఇతి దత్వా రవేరర్ఘ్యం సమయేర్ధోదితే నృప,
మంత్రేణానేన చ స్నాత్వా మనసా భాస్కరం స్మరన్. నిశానిద్రాం
ప్రవిష్టాయ మృతప్రాయాయ దేహినే, జ్ఞానదాత్రే నమస్తుభ్యం ప్రే
రకాయ స్వకర్మణే. ఇమం మంత్రం సముచ్చార్య సకృత్స్నాత్వా జపే
త్పునః, సర్వతీర్థాత్మనే తుభ్యం నదీనద హ్రదాత్మనే. సర్వక్షేత్రాత్మనే
తుభ్యం సర్వాఘౌఘవినాశినే, పరంజ్యోతిఃస్వరూపాయ పరానం
దాత్మనే నమః. సవిత్రే ప్రసవిత్రే చ మాత్రే పిత్రే నమోనమః, జగతా
మాదిభూతాయ మధ్యాయాంతాయ తేనమః. త్రయీశాయనమస్తుభ్యం
త్రయీవిహారతే నమః, మాఘస్నానేన మే దేవ యథోక్తఫలదో భవ.
ఏవంయః కురుతే స్నానం మాఘమాస్యరుణోదయే, భిత్వాబింబంరవే ర్యా
తి తద్విష్ణోః పరమంపదమ్. ఏవంవిధోమాఘమాసః సర్వకామఫలప్రదః,

---

వాసము చేయుదును. మరియు మాఘస్నానము చేయువాడు ప్రొద్దుపొడిచిపొడవని సమయము నందు సూర్యునిఉద్దేశించి, ఓసూర్యుడా! లోపలి వెలుపలి మలములను పోగొట్టువాడవును లోకులకు జ్ఞానమిచ్చువాడవును నైన నీకు అర్ఘ్యమును సమర్పించెదను. నాకు ఈస్నానము వలనిఫలమును ఇమ్ము. అను అర్థముగల మంత్రమును చెప్పి అర్ఘ్యము ఇచ్చి, స్నానము చేసి మనసునందు సూర్యునిధ్యానించి రాత్రికాలమునందు నిద్రచేత చచ్చినవానివలెఒళ్లుతెలి యకయుండునట్టిమనుష్యునకు మెలకువను కలుగజేసి తనపనులకై వాడు ప్రయత్నించునట్లు ప్రేరేపించువాడవైననీకొరకు నమస్కారము అను అర్థముగల మంత్రమును చెప్పుచు మరల ఒకసారి స్నానముచేసి ఎల్లతీర్థములును స్వరూపముగాగల వాడవును నదులు నదములు మడుగులనయిన వాడవును సమస్తపుణ్యస్థలములు నయిన వాడవును ఎల్లపాపసమూహము లను నశింపజేయువాడవును పరంజ్యోతిః స్వరూపుడవును సర్వోత్కృష్టమయిన ఆనంద మే స్వరూపమైనవాడవును నిద్రపోవువారిని మేలుకొలుపువాడవును ప్రజలకు జాగ్రత్తను పుట్టించువాడవును లోకులకుతల్లియుం తండ్రియుం నైనవాడవునైన నీకొరకు నమస్కారము. లోకములకు మొదలును నడుమును తుదయును నైనవాడవును మూడు వేదములకు అధిపతి యైనవాడవును మూడు వేదములందును వినోదముగ తిరుగువాడవునైన నీకు నమస్కరించెదను. నాకు ఈమాఘస్నానమునకు తగిన ఫలము ఇమ్ము. అను నీయర్థములుగల మంత్రములను చెప్పుచు ప్రొద్దుపొడుచునప్పుడు ఎవడు మాఘస్నానము చేయునో వాడు సూర్య బింబమునందు చొచ్చి ఆబింబమును భేదించుకొని విష్ణుదేవునిదైన పరమపదమును పొందును. ఈవిధముగా ఎల్లకోరికలను ఇచ్చునట్టిమహిమగలది మాఘమాసము. కనుక దీనికి

తస్మాదస్యైవమాఘస్య కేన మాసేనవర్ణ్యతే. మాఘసంయోగవైశిష్ట్యా దేకాదశ్యధికాస్మృతా, యామువోష్య నరోయాయా ద్ద్వాదశైకాదశీఫలమ్.

ఇతి శ్రీపాద్మేపురాణే, మాఘమాహాత్మ్యే, మాఘస్నానఫల ప్రభావకథనంనామ పంచవింశోఽధ్యాయః.

---

షడ్వింశోఽధ్యాయః.

వసిష్ఠః.—భీమసేనఃపురా ధౌమ్యమపృచ్ఛత్స్వపురోహితమ్, కుర్వంతి మనుజాస్సర్వే ఉపవాసంహరేర్దినే శిశవోనపపుఃక్షీరం సర్వేవర్ణా ద్విజోత్తమ, ప్రహాసంతిచ మాం సర్వే భుక్తంతు హరివాసరే. బహ్వాశీ బహుభక్షీచ ఇతినిందంతి మాంసదా, దుశ్శాసనాద్యాః కురవో మాంహసంతి విశేషతః. ఏకాదశ్యాంవిశేషేణ జఠరాగ్నిర్విజృంభతే, ఉపవాసస హోనాహం నితరాంక్షుద్బలీయసీ. క్షుధంనియమ్యయత్నేనబధ్వాజిహ్వా

సమానముగా మరియే నెలయును చెప్పబడదు. ఏయేకాదశినాటి యుపవాసము పండ్రెండు ఏకాదశుల ఉపవాసఫలముఁ ఇచ్చునో ఆమాఘమాసమునందు వచ్చెడి ఏకాదశి మాఘమాసముయొక్క సంబంధవిశేషముచేత ఎచ్చైనదిగా చెప్పబడును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు మాఘస్నానఫలప్రభావమును తెలియజేయునదియైన ఇరువదియైదవ అధ్యాయకథ.

---

ఇరువదిఆరవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—పూర్వకాలమునందు పాండురాజుయొక్క రెండవకొమారుడయిన భీమసేనుడు తమపురోహితుడైన ధౌమ్యునిజూచి, ఓబ్రాహ్మణోత్తమా! శ్రీహరివాసరమయిన ఏకాదశినాడు ఎల్లజనులు ఉపవాసముచేసెదరు. పసిబిడ్డలు పాలు సైతము త్రాగరు. జనులు అందరును ఏకాదశినాడు భోజనముచేసెడి నన్నుజూచి వీడు తిండిపోతు మిక్కిలి తినువాడు అని దూషించెదరు. అందును దుశ్శాసనుడు మొదలగు కౌరవులు మిక్కిలి దూషించుచున్నారు. నాకు ఆయేకాదశినాడు జఠరాగ్ని రేగుచుండును కనుక అధికమైన ఆయాకటికి ఓర్వలేకను ఎంతో ప్రయత్నముచేత ప్రాణముకు నాలు

మసూనపి, ఫలమూలాని సంప్రాశ్య లాజపిణ్యాకసక్థుకాన్. దధిక్షీరం
ఘృతం పీత్వా కరోమిసముపోషణమ్, ఉపోష్యైకాదశీమేకా మేకస్మిన్నాసి
మేవద. ఫలం ప్రాప్స్యామి సకలం ద్వాదశైకాదశీఫలమ్, ఏకాదశ్యుప
వాసస్య విధానం నియమంవద. భక్ష్యాని కానిపేయాని కానిస్వాదూని
భూసుర. ధౌమ్యః. సాధుభీమమహాబాహో యత్పృష్టోహమిహత్వయా,
తత్తేహం సంప్రవక్ష్యామి త్వమిహైకమనాః శృణు. మాఘస్యశుక్లపక్షే
యాభవత్యేకాదశీశుభా, పుష్యనక్షత్రసంయుక్తా పుణ్యవృద్ధికరీనృప. బు
తేపిపుష్యసంయోగాదుపోష్యావిష్ణుపక్షదా, ఏకమేకాదశీమేనా ముపో
ష్యవిధివన్నరః. ఏకాబ్దైకాదశీపుణ్యఫలభాక్స్యాన్నసంశయః, ఏకాపు
ణ్యామహాభాగానరాణాంపుణ్యకర్మణామ్. వినిహంతిమహాపాపాన్ కున్ను
పోవిషయం యథా, హిమం యథాసహస్రాంశు రనర్థశ్చార్థసంచయమ్.

---

కనుకట్టి పండ్లు వేళ్లు దుంపలు మొదలగువానిని తిని నీళ్లుత్రాగియు పేలాలు పేలపిండి తెలికపిండి మొదలగువానిని పెరుగు పాలు నెయ్యి వీనితోకలిపి త్రాగియు ఉపవాసము నడపుచు వచ్చెదను. కనుక ఎల్ల యేకాదశులఫలమును పొందదగిన ఒకయేకాదశిని ఆయేకాదశీ వ్రతము నడపునట్టి క్రమమును ఆయేకాదశినాడు భోజనము చేయదగిన వస్తువులను త్రాగదగిన పదార్థములను అందలి నియమముతోడ నాకు తెలియజేయుము అని యడిగెను.

ధౌమ్యునిమాటలు.—మిక్కుటమయిన భుజబలముగల ఓభీమసేనా! నీవు నన్ను ఇప్పుడు ఏమిఅడిగితివో ఆవిషయమును నీకు నేనుచెప్పెదను. మనసున కలవరములేకుండ ఎచ్చరికతోవినుము. మాఘమాసముయొక్క శుక్లపక్షమునందు వచ్చెడియేకాదశిమేలైనది. అది పుష్యనక్షత్రముతో చేరివచ్చినయెడ పుణ్యమును చాల వృద్ధిపొందించునది అగును. విష్ణువునకు ప్రియమును కలుగజేయునది గనుక ఆయేకాదశి పుష్యముతోగూడినది కాక పోయిన నాడు ఉపవాసము చేయవలయును. ఈచెప్పబడిన ఒక యేకాదశినాడు యథావిధిగా ఉపవాసము చేసిన పురుషుడు సంవత్సరమునందువచ్చెడి యిరువదినాలుగు ఏకాదశులయందును ఉపవాసము చేసిన ఫలమును పొందును. అందులకు సందేహము లేదు. ఒక్కటియైన ఈఏకాదశినాడు ఉపవాసము చేసిన పుణ్యపురుషులయొక్క పాపములు చెడ్డరాజును వానిరాజ్యము ఎట్లు వదలిపోవునో అట్లు వదలిపోవును. మరియు ఈ మాఘశుద్ధ ఏకాదశినాడు ఉపవాసము ఉండినపురుషుడు సూర్యుడు మంచును అనర్థములు శుభములను ఎట్లు పోగొట్టునో అట్లు పాపములను పోగొట్టును. ఇదిగాక నేను

ప్రఖ్యాపనాద్యథాధర్మం తపసో విషయా యథా. అశిక్షయా యథాపుత్రో గావో గోపాలవర్జితాః, అవజ్ఞయా యథాశ్రాద్ధం కోపేనచ యథా తపః. అనర్చితమసంకల్పం యథాశ్రాద్ధమసంస్కృతమ్, యథాకులమనాచారాద్యథావిత్తమవర్ధనమ్. అనామ్నాయాద్యథా వేదో యోషిద్వా సత్క్రియాయథా, వైవాహికే యథావిప్రో వేదహీనో యథాద్విజః పతిహీనాయథానారీ సతిహీనోయథాగృహీ, తథైవ హంతిపాపాని ఇయమేకాదశీతిథిః. పంచపాతకినాం పాపం నహన్యాచ్చ త్రిపుష్కరః, నచాపి నైమిశం క్షేత్రం క్షేత్రంచ కురుసంజ్ఞికమ్. ప్రయాగోన గయాగంగాన రేవానసరస్వతీ, కావేరియమునాచైవ దేవికాచ కథంచన. నాపర స్తీర్థ సంఘాతో హరేర్దినసమః క్వచిత్, నదానం న తపోహోమో నచాన్యత్సుకృతంక్వచిత్. నాలంపాతకనాశాయ భుక్త్వైకం హరివాసరమ్,సకృదేవోపవాసేన నశ్యంతే పాపరాశయః. ఏకతఃపృథివీదానమేకతో హరివా

---

అంతధర్మము చేసితిని ఇంతధర్మము చేసితిని అని చెప్పుకొనుటవలన ధర్మమును మంచి తపస్సువలన విషయములును శిక్షలేకపోవుటచేత బాలుడును కాచువాడులేక పసులును బ్రాహ్మణులను అవమానము చేయుటచేత శ్రాద్ధమును కోపముచేత తపస్సును బ్రాహ్మణులను అర్చింపనిదియు సంకల్పము చేయనిదియు చక్కగా నడుపబడనిదియు నైనశ్రాద్ధమును సదాచారములేని కులమును వృద్ధిపొందింపని ధనమును అప్పుడప్పుడు పఠింపమివలన వేదమును చెడ్డ నడవడిగల ఆడుదియు పెండ్లిచేసికొని వేదము చదువని బ్రాహ్మణుడును పెనిమిటిలేని పెండ్లామును పెండ్లాములేని గృహస్థుడును ఎట్లు చెడిపోదురో అట్లు మాఘశుక్ల ఏకాదశివలన పాపములు నశించును. దొంగ బ్రహ్మహత్యచేసినవాడు కల్లుత్రాగెడువాడు గురుభార్యను పొందినవాడు ఇట్టివారితో కూడినవాడును అగు పంచమహాపాతకులపాపము మూడుపుష్కరములు గంగలోస్నానముచేసినను తొలగదు. అట్టిపాపము ఈయేకాదశినాటి ఉపవాసమువలన తొలగును. (పుష్కరము అనగా పుణ్యతీర్థములయందుపండ్రెండేండ్లకు ఒకతూరి జలము తనంతట ఉబుకునట్టిపుణ్యకాలము.) నైమిశము కురువు అనెడిపుణ్యక్షేత్రములును ప్రయాగము గయ గంగ నర్మద సరస్వతి కావేరి యమున దేవిక మొదలగు నదులును ఇంకనుగల యిట్టి తీర్థవిశేషములును ఎప్పుడును ఏకాదశితో సమానములు కానేరవు. మరియు దానము తపస్సు హోమము ఇతరములయిన పుణ్యకర్మలును ఏకాదశివలె పాపములను తొలగింపజాలినవికావు. ఒకానొక ఏకాదశినాడు చేసిన ఉపవాసముచేతనే పాపసమూహములు నశించుచున్నవి. ఒకతట్టు భూదానఫలమును ఒకతట్టు ఏకాదశీవ్రతఫలమును పెట్టితూచగా ఏకాదశిఫలము

సరః, తులయేత్పృథివీదానా దధికో హరివాసరః. దశమ్యామేకభుక్తేన బ్రహ్మచర్యేణవానిశి, ఏకాదశ్యా ముషఃకాలే స్నాత్వా నిర్వర్త్యనిత్యకమ్. ఔపాసనాహుతిం హుత్వా బ్రహ్మయజ్ఞంసమాప్యచ, ఉపవాసంచ కుర్వాణో విష్ణుమంత్రమిమం జపేత్. అద్యస్థిత్వా నిరాహారో శ్వోభూతే పురుషోత్తమ, భోక్ష్యామి పుండరీకాక్ష శరణం మే భవాచ్యుత. ప్రమాదా దథవాలస్యా ద్ధరే కేశవ మాధవ, వ్రతస్యాస్యచ మేవిఘ్నో నభవేత్త్వత్ప్రసాదతః. ఇతి సంకల్ప్య విధివ న్నియమేన సమన్వితః, వరాహరూపిణం కృష్ణం కృత్వా హేమ్నావసుంధరామ్. ఉపలిప్య శుచౌదేశే రంగవల్ల్యా పరిష్కృతే, చతుర్ద్వారవతీరమ్యే మండపే కుసుమోత్కటే. పూర్ణకుంభై శ్చతుర్దిక్షు శోభితే శుభలక్షణే, ముక్తావితానసంయుక్తే ముక్తాదామ పరిష్కృతే. పుష్పమాలా పరిష్కృతే దర్పణ చ్ఛత్రచామరైః, తస్మిన్మండపికామధ్యే ధాన్యరాశిం వినిక్షిపేత్. క్షౌమావృతం పూర్ణకుంభం తస్మిన్ క్షౌమం నిధాయచ, తస్యోపరి న్యసేద్దేవం శ్రీయుతంచ వసుంధరామ్. అష్టదిక్ష్వష్టధాన్యాని విన్య

---

తట్టే మొగ్గ కానవచ్చును. ఏకాదశీవ్రతమును జరపునట్టి పురుషుడు దశమినాడు ఒంటిపూట భోజనము చేసి నాటిరాత్రి భార్యతో కలియక గడపి ఏకాదశినాడు తెల్లవారి లేచి స్నానము చేసి సంధ్యావందనము మొదలగు నిత్యకర్మలను జరపి ఔపాసనము చేసి బ్రహ్మయజ్ఞమును కావించి ఉపవాసము చేయువాడగుచు "ఓ పురుషోత్తమా పుండరీకాక్షా అచ్యుతా హరీ కేశవా మాధవా! ఈదినము ఆహారములేకయుండి రేపు తెల్లవారగానే భోజనము చేసెదను నన్నురక్షింపుము. మదిమరపుచేతనయినను మాంద్యముచేతనయినను ఈవ్రతము విఘ్నములేకుండ నీయనుగ్రహముచేత జరుగునుగాక" అనెడిఈయర్థముగల మంత్రమును జపించుచు యథావిధిగా సంకల్పముచేసి నియమముగలవాడై, వరాహరూపముపొందిన శ్రీకృష్ణమూర్తిని బంగారుతో చేసి భూమిని అలికి పరిశుద్ధమైన ఆ అలికిన ప్రదేశమునందు నాలుగువాకిళ్లుగల మండపమును చేసి ముగ్గులచేత అలంకరింపబడినదియు పువ్వులచేత శృంగారింపబడినదియు నాలుగుదిక్కులయందును జలమునింపిన కలశములచే ప్రకాశించునదియు ఇంకను అనేకములైన శుభలక్షణములుగలిగినదియు ముత్యాలమేలుకట్టుతో గూడినదియు ముత్యాలసరములచేత అలంకరింపబడినదియు పూలదండలచేత చుట్టబడినదియునైన ఆమండపము నడుమ అద్దము గొడుగు వింజామరలు వీనితోడ ధాన్యరాశిని ఉంచి, ఆరాశిమీద తెల్లనివస్త్రమునుపరచి దానియందు తెల్లనివస్త్రమును

సేద్ద్రోణసంఖ్యయా. యవవ్రీహి తిలాన్మాషాన్ ముద్గగోధూమ శా
లికాన్, ప్రాగాదిదిక్క్రమేణైవ శ్యామాకాంశ్చైవ విన్యసేత్. ఏవం
విధాయ మధ్యాహ్నే పునస్స్నానం సమాచరేత్, మాధ్యందినంచ
నిర్వర్త్యవైశ్వదేవాదికంతథా. నానావిధాని పుష్పాణి సంపాద్య తుల
సీమథ, పూజాద్రవ్యాణిసర్వాణిపూజోపకరణానిచ. అసకృజ్జలపానంచ
సకృత్తాంబూలభక్షణమ్, కందమూలఫలాదీనాం భక్షణంచ దివాత్య
జేత్. నిత్యస్య కర్మణోశక్తౌ ఘృతం క్షీరం జలంఫలమ్, ప్రాశయేత్ప్రా
ణరక్షార్థ మగ్నిపక్వం నభక్షయేత్. దీపయిత్వాభితోదీపాన్ ఘృతవర్తి
సమన్వితాన్, ప్రాణానాయమ్య సంకల్ప్య ఆచార్య మభిపూజ్యచ.
ప్రతిష్ఠాబింబయోః ప్రాణాన్ పూజయేద్ధ్యానపూర్వకమ్, నానాబీజాని
రత్నాని పూర్ణకుంభే వినిక్షిపేత్. ఆవాహనాదిదీపాంతం పూజయి
త్వాతతోర్చయేత్, మత్స్యాయతేనమఃపాదౌ కూర్మాయేతితతఃకటిమ్

---

చుట్టి జలమునిండించిన కలశమును ఉంచి ఆకలశముపైని శ్రీదేవితోను భూదేవితోను
గూడినవాడైన విష్ణుమూర్తినినిలిపి, ఆకలశమునకు ఎనిమిదిదిక్కులయందును ఎనిమిది
విధములయిన యవలు ఎఱ్ఱవడ్లు నువ్వులు మినుములు పెసలు గోధుమలు రాజనపువడ్లు
చామలు ఈధాన్యములను దినుసునకు నల్గుముచొప్పున క్రమముగా రాసులుపోయించి
అంతట మధ్యాహ్నకాలమునందు మరల స్నానము చేసి ఆప్పుడుతాను చేయవలసినసంధ్యా
వందనము మొదలుగాగల నిత్యకృత్యములను వైశ్వదేవమును చేసి నానావిధములైన పువ్వు
లను తులసిని సంపాదించుకొని పిమ్మట పూజకు కావలసిన ద్రవ్యములను అన్నిటిని
పూజకు ఉపయోగించెడి సాధనములతోడ చేర్చిపెట్టుకొని నాటిపగలంతయు తాంబూల
మువేసికొనక పలుమారు నీళ్లుత్రాగుటయు దుంపలు వేళ్లు పండ్లు మొదలగువానినిసైతము
భక్షించియుండుట మాని యుండవలెను. ఒకవేళ నిత్యకర్మమును జరపుకొనుటకు
గూడ శక్తిలేకపోయినయెడ నెయ్యి పాలు జలము పండు వీనిని ప్రాణములను కాపాడు
కొనుటకుగాను ఆహారముగా తీసికోవచ్చును. నిప్పునందు పక్వముచేయబడిన పదా
ర్థమును ఎంతమాత్రను భక్షింపరాదు. వత్తివేసి నెయ్యిబోసిన దీపపుసెమ్మెలను వెలి
గించి నాలుగుప్రక్కలను పెట్టి ప్రాణాయామమును సంకల్పమునుచేసి మునుపుచేయించి
యుంచుకొన్న కృష్ణవిగ్రహమునందు ప్రాణప్రతిష్ఠచేసి ఆవిగ్రహమునందు అనేక
విధధాన్యములను రత్నములను నిండించియుంచిన కలశముమీదపెట్టి ధ్యానపూర్వకము
గా పూజింపవలెను. ఆవాహనము మొదలుకొని దీపముదాకగల పదియారువిధములయిన
యుపచారములచేతను బూజించి అయినపిమ్మట మత్స్యమూర్తివైననీకొరకు నమస్కా
రము అని పాదములను, కూర్మమైన నీకొరకు నమస్కారము అని నడుమును, వరాహ

వరాహాయ నమోనాభిం నారసింహాయ చోదరమ్, వామనాయ నమో బాహూ కంఠం రామాయ తేనమః. రామాయేతి ముఖం పూజ్య ఫాలం రామాయ తేనమః, నమోబుద్ధాయ మూర్ధానం కేశాంతం కల్కినేనమః దశాంగం పూజయిత్వైవం వాసుదేవాదికాన్యజేత్, ఆత్మానమంతరాత్మానం పరమాత్మానమేవచ. జీవాత్మానం యతో దిక్షు ఆవాహ్యాచ యథాక్రమమ్, పునర్ధూపంచ దీపంచ నైవేద్యంచ నివేదయేత్. హస్తోద్వర్తనతాంబూలముఖగంధం నివేదయేత్. విచిత్రగంధమాల్యాని వస్త్రాణ్యాభరణానిచ. సంపూజయే ద్ద్వాదశభి ర్నామభిః కేశవాదిభిః, దేవస్య స్తోత్రపఠనైః పురాణశ్రవణేనచ. విదధ్యా జ్జాగరం రాత్రౌ పుణ్యశ్రవణకీర్తనైః, ప్రాతర్నిర్వర్త్య కర్మాణి పూర్వవ ద్దేవ మర్చయేత్. సమ్యగారాధ్య దేవేశం యథా విభవవిస్తరమ్, ప్రణమ్యబహుశో భక్త్యా ప్రార్థయేత్సుమనోరథమ్. ఆచార్యం పూజయిత్వాథ తస్మై దద్యాచ్చ భక్తితః,

---

మైన నీకొరకు నమస్కారము అని బొడ్డును, నారసింహుడవైన నీకొరకు నమస్కారము అని కడుపును, వామనుడవైన నీకొరకు నమస్కారము అని చేతులును, పరశురాముడవైన నీకు నమస్కారము అని కంఠమును, శ్రీరాముడవైన నీకు నమస్కారము అని ముఖమును, బలరాముడవైన నీకు నమస్కారము అని నొసటిని, బుద్ధుడవైన నీకు నమస్కారము అని నడినెత్తిని, కల్కివైన నీకు నమస్కారము అని తలవెండ్రుకలను బూజచేయవలెను. ఇట్లు పదియవతారములను చెప్పి పదియంగములను బూజించి పిమ్మట వాసుదేవాదినామములతో యథావిధిగా అర్చనచేయవలెను. అంతట తన్నును తనఅంతరాత్మను పరమాత్ముడైన భగవంతుని జీవాత్ముడైన ప్రాణుని నియతితో కలశమునకు నాలుగుదిక్కులయందును క్రమముగా ఆవాహనముచేసి మరల ధూపము దీపము నైవేద్యము మొదలగు ఉపచారములతో బూజచేసి తాంబూలమును అందులకువలయుపరిమళద్రవ్యములను నానావర్ణములైన పరిమళముగల పువ్వుదండలను వస్త్రములను ఆభరణములను సమర్పించి కేశవాదినామములు పండ్రెండింటిచేత బూజచేయవలసినది. పిమ్మట భగవంతుని స్తోత్రముచేతను పురాణములను వినుటచేతను పుణ్యకథలను వినుటచేతను ప్రొద్దుపుచ్చుచు రాత్రికాలమునందు జాగారము చేయవలసినది. తెల్లవారగానే అప్పటినిత్యకృత్యములన్నిచేసికొని ముందు చెప్పినచొప్పున దేవతార్చనముచేయవలసినది అట్లు తనకలిమికితగినట్లు దేవునిఆరాధనముకాగానే భక్తితో భగవంతుని తనయిష్టము వచ్చినన్ని మారులు నమస్కారము చేసి ప్రార్థింపవలసినది. ఆటుపిమ్మట తనగురువును పూజించి ఆయనకు తాను అర్చించిన కృష్ణవిగ్రహమును ఆవిగ్రహము నుంచియున్న

బింబం కుంభం తథాక్షౌమం ధాన్యాన్యన్యాని సర్వశః, ఆచార్యాయ ప్రతిదద్యా ద్యథాశక్తిసదక్షిణామ్. పశ్చాత్తుపారణాంకుర్యా దేషధర్మ స్సనాతనః, ఏవంతు కుర్వతో భక్త్యా వ్రతమేత చ్ఛరీరిణః భస్మీభవత్య శేషైన స్తమసూర్యోదయేయథా, ఏవంకురుష్వకౌంతేయద్వాదశైకా దశీఫలమ్ వసిష్ఠః. ఇతిధౌమ్యవచశ్శ్రుత్వా భీమసేనః ప్రసన్నధీః, కరిష్య ఇతితంనత్వా సంప్రాప్తేహరివాసరే. మాఘమాసే శుక్లపక్షే ప్రాతస్స్నాత్వాయథావిధి, నిర్వర్త్యనైత్తికంకర్మ ధౌమ్యోక్తవిధిమార్గతః. కృత్వా వరాహపూజాంచ యథా విభవవిస్తరమ్, సహస్రైవపురోద్యానం గత్వాథ సుసమృద్ధిమత్. సలక్షం నారికేళానాం ద్విలక్షం కదళీఫలమ్, పనసానాం సహస్రంచ పుండ్రేక్షూణాంశతంశతమ్. నివేద్య విష్ణవే సర్వం తద్భుక్త్వా నాతిహృష్టవాన్, బడబానలవత్తీవ్రం జఠరాగ్నిం సహాకథమ్. రాత్రౌజాగరణంకృత్వా తదారాధ్యజనార్దనమ్, సంపూజ్య విధివస్నాత్వా సంప్రార్థ్యప్యమునోరథమ్. పునఃప్రభాతే సంపూజ్య కృత్వాదా

---

కలశమును కలశమునకు చుట్టినవస్త్రమును అక్కడవోసియున్న ధాన్యరాసులను తక్కిన పదార్థములను తనశక్తికొలదిని దక్షిణపెట్టి భక్తితో దానముగా నిచ్చి అవతల ద్వాదశి పారణ చేయవలసినది. ఇట్లు ఏకాదశీవ్రతమునడపుట పెద్దలవలన నియమితమైన ధర్మము. ఈవిధముగా ఏకాదశీవ్రతమును భక్తితో ఆచరించునట్టి మానవులయొక్క పాపములన్నియు సూర్యోదయము కాగానే చీకట్లునశించునట్లు నశించును. ఓభీమసేనా! నీవును ఇప్పుడు నేనుచెప్పినచొప్పున మాఘశుక్ల ఏకాదశినాడు వ్రతమును చేయుము. నీకు పండ్రెండు ఏకాదశులఫలము లభించును అని ధౌమ్యుడు పలికెను.

వసిష్ఠునిమాటలు —ఇట్లు ధౌమ్యుడు చెప్పినమాటలను విని భీమసేనుడు తేటపారిన బుద్ధిగలవాడై అట్లేచేయుదునని అతనికి మ్రొక్కి మాఘశుద్ధమేకాదశి రాగానే యథావిధిగా తెల్లవారి స్నానముచేసి నిత్యకర్మములను తీర్చుకొని ధౌమ్యుడు చెప్పినవిధమున తనకలిమికితగినట్టు వరాహపూజచేసి వెంటనే ఫలవృక్షముల సమృద్ధిగలిగిన పట్టణము వెంబడితోటకుపోయి లక్షటెంకాయలను రెండులక్షల అరటిపండ్లను వేయిపనసపండ్లను పదివేలనామాల చెరకులను తెచ్చి విష్ణుదేవునికి ఆరగింపుచేసి, వానినంతయుంతాను ఫలాహారము చేసియుం తృప్తినిపొందక బడబాగ్నివలెమండుచున్నజఠరాగ్నియొక్క వేండ్రమునకు ఎట్లో ఓర్చుకొనియుండి, ప్రొద్దుగ్రుంకిన పిమ్మట మరల స్నానముచేసి దేవతార్చనముచేసి నమస్కారమును ప్రార్థనమును కావించి ఆ రాత్రి జాగారముచేసి మరునాడు తెల్లవారగానే స్నానముచేసి తన శక్తికొలదిని దేవుని పూజించి బ్రాహ్మ

నంయథాబలమ్, చకారపారణాం భీమో భక్ష్యభోజ్యాన్నపర్వతమ్. త దాప్రభృతిలోకేసా భీమైకాదశి సంజ్ఞికా, మాసానాంపరమోమాఘ స్త స్మాన్మాఘసమోనహి. సర్వఏవశుభఃకాలః సర్వదేశ స్తథాశుచిః, సర్వేపి దానపాత్రాణిజలం సర్వంచపాపహృత్. సర్వంద్రవ్యందానయోగ్యంమ కరస్థేదివాకరే, యథాశ్వమేధోయజ్ఞానాం నగానాం హిమవాన్యథా. వ్రతానాంతు యథాసత్యం దానానామభయంయథా, ప్రాణాయామ శ్చ తపసాం మంత్రాణాంప్రణవో యథా. ధర్మాణామప్యహింసాచ యో షితాంశ్రీర్యథావరా, యథాత్మవిద్యావిద్యానాం గాయత్రీఛన్దసామివ. సర్వేషాంశివభక్తానాం యథానారాయణఃపరః, వైష్ణవానాం యథాశం భుర్ధేనూనాంకామధుగ్యథా. సర్వేషామపిపాత్రాణామాహితాగ్నిర్య థావరః,తథాసర్వేషుపుణ్యేషుమాఘస్నానంవిశిష్యతే.గరుడాలోకమా త్రేణ ఫణినోనిర్విషాయథా, నిష్ప్రభాణితథైనాంసిమాఘమాసస్యవైభ వాత్.వ్యసనైరభిభూతస్యధనహీనస్య పాపినః,మాఘమాసోగతిస్త స్యగతి

---

ణులకు దానములను చేసి పర్వతమువలె రాశిగాపోయబడిన అన్నమును తినుబండములు మొదలగువానితో పారణచేసెను. అది మొదలుకొని ఆమాఘశుద్ధ ఏకాదశి భీమైకా దశి అని చెప్పబడుచున్నది. మాసముల లోపల మాఘమాసముతో సమానమయిన మాసములేదు. సూర్యుడు మకరరాశిని పొందగానే ఎల్ల కాలములను మంచివిగాను ఎల్ల దేశములను పరిశుద్ధములుగాను ఎల్లజనులును దానమిచ్చుటకు తగినవారుగాను ఎల్ల నీళ్లు ను పాపములను పోగొట్టునవిగాను ఎల్లవస్తువులును దానమిచ్చుటకు తగినవిగాను అగుచు న్నవి. యజ్ఞములోపల అశ్వమేధమును కొండలలోపల హిమవంతమును వ్రతములలోపల సత్యవ్రతమును దానములలోపల అభయదానమును తపస్సులలోపల ప్రాణాయామ మును (ప్రాణవాయువును స్వాధీనము చేసుకొనుట) మంత్రములోపల ప్రణవమును ధర్మ ములలోపల అహింసయును ఆడువారిలోపల లక్ష్మీదేవియును విద్యలలోపల బ్రహ్మవిద్యయును ఛందస్సులలోపల గాయత్రియును శివభక్తులలోపల నారాయణఋషియును విష్ణుభక్తులలో పలశివుడును గోవులలోపల కామధేనువును పాత్రులలోపలఆహితాగ్నియును ఎట్లువిశేషిం చినవారో అట్లు ఎల్ల పుణ్యకార్యములలోను మాఘస్నానము విశేషించినది. గరుత్మం తుని చూచినమాత్రముచేతనే పాములువిషములేనివిఅగునట్లు మాఘమాసముయొక్క ప్ర భావమువలనఎల్ల పాపములును కళతప్పినవైనశించును. విషయములయందలి ఆసక్తిచేకొట్ట బడినవానికిని ధనము లేనివానికిని పాపాత్ములగువారికిని మాఘమాసముకంటె ఇతర

రన్యానవిద్య తే. చంద్రహీనా యథారాత్రి స్సూర్యహీనం యథానభః, గౌర్యథా క్షీరహీనాచ జలహీనం యథాసరః అంబుహీనోయథాకూపో హ్యప్రసూతా యథాంగనా, తథైవతే మనుష్యాశ్చ మాఘస్నానవివర్జితాః. అనయాసంపదోయద్వ న్మఖాయద్వదదక్షిణాః, జీవహీనో యథా దేహో మాతృహీనో యథా శిశుః. విద్యాహీనో యథావిప్రో విత్తహీనోయథాశిశుః, తథైవ తేమనుష్యాశ్చ మాఘస్నానవివర్జితాః. జీవన్నపి మృతోమర్త్యః సమర్థోపిసవైజడః, చక్షుష్మానపిసోంధస్స్యాత్ జ్ఞానవానపి మూఢధీః. శ్రుతవానపి మూర్ఖస్స్యాద్యో మాఘే న నిమజ్జతి, త్రిదినం త్వేకభుక్తస్తు దివానక్తం త్రిరాత్రికమ్. అయాచితాశీత్రిదినం త్రిదినం చోపవాస్యపి, ఏవం ద్వాదశమాత్రంచ మాఘమాసే వ్రతంచరేత్. తద్వాభుక్త్వా తతోవిప్రో బ్రహ్మభూయాయకల్పతే, అశుభైః కర్మభిర్గ్రస్తో మజ్జమానోభవార్ణవే. పతతోనిరయేమర్త్యాన్మాఘస్సంతారయేద్ధ్రువమ్, అకామోవా సకామోవా యోమాఘే

---

మైనగతిగానము. చంద్రుడులేని రాత్రియు సూర్యుడులేని ఆకాశమును పాలులేని ఆవును నీళ్లులేని నూయియు బిడ్డలుకనని ఆడుదియు దక్షిణలేని యజ్ఞమును ప్రాణములేని దేహమును తల్లిలేనిబిడ్డయు చదువులేని బ్రాహ్మణుడును ధనములేని కోమటివాడును ప్రకాశింపనివిధమున మాఘస్నానము చేయని మానవులు ప్రకాశింపరు. ఎవడు మాఘస్నానము చేయనివాడో వాడు బ్రతికియుండియు చచ్చినవాడు అగును. నేర్పరియైనను ఏమి తెలియనివాడు అగును. కన్నులు గలిగియుండియు గ్రుడ్డివాడు అగును. తెలివి గలవాడుగానుండియు తెలివిలేనివాడు అగును. వేదశాస్త్రముల వినికిగలవాడైనను మూర్ఖుడుఅగును. మాఘమాసమునందు మూడుదినములుపగలు ఒకసారిమాత్రము భోజనము జేసియు మూడుదినములు రాత్రియందుమాత్రముభోజనము చేసియు మూడుదినములు ఒకరిని అడుగక తనంతటదొరకిన ఆహారమును తీసికొనియు మూడుదినములు శుద్ధోపవాసము చేసియు ఈవిధముగా పండ్రెండుదినములు వ్రతమునడపి పదుమూడవనాడు తన శక్తికొలదిని దానధర్మములుచేసి భోజనము చేయునట్టి పురుషుడు బ్రహ్మత్వమును పొందును చెడ్డపనులచేత మ్రింగబడినవారును (పాపకార్యములు చేసి ఆపదలను పొందువారును) జన్మములనెడి సముద్రమునందు మునిగినవారును (అనేక జన్మములుఎత్తి దుఃఖములను పొందువారు) నరకమునందు కూలునట్టివారును అగుజనులను మా

స్నాతిమానవః. తస్యధ్రువం బ్రహ్మలోకః కిముభక్తిమతాంనృణామ్, మహాజలాశయోయస్మిన్ దేవఖాతహ్రదోనదీ సరాంసి సరితశ్చైవ పుష్కరిణ్యోతినిర్మలాః, సముద్రగా మహానద్యః సప్తజన్మాఘనాశనాః. బ్రహ్మలోకస్తు సర్వేషాం లోకానా ముత్తమో యథా, తథా సర్వేషు పుణ్యేషు మాఘమాసో మహోదయః. మకరం సముపేయుషిభాస్వతియో విమలే పరిశీతల బాహ్యజలే, శివకృష్ణహరేతి నిమజ్జన కృత్త్రిదశీ ముఖపత్త్రలతాం విలిఖతి మాఘమాసస్య మాహాత్మ్యం మయా వక్తుం నశక్యతే, యత్ర సాచావతరతి శివరాత్రి శ్శివప్రియా. కేన వా వర్ణ్యతే మాఘ శ్శివాఖ్యాతు చతుర్దశీ, యత్రావతారం కురుతే కైలాస పదదాయినీ. మాఘాత్యయే రుద్రచతుర్దశీతి కాచి త్తిథిర్ధ్వస్తకృత కల్మషఘ్నీ, వ్యాజేన కేనాపి కృతోపవాసం నినాయ కైలాసపదం పులిందమ్.

ఇతి శ్రీపాద్మేపురాణే, మాఘమాహాత్మ్యే, ఏకాదశీ వ్రత ప్రభావ కథనంనామ షడ్వింశోఽధ్యాయః.

---

ఘమాసము తప్పక ఉద్ధరించును. కోరికగలిగిగాని లేక గాని మాఘస్నానము చేయునట్టి మనుష్యునికి బ్రహ్మలోకము తప్పక కలుగుచుండగా భక్తిగలిగి మాఘస్నానము చేయునట్టి పుణ్యాత్ములకు బ్రహ్మలోకము కలుగునని వేఱె చెప్ప నేల. మాఘమాసమునందు గొప్ప చెరువులు దొనలు మడుగులు ఏళ్లు గుంటలు వాగులు మిక్కిలి తేటనీళ్లుగల కోనేళ్లు సముద్రములో జేరెడిగొప్పయేళ్లును ఏడుజన్మములందు జేసిన పాపములను నశింపజేయగలవు. అన్నిలోకములలోపల బ్రహ్మలోకము ఉత్తమమయినట్లు అన్నిమాసములలోపల మాఘమాసము మిక్కిలి ఉత్తమము. సూర్యుడు మకరరాశినిపొందుచుండగానే మిక్కిలిచల్లనై తేటగానుండునట్టి ఊరిబయటనుండెడి చెరువు మొదలగువాని జలమునందు శివా, కృష్ణా, హరా, అని స్నానముజేయునట్టి పురుషుడు దేవతాస్త్రీల చెక్కిళ్లయందు మకరికాపత్త్రములను వ్రాయును. అనగా స్వర్గమునుపొందును. కనుక మాఘమాసముయొక్క మహిమఇట్టిది అని చెప్పునేను శక్తుడనుకాను. శివునికి ప్రియమయిన శివరాత్రియనునది యేమాఘమునందు వచ్చుచున్నదో ఆమాఘమాసమును ఎవడు వర్ణించిచెప్పగలడు. అట్టిమాఘమాసముకడపట కైలాసపదవినిపొందించునదియైన శివచతుర్దశి వచ్చును. పాపములనెడి మురికిని బోగొట్టునట్టి ఆశివచతుర్దశి ఒకానొకనిమిత్తముచేత ఉపవాసముండిన ఒకబోయవానిని కైలాసము పొందించెను.

ఇది శ్రీ పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు ఏకాదశీవ్రతప్రభావమును తెలుపునట్టిదైన ఇరువదియారవ అధ్యాయకథ.

## సప్తవింశోఽధ్యాయః.

వసిష్ఠః.—శృణు రాజన్ప్రవక్ష్యామి శివరాత్రివ్రతంతవ, వ్రతానాముత్తమం సాక్షాచ్ఛివలోకైకసాధనమ్. మాఘఫాల్గునయోర్మధ్యే కృష్ణపక్షచతుర్దశీ, శివరాత్రి రితిజ్ఞేయా సర్వపాపప్రణాశనీ. కృతోపవాసా యేమర్త్యా శ్శివమర్చంతియేనరాః, బిల్వపత్రైంచతుర్యమం తేయాంతి శివతుల్యతామ్. నతపోభి ర్నదానైశ్చ నజపైశ్చ సమాధిభిః, ప్రాప్యతేతత్ఫలంరాజన్నోపవాసమఘాదిభిః. గుహ్యాద్గుహ్యతమంలోకే వ్రతమేతచ్ఛివప్రియమ్, త్వయాహిఖలుసర్వత్ర నప్రకాశ్యమిదం వ్రతమ్ భూధరాణాం యథా మేరు స్తేజసాం భాస్కరో యథా, ద్విపదానాంయథా విప్రో కపిలా చ చతుష్పదామ్. జప్యానామివ గాయత్రీ రసానా మమృతంయథా, పురుషాణాం యథా విష్ణుః స్త్రీణాం యద్వదరుంధతీ. శివరాత్రివ్రతం తద్వ ద్వ్రతానాముత్తమంతథా, శివరాత్రిమహావహ్ని ర్భవానిలసమన్వితః. దహత్యవారితో వేగా చ్ఛుష్కార్ద్రం కల్మషేంధనమ్,

### ఇరువది యేడవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓరాజా! వ్రతములలోపల ఉత్తమమయినదియును శివలోకమును పొందుటకు ముఖ్యసాధనమైనదియును అగు శివరాత్రివ్రతమును నీకుచెప్పెదను వినుము. మాఘఫాల్గునమాసములు నడుమవచ్చెడి సర్వపాపములను నాశముచేయునదియైన కృష్ణపక్ష చతుర్దశి శివరాత్రియని తెలియదగినది. ఆశివరాత్రినాడు ఉపవాసము చేసి బిల్వదళముచే శివుని పూజించువారు ఎవరో వారు నాలుగవదియైన శివసాయుజ్యమును పొందుదురు. ఆఫలము శివరాత్రికంటె ఇతరములైన తపస్సులచేతను దానములచేతను జపములచేతను సమాధులచేతను మఘ మొదలగువానియందు ఉపవాసము ఉండుటలచేతను పొందరాదు. శివునికి ప్రియమయిన ఈవ్రతము రహస్యములలో నెల్లను మిక్కిలి రహస్యము. కనుక నీవును దీనిని బహిరంగము చేయకుము. పర్వతములలోపల మేరుపర్వతమును వెలుగునట్టివానిలోపల సూర్యుడును రెండు పాదములు గలవారిలోపలబ్రాహ్మణుడు నాలుగు పాదములుగల ప్రాణులలోపల కపిలగోవును జపము చేయదగిన మంత్రములలోపల గాయత్రియును రసవస్తువులలోపల అమృతమును మగవారిలోపల విష్ణుదేవుడును ఆడువారిలోపల అరుంధతియును ఎట్లు ఉత్తములో అట్లు వ్రతములన్నిటిలోను శివరాత్రివ్రతము ఉత్తమము. శివరాత్రివ్రతమనెడినిప్పు శివుడనెడి గాలితోగూడినదై నివారింపరానివడితో అనగా, అతిశీఘ్రముగా ఎండీ ఎండని కట్టెలనుబోలిన పాపములను కాల్చివేయును. రక్తజలప్రవాహమును మాంసమనెడి బురదయు

ఘోరా వైతరణీ యాసృక్ప్రవాహామిషకర్దమా. సాపి క్షీరవహా తేషాం
మధుపాయసకర్దమా, పురాభూదంకిలో నామ లుబ్ధకశ్శాకలేపురే. ప్రాం
తే దేశస్య రౌద్రాత్మా సదార శిశుధారకః, కుచేలో మలదిగ్ధాంగో
రక్తార్ద్రకరజస్సదా. రక్తాక్షో నిరనుక్రోశో జనభక్షో వికారవాన్, అన
న్యజీవనో మాంసైః పుత్రదారాత్మపోషకః. స కదాచిద్ధనుష్పాణిః కృ
ష్ణాంగః కృష్ణకంచుకః, బద్ధగోధాంగుళిత్రాణో జరాపలితమూర్ధజః. మృ
గయుర్మృగయాశీలో విషదిగ్ధశిలీముఖః, జగామ కాననం ఘోరం సజలాం
బుదసన్నిభమ్. బహువృక్షసమాకీర్ణం నానావ్యాళ సమాకులమ్, కపి
త్థాశ్వత్థవానీరప్లక్షాంకోలక సమ్మితమ్. చిరిబిల్వమహాబిల్వ గుంద్రాస
ల్లకిసంకులమ్, కపీతవార్క్షి కాకీర్ణం తుంగగుగ్గులుపాదపమ్. తత్ప్రవిశ్య
మహాఘోర మేకాకీ గతసాధ్వసః, మృగపాదాంకితే మార్గే మార్గయా
మాస లుబ్ధకః. కోలశల్య రురుద్వీపి కృష్ణసారశశాదయః, వీక్ష్యబిభ్య

---

గలిగి భయంకరమైన వైతరణీనది శివరాత్రివ్రతమును ఆచరించినవారికి పాలనెడిజలప్ర
వాహమును తేనె పరమాన్నము ననెడి బురదగలదై తోచును. పూర్వకాలమునందు
శాకలము అను పట్టణమునందు అంకిలుడను పేరుగల బోయవాడొకడు ఉండెను. వాడు
తానుండునట్టి ఊరికి సమీపముననుండు దేశమునకు భయంకరుడై పెండ్లాము బిడ్డలతోడ
జీవించువాడును చింపిగుడ్డలుగలవాడును దేహమునందెల్ల మురికి కమ్ముకొన్నవాడును
నెత్తుటిచే తడసిన గోళ్ళుగలవాడును ఎఱ్ఱనికన్నులు గలవాడును దయలేనివాడును జను
లను భక్షించువాడును వికారరూపము గలవాడును వేటతప్ప ఇతరమయిన బ్రతుకు దెరు
వులేనివాడును మాంసముచేతనే పెండ్లాము బిడ్డలను తన్నును పోషించుకొనువాడును నై
యుండును. అటువంటి ఆబోయవాడు ఒకనొక సమయమునందు నల్లనిశరీరము గలవా
డును నల్లని కవచము తొడిగినవాడును ఉడుముతోలుతో కుట్టబడిన వ్రేలికవచము
తొడుగుకొన్నవాడును ముసలితనమువలన నరసిన తలవెండ్రుకలు గలవాడును వేటాడు
టయే స్వభావముగాగల వేటకాడును విషముపూయబడిన బాణములు కలవాడును నై
మిక్కిలి భయంకరమైనదియు నీళ్లతోడి మబ్బువలె నల్లగా కానవచ్చునదియు అనేక
వృక్షములచేత నిండుకొని యుండునదియు బహువిధములైన క్రూరమృగములచేత సంద
డిగొన్నదియు వెలగ రావి ప్రబ్బ జువ్వి ఊడుగు కానుగు మారేడు ప్రేంకణము అం
దుగు అంబాళము కలుగానుగు జమ్మి గుగ్గిలపుచెట్టు మొదలుగాగలవృక్షములు గలది
యునైన యొకగొప్ప అడవియందు చొచ్చి ఆబోయవాడు ఒంటరిగాడైయుండియు
భయములేనివాడై మృగములఅడుగుజాడలుగలత్రోవలయందు మృగములను వెదక సాగెను.

తితంభీమం భూతానీవోగ్ర మంతకమ్. క్వచిచ్ఛ్వాపదసంచారే వితత్యాధ్వని వాగురే, శ్వాపదాన్ కాలయామాస నానాదిగ్భ్యోభయంకరః వాయునా ప్రతికూలేన గోపయన్ గంధమాత్మనః, విశ్వాసాయ విహంగానాం క్వచిద్గాయతి సుస్వరమ్. క్వచిత్కూటం క్వచిత్పాశం క్వచిద్యంత్రవిభేదనమ్, చరిత్వా విపినే చాసౌ బభూవ విఫలశ్రమః ధావన్విషమభూభాగే దృశ్యదృశ్యప్లుతం శశమ్, దండహస్తః క్వచిద్దూరాద్దృష్ట్వా సౌపర్యతప్యత. తతశ్చిరమసౌ భ్రాంతః కాననే మృగలుబ్ధకః, ఉపాయాన్వివిధాంశ్చైవ కృత్వా మృగజిఘాంసయా విధాయ గాఢమాత్మానం తతస్తస్మింశ్చిరం వనే, అదత్వా స్వేష్టమాదిత్యో వివేశాస్త్రాద్రిమందిరమ్ తతస్సంధ్యాభవద్భానోః కిరణైః కుంకుమారుణైః, కుర్వంత్యాశాం వధూం రమ్యాం సద్యోమాలిన్యమావిశత్. నిస్సమీరం గళన్మాల్యం లీనమూకమృగద్విజమ్, సదదర్శాచలత్పర్ణం ప్రసుప్తమివ కాననమ్.

---

అప్పుడా వనమునందలి పందులు ఏదుపందులు నల్లచారలదుప్పులు పులులు జింకలు కుందేళ్లు మొదలుగాగల మృగములన్నియు ఆభయంకరుడైన బోయవానిని చూచి క్రూరుడైనయముని జూచిన ప్రాణులవలెనే భయము నొందినవిఅయ్యెను. అంతటవాడు క్రూరమృగములయడుగులజాడగల ఒకపెద్దబాటయందు వలనుఒడ్డి ఎల్లదిక్కులనుండివచ్చెడి మృగములను చంపయత్నించుచును మరియొకచోట ఎదురు గాలిచేత తన దేహవాసనను మాటుపరచుచు పక్షులు తమజాతిపక్షియే కూయుచున్నదని నమ్మి దగ్గరవచ్చునట్లు ఇంపైనకంఠస్వరముతో పాడుచును మరియొకచోటబోనును ఒకచోట ఉరియును ఒకచోట కత్తెరబోనును ఒడ్డుచును ఆ యడవిలో మెలగియు ఆ ప్రయత్నములన్నియు వ్యర్థములై పోయెను. పిమ్మటవాడు మిట్టపల్లముగానుండెడి ఆ అడవిలో దాటిదాటి పరుగెత్తిపోవుచున్న ఒకకుందేటిని జూచి చేతకఱ్ఱయెత్తుకొని తరిమి అది చిక్కక కొంతదూరముగా పరుగెత్తిపోయినందున ఇదియుం జిక్కకపోయెనే యని అదిపోవుటజూచి పరితపించెను. అట్లు పరితాపమును పొందియు ఆబోయవాడు మృగములను చంపి తీసికొనిపోవుటయందలి ఆశచేత అనేకములయిన ఉపాయములను పన్ని ఆ యడవియందే తిరుగుచు చాలసేపు మృగములకు కనబడక దాగి యుండెను. అట్లుండినను వానియిష్టమును నెరవేర్పకయే సూర్యుడు అస్తమించెను. అంతట కుంకుమవలె ఎఱ్ఱనైన సూర్యకిరణములచేత సంధ్యారాగము కలిగి పడమటిదిక్కనెడి ఆ సుదాని నలంకరించి అప్పుడే మాసిపోయెను. అప్పుడు అంకిలుడు గాలిలేనిదియు రాలిన పూగుత్తుల చాలుగలదియు దాగికూయకయుండెడి మృగపక్షులుగలదియు కదలని ఆకులుగలినదియు నై

తద్దృష్ట్వా కాననం ఘోరం ధ్వాంతధూసరభూతలమ్, నిశాం ప్రాప్తతమి
స్రాంచ వ్యాధశ్చింతాం సమావిశత్. భ్రాంతమేతద్వనం సర్వం సకలం
వాసరం మయా, సవితాస్తంగతో రాత్రిః సంప్రాప్తా తమసావృతా.
అంధీభూతా తమిస్రేణ దృష్టిర్దూరం న సర్పతి, కుతో వాద్య మృగాః కేచి
ద్బాణమార్గా భవంతి మే. నైషా వా కిమరణ్యానీ మందతా వా మమేతి సః,
సందిదేహాథ దుష్ప్రాప్త్యా సుకృతీవ దురన్వయే. కింకరోమీహ సంప్రా
ప్తే గృహం యామి న యామి వా, ఇతః కించిదనాదాయ మయా గేహం
గతేన కిమ్ న ద్రష్టుముత్సహే బాలా బుభుక్షాపరిపీడితా; పునర్యత్నం కరి
ష్యామి అంతమేవ మృగానహమ్. ఇత్యాలోచ్య సమీపస్థం దదర్శా
సౌ జలాశయమ్, ప్రాంతే చాస్య మహాబిల్వం బదరీషండమధ్యగమ్.
పురాతనం మహాబిల్వం మూలాల్లక్ష్య తనుర్మహత్, మృగానత్ర హని
ష్యామి పానీయం పాతుమాగతాన్. ఇతి కృత్వా మతిం వ్యాధో నిశ్చ
లో ఘోరదర్శనః, పునర్నవసమారంభ స్తం బిల్వమభితో యయౌ. త
మాసాద్య మహాబిల్వం ఘనపల్లవశాఖినమ్, నిరస్య కంటకాం స్తత్ర స్వమా

---

నిద్రపోవుచున్నదానివలెనుండెడి యడవిని జూచి చీకటిచేత మాసిన నేలగల ఆ యడవిలో చీక
టితో గూడిన రాత్రికాలమునందు ఇట్లు చింతించెను. నేను నేటిపగలంతయును ఈయడ
వియెల్లయెడలను తిరిగితిని ప్రొద్దు గ్రుంకి రాత్రియు వచ్చెను. చీకటి కమ్ముకొనెను. చీకటి
చేత గ్రుడ్డిగా జేయబడిన నా చూపు దూరముగా పోదు. ఇప్పుడు కొన్ని మృగములయి
నను నా బాణములకు ఎట్లు తగులుపడును. ఇది అడవి కాదా? లేక నా తెలివిలేమియా?
ఇట్లు చెడుకులమునందు బుట్టిన పుణ్యవంతుడు తన ప్రాప్తినిగూర్చి యేల యిట్టికులమునందు
బుట్టితిమని సందేహించునట్లు ఆబోయవాడును తనకు మృగములు దొరకమికి కారణమే
మో అనియోచుచు నేను ఇట్టి ఆపద వచ్చెనే ఇక ఇంటికి పోదునా? పోక యిక్కడనే
ఉందునా? కొంచెమైనను మాంసము తీసికొనక యింటికి పోయినను ఏమి ప్రయోజనము?
ఆకలిగొని బాధపడునట్టి బిడ్డలను నేను చూడజాలను. కనుక నేను మృగములను చంపు
టకు మరల ప్రయత్నము చేసెదను. అని యిట్లు ఆలోచించినవాడై ఆయంకిలుడు అక్క
డికి దాపుననున్న ఒక మడుగును దానిగట్టునందు బహుదినములనాటిదై వేళ్లతోడి
మొదలు కానవచ్చుచున్నదైన రేగుచెట్ల నడుమనుండెడి పెద్ద మారేడు చెట్టును జూచి
ఇక్కడనుండి దీనిలో నీళ్లు త్రాగవచ్చెడి మృగములను చంపెదను. అని యిట్లు తనలో నిశ్చ
యించుకొని ఇటునటు కదలక భయంకరమయిన చూపులుగలవాడై మరల క్రొత్త ప్రయత్న
ముతో ఆ మారేడు చెట్టుచుట్టును తిరిగి చూచి ఒకతట్టు ముండ్లు ఊడ్చి త్రోసివేసి తనకు నిలువను

వాసం చకార సః. బాణమేకం సమాదాయ శేషానాదాయ భూతలే, ప్రేంఖైకజాన్వురాసన్న స్తస్థా తత్రైకమానసః. అనేనచ నవిజ్ఞాత మాసీ త్తత్ర పురాతనమ్, శ్రీకంఠం లింగమవ్యక్తం శ్రీఫలస్యోపకంఠతః. తత్ర రాత్రావవశ్యాయ జలసంక్లిన్నమూర్ధజః, అనిద్రో నిరాహారో నిశ్చల శ్శంభుసన్నిధౌ. బభంజ బిల్వపత్రాణి దృష్టిరోధీని కృత్స్నశః, పతితా న్యానిపత్రాణి శివలింగోపహారతామ్. సబుభుక్షు స్వహోరాత్రౌ జిత నిద్రోమిషాశయః, నిశ్చలో బకవ త్తస్థా వీక్షమాణో జలాశయమ్. తత్ర రాత్రౌ తమస్యంధేజాగ్రతోద్వితయంవనే, శివత్రైలోక్యదర్శీచలక్ష్యద ర్శీచ లుబ్ధకః. శివశ్చ శివరాత్రిశ్చ శ్రీఫలస్యతుచాంతికే, భంజనంబిల్వప త్రాణాం పతితం లింగమూర్ధని. వ్యాధస్యచామిషాభావా దుపవాసో ప్యజాయత, రాత్రౌమృగవధాసక్త్యా జాగ్రత శ్శివసన్నిధౌ. ఉపవాసాం గ భూతస్య అటనం తస్యచాభవత్, కాకతాళీయన్యాయేన తత్ర తస్యా

---

తావు చేసికొని ఒకబాణమునుమాత్రము చేతబుచ్చుకొని తక్కినబాణములను దిగువనుంచి చేయిమీదికి ఎత్తుకొని చలింపని చిత్తములో అచ్చట నిలుచుండెను. అట్లు ఉండియుం ఆ మారేడుచెట్టువెంబడి తెలియబడనిబహుదినములనాటిశివలింగము ఉండగా దానినిచూచి తెలిసికోలేకయే ఆలింగసమీపమునందు మంచునీళ్లచేత తడిసినతలవెండ్రుకలు కలవాడును నిద్రాహారము లేనివాడును చలింపనివాడునునై తనచూపులకు అడ్డముగా వ్రేలాడుచున్న వాలుగొమ్మలలోని మారేడుదళములను రాలగొట్టెను. ఆమారేడాకులన్నియుం క్రిందనున్న శివలింగముమీదపడి ఆశివలింగమునుపూజచేసినట్లాయెను. ఔరా! వాడుఆకలిగొన్నవాడు గానుండియుం ఆరాత్రియంతయుం నిద్రలేక మాంసమునుగోరి గుంటగట్టుకొంగవలె కద లక మెదలక అచ్చటి మడుగుమీదనే గురియుంచి చూచుచుండెను. అట్లు ఒంటరిగా ఆ రాత్రికాలమునందు కన్నుగానరాని చీకటిలో హెచ్చరికగలవాడైఉండినందునమూడు లోకములను చూచుచుండువాడు శివుడును గురినిచూచువాడు బోయవాడును ఐ౨. మా రేడుచెట్టుక్రింది శివుడును శివరాత్రియుం బిల్వపత్రిని రాల్చుటయుం ఆబిల్వపత్రి శివ లింగముమీద పడుటయుం మాంసముదొరకకవాడు ఉపవాసముచేయుటయుం మృగము లను చంపుటయందలి ఆసక్తిచేత ఆశివునిసన్నిధిలో రాత్రియంతయుం జాగారముచేయుం టయుం ఉపవాసమునకు ఒక అంగమైన సంచారము కలుగుటయుం కాకతాళీయన్యా యముచేత పొసగినందున ఆబోయవానికి శివరాత్రి వ్రతఫలము లభించెను (కాకతాళీ యన్యాయము అనగా కాకివాలుచుండగా తాటిపండుపడుటవంటిన్యాయము). ఇక

భవత్కిల. వ్యాధస్యచగృహేభార్యా కథంచిత్పుత్రపోషణమ్, కృత్వా ప్రతీక్షమాణాతు క్షేపయామాసవాసరమ్. పాదస్థానే శిశుంకృత్వాక్రోధేనాదాయచాపరమ్, మంచకస్థానిశీథేసాగతంవ్యాధంశుశోచహ. భుక్తవేళాగతాతస్మిన్ వనంయాతేదివాగమత్, శర్వరీచగతప్రాయా కుతోనాయాతి కాననాత్. కృతోపవాసినాసన్నే కాననే బాలసూనునా, కదాచిన్మమనాథేన రజన్యాం నబహిః స్థితిమ్. కిమాధాయ తరుస్కంధే దత్తదృష్టిఃకురంగకే,దష్టోనిసృత్యవల్మీకా దహినా ఘోరరూపిణా. వంచిత్వా కింనుతస్ముక్తం బాణమేత్య తరస్వినా, ఆక్రాంతః ప్రౌఢసింహేన సద్యోవ్యాకులతాంగతః. విలప్య వివిధా వాచః ప్రాప దుఃఖాత్త పాతుయమ్, అథ మేరుతటాదర్కః కించిదుత్తరతఃకృతాత్. తమఃపయోధిమాచమ్య కుంభయోనిరివోత్థితః, వ్యాధోపితతఉత్థాయహ్యవరోప్యశరాసనమ్. జాగరిత్వా నిశాం కృత్స్నాం ప్రతస్థే గృహమాత్మనః, గచ్ఛన్నేవ సమా

ఆబోయవానియింటివద్ది వృత్తాంతము ఏమనగా, వానిపెండ్లాము నాటిపగలంతయు బిడ్డలను ఏదోఒకవిధముగా పోషించుకొనుచు వేటపోయిన పెనిమిటిరాకకు ఎదురు చూచుచు గడపెను. ప్రొద్దుగ్రుంకి సగమురాత్రిఐనను పెనిమిటి యింటికిరాకపోగా ఆబోయది ఒకబిడ్డను కాళ్లమీద పండబెట్టుకొని కోపముతో విసుగుకొనుచు మఱి యొకబిడ్డను ఎత్తుకొని మంచమునందు గూర్చుండి వేటాడపోయి రానిమగని గూర్చి యిట్లు దుఃఖింపసాగెను. నామగడు అడవికిపోయి చాలసేపాయెను. భోజనకాలమును మించెను. పగలంతయు గడచిపోవుటయేగాక రాత్రికూడ కొంచెము తక్కువగా కడచి పోయినదాయెను. ఇంతవట్టుకు అడవినుండి రాకపోవుటకు కారణమేమి? దాపున నుండు అడవులలో నుండియు ఆహారమేమియు దొరకనియెడ వెంటనే ఇంటికి వచ్చునుగాని యింతసేపు అచ్చటనే యుస్తుగా ఉండడు. పసిబిడ్డలను నన్ను విడిచి నాపెనిమిటి యెప్పుడును బయట నిలచినవాడుకాడు. చెట్టుమొదట మృగముమీద చూపునిలిపిఉండగా ఆచెట్టు మొదటిపుట్టలోనుండిబయటికివచ్చిన భయంకరమైనపాము చేతకరవబడెనో, లేక పొంచియున్నఆతనిచేప్రయోగింపబడిన బాణముయొక్క దెబ్బను తప్పించుకొన్నపడిగలిగినదియు నేర్పుగలిగినదియునైన సింహముచేత అప్పుడేచంపబడెనో, అని యిట్లుఅనేకవిధములయెన్నుపలుకెట్టియేడ్చుచుండగా ఆరాత్రియుంగడచెను. అంతట మేరుపర్వతపుచరినుండి కొంచెము ఉత్తరమునించిన తూర్పుదిక్కునందు చీకటియనెడు సముద్రమును పానముచేసిన అగస్త్యమహామునివలెనేసూర్యుడుఉదయించెను. (అనగా అంతటను చీకటిలొలగిపోగాప్రొద్దుపొడిచెను) బోయవాడును తెల్లవారునంతదాకజాగా రముచేసి అంతటవిల్లుఎక్కుడించి ఆమారేడుచెట్టుదగ్గరనుండితేచితనయింటికిప్రయాణమై

యాంతీం దదర్శ సధృతాత్మజామ్. పతిభార్యాంతదాలోక్య పునస్సంజాత జీవికామ్, బాలకాన్సంపరిష్వజ్య భార్యాంచాభాష్య లుబ్ధకః గత్వాగేహం యథాత్సృష్టో బుభుజేసహదారకైః, పాపభీధీరలక్ష్యేణపార్శ్వస్థేనబలీయసా. భూతానాంసంహరతానేనమృత్యునాసోప్యగృహ్యత, మృతః కాయాంతరంప్రాప్యదదర్శాంబుదమేచకాన్. యమదూతాన్ మహాకాయాన్ దండపాణీన్ పురఃస్థితాన్, స్యందనాక్ష గభీరాక్షాన్ దృష్ట్వా తాన్ దీప్తతేజసః. వ్యాధస్య సహసా త్రాసా ద్వేపథు స్సముజాయత, నీయతాం బధ్యతాం పాపో వధ్యతాం ఛిద్యతామయమ్. సంరంభస్సుమహానాసీ ద్భూతానాం జల్పతామపి, అథైకః ప్రాహసంరంభా ద్గద్గదంభోద సన్నిభః. అహో యూయం నజానీథ వ్యాధస్యాస్యవధోచితమ్, అత్యంత కశ్మలీ హ్యేష భుక్త్వా వజ్రాగ్నివాలుకామ్. పీత్వా తైలం ప్రతప్తం చ శ్వేతా మంగారరాశిషు, ఇతిజల్పత్సు దూతేషు క్రూరమన్యోన్య వాదిషు. ప్రభాసయంతో గగనం శివాజ్ఞాం విజ్ఞాన విద్యాధరతుల్యరూ

---

పోవుచు బిడ్డలనెత్తుకొని తన్ను వెదకుచువచ్చుచున్న పెండ్లామును ఎదుటచూచి మరల బ్రదుకు దెరువుకలిగినదానివలెనున్న ఆపెండ్లామునుబిడ్డలను కౌగిలించుకొని పెండ్లాముతో ముచ్చటలాడుచు తనయింటికిపోయి సుఖముగానుండెను. మఱికొన్నాళ్లకు పాపబుద్ధి గలవారికి కానరానిదియుం ప్రాణులపార్శ్వమునందే ఉండునదియుం బలవంతమైనదియుం ఎల్ల ప్రాణులనుచంపునదియుం ఐనమృత్యుదేవత ఆబోయవానిని పట్టుకొనెను. అనగా ఆబోయవాడుచచ్చెను. చచ్చి మఱియొకశరీరమును పొందినబోయవాడు నల్లమబ్బు చాయగలవారును పెద్దపెద్దఆకారములుగలవారును కఱ్ఱలుచేతబట్టుకొన్నవారును బండిచక్రపురంధ్రములవలె లోతులై భయంకరములై కానవచ్చుమిడిగ్రుడ్లలోడి కన్నులుగలవారును వెలుగుచున్న తేజస్సుగలవారునునై యెదుటనున్న యమదూతలను జూచి తటాలున భయముగలిగి ఆభయమువలన వడకును బుట్టెను. ఈపాపాత్ముని లాగుడు కట్టుడు చంపుడు కోయుడు అని ప్రాణులనెల్లను తుచ్ఛపుమాటలాడి నొప్పించువారైన దూతలు మిక్కిలి ఆటోపమునొందిరి. అప్పుడు ఉరుముచున్న మేఘమో అనగా ఆదూతలలో ఒకడు ఆటోపముతో ఇట్లు పలికెను. ఓయమకింకరులారా! ఈ బోయవానిని చంపవలసినవిధమును మీరు ఎరుగరు. వీడు మిక్కిలి పాపాత్ముడు. కాలినవజ్రపు ఇసుకను తిని తెర్లుచున్న నూనెత్రాగి నిప్పుల కుప్పలయందు పడియుండవలసినవాడు. అని యిట్లు దూతలు తమలోతాము కఠినముగా పదరుచు వాదించుచునుండగా ఆకాశమును వెలిగించుచున్నవారును విశేషమైన జ్ఞానముగలిగి గంధర్వులరూపములవంటి రూపములు గలవారును నైన శివగణములు శివుని యనుజ్ఞపొంది చంద్రబింబమువలె వెలుగుచున్న

పాః, చంద్రాభమాదాయ తతో విమానం సమాగతాః శంభుగణాః పురస్తాత్. తేనీయమానంతు నిరీక్ష్య మధ్యే వ్యాధం రుదంతం యమకింకరాణామ్, దూతానపోహ్యాహితదివ్యరూపం వ్యాధం విమానాధిపతిం విచక్రుః. ఔద్ధత్యమేషాంతు విలోక్య దూతా వ్యాధం విమానేచ విరాజమానమ్, నిర్వాపితాంగారసమానరూపాః పరామృశంతః పథి తానవోచుః. క్వైవనం గృహీత్వా నయతాస్మదీయం కేకస్య కస్మాదితి వో న విద్మః, ఇంద్రస్య విష్ణోర్వరుణస్య రాజ్ఞః శంభోరుతాహో ధనదస్య యూయమ్. ప్రత్యేకమస్మాభిరసౌ పురస్తాత్కాలం మహాంతం నరకేషు పాత్యః, వ్యాధంపురానేష్యథ కస్య లోక మేనం విమానాధిపతించ కృత్వా. బ్రూతాస్య పుణ్యం యదివేత్థ యూయం వ్యాధస్య హింసానిరతస్య కించిత్, ఉల్లంఘ్య వేలాంచరతస్తుదైవీం సుఖాయ జాయేత న కామచారః. నాద్యాపివేదా విదధాతితంయః కాలవ్యలీకం కురుతేబలేన, తస్ముచ్యతామేష నయామదూతాః శిరాంసివః పాతయితుం భవామః. శ్రుత్వేతి

---

విమానము ఎత్తుకొని వారి యెదుటికివచ్చి ఆయమదూతలనడుమ ఏడ్చుచు ఈడువబడుచున్న బోయవానిని జూచి ఆయమదూతలను బెదరించి తరిమి బోయవానిని దేవరూపమును పొందినవానిగాను విమానమునకు అధిపతినిగాను జేసిరి. అంతట యమదూతలు శివగణముల అహంకారమును విమానమునందు వెలుగుచున్న బోయవానిని చూచి చల్లార్పబడిన నిప్పువలె తేజస్సుచెడినవారై శివగణములు అట్లుచేయుటకు కారణమును తెలిసికోదలచి వారుపోవు త్రోవయందు నిలిచి వారితో ఇట్లు పలికిరి. ఓ అయ్యలారా! మీరు ఎవరు? మాచేత చిక్కియున్న వీని మీరు ఎక్కడికి తీసికొనిపోయెదరో ఏల తీసికొనిపోయెదరో మాకు తెలియదు. మీరు ఇంద్రుని బంటులో విష్ణునిబంటులో వరుణునిబంటులో శివునిబంటులో కుబేరునిబంటులో తెలియజేయుడు. వీడు విశేషకాలము వేరువేరు నరకములలో మాచేత త్రోయబడి బాధ పొందదగినవాడు. ఈ పాపాత్ముడైన బోయవానిని విమానము నెక్కించుకొని యే లోకమునకు తీసికొనిపోయెదరు. హింసచేయుటయే పనిగా ఉండిన యీబోయవానికి కొంచెమైనను పుణ్యము కలిగియున్నయెడల మాకు తెలియజెప్పుడు. ఎవడుగాని దేవునిచేత నియమింపబడిన నియమనమును అతిక్రమించి ప్రవర్తించినపక్షమున మేలుపొందడు. ఏ కార్యము కాలక్రమమున అప్రియముగా నేర్పడునో ఆకార్యమును బ్రహ్మదేవుడు కూడ చేయకూడదు. కాబట్టి వీనిని మీరు విడిచిపెట్టుడు. విడిచిపెట్టకపోయినయెడ యమునిదూతలమైన మేము మీతలలు పగులగొట్టెదము. అనియిట్లు చెప్పుచున్న సహింపరానివియు తీక్ష్ణమైన విషమును నిప్పును పోలినవియు నైన యమకింకరుల మాటలను శివకింకరులువిని కోపమును అణచినవారును మిక్కిలి సంతోషమును పొందినవారునునై

వాచో యమకింకరాణాం సుదుస్సహా స్తీవ్రవిషాగ్నికల్పాః, నిగృహ్య కోపం వినయానురూపం ప్రత్యూచురేనాన్ ప్రమథామహాంతః. ససర్జ యో దిక్షు విభుర్మహేంద్ర ప్రేతాధిపాంభఃపతిరాజరాజాన్, తమేవ జానీథ నదేవదేవం కేదాసదాసాస్సపది భ్రమోయమ్. స్రష్టారమాద్యం సృజతి స్వయంయః కాలస్యకాలో భవతి క్షణేన, ఇత్యేవముక్త్వాః ప్రమథా మహాంతో ప్రత్యేత్య దూతాన్ ప్రథమం క్రమేణ. తతః స్ఫురతోకప వివృత్తనేత్రా స్మృత్వా శివాజ్ఞాం విధివంద్యమానామ్, ఆచ్ఛిద్య తేభ్యః పరిఘైస్తదీయై స్తానేవ హంతుం ప్రమథాః ప్రవృత్తాః. యఏవతత్రోచ్ఛ్వసతి ప్రదర్పా స్సఏవచైతైర్నిహతః పురైవ, ప్రఘాతదత్తైః పరిఘప్రహారైః స్రోతస్సు రక్తం సతతం శిరస్సు. వ్యాథాలయం తత్యజురేవదూతాః మార్గేవిలీహా నిహతాభవంతి,విభిన్నగాత్రా రుధిరం వమంతః సంధ్యాపయోదా ఇవ లోహితాంగాః. హాతా హాతా ఇత్యనిశం నదంత స్తే ధర్మరాజస్య పురో నిపేతుః.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, శివరాత్రిమహిమానువర్ణనంనామ సప్తవింశోఽధ్యాయః.

---

వినయములను తగినవియంసైన ప్రత్యుత్తరములను మీద చెప్పబడెడిరీతిగా చెప్పిరి. ఓ యమకింకరులారా! మీకు ఈ భ్రమయేల ? ఎవడు తూర్పు మొదలుగాగల నాలుగు దిక్కులయందును ఇంద్రుని యముని వరుణుని కుబేరు నిలిపెనో, మొట్టమొదట బ్రహ్మదేవుని సృజించినవాడును యమునికి యముడైనవాడును ఎవడో, అట్టిదేవుడు మాయేలినవాడు. అనిఇట్లు క్రమముగా తొలుత ఉత్తరముచెప్పి మిక్కుటమైన సంతోషముగల ఆశివకింకరులు బ్రహ్మకు సైతము శిరసావహింపదగిన శివుని ఆజ్ఞనుతలచి వెంటనే కోపము కలుగజేసికొన్నవారై మండిపడుచు యమదూతలను ఉరిమిచూచి. ఎవడు క్రొవ్వుచేత దేహము తెలియక బుసకొట్టుచు పైకివచ్చునో వానిని చంపునట్లు ముందే ఏలినవానివలన ఉత్తరవును పొందినవారు గనుక తమచేతిపలకవాటు దుడ్డుకఱ్ఱతో యమదూతల తలలుపగిలి నెత్తురువెల్లువలు కట్టునట్టుగా కొట్టిరి. అంతట యమదూతలు బోయవానిదేహమును విడిచి త్రోవలో చచ్చినవారివలె సోలిపడిలెప్పిరిలేచి నెత్తురుక్రక్కుకొనుచు సాయంకాలమునందలి మేఘములవలె ఎఱ్ఱగానుండెడి పగిలి నెత్తురుగ్రమ్మిన దేహములతో చచ్చితిమి చచ్చితిమి అని పలుమారు పలుకుచు పోయి యమధర్మరాజు ముందట పడిరి.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు శివరాత్రిమహిమను తెలుపునట్టిదైన ఇరువదియేడవ అధ్యాయకథ.

## అష్టావింశోఽధ్యాయః

వసిష్ఠఃః.— సభాయాం ధర్మరాజస్య మృత్యుః కాలాంతక స్తథా, రోగా రాగ స్తథా యక్ష్మ కుష్ఠాద్యా వ్యాధయోఖిలాః. శీతోష్ణజ్వర మాహేంద్ర దారిద్ర్యం విస్మృతి స్తథా, కామః క్రోధ స్తథా లోభ మోహాహంకారమత్సరాః. క్షుత్పిపాసా శ్రమ శోక నిద్రా తంద్రాస్తు తంకలిః, యత్ర పాపాదయోన్యేపి మూర్తిమంత ఉపాసతే. తథా సప్తర్షయ స్తత్ర ధర్మాధర్మవిచారకాః, చిత్రగుప్తో లిఖత్యత్ర యావదత్ర శుభాశుభమ్. తం దృష్ట్వాదృష్టపూర్వంతు కింకరాణాం పరాభవమ్, చుక్షుభే సకలోలోకః పర్వణీవ మహార్ణవః. సాసభాకులితా దూతైః ప్రోతశ్శోణితబిందుభిః, మేఘవాతైరివోద్ధూతైః తుంగసాలావళీ యథా. ప్రేతరాజః ప్రకృత్యైవ ప్రాణినా మతిభీషణః, కుపితస్తు స్వకాలాద్యైః సదుష్ప్రే క్ష్య ఇవాభవత్. భృకుటీ కుటిలేతస్య చక్షుషీచ పరిభ్రమత్, మూర్తిమానివ సంరంభః ప్రాదురాసీ త్తదాముఖే. తతస్సంక్రుద్ధ

---

ఇరువదియెనిమిదవ అధ్యాయము.

వసిష్ఠుని మాటలు — ఆయమధర్మరాజు సభయందు మృత్యుదేవత కాలాంతకుడు రోగములు అనురాగము క్షయము కుష్ఠము మొదలుగాగల ఎల్లరోగములు శీతజ్వరము ఉష్ణజ్వరము ఇంద్రజాలము పేదరికము మైమరపు కామము క్రోధము లోభము మోహము అహంకారము మాత్సర్యము ఆకలి దప్పి బడలికశోకము నిద్ర మూరుకుపాటు కొంకు కలిపురుషుడు ఇతరములైన పాపములు మొదలైనివియు దేహములు ధరించినవై యముని గొలుచుచుండెను. మరియు ధర్మమును అధర్మమును విచారించి చెప్పునట్టి యేడుగురు ఋషులును ఉండిరి. అచ్చట చిత్రగుప్తుడు ప్రాణులు చేయు శుభకార్యములును అశుభకార్యములును వ్రాయుచుండెను. ఇట్లు యముని కొలువుతీరియుండగా ఎన్నడును చూచియెరుగని యమకింకరుల అవమానమునుజూచి ఆకొలువులో నున్నవారు అందరు పున్నమనాడు సముద్రము కలతను పొందునట్లు కలతనొందిరి. మరియు ఆసభ నెత్తురుబొట్లతోడ గాలివానచేత చెట్లచాలు పడినట్లు నిట్టనిలువున పడినదూతల పాటుచేత కలతనొందినదాయెను. సహజముగా ప్రాణులకు మిక్కిలి భయమును తో పించువాడైన యముడు ఆసమయమునందు కోపమురాగా తనవారైన కాలుడు మొదలైనవారికిగూడ చూడ నలవికానివాడయ్యెను. వంకరయైన అతని బొమముడితోడ కనుగ్రుడ్లు తిరుగసాగెను. అప్పుడు అతని ముఖమునందు వేగిరపాటుఅనునది శరీరముతో పుట్టినట్లుండెను. అంతట మండుచున్న అగ్నియొక్క తేజస్సువంటి తేజస్సుతో మండి

మాలోక్య జ్వలంతమివ తేజసా, చిత్రార్పితేవ నిష్పందా సా సభా సభయాభవత్. అథ పప్రచ్ఛ తాన్ దూతాన్ లోహితానివ తేజసా, ధర్మరాజో భృశం క్రుద్ధో నిర్దహన్నివ తేజసా. సమాశ్వసథ హే దూతాః కేన యూయం పరాజితాః, దేవాసురమనుష్యేషు గంధర్వేషు ఖగేషుచ. రక్షోభూతపిశాచేషు కః ప్రతీపం సమాచరేత్, హంతుం తమభిధావంతో మృత్యుః కాలాంతకాదయః. విస్రబ్ధం మమ తత్సర్వం కథ్యతాం యేన యత్కృతమ్, తదా తం దోషముద్దిశ్య సంహరామి భవద్విషః. దూతాః. దేవాకర్ణయ వృత్తాంతం ధర్మరాజ ప్రసీద నః, గతాస్మ వ్యాధ మానేతుం చిత్రగుప్తాభిచోదితాః. తంపాపనికరాక్రాంతం వ్యాధమాదాయ సత్వరమ్, యావత్ప్రచలితా దేవ తావత్పశ్యామ ఖేచయమ్ నిరతాభ్రా దివాకాశా దంతరి క్షేందుమండలమ్, తతో విధూయన స్సర్వాన్ హస్తానాచ్ఛిద్య తే గణాః విమానే వ్యాధమారోప్య ప్రస్థితా దిశముత్తరామ్, అథ తానను ధావంతో వ్యాధనిర్బంధకారిణః. ఆచ్ఛిద్య

---

పడుచున్న యమునిజూచి సభలో నున్నవారందరును భయమునుపొంది చిత్తరువుబొమ్మలవలె కదలక మెదలక యుండిరి. అప్పుడు నెత్తుటదడిసిన యొఱ్ఱనిదేహములతోనున్న దూతలను జూచి మిక్కిలి కోపించినవాడైన యమధర్మరాజు లోకములను తగులబెట్టునట్టి ప్రతాపములో, ఓదూతలారా! ఊరటనుపొందుడు. మీరు ఎవనిచేత ఇట్లుఅవమానింపబడితిరి. దేవతలు అసురులు మనుష్యులు గంధర్వులు గరుడులు రాక్షసులు భూతములు పిశాచములు వీరిలో ఎవడు తప్పుచేసెనో చెప్పుడు. వానిని చంపుటకు ఇప్పుడే మృత్యువు కాలాంతకుడు మొదలగువారు పోవువారుగా నున్నారు. నాకు నమ్మదగినసరీతిని ఇదియెవనిపనియో విశదముగా చెప్పుడు. వెంటనే ఇందులతప్పిదమును చక్కగా విచారించి మీకు పగవాడైన ఆదుష్టుని చంపెదను అని పలికెను.

యమకింకరులమాటలు.—స్వామీ ధర్మరాజా! మావృత్తాంతమును మనవిచేసెదము మాయందుఅనుగ్రహముతో చిత్తగింపుము. మేము చిత్రగుప్తునిచేత పంపబడినవారై ఆ బోయవానినితీసికొనిరాబోతిమి. పాపసమూహములచేత ఆక్రమింపబడిన ఆబోయవానిని పట్టుకొని శీఘ్రముగారాను మేము యత్నించుచుండగా ఆకాశమునందు శివగణములు కనబడిరి. ఎడతెగని మేఘములవలననుండియు ఆకాశమువలననుండియు దిగివచ్చెడి చంద్రమండలమువలె వారుదిగివచ్చి మా చేతులు తెగనరికి మమ్ము తరుమగొట్టి బోయవానిని విమానముమీద యెక్కించుకొని ఉత్తరపుదిక్కునుగూర్చిపోయిరి. అంతట బోయవానిని నిర్బంధించువారలమైన మేము ఆగణములను వదలక వెంబడించి వ్యాధుని నివారింప

పరిఘైరేవప్రమథై ర్నిహతా వయమ్, పరిఘైరాయసై రస్మా న్నిఘ్నంతి బలదర్పితాః. వదంతః పరుషా వాచో దాసదాసా ఇతి ప్రభోః, పరిఘాఘాతభిన్నాని పశ్య దేవ శిరాంసి నః. త్వయి నాథే హతా దుష్టైరనాథా ఇవ తైర్వయమ్, ఇత్యాకర్ణ్య వచ స్తేషాం ధర్మరాజో మహాబలః. చిత్రగుప్తం సమీపస్థం పప్రచ్ఛాకులమానసః. యమః చిత్రగుప్త మమాచక్ష్వ వ్యాధః పుణ్యం చ కారకిమ్, యస్తైర్విమానమారోప్య నీయతే శంకరాలయమ్. చిత్రగుప్తః. న దేవ ధర్మకార్యేషు కథా స్తస్య దురాత్మనః, ధర్మనామాపి లోకేభ్యో నియతం శ్రుతిగోచరమ్. వ్యాధస్య నిఘ్నత స్తస్య సదా మృగగణాన్ బహూన్, నిత్యం పాపాని సంఖ్యాతుం తస్మిన్ వ్యాకులతాం గతః. ఇమాని నిత్యఘోరాణి భూరీణి నరకాని చ, సోఢవ్యా యాతనా యత్ర చిరం తేన దురాత్మనా. యమః. ఉత్తిష్ఠ పట్టమాదాయ ముద్రాదండం చ మామకమ్, చిత్రగుప్త సమం దూతై రభియామో హరాలయమ్. కుతో మే నిహతా వ్యాధో నీయతే దూతకా స్తథా, ఈశ్వరస్య పురో బ్రూమో

---

పోగా వారు మాకంటె బలముచేత అహంకరించినవారై ఇనుపబడితలతో మమ్ము నొవ్వగొట్టి మేము మాయేలినవాని బంటులకు బంటులము అనికఠినముగా పలుకుచు వానితీసుకొనిపోయిరి. ఓయేలినవాడా! ఇనుపబడితల దెబ్బలచేపగిలిన మాతలలను చూడుము. నీవంటిదొరను బడసినవారమయ్యును దిక్కులేనివారివలె మేము ఆదుష్టులచేత కొట్టబడితిమి అని యిట్లుచెప్పిన దూతలమాటలనువిని మిక్కిలి బలవంతుడైన యమధర్మరాజు కలవరము నొందినమనస్సుగలవాడై తనవెంబడినున్న చిత్రగుప్తునిజూచి ఈవిధముగా అడిగెను. ఓయిచిత్రగుప్తుడా! ఆశివగణములచేత శివుని ఆలయమునకు అనగా శివలోకమునకు తీసికొనిపోబడిన ఆబోయవాడు ఏమైన పుణ్యముచేసియున్నాడా చెప్పుము అనియడుగగా చిత్రగుప్తుడు ఓయేలినవాడా! ఆబోయవాడు ధర్మకార్యములయందు ప్రవర్తించినవాడు కాకపోవుటయేకాదు వానిపేరుగూడ విన్నవాడుకాడు. మరియు లోకులవలన ధర్మాత్ముడను వినికియు లేదు. ఎల్లప్పుడు ఆబోయవాడు అనేక మృగసమూహములను చంపి పొందునట్టి పాపములను లెక్కించి వ్రాయుటకు నేను ప్రతిదినమును కలత పడుచుందును. కనుక ఆదురాత్ముడు భయంకరమైన అనేకనరకములలో యాతనను పొందదగినవాడు అని చెప్పగా యముడు మరల చిత్రగుప్తునిజూచి అట్లైన పక్షమున దూతలతోడ మనము శివలోకమునకుపోయి ఈపాపములు వ్రాసినపట్టికను ముద్రను దండమును శివునిముందర పెట్టి శివగణములు నాకింకరులనుకొట్టి బోయవానిని ఏల తీసి

వయం యస్యాధికారిణః. తతః కజ్జలశైలాభ మారుహ్య మహిషం యమః, ప్రయయౌ శాంకరం ధామ సానుగస్సానుమానివ. నందినావేదితో ద్వారి ప్రవిశ్య సురసంసది, నీలకంఠం ప్రణమ్యాసౌ భేజే నిర్దిష్టమాసనమ్ తత్ర బ్రహ్మేంద్రవైకుంఠవహ్న్యాద్యాస్త్రిదశోత్తమాః, గంగాద్యాస్సరితశ్చైవ హిమవత్ప్రముఖాచలాః. గంధర్వాద్యాస్తథా యక్షాశ్చారణాద్యాస్తథైవ చ, ఏతైరన్యైశ్చ బహుభిః సా సభా శోభితాభవత్. తత్రాధికృతవార్తాసు నివృత్తాసు వినీతవత్, అథోవాచ యమశ్శంభోః కటాక్షక్షేపశోభితః. నమస్తే దేవ దేవేశ నమస్తే భక్తవత్సల, ప్రసీద సర్వదేవేశ విజ్ఞప్తిం శ్రూయతాం మమ. అధికారే నియుక్తాస్స్మః త్వయా దేవ సురాసురాః, విధే విధేహి భూతాని విష్ణో పాహి జగత్త్రయమ్. అధకారేధికారే చ తదా దేవ సురార్చిత, ప్రవర్తితాస్స్వయం దేవ, త్రైలోక్యస్థితికారణాత్. తదా ప్రభృతి దేవేశ త్వయా దత్తవరాః ప్రభో, యథా సమధికారేషు మర్యాదాం పాలయామహే. వదంతీహ వ్రతం దేవా ఏత

---

కొనిపోయిరో మనము ఎందులకు అధికారులమో అడుగుదము. అని వెంటనే కాటుక కొండను బోలిన ఎనుబోతును ఎక్కి పరిజనులతోడ ఒక కొండవలెనే శివలోకమునకు పోయెను. అట్లుపోయి తొలుత ఆశివుని ఇంటి కావలివాడైన నందీశ్వరుని చేత తాను వచ్చిన వర్తమానము చెప్పిపంపి ఉత్తరువు పుచ్చుకొని పిమ్మట ఆదేవుని సభయందు చొచ్చి శివునికి నమస్కరించి ఆయన చేత చూపబడిన పీఠమునందు కూర్చుండెను. ఆసభ బ్రహ్మ ఇంద్రుడు విష్ణువు అగ్ని మొదలుగాగల దేవతలును గంగ మొదలగు నదులును హిమవంతము మొదలగు పర్వతములును గంధర్వులు యక్షులు చారణులు మొదలుగాగలదేవయోని విశేషులును ఇంకను ఇతరులైన అనేకులునుగలిగి ప్రకాశించుచుండెను. అందు అప్పుడు చెప్పబడుచున్న వృత్తాంతములు అన్ని చెప్పి ముగియనిచ్చి ఇక నీవు వచ్చిన సంగతియేమి చెప్పుమని శివుడును సైగచే సెలవియ్యగా యముడు వినయముతో, ఓస్వామీ ! దేవతలకు దేవుడవును భక్తులయందు ప్రేమగలవాడవును ఎల్ల దేవతలకురాజవును అగు నీకు మ్రొక్కెదను. నాయందు దయచేసి నామనవిని చిత్తగింపుము. ఓస్వామీ ! దేవతలు రాక్షసులు మొదలగువారిని తమతమ అధికారములయందు వర్తించునట్లు నీవు నియమించితివిగదా? అప్పటినుండి బ్రహ్మ లోకసృష్టిని విష్ణు లోకసంరక్షణమును చేయుచున్నారు. స్వర్గమర్త్యపాతాళములనెడి మూడులోకముల యునికినిబట్టి తక్కినవారును వారివారిఅధికారములయందు ప్రవర్తించుచున్నారు. అదిమొదలు మామా అధికారములలో మాకు మన్నన కలుగునట్లు మీరు వరమియ్యగా క్షేమము మా అధికారము

త్సత్యమితి శ్రుతిః, తస్మిన్ చరాచరం సత్యే జగదేతత్ప్రతిష్ఠితమ్. సత్యం సర్వేశ్వరో భూత్వా సత్యభ్రష్టో యథా స్వయమ్, బ్రహ్మాదీనాం తథాన్యేషాం కో హేతుస్సత్యపాలనే. సత్యేతు ప్రళయం యాతే సకలస్థితికారకే, మన్యే దేవ జగత్సర్వం సహసా క్షయమేష్యతి. ఇమౌ దేవ వినా సత్యం భవేతాం విశ్వలోచనౌ, సూర్యాచంద్రమసౌ రాహు రకాలే కబళద్వయమ్. లోకేనాపి వినా సత్యం విధాయాకాండ చండతామ్, సంహరేతాం జగంతీమౌ మిళితౌ పవనానలౌ. పృథుబాహుశ్చ కల్లోలై స్త్యక్తవేలో మహార్ణవః, సంప్లావయేత తావత్తు యావద్బ్రహ్మాండమండలమ్. కులాద్రిదిగ్గజానంత వరాహకమఠోరగాః, వినా సత్యమియం దేవీ ధాత్ర్యధోధో వసుంధరా. ఆకాశే చ ఘనధ్వాంతే నష్టసూర్యేందుతారకే, మన్యే దేవ జగత్సర్వం సహసా క్షయ మేష్యతి. అస్త్వేకాకిచరన్ దేవ అకాల ప్రళయే భవాన్, నాహం కారం మహాదేవ శక్తో హం కర్తుమీశ్వర. ప్రసాదో యత్ర తే తస్మై ప్రయచ్ఛేథా ఇతి బ్రువన్, పురా చిక్షేప సంక్రుద్ధో

---

లను చెల్లించుచుంటిమి. మీరు మాకు వరమిచ్చునప్పుడు దేవతలు ఇది సత్యము సత్యము అని పలికిరి. ఆ సత్యమునందే చరములతోను అచరములతోను గూడిన యీ జగత్తు స్థాపింపబడియున్నది. అటువంటి సర్వేశ్వరుడైన నీవే సత్యము తప్పినవాడవైతివి. అట్లుండగా ఇతరులకు సత్యమును కాపాడవలసిన హేతువు ఏమున్నది? సకలమైన స్థితిని చేయునదియైన సత్యమే నశించుచుండగా జగత్తు అంతయు శీఘ్రముగా నశించుచునుగదా ? సత్యము లేమిచే లోకమునకు కన్నులైన ఈ చంద్రసూర్యులనిద్దరిని పర్వము కాని కాలమునందే రాహువు రెండు కబళములుగా జేసికొని మ్రింగును. మరియు సత్యము లేనియెడ వాయువు అగ్ని ఈ యిరువురును ప్రళయకాలమును ఎదురుచూడక ఒక్కపైరేగి భయంకరరూపముతో లోకమును నాశము చేయుదురు. సత్యము లేనియెడ సముద్రుడు పెద్ద అలల నెడి నిడుపాటి చేతులను చాచి చెలియలికట్టను దాటి పొరలి ప్రవహించి ఈ బ్రహ్మాండమునంతయు ముంచివేయును. కులపర్వతములును దిగ్గజములును ఆదిశేషుడును ఆదివరాహమును ఆదికూర్మమును భూమిభారమును మోయలేకపోగా భూమి క్రిందికి అణగిపోవును. ఆకాశము సూర్యచంద్రులును నక్షత్రములును లేనిదై అధికమైన చీకటిచేత ఆవరింపబడగా ఈ లోకమంతయు శీఘ్రముగ నశింపగలదు. అట్లు ఆ కాలమునందు సర్వమును నశింపగా నీవు ఒంటరిగా సంచరించువాడవు అగుదువు. (అనగా నీవు సత్యమును వదలి సర్వమును నాశము చేయుదువు అని అర్థము) ఓ స్వామీ ! నేను నా అధికారమును చెల్లింప సమర్థుడను కాజాలితిని. నీవు ఎవనియెడ అనుగ్రహము కలదో వానికి ఈ అధికారమును

ముద్రాం దండపటాయమః, ధర్మరాజే బ్రువత్యేవం సంరంభపరుషాక్షరమ్, జీవితే జాతసందేహా సాసభా భయకంపితా శ్రుత్వైవం వచనం తస్య స్మితం కృత్వా మహేశ్వరః, శృణ్వతాం సర్వదేవానాం వైవస్వతమభాషత. కక్రమేణకృతీయాయాదమునాయమునాగ్రజ, యేనాభిభూతాభూభాగే భూరిణాచ భవాదృశః. సంరంభేణసమాయుక్తో నార్హ్యసేవక్తుమీదృశమ్, యతోజాతంమనోభీతంసప్రసాదంసభాసదామ్. మయిత్రాతరిసర్వేషాంఅకాలేప్రళయంకథమ్, కథమస్మిచ్యుతస్సత్యాత్పట్టదండౌకుతస్త్యజేః యమః. కింపట్టేలిఖితేతత్రదండోయంక్వచపాత్యతామ్ దేవదేవమహాపాపోహ్యేనీతశ్చ భవద్గణైః. లుబ్ధకో దేవ సర్వేభ్యో మహాపాపతమోహిసః, యావజ్జీవంజీవఘాతీ పరమాంసాత్మపోషకః. దుష్టాత్మానిరనుక్రోశస్సర్వలోకవిగర్హితః, నశృణోద్ధర్మనామాని చిత్రగుప్తో యథాహ మామ్. కింకరాణాం శిరో భిత్వా పరిఘై రాయసైర్ధృతైః, సర్వకామయుత

---

ఇమ్ము. అని పలుకుచు యముడు తన పాపముల పట్టికను ముద్రను దండమును శివుని యెదుట ఉంచెను. ఇట్లు యమధర్మరాజు కఠినముగా మాటలాడుచు తత్తరపడుచుండగా ఆసభయందలివారందరు తమబ్రదుకునందు సందేహముగలవారై వణకసాగిరి. శివుడు ఈచెప్పబడిన యమునిమాటలను విని చిరునవ్వునవ్వి ఎల్ల దేవతలును వినుచుండగా యమునితో ఇట్లుపలికెను. ఓయమధర్మరాజా! ఇట్లు ఎవఱుమాటలాడజాలును. నీవంటి వానిని ఎవడుఅవమానింపఁబోవును. ఇంతఆటోపముతో ఇట్లుమాటలాడుట నీకుతగదు. నీవు ఇట్లు పలుకుచుండగా నిర్మలమైన సభికులయొక్క మనసులందు వెరపు పుట్టినది. అదిగాకరక్షించువాడను నేనుఉండగా ఆకాలమునందు సర్వమును ఎట్లు ప్రళయమునొందును. నేను సత్యమునుండి తొలగుట ఎట్టిది. నీవు ఈపాపముల పట్టికనుముద్రను దండమును వదలుట ఎట్టిది. అని పరమేశ్వరుడు అడుగగా, యముడు ఓ స్వామీ! ఈ పట్టికయందు వ్రాయబడినది ఏమి? అందులకు విధించిన శిక్షను ఎక్కడ పడగొట్టవచ్చును? మిక్కిలి పాపాత్ముడైన బోయవాడు మీసేవకులైన ప్రమథగణములచేత మీ సన్నిధానమునకు తేబడెను. వాడు పాపులలోనెల్లను అధికపాపి. బ్రతికినంతకాలము జీవహింస చేసినవాడు. ఇతర జంతువుల మాంసముచేతనే పొట్టపోసికొన్నవాడు. చెడ్డమనసు గలవాడు. దయలేనివాడు. ఎల్లజనులచేత దూషింపబడినవాడు. ధర్మముల పేళ్లైనను విన్నవాడుకాడు. అని చిత్రగుప్తుడు నాతో చెప్పెను. అటువంటి పాపాత్ముని ప్రమథగణము ఎల్ల అభీష్టములతో కూడినవానిగా విమానమునందు గూర్చుండబెట్టుకొని వచ్చినదే కాక నా కింకరులను ఇనుపగుదియలతో తలలు పగులగొట్టి పంపిరి. ఇట్లు అప్సర

సోఽయం విమానే స్థాపితో గణైః, కృతంస్నానం కిమేతేన మాఘమాసి బహిర్జలే కిం యష్టా రాజసూయేన వాజపేయేనవా పునః, అప్సరోగణసంకీర్ణే విమానే యేన రాజతే. స్వయందేవో యతస్త్వం పాపానామపి దేహినామ్, నిరనుక్రోశతాంగత్వా హంతాస్మి కిమహం ప్రజాః. అతస్త్యక్తాధికారస్య కిందండేన పటేనమే, స్థాస్యామి సోఽహమత్రైవ భవత్పాదాబ్జసేవకః. ఈశ్వరః. యత్తేనాచరితం పుణ్యం కాననే మృగజీవినా, ధర్మరాజ న జానాతి చిత్రగుప్తస్తు తేనవై. శివరాత్రిముపోష్యాసౌ బిల్వపత్రైశ్శివార్చనమ్, కృత్వా జాగరితా రాత్రిస్తేనేదం ఫలమాప్తవాన్. అపనీయ తనుం పూర్వాం సప్తధాతు మలీమసామ్, శివరాత్రిమహుతాశేన వ్యాధోఽసీతస్సువర్ణతామ్. చిత్రగుప్తః. శివరాత్రిం వనే వేద నచ దేవ పురస్థితం, బభంజబిల్వపత్రాణి శ్వాపదాలోకహేతునా. నతుపత్రైరయంశంభు మర్చయామీతి చేతసా, బాణంసంధాయ కోదండే హంతుకామో మృగానయమ్. సజాగరం నిజాం కృత్వాఽఽం

లతో నిండుకొన్న విమానముమీదచేరి వెలుగుటకు వీడు ఊరిబయటిజలములలో మాఘస్నానము చేసెనా? రాజసూయయాగము చేసెనా? వాజపేయము అనుయజ్ఞమును చేసెనా? దేవుడవైన నీవు పాపులను ప్రీతితో కాపాడుచు ఉండగా నేను దయలేనివాడనై ఎల్లజనులను హింసపెట్టుచున్నానా ఏమి? నేను నా అధికారమును వదలుకొంటిని. అధికారమును విడిచిపెట్టిన నాకు పట్టికతోను దండముతోను ఏమి ప్రయోజనము? అన్నిటిని మాని నీపాదసేవచేయుచు ఇచ్చటనే ఉండెదను. అని యముడు శివునితో విన్నపము జేసికొనెను.

శివునిమాట. ఓయి యమధర్మరాజా! మృగములను చంపి జీవించెడి ఈ బోయవానిచేత అడవియందు చేయబడిన పుణ్యమును చిత్రగుప్తుడు ఎరుగడు. వీడు అడవిలో శివరాత్రినాడు పస్తుఉండి మారేడుపత్త్రితో శివపూజచేసి ఆరాత్రియంతయును మేలుకొని ఉండెను. కనుక ఆఫలముచేత వస అసృక్కు మాంసము మేదస్సు అస్థి మజ్జము శుక్లము అనబడిన సప్తధాతువులచేతను మురికిపట్టిన మునుపటిదేహమును శివరాత్రి అనెడి అగ్నిచేత కాల్చివేసి బంగారుమయమైన దేహమును పొందెను.

చిత్రగుప్తునిమాటలు. ఓస్వామీ! వీడు అడవియందు ఉన్నవాడు శివరాత్రియని ఎరుగడు. తనముందరనున్న శివలింగమును ఎరుగడు. మృగములు కానరావలెనని బిల్వపత్త్రిని దూసిపోసెనుగాని శివలింగమును పూజింపవలెనను తలపుతో బిల్వపత్త్రినిదూయలేదు. వింటియందు బాణమునుకూర్చి మృగములను చంపవలెనని రాత్రియంతయును మేలుకొని ఉండెనుగాని శివరాత్రి అని జాగారము చేయలేదు. మాంసముదొరకక పస్తుపడి ఉండె

మాంసాభావాదుపోషితః, నాస్య దేవే భవద్భావో మహావ్రతసమాప్తయే. లోకనాథ తథాప్యేషః పరాం లేభే సతాంగతిమ్. ఈశ్వరః. చిత్రగుప్త వినాభావా దియన్మాత్ర మభూత్ఫలమ్, తస్మిన్నైవ శ్రద్ధధానస్య వ్రతే ముక్తిర్న దుర్లభా. దత్తమిష్టం హుతం వాపి తపో నాచరితం మహత్, శివరాత్రి వ్రతస్యాస్య సమం నాస్తీహ కించన. స్థీయతామధికారే స్వే తథైవ శ్రుతిశాశ్వతే, మా విషాదం కృతాశ్చైతే మద్గణైర్నిహతా ఇతి. అహం మానాభిభూతానాం భూతానా మల్పచేతసామ్, బలశాలిషు ముక్తేషు పరిభూతి రభూతిచ. నిశమ్యేతి వచశ్శంభోః, విధాయశిరసానతిమ్, క్షమస్వేతిచ భూతానాం పతయే తే నమోనమః. శివం ప్రసాదయామాస భయసంవిగ్నమానసః, కాలదండం సమాదాయ పట్టం ముద్రాంచ ధర్మరాట్. చిత్రగుప్తాదిభిస్సార్థం తతః ప్రాయాద్యథాగతమ్, వ్యాధోఽపి శక్రసంకాశః సర్వలోకేషు సంచరన్. కామగేన విమానేన స్తూయమానోఽప్సరోగణైః, కైలాసాదిషు లోకేషు బహూ

---

నుగాని ఈమహావ్రతమును నడపవలసినది అనుతలంపుతో ఉపవాసము చేయలేను. అట్లు అయ్యును వీడు సత్పురుషులు పొందదగిన సర్వోత్కృష్టమైనగతిని పొందెను.

ఈశ్వరునిమాటలు. ఓచిత్రగుప్తుఁడా! వ్రతముతలపులేమిచేతనే ఈఫలముకలిగెను. శ్రద్ధతో ఈవ్రతమును ఆచరించినవానికి మోక్షముపొందరానిది కానేకాదు. విశేషదానములు చేయుటయు యజ్ఞములుచేయుటయు గొప్పతపస్సులుచేయుటయుశివరాత్రితో కొంచెమైనను సమానములు కావు. కనుక మీరు వేదప్రసిద్ధములైన మీమీ అధికారములయందు ఉండుడు. ఈకింకరులు ప్రమథగణములచేత కొట్టబడితిమే అని సంకటపడవలసిన పనిలేదు. అల్పబుద్ధులును అహంకారులునైన జనులకు భంగపాటును బలవంతులగు అహంకారము లేనివారికి లేమిని కలుగచేయుదుము. అని శివుడు సెలవియ్యగా యమధర్మరాజు ఆదేవుని ఆజ్ఞను శిరసావహించి సమస్తప్రాణులకును రాజవైన ఓమహాదేవా! నీకు నమస్కారము అని తలతో నమస్కారము చేసి, శివుడు అనుగ్రహింపగా భయముచేత తత్తరపడుచున్న మనసుగలవాఁడు అగుచు తనదండమును పాపములువ్రాయు పట్టికను ముద్రను తీసికొని చిత్రగుప్తుడు మొదలగువారితోగూడ తాను వచ్చినదారి బట్టుకొని పోయెను. బోయవాడును దేవేంద్రునివలె ఎల్లవైభవములునుగలవాఁడై ఎల్లలోకములందును తలచినతావునకుపోవునట్టి విమానముతో అప్సరస్త్రీల సమూహముచేత పొగడబడుచు తిరుగువాడును కైలాసము మొదలైన లోకములయందు అనేక సంవత్సరములు

సంవత్సరాన్ వసౌ, దివ్యభోగాన్ తథా భుంజన్ గణానాం గణతాంగతః. ఇయంసా తే కథాఖ్యాతా లుబ్ధకస్యనృపోత్తమ, శివరాత్రేశ్చమాహాత్మ్యం కథితం పుణ్యవర్ధనమ్. వినాభావమిదం తేన ఫలంవ్యాధేనపాపినా, ప్రాప్తమన్యైః సుదుష్ప్రాపం యథా తేకథితంమయా. యఃకరోత్యభిసంధాయ శ్రద్ధయా విధివత్పునః, తస్య పుణ్యమహం వక్తుమశక్తోఽస్మి నరాధిప. వసిష్ఠః. ఇత్థంవ్యాధం నినాయైషా శివలోకం శివానిశా, ఇత్థం వ్యాధేన పుణ్యాత్మా ప్రాప్తవాన్ స వనేచరః. మాఘస్య ముఖ్యో భువి పూర్వపక్షో వృకోదరైకాదశిసంగమేన, తస్మాదపి శ్రేష్ఠతరో బభూవ పక్షోఽపరశ్శ్రీశివరాత్రియోగాత్. విశిష్టపాత్రేషుసమర్పితేషు దానేషు సర్వేష్వవితత్పరేషు, యజ్ఞేషుసర్వేషుసదక్షిణేషు మాఘోగరీయాన్ శివరాత్రియోగాత్. సూతః. ఉక్తం వసిష్ఠేనమునీశ్వరేణ మహావిచిత్రం కలికల్మషఘ్నం, ఆకర్ణ్యభక్త్యా శివరాత్రిపుణ్యానందరాజానితరాం దిలీపః.

ఇతి శ్రీపాద్మపురాణే, మాఘమాహాత్మ్యే, శివరాత్రిమహిమానువర్ణనంనామ అష్టావింశోఽధ్యాయః.

---

దివ్యములైన భోగములను అనుభవించువాడునై ప్రమథగణములలో గణన కెక్కినవాఁడాయెను. ఓ రాజశ్రేష్ఠుడా! ఆబోయవానికథను పుణ్యమును పెంచునట్టి శివరాత్రియొక్క మహిమను పాపాత్ముడైన బోయవాడు శివరాత్రివ్రతమును ఆచరింపవలెనని తలపకయే ఇతరములచేత పొందరాని మహాఫలమును పొందుటయును నీకుచెప్పితిని. శ్రద్ధతో క్రమముతప్పక శివరాత్రివ్రతమును కోరిఆచరించువానిపుణ్యముఇట్టిదనిచెప్ప నేనుసమర్థుడను కాను. అని చెప్పి వసిష్ఠుడు దిలీపమహారాజుతో, ఓరాజా! శివరాత్రి యీ విధముగా బోయవానిని శివలోకమును పొందించెను. ఈహేతువుచేతనే ఆబోయవాడు పుణ్యాత్ముడు ఆయెను. ఇదిగాక ఈమాఘమాసము శుక్లపక్షమునందు భీమైకాదశి వచ్చుటచేతను కృష్ణపక్షమునందు శివరాత్రితోడికూడికకలుగుటచేతను అన్ని మాసములలోను ముఖ్యమైనదియును మిక్కిలి శ్రేష్ఠమైనదియును ఆయెను. యోగ్యులైన పెద్దలకు శ్రద్ధతో ఇయ్యబడిన సమస్తదానములయందును పూర్ణదక్షిణలతో గూడిన గొల్లయజ్ఞములయందును మాఘమాసము శివరాత్రితో గూడినదగుటచేత ఎచ్చైనది అగును.

సూతునిమాటలు. మునిశ్రేష్ఠుడైన వసిష్ఠునిచేత చెప్పబడిన మిక్కిలి వింతయైనదియును కలియుగమునందలి పాపములను నశింపచేయునదియును ఐన శివరాత్రి పుణ్యమును దిలీపమహారాజు భక్తితో విని మిక్కిలి సంతోషించెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు శివరాత్రిమహిమను తెలుపునట్టిదైన ఇరువదియెనిమిదవ అధ్యాయకథ.

## ఏకోనత్రింశోఽధ్యాయః.

దిలీపః.—విచిత్రేయం కథాఖ్యాతా అంకిలస్య మహాత్మనః, మనో మమత్వయానీతం పరమానందమందిరమ్. సత్యం సంతి వ్రతాన్యత్ర సుబహూన్యపరాణ్యపి, అభీష్టఫలదాయీని భవమూలాని కేవలమ్. అస్య వ్రతస్యమాహాత్మ్యం అహో వాచామగోచరమ్, అవిచింత్యతయా తస్య ఫలంయస్యాశ్వమేధికమ్. యేనై తద్విధినా విప్ర వ్రతం కార్యం జనైరపి, బ్రూహి తత్త్వ మశేషేణ నమస్తుభ్యం మునీశ్వర. వసిష్ఠః.—త్రయోదశ్యాం నిరాహారో నిశి సుప్త్వా జితేంద్రియః, ప్రభాతేతు సముత్థాయ కృతపూర్వాహ్ణిక క్రియః. దర్శనాలాపసంస్పర్శా నంత్యజైస్సహ వర్జయేత్, నద్యాదౌ విహితస్నానో వసానో ధౌతవాససీ. దివాకరముపస్థాయ కృతదేవపరాయణః, శివస్యాయతనం సర్వం గోమయే నోపలేపయేత్. కుర్యాత్కుసుమసంఛన్నం నానాలంకారశోభితమ్, తతో జలేన శుచినా స్నాపయిత్వా విశేషతః. లింగం పంచామృతేనాపి స్నా

---

## ఇరువదితొమ్మిదవ అధ్యాయము.

దిలీపునిమాటలు —ఓ వసిష్ఠమహాముని! వింతయైన అంకిలుడుఅనుమహాత్ముని కథను చెప్పితిరి. దానిని వినుటచేత నామనస్సు మిక్కిలిసంతోషించెను. ఇదినిజము. లోకమునందు అనేకములు వ్రతములు ఉత్తమములైనవికలవు. ఐనను అవికోరినకోరికలను ఇచ్చునవియును జన్మమునకు కారణములైయున్నవి. ఆశ్చర్యకరమైన ఈశివరాత్రివ్రతము యొక్కమహిమను నోటచెప్పుటకును మనసునతలచుటకును అలవికానిదిగానున్నది. ఈశివరాత్రివ్రతఫలము అశ్వమేధయాగముయొక్క ఫలమునుమించినది. ఈవ్రతమును జనులు ఆచరింపవలసిన క్రమము ఎట్టిది? అదియంతయును నాకు విశదముగా తెలియచెప్పుము నీకు నమస్కరించెదను.

వసిష్ఠునిమాటలు—త్రయోదశినాడుఆహారము లేకయుండినాటిరాత్రి ఇంద్రియ జయముగలవాడై జాగారముచేసి తెల్లవారిలేచి ప్రాతఃకాలమునందు చేయవలసినఅనుష్ఠానములన్నియుం చేసికొని చండాలురతో మాటలాడక వారిని చూడక తాకక ఏరుమొదలగు వానిలో స్నానముచేసి పరిశుద్ధమైనవస్త్రమును కట్టుకొని సూర్యోపస్థానమును దేవతార్చనమును చేసికొని శివుని ఆలయమును ఆవుపేడతో చక్కగా అలికి దానియందు పువ్వులను పరిచి అలంకరించి పిమ్మట పరిశుద్ధమైన జలమును ప్రోక్షించి అటు పిమ్మట శివలింగమునకు పాలు పెరుగు నెయ్యి తేనె పానకము అను నీ పంచామృతములచేతను అభిషేకముచేసి వెంటనే శుద్ధజలముతో అభిషేకము చేయవలెను. అట్లు అభిషేకము

పయేచ్చ జలైస్తతః, కుంకుమై ర్లేపయేల్లింగం తథా సురభిచందనైః
త్రిదళైర్బిల్వపత్రైశ్చ పూజయే దేకమానసః, అన్యైశ్చకుసుమైర్భక్త్యా
జాతికుందాదిభిస్తథా. శర్వాయోగ్రాయ భీమాయ శంకరాయ శివా
యచ, ఈశానాయ మహేశాయ భూతానాం పతయే నమః మంత్రే
ణానేన సంపూజ్య భక్త్యా ప్రయతమానసః, అగరుంవా దశాంగంవా
గుగ్గులుంవాపిధూపయేత్. ఘృతాదిస్నేహసంపూర్ణాన్ దీపానుద్దీప్య
సుప్రభాన్, నైవేద్యం విధివద్దద్యాదన్నమిష్టఫలానిచ. గంధం సుమన
సోదీపో జ్యోతిరన్నాది యన్మయా, దత్తం తేనాపి సంతుష్టః పార్వత్యా
సహ శంకర. ఇతి సంకల్ప్య తత్సర్వం కుర్యాద్దానాదికంతతః, తతోనా
నావినోదైస్తు సంజహ్యా త్పర్వశర్వరీమ్ గీతవాదిత్రనిర్ఘోషైః శివమంగళ
దాయకైః, శివరాత్ర్యాశ్చ మాహాత్మ్యం పఠద్భి ర్బ్రాహ్మణోత్తమైః
కథాభి రనుకూలాభి శ్శాంభవీభిరతంద్రితః, సమాధాయ మనశ్చైవ
భవే న్నిద్రాపరాఙ్ముఖః. తతశ్చ తుష్టయే యామే దద్యా దర్ఘ్యం పృథ

చేసి కాగానే కుంకుమమును మంచివాసనతోడిగంధముతు లింగమునకుపూసి మూడేసి ఆకులు గలిగిన బిల్వదళములచేత చలింపని మనసుతో పూజచేసి పిమ్మట జాజులు మొల్లలు మొదలుగాగల పువ్వులచేత భక్తితో శర్వాయనమః ఉగ్రాయనమః భీమాయ నమః శంకరాయనమః శివాయనమః ఈశానాయనమః మహేశాయనమః భూతానాం పతయే నమః అని యిట్లు శివనామములను చెప్పుచు నియమముతోడి మనసు గలవాడై అర్చనచేసి అగురు సాంబ్రాణి గుగ్గిలము వీనిలో ఏద్రవ్యముచేత నయినను ధూపమిచ్చి నెయ్యి మొదలగు చమురులతో దీపము చక్కగా వెలిగించి అన్నమును శివప్రీతికరములయిన పండ్లను క్రమము చొప్పున నైవేద్యముచేసి "ఓయీశ్వరా! గంధము పుష్పము దీపము నీరాజనము అన్నము మొదలుగ ఏమేమినాచేత సమర్పింప బడునో వానిచేతనే పార్వతీదేవితోడ నీవు సంతోషించినవాడవు అగుము" అను అర్థముగల మంత్రముతో సంకల్పముచేసి పిమ్మట ఎల్లదానములను చేసి తరువాత అనేకవిధములయిన వేడుకలచేతను పాటచేతను వీణ మొదలగు వాద్యములచేతను శివునికి శుభమును గలుగజేసెడి మంగళారతులచేతను శివరాత్రి మాహాత్మ్యమును చదివెడి బ్రాహ్మణశ్రేష్ఠులతో శివసంబంధములైన కథలను వినుచు కలవరములేని మనసుగలవాడై నిద్రను కోరక ఆరాత్రియంతయు గడుపవలెను. మరియు రాత్రియొక్క నాలుగు జాములయందును వేరువేరుగా నియమముచొప్పున మంత్రపూర్వకముగా జలము

క్పృథక్, కృత్వా విధివదవ్యగ్రో భక్త్యా మంత్రపురస్సరమ్. తోయం దూర్వాఫలం పుష్పం చందనం సర్షపైస్సహ, పాత్రేఽర్ఘ్యంతు సమాదాయ దద్యాన్మంత్ర ముదీరయేత్. నమశ్శివాయ సోమాయ సర్వపాపహరాయచ, శివరాత్రౌ మయా దత్తం గృహాణార్ఘ్యమిదం ప్రభో. మయా కృతాన్యశేషాణి పాపానినుదశంకర, గృహాణార్ఘ్య ముమాకాంత శివరాత్రౌ ప్రసీదమే. దుఃఖదారిద్ర్యరోగాదిదగ్ధోఽహం పార్వతీప్రియ, గృహాణార్ఘ్యందయాంకృత్వా శివరాత్రౌ మహేశ్వర. శివరాత్రౌ దదామ్యర్ఘ్యం సర్వపాపవ్యపోహనమ్, శివ ప్రతీక్ష్యమాంభక్త్యా ప్రసీద ఉమయాసహ. నమశ్శివాయ శాంతాయ కారణత్రయహేతవే, నివేదయామి చాత్మానం త్వంగతిః పరమేశ్వర. అనేనైవతు మంత్రేణ దేవదేవం క్షమాపయేత్, అథ రాత్ర్యాం వ్యతీతాయాముదితే విమలేరవౌ. నిర్వర్త్యావశ్యకార్యాణి శ్రాద్ధం కుర్వీత శాంభవమ్, బ్రాహ్మణాన్భోజయేద్భక్త్యా తథాన్యాక్ శివయోగినః. దీనాంధవికలానాథాణ్ భృత్యా

---

గరిక పండ్లు పువ్వులు గందము ఆవాలతోఁగూడిన అర్ఘ్యమును సమర్పించుచు ఆయా అర్ఘ్యకాలములయందు "శుభకరుడును ఉమాదేవితోఁ గూడుకొన్నవాడును సమస్త పాపములను హరించువాడునునైన ఓస్వామీ! నీకొఱకుశివరాత్రినాడు నాచేత ఇయ్యఁబడెడి యీ అర్ఘ్యమును గ్రహింపుము. సేవకులకు సుఖమును కలుగఁజేయువాడవును ఉమాదేవికి భర్తయునైన ఓస్వామీ! శివరాత్రినాడు నాచేత ఇయ్యఁబడునట్టి అర్ఘ్యమును గ్రహించి నాచేత చేయఁబడిన పాపములన్నియుఁ దొలఁగిపోవునట్లు అనుగ్రహింపుము. పార్వతీదేవికి ప్రియుఁడవైన ఓస్వామీ! దుఃఖము దారిద్ర్యము రోగము మొదలగువానిచేత కాల్పఁబడువాడను. నాయందు దయచేసి నేనుశివరాత్రినాడు ఇచ్చునట్టి అర్ఘ్యమును గ్రహింపుము. శివరాత్రినాడు ఎల్ల పాపములను పోఁగొట్టునట్టిదైన అర్ఘ్యమును నేను ఇచ్చుచున్నాను. భక్తితోఁగూడిన నన్ను పార్వతితోఁ గూడినవాడవై అనుగ్రహింపుము. శుభస్వరూపుఁడవును శాంతుఁడవును సృష్టిస్థితిసంహారములనెడి మూఁడు కార్యములకు కారణములైన త్రిగుణములకు కారణమయినవాఁడవునునైన నీకు నమస్కారముచేసి నాఆత్మనే నీకు సమర్పించెదను. ఓపరమేశ్వరా! నీవే నాకుగతి." అను అర్థముగల మంత్రముచేత అర్ఘ్యమిచ్చి మహాదేవుని తన్ను మన్నింప వేడుకోవలెను. అంతట ఆరాత్రి కడచిపోయి సూర్యుఁడు ఉదయింపఁగానే అప్పుడు తప్పక నడపవలసిన కార్యములను నడపి శాంభవ శ్రాద్ధమును చేయవలెను. (శాంభవశ్రాద్ధము అనఁగా శివప్రీతిగా కొందరు బ్రాహ్మణులను శ్రద్ధతోఁ పూజించి వారికి తృప్తిగా అన్నము పెట్టుట అని చెప్పెదరు.) పిమ్మట శివభక్తులయిన ఇతరబ్రాహ్మణులకు దిక్కులేనివా

వన్యాంశ్చ భోజయేత్,హిరణ్యగృహగోదానం భూమిశ్చాశ్వా రథాగజాః. దాతవ్యాహి యథాన్యాయం బ్రాహ్మణేభ్యో విశేషతః, లక్షం లక్షపతిర్దద్యా ద్దరిద్రస్తు వరాటికామ్,సమమేవ తయోఃపుణ్యం ప్రవదంతి మనీషిణః, విప్రాదీన్ భోజయిత్వాథ దక్షిణాభిస్సమాపయేత్. అనుజ్ఞాతస్తు తైః కుర్యా త్పారణం వాగ్యతో వ్రతీ,అనేన విధినా యస్తు వ్రతమేతత్కరిష్యతి. సర్వపాపవినిర్ముక్తః శాంకరం పదమేతి సః, అస్యైవకులసంభూతా స్తేపి సౌభాగ్యభాగినః, ఆధివ్యాధివిహీనాశ్చాప్యంతే కైవల్య మాప్నుయుః. దిలీపః —యోనజానాతి మంత్రాణాం నియమం నాపి బాలిశః, సోఽపి పూర్ణఫలం తస్య వ్రతస్య లభతే కథమ్. వసిష్ఠః.- శృణుచాపి పరం గుహ్యం శివస్యాతీవ తుష్టిదమ్, యదిదం జ్ఞానసర్వస్వం కథయామి తవానఘ.సద్యోవమశ్శివాయేతి మంత్రేణార్చాం కరోతియః, సమాహితాత్మా భూత్వాచ కృతంతేనాఖిలం త్విదమ్. యేనకేనాపి వి

రును గ్రుడ్డివారును అవయవముల స్వాధీనత తప్పినవారును అగుజనులను తన సేవకులను ఇతరులగు జనులను భోజనముచేయించి శిష్టుల బ్రాహ్మణులకు బంగారము ఇండ్లు గోవులు భూములు గుఱ్ఱములు రథములు ఏనుగులు మొదలగువానిని క్రమముచొప్పున దానముచేయవలసినది. లక్షాధికారియగువాడు లక్షరూకలది దానము చేయవలసినదేగాని ఏమిలేని పేదవాడు తనశక్తికి తగినట్లు ఒక గవ్వయిచ్చినను చాలును. ఈచెప్పబడిన లక్షాధికారి నిరుపేద యీయిద్దరకును ఆయిచ్చుటవలని పుణ్యముసమానమేగాని ఎచ్చుతక్కువలేదు. అని విద్వాంసులు చెప్పెదరు. శిష్టుల బ్రాహ్మణులకు భోజనము పెట్టుట దక్షిణయిచ్చుట అనుక్రియలచేత వ్రతమును పూర్తిచేయవలసినది. అటుశిష్టుల బ్రాహ్మణులచేత అనుజ్ఞపడసి వ్రతమునడుపువాడు మౌనముతో పారణచేయవలసినది. ఈనియమముచేత ఎవడు ఈవ్రతమును చేయునో వాడు సర్వపాపములచేత విడువబడినవాడై శివునిస్థానమైన కైలాసమును పొందును. వాని కులమునందు బుట్టినవారు చక్కదనమును భోగమునుగలవారు అగుదురు. మరియు మనోవ్యథలును వ్యాధులును లేనివారై కడపట కైవల్యమును పొందుదురు. అని వసిష్ఠుడు చెప్పగా, దిలీపుడు ఈచెప్పబడిన మంత్రములను నియమములను తెలియని మూఢుడు ఈవ్రతమును ఆచరించినపక్షమున అట్టివానికి అందుల ఫలము పూర్తిగా లభించుట యెట్లు అని యడిగెను. అందులకు వసిష్ఠుడు, ఓరాజా! వినుము. అని యిట్లు చెప్పనారంభించెను. మిక్కిలి రహస్యమయినదియు శివునికి మిక్కిలి తృప్తిని కలుగజేయునదియు జ్ఞానమునకు సమస్తవిధములను మూలమయినదియునైన యీవిషయమును తెలియజేసెదను. ''ఇప్పుడు శివునికొరకు నమస్కారము'' అను అర్థముగల మంత్రముచేత ఊరటనొందిన మనస్సుతో ఎవడు శివార్చనచేయునో వాడు ఎల్ల విధులను నడపినవాడు అగును. ఏవిధముగానైనను సరే శివరాత్రినాడు ఉపవాసము

ధినా శివరాత్రి ముపోషితః, జాగరంచైవ యఃకుర్యా త్పాతకై స్స విముచ్యతే. పురుషోవాథవానారీ కుమారీవాథకన్యకా, కింకిం నలభతే శ్రేయః శివరాత్రిమహోత్సవే. భర్తృహీనాచ యానారీ శివరాత్ర్యుపవాసనాత్, తస్యా స్తిష్ఠతి మాంగల్య మన్యజన్మని చాక్షయమ్. శివరాత్రివ్రతంయస్తు కీర్తయేత్సతతంనరః, ముచ్యతే సర్వపాపేభ్యః శివలోకేమహీయతే. యత్రేదం పఠ్యతే రాజన్ తత్ర శంభుః ప్రసీదతి, అస్యాధ్యాయస్యవక్తాయః స విజ్ఞేయ స్సదాశివః. తం పూజయే న్మహాత్మానం భుక్తిముక్తిప్రదాయకమ్, జాయంతే సర్వకామస్తు సర్వేషాం శ్రవణేన వై. కిమత్ర బహునోక్తేన సర్వకామాన్ లభేన్నరః. తురగముఖ మఖాభిః కిం క్రియాభిః ప్రయత్నా ద్యదిచ సువ్రతమేకం కీర్తయేద్య శ్శృణోతి, హృదయగతమశేషం వాంఛితం ప్రాప్య పశ్చా త్ప్రచురమణిగణాఢ్యే రాజతే ఖే విమానే.

ఇతి శ్రీపాద్మేపురాణే, మాఘమాహాత్మ్యే, శివరాత్రి
వ్రతవిధానం నామ ఏకోనత్రింశోఽధ్యాయః.

---

చేసి నాటిరాత్రి జాగారము చేయువాడు ఎవడో వాడు పాపములచేత విడువబడును. మగవాడుగాని ఆడుదిగాని పెండ్లియై సమర్తాడని పడుచుగాని పెండ్లికాని పడుచుగాని శివరాత్రిపండుగయందు నియమముతో ఉపవాస జాగరణములు నడపినయెడ ఏమేమి శుభములు లభింపక పోవును? (అన్నియును లభించును అనుట) పెనిమిటి లేనిదైనఆడుది శివరాత్రినాటి ఉపవాసమువలన పిమ్మట జన్మమునందు చెడనిముత్తైదువతనమును పొందును. శివరాత్రివ్రతమును ఎల్లప్పుడు తప్పక నడపునట్టి మనుష్యుడు ఎల్లపాపముల వలనను విడువబడినవాడై శివలోకమునందు వసించును. ఎచ్చట ఈశివరాత్రిమహిమను చదువుదురో అచ్చట శివుడు ప్రసన్నుడైయుండును. ఈఅధ్యాయమును ఎవడు చదివిచెప్పునో వాడు శివుడుగా ఎంచవలసినది. ఇహలోకమునందు అనుభవించుటకు సుఖములను పరలోకమునందు మోక్షమును ఇచ్చునట్టివాడైన అట్టిమహాత్ముని పూజింపవలెను. ఈశివరాత్రిమహిమమును వినువారికి కోరినకోరికలెల్లను కలుగును. ఇంకను ఈవిషయమునందు పలుమాటలు పలుకనేల. ఎవడు ఈశివరాత్రిమహిమను ఒకదానిని వినునో వాడు పూనికతో చేయబడిన అశ్వమేధము మొదలయిన యజ్ఞములను అనేకములను చేసినఫలమును పొందుటయేగాక మనసునగల యిష్టములనెల్లను పొంది కడపట మిక్కిలి ప్రకాశించుచున్న మణులుచెక్కినవిమానము నెక్కి వెలుగును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు శివరాత్రివ్రతవిధానమును తెలుపునట్టిదైన ఇరువదితొమ్మిదవ అధ్యాయకథ.

## త్రింశోఽధ్యాయః.

వసిష్ఠః.—అథవా మాఘమాహాత్మ్యం ప్రవక్ష్యామినృపోత్తమ, పృచ్ఛతే కార్తవీర్యాయ దత్తాత్రేయోదితం పురా. దత్తాత్రేయం హరింసాక్షా ద్వసంతం సహ్యపర్వతే. తంమునిం సముపాగమ్య నత్వాతత్పాదపంకజమ్. పప్రచ్ఛావసతో భూత్వా రాజా మాహిష్మతీపతిః, భగవన్ యోగినాం శ్రేష్ఠ సర్వే ధర్మా మయా శ్రుతాః. మాఘస్నానఫలం బ్రూహి కృపయా మమ సువ్రత. దత్తాత్రేయః.—శ్రూయతాం రాజశార్దూల త్వత్ప్రశ్నస్యోత్తరం శుభమ్, బ్రహ్మణోక్తం పురా హ్యేవ నారదాయ మహాత్మనే. తత్సర్వం కథయిష్యామి మాఘస్నానఫలం మహత్, యథా దేశం యథాతీర్థం యథాశ్రాద్ధం యథాక్రియా. అస్మిన్వై భారతే వర్షే కర్మభూమౌ విశేషతః, అమాఘస్నాయినాం నృణాం నిష్ఫలం జన్మకీర్తిదమ్. అసూర్యంగగనంయద్వదచంద్రముడుమండలమ్, తద్వన్న భాతి తత్కర్మ మాఘస్నానం వినా నృప. వ్రతైర్దానైస్తపోభిశ్చ న తథా ప్రీయతే హరిః, మాఘమజ్జనమాత్రేణ యథా ప్రీణాతి కేశవః.

---

## ముప్పదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—ఓదిలీపమహారాజా! పూర్వకాలమునందు కార్తవీర్యార్జునుడు అడుగగా అతనికి దత్తాత్రేయుండు చెప్పిన మాఘమాహాత్మ్యమును ఇప్పుడు నీకు చెప్పెదను. ప్రత్యక్షవిష్ణువైనదత్తాత్రేయమహాముని సహ్యపర్వతమునందు ఉండగా మాహిష్మతీపట్టణమునకు రాజైన కార్తవీర్యార్జునుడు ఆమునీశ్వరునియొద్దకుబోయి ఆయనపాదములకుమ్రొక్కికూర్చుండి, పూజ్యుడవైన ఓమునిశ్రేష్ఠుడా! నీయనుగ్రహమువలన నేను ఎల్లధర్మములను వింటిని. ఇకను దయతో మాఘస్నానఫలమును సెలవిమ్ము అనియడిగెను.

దత్తాత్రేయునిమాటలు.—ఓయిరాజశ్రేష్ఠుడా! నీవు అడిగినదానికి మారుఉత్తరమయిన పుణ్యకథను వినుము. ఎచ్చైన యీమాఘస్నానఫలము మునుపు మహాత్ముడైన నారదునకు బ్రహ్మచేత చెప్పబడెను. అదియంతయు నీకు నేనును చెప్పెదను. కర్మభూమియయిన ఈభరతఖండమునందు పుణ్యక్షేత్రములయందు ఎట్లు ఉండవలెనో అట్లు ఉండినను పుణ్యతీర్థములయందు స్నానము చేసినను శ్రాద్ధములను చేసినను పుణ్యక్రియలను నడపినను విశేషించినదైన మాఘస్నానము చేయని మానవుజన్మము వ్యర్థమగును. అట్టివాడు చేసెడిపుణ్యకర్మములన్నియు సూర్యుడులేని ఆకాశమును చంద్రుడులేని నక్షత్రమండలమును ఎట్లోఅట్లు ప్రకాశింపనేరవు. శ్రీవిష్ణుదేవుడు మాఘస్నానమాత్రముచేత సంతోషించునట్లు వ్రతములచేతను దానములచేతను తపస్సులచేతను సంతోషింపడు.

కిం రక్షితేనదేహేన సుపుష్టేనబలీయసా, అధ్రువేణాప్యశుచినా మాఘస్నానం వినా నృప. అస్థిస్తంభం స్నాయుబద్ధం మాంసక్షతజలేపితమ్, చర్మావినద్ధం దుర్గంధిపాత్రం మూత్రపురీషయోః. ఆధిశోకజరావ్యాప్తం రోగమందిరమాతురమ్, రజస్వల మసత్యంత త్సర్వదోష సమాశ్రయమ్. పరోపతాపనిరతం పరద్రోహజుగుప్సితమ్, లోలుపం పిశునం క్రూరం కృతఘ్నం శోకదం తథా. దుఃఖదం దుర్ధరందుష్టం తాపత్రయవిదూషితమ్, నిసర్గతో ధర్మహీనం తృష్ణాశతసమాకులమ్. కామక్రోధసమాయుక్తం నరకద్వారసంస్థితమ్, క్రిమివచ్చర్మభస్మాస్థి పరిణామి శునాం హవిః. ఈదృక్ఛరీరకం వ్యర్థం మాఘస్నానవివర్జితమ్, బుద్బుదాఇవ తోయేషు పృణికాఇవ జంతుషు. జాయంతే మరణాయైవ మాఘస్నానవివర్జితః, అవైష్ణవోహతోవిప్రో హతం శ్రాద్ధమదక్షిణమ్. అబ్రహ్మణ్యం

మాఘస్నానము చేయనియెడల చక్కగా బలిసినదియును బలముగలదియును, శాశ్వతముకానిదియును పవిత్రము కానిదియును నైన దేహముచేత ఏమిప్రయోజనము. ఎముకలనెడి కంబముల గలిగినదియు సన్నని నరములచేత కట్టబడినదియును మాంసముచేతను నెత్తుటిచేతను పూయబడినదియును తోలుచేత కప్పబడినదియును చెడ్డకంపుగలమూత్రపురీషములకు పాత్రమయినదియును మనోవ్యధ దుఃఖము ముసలితనము వీనిచేతపొందబడినదియును రోగములకు ఇల్లు అయినదియును రోగమువలని బాధగలదియును పరిహరింపదగినదియును సత్యము కానిదియును ఎల్ల దోషములకును ఆధారమైనదియును ఒకరికి సంకటమును కలుగజేయుటయందు ఆసక్తమయినదియును ఒకరికి చెరుపుచేయుటచేత రోతపుట్టించునదియును మిక్కిలి చంచలమైనదియును కొండెములు చెప్పునదియును క్రూరమయినదియును నెనరులేనిదియును వగపుకలుగజేయునదియును బాధనిచ్చునదియును ధరింపరానిదియును చెడ్డదియును ఆధ్యాత్మికము అధిభౌతికము అధిదైవికము అనెడి మూడువిధములైన తాపములతోడగూడినదియును స్వభావముగా ధర్మముచేత తక్కువైనదియును అనేకములయిన ఆశలచేత కలవరము నొందినదియును కామముతోడను క్రోధముతోడను గూడినదియును నరకముల వాకిళ్లయందుండునదియును పురుగువలె తోలుతిత్తియందు పరిపక్వమునొంది కుక్కలకు హోమద్రవ్యము వంటిది అగునదియును అయిన యిటువంటి దేహము మాఘస్నానము చేయమిచేత వ్యర్థమయిపోవుచున్నది. నీళ్లలోనిబుగ్గలవలెను జంతువులయొక్క చొంగవలెను మాఘస్నానములేని దేహము నశించుటకే పుట్టినదగుచున్నది. విష్ణుభక్తుడు కాని బ్రాహ్మణుడును దక్షిణలేని శ్రాద్ధమును బ్రాహ్మణకర్మములేని రాచరికమును ఆచారములేని కులమును

హతంక్షాత్రం అనాచారం హతంకులమ్, సదంభశ్చ హతోధర్మో క్రోధే
నైవ హతంతపః. అదృష్టంచ హతంజ్ఞానం ప్రమాదేనహతంధనమ్. భ
ర్తృభక్తిహతానారీ బ్రహ్మచారీహతో వ్రతః, అదీప్తాగ్నౌ హతోహో
మో హతంభుక్తమసాక్షికమ్. ఉపజీవ్యాహృతాకన్యా సార్థేపాత్రక్రి
యా హతా, శూద్రభిక్షో హతోయాగో లుబ్ధస్యచ హతంధనమ్. అన
భ్యాసా హతావిద్యా హతోరాజా విరోధకృత్, జీవనార్థంహతంతీర్థం
జీవనార్థం హతంవ్రతమ్. అసత్యాచహతావాణీ తథావైశూన్యవాదినీ,
సందిగ్ధశ్చ హతోమంత్రో వ్యగ్రచిత్తో హతోజపః హతమశ్రోత్రియే
దానం హతోలోకస్తు నాస్తికః, అశ్రద్ధయా హతం సర్వం యత్కృతం
పారలౌకికమ్. మనుష్యాణాం హతం జన్మ మాఘస్నానవివర్జితమ్, మక
రస్థేరవౌమాఘే నస్నాత్యనుదితేరవౌ. కథంపాపైః ప్రముచ్యేత కథం
సత్రిదివంవ్రజేత్, బ్రహ్మహా హేమహారీచ సురాపో గురుతల్పగః. మా
ఘస్నాయీ విపాపస్స్యాత్ తత్సంయోగీచపంచమః, మాఘమాసే రటం

---

వంచనతో గూడిన ధర్మమును చెడును. కోపముచేత తపస్సును గ్రంథములను చూడక పోవుటచేత తెలివియు ఏమరుటచేత ధనమును పెనిమిటియందు భక్తిలేకపోవుటచేత ఆడుదియు నియమము లేమిచేత బ్రహ్మచారియు నశింతురు. మండని నిప్పునందు చేయబడిన హోమమును ఒంటరిగాచేయు భోజనమును ఒకరిని అనుసరించి బ్రదుకువానికి ఇచ్చిన కన్యకయు ధనముగలవానికి ఇచ్చునట్టి దానమును శూద్రునియొద్ద బిచ్చమెత్తి చేసినయజ్ఞమును బుద్ధికి దొరికిన ధనమును అలవాటుచేయని విద్యయు వ్యర్థములగును. ప్రజలకు విరోధముచేయు రాజు నశించును. బ్రదుకుదెరువునకై చేయుతీర్థయాత్రయు పొట్టపోసికొనుటకై చేయు వ్రతమును నిరర్థకములగును. అసత్యముపలుకుటచేత మాటయు దేవుడులేడని వాదించుటచేత మతమును ఇదిఫలించునోఫలింపదో అనుసందేహము చేత మంత్రమును చలించినమనసు గలవాడగుట జపమును దానములు తీసుకొనుట చేతనే జీవించువాని జీవనమును వ్యర్థములు. జనసమూహములోపల దేవుడు లేడు అను తలపు గలిగినవాడు నశించును. శ్రద్ధ లేకపోవుటచేత పరలోకసంబంధమయిన క్రియ యేదిచేసినను వ్యర్థమే అగును. ఆలాగుననే మాఘస్నానము లేనిజన్మమును వ్యర్థము. సూర్యుడు మకరరాశిగతుడగుచుండగా మాఘమాసమునందు ప్రొద్దుపొడువకముందే స్నానముచేయనివాడు ఎట్లు తనపాపములచేత విడుపబడును? ఎట్లు స్వర్గమును పొందును? బ్రహ్మహత్యచేసినవాడును ధనమును దొంగలించినవాడును కల్లు త్రాగినవాడును గురుభార్యను పొందినవాడును వారితోడగూడినవాడునైన పంచమహాపాతకులును మాఘస్నానముచేసి తమ పాపములవలన విడుపబడినవా రగుదురు. మాఘమాసమునందు ప్రొద్దు

త్యాపః కించిదభ్యుదితేరవౌ, బ్రహ్మఘ్నంవా సురాపంవా కంపతంతం పునీమహే. ఉపపాతకసంఘాశ్చ మహాపాపాని యానిచ, భస్మీభవంతి సర్వాణి మాఘస్నాయిని మానవే వేపంతే సర్వపాపాని మాఘమాసే సమాగతే, నాశకాలోయమస్మాకం యదిస్నాస్యతివారిణి. పావకాఇవ దీప్యంతే మాఘస్నానైర్నరోత్తమాః, విముక్తా సర్వపాపేభ్యో మేఘేభ్యఇవచంద్రమాః. ఆర్ద్రింశుష్కంలఘుస్థూలం వాఙ్మనఃకాయకర్మభిః, మాఘస్నానం దహేత్సర్వం పావక స్సమిధోయథా. ప్రామాదికంచ యత్పాపం బుద్ధిపూర్వకృతంచయత్, స్నానమాత్రేణ తన్నశ్యే న్మకరస్థే దివాకరే.నిష్పాపాస్త్రిదివం యాంతి పాపిష్ఠా యాంతి శుద్ధ్యతామ్, సందేహో నాత్ర కర్తవ్యో మాఘస్నానా న్నృపోత్తమ. సర్వేధికారిణో హ్యత్ర విష్ణుభక్త్యా యథాభువి, సర్వేషాం స్వర్గదో మాఘః సర్వేషాం పాపనాశనః. ఏషఏవ పరో మంత్రో హ్యేషఏవ పరంతపః,

---

పొడుచుచుండగా బ్రహ్మహత్యచేసినవాడుగాని కల్లు త్రాగినవాడుగాని మరియెవడుగాని వచ్చి మాలో ఎప్పుడు పడుదురో? మేము వారిని ఎప్పుడు పవిత్రులనుగా చేయుదుమో? అని జలములు మొరపెట్టుచుండును. ఏయేమహాపాతకములు కలవో అవియును వానిని అనుసరించిన పాపసమూహములును మాఘస్నానము చేసినమానవునియందు భస్మములగుచున్నవి. అన్నిపాపములు మాఘమాసమురాగానే ఇదిమాకు చెడుకాలము. శ్రేష్ఠులైన జనులందరు స్నానములు చేసి ఆమాఘస్నానముచేత అగ్నిహోత్రులవలె వెలుగుచున్నారు. ఇదిగాక అన్నిపాపములవలన విడువబడినవారై మేఘములవలన విడువబడిన చంద్రబింబమువలెనే కనబడుచున్నారు. తడిసినదియు ఎండినదియు అల్పమయినదియు అధికమయినదియు నై మనస్సుచేతను వాక్కుచేతను దేహముచేతను చేయబడిన పనులచేత వచ్చినవైన పాపముల నన్నిటిని అగ్ని సమిధలను కాల్చునట్లు మాఘస్నానము కాల్చివేయును. పొరపాటువలన గలిగిన పాపములుగాని బుద్ధిపూర్వకముగాచేసిన పాపములుగాని సూర్యుడు మకరరాశిగతుడు అగుచుండగా మాఘస్నానము చేసినమాత్రము చేతనే నశించును. ఓరాజా! మాఘస్నానము చేయుటచేత పాపులు కానివారు స్వర్గమును పొందుదురు. పాపులగువారు తమ పాపములు నశింపగా పరిశుద్ధులు అగుదురు. ఇందులకు సందేహము లేదు. మరియు ఈభూలోకమునందు విష్ణుభక్తిచేత అధికారులు కాదగినవారుగూడ అధికారులు అగునట్లు మాఘస్నానము చేసినవారు స్వర్గమును పొందినవారును పాపములులేనివారును అగుదురు. మిక్కిలి శ్రేష్ఠమైన యీమాఘస్నానము ఎల్లపాపములకును ఉత్తమమైన

ప్రాయశ్చిత్తంపరం హ్యేత న్మాఘస్నానమనుత్తమమ్. నృణాం జన్మాంతరాభ్యాసా న్మాఘస్నానే మతిర్భవేత్, అధ్యాత్మజ్ఞానకౌశల్యం జన్మాభ్యాసా ద్యథానృప. సంసారకర్దమాలేపప్రక్షాళనవిశారదమ్, పావనం పాపనాశం చ మాఘస్నానం పరంతప. రాజన్ మజ్జంతి యే మాఘే సర్వకామఫలప్రదే, తే శ్రేష్ఠాన్ భుంజతే భోగాన్ చంద్రసూర్యగ్రహోపమాన్. శృణు రాజ న్మహాశ్చర్యం ప్రభావం మాఘమాసజమ్. ఋషికా నామ కల్యాణీ బ్రాహ్మణీ భృగువంశజా. బాల్యవైధవ్యదుఃఖార్తా తపస్తేపే సుదుష్కరమ్. వింధ్యపాదే మహాక్షేత్రే రేవాయా ఉత్తరే తటే. తత్ర సా వ్రతినీ భూత్వా నారాయణపరాయణా, సదాధారవతీ నిత్యం జనసంగవివర్జితా. జితేంద్రియా జితక్రోధా సత్యవాగల్పభాషిణీ, సుశీలా దానశీలాచ దేహశోషణతత్పరా. షష్ఠకాలేతథా భుక్త్వా ఉంఛవృత్తిస్సదానృప, కృచ్ఛ్రాతికృచ్ఛ్రపారాక తప్తకృచ్ఛ్రాదిభిర్వ్రతైః, ప్రాణానేవం ధారయంతీ నర్మదాయాశ్చ రోధసి, రాజన్ తదా

---

ప్రాయశ్చిత్తము. ఇదియే సర్వోత్తమమైన మంత్రమును తపస్సును అగుచున్నది. ఇది జన్మాంతరసంస్కారమువలననే పుట్టవలసినది. మరియు మాఘస్నానము సంసారమనెడి అడుసుయొక్క పూతను చక్కగా కడుగుటకు చాలినదియు పాపముల నశింపజేయునదియు అగును ఎల్లకోరికలను నెరవేర్చునట్టిదైన మాఘస్నానమును చేయువారు చంద్రుడు సూర్యుడు వీరితో పోల్పదగిన ప్రకాశముతో మేలయినభోగముల ననుభవింతురు. ఓరాజా! మాఘమాసముయొక్క ప్రభావమును దెలుపునట్టి వింతయైన కథయొకటిగలదు. దానిని చెప్పెదను వినుము. చక్కదనము గలిగినదియు భృగువంశమునందు బుట్టినదియు అయిన ఋషిక అను పేరుగల బ్రాహ్మణకన్యక ఒకతె కలదు. ఆచిన్నది పసితనమునందే విధవాత్వము రాగా మిక్కిలి దుఃఖమును పొందినదై వింధ్యపర్వతమునకు దాపున నర్మదానదియుత్తరపుగట్టునందు నియమము గలదై శ్రీమన్నారాయణునియందలి భక్తితో ఇతర జనుల సహవాసము లేనిదియు ఎప్పుడును సత్యమే ఆధారమయినదియు ఇంద్రియములను వశపరుచుకొన్నదియు కోపమును అణచినదియు సత్యమును మితమునుగా మాటలాడునదియు మంచిస్వభావముగలదియు దానమును చేయునట్టి తాత్పర్యము గలదియు దేహమును ఎండగట్టుటయందు అక్కరగలదియు దినముయొక్క ఆరవభాగమయిన కాలమునందు నేలను రాలియున్న గింజలు ఏరితెచ్చి ఆహారము చేసికొనునదియు కృచ్ఛ్రము అతికృచ్ఛ్రము పారాకము తప్తకృచ్ఛ్రము అనునివి మొదలుగాగల ఆహారమునుతగ్గించెడి వ్రతములను ఆచరించి ప్రాణములు మాత్రము పోకుండ నిలుపుకొన్నదగుచు చేయశక్యము

తపస్విన్యా వల్కలిన్యా విరక్తయా. శుద్ధయా సత్యశీలిన్యా ధృతిసంతో
షయుక్తయా, షష్టిమాఘాస్తయాస్నాతా రేవా కపిలసంగమే. తతస్సా
తపసా క్షీణా తస్మింతీర్థే మృతా నృప, మాఘస్నానజపుణ్యేన తేన
సా వైష్ణవే పురే. ఉవాస ప్రమదాయుక్తా చతుర్యుగసహస్రకమ్, తత్ర
భుక్త్వా మహాభోగాన్ సూర్యలోకం జగామహ. తత్ర సూర్యపథే స్థిత్వా
భుక్త్వా భోగా ననేకశః, చతుర్యుగసహస్రంతు తత్రోషిత్వా మహాసతీ.
సుందోపసుందనాశాయ పశ్చాత్పద్మభవాపునః, తిలోత్తమేతిసానామ్నా
బ్రహ్మలోకేఽవతారితా. తేనైవపుణ్యశేషేణ రూపయౌవనతాం వ్రజేత్,
అయోనిజా బలా తన్వీ దేవానామపి మోహినీ. లావణ్యభూమిస్తరుణీ
సాభూదప్సరసాం వరా, ఆశ్చర్యకారిణీ నూనం నిపుణస్య విధేరపి. తాము
త్పాద్యవిధాతాపి స్వస్థోఽభూద్ధృష్టమానసః, తతో దేవాజితాస్తాభ్యాం
జగ్ముస్తే బ్రహ్మణోఽన్తికమ్. దైత్యాభ్యాం పీడితా దేవాః విధాత్రేతన్న్య
వేదయన్, తయోర్నాశయితుం బ్రహ్మా మనసా చింతయత్తదా. తాన్వి

---

గాని తపస్సుచేయుచుండెను. ఇట్లు తపస్సు చేయుచున్న ఆబుుషిక నారచీరలు ధరించి
విరక్తియుం పరిశుద్ధత్వమునుగలదై నిజమే పలుకుచు ధైర్యముతోను సంతోషముతోనునర్మ
దానదియుం కపిలానదియుం చేరునట్టి పుణ్యతీర్థప్రదేశమునందు, అరువది మాఘమాసములం
స్నానముచేసి కొంత కాలమునకు ఆతపస్సుచేతనే దేహముక్షీణింపగా చచ్చిపోయినదా
యెను. అట్లు చనిపోయిన ఆ బ్రాహ్మణకన్యక తాను చేసిన మాఘస్నానమువలని పుణ్యము
చేత నాలుగు యుగములు వేయిమారులు కడచునంత కాలము విష్ణులోకమునందు అనేకు
లయిన పరిచారికలతోడ సుఖముగానుండి యెల్లభోగములను అనుభవించి అందుండి సూ
ర్యలోకమునకుపోయి అక్కడ బహువిధములైనభోగములను అనుభవించుచు విష్ణులో
కమునందు ఉన్నంత కాలము ఉండెను, పిమ్మట ఆమె సుందోపసుందులు అను రాక్షసు
లను నాశము చేయుటకై బ్రహ్మదేవునిచేత తిలోత్తమ అనెడి అప్సరస్త్రీగా సృజింప
బడెను. ఆజన్మమునందును మునుపటి మాఘస్నానమువలని పుణ్యవిశేషముచేత నేచక్కద
నమును యౌవనమును గలిగి ఒకరిగర్భమునందుండి యోనిద్వారమున జనింపక తిన్నదన
ముగలదియుం సలాకవలె సన్ననిదేహముగలదియుం దేవతలను సైతము మోహింప జేయుం
నదియుం మేనిమెరుగునకు చోటయినదియునై ఆకన్యక అప్సరసలలో ముఖ్యురాలా
యెను. తన్నుసృజించినవానికికూడ ఆశ్చర్యమునుపుట్టించునదియైన తిలోత్తమను సృజించి
సెమ్మదినొందినవాడై బ్రహ్మ తనమనసునసంతోషించెను. పిమ్మట ఆసుందోపసుందులచేత
దేవతలు పీడింపబడినవారై బ్రహ్మయొద్దకుపోయి తమ సంకటమును బ్రహ్మకు తెలియజే
సిరి. అప్పుడు బ్రహ్మవారినినాశముచేయుటకు తగినఉపాయమును తనలోచింతించి దేవత

లోకాన్యథ తన్వంగీ మువాచాథపితామహః, ఏణశాబాక్షి గచ్ఛత్వం దైత్యనాశాయసత్వరమ్. తతస్సాబ్రహ్మణోలోకా ద్వీణామాదాయ భామినీ, గత్వాపుష్కరమార్గేణయత్రతౌ దేవవైరిణౌ. తత్రస్నాత్వాతు రేవాయాఃపవిత్రేనిర్మలేజలే, పరిధాయాంబరం రమ్యం బంధూకసదృశప్రభమ్. రణద్వలయినీచారు శింజన్నూపురమేఖలా, లోలముక్తావళీకంఠా చంచత్కుండలశోభితా. మాధవీకుసుమాపీడా కంకేళీవిష్టరేస్థితా, గాయంతీసుస్వరంసాధు వాదయంతీ విపంచికామ్. మూర్ఛయంతీస్వరంషడ్జం సుస్నిగ్ధంకోమలంకలమ్, అశోక కాననే రాజన్ తిష్ఠంతీసా తిలోత్తమా. దృష్ట్వాదైత్యభటైస్తత్ర ఐందవీవకలామలా. తాందృష్ట్వా విస్మయావిష్టైః సానందైస్సైనికైర్భృశమ్. త్వరమాణైస్సమీపంచ గత్వా సుందోపసుందయోః, కథితా సంభ్రమేణైవ వర్ణయిత్వా పునఃపునః. హేదైత్యా నవిజానీమో దైవీవా దానవీచవా, నాగాంగనావాయక్షీవా స్త్రీరత్నంవిమలంభువి. యువాం రత్నభుజౌలోకే రత్నభూతైవ సాబలా, వర్తతే నాతిదూరేణ అశోకవనికాంగతా. గత్వా సాదృశ్యతాం శీ

---

లనుజూచి తిలోత్తమతో ఇట్లుపలికెను. ఓతిలోత్తమా! నీవు శీఘ్రముగాపోయి ఆరాక్షసులను చంపుము. అని ఆజ్ఞాపింపగా ఆమె అప్పుడే వీణెనుతీసుకొని బ్రహ్మలోకమునుండి వెడలి ఆకాశమార్గమున ఆరాక్షసులుండెడి చోటికి పోయి అచ్చట తేటనీరుగలదియు పావనమయినదియునైన నర్మదానదిలో స్నానము వేసి మంకెనపూవువలెఎఱ్ఱగానుండెడి మడుగుచీరకట్టుకొని గణగణమ్రోగుచున్న గాజులను అందెలను మొలనూలును ధరించి ముత్యాలహారములు మెడనువ్రేలుచుండగా ఒప్పిదములైన కమ్మలు చెవులయందు వెలుగగా గురువిందపువ్వులు కొప్పునందు తురిమి అశోకపుచెట్టుక్రింద గూర్చుండి తిన్ననిస్వరముతో వీణవాయించుచు ఆరాక్షసుల సేవకులకు ఆకాశమునుండి భూమికి దిగివచ్చిన చంద్రకళవలెనే కానబడెను. అప్పుడు ఆరాక్షసభటులు మిక్కిలి ఆశ్చర్యమును సంతోషమును పొందినవారై అతిశీఘ్రముగా పోయి సుందోపసుందులతో ఈమెయొక్క వృత్తాంతమును చెప్పి, ఈమీదచెప్పబోయెడి విధముగా మాటిమాటికి వర్ణింపసాగిరి. ఓ రాక్షసరాజులారా! అది దేవకన్యకయో దానవకన్యకయో యక్షకన్యకయో నాగకన్యకయో తెలియదు. ఈలోకమునందు రత్నములను అనుభవించువారుమీరు. నిర్మలమయిన స్త్రీరత్నము ఆమె. అట్టిరత్నమును బోలినజవరాలు మిక్కిలి సమీపమునందుండెడిఅశోకవనమునందు చేరియున్నది. మమకారము లేనివానికిగూడ మోహమునుపుట్టిం

ఘుర్గం నిర్గమస్యాపి మోహినీమ్, ఇతి సేనాపతీనాంచ శ్రుత్వా వాక్యం మనోహరమ్. జలక్రీడాం విహాయైవ తజ్జలం సింధుపూరితమ్, ఉత్తమస్త్రీసహస్రాణి త్యక్త్వా తస్మాజ్జలాశయాత్. శతభారాయసీం ఘోరాం కాలదండోపమాం గదామ్, భిన్నాం భిన్నాం గృహీత్వా తౌ జవేనాప్లుత్య జగ్మతుః. యత్ర శృంగారభూతా సా హంతుంచండీవ తౌ స్థితా, రాజన్ సంధుక్షయంతీవ దైత్యయోర్మన్మథానలమ్ స్థిత్వా తస్యాః పురస్తాత్తు తద్రూపేణ విమోహితౌ, విశేషాన్మధునామత్తావూచతుశ్చ పరస్పరమ్. భ్రాతర్విగతభార్యోహం మమాస్తు వరవర్ణినీ, త్వమేవార్య త్యజేమాం మే భార్యాస్తు కమలేక్షణామ్. ఇత్యాగ్రహేణ సంరబ్ధౌ మాతంగావివ దుర్మదౌ, అన్యోన్యకాలనిర్దిష్టౌ గదయాజఘ్నతుస్తథా. పరస్పరప్రహారేణ గతాసూ పతితౌ భువి, మృతౌ తౌ సైనికైర్దృష్ట్వా కృతః కోలాహలో మహాన్. కాళరాత్రిసమా చేయం హా కిమేతదుపస్థితా, ఏవంవదత్సు సైన్యేషు దైత్యౌ సుందోపసుందకౌ. పాత

కటాలిన ఆచిన్నదానిని పోయి చూడుడు. అని యిట్లు చెప్పుచున్న సేనానాయకులయొక్క యింపైనమాటలు విని అప్పుడే తాము చేయుచున్న జలక్రీడను మాని తమతోగూడ జలక్రీడలాడుచున్న ఉత్తమస్త్రీలను అనేకులను అక్కడనే విడిచిపెట్టి ఆసరస్సునుండి బయలువెడలి నూరుబారువుల ఇనుముచేత చేయబడియమునిదండములోపోల్పదగిన గదలను రెంటిని వారుచెరియొకటి పుచ్చుకొని మిక్కిలివడిగా దాట్లువేయుచు చండి అనబడు మహాశక్తివలె ఆరాక్షసులను చంపుటకై శృంగారించుకొనిఉండునదియు వారిని పొందిన మన్మథాగ్నిని మరి మరి రగులుకొని మండునట్లు చేయునదియు నయిన ఆతిలోత్తమ ఉండుతావునకు బోయి ఆమెయెదుటనిలిచి విశేషముగా కల్లుత్రాగుటచేత ఒళ్లుతెలియక ఒకరితోనొకరు ఇట్లు చెప్పుకొనసాగిరి. ఓరితమ్ముడా! నేను పెండ్లాము పోయినవాడను. నాకు యిది భార్యయగును. ఓఅన్నా! నీవేనాకు విడిచిపెట్టుము. ఇది నా భార్యయగును. అని యిట్లు వాదాడి అందువలన ఒకరిపైనొకరికి కోపముకలుగగా ఆ పైరేగి మదపుటేనుగులవలె ఒళ్లుతెలియక పోరాడి ఒకనిగదచేత ఒకడు మోదబడి చచ్చిరి. ఇట్లు ఒకరొకరి దెబ్బలచేత ప్రాణములుపోగా నేలబడిన సుందుని ఉపసుందునిజూచి వారిసైనికులు అయ్యో! కాళరాత్రినిపోలిన యీయాడుది ఇక్కడికేల వచ్చెను. అని చాల గొలగొలపుట్టగా మొరపెట్టసాగిరి. ఈవిధముగా సైనికులు మొరలు పెట్టుకొనుచుండగా వజ్రాయుధము కొండకొమ్మును నరికి పడద్రోసినట్టు సుందోపసుందు

యిత్వా గిరేశ్శృంగే ప్రాదిసీవతిలోత్తమా, ప్రస్థితా గగనం శ్రీఘ్రం ద్యోతయంతీ దిశో దశ. దేవకార్యం తతః కృత్వా గతా సా బ్రహ్మణోఽంతికమ్, తతస్తుష్టేన దేవేన విధినా సానుమోదితా. స్థానం సూర్యరథే దత్తం తవ చంద్రనిభాననే, భుక్త్వా భోగాననేకాం స్త్వం యావత్సూర్యోఽంబరే స్థితః. ఇత్థం సా బ్రాహ్మణీ రాజన్ భూత్వా చాప్సరసాం పరా, భుంక్తేఽద్యాపి రవేర్లోకే మాఘస్నానస్య వైభవాత్. తేన ప్రయత్నతో రాజన్ శ్రద్ధధానైస్సదా నరైః, స్నాతవ్యం మకరాదిత్యే వాంఛద్భిః పరమాం గతిమ్. నాస్తికస్య తు లోకేషు పురుషార్థోఽత్ర కశ్చన, సాక్షిణః పాతకం కించిన్మాఘస్నానేన భూపతే. తులయంతి న తేనాత్ర యజ్ఞాస్సర్వస్వదక్షిణాః. మాఘస్నానేన రాజేంద్ర తీర్థైరేవ విశేషతః, నచాన్యం మోక్షదం కించిన్మాఘస్నానసమం భువి.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, ఋక్షకా
చరిత్రం నామ త్రింశోఽధ్యాయః.

---

లను నేలగూల్చి దేవతల కార్యమును చక్కజేసినదై తిలోత్తమ పదిదిక్కులను వెలిగింపజేయు తేజస్సుతో ఆకాశమార్గమున బ్రహ్మసన్నిధానమునకు బోయెను. అంతట బ్రహ్మ సంతోషించినవాడై నీవు చేసిన పనికి మెచ్చుకొంటిని. సూర్యునిరథమునం దుండునట్లు నీకు అనుగ్రహించితిని. ఎంతకాలము సూర్యుడు ఆకాశమునం దుండునో అంతకాలమును అచ్చట సుఖమును ననుభవించుచు ఉండుము అనెను. ఓ రాజా! ఇట్లు ఆ బ్రాహ్మణకన్యక మాఘస్నానము యొక్క మహిమచేత అప్సరసలలో శ్రేష్ఠురాలై ఇప్పటికిని సూర్యలోకమునందు సమస్తసౌఖ్యములను అనుభవించుచు వెలుగుచున్నది. కాబట్టి మానవులు సద్గతిని అపేక్షించి శ్రద్ధగలవారై మిక్కిలి మక్కువతో మాఘస్నానము చేయవలసినది. నాస్తికునికి ఈ మాఘస్నానమువలన పురుషార్థము కలదు. ఏమియనగా స్నానము చేయునట్టి పుణ్యాత్ములను జూచినను కొంత పాపము నశించును. కనుక సంపూర్ణదక్షిణలతో చేయు యజ్ఞములుగూడ మాఘస్నానమునకు ఈడుగావు. మాఘస్నానముచేత సద్గతి గలుగును. ఆదియును పుణ్యతీర్థములయందైన మరియు విశేషము. ఈలోకమునందు మోక్షమును కలుగజేయుటకు చాలినది మాఘస్నానమే కాని దానికంటె ఇతరమయినది యేదియును లేదు.

ఇది శ్రీ పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు
ఋక్షకయను బ్రాహ్మణకన్యచరిత్రమును దెలుపునట్టిదైన
ముప్పదవ అధ్యాయకథ.

## ఏకత్రింశోఽధ్యాయః.

దత్తాత్రేయః.—శృణు రాజన్ యథావృత్తం పావనం పాపనాశనమ్, అత్ర తేకథయిష్యామి ఇతిహాసం పురాతనమ్. మాఘస్నానేన రాజేంద్ర పురా వైశ్యేన తారితః. నిరయే పచ్యమానస్తు భ్రాతా జ్యేష్ఠో మహామతే. కార్తవీర్యః.-సకథం తారిత స్తేన నరకాద్యమశాసనాత్, వద సర్వమశేషేణ యద్యనుగ్రహభాగహమ్. దత్తాత్రేయః -పురా కృతయుగే రాజన్ నైషధేనగరేవరే, ఆసీద్వైశ్యః కుబేరాభో నామతో హేమకుండలః. కులీనస్సత్క్రియో రాజన్ ద్విజసప్తార్చిపూజకః, కృషివాణిజ్యకర్తాచ బహుధాక్రయవిక్రయీ గోఘోటక మహిష్యాది యోనిపోషణతత్పరః, పయోదధీని తక్రాణి గోమయాని తృణానిచ. కాష్ఠాని ఫలమూలాని లవణం జాజి పిప్పలీ, ధాన్యాని తైలశాకాని వస్త్రాణి వివిధానిచ. మధూనీక్షువికారాంశ్చ విక్రిణీతే సపర్వదా, ఇత్థం నానా

---

### ముప్పదియొకటవ అధ్యాయము.

దత్తాత్రేయునిమాటలు.—ఓీ కార్తవీర్యమహారాజా ! పావనమును పాపములను నశింపజేయునదియునైన ఒకానొక కథ గలదు. అది యీమాఘమాహాత్మ్యవైభవమును తెలియజేయునది గనుక నీకు దానిని చెప్పెదను. పూర్వకాలమునందు మాఘస్నానము చేసిన ఒక కోమటివానివలన వానితోడబుట్టినవాడు నరకములనుండి ఉద్ధరింపబడెను.

కార్తవీర్యునిమాటలు.—ఓీదత్తాత్రేయమహామునీ! కోమటివానివలన వానితోడబుట్టినవాడు నరకములనుండి యెట్లు ఉద్ధరింపబడెను ? నాకు అనుగ్రహించి తెలియజేయుము.

దత్తాత్రేయునిమాటలు.—ఓీరాజా! మునుపుకృతయుగమునందునిషధఅను పేరుగల గొప్ప పట్టణమునందు ధనము కలిమిచేత కుబేరునిబోలిన హేమకుండలుడు అను కోమటివాడు ఒకడు ఉండెను. వాడు మంచికులమునందు బుట్టినవాడును బ్రాహ్మణులను అగ్నిహోత్రునినిపూజించువాడును, సేద్యమును వర్తకమును చేయువాడును, విశేషముగా సరకులనుగొని అమ్మువాడును, ఆవులు గుఱ్ఱములు బఱ్ఱెలు మొదలుగాగల పశుధనమును కాపాడుటయందు, అక్కరగలవాడును, పాలు పెరుగు మజ్జిగ పేడ గడ్డి వంటచెఱకు పండ్లు వేళ్లు ఉప్పు జాజికాయ జాపత్రి పిప్పళ్లువడ్లు మొదలగుధాన్యములు నూనె కూరగాయలు నానావిధములైన వస్త్రములు తేనెదినుసులు చెరకురసమువల్లనైన చక్కెర కండచక్కెర బెల్లము మొదలగునవియు ఎల్లప్పుడు అమ్ముచుండువాడును అయియుం

విధైరైర్వైశ్య ఉపాయైః పరమైస్సదా. ఆర్జయామాస ద్రవ్యాణా మష్టౌ హాటకకోటయః, ఏవంమహాధనస్సోఽథ ఆకర్ణ్యపరిలోభవత్. పశ్చాద్విచార్యవైశ్యస్తు సంసారిత్వం స్వచేతసి, తద్ధనస్య షడంశేన ధర్మకార్యం చకార సః. విష్ణోరారాధనం చైవ చక్రే గేహంశివస్యచ, తటాకం ఖాతయామాస విపులం సాగరోపమమ్ వాప్యశ్చ పుష్కరిణ్యశ్చ బహుశస్తేన కారితాః, వటాశ్వత్థామ్ర కంకేళి జంబూ నింబాది కాననమ్. ఆరోపితం సుసత్త్వేన తథాపుష్పవనం శుభమ్, ఉదయాస్తమయాయావదన్నపానం చకారసః పురాద్బహిశ్చతుర్దిక్షు ప్రపాశ్చక్రేఽతిశోభనాః, పురాణేషు ప్రసిద్ధాని యాని దానాని భూతలే. దదౌ తాని సధర్మాత్మా నిత్యదానపరస్సదా, యావజ్జీవం కృతేపాపే ప్రాయశ్చిత్తం తథాకరోత్. దేవపూజాపరో నిత్యం నిత్యంచాతిథిపూజకః, తస్యేత్థం వర్తమానస్య సంజాతౌ ద్వౌసుతౌ నృప. తౌచప్రసిద్ధనామానౌ శ్రీకుండలవికుండలౌ, తయోర్మూర్ధ్నిగృహంత్యక్త్వా జగామ తపసేవనమ్, తత్రారాధ్య

---

దును. ఈచెప్పబడిన అనేకవిధములయిన మంచి ఉపాయములచేత ఆకోమటివాడు ఎనిమిదికోట్ల వరహాలు ఆర్జించెను. ఈవిధముగా మిక్కిలి ధనవంతుడైన ఆవైశ్యుడు లోకులు తన్ను లోభియని నిందింపగా విని పిమ్మట సంసారతనమునుగూర్చి తనలోతాను చక్కగా ఆలోచించి ఆధనములో ఆరవపాలు కర్చుచేసి ధర్మకార్యములను నడపెను. ఆధర్మకార్యములు ఎట్టివనగా, విష్ణుపూజచేయించెను. శివునికి గుడి కట్టించెను. విరివిగలిగి సముద్రమునుబోలిన చెరువును త్రవ్వించెను. బావులను కోనేళ్లను అనేకములను త్రవ్వించెను. మఱ్ఱి రావి మామిడి అశోకము నేరేడు వేము మొదలుగాగలవృక్షముల తోపులను వేయించెను. అనేకవిధముల పూలచెట్లతోట వేయించెను. ప్రొద్దుపొడిచినది మొదలు ప్రొద్దుగ్రుంకుపర్యంతము పేదలకు అన్నపానములను ఇప్పించుచు వచ్చెను. పట్టణమునకు వెలుపల నాలుగుదిక్కులయందును మిక్కిలి పరిశుద్ధములయిన చలిపందిరులు పెట్టించెను. మరియు ధర్మాత్ముడైన ఆవైశ్యుడు నిత్యదానము చేయుటయందు అక్కరగలవాడై పురాణములందు చెప్పబడినవియును భూమియందు ప్రసిద్ధికెక్కినవియునైన దానములనెల్లను ఎల్లకాలము చేయుచుండెను. కలకాలము తనచేత చేయబడినపాపముల కన్నిటికి ప్రాయశ్చిత్తము చేసికొని దేవతార్చనమును అతిథిపూజయు ఎడతెగక చేయుచు కాలము గడపుచుండగా వానికి ఇద్దరు కొడుకులుపుట్టి వారు శ్రీకుండలుడు వికుండలుడు నను పేళ్లచేత ప్రసిద్ధులయి వర్ధిల్లిరి. అంతట మహాకుండలుడు ఇంటివ్యాపారములను నడపెడుభారమును ఆకుమారులతలను మోపి తాను తపస్సుచేయుటకై అడవికి

పరం దేవం గోవిందం వరదం విభుమ్, తతః క్లిష్టశరీరోఽసౌ వాసుదేవము నాస్పదా. ప్రాప్తవాన్ వైష్ణవం లోకం యత్ర గత్వా నశోచతి, అథా తత్సుతౌ రాజన్ మదమానసమన్వితౌ. తరుణౌ రూపసంపన్నౌ ధన గర్వేణ దీపితౌ, దుశ్శీలౌ వ్యసనాసక్తౌ సత్కర్మప్రవిదూషకౌ. అధర్మ నిరతౌ దుష్టౌ పరదారాభిగామినౌ. నకార్యం శృణుతో మాతుః వృద్ధా నాంవచనంతథా. దుర్మార్గగౌ దురాచారౌ పితృమాతృనిషేధకౌ, గీతవా దిత్రనిరతౌ వీణావేణువినోదినౌ. వారస్త్రీశతసంయుక్తౌ గాయంతౌ చేర తుస్తథా, దురోదర నరైర్యుక్తౌ విటగోష్ఠీవిశారదౌ. సువేషౌ చారువద నౌ చారుచందనరూషితౌ, నాశయంతౌ పితుర్ద్రవ్యం సహస్రందదతుశ్శ తమ్. సుగంధపుష్పమాల్యాది కస్తూరీలక్ష్మలక్షితౌ, నానాలంకారశోభి ష్ఠౌ మౌక్తికోదారహారిణౌ. గజవాజిరథౌఘేషు క్రీడయంతావిత స్తతః,

---

పోయి అచ్చట సర్వోత్కృష్టుఁడైన దేవుఁడును కోరినకోరికలను ఇచ్చువాఁడును సర్వము నకు ప్రభువునైన శ్రీవిష్ణుదేవుని ఆరాధించి అంతట దేహమును క్లేశపెట్టివిష్ణువును పొందిన మనసుగలవాఁడు అగుచు ఎక్కడికిపోయి మనుష్యుఁడు దుఃఖమును పొందక యుండునో అట్టి విష్ణులోకమునకుపోయి చేరెను. అతఁడు అట్లు పరలోకమును పొందినపిమ్మట అతని కొడుకులు క్రొవ్వును గర్వమును కలిగి పడుచువారును చక్కఁదనము గలవారును ధనమువలని యహంకారముచేత ప్రకాశించువారును దుష్టస్వభావము గలవారును జూదము మొదలగు దుర్విషయములందు ఆసక్తిగలవారును మంచికార్యములను చెడగొడువారును అధర్మమునందు ఆసక్తులగువారును చెడ్డవారును పరులభార్యలను పొందువారును చేయదగినవానిని చెప్పినను వినకపోవువారును, పెద్దలమాటలను విననివారును చెడ్డపనులయందు ప్రవర్తించువారును చెడునడవడిగలవారును తల్లిదండ్రులనుని షేధించువారును సంగీతములందును వాద్యములందును ఆసక్తిగలవారును వీణవాయించుటచేతను పిల్లనగ్రోవి ఊఁదుటచేతను వేడుకగా ప్రొద్దుపుచ్చువారును నూరులకొలది భోగమువాండ్రతోఁగూడి యుండువారును పాటలుపాడుచు ప్రొద్దుపుచ్చువారును జూదరులతోఁ గూడియుండువారును విటులసమూహముతోడి ప్రసంగమునందు నేర్పరులును మంచి వస్త్రములు కట్టుకొని తేటమొగములతోఁ మంచివాసనగల గందములు పూసికొని వెలుగువారును నూరు ఇయ్యవలసిన దానికి వేయి ఇచ్చువారునై తమతండ్రి పెట్టిపోయిన ధనమును పరిమళద్రవ్యములు పువ్వుదండలు కస్తూరితిలకములు అనేకవిధములయిన ఆభరణములు ముత్యాలదండలు వీనిని ధరించుటచేతను ఏనుగులు గుఱ్ఱములు రథములు మొదలగు వాహనములనెక్కి తిరుగుటచేతను కల్లుత్రాగుటచేతను భోగమువారితోడ క్రీడించుట

మధుపానసమాయుక్తౌ వారస్త్రీరతిమోహితౌ. తస్థతు స్స్వగృహేరమ్యే నిత్యంభోగపరాయణౌ, ఇత్థంతుతద్ధనం ద్వాభ్యాం వ్యయమాసీదసద్వ్యయైః. వారస్త్రీవిటశైలూష మల్లచారణవందిషు, అపాత్రే తద్ధనంయుక్తముప్తం బీజమివోషరే, నసత్పాత్రేషు తద్దత్తంన బ్రాహ్మణముఖేహుతమ్, నార్చితో భూతకృద్విష్ణుః సర్వపాపప్రణాశనః. తయోరేవంతుతద్ద్రవ్యం అచిరేణక్షయంగతమ్, తతస్తౌదుఃఖ మాపన్నౌ కార్పణ్యం పరమంగతౌ. శోచమానౌతుమహ్యేతాంక్షుత్పీడాదుఃఖదుఃఖితౌ, తయోస్తుతిష్ఠతోర్గేహే నాస్తియద్భుజ్యతేతథా. సర్వబంధుజనైస్త్యక్తౌ అశనాచ్ఛాదనైః కృశౌ, పశ్చాచ్చౌర్యంసమారబ్ధం తాభ్యాంతునగరేనృప. రాజతో లోకతో భీతౌ స్వపురాన్నిర్గతౌతదా, చక్రతు ర్వనవాసంతౌ సర్వతః ప్రాణిహింసకౌ. జఘ్నతుస్సతతం మూఢౌ శితై ర్బాణైర్విపార్పితైః, నానాపక్షీ వరాహాంశ్చ హరిణాన్ రోహిషాం స్తథా. శశకాన్ శల్యకాన్ గోధాన్ శ్వాపదాంశ్చతథా బహూన్, మహాబలౌమల్లసమౌ ఆఖేటకరతౌ

---

యందలి మోహము చేతను కర్చుచేయుచు సుఖముగా తమయిల్లువిడిచి కదలక భోగములను అనుభవించుచుండిరి. ఇట్లు తమ ధనమును చెడువిషయములందు కర్చుచేయువారై ఆయిద్దరును బోగమువారు విటులు నట్టువవాండ్రుం జెట్టీలు బహుదేశములం తిరిగి నాట్యము జేయునట్టువవాండ్రు బట్టువాండ్రు మొదలుగాగల అపాత్రులయందు చవుటినేలయందు మంచివిత్తనాలు వెదచల్లినట్లు ఉన్నధనమంతయును వెచ్చపెట్టిరిగాని తగినవారికి దానముచేసిగాని యజ్ఞములు మొదలగువానియందు బ్రాహ్మణులకు ఇచ్చిగాని వెచ్చపెట్టినవారు కారు. మరియును ఎల్లపాపములను నశింపజేయువాడును ఎల్లప్రాణులను పుట్టించువాడును నైన విష్ణుని అర్చించినవారు కారు. ఇట్లు ఆయిద్దరి ధనమును కొంచెపుకాలములోనే వెచ్చమైపోయెను అంతట వారు దుఃఖముచేత పీడింపబడినవారై మిక్కిలి కుత్సితత్వమును పొంది మిక్కుటమైన ఆకటిచేత బాధింపబడి దుఃఖించువారును అయి యింటిలో అన్నమునకు సయితము లేనివారయిరి. అటుపిమ్మట వారు తమచుట్టములచేత విడువబడినవారును అన్నవస్త్రములకులేక కృశించినవారునై ఆపట్టణమునందు దొంగిలింపయత్నించిరి. అందులకుతర్వాత రాజువలనను పట్టణములోనిజనుల వలనను భయపడినవారై పట్టణమును విడిచి అడవిలో ప్రవేశించి ప్రాణులను హింసచేయబూనుకొనిరి. ఎట్లనగా, మూఢులయిన ఆయిద్దరును ఆ అడవియందలి పక్షులను పందులం జింకలు కొండగొఱ్ఱెలు కుందేళ్లు ఏదుపందులు ఉడుములు మొదలగువానిని ఇవిగాక క్రూరములైన పులులు మొదలగువానిని అనేకములను ఎల్లప్పుడు చంపుచు ఆయున్నదమ్ములు మిగుల బలముగలవారును జెట్టీలనుబోలినవారును ఎప్పుడును వేటాడుటయే పని

సదా. ఏవంమాంసమయాహారౌ పాపాచారౌ పరంతప, కదాచిద్భూధరం ప్రాప్తౌ హ్యేకోన్యశ్చవనంగతః. శార్దూలేనహతో జ్యేష్ఠః కనిష్ఠస్సర్పదంశితః, ఏకస్మిన్ దివసే రాజన్ పాపిష్ఠౌ నిధనం గతౌ. యమదూతైస్తదా బధ్వా పాశైర్నీతౌ యమక్షయమ్, గత్వాచ జగదుస్సర్వే తే దూతాః పాపినావిమౌ. ధర్మరాజ నరావేతౌ ఆనీతౌ తవశాసనాత్. అజ్ఞాందేహి స్వభృత్యేషు ప్రసీదకరవామకిమ్. ఆలోచ్య చిత్రగుప్తేనతదా దూతాన్ జగౌ యమః, జ్యేష్ఠస్తు నీయతాం ఘోరం నరకం తీవ్రవేదనమ్. అపరః స్థాప్యతాం స్వర్గే యత్ర భోగాస్త్వనుత్తమాః, కృతాంతాజ్ఞాం తతః ప్రాప్య దూతైశ్చతీప్రకారిభిః. నిక్షిప్తో రౌరవే ఘోరే తయోర్జ్యేష్ఠో నరాధిప, తేషాందూతవరః కశ్చి దపరం మధురం వచః. వికుండల మయాసార్థ మేహి స్వర్గం దదామి తే, భుంక్ష్వ భోగా ననేకాం స్త్వమూర్జితాన్ స్వేన కర్మణా. తతో హృష్టమనాసోథ దూతం పప్రచ్ఛతంపథి, సుసందేహం హి కృత్వాతు విస్మయం పరమం గతః. వికుండలః—వి

---

గాగలవారును పాపకృత్యములను చేయువారునైయుండి ఒకానొకప్పుడు వారిలో పెద్దవాడు ఒకడే ఒకకొండకుపోయెను. రెండవవాడు ఒక అడవికిపోయెను. అప్పుడు పెద్దవాడు ఒకపులిచేత చంపబడెను. రెండవవాడు పాముచేత కరవబడి చచ్చెను. ఇట్లు పాపాత్ములయిన ఆయిద్దరును ఒకనాడే చచ్చిరి. అంతట యమదూతలు వచ్చి త్రాళ్లతో కట్టి యమలోకమునకు తీసుకొనిపోయిరి. అట్లుపోయి దూతలు అందరును, ఓయేలినవాడా! ఈయిద్దరును పాపులు. వీరిని మీయాజ్ఞవలన తీసికొనివచ్చితిమి. ఇక నీబంటులమయిన మాకు వీరిని ఏమిచేయవలెనో సెలవిమ్ము, అని అడుగగా, యముడు చిత్రగుప్తుని అడిగి వారికృత్యమును తెలిసికొని పెద్దవానిని అధిక వేదననుకలుగజేయునట్టి భయంకరమయిన నరకమునందు త్రోయుడు. రెండవవానిని విశేషభోగములకు ఉనికిపట్టయిన స్వర్గమునందు నిలుపుడు. అని కింకరులకు ఉత్తరువుచేసెను. ఆఉత్తరువును పొందినవారును కార్యములను నడుపుటయందు చోరవగలవారునైన దూతలు ఆకోమటికొడుకులలో పెద్దవానిని రౌరవమనెడి భయంకరమైన నరకమునందు తోసిరి. అందు ఒకకింకరుడు రెండవవానిని పిలిచి ప్రియమయినమాటలతో, ఓయి వికుండలుడా! నావెంటరా నేను నీకు స్వర్గమును ఇచ్చెదను. నీవు పుణ్యకర్మమువలన అనేకములైన భోగములను అనుభవింపుము. అనగా, వాడు సంతోషించినవాడై ఆదూతవెంట పోవుచు సందేహమును వింతయును మనసున కలుగగా దారిలో దూతతో ఇట్లని పలికెను,

చారయన్ హృది స్వర్గం కస్య హేతోః ఫలం మమ, భో దూత పరిపృ చ్ఛామి సంశయం త్వా మహాంవరమ్. ఆవాం జాతౌకులేతుల్యే తుల్యం కర్మ తథాకృతమ్, దుర్మృత్యురపి తుల్యోపి తుల్యం దృష్టో యమ స్తథా. కథంపనరకేత్వేష ప్రస్తుల్యకర్మా మమాగ్రజః, మమ భావికథంనాక ఇతి మేఛింది సంశయమ్. దేవదూత నజానామి మమ స్వర్గస్య కారణమ్. దూతః.— మాతాపితాసుతో జాయా స్వసా భ్రాతా వికుండల,జన్మహేతోరియం సంజ్ఞా కృతం కర్మోపభుక్తయే. ఏకస్మిన్ పాదపే యద్వ,చ్ఛకుంతానాం సమాగమః, పుత్రభ్రాతృపితౄణాంచ తథాభవతిసంగమః. తేషాం యో యోహియత్కర్మ కురుతే పూర్వభావితః, తస్యతస్య ఫలంభుఙ్క్తే పురుషః కర్మణః ఫలమ్, సత్యంవదామి తేవైశ్య నరైఃకర్మశుభాశుభామ్, స్వకృతం భుజ్యతేవైశ్య కాలేకాలే పునఃపునః. ఏకః కరోతి కర్మాణి ఏకస్తత్ఫల మశ్నుతే, అనేన ప్రాప్యతే వైశ్యకర్మణాన్యస్యకస్యచిత్. అపతన్నరకేపాపై స్తవభ్రాతా సుదారుణైః, త్వంచ ధర్మేణ ధర్మాత్మన్ స్వర్గం ప్రాప్నోషి శాశ్వతమ్. వికుండలః —ఆబాల్యాన్మమపాపేషు సతతం

---

వికుండలునిమాటలు.—ఓదూతుడా! ఒకకులమునందే పుట్టి ఒకవిధమైన దుష్కర్మములనేచేసి అట్లే దుర్మరణమును పొంది యముని జూచిన అన్నదమ్ములమయిన మాయిరువురిలోను నాకుమాత్రము స్వర్గములభించుటకును మాఅన్ననరకమును పొందుటకును కారణము ఏమి అను సందేహము నామనసున కలిగియున్నది. నీవు ఈసందేహమును తీర్పుము.

దూతమాటలు.—ఓయి వికుండలుడా! తల్లితండ్రి కొడుకు పెండ్లాము తోడబుట్టినది తోడబుట్టినవాడు అనుసంజ్ఞలు పుట్టుకనుబట్టియేర్పడుచున్నవి. కాబట్టి ఒకరుచేసిన కర్మఫలమును మరియొకరు అనుభవింపనేరరు. అనేకపక్షులకు ఒకమ్రానియందు చేరిక కలుగునట్లు కొడుకు తోడబుట్టినవాడు తండ్రి వీరికిని ఒక యింటిలో చేరికకలుగుచున్నది. అట్లు చేరికగల కొడుకు మొదలగువారిలో ఎవరెవరు ఏయేకర్మమును తొలుత చేయుదురో ఆయాకర్మఫలమును వారువారు అనుభవింతురు గనుక మంచిపనులు చేసినవారు మేలును చెడ్డపనులు చేసినవారు కీడును తప్పక అనుభవింతురుగాని ఒకరుచేసిన కర్మఫలమును మరియొకరు అనుభవింప నేరరు. కాబట్టి నీఅన్న మిక్కిలి క్రూరమయిన పాపకృత్యములను చేసి నరకమును పొందెను. నీవు పుణ్యకర్మములనుచేసి అందులపుణ్యముచేత శాశ్వతమయిన స్వర్గమును పొందితివి.

వికుండలునిమాటలు.—ఓయిదూతా! చిన్ననాటనుండి నామనసు పాపకార్యము

రమతే మనః, అస్మిన్జన్మని హే దూత దుష్కృతం హి కృతం మయా. దేవ దూత న జానామి సుకృతం కర్మ చాత్మనః, యది జానాసి యత్పుణ్యం తన్మే త్వం కృపయా వద. దూతః. శృణు వైశ్య ప్రవక్ష్యామి యత్త్వయా పుణ్యమార్జితమ్, జానామి తదహం సర్వం న త్వం వేత్థ సునిశ్చితమ్. హారిమిత్రసుతో విప్ర స్సుమిత్రో వేదపారగః, ఆసీత్తస్యాశ్రమః పుణ్యో యమునాదక్షిణే తటే. తేన తస్మిన్వనే సఖ్యం తవ జాతం విశాంవర, తత్సంగేన త్వయా స్నాతం మాఘమాసద్వయం తథా. కాళిందీపుణ్యపానీయే సర్వపాపహరే వరే, తత్తీర్థే లోకవిఖ్యాతే నామ్నా పాపప్రణాశనే. ఏకేన సర్వపాపేభ్యో విముక్తస్త్వం విశాంవర, ద్వితీయమాఘపుణ్యేన స్వర్గప్రాప్తిస్తవానఘ. త్వం తత్పుణ్యప్రభావేన మోదస్వ సతతం దివి, నరకేషు తవ భ్రాతా సహతాం యమయాతనామ్. ఛిద్యమానోసిపత్రైస్తు భిద్యమానోపి ముద్గరైః, చూర్ణమానశ్శిలాపృష్ఠే తప్తాంగారేషు భర్జితః. ఇతి దూతవచశ్శ్రుత్వా భ్రాతృదుఃఖేన దుఃఖితః, పులకాంకితసర్వాంగో

---

నందే ఆసక్తిగలదై యుండెను. ఈజన్మమునందు నాచే దుష్కార్యములే చేయబడెను. నాకు పుణ్యము ఎట్లు కలిగెనో నేనెరుగను నీకు తెలిసియున్నయెడ దయచేసి నాకు తెలియజేయుము.

దూతమాటలు.—ఓవైశ్యుడా! నీవు చేసిన పుణ్యము ఇట్టిది అని నేను ఎరుగుదును. ఆదియంతయు విశదముగా చెప్పెదను వినుము. వేదములను తుదముట్ట చదివిన వాడును హారిమిత్రుడు అనువాని కొడుకును సుమిత్రుడు అను పేరుగలవాడును అగు బ్రాహ్మణుడుకలడు. వాని ఆశ్రమము యమునానదియొక్క దక్షిణపుగట్టున ఉండును. నీవు అడవియందు ఉండగా అతనితో నీకు స్నేహముకలిగెను. ఆసత్పురుషుని సహవాసముచేత ఎల్లపాపములను పోగొట్టునదియు శ్రేష్ఠమయినదియు నయిన యమునానదీజలములలో రెండుమాఘమాసములు స్నానము చేసితివి. లోకమునందు ప్రసిద్ధిపొందినదియు పేరు తలచుటచేతనే పాపములను నశింపజేయునదియునైన ఆపుణ్యతీర్థమునందు చేసిన ఒకమాఘస్నానముచేత నీపాపములు అన్నియు నశించెను రెండవ మాఘస్నానము వలన నీకు స్వర్గము కలిగెను. నీవు ఆపుణ్యమహిమచేత ఎల్లప్పుడును స్వర్గమునందు సుఖింపుము. మీఅన్న నరకములయందు కత్తులవంటి ఆకులుగల చెట్ల ఆకులచేత నరకబడుచున్నవాడును రాతిబండలమీద పొడిచేయబడుచున్నవాడును మండెడి నిప్పులలోబడి వేచబడుచున్నవాడును అయి యమయాతనలను అనుభవింప దగినవాడు. అనిచెప్పినదూతయొక్క మాటలనువిని వికుండలుడు తన అన్నవలని దుఃఖముచేత గగుర్పాటునొందిన

దీనో వినయసంయుతః, ఉవాచ దేవదూతం తం మధురం నిపుణం వచః.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే శ్రీకుండలవికుండల
చరితనంనామ ఏకత్రింశో ఽధ్యాయః.

---

## ద్వాత్రింశో ఽధ్యాయః.

వికుండలః. మైత్రీ సప్తపదేసాధో సతాం భవతి సత్ఫలా, మిత్ర భావం విచింత్యత్వం మాముపాకర్తుమర్హసి. త్వత్తోహం శ్రోతుమిచ్ఛామి సర్వజ్ఞ స్త్వమతోమమ, యమలోకం నపశ్యంతి కర్మణాయేన మానవాః. గచ్ఛంతి నరకం యేన తన్మేత్వం కృపయావద. దూతః. సమ్యక్పృష్టం త్వయావైశ్య పృష్టవానసి సాంప్రతమ్, విశుద్ధే హృదయే పుంసాం బుద్ధిః శ్రేయసి జాయతే. యద్యప్యవసరో నాస్తి మమ సేవాపరస్యచ. తథాపిచ తవస్నేహాత్ప్రవక్ష్యామి యథామతి. కర్మణా మనసా వాచా

ఎల్ల అవయవములు గలవాడును చిన్నబోయినవాడును వినయము గలవాడును అయి దుఃఖించుచు దూతనుజూచి ఇంపైనదియు నేర్పుగలిగినదియునైన యొకపలుకుపలికెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు శ్రీకుండలవికుండలుల
చరిత్రమును తెలుపునట్టిదైన ముప్పది ఒకటవ అధ్యాయకథ.

---

## ముప్పది రెండవ అధ్యాయము.

వికుండలునిమాటలు.—ఓసత్పురుషుఁడా! సత్పురుషులగువారికి ఏడుమాటలచేతనే మంచిప్రయోజనము కలుగఁజేయునదియైన చెలిమి కలుగుచున్నది. కనుక నీవు నాయెడల చెలిమిని వహించి నాకు ఉపకారముచేయువాఁడవు అగుము. సర్వము తెలిసిన నీవలన నాకు తెలియని విషయములను అడిగి తెలిసికోఁగోరెదను. మనుష్యులు ఏకర్మముచేత యమలోకమును చూడరు. ఏకర్మములచేత యమలోకమును పొందుదురు. ఈవిషయమును నాకు దయచేసి తెలియఁజెప్పుము.

దూతమాటలు.—ఓయివైశ్యుఁడా! నీవు అడుగఁదగిన మంచివిషయమును అడిగితివి. నిర్మలమైన మనసు కలుగుటచేతనే పురుషులకు మంచిబుద్ధి పుట్టుచున్నది. అయినందున కొలువునందు ఆసక్తిగల నాకు సమయము అక్కరలేదు. కాబట్టి నాబుద్ధికితోఁచినట్టుకు నీయందలి చెలిమినిబట్టి వివరముగా చెప్పెదను. పనిచేతను మనస్సుచేతను మాటచేతను బాల్యము యౌవనము వార్ధకము మొదలగు అవస్థలయందు ఎప్పుడును ఒక

సర్వావస్థాసుసర్వదా, పరపీడాం నకుర్వంతి నతేయాంతి యమాలయమ్. నవేదైర్నచదానైశ్చ నతపోభిర్న చాధ్వరైః, కదాచిత్సద్గతిం యాంతి పురుషాః ప్రాణిహింసకాః. అహింసా పరమోధర్మో అహింసా పరమంతపః, అహింసా పరమం దానం ఇత్యాహుర్మునయ స్తథా మశకాన్మత్కుణాన్దంశా న్మ్యూకాదిప్రాణిన స్సదా, ఆత్మౌపమ్యేన పశ్యంతి మానవా యే దయాళవః. తప్తాంగారమయం కీలం మార్గం ప్రేతతరింగిణీమ్, దుర్గతించ నపశ్యంతి కృతాంతస్యచ తేనరాః. భూతాని యత్రహింసంతి జలస్థలచరాణిచ, జీవనార్థం నరాయాంతి కాలసూత్రంచ దుర్గతిమ్. శ్వమాంసభోజిన స్తత్ర పూయశోణితఫేనపాః, మజ్జాంతశ్చ వసాపంకే దష్టాః కీటైరధోముఖైః. పరస్పరంచ ఖాదంతో ధ్వాంతోహ్యతిభయంకరే, వసంతి కల్పమేకంతే రుదంతో దారుణస్వరమ్. నరకాన్నిర్గతా వైశ్య స్థావరాస్యుశ్చిరంతుతే, తతోగచ్ఛంతి తేక్రూరా స్తిర్యగ్యోనిశతేషుచ పశ్చాద్భ

రిని బాధింపనివారు ఎవరో వారు యమలోకమును పొందరు. వేదములు చదివినను దానములు చేసినను తపస్సులు చేసినను ప్రాణులను హింసచేయునట్టి జనులు ఏదైన ఒక కాలమందైనను సద్గతిని పొందరు. హింస చేయకుండుటయే ఉత్తమమైన ధర్మము. అదియే గొప్పతపస్సు. అదియే శ్రేష్ఠమైన దానము అని మునీశ్వరులు చెప్పుదురు. ఎవరు దోమలు నల్లులు ఈగలు పేలు మొదలగు బాధించు జంతువులనైనను తమవలెనే యెంచి బాధింపకుందురో వారే దయగలవారు. అట్టివారు కాలుచున్న కట్టెనిప్పులును ఇనుపమేకులును గలత్రోవను ప్రేతతరంగిణి యనెడి ఏటిని నరకమును చూడరు. ఇంకనుగల యమయాతనలను పొందరు. ఎవరు తమ బ్రదుకునకై నీళ్లయందు మెలగునవియును భూమియందు తిరుగునవియునైన చేపలు మృగములు మొదలగు ప్రాణులను హింసింతురో అట్టిజనులు కాలసూత్రము అనెడి నరకమునుపొంది కుక్కమాంసమును తినుచు చీము నెత్తురు నురుగుత్రాగుచు మురికికంపెత్తుచున్న క్రొవ్వుబురదయందు మునుగుచు క్రిందితట్టునకు ముఖములు త్రిప్పుకొన్నపురుగులచేత కరవబడుచు మిక్కిలి భయంకరమైన చీకటిలో కన్నుగానక ఒకరినొకరు నమలుచు భయము పుట్టించునట్టి ధ్వనికలుగునట్లు ఏడ్చుచు ఒకప్రళయము అగునంత కాలము ఆనరకమునందు ఉందురు. పిమ్మట ఆపాపులు నరకమునుండి విడువబడి బహుకాలము చెట్లుచేమలుగా ఉండి ఆటుపిమ్మట క్రూరములైన పులులు మొదలగు అనేక మృగయోనులయందు బుట్టి నశించి, అవల పుట్టుగ్రుడ్డివారుగాను మరుగుజ్జువారుగాను ఒంటికన్ను గలవారుగాను ఈచ

వంతి జాత్యంధాః కుబ్జాః కాణాశ్చ పంగవః, దరిద్రాభాగ్యహీనాశ్చమ నుష్యాః ప్రాణిహింసకాః తస్మాద్వైశ్వరద్రోహంకర్మణా మనసాగిరా, లోకద్వయహితాభీష్టధర్మజ్ఞాన సమాచరేత్. లోకద్వయేన విందంతి సుఖాని ప్రాణిహింసకాః, యేనహింసంతి భూతాని నతేబిభ్యతి కుత్రచిత్. ప్రవిశంతి యథానద్య స్సముద్రమృజువక్రగాః, సర్వేధర్మా అహింసాయాం ప్రవిశంతి తథా దృఢమ్ సస్నాతస్సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః, అభయం సర్వభూతేభ్యోదత్తమత్రవిశాంపతే. ధర్మాన్నిజాంశ్చశాస్త్రోక్తాన్ వర్ణధర్మేణమిశ్రితాన్, పాలయంతీహయేవైశ్యనతేయాంతియమాలయమ్. బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థోయతిశ్చవా, స్వధర్మనిరతాస్సర్వేనాకపృష్ఠేవసంతితే. యథోక్తకారిణస్సర్వేవర్ణాశ్రమసమన్వితాః, నరాజితేంద్రియాయాంతి బ్రహ్మలోకంసనాతనమ్. ఇష్టాపూర్తరతాయేతు పంచయజ్ఞరతాశ్చయే. దయాన్వితాశ్చయేనిత్యంతే నైవతేయమాలయమ్. ఇంద్రియార్థైర్నివృత్తాయే సమర్థా వేదవాదినః, అగ్నిపూ

---

బోయిన కాళ్లుగలవారుగాను దరిద్రులుగాను అదృష్టము తక్కువైనవారుగాను ప్రాణులను హింసించునట్టి బోయలు మొదలగువారుగాను పుట్టుదురు. కాబట్టి ఇహముపరము అనెడి రెండు లోకములందును మేలుకోరువారు మనస్సు వాక్కు కర్మము అనెడి త్రికరణములచేతను ప్రాణులకు ద్రోహము చేయరు. ప్రాణులను హింసించునట్టివారు ఎవరో వారు ఇహపరలోకములు రెంటియందును సుఖములను ఎరుగరు. ఎవరు ప్రాణులను హింసపెట్టరో వారు ఎప్పుడును దేనివలనను భయమును పొందరు. వంకరగాను సరిగాను పారునట్టివైన యెల్లనదులును సముద్రమునందు చొచ్చుచుండునట్లు ఎల్లధర్మములును అహింసయందు చేరుచున్నవి. ఇది నిశ్చయము. ఎవడు ఈ లోకమునందు సకలప్రాణులకును అభయమును ఇచ్చునో అనగా, ఎవడు ప్రాణులను హింసింపడో, వాడు ఎల్ల పుణ్యతీర్థములయందును స్నానము చేసినవాడును, ఎల్లయజ్ఞములయందును దీక్షవహించినవాడును అగును ఎవరు శాస్త్రములయందు చెప్పబడినచొప్పున తమతమ కులాచారములను అనుసరించి ధర్మములను నడపుదురో, వారు యమపట్టణమును పొందరు. బ్రహ్మచారి గృహస్థుడు వానప్రస్థుడు సన్యాసి వీరిలో ఎవరైనను తమతమ అనుష్ఠానములను తప్పక నడపినపక్షమున వారు స్వర్గలోకమునందు వసింతురు. వర్ణములను ఆశ్రమములను వదలక శాస్త్రములందు చెప్పబడిన క్రమమున నడచుకొనువారును ఇంద్రియజయముగలవారును అయిన పుణ్యాత్ములు అందరును బ్రహ్మలోకమును పొందుదురు. ఇష్టమునందును (అగ్నిహోత్రము తపస్సు సత్యము వేదములను చదువుట అతిథిపూజ వైశ్వదేవము వీనిని ఆదరణతో జరపుటయందును) పూర్త

జారతా నిత్యం తే విప్రాః స్వర్గగామినః. అదీనవదనాశ్శూరా శ్శత్రుభిః పరివేష్టితాః, ఆహవేష్వవిషణ్ణా యే తేషాంమార్గో దివాకరః. అథ గోస్త్రీ ద్విజార్థేచ శరణాగతపాలనే, ప్రాణాం త్యజంతి యే వైశ్య నచ్యవంతి దివస్తు తే. పంగ్వాంధ భాలవృద్ధాంశ్చ రోగార్తానథ దరిద్రిణః, యేపుష్ణంతి సదా వైశ్య తేషాం నాకో౽శ్వమేధినామ్ గోగ్రాసం యే ప్రయచ్ఛంతి శుశ్రూషాం యేనరాః సదా, అగ్నిపూజా దేవపూజా గురుపూజా రతాశ్చయే సర్వపూజారతానిత్యం తేవిప్రాః స్వర్గగామినః, గర్తమాత్రంతు యేచఖ్యుః యత్ర గోర్విత్తృషా భవేత్. యమలోకమదృష్ట్వైవ సతతం యాంతి తే నరాః, వాపీకూపతటాకాద్యా ధర్మస్యాంతో న విద్యతే.

---

మునందును (బావులు నూతులు త్రవ్వించుట చెరువులు వేయించుట దేవాలయములు కట్టించుట అన్నదానముచేయుట తోపులువేయించుట అనెడివ్యాపారములను చేయుటయందును) ఆసక్తిగలవారు ఎవరో, బ్రహ్మయజ్ఞము పితృయజ్ఞము దేవయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞము అనెడి పంచయజ్ఞములను చేయుటయందు ఆసక్తిగలవారు ఎవరో, దయతోగూడినవారు ఎవరో, వారు అందరును యమపట్టణమును కన్నులనైన చూడరు. విషయములయందాసక్తి లేనివారును వేదము పఠించిన సమర్థులును అగ్నిపూజయగు ఔపాసనము మొదలగు క్రియలయందు ఆసక్తులును ఎవరో ఆబ్రాహ్మణులు స్వర్గమును పొందువారగుదురు. ఎవరు శత్రువుల చేత చుట్టబడినవారై మొగము వేలవేసికొని యుద్ధములయందు ఏమియు తోచక చింత పొందువారు గాక యుండు శూరులో వారు సూర్యుని త్రోవగా జేసికొని స్వర్గమునకు పోవుదురు. ఎవరు గోవులవిషయమయ్యును స్త్రీల విషయమయ్యును బ్రాహ్మణుల విషయమయ్యును శరణు చొచ్చినవారిని కాపాడెడివిషయమయ్యును ప్రాణములను విడుతురో వారు స్వర్గమునందుండి త్రోయబడరు. కుంటి గ్రుడ్డి పసివాడు ముసలివాడు దరిద్రులైన రోగ్యులు ఇట్టివారిని ఎవరు పోషింతురో వారు ఎల్లప్పుడు అశ్వమేధయాగము చేసిన పుణ్యాత్ములుపొందెడి స్వర్గలోకమును పొందుదురు. గోవులకు మేత వేయువారును ఉపచారము చేయువారును అగ్నిని దేవునిని గురువును పూజించువారును వీరు వారు అనక ఎల్లవారినిపూజించువారును అగు బ్రాహ్మణులు స్వర్గమును పొందువారు అగుదురు. ఒకగోవునకు దప్పితీరునంతటి నీళ్లు నిలిచెడి గుంటనైనను ఎవరు త్రవ్వింతురో వారు యమలోకమును చూడక యేస్వర్గలోకమునుపొందుదురు. బావులు నూతులు చెరువులు త్రవ్వించుట విశేషమయిన ధర్మము. ఆబావులు మొదలగువానియందు ఎల్లప్పుడును భూమియందు చరించునవియు జలమునందుచరించునవియునైనప్రాణులు మనసువచ్చినట్లు నీళ్లుత్రాగి వర్ధిల్లునుగనుక ఆధర్మమునకు తుద లేదు. అట్లు బావులు

పిబంతి స్వేచ్ఛయా యస్య జలస్థలచరా స్తథా, నిత్యదానపరాయే తే క థ్యంతే విబుధై రపి. యథాయథాతు పానీయం పిబంతి ప్రాణినో భృశమ్, తథాతథాతు యోస్వర్గో ధర్మవృద్ధ్యా వివర్ధతే. ప్రాణినాం జీవనం వారి ప్రాణా వారిణిసంస్థితాః, తత్ప్రభావే ప్రయచ్ఛంతి తేదీవ్యంతే తథాదివి అశ్వత్థమేకం పిచుమందమేకం న్యగ్రోధమేకం దశతింత్రిణీకం, కపిత్థబిల్వా మలకత్రయంచ పంచామ్రముప్త్వా నరకం న యాతి. వరం భూమిరుహాం పంచ వరం వాగోష్ఠహాందశ, పత్త్రైః పుష్పైః ఫలై ర్మూలైః కుర్వంతి పితృతర్పణమ్. సదా కరోత్యగ్నిహోత్రం సుహుతం హవ్యసంచయైః, యఃకరోతిఘనచ్ఛాయం పాదపంపథరోపితమ్ సదాసత్త్రీసభవతి సదా దానం కరోతి సః, సదాయజ్ఞంచయజతే యో రోపయతి పాదపమ్ సుచ్ఛాయాన్ ఫలపుష్పాఢ్యాన్ పాదపాన్ పథి రోపితాన్, భిందంతి యే నరా మూఢా స్తేయాంతినిరయంచిరమ్. నపశ్యంతియమంవైశ్య తులసీ

---

మొదలగువానిని త్రవ్వించినవారు వాని జలములచేత నిత్యదానములు చేయువారు అని పండితులచేత కొనియాడబడుదురు. ఆబావులు మొదలగువానియందలిజలములను ఎంత విశేషముగా ప్రాణులు పానముచేయుదురో అంత విశేషముగా వానిని త్రవ్వించినవారికి స్వర్గలోకసుఖము పెరుగుచుండును. ప్రాణము జలమునందే ఉంచబడినది. కాబట్టి ప్రాణులకు జలమేజీవనము అగుచున్నది. అట్టిజలముల మహిమచేత ఆజలాధారములను కలుగజేసినవారికి స్వర్గము కలుగగా వారు స్వర్గమునందు ప్రకాశించుచు ఉందురు. రావిచెట్టు ఒకటి వేపచెట్టు ఒకటి మఱ్ఱిచెట్టు ఒకటి చింతచెట్లు పది వెలగ మారేడు ఉసిరిక ఇవి మూడేసిచెట్లును ఆయిదు మామిడిచెట్లును చేర్చి ఒకతోపుగా నెవడువేయించునో వాడు నరకమును పొందడు. కొంచెపు వేంద్రములైనను పోగొట్టెడి నీడగలుగువృక్షములు ఆయిదైనను పదియైనను మేలు. ఆకులచేతను పువ్వులచేతను పండ్లచేతను వేళ్లచేతను మనుజులు తమ పితృదేవతలకు తృప్తిచేయుచున్నారు. ఎవడు మిక్కిలి నీడను కలుగజేయువృక్షములను నాటిపెంచునో, వాడు ఎల్లప్పుడు మంచి హోమద్రవ్యములగు నెయ్యిసమిధలు మొదలగువానిచేత హోమము చేసినవాడు అగును. ఎవడు వృక్షమునుభూమియందు నాటునో వాడు ఎల్లప్పుడు అన్నసత్త్రములను నడపువాడును ఎల్లప్పుడు దానములు చేయువాడును యజ్ఞములను చేయువాడును అగును. మంచి నీడగలవియు పండ్లు పువ్వులు గలిగినవియునైన దారిలో నాటబడిన వృక్షములను నరకునట్టి మూఢులగుమనుజులు చిరకాలము నరకములను అనుభవింతురు. తులసితోట వేయించుటవలన జనులు

వనరోపణాత్, సర్వపాపహరం సర్వకామదం తులసీవనమ్. తులసీకాననం యత్ర యత్ర పద్మవనానిచ, వసంతి వైష్ణవాయత్ర తత్ర సన్నిహితో హరిః. నచలతి నిజవర్ణధర్మతోయ స్సమమతి రాత్మ సుహృ ద్విపక్షపక్షే, నహరతినచహంతి కించిదుచ్చైః స్థితమనసంతమవైహి విష్ణుభక్తమ్. తులసీకాననంవైశ్య గృహేయస్మింశ్చతిష్ఠతి, తద్గృహంతీర్థభూతంహి నయాంతి యమకింకరాః. తావద్వర్షసహస్రాణి యావద్బీజ దళానిచ, వసంతి వైష్ణవేలోకే తులసీంరోపయంతి తే. తులసీగంధమాఘ్రాయ పితరస్తుష్టమానసాః, ప్రయాంతి గరుడారూఢాః తత్పదం చక్రపాణినః. దర్శనం నర్మదాయాస్తు గంగాస్నానంవిశాంవర, తులసీదళసంస్పర్శం త్రయమేతత్సమంస్మృతమ్ రోపణాత్పాలనాత్సేవా ద్దర్శనాత్స్పర్శనాన్నృణామ్, తులసీ హరతే పాపం వాఙ్మనఃకాయకర్మజమ్. పక్షేపక్షేతు సంప్రాప్తే ద్వాదశ్యాంవైశ్యసత్తమ, బ్రహ్మాదయోపి కుర్వంతి తులసీదళపూజనమ్. మణికాంచనపుష్పాది ముక్తావైడూర్యకానిచ, తులసీదళదానస్య కళాం

---

యమునిజాడరు. తులసితోట ఎల్లపాపములను పోగొట్టునదియు ఎల్లకోరికలనుఇచ్చునదియు అగును. ఎక్కడ తులసితోట ఉండునో ఎక్కడ తామరలసమూహము ఉండునో ఎక్కడ వైష్ణవులుఉందురో అక్కడక్కడ విష్ణుదేవుడు సన్నిహితుడు అగును. ఎవడు తనకులమును అనుసరించిననడవడివలనచలింపడో ఎవడు తనస్నేహితునియెడలనుపగవానియెడలను సమబుద్ధిగలిగియుండునో ఎవడు ఒకరిసొత్తును అపహరింపక ఒక ప్రాణిని చంపకయుండునో అటువంటి గొప్పమనసుగల పురుషుడు విష్ణుభక్తుడుఅని తెలిసికొనుము. ఏయింటియందు తొళసితోటయుండునో ఆయిల్లు పుణ్యతీర్థమును పోలినదగును. కనుక ఆయింటిలో యమకింకరులుచొరరు. తొళసిచెట్టును నాటినవారుదానివిత్తులనుదళములను ఎంతకాలముభూమిలో నశింపకయుండునో అంతకాలము విష్ణులోకమునందు ఉందురు. తులసీదళముయొక్క పరిమళమునుమూజూచినమాత్రమున పితృదేవతలందరు సంతోషించిన మనస్సుగలవారై గరుడవాహనమునెక్కి శ్రీవిష్ణుదేవునిదైన పరమపదమును పొందుదురు. నర్మదానదియొక్క దర్శనము గంగానదియందలిస్నానము తులసిదళమును చేతముట్టుట అనుమూడును సమానములు అని చెప్పబడును. తులసిచెట్టును మొలవేయుట నీళ్లుపోసి పెంచుట దానివలని పరిమళమును అనుభవించుట దానిని చూచుట వీనివలన మనుష్యులకు మాటలచేతను మనస్సుచేతను దేహముచేతనునైన పనులవలన గలిగినపాపములు నశించును. ప్రతిపక్షమునందును వచ్చెడిద్వాదశినాడు బ్రహ్మమొదలగు దేవతలుగూడ తులసీదళముతో భగవంతుని బూజించుచున్నారు. రత్నములచేతను బంగారుచేతను చేయబడినపువ్వులతో చేయుపూజ తులసీదళముతో చేయుపూజవలని ఫలము

నార్హంతిషోడశీమ్ ఆమ్రారోపసహస్రేణ పిప్పలానాం శతేనచ, యత్ఫలంహితదేకేన తులసీవిటపేనతు. విష్ణుపూజాసుసంయుక్తాం తులసీంరోపయంతియే, యుగాయుతశతైరంతే రమంతే దివిరోపకాః. తులసీమంజరీభిర్యఃకుర్యాద్ధరిహరార్చనమ్, నచతస్యగృహంయాంతియమదూతానసంశయః. పుష్కరాదీనితీర్థాని గంగాద్యాస్సరితస్తథా, వాసుదేవాదయోదేవాఃవసంతితులసీదళే. ఆరోప్యతులసీంవైశ్య సంపూజ్యసుదర్శనారిమ్, వసంతి మోదమానాస్తే యత్ర దేవశ్చతుర్భుజః ఏకకాలం ద్వికాలంవా త్రికాలంవాపి యేనరాః,సమర్చయంతి భూతేశం లింగేరేవాసముద్భవే. స్ఫాటికే రత్నలింగేవా పార్థివేవా స్వయంభువే, స్థాపితేవాక్వచిద్దైవశ్య తీర్థక్షేత్రేఽథవావనే. నమశ్శివాయమంత్రేణ కుర్వంతస్తజ్జపంతథా, శృణ్వంతి యమలోకస్య కథామపి న తే నరాః శివపూజాప్రభావేన శివభక్త్యాశ్నివేశకాః, మోదంతే శివలోకేతే యావదింద్రాశ్చతుర్దశ. ప్రసం

నందు పదియారుపాళ్లలో ఒకపాలు ఫలమునుగూడ ఇయ్యజాలదు. వేయిమామిడిచెట్లను నూరురావిచెట్లను నాటి పెంచినఫలము ఒకతొళసిచెట్టు నాటుటచేత కలుగును. విష్ణుపూజకు ఉపయోగించునట్టి తొళసితోట ఎవరిచేత వేయబడునో వారు అంత్యకాలమునందు స్వర్గమునుపొంది నూరువేలయుగములు అచ్చట సుఖమును అనుభవించుచు ఉండెదరు. లేక తులసీదళములచేత హరిహరులను ఎవడు పూజించునోవానియింటికట్టు యమదూతలు పోరు. ఇందులకు సందేహములేదు. పుష్కరము మొదలగు తీర్థములును గంగ మొదలగు నదులును తులసీదళమునందు వాసముచేయును. అట్లే శ్రీవిష్ణుదేవుడు మొదలగు దేవతలును తులసీదళమునందు వాసముచేయుదురు. ఓవైశ్యుడా ! ఎవరు తొళసిచెట్టునునాటి దానివలనిమంచిదళములచేత విష్ణుదేవునిపూజించునట్టివారో వారు ఆనాలుగుభుజములుగల విష్ణుదేవుడు ఎక్కడఉండునో ఆపరమపదమునందు సంతోషించుచు ఉందురు ఒకపూటగాని రెండుపూటలుగాని మూడుపూటలుగాని ఎల్లప్రాణులను ఏలినవాడగు భగవంతుని పూజించువారును నర్మదానదియందు బుట్టిన లింగమునందయినను స్ఫటికలింగమునందైనను ఏరత్నముచేతనయిన జేయబడిన లింగమునందయినను ఒకరివలన చేయబడక తానుగాపుట్టినలింగమునందైనను పుణ్యతీర్థము పుణ్యక్షేత్రము లేక సామాన్యమయిన వనము ఇట్టిచోటులలో ప్రతిష్ఠచేయబడిన లింగమునందైనను "ఓంనమశ్శివాయ" అనుమంత్రముచేత ఒక్కసారియైనను శివుని ఆవాహనచేసి పూజించి ఆమంత్రమును ఎల్లప్పుడు జపించువారు యమలోకముయొక్క కథనుగూడ వినరు. శివపూజయొక్క మహిమచే శుభమునందాసక్తిగల శివభక్తులగువారును శివలోకమునందు

గేనాపి శాఠ్యేన దంభేనాపిచ లోభతః, యేసేవంతే మహాదేవం నతే పశ్యంతి భాస్కరిమ్ భిందంతి శైలానుదధీః పిబంతి వ్యత్యాసయంతిక్షితిమంతరిక్షమ్, తృణీకృతబ్రహ్మపురందరాణాం కిం దుష్కృతం శంకర కింకరాణామ్.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే
వికుండల యమదూతసంవాదం నామ
ద్వాత్రింశోఽధ్యాయః.

---

## త్రయస్త్రింశోఽధ్యాయః.

దూతః — సౌభాగ్యం కాంతిమద్రూపంసత్యం త్యాగప్రవర్తితా, శౌర్యంచ జగతిఖ్యాతిః శివపూజావిధేఃఫలమ్. బ్రహ్మణఃసృష్టికర్తృత్వంవిష్ణోర్దానవమర్దితా, బలేర్దానప్రభావశ్చ శివపూజావిధేఃఫలమ్. కర్ణస్యదానశూరత్వం కార్తవీర్యస్య శౌర్యతా, కుబేరస్యచ సంపత్తిః శివపూజావి

పదునలుగురు ఇంద్రులు గతించునంత కాలము సంతోషముతో వసింతురు. ఏదైనయొక పనిగలిగికాని ఒక పెపముచేతగాని ఆసక్తితో శ్రీమహేశ్వరుని సేవించువారు యమధర్మరాజును చూడరు. శివభక్తులగువారు కొండలను పిండిజేయుదురు. సముద్రముసీళ్లన్ని యుంత్రాగుదురు. భూమిని ఆకాశమును క్రిందుమీదు జేయుదురు. బ్రహ్మ ఇంద్రుడు మొదలగువారిని తృణముగా నెంచెడి శివకింకరులకు చేయ శక్యము కానిది యేదికలదు ? ఎట్టి అసాధ్యకార్యమునైనను అనాయాసముగా సాధించుకొందురు.

ఇది శ్రీ పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు వికుండలునికి
యమదూతకునైన సంవాదమును తెలుపునట్టిదైన
ముప్పదిరెండవ అధ్యాయకథ.

---

## ముప్పదిమూడవ అధ్యాయము.

దూతమాటలు. — ఓవికుండలుడా ! శివపూజవలని ఫలమును చెప్పెదను వినుము. శివునిపూజచేయుటవలన మనోహరత్వమును మినమినలాడు కాంతితోడిఆకారమునుసత్యమును త్యాగమును చక్కగా మాటలాడుటయందలినేర్పును శూరత్వమును లోకమునందు ప్రసిద్ధియు కలుగును. బ్రహ్మకు సృష్టిచేయునట్టి అధికారమును విష్ణువునకు రాక్షసులను చంపునట్టి సామర్థ్యమును బలిచక్రవర్తికి దానమిచ్చుమహిమయు శివపూజచేయుటవలననే కలిగినవి. కర్ణునికి దానమిచ్చుటయందలి తెగువయు కార్తవీర్యార్జునునికి శూ

ధేఃఫలమ్, మహత్త్వం వాసుదేవస్య వాక్పతిత్వం బృహస్పతేః. బ్రహ్మ తేజో వసిష్ఠస్య శివపూజావిధేఃఫలమ్, అగస్త్యేనార్ణవః పీతస్తారితశ్చహనూమతా. రాఘవేణోదధిర్బద్ధః శివపూజవిధేః ఫలమ్, అమంత్రంవా సమంత్రంవా లింగస్యోపరి నిక్షిపేత్. పత్త్రంవా పుష్పమేకంవాకులకోటిం సముద్ధరేత్, శివార్చనసమం పుణ్యం సర్వపాపప్రణాశనమ్. సర్వైశ్వర్యప్రదం హ్యైశ్య నాస్తి కించి జ్జగత్త్రయే, శివభక్తిం ప్రకుర్వాణా యే ద్విషంతి జనార్దనమ్. తేషాం నరకపాతస్తు యావదింద్రాశ్చతుర్దశ, పరాత్పరతరం యాంతి నారాయణపరాయణాః. నిరయం తే గమిష్యంతి యే ద్విషంతి మహేశ్వరమ్, ద్రవ్య మన్నం ఫలం తోయం శివస్వం న స్పృశే త్క్వచిత్. నిర్మాల్యం నైవ నస్పృష్టం కూపే సర్వం వినిక్షిపేత్, మక్షికాపాదమాత్రంతు శివస్వముపభుంజతే. మోహాల్లోభాన్నముచ్యేత కల్పాంతం నరకం నరః, తృణైః కాష్ఠైశ్చ పాషాణైః యే సృజంతి శివాలయమ్. మోదంతే సహ రుద్రేణ తే నరా శ్శివసన్నిధౌ,

రత్నమును కుబేరునికి ధనసంపదయుం ద్రౌపదికి మంచి మగలుగలుగుటయుం ధ్రువునికి ఉన్నతస్థానమునందలి యునికియు అర్జునునికి యుద్ధమునందు గెలుపుగలుగుటయుం కృష్ణునికి గొప్పతనమును బృహస్పతికి విద్యాధికారము వసిష్ఠునికి బ్రహ్మతేజస్సును శివపూజ చేయుటవలననే లభించినవి. అగస్త్యుడు సముద్రమును త్రాగుటయుం హనుమంతుడు సముద్రమును దాటుటయుం శ్రీరాముడుసముద్రమునకుకట్టకట్టుటయుం శివునిపూజ చేయుటవలని ఫలమేఅగును. మంత్రముచెప్పిగాని చెప్పకగాని పుష్పగాని పత్త్రిగాని శివలింగముమీద ఉంచబడిన పక్షమున అది అనేకకులములను ఉద్ధరించును. స్వర్గము మర్త్యము పాతాళము అనెడి మూడులోకములయందును ఎల్లపాపములను చెరుచునదియుం ఎల్లకలుములను ఇచ్చునదియుం అయిన శివపూజవంటి పుణ్యపువని లేనేలేదు. విష్ణుభక్తులగువారు ఉత్తమమయిన వానిలో నెల్లను ఉత్తమమయిన పరమపదమును పొందుదురు విష్ణుభక్తులయియుండియు శివునియెడల విరోధబుద్ధిగలవారైన పక్షమున నరకమును పొందుదురు. శివునికి సమర్పింపబడిన ఏవస్తువునయినను అన్నము పండు నీళ్లు వీనిలో ఏదయినను ఒకానొకప్పుడైనను చేతితో ముట్టరాదు. శివునికి సమర్పించి తీసివేసిన పువ్వులు మొదలగునవియుం ముట్టరానివే కనుక వానినంతయుంఒకనూతిలోపడ వేయవలసినది. అజ్ఞానముచేతగాని ఆశ్యాశచేతగాని ఈగకాలంతయయినను శివునిసొత్తునుఅనుభవించినమనుష్యుడు ప్రళయకాలమువరకు నరకమునుండి విడువబడడు. గడ్డిచేతను మ్రాకులచేతను రాళ్లచేతను శివునికి గుడికట్టించునట్టి పుణ్యాత్ములు శివునిదాపున శివునితోగూడ సంతో

బ్రహ్మవిష్ణు మహాదేవ ప్రసాదం వరమేవవా. కృత్వాతు సుచిరం కాలం
తత్తల్లోకే వసంతి తే, యేధర్మమఠగోశాలాః పథి విశ్రామమందిరమ్.
యతీనాం శరణంచైవ దీనానాథకుటీరకమ్, బ్రహ్మశాలాంచ విపులాం
బ్రాహ్మణస్యచ మందిరమ్. సృష్ట్వా యాంతి విశాంశ్రేష్ఠ ఇంద్రస్య సద
నంమహత్, జీర్ణోద్ధారంతు చైతేషాం తత్ఫలం ద్విగుణం భవేత్. తన్ము
క్త్వాన్యత్ర యఃకుర్యా త్సగచ్ఛేన్నిరయం మహత్, దేవవిప్ర యతీనాం
తు మఠే లోభవిమోహితాః. మాఠాపత్యంతు యే కుర్యుః సర్వకర్మ
బహిష్కృతాః, తేపచ్యంతే మహాఘోరే నరకే రౌరవేతు యే పత్రంపు
ష్పం ఫలం తోయం ద్రవ్యమన్నం మఠస్యతు. యోఽశ్నాతి పచ్యతే ఘో
రా న్నరకానేకవింశతిః. యమిచ్ఛేన్నరకం నేతుం సపుత్రపశుబాంధ
వమ్, తం దేవేష్వధికుర్యా ద్గోషుచ బ్రాహ్మణేషుచ. అభోజ్యం యతి

---

క్షించుచు ఉందురు బ్రహ్మవిష్ణు మహేశ్వరుడు వీరివలని మేలైన అనుగ్రహమును
పొందునట్టివారు ఆయాలోకములయందు చిరకాలము వాసముచేయుందురు. ఎవరు
ధర్మార్థముగా మఠము ఆవులకొట్టము త్రోవలో బాటసారులు నిలుచుటకు చవిక
సన్యాసుల మఠము దరిద్రులు దిక్కులేనివారు ఉండుటకు దగినగుడిసెలు బ్రాహ్మణులు
వేదాధ్యయనము చేయుటకు దగిన పెద్ద సత్రము బ్రాహ్మణులు వాసముచేయుటకు
దగిన యిల్లు వీనిని కట్టింతురో వారు మిక్కిలి పూజ్యమయిన ఇంద్రలోకమునందు
చేరుదురు. ఈ చెప్పబడినవి ప్రాతగిలి చెడిపోయినప్పుడు వానిని బాగుచేయుటవలన
క్రొత్తగా కట్టించుట వలని ఫలమునకు రెండంతల ఫలము లభించును. ఇట్టిప్రా
తగిలి చెడిపోయినవానిని చక్కబెట్టుటను మాని ఎవడు ఇడియగొట్టించునో వాడు
మహానరకమునందు కూలును. ఎవరు ధనలోభముచేత ఒళ్లుతెలియక దేవాలయములయం
దును బ్రాహ్మణులకు అన్నదానము చేయు సత్రములయందును సన్యాసులమఠములయం
దును అధికారము చేయుదురో వారు అన్నికనులవలనను వెలికి తొలగింప దగిన వా
రగుదురు. మరియు వారు అప్పటప్పటికి పెరుగునదియు మిక్కిలి భయంకర మయినది
యు నైన రౌరవము అను నరకమునందు తపింప జేయబడుదురు. సన్యాసులమఠములం
దు ఆకు పువ్వు పండు జలము అన్నము వీనిని ఎవడు పుచ్చుకొని భుజించునో వాడు
ఇరువదియొక్క మహానరకములలోను పడి తపించును. ఎవనిని కొడుకులు మొదలగు
వారితోను పశువులతోను చుట్టములతోను నరకమును పొందింపకోరుదుమో వానిని
దేవాలయమునందును ఆవులమందయందును బ్రాహ్మణులసత్రములయందును అధికారినిగా
జేయవలయును. సన్యాసులదైన అన్నమును భుజింపరాదు. ఒకవేళ తెలియక భు

నామన్నం భుక్త్వా చాంద్రాయణం చరేత్, స్పృష్ట్వా మఠపతిం వైశ్య సవాసా జల మావిశేత్. బ్రహ్మవిష్ణుమహేశానాం పూజార్థం పుష్ప వాటికామ్, ఆరోపయంతి యే ధన్యాః దేవలోకేచ సంతి తే. యేనరాః పితృదేవాంశ్చ తర్పయంత్యతిథీనపి, ప్రాజాపత్యంహి తే యాంతి సర్వలోకోత్తమోత్తమమ్. మూర్ఖోవా పండితోవాపి శ్రోత్రియః పామరోపి వా, బ్రహ్మతుల్యోఽతిథిర్వైశ్య మధ్యాహ్నే యస్సమాగతః. పథిశ్రాంతాయ విప్రాయ అన్యస్మై క్షుధితాయచ, ప్రయచ్ఛంత్యన్నపానం యే తే నాకేచిరవాసినః. అదృష్టపూర్వా యేపాంథాః భోక్తుకామాః క్షుధాతురాః, యద్గృహే తృప్తిమాయాంతి సర్వలోకేషు తేతథా. అతిథిర్విముఖోయస్య నయాతిగృహమేధినః, మధ్యాహ్నే వైశ్యసాయంవై సన యాంతి యమాలయమ్. నాస్తినాస్తి వచశ్శ్రుత్వా భిన్నో గేహాద్వ్రజేత్తు యః, ఆజన్మసంచితం పుణ్యం గృహ్ణాతి గృహమేధినః నాస్త్యతిథిసమో బంధుః నాస్త్యతిథిసమం ధనమ్, నాస్త్యతిథిసమో ధర్మో నాస్త్యతిథి

---

జించిన పక్షమున చాంద్రాయణవ్రతమును ఆచరింపవలసినది. మఠాధికారి అగు పురుషుని తాకినయెడ కట్టుకొన్నవస్త్రముతోడ స్నానము చేయవలెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల పూజకొరకు పూలతోటవేయించునట్టి పుణ్యాత్ములు దేవలోకమునందు వసింతురు. దేవతలను పితృదేవతలను అతిథులనుతృప్తిపొందించువారు అన్నిలోకములలోను ఉత్తమమయిన బ్రహ్మలోకమును పొందుదురు. మధ్యాహ్నకాలమునందు యింటికి వచ్చినయతిథి మూర్ఖుడయినను పండితుడయినను వేదాధ్యయనముచేసినవాడైనను ఏమి తెలియని మూఢుడైనను బ్రహ్మతో సమానుడగును. ఎవడు దారినడచి అలసిన బ్రాహ్మణునికైనను మరియేవిధముచేతగాని ఆకలిగొన్న బ్రాహ్మణునికైనను అన్నపానీయము లిచ్చి ఆదరింతురో వారు చిరకాలము స్వర్గమునందు వాసముచేయుదురు. బాటసారులు ఆకలిగొని భోజనాపేక్ష గలవారై ముందు ఎన్నడును చూచి యెరుగనివారుగా నుండియు ఏయింట అన్నపానాదులను పుచ్చుకొని తృప్తిపొందుదురో ఆయింటి అధికారి సర్వలోకములయందును చిరకాలము సుఖమును అనుభవించును. మధ్యాహ్నకాలమునందుగాని సాయంకాలమునందుగాని వచ్చిన అతిథి యెవనియింట ఆదరింపబడక మరలిపోవడో ఆయింటివాడు యమలోకమును పొందడు. ఏయింట నుండి అతిథియగువాడు లేదు లేదు అనుమాటను విని చిన్నబోయినవాడై వెడలిపోవునో ఆయింటివాడు పుట్టిన నాటనుండి సంపాదించిన పుణ్యములెల్లను ఆయతిథి తీసికొనిపోవును. లోకమునందు గృహస్థునికి అతిథినిబోలిన చుట్టమును ధనమును మేలును లేవు. అతిథి పూజయొక్క

సమాహితః ఆతిథ్యస్య ప్రభావేన రాజానో మునయ స్తథా, బ్రహ్మలోకం గతాద్యాపి నచ్యవంతే విశాంవర. జనమధ్యే గృహస్థో యః ప్రమాదాద్వా కథంచన, భోజయేదతిథీనన్నై ర్నచపశ్యతి సోంతకమ్. సుదీప్తేషువిమానేషు భుజ్క్తేపీయూషమన్నదః, యాతి స్వర్గచ్యుతో వైశ్య ఉత్తరాంశ్చ కురూన్ పునః. తతశ్చభారతేవర్షే రాజాభవతిధార్మికః, అన్నదోదీర్ఘమాయుశ్చ విందేతాక్షీణవంశజః. సర్వేషామేవజంతూనా మన్నే ప్రాణాః ప్రతిష్ఠితాః, తేనాన్నదోవిశాంశ్రేష్ఠః ప్రాణదాతా బుధైస్స్మృతః. ప్రాహ వైవస్వతో దేవో రాజానం కేసరిధ్వజమ్, చ్యవంతం దేవలోకా చ్ఛకారుణ్యేన విశాంవర. దదస్వాన్నం దదస్వాన్నం దదస్వాన్నం నరాధిప, కర్మభూమిం గతో దేవోయదిస్వర్గంత్వ మిచ్ఛసి. ఇత్యాశ్రావితయా వైశ్య సాక్షాద్యమముఖాత్తదా, అన్నదానసమం దానం అతో నాస్తీమ యోదితమ్, పానీయం ప్రదద గ్రీష్మే హేమంతేచ తథేంధనమ్, అన్నం చైవ సదా దత్వా యామీం యాతి నయాతనామ్. జ్ఞాతాజ్ఞాతేషు పాపేషు క్షుద్రేషుచ మహాత్సుచ, షట్సు షట్సుచ మాసేషు ప్రాయశ్చి

---

మహిమచేతనే రాజులును మునులును బ్రహ్మలోకమును పొంది యిప్పటికిని అందునుండి చలింపక యున్నారు. అనేకులైన జనులనడుమ ఏగృహస్థుడు ఏమరియైన ఒకానొకప్పుడు అతిథులకు అన్నముపెట్టి భోజనము చేయించునో ఆగృహస్థుడు యముని చూడడు. అన్నదానము చేసినపురుషుడు చక్కగా వెలుగుచున్న విమానములయందుండి అమృతమును భుజించును. అట్టిధర్మాత్ముడు తనపుణ్యము క్షీణించినపిమ్మట స్వర్గమునుండి దిగబడి ఉత్తరకురువులనెడి పుణ్యదేశములయందు పుట్టి భారతవర్షమనెడి యీభరతఖండమునందు రాజు అగును. అన్నము పెట్టునట్టివాడు వృద్ధితరుగని కులమునందుబుట్టి దీర్ఘాయుష్మంతుడగును. ఎల్లజంతువుల ప్రాణములును అన్నమునందే ఉంచబడినవి అగును. కనుక అన్నదానము చేయువాడు ప్రాణములనిచ్చువాడని పెద్దలు చెప్పుదురు. ఓవైశ్యుడా! ఒకానొకప్పుడు దేవలోకమునుండి భూలోకమునకు దిగిపడుచున్న కేసరిధ్వజుడను రాజునుజూచి యముడు దయతో, ఓరాజా! కర్మభూమిని పొందువాడవైన నీవు మరల స్వర్గమును కోరెడిపక్షమున అన్నమును పెట్టుము పెట్టుము పెట్టుము అని ముమ్మారు చెప్పెను. ఇట్లు మాయేలినవాడు ఆరాజుతో చెప్పునప్పుడు ఆయునవలన నేను ప్రత్యక్షముగా వింటిని. కాబట్టి అన్నదానమునకు సరియైనదానములేదు అని నేను దృఢముగా చెప్పితిని. ఎండకాలమునందు మంచినీళ్లు మంచుకాలమునందు వంటచెరకును ఎల్లప్పుడు అన్నమును ఇచ్చునట్టివాడు యమునిదైన యాతనను పొందడు. తెలిసి తెలియకచేసిన అల్పపాపములుగాని అధికపాపములుగాని ఆరేసినెలలకు ఒకసారి ప్రా

త్తంచ యశ్చరేత్. నిష్కల్మషో నరోవైశ్య సకృతాంతం నపశ్యతి, ప్రాయశ్చిత్త మకృత్వైవ నరో భవతి నారకే. ప్రాయశ్చిత్తం చరేద్యస్తు వాఙ్మనఃకాయకర్మసు, స ప్రాప్నోతి శుభాంల్లోకాన్ దేవగంధర్వసేవితాన్. నిత్యం జపంతియేవైశ్య గాయత్రీం వేదమాతరమ్, అన్యచ్చనైగమం జప్యం నతే లిప్యంతి పాతకైః. వేదాభ్యాసరతానిత్యం సాయంప్రాతర్హుతాశనే, యేజుహ్వతిద్విజావైశ్యతే లభంతేఽక్షయాంగతిమ్ నిత్యవ్రతసమాచారో నిత్యతీర్థోపసేవకః, నిత్యం జితేంద్రియ స్సత్యం యమం రౌద్రం నపశ్యతి. పరాన్నం పరపాకంచ నిత్యం కర్మరత స్త్యజేత్, యోహి యస్యాన్నమశ్నాతి సతస్యాశ్నాతి కిల్బిషమ్. సర్వతః ప్రతిగృహ్ణీయా ద్భోజనం నసమాచరేత్, నరకం దారుణంస్మృత్వా పరాన్నేచ మతింత్యజేత్. యామ్యంతు యాతనా దుఃఖం నిత్యంస్నాయీ నపశ్యతి, నిత్యస్నానేనపూయంతే యదిపాపకృతోజనాః. ప్రాతఃస్నానేన నిష్పాపో

---

యశ్చిత్తము చేసికొనుటచే నశించును. అట్లుచేసికొనక యథేచ్ఛముగా మెలగునట్టి మానవుడు నరకమునుపొందును. ఎవడు వాక్కు మనస్సు కాయము వీనిచేత చేయబడినపాపకర్మముల విషయమై ప్రాయశ్చిత్తము చేసికొనునో వాడు దేవతలు గంధర్వులు పొందునట్టిపుణ్యలోకములను పొందును. వేదమాతయైనగాయత్రీమంత్రమును ఇతరములైన వేదములో సంబంధించినమంత్రములనుగాని యెవరు జపముచేయుదురో వారిని పాపములు పొందవు. ఎల్లప్పుడు వేదాభ్యాసముచేయుటయందు అక్కరగలిగి సాయంకాలమునందును ప్రాతఃకాలమునందును అగ్ని మొదలగుకార్యములను చేయునట్టివారు ఎవరో వారు ఎన్నడును చెడని ఉత్తమగతిని పొందుదురు. ప్రతిదినమును నడుపదగిన వ్రతములను నడుపువారు ఎల్లప్పుడును పుణ్యతీర్థములయందు స్నానముచేయువారును ఎల్లప్పుడును ఇంద్రియములను వశపరచుకొని యుండువరును భయంకరుడైన యమధర్మరాజును చూడరు. ఇది నిజము. ఎవడు తాను చేయదగినకర్మములను చేయగోరునో వాడుఇతరులయింటిభోజనమును ఇతరులచేత వంటచేయించుకొనుటయు మానవలెను. ఎవడుగాని తాను ఎవని అన్నమును భుజించునో వానిపాపములను అనుభవించువాడు అగును. బ్రాహ్మణుడేగదా దానము తీసికొవలసినవాడు అని అంతటను దానములు పుచ్చుకోరాదు. పరులయింట భోజనము చేయుటవలన భయంకరమైన నరకమును అనుభవింపవలసివచ్చును అనుతలపుగలిగి అంతటను భోజనము చేయనుగూడదు. ఇదిగాక ఎవడు ఎడతెగక త్రికాలస్నానముచేయునో వాడు యమునిసంబంధమయిన యాతనాదుఃఖమును పొందడు. పాపములు చేసినవారును నిత్యస్నానముచేత పవిత్రులు అగుదురు. ప్రాతఃకాలమునందు స్నానము

నరోనరకంవ్రజేత్. స్నానంవినాతు యోభుఙ్క్తే మలాశీతు సదానరః, అస్నాయినోశ్నతో వైశ్య విముఖా స్సర్వదేవతాః. స్నానహీనో నరః పాపః స్నానహీనో శుచిస్సదా, అస్నానీ నరకం భుఙ్క్తే పుల్కసాదిషు జాయతే. యే పునస్స్రోతసిస్నాన మాచరింతీహ పర్వణి, తేనైవ సద్గతిం యాంతి న జాయంతే కుయోనిషు. దుస్స్వప్నం దుష్టచింతా చ నష్టం భవతి సర్వదా, ప్రాతఃస్నానవిశుద్ధానాం పురుషాణాం విశాంవర. తిలాంశ్చ తిలపద్మంచ తిలపాత్రంయథావిధి, దత్వాప్రేతపతే ర్యామిం న వ్రజంతి నరాఃక్వచిత్. పృథివీం కాంచనం గాంచ మహాదానాని షోడశ, దత్వాతేన నివర్తంతే స్వర్గలోకా ద్విశుండల. పుణ్యాసుతిథిషు ప్రాజ్ఞాః వ్యతీపాతేచ సంక్రమే, స్నాత్వా దత్వాచయోభుఙ్క్తే నైవగచ్ఛతి దుర్గతిమ్. నైవక్రమంతి దాతారో దారుణం రౌరవంతథా, ఇహలోకే న జాయంతే కులే ధనవివర్జితే. సత్యవాదీ సదామౌనీ ప్రియవాదీచ యో

---

చేయుటచేత దేహమునకు లోపలను వెలుపలను ఉండు మురికిపోవును. ప్రాతఃకాలపు స్నానముచేతనే మనుష్యుడు పరిశుద్ధుడై నరకమును పొందడు. ఎవడు స్నానము చేయకయే భోజనముచేయునో వాడుమలభక్షకుడు అనబడును. స్నానముచేయక భోజనముచేయువానిని జూచి ఎల్లదేవతలును మొగములను వెనుకకు త్రిప్పుకొందురు. స్నానముచేయనివాడే పాపుడు. స్నానముచేయనివాడే అశుచి. కనుక స్నానము చేయనివాడు నరకమును అనుభవించి కడపట మాలమొదలగు నీచజాతులయందు పుట్టును. ఈ లోకమునందు పూర్వకాలములో ప్రవాహజలమునందు ఎవరు స్నానముచేయుదురో వారు దానిచేతనే సద్గతిని పొందుదురు. నీచజాతులయందు పుట్టరు. ప్రాతస్స్నానముచేత పరిశుద్ధులయిన పురుషులకు ఎప్పుడును చెడ్డకలలు చెడ్డదుఃఖములు వీనివలని దోషములునశించును. ఎవరు నువ్వులతో చేయఁబడిన పద్మమును నువ్వులతోడి పాత్రమును శాస్త్రమునందు చెప్పబడినచొప్పున దానము చేయుదురో వారు ఒకప్పుడును యమలోకమును పొందరు. ఓయువికుండలుడా! భూదానము స్వర్ణదానము గోదానము మొదలగు పదియారు మహాదానములను చేయువారు స్వర్గలోకమును వదలనే వదలరు. వ్యతీపాతము సంక్రాంతి ఇట్టి పుణ్యదినములయందు స్నానమును యథోచిత దానములు చేయునట్టివారు పరలోకమునందు భయంకరమయిన రౌరవమును నరకమును పొందరు. ఈలోకమునందు దరిద్రులయింట బుట్టరు. నిజము పలుకువాడును ఎప్పుడును మాటలాడకుండువాడును వినువారికి ఇష్టముగ మాటలాడువాడును కోపములేనివాడును ఓర్పు

నరః, అక్రోధనః క్షమోదారః నాతివాద్యనసూయకః. సదా దాక్షిణ్య సంపన్నః సదా భూతదయాన్వితః, గోప్తాచ పరమర్మాణాం వక్తా పరగుణస్యచ. పరస్వం తృణమాత్రంచ మనసాపి నయోహరేత్, న పశ్యతి విశాంశ్రేష్ఠ సదానరకయాతనామ్. పరాపవాదీ పాపిష్ఠః పాపేభ్యోప్యధికో౽నఘ, పచ్యతే నరకే తావ ద్యావదాభూతసంప్లవమ్. వక్తా పరుషవాక్యానా మమర్త్యో నరకం వ్రజేత్, సంతేహో న విశాంశ్రేష్ఠ పునర్యాస్యతి దుర్గతిమ్. నతీర్థేనతపోభిశ్చ కృతఘ్నస్యాస్తి నిష్కృతిః, సహతే యాతనాం ఘోరాం సనరో౽నరకేచిరమ్. పృథివ్యాం యానితీర్థాని తేషుమజ్జతియోనరః, జితేంద్రియో జితాహారః సనయాతి యమాలయమ్. నతీర్థే పాతకంకుర్యాత్త్యజేత్తీర్థోపజీవనమ్, తీర్థేప్రతిగ్రహస్త్యాజ్యః త్యాజ్యో ధర్మస్యవిక్రయః. దుర్జితంపాతకంతీర్థే దుర్జితశ్చప్రతిగ్రహః. తీర్థేచ దుర్జితం సర్వమేతత్కృన్నరకంవ్రజేత్. సకృద్గంగాంభసి స్నాత్వా

---

గలవాడును తిన్నదనము గలవాడును తగినకాలది మాటలాడువాడును ఓర్వలేనితనము లేనివాడును ఎప్పుడును మొగమోటముగలవాడును ప్రాణులయందు దయగలవాడును ఒకరిరహస్య సంగతులను బయలుపరుపనివాడును ఒకరిమంచిగుణములను వెల్లడిగా చెప్పువాడును ఒకరిసొత్తును గడ్డిపోచతో సమానముగా నెంచి మనసునందైనను దానిని తీసుకోగోరనివాడును ఎవడో వాడు నరకములను ఎప్పుడును కనులజూడఁడు. ఒకరిపై లేనిపోని నిందమోపునట్టివాడును పాపములయెడల ప్రీతికలవాడును అగుపాపాత్ముడు ఎప్పటికి ఎల్లప్రాణులు నశించెడి ప్రళయకాలము వచ్చునో అప్పటివరకు నరకమునందు తపించుచుండును. కఠినముగా మాటలాడునట్టివాడు దేవుడైనను నరకమును పొందును. సందేహములేదు. ఒకరు చేసినమేలు మరచునట్టి పాపాత్మునికి పుణ్యతీర్థములయందలి స్నానములచేతను తపస్సులచేతను ప్రాయశ్చిత్తము కలుగదు. మాటిమాటికి నరకములయందు భయంకరమయిన యాతనలను పొందుచు చిరకాలము నరకమునందే యుండును. భూమియందు ఎన్నితీర్థములు గలవో అన్నిటియందును ఎవడు స్నానము చేయునో ఎవడు ఇంద్రియములను ఆహారమును కుదించునో వాడుయమునియింటిని పొందడు. పుణ్యతీర్థములయందు పాపకృత్యములను చేయరాదు. జీవనార్థముగా తీర్థయాత్ర చేయుటను తీర్థయాత్ర చేయునపుడు ఒకరివలన దేనినైనను పుచ్చుకొనుటను తాను చేసిన ధర్మమును ఒకరికి అమ్ముటను మానవలసినది. తీర్థమునందు చేయుపాపమును దానమును పుచ్చుకొనుటయు గెలువరానివి అనగా పోగొట్టుకొరానిపాపములు. ఇట్టిపాపముల నెల్ల చేయువాడు నరకమును పొందును. మనుష్యుడు విశేషపాపములు చేసినవాడైనను ఒకసారి గంగనీటిలో

పూతో గాంగేనవారిణా. నరో న నిరయం యాతి అపిపాతకరాశికృత్, వ్రతదానతపోయజ్ఞాః పవిత్రాణీతరాణిచ. గంగాబింద్వభిషేకస్య నసమానఇతి శ్రుతః, అన్యతీర్థసమాం గంగాం యో బ్రవీతి నరాధమః. సయాతినరకంవైశ్యరౌరవం దారుణం మహత్, అర్థవాదమిమం సర్వం పురాణమితి యోవదేత్. పచ్యతే రౌరవే ఘోరే కులానామేకవింశతిః.

ఇతి శ్రీపాద్మేపురాణే, మాఘమాహాత్మ్యే, వికుండల కింకర సంవాదంనామ త్రయస్త్రింశోఽధ్యాయః.

---

చతుస్త్రింశోఽధ్యాయః.

దూతః.—ధర్మమూల మహాంబీజం వైకుంఠచరణాచ్చ్యుతమ్, ధృతంమూర్ధ్ని మహేశేన యద్గాంగ మమలం జలమ్. తద్బ్రహ్మైవ నసందేహో నిర్గుణం ప్రకృతేఃపరమ్, తేనకింసమతాంగచ్ఛేదపి బ్రహ్మాండగోళకే

---

స్నానముచేసి ఆగంగయందలి జలముచేత పరిశుద్ధుడై నరకమును పొందడు. చాంద్రాయణాదివ్రతములు భూదానము మొదలగుదానములు తపస్సులు యజ్ఞములు పావనమయిన యితరక్రియలును గంగయందలి ఒకనీటిబొట్టుచేతతడియుటతో సమానములు కావనిచెప్పుదురు. ఓవైశ్యుడా! ఏనీచజనుడు గంగానదిని ఇతరతీర్థములతో సమానముఅని చెప్పునో వాడు భయంకరమును గొప్పదియు నైన రౌరవమనెడి నరకమును పొందును. ఎవడు ఈ చెప్పబడినదంతయు శ్లాఘించుటగాని ఇతరముకాదు. ఇది పురాణముకాదా, అని యిట్లు అలక్ష్యముగామాటలాడునో వాడు భయంకరమయిన రౌరవముఅనెడి నరకమునందు ఇరువదియొక్కతరములవారితోడ తపింపజేయబడును.

ఇది శ్రీపద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు వికుండల కింకర సంవాదరూపమయిన ముప్పదిమూడవ అధ్యాయకథ.

---

ముప్పదినాలవ అధ్యాయము.

దూతమాటలు.—ధర్మమునకు ఆధారమయినదియు తీర్థములకెల్లను మూలకారణమయినదియు విష్ణుదేవుని పాదమునందుండి వెడలినదియు మహాదేవుడైన శివునిచేత శిరస్సునందు ధరింపబడినదియు నిర్మలమయినదియు నైనగంగానదియందలి జలము ప్రకృతికంటె ఇతరమును గుణరహితము నైన బ్రహ్మమే అగును. అందులకు సందేహములేదు. కనుక గోళాకారమయిన యీబ్రహ్మాండమునందు దానికి సమానమగు తీర్థము ఏదియు

గంగాగంగేతి యోబ్రూయాద్యోజనానాం శతైరపి, ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి. నాత్రకిందహ్యతే పాపం గంగాయాం మజ్జతో నృప, గంగాంభసి ప్రయత్నేన స్నాతవ్యం తేన మానవైః. ప్రతిగ్రహాన్నివృత్తో యః ప్రతిగ్రహక్షమోపిసః, సద్విజో ద్యోతతే వైశ్య కామరూపశ్చరన్దివి. యమలోకం న పశ్యంతి ప్రాణాయామపరాయణాః, అపి దుష్కృతకర్మాణః తపసా హతకిల్బిషాః. దివసేదివసే వైశ్య ప్రాణాయామాంస్తు షోడశ, భ్రూణఘ్నమపి షణ్మాసాత్ పునంత్యహరహః కృతాః. తపాంసి యాని తప్యంతే వ్రతాని నియమానిచ, గోసహస్రప్రదానంచ ప్రాణాయామస్తు తత్సమః. అబ్బిందుయః కుశాగ్రేణ మాసేమాసేతు యఃపిబేత్, సంవత్సరశతం సాగ్రం ప్రాణాయామస్తు తత్సమః. యస్తు వర్షశతం ధత్తే లలాటే గోపిచందనమ్, శిఖాయాం తులసీం చైవ ప్రాణాయామస్తు తత్సమః. పాతకంతు మహద్యచ్చ తథాక్షుద్రోపపాతకమ్, ప్రాణాయామైః క్షణాత్సర్వం భస్మసాత్స్యాద్ద్విశాంవర. మాతృవత్పరదారాన్ యే సంపశ్యంతి నరోత్తమాః, న తేయాంతి విశాంశ్రేష్ఠ కదాచి

---

కాదు. నూరామడ దూరమునందుండియైనను గంగ గంగయని గంగనుతలచునట్టివాడు ఎల్లపాపములవలనను విడువబడినవాడై విష్ణులోకమును పొందును. ఈగంగయందుస్నానముచేయువాని పాపములు అన్నియుం కాలిపోవును. కనుక గంగయందలినీళ్లలో మనుష్యులు ప్రయత్నపూర్వకముగా స్నానముచేయదగును. దానముపుచ్చుకొనజాలినవాడుగా ఉండియుం దానములు పుచ్చుకొనివాడు ఎవడో అట్టిబ్రాహ్మణుడు స్వర్గమున ఇచ్ఛవచ్చిన రూపమును పొంది చరించుచు వెలుగును. ప్రాణాయామము చేయుటయందు ఆసక్తులగువారు పాపకర్మములను చేసినవారయినను తపస్సుచేత పాపములను బాపుకొన్నవారై యమలోకమును కనఁజాలరు. ప్రతిదినమును పదియారుమారులు ప్రాణాయామము చేసినవాడు తల్లికడుపులోనుండు బిడ్డను చంపినవాడైనను ఆరునెలలలో పరిశుద్ధుడు అగును. ప్రతిదినము చేయబడిన తపస్సులు వ్రతములు ఇంకనుగలఒక్కప్రొద్దులు మొదలగునియమములు వేయిగోదానములును ఐన ప్రాణాయామములో సమానములుకావు. నెలకు ఒకసారి దర్భకొనవలన పడునట్టి ఒకజలబిందువును త్రాగి నూఱుసంవత్సరములు కడచునంతవఱకు నుండి నడపునట్టి వ్రతము ఒకప్రాణాయామముతో సమానము అగును. నూఱుసంవత్సరములు నొసట గోపిచందనమును సిగనుతులసీదళమును ధరించుట ఒకప్రాణాయామముతో సమానము అగును. మహాపాతకములు అల్పపాతకములు ఉపపాతకములు అనబడునవి యేవికలవో అవి అన్నియుం ప్రాణాయామములచేత తత్క్షణమే భస్మమయి పోవును. ఏపురుషశ్రేష్ఠులు ఇతరులభార్యలను తమతల్లులనుజూచినట్టు చూతురో

ద్యమయాతనామ్. మనసాపి పరేషాంయః కళత్రాణి న సేవతే, సహిలోక ద్వయేపూజ్య స్తేన వైశ్య ధృతాదరా తస్మా ద్ధర్మరతై స్త్యాజాః పరదారాస్తు సర్వదా, నయంతి పరదారాస్తా న్నరకా నేకవింశతీః. నజాతు కురుతేయేషాం పరద్రవ్యేషుమానసమ్, తేయాన్తి విష్ణులోకంహి నయామంవైశ్యసత్తమ.సంధ్యామఠే దేవగృహే పురాణపఠనం సదా, కారయంతిచ కుర్వంతి నతేయాంతి యమాలయమ్. సత్సుక్రోధనిదానేషు నక్రోధేన నయుజ్యతే, జితనాక స్సమంతవ్యః పురుషో క్రోధనోభువి. మాతరం పితరం పుత్ర స్త్వారాధయతిదేవవత్, యఃప్రాప్తేవార్ధకేకాలే సనయాతి యమాలయమ్. పితురాధిక్యభావేన యేర్చయంతి గురుం నరాః, భవత్యతిథయస్తే వై బ్రహ్మలోకే విశాంవర. జయంతి యస్త్రియో ధన్యాః శీలస్యపరిరక్షణాత్, శీలభంగేన నారీణాం యమలోకస్సుదారుణః శీలం రక్ష్యం సదాస్త్రీభిః దుష్టసంగవివర్జనాత్, శీలంచపరమంస్వర్గం స్త్రీణాం వైశ్య నసంశయః. శూద్రస్యపాకయజ్ఞేన సిద్ధేశకరణేనచ, స్వర్గచ్యుతిర్ద్విజా

---

వారు ఒకానొకప్పుడైనను యమునివలనియాతనలను పొందరు. మనసుచేతనయినను యితరులభార్యలను తలపనివాడు ఎవడో ఆపుణ్యపురుషుడు ఇహపరలోకములురెంటియందును పూజ్యుడగు. కాబట్టి ధర్మమునందు అక్కరగలవారు ఎల్లప్పుడును అన్యులభార్యలను విడువదగినవారు. అట్లుగాక పరభార్యలనుపొందునట్టిదుర్జనులు ఇరువదియొకటియగు మహానరకములను అనుభవింతురు. ఎవరు పరులధనమునందు ఎప్పుడును మనసుపెట్టరో వారువిష్ణులోకమును పొందుదురుగాని యమలోకమునుపొందరు. ఎవరు ప్రతిదినమునందును సాయంకాలమునందు మఠము దేవళము వీనియందు పురాణముచెప్పింతురో లేక చెప్పుదురో వారు యమలోకమునుపొందరు. కోపమునకుస్థానభూతులైనను పెద్దలయందు ఎవడు కోపములేక మెలగునో వాడుస్వర్గమును గెలిచినవాడును కోపములేనివాడును అని యెంచదగినవాడు. ముసలితనము పొందిన తల్లిదండ్రులను ఎవడు దేవుని పూజించినట్టు పూజించునోవాడు యమలోకమునుపొందడు. గురువునుతమతండ్రికంటె హెచ్చుగానెంచి పూజించునట్టి ఉత్తములుఎవరో వారుబ్రహ్మలోకమును పొందుదురు. ఏస్త్రీలు శీలమును కాపాడుకొనుటచేత కృతార్థులగుదురో వారుమేలు పొందుదురు. శీలమునుచెరుచుకొనునట్టిస్త్రీలు మిక్కిలిభయంకరమైన యమలోకమునుపొందుదురు. కనుక స్త్రీలు ఎప్పుడునుదుష్టసహవాసముచేయక శీలమునురక్షించుకోవలసినది. స్త్రీలకు శీలమే సర్వోత్కృష్టమయిన స్వర్గము అగును. అందులకుసందేహములేదు. శూద్రునిద్రవ్యమువలన వైశ్వదేవము మొదలగుపాకయజ్ఞములను చేయుటచేతను బ్రాహ్మణునికి స్వర్గమువలని

విహితా తస్యాధో నారకీగతిః. విచారయంతి యే శాస్త్రం వేదాభ్యాసరతా శ్చయే, పురాణసంహితాం యేచ శ్రావయంతి పఠంతిచ వ్యాకుర్వంతి స్మృతిం యేచ యే తే ధర్మప్రబోధితాః, వేదాంతేతుచ నిష్ఠా యే తైరియం జగతీధృతా. తత్తదభ్యాసమాహాత్మ్యా త్సర్వే తేహతకిల్బిషాః, గచ్ఛంతి బ్రహ్మణో లోకం యత్ర మోహో నవిద్యతే. జ్ఞానమజ్ఞాయ యోదద్యా ద్వేదశాస్త్రసముద్భవమ్, అపి దేవా స్తమర్చంతి భవబంధవిదారకమ్. శ్రూయతామద్భుతం హ్యేత ద్రహస్యం వైశ్యసత్తమ, సమ్మతం ధర్మరాజ స్య సర్వలోకామృతప్రదమ్. నయమం యమలోకంచ నదూతాన్ ఘోరదర్శనాన్, పశ్యంతి వైష్ణవాః క్వాపి సత్యం సత్యం వదామ్యహమ్ ప్రాహ తాన్యమునాభాషితా సాదరేణ పునఃపునః, భవద్భి ర్వైష్ణవాస్త్యాజ్యాః నతేస్యుర్మమగోచరాః. యేస్మరంతి సకృద్భూతాః ప్రసంగేనాపి కేశవమ్, తేపి ధ్వస్తాఖిలాఘౌఘాః యాంతి విష్ణోః పరంపదమ్. దురాచారః కృతఘ్నోవా మహాపాపరతోపివా, భవద్భి స్సర్వదా త్యాజ్యః విష్ణుం

దిగుపాటు కలుగుటయేగాక అధోలోకమునందు నరకబాధలును కలుగును. శాస్త్రవిచారము చేయుచుండువారును వేదమును చదువుటయందు అక్కరగలవారును పురాణములను చెప్పునట్టివారును పురాణములను చదువునట్టివారును ధర్మశాస్త్రార్థములను తెలియజేయుచుండువారును ధర్మములను తెలియజేయుచుండువారును వేదాంతనిష్ఠగలవారును అగువారు ఎవరో అట్టి మహానుభావులచేత ఈభూమినిలుపబడియున్నది. ఈ చెప్పబడినవారందరును ఆయాశాస్త్రములను నేర్చిన మహిమమువలన పాపములేనివారై పాపములేనిదైన బ్రహ్మలోకమునుపొందుదురు. ఎవడు ఏమి తెలియనిమూఢునికి వేదశాస్త్రములవలని తెలివినిగలుగజేయునో అటువంటి జన్మబంధములను విడిపించువాడైనపుణ్యపురుషుని దేవతలుగూడ పూజింతురు. ఓవైశ్యోత్తమా! వింతయయినదియు యమధర్మరాజునకు సమ్మతమయినదియు ఎల్లలోకములకు చావులేమిని ఇచ్చునదియు నైనరహస్య మొకటికలదు. దానిని చెప్పెదనువినుము. విష్ణుభక్తులు అగువారు ఎవరు అయినను యముని యమలోకమును భయముపుట్టించుచు కానవచ్చెడి యమదూతలను చూడరు. ఇదిముమ్మాటికి నిజము అని నేనుచెప్పితిని. ఇదిగాక యమధర్మరాజు తనభటులనుజూచి, ఓభటులార! విష్ణుభక్తులగువారు నాదండనకు తగినవారుకారుగనుక మీరు వారిని విడిచిపెట్టవలసినది. అని మాటిమాటికి అక్కరతో చెప్పును. మఱియు, ఓదూతలారా! ప్రసంగవశముచేత ఒకానొకప్పుడు శ్రీవిష్ణుదేవుని తలచినవారును ఎల్లపాపములును నశింపగా విష్ణులోకమును పొందుదురు. దురాచారుడయినను ఒకరు చేసినమేలు మరచువాడయినను గొప్పపాపములను చేయుటయందు ఆసక్తుడయినను విష్ణుసేవచేయువాడయినయెడల సర్వవిధములను

చేద్భజతే నరః. వైష్ణవో యద్గృహే భుఙ్క్తే యేషాం వైష్ణవసంగతిః, తేపివః పరిహార్యాస్స్యుః సత్సంగహతకిల్బిషాః. ఇతి వైశ్యానుశాస్యాస్మాన్, యమో దండధరస్సదా, అతో న వైష్ణవా యాంతి రాజధానీం యమస్య వై. విష్ణుభక్తిం వినాన్యేషాం పాపిష్ఠానాం విశాంవర, ఉపాయో నాస్తి నాస్త్యన్యః సంతర్తుం నరకార్ణవమ్. శ్వపాకమివ నేక్షంతే లోకా విప్రమవైష్ణవమ్, వైష్ణవో వర్ణహీనోఽపి పునాతి భువనత్రయమ్. ఏతావతాలమఘనిర్హరణాయ పుంసాం సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్, ఆక్రుశ్య పుత్రమఘవాన్యదజామిళోపి నారయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తిమ్. నరకేపి చిరం మగ్నాః పూర్వజా యే కులోద్భవాః, తథైవ యాంతి తే స్వర్గం యథార్చతి సుతో హరిమ్. విష్ణుదాసస్య దాసా యే వైష్ణవాన్నభుజశ్చ యే, తేపి క్రతుభుజాం వైశ్య గతిం యాంతి నిరాకులామ్. ప్రార్థయేద్వైష్ణవస్యాన్నం ప్రయత్నేన విచక్షణః, సర్వపాపవిశు

---

మీరు వదలిపెట్టవలసినది. ఎవనియింట వైష్ణవుడు భోజనము చేయునో ఎవరికి వైష్ణవులతోడి సహవాసము కలదో వాడును వారును సత్పురుషసహవాసముచేత పాపములను పోగొట్టుకొనువారు అగుదురు. కనుక అట్టివారిని మీరు ముట్టవలదు అని యీవిధముగా దండమును ధరించినవాడగు యముడు దూతలమగువారికి సెలవిచ్చుచు ఉండును. ఓ వైశ్యశ్రేష్ఠుడా! ఆ కారణముచేత విష్ణుభక్తులు యమపట్టణమును పొందరు. పాపాత్ములగు జనులకు నరకమనెడి సముద్రమును దాటుటకు విష్ణుసేవకంటె ఇతరమయిన యుపాయము కానము. విష్ణుభక్తుడు కాని బ్రాహ్మణుని కుక్కమాంసము వండితినెడి చండాలునివలె నెంచి జనులు కన్నులనైన చూడరు. విష్ణుభక్తుడగువాడు తక్కువకులమునందు బుట్టినవాడైనను మూడులోకములను పరిశుద్ధము చేయువాడగును. పాపాత్ముడయిన అజామిళుడుకూడ కొడుకును పిలుచునెపముచేత నారాయణనారాయణ అని మొరపెట్టుచు చచ్చి మోక్షమును పొందెను. కాబట్టి మానవులు తమపాపములు తొలగుటకై భగవంతుని గుణములను కార్యములను నామములను కొనియాడవలెను. ఎవడైన నొకడు విష్ణుదేవుని అర్చించినపక్షమున చిరకాలము నరకములయందు మునిగియున్నవాని పూర్వీకులు అందరును వాని వంశమునందు బుట్టిన కారణమున స్వర్గమును బొందుదురు. ఎవరు విష్ణుభక్తులో ఎవరు విష్ణుభక్తులు పెట్టిన పరిశుద్ధాన్నమును భుజింతురో వారు అందరును త్రొక్కుటలేక దేవతలలోకమును పొందుదురు. తెలివిపరుడగువాడు ఎల్లపాపములవలనను పరిశుద్ధుడగుటకు ప్రయత్నపూర్వకముగా విష్ణుభక్తుని చేతియన్నమును ప్రార్థించి తెచ్చుకొనవలెను. అది దొరకనియెడ నీళ్లుత్రాగి యూరక యుండవలసినది. ఎక్కడనయినగాని గోవింద

ద్ధ్యర్థం తదభావే జలంపిబేత్. గోవిందేతిజపన్ యత్ర కుత్రచిన్మ్రియతే
యది, సనరో నయముంపశ్యే త్తంచనేక్షామహే వయమ్. సాంగంసము
ద్రం సన్యాసం సర్షిచ్ఛంధోధిదైవతమ్, సదీక్షావిధివద్ధ్యానసంయుతం
ద్వాదశాక్షరమ్. అష్టాక్షరంచ మంత్రేశం యే జపంతి నరోత్తమాః, తా
న్దృష్ట్వా బ్రహ్మహా శుద్ధ్యే త్కింపునర్వైష్ణవస్స్వయమ్. శంఖనశ్చక్రిణో
భూత్వా బ్రాహ్మణా వనమాలినః, వసంతి వైష్ణవో లోకే విష్ణురూపేణ
తేనరాః. హృదిసూర్యేజలేవాథ ప్రతిమాస్థండిలేషుచ, సమభ్యర్చ్య హ
రింయాంతి నరాస్తే వైష్ణవంపదమ్. అతస్సర్వాత్మనా పూజ్యో వాసుదే
వో ముముక్షుభిః, సాలగ్రామశిలాచక్రే వజ్రకీటవినిర్మితే, అధిష్ఠానంచత
ద్విష్ణోః సర్వపాపప్రణాశనమ్, సర్వపుణ్యప్రదం వైశ్య సర్వేషామపి
ముక్తిదమ్. యఃపూజయేద్ధరిం చక్రే సాలగ్రామసమన్వితే, రాజసూయ
సహస్రైశ్చ తైరిష్టైః కింప్రయోజనమ్. యన్నామనంతి వేదాంతాః బ్రహ్మ

---

గోవిందయని పలుకుచు ప్రాణమువిడిచిన మానవుడు మమ్మును మాయేలినవాడగు యముని
జూడడు. ఆగమోక్తమయిన అంగముతో గూడినదియు జ్ఞానముద్రతో గూడినదియు అంగ
న్యాసాదులతోను ఋషిఛందదైవములతోను గూడినదియు దీక్షావిధానముతోడి ధ్యాన
ముతో గూడినదియునైన ద్వాదశాక్షరమంత్రమును మంత్రరాజమైన అష్టాక్షరమంత్ర
మును ఏజనులుజపింతురో ఆట్టిపుణ్యపురుషులనుజూచి బ్రహ్మహత్యచేసినవాడును పరిశుద్ధు
డు అగును. ఇక ఆట్టివైష్ణవుడు పరిశుద్ధుడని చెప్పవలసినది ఏమున్నది. ఏబ్రాహ్మణులు శంఖ
చక్రములనువనమాలనుధరింతురో వారు విష్ణురూపముతో విష్ణులోకమునందు ఉందురు.
ఏజనులు మనసునందుగాని సూర్యునియందుగాని నీళ్లయందుగాని ప్రతిమయందుగాని
అగ్నిహోత్రముచేయుటకైశుద్ధి చేసినస్థలమునందుగాని విష్ణుని ఆవాహనచేసిపూజింతురో
వారు వైష్ణవమైన పరమపదమును పొందుదురు. కాబట్టి సర్వవిధములచేతను మోక్షము
నందు ఇచ్ఛగలవారు విష్ణుదేవుని పూజింపవలసినది. వజ్రకీటముఅనుపురుగుచేత చేయబడి
నదియు విష్ణువునకు నెలవైనదియు ఎల్లపాపములను 'నశింపజేయునదియు ఎల్లపుణ్యము
లను ఇచ్చునదియు ఎల్లవారికి మోక్షము నిచ్చునదియునైన సాలగ్రామచక్రముతోగూ
డిన విష్ణుమూర్తిని ఎవడు పూజించునో వాడు రాజసూయము మొదలగు అనేకయాగ
ములను చేయనక్కరలేదు. ఆయాగములవలని ఫలమును మించినఫలము సాలగ్రామచక్ర
ముతోగూడినవిష్ణుమూర్తిపూజచేతనే కలుగును. ఎవనిని వేదాంతములు మోక్షస్వరూపు

నిర్వాణమచ్యుతమ్ తత్ప్రసాదోభవేన్నృణాంసాలగ్రామశిలార్చనాత్, సర్వకాష్ఠగతో వహ్నిర్మంథనేన ప్రకాశతే. యథాతథాహరిశ్చాపి సాలగ్రామే ప్రకాశతే, అపి పాపసమాచారాః కర్మణ్యనధికారిణః. సాలగ్రామార్చనాద్వైశ్య నైవ యాంతి యమాలయమ్, న తథా రమతే లక్ష్మీః న తథా స్వపురేహరిః. సాలగ్రామశిలాచక్రే యథోపరమతే తథా; అగ్నిహోత్రం హుతం తేన దత్తా పృథ్వీ ససాగరా. యేనార్చితో హరిశ్చక్రే సాలగ్రామశిలోద్భవే, శిలాద్వాదశ భో వైశ్య సాలగ్రామ శిలోద్భవాః. విధివత్పూజితా యేన తస్యపుణ్యఫలం శృణు, కోటిద్వాదశలింగైస్తు పూజితైః స్వర్ణపంకజైః. యస్య ద్వాదశకల్పేషు దినేనైకేనతత్ఫలమ్, యఃపునఃపూజయేద్భక్త్యా సాలగ్రామశిలాం నరః. ఉషిత్వా స హరేర్లోకే చక్రవర్తీహ జాయతే, కామైఃక్రోధైశ్చలోభైశ్చవ్యాప్తాయే ఉత్రనరాధమాః తేఽపి యాంతి హరేర్లోకం సాలగ్రామశిలార్చనాత్, యఃపూజయతి గోవిదం సాలగ్రామేసదానరః. ఆభూతసంప్లవంయావత్స

---

డయిన పరబ్రహ్మమని ప్రతిపాదించునో ఆవిష్ణుదేవుని యనుగ్రహము సాలగ్రామమును ఆరాధించుటవలన గలుగును. ఎల్లకట్టెలయందు ఉండెడి అగ్ని తరచుటచేత ఎట్లు వెలుగునో అట్లు సాలగ్రామమునందలి అర్చనము చేత విష్ణుదేవుడు వెలుగొందును. పాపకృత్యములు చేయువారైనను సత్కర్మలయందు నియమించుటకు అర్హులు కాని వారైనను సాలగ్రామమును అర్చించుటవలన యమాలయమును పొందరు. లక్ష్మీ నారాయణులు సాలగ్రామశిలాచక్రమునందు వసించునట్లు శ్రీవైకుంఠపురమునందుగూడ వసింపరు. ఎవడు భక్తిగలవాడై సాలగ్రామశిలాచక్రమునందు వర్తించెడి శ్రీహరినిపూజించునో వాడు అగ్నికార్యములు తప్పక నడపుటవలనను సముద్రపర్యంతమైన సమస్తభూమిని దానము చేయుటవలనను పొందగలఫలమును పొందును. ఓవైశ్యుడా! సాలగ్రామశిలలు పండ్రెండు భేదములు గలవైయుండును. అట్టి సాలగ్రామశిలలయందు అవతరించిన విష్ణుమూర్తిని ఆగమోక్తప్రకారముగాపూజించువారు పొందెడిఫలమును చెప్పెదనువినుము. పండ్రెండు కల్పములకాలము ప్రతిదినమునుపండ్రెండుకోట్ల శివలింగములను బంగారుకమలములచేతపూజించుటవలన ఎంతపుణ్యము కలుగునో అంతపుణ్యము ఒకనాటి సాలగ్రామపూజవలననే కలుగును. భక్తియుక్తుడై సాలగ్రామశిలయందలి విష్ణుమూర్తిని పూజించువాడు ఎవడో వాడు శ్రీహరిలోకమునందు చిరకాలమువసించి పిమ్మట ఈలోకమునందు చక్రవర్తిగా పుట్టును. ఈలోకమునందు కామము క్రోధము లోభము ఈదుర్గుణములు గలిగిన నీచమానవులయినను సాలగ్రామ పూజవలన విష్ణులోకమును పొందుదురు. సాలగ్రామమునందు ఆసహిం

నప్రచ్యవతేదివః, వినాతీర్థైర్వినాయజ్ఞై ర్వినాదానై ర్వినామతిమ్. ముక్తిం
యాతినరో వైశ్య సాలగ్రామశిలార్చనాత్, నరకంగర్భవాసంచ తిర్యగ్యో
నిషుజన్మతామ్. నయాతివైశ్యపాపోఽపి సాలగ్రామశిలార్చకః, దీక్షావిధా
నం మంత్రజ్ఞ శ్చక్రే యో విష్ణుమావహేత్. సయాతి వైష్ణవంధామ స
త్యంసత్యం మయోదితమ్, సస్నాతస్సర్వతీర్థేషుసర్వయజ్ఞేషుదీక్షితః. సా
లగ్రామశిలాతోయైరభిషేకంసమాచరేత్, గంగాగోదావరీరేవానద్యో
ముక్తిప్రదాశ్చయాః. నివసంతి హితాస్సర్వాః సాలగ్రామశిలాజలే, నై
వేద్యైర్వివిధైః పుష్పైః ధూపదీపైర్విలేపనైః. గీతవాదిత్రస్తోత్రాద్యైః
సాలగ్రామ శిలార్చనమ్, కురుతే మానవో యస్తు హరౌ భక్తిపరా
యణః. కల్పకోటి సహస్రాణి రమతే విష్ణుసన్నిధౌ, లింగైస్తు కోటిభి
ర్దృష్టైర్యత్ఫలంపూజితైస్స్తుతైః. సాలగ్రామశిలాయాస్తు హ్యేకేనాపిహి
తత్ఫలమ్, సాలగ్రామశిలారూపీ యత్ర తిష్ఠతి కేశవః. తత్ర దేవాసురా

---

చిన విష్ణుమూర్తిని ఎల్లప్పుడు పూజించుమనుష్యుడు ప్రళయావసానముదాక స్వర్గము
నందు చలింపకవసించును. తీర్థయాత్రలు యజ్ఞములు దానములు లేకున్నను మంచిబుద్ధి
లేకున్నను సాలగ్రామశిలను అర్చించుటవలన నరుడు మోక్షమునుపొందును. సాలగ్రామ
శిలను అర్చించునట్టివాడు పాపుడైనను నరకమునుపొందడు. తల్లిగర్భమునందలి దుఃఖము
ను పొందడు. అనగాపునర్జన్మమునుపొందడు. పశుపక్షి మొదలగునవిగాను పుట్టడు.
మంత్రమును తెలిసినవాడై దీక్షావిధానమున విష్ణుదేవుని సాలగ్రామ శిలాచక్రమునందు
ఆవాహనము చేయునట్టి మానవుడు విష్ణులోకమును పొందును. ముమ్మాటికి ఇది నిజము.
గంగ గోదావరి నర్మద మొదలగు తమజలములలో మునిగినప్పుడే మోక్షమునిచ్చెడి
నదులయందలి పావనజలములన్నియు సాలగ్రామశిలాభిషేకము చేసిన జలమునందు
ఉండును. కనుక సాలగ్రామతీర్థమును తలపై చల్లుకొన్నవాడు ఎల్లతీర్థములయందును
స్నానముచేసినవాడును ఎల్లయజ్ఞములయందు దీక్షనువహించినవాడును అగును. విష్ణు
దేవునియందలి భక్తితో నానావిధములైన నైవేద్యములచేతను పువ్వులచేతను ధూపము
దీపము చందనము మొదలగువానిచేతను సంగీతము, వాద్యము స్తోత్రము మొదలగువాని
చేతను సాలగ్రామమును అర్చించునట్టిజనుడు ఎవడో వాడు కోటికల్పముల కాలము
విష్ణుదేవుని సన్నిధియందు వసించును. కోటిలింగముల దర్శనము చేయుటయు పూజించు
టయు పొగడుటయు ఎంతటిఫలమును ఇచ్చునో అంతటిఫలమును ఒకసారి చేయబడిన
సాలగ్రామపూజచేత కలుగును.సాలగ్రామ శిలారూపమున విష్ణుమూర్తి యెక్కడ వసించి

యత్రైః భువనానిచతుర్దశ, సాలగ్రామశిలాగ్రేతు యశ్శ్రాద్ధం కురుతే నరః. పితరస్తస్య తిష్ఠంతి తృప్తాః కల్పశతం దివి, యే పిబంతి నరానిత్యం సాలగ్రామశిలాజలమ్ పంచగవ్య సహస్రైస్తు ప్రాశితం కిం ప్రయోజనమ్, సాలగ్రామశిలాయత్ర తత్తీర్థం యోజనత్రయమ్. తత్రదానంచ హోమశ్చ సర్వం కోటిగుణం భవేత్, సాలగ్రామశిలాతోయం యః పిబేద్బిందుమాత్రకమ్. మాతుస్తన్యంతు న పిబేత్సపునర్ముక్తిభాఙ్నరః, సాలగ్రామసమీపేతు క్రోశమాత్రం సమంతతః. కీటకోఽపిమృతోయాతి వైష్ణవం భవనంపరమ్, సాలగ్రామశిలాచక్రం యోదద్యాద్దానముత్తమమ్. భూచక్రం తేనదత్తం స్యాత్సశైలవనకాననమ్, సాలగ్రామశిలాయాస్తు మూల్యముత్పాదయేన్నరః. విక్రీతాచానుమంతాచ యఃపరీక్షానుమోదతే, సర్వే తేనరకంయాంతియావదాభూతసంప్లవమ్. అతస్తం వర్జయేద్వైశ్య చక్రస్య క్రయవిక్రయమ్, బహునోక్తేనకింవైశ్య కర్తవ్యం పాపభీరుణా. స్మరణం వాసుదేవస్య సర్వపాపహరంపరమ్, తప

---

యుండునో అక్కడ దేవతలును అసురులును యక్షులును పదునాల్గులోకములును ఉండును. సాలగ్రామము నెదుట ఎవడు శ్రాద్ధముచేయునో వానిపితరులు తృప్తినొందినవారై స్వర్గమునందు నూరుకల్పములు వాసము చేయుందురు. సాలగ్రామతీర్థమును ఏజనులు ప్రతిదినమును తప్పక పుచ్చుకొనుదురో వారికి బహుపర్యాయములు పంచగవ్యములను పుచ్చుకొనవలసినప్రయోజనములేదు. సాలగ్రామతీర్థము తానున్నతావునకు చుట్టును మూడామడదూరము వరకు గలవానిని పరిశుద్ధములనుగా చేయును. ఆపరిశుద్ధస్థానమునందు చేయబడు దానములు హోమములు ఇవి యన్నియును కోటియంతఫలమునిచ్చునవి అగును. సాలగ్రామతీర్థము ఒకచుక్క పుచ్చుకొన్నను మనుష్యుడు మరల తల్లి చను బాలుత్రాగువాడు కానేరడు. సాలగ్రామము ఉండుచోటికి కోసెడు దూరమునందుండెడి పురుగు చచ్చినను విష్ణులోకమును పొందును. ఎల్లదానములలోను ఉత్తమమయిన సాలగ్రామదానమును ఎవడు చేయునో వాడు పర్వతములతోను తోపులతోను అడవులతోనుగూడిన భూమండలదానము చేసినఫలమును పొందును. సాలగ్రామమునకు వెలయేర్పరచువాడును అమ్మెడువాడును వెలనుగూర్చి ఇది యింతయుండునని యూహించువాడును పరీక్షచే సంతోషించువాడును అగువారందరును ఎప్పటికి ఎల్లప్రాణులును లయమునుపొందునో అప్పటిదాక నరకమునందు వసింతురు. కాబట్టి సాలగ్రామమును కొనను అమ్మనుకూడదు. ఓ వైశ్యుడా! పలుమాటలేల పాపమునకు వెరచువాడు ఎల్లపాపములను పోగొట్టునదియు సర్వోత్కృష్టమయినదియు నయిన హరినామస్మరణమును చేయ

స్తప్త్వా నరోఘోర మరణ్యే నిర్జితేంద్రియః. యత్ఫలం సమవాప్నోతి తంనత్వా గరుడధ్వజమ్, కృత్వాపి బహుశఃపాపం నరో మోహాసమన్వితః. నయాతి నరకం నత్వా సర్వపాపహరం హరిమ్, పృథివ్యాం యానితీర్థాని పుణ్యా న్యాయతనానిచ. తానిసర్వా ణ్యవాప్నోతి విష్ణోర్నామానుకీర్తనాత్, దేవం శార్ఙ్గధరం విష్ణుం యేప్రపన్నాః పరాయణమ్. న తేషాంయమసాలోక్యం నతేహినరకౌకసః, వైష్ణవః పురుషోవైశ్య శివనిందాం కరోతియః. న విందే ద్వైష్ణవం లోకం సయాతి నరకం ధ్రువమ్, ఉపోష్యైకాదశీ మేకాం ప్రసంగేనాపి మానవః. న యాతి యాతనాం యామీంమితినోయముతశ్శ్రితమ్, నేదృశంపాతకంకించి త్త్రిషులోకేషు విద్యతే. ఉభయం పద్మనాభస్య దినం పాతకనాశకమ్, తావత్పాపానిదేహేస్మిన్ వసంతి హి విశాంవర. యావన్నోపవసేజ్జంతుః పద్మనాభదినం శుభమ్, అశ్వమేధసహస్రాణి వాజపేయశతానిచ. ఏకాదశ్యుపవాసేన

---

వలసినది. మనుష్యుడు ఇంద్రియనిగ్రహముగలవాడై భయంకరమైన అడవియందు తపస్సుచేసి ఏఫలమును పొందునో ఆఫలమును విష్ణుమూర్తికి మ్రొక్కి పొందగలడు. అజ్ఞానమువలన అనేక పాపములనుచేసిన మనుష్యుడయినను ఎల్లపాపములను హరించువాడైన విష్ణుమూర్తిగురించి మ్రొక్కినయెడ నరకమునుపొందడు. భూమియందు తీర్థములను దేవాలయములను ఎన్నికలవో అన్నిటియందును స్నానములు దేవతారాధనములును చేసినంతటిఫలమును విష్ణునామసంకీర్తనముచేతనే మానవుడు పొందును. శార్ఙ్గమనెడిధనుస్సును ధరించినవాడయిన విష్ణుమూర్తిని ఏప్రపత్తినిష్ఠులు ఆశ్రయింతురో వారికి యమలోకమును నరకమునందు ఉనికియు కలుగవు. విష్ణుభక్తుడైన శివునినిందించువాడెవడో వాడు విష్ణులోకమును పొందకపోవుటయేగాక శాశ్వతమయిన నరకమును పొందును. ఓవైశ్యోత్తమా! ఒకానొకప్పుడు యమధర్మరాజు మాకుచెప్పిన విశేషమొకటి కలదు. అదియేమియనగా, మనుష్యుడగువాడు ముచ్చటలాడునప్పుడు మాటమాత్రము ఒక ఏకాదశినాడు ఉపవాసము చేసెదనని చెప్పినను యమసంబంధమైన యాతనను పొందడు. పాతకములను నాశముచేయునట్టి హరివాసరము రెండుపక్షములయందును వచ్చుచుండగా పరిశుద్ధమైన ఆహరివాసరమునందు ప్రాణియైనవాడు ఎంతకాలము ఉపవాసముచేయకుండునో అంతకాలమువరకు వానిదేహమునందు పాపములు వాసము చేయుచుండును. కనుక ఆట్టి హరివాసరమునందు ఉపవాసము చేయకుండుటవంటిపాపము మూడులోకములయందును కొంచెమయినను కానరాదు. అనేకములయిన అశ్వమేధయాగములను వాజపేయయజ్ఞములను ఏకాదశి ఉపవాసముయొక్క పదియారుభాగ

కలాంనార్హంతి షోడశీమ్. ఏకాదశేంద్రియైః పాపం యత్కృతం పాపమా నవైః. ఏకాదశ్యుపవాసేన తత్సర్వం విలయంవ్రజేత్, ఏకాదశీసమంపుణ్యం కించిల్లోకేనవిద్యతే వ్యాజేనాపికృతంయైస్తు వశంయాంతి నభాస్కరేః, స్వర్గమోక్షప్రదాహ్యేషాం శరీరారోగ్యదాయిని. సుకళత్రప్రదాహ్యేషు జీవత్పుత్రప్రదాయిని, నగంగా నగయా వైశ్య నకాంచీన చపుష్కరమ్. నచాపి వైష్ణవంక్షేత్రం తుల్యంహరిదినేతథా, యమునా చంద్రభాగాచ తుల్యేపుణ్యదినేహరేః. అనాయాసేన యోయత్ర ప్రాప్యతేపరమంపదమ్, రాత్రౌ జాగరణం కృత్వా సముపోష్య హరేర్దినమ్. దశకేపైతృకేపక్షే మాతృకే దశపూర్వజాః, ప్రియాయాదశవైవైశ్య తానుద్ధరతినిశ్చితమ్. తేద్వంద్వ సంగ నిర్ముక్తా నాగారికృత కేతనాః, స్రగ్విణః పీతవాసాశ్చ ప్రయాంతి హరిమందిరమ్. బాలత్వేయౌవనత్వేవా వృద్ధత్వేవా విశాంవర, ఉపోష్యైకాదశీంనైవ యాంతి పాపోఽపి దుర్గతిమ్. ఉపోష్యైతత్త్రిరాత్రాణికృత్వావాతీర్థమజ్జనమ్, దత్వా హేమతిలాం

---

ములలో ఒకభాగమును పోలజాలవు. పదునొకండు ఇంద్రియములచేత చేయబడు పాపములు ఏవిగలవో అవియన్నియుం ఏకాదశి ఉపవాసముచేత నాశమును పొందును ఏకాదశివంటి పుణ్యము నిచ్చునది లోకమునందు ఏదియుం గానము. ఏదో ఒకనిమిత్తమును బట్టి ఏకాదశినాడు ఉపవాసము చేసినను జనులు యమునికి ఆధీనులు కారు. ఈలోకమునందు ఏకాదశి స్వర్గమును మోక్షమును ఇచ్చునదియు శరీరమున రోగములేకుండ చేయునదియు మంచిభార్యను దీర్ఘాయుష్మంతులగు కొడుకులను ఇచ్చునదియు నగును. గంగానదియు గయాక్షేత్రమును కాంచీపట్టణమును పుష్కరక్షేత్రమును ఇంకను భూమియందుగల విష్ణుక్షేత్రములును యమున చంద్రభాగ అనునదులును హరివాసరము అగు ఏకాదశినిపోలజాలవు. ఏకాదశినాడు ఉపవాసముచేసి నాటిరాత్రి జాగారము చేయునట్టిపురుషుఁడు ఆయాసములేకయే పరమపదమును పొందుటయేగాక తనతండ్రివంకను పదితరములవారిని తల్లివంకను పదితరములవారిని పెండ్లామువంకను పదితరములవారిని కృతార్థులను చేయును. ఇది నిశ్చయము. మరియును అటువంటి సుఖదుఃఖాదులచేతను పెండ్లాము బిడ్డలు మొదలగువారి తగులుచేతను విడువబడి గరుడధ్వజములు గలవారును పూలదండలు ధరించినవారును పట్టుపీతాంబరములు కట్టుకొన్నవారును అయి విష్ణులోకమును పొందుదురు. ఓయివైశ్యుఁడా! పసితనమునందుగాని నడితరపు వయసునందుగాని ముసలితనమునందుగాని ఏకాదశినాడు ఉపవాసముచేసినమానవుడు మిక్కిలి పాపాత్ముఁడయినను నరకమును పొందఁడు. చక్కగా నీళ్లయందు దిగిస్నానముచేసి మూఁడు

గాంచ వైశ్యస్వర్యాతిమానవః. తీర్థేస్నాంతినయేవైశ్య నదత్తం కాంచ నంచయైః, నైవత స్తంతపఃకించిత్తేస్యుః సర్వత్రదుఃఖినః సంతుష్య వర్ణ్యతేధర్మః నరకస్యనివారణమ్, అద్రోహస్సర్వభూతేషు వాఙ్మనః కాయ కర్మభిః. ఇంద్రియాణాం నిరోధంచ దానంచ హరిసేవనమ్, వర్ణాశ్రమ క్రియాణాంచ పాలనంవిధివత్సదా. స్వర్గార్థీసర్వదా వైశ్య తపోదానం నకీర్తయేత్, యథాశక్తి తథా దద్యా దాత్మనో హితకామ్యయా. ఉపానచ్ఛత్రవస్త్రాణి అన్నం మూలం ఫలం జలమ్, అవధ్యదివపంకుర్యా ద్దరిద్రోవాపివైశ్యక. ఇహలోకేపరేచైవ నాదత్తముపతిష్ఠతే, దాతారో నైవ పశ్యంతి తాంతాంహి యమయాతనామ్. దీర్ఘాయుషోధనాఢ్యాస్తే భవంతీహాపునఃపునః, కిమత్రబహునోక్తేనయాంత్యధర్మేణదుర్గతిమ్. ఆరోహంతిదివంధర్మై ర్నరాస్సర్వత్రసర్వదా, తస్మాద్బాలత్వమారభ్య కర్తవ్యో ధర్మసంగ్రహః. ఇతితే కథితం సర్వం కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి.

---

ఏకాదసులరాత్రులు ఉపవాసముచేసి బంగారునువ్వులు గోవు వీనినిదానముచేయువాడు స్వర్గమును పొందును. ఎవరు పుణ్యతీర్థములయందు స్నానముచేయరో ఎవరు బంగారు మొదలయినదానములను చేయరో ఎవరు కొంచెమయినను తపస్సుచేయరో అట్టివారు ఇహపరములురెంటను దుఃఖమునే అనుభవింతురు. ఓయివైశ్యుడా! నరకమును తొలగించునట్టి పుణ్యమును ఇక సంగ్రహముగా చెప్పెదనువినుము. వాక్కుచేతను మనస్సుచేతను శరీరముచేతను పనులచేతను ఎల్లప్రాణులకునుకీడుచేయకుండుటయు, ఇంద్రియములనుఅపుటయు, దానములు చేయుటయు, విష్ణువునుసేవించుటయు, వర్ణములయొక్కయు ఆశ్రమములయొక్కయునడవళ్లను ఎల్లప్పుడుశాస్త్రమునందు చెప్పబడినచొప్పున నడపుటయు, స్వర్గమునుకోరినవాడై తాను తపస్సును దానమును శ్లాఘించుకొనకుండుటయు, చెప్పులుగొడుగు వస్త్రము అన్నము గడ్డలు పండ్లు జలము వీనినిదరిద్రుడైననుదినమువ్యర్థముపోకుండ తనమేలునుకోరి శక్తికొలదిని యిచ్చుటయుం గలిగి ప్రవర్తించువారు ఎవరోవారు ఈలోకమునందును పరలోకమునందును ఇయ్యలేదు అనునదిలేక దాతలు అనబడుదురు. అటువంటిదాతలు ఆయాదానములను చేయమివలన గలిగెడుయాతనలను పొందరు. మరియు వారు ఈలోకమునందు మాటిమాటికి దీర్ఘాయుస్సుగలవారును ధనవంతులునుఅయి పుట్టుచుందురు. పలుమాటలేల అధర్మముచేత జనులు దుఃఖమును పొందుదురు. ధర్మముచేత స్వర్గమును పొందుదురు. కాబట్టి చిన్ననాటనుండి ధర్మసంగ్రహమే చేయవలసినది. ఓయి వైశ్యుడా! ఇట్లు సర్వమును నీకు తెలియజెప్పితిని. ఇక నీవు ఏమి వినగోరెదవు అని యూత పలికెను.

వికుండలః. శ్రుత్వా తవవచస్సౌమ్య ప్రసన్నం మమమానసమ్, గంగేవపా
పహాఽభూత పాపహారి సతాం వచః ఉపకర్తుం ప్రియం వక్తుం గుణో నైస
ర్గికస్సతామ్, శీతాంశుః క్రియతే యేన శీతలోఽమృతమండలః. దేవదూత
తతో బ్రూహి కారుణ్యాన్మమ పృచ్ఛతః, నరకాన్నిర్గతస్సద్యో భ్రాతా
మే జాయతే కథమ్ ఇతి తస్య వచశ్శ్రుత్వా దేవదూతోఽజగాద హ, జ్ఞాన
దృష్ట్యా క్షణం ధ్యాత్వా తన్మైత్రీకృతబాంధవః. గతే వైశ్యాష్టమే పుణ్యం
త్వయా జన్మని సంచితమ్, త్వద్భ్రాత్రే దీయతాం శీఘ్రం స్వర్గం తస్య యది
చ్ఛసి వికుండలః. కింతత్పుణ్యం కథం జాతం కింజన్మాహం పురాభవమ్, త
త్సర్వం కథ్యతాం దూత తతో దాస్యామి సత్వరమ్. దూతః. శృణు వైశ్య
ప్రవక్ష్యామి తత్పుణ్యం చ సహేతుకమ్, పురా మధువనే పుణ్యే ఋషిరాసీ
ద్విశాలకః. తపోధ్యయనసంపన్నస్తేజసా బ్రహ్మణా సమః, జజ్ఞిరే తస్య రే
వత్యాం నవపుత్రా గ్రహా ఇవ ధ్రువశ్శశీ బుధస్తారో జ్యోతిష్మానితి పంచ

---

వికుండలునిమాటలు.—ఓమంచివాఁడా! నీమాటలువినఁగా నామనసులోని కలవ
రముతీరినది. సత్పురుషులమాట గంగానదివలె పరిశుద్ధమైనది గనుక ఎల్ల పాపములను
తొలగించునది అగును. సత్పురుషులగువారికి ఒకరికి ఉపకారముచేయుటయు ప్రియము
చెప్పుటయు స్వభావమువలన బుట్టినగుణములు అగును. ఓ దేవదూతా! అమృతబింబ
మయినవాడగు చంద్రునివలె సత్పురుషులు చల్లనివారు. కాబట్టి సత్పురుషుడవైననీవు
నాయందుదయచేసి నేనడుగునట్టి విషయమును నాకు తెలియఁజెప్పుము. నాతోడబుట్టిన
వానికి నరకమునుండి విడుదలయెట్లు అగును. అని యిట్లు వికుండలుడు అడుగగా స్నేహ
మువల్లనైన బంధుత్వముగలవాడగు ఆదూత జ్ఞానదృష్టిచేత క్షణకాలము ధ్యానించి వై
శ్యునితో ఇట్లుపలికెను. ఓ వైశ్యుడా! నీవు నీయన్నకు స్వర్గము కలుగజేయ దలచిన
యెడ కడచిన యెనిమిదవజన్మమునందు సంపాదించిన పుణ్యమును నీయన్నకు శీఘ్ర
ముగా ఇమ్ము. అనిదూతుడుచెప్పగా వికుండలుడు, ఓయిదూతా! ఆపుణ్యమేమి? అది
నాకు ఎట్లుకలిగెను? మునుపటిజన్మమునందు నేను ఏమిజన్మమునెత్తితిని? ఆదియంతయు
చెప్పుము. పిమ్మట శీఘ్రముగానే నాపుణ్యము నాయన్నకు ఇచ్చెదను. అనగా దూత,
ఓ వైశ్యుడా! ఆపుణ్యమును అది కలుగుటకు కారణముచెప్పెదను. వినుము. పూర్వ
కాలమందు పుణ్యముగల మధువనములో విశాలకుడు అను ఋషి యుండెను. అతడు
తపస్సును వేదముచదువుటయు గలవాడు, తేజస్సుచేత బ్రహ్మను పోలినవాఁడు. అతనికి
రేవతి అనుభార్యగలదు. ఆభార్యయందు అతనికినవగ్రహములో అనునట్లు తొమ్మిదిమంది
కొడుకులుపుట్టిరి. వారిలో ధ్రువుడు శశి బుధుడు తారుడు జ్యోతిష్మంతుడు అనువారు

మః, అగ్నిహోత్రప్రియాస్సర్వే గృహధర్మేషు రేమిరే. నిర్మోహో జితమాయశ్చ ధ్యానకాష్ఠో గుణాధికః, ఏతేగృహేవిరక్తాహి చత్వారో ద్విజసూనవః, చతుర్థాశ్రమమాపన్నా స్సర్వకర్మసు నిస్స్పృహాః, గ్రామైకనిరతాస్సర్వే నిస్సంగానిష్పరిగ్రహాః. నిశ్శిఖా నోపవీతాశ్చ సమలోష్టాశ్మకాంచనాః, యేనకేనచిదాచ్ఛన్నాః యేనకేనచిదాశితాః. సాయం గృహస్థితా నిత్యం బ్రహ్మధ్యానపరాయణాః, జితేంద్రియా నిరాహారా శ్శీతవాతసహిష్ణవః. పశ్యంతో విష్ణురూపేణ జగత్సర్వం చరాచరమ్, చరంతి లీలయా పృథ్వీం తేఽన్యోన్యంమౌనమాశ్రితాః నకుర్వంతి క్రియాం కాంచి దణుమాత్రంచ యోగినః, దృష్టజ్ఞానా స్త్వసందేహాః చిద్విచారవిశారదాః. ఏవంతే తవ విప్రస్య పూర్వమష్టమజన్మని, తృషితా మత్స్యదేశేషు పుత్రదారకుటుంబినః. గేహంతావకమాజగ్ము ర్మధ్యాహ్నే క్షుత్పిపాసితాః, వైశ్వదేవాంతరే కాలేత్వయా దృష్టా గృహాం

---

అయిదుగురు ఔపాసనము మొదలగు అగ్నికార్యములు నడపుటయందు ఆసక్తిగలవారై గృహస్థాశ్రమమునందు వర్తించుచుండిరి. నిర్మోహుడు జితమాయుడు ధ్యానకాష్ఠుడు గుణాధికుడు అను వారు నలుగురు గృహమునందు విరక్తిగలవారై నాలవ ఆశ్రమమైనసన్యాసమునుపొంది, ఎల్లకర్మములయందును ఇచ్ఛలేనివారును, ఊరొకనాడుగా తిరుగుచుండువారును, విషయములతోడి కూడిక లేనివారును, ఎవరేమి యిచ్చినను పుచ్చుకొననివారును, శిఖాయజ్ఞోపవీతములు లేనివారును, మంటిపెళ్లరాయి బంగారు అనువాని సమముగా ఎంచువారును, వస్త్రమే కావలెననక కప్పుకొనుటకు తగినది యేదిదొరకునో దానిని కప్పుకొనువారును, దొరకిన ఆహారమును భుజించువారును, మాపటివేళకు ఏదో ఒకయిల్లుచేరువారును, ఎల్లప్పుడు పరబ్రహ్మను ధ్యానించునారును, ఇంద్రియములను గెలిచినవారును, ఆహారములేనివారును, చలిగాలినోర్చువారును, చరాచరరూపమైన యీలోకమంతయు విష్ణుస్వరూపముగా దలచువారునునై ఒకరితో నొకరు మాటలాడుటమాని మౌనముతో వినోదముగా భూసంచారము చేయుచుందురు. మరియు వారు యోగీశ్వరులు చేయు కార్యములను ఒకానొకప్పుడయినను కొంచెమైనను చేయక తత్త్వము తెలిసినవారును ఏవిషయమునందును సందేహములేనివారును జ్ఞానవిచారమునందు సమర్థులునునై తిరుగుచు, ఈజన్మమునకుముందు ఎనిమిదవజన్మమున బ్రాహ్మణుడవై మత్స్యదేశమునందు పెండ్లాము బిడ్డలు మొదలగుకుటుంబజనముతో గూడియున్న నీయింటికిమిక్కిలిఆకలిగొన్నవారును దప్పిగొన్నవారును నై మధ్యాహ్నకాలమునందు వచ్చి నీవువైశ్వదేవముచేసికొన్నవిమ్మట నీయింటిముంగిట నీకు కనబడిరి. అంతట నీవు వారిని

గణే, సగద్గదం సాశ్రునేత్రం సహర్షంచ ససంభ్రమమ్. దండవత్ప్రణిపాతేన బహుమానపురస్సరమ్, ప్రణమ్య చరణౌ స్పృష్ట్వా కృత్వా పాణియుగాంజలిమ్. త్వయాభినందితాస్సర్వే తయాసూనృతయాగిరా, అద్యమే సఫలంజన్మ జీవితం సఫలంచ మే. అద్యవిష్ణుః ప్రసన్నో మే సనాథోఽద్యాపి పావనః, ధన్యోఽస్మి మేగృహంధన్యంధన్యా మేద్యకుటుంబినీ. మమాద్య పితరో ధన్యా ధన్యా గావశ్శ్రితం ధనమ్, యద్దృష్టా భవతాంపాదా తాపత్రయహరౌ మయా. భవతాం దర్శనం యస్మాద్ధన్యోఽస్మీతిహరేరివ, ఏవం సంపూజ్య తేషాంచ చరణక్షాళితోదకమ్. ధృతం మూర్ధ్ని విశాం శ్రేష్ఠ శ్రద్ధయాపరయా ముదా, యతిపాదోదకం వైశ్య హంతి పాపం పురాతనమ్. సప్తజన్మార్జితం సత్యం శ్రద్ధయా శిరసాధృతమ్, గంధపుష్పాక్షతైర్ధూపైర్నీరాజనపురస్కృతమ్. సంపూజ్యసంస్కృతైరన్నైర్భోజ్యం తాం యతయస్త్వయా, భూతానాం ప్రాణినశ్శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః. బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః తేషుచ బ్రాహ్మణాః స్మృతాః, బ్రాహ్మణేషుచ విద్వాంసో విద్వత్సు కృతబుద్ధయః. కృతబుద్ధిషు కర్తారః కర్తృ

---

చూచిడగ్గుత్తికతోడి మాటలతోను ఆనందబాష్పములతోడి కన్నులతోను సంతోషముతోను తొట్రుపాటుతోను తగిన మర్యాదలుచేసి సాష్టాంగముగా సాగిలబడి వారియడుగులు ముట్టిమ్రొక్కి చేతులుజోడించుకొని ఇప్పుడునాజన్మము సఫలమాయెను. నాబ్రతుకును నెరవేరినదాయెను. ఇప్పుడే నాకు విష్ణుమూర్తియు ప్రసన్నుడు ఆయెను. ఇప్పటికి నేను పరిశుద్ధుడనైతిని. నాయిల్లు పావనమాయెను. నాపెండ్లామును నాపితృదేవతలును కృతార్థులైరి. నాఆవులును నాసంపదయు మేలిమిని పొందెను. తాపత్రయమును పోఁగొట్టునట్టి మీపాదములను చూచితిని. విష్ణుమూర్తినివలెనే మీదర్శనమును చేసితిని కనుక నేను కృతార్థుడనైతిని. అని ఇట్లు సత్యమైన అభిప్రాయముతోడి మాటలు చెప్పి వారిని పూజించి ఏడుజన్మములందు చేసినపాపములను పోఁగొట్టునట్టిదైన వారిపాదములు కడిగినజలమును మిక్కిలి శ్రద్ధతోను సంతోషముతోను, తలమీద చల్లుకొంటిని. అట్లు యతులపాదజలమును తలనుధరించి పూర్వముచేసిన పాపములెల్లను నశింపగా వారిని గంధము పుష్పము అక్షతలు ధూపము నీరాజనము (ఆరతి) మొదలగువానిచేత లెస్సగాఁ బూజించి పక్వముగావండిన పరిశుద్ధాన్నముచేత భోజనము చేయించితిని. కనుక లోకమునందు ఎల్లభూతములలోపల ప్రాణులు శ్రేష్ఠములు. ఆప్రాణులలోపల బుద్ధివలన జీవించునవి ముఖ్యములు. ఆబుద్ధిగల ప్రాణులలోపల మనుష్యులు ఉత్తములు. ఆమనుష్యులలోపల బ్రాహ్మణులు ప్రధానులు. బ్రాహ్మణులలోపల విద్వాంసులు శ్రేష్ఠులు. ఆవిద్వాంసుల

షు బ్రహ్మవాదినః, అతఏవహి పూజ్యాస్తే యస్మాచ్ఛ్రేష్ఠా జగత్త్రయే.
సత్సంగతి ర్విశాంశ్రేష్ఠ మహాపాతకనాశినీ, విశ్రాంతా స్తవ గేహేతే
సత్వస్థా బ్రహ్మవాదినః ఆజన్మసంచితం పాపం నాశయంతి క్షణేన తే,
సంచితం యద్గృహాస్థస్య పాపమామరణాంతికమ్. నిర్దహిష్యతి తత్సర్వ
మేకరాత్రోషితా ద్విజాః, ఇతితే సంచితం పుణ్య మష్టమే పూర్వజ
న్మని. త్వద్భ్రాత్రే దేహి తత్పుణ్యం నరకాద్యేనముచ్యతే, ఇతి దూతవ
చశ్శ్రుత్వా దదౌపుణ్యంససత్వరమ్. ఇష్టేన తేజసా భ్రాత్రే నిరయాత్సో
ఽపినిర్గతః, దేవై స్తౌపుష్పవర్షేణ పూజితౌచ దివంగతౌ. తాభ్యాం సంపూ
జితస్సర్య్య గ్దేవదూతో యమాలయమ్. అఖిలవృషసుబోధం దేవదూత
స్య వాక్యం నిగమవచనతుల్యం వైశ్యపుత్రో నిశమ్య, స్వకృతసుకృత
దానా ద్భ్రాతరం తారయిత్వా సురపతివరలోకం తేన సార్ధం జగామ.
ఇతిహాస మిమం పుణ్యం యః పఠేచ్ఛృణుయాదపి, గోసహస్రప్రదానస్య
విపాపో లభతే ఫలమ్.

---

లోపల ఆస్తికత్వబుద్ధిగలవారు ఉత్తములు, ఆబుద్ధిమంతులలోపల సత్కర్మములను నడు పువారు ముఖ్యులు. సత్కర్మములను నడుపువారిలో బ్రహ్మవేత్తలు శ్రేష్ఠులు. గనుక బ్రహ్మజ్ఞానులు మూడులోకములందును బూజింపదగినవారు. అటువంటి సత్పురుషుల సాంగత్యము ఎల్లపాపములను నశింపజేయుచున్నది. సత్వగుణముగల ఆబ్రహ్మజ్ఞానులు నీ యింటిలో నిలిచి క్షణకాలమున నీవు పుట్టిననాటనుండియు గడించిన పాపమునంతయు నశింపజేసిరి. బ్రహ్మజ్ఞానులగు బ్రాహ్మణులు ఏగృహస్థునియింట ఒకరాత్రి తాము వసిం తురో ఆగృహస్థుడు పుట్టినది మొదలు చచ్చునంతవఱకు చేసినపాపములనెల్లను వారు కాలిపోవునట్లు చేయుదురు. నీవు ఈవిధముగా నీయెనిమిదవజన్మమునందు పుణ్యమును సంపాదించుకొంటివి. ఇప్పుడు నీవు ఆపుణ్యమును నరకమునుండి విడుదల అగుటకై నీ తోడబుట్టినవానికి ఇమ్ము. అని ఇట్లు పూర్వపుణ్యవృత్తాంతమును ఆదూత చెప్పగా విని వికుండలుడు ఆ పుణ్యమును శీఘ్రముగా తన అన్నకు ఇచ్చెను. ఇయ్యగానే వాడు నరకమునుండి బయటవెడలి వచ్చెను. అంత వారిరువురును దేవతలు పువ్వులవానలు కురి యించుచుండగా తమకు మేలుచేసిన ఆయమదూతకు తగినమర్యాదచేసి యమలోకము నకు పంపి తాము దేవలోకమునకుపోయిరి. ఎల్లధర్మములను సులభముగా తెలుపునదియు వేదవాక్యమును పోలినదియునైన యమదూతయొక్క మాటనువిని కోమటివానికొడుకు తనపుణ్యమును ఇచ్చి అన్నను నరకమునుండి విడుదలచేసికొని వానితోగూడ పుణ్య లోకమునకుబోయిన ఈపుణ్యకథను చదివినవారును విన్నవారును ఎల్లపాపములు నశింపగా వేయిగోదానములు చేసినఫలమును పొందుదురు.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే వికుండలాచ్ఛ్రీకుండలస్య స్వర్గప్రాప్తిర్నామ చతుస్త్రింశోఽధ్యాయః.

---

## పఞ్చత్రింశోఽధ్యాయః.

కార్తవీర్యః — హేతునా కేన విప్రర్షే మాఘస్నానే మహాద్భుతే, ప్రభావో వర్ణితో నూనం తన్మే కథయ విస్తరాత్. గతపాపోయదైకేన ద్వితీయేనదివంగతః, వైశ్యో మాఘజపుణ్యేన కథంమాఘస్య వైభవమ్. దత్తాత్రేయః.—నిస్సంగా త్సలిలం మేధ్యం నిర్మలం శుచిపాండురమ్, మలహం పురుషవ్యాఘ్ర త్రాసకం దాహకం తథా. ధారకం సర్వ భూతానాం పోషణం జీవనం తథా, ఆపో నారాయణో దేవః సర్వ వేదేషు పఠ్యతే. గ్రహాణాంచ యథా సూర్యో నక్షత్రాణాం యథా శశీ, మాసానాంచ తథా మాఘ శ్శ్రేష్ఠస్సర్వేషు కర్మసు. మకరస్థే రవౌ మాఘే ప్రాతఃకాలే తథామలే, గోష్పదేపి జలస్నానం స్వర్గదంపా

---

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు వికుండలునివలన వాని అన్న స్వర్గమునుపొందుటను దెలిపెడి ముప్పదినాలవ అధ్యాయకథ.

---

## ముప్పదియైదవ అధ్యాయము.

కార్తవీర్యునిమాటలు.—బ్రహ్మర్షివైన ఓదత్తాత్రేయా! ఏదో ఒక కారణముచేత మిక్కిలి వింతయైనదియగు మాఘస్నానముయొక్క మహిమను చెప్పితివి. ఇంకను విశదముగా ఆకథను నాకుచెప్పుము. ఒక కోమటివాఁడు మాఘస్నానమువలన పుణ్యముచేత పాపములు పోయినవాడై రెండవవానితోగూడ స్వర్గమునుపొందెనే ఆమాఘమాసము యొక్క మహిమయెట్టిది?

దత్తాత్రేయునిమాటలు.—ఓరాజా! ఇతరజలముయొక్క చేరికలేకపోవుటవలన పవిత్రమైనదియు తేటయైనదియు పాపములేనిదియు తెల్లనైనదియు పాపములనుహరించుచు భయపెట్టుచు గాల్చుచు నుండునదియు ఎల్లప్రాణులకు ప్రాణధారకమును బ్రదుకును బ్రదుకుదెరువైనదియు అగుజలము శ్రీమన్నారాయణస్వరూపమే యని ఎల్లవేదములందును చెప్పబడుచున్నది. గ్రహములలోపల సూర్యుడును నక్షత్రముల లోపల చంద్రుడును ఎట్లు శ్రేష్ఠులో అట్లు అన్నిమాసములలోను మాఘమాసము శ్రేష్ఠము. మకరమునందు సూర్యుడు ఉండునట్టికాలమైన మాఘమాసమునందు తెల్లవారగానే కొంచెపాటికాలువయందైనను తేటయైన జలమునందు చేయునట్టి స్నానము పాపాత్ముల

పినామపి. యోగోఽయందుర్లభో రాజన్ త్రైలోక్యే సచరాచరే, అస్మిన్యోగే హ్యశక్తోఽపి స్నాయాదపిదినత్రయమ్. దద్యాత్కించి ద్యథాశక్తి దారిద్ర్యాభావమిచ్ఛతా, త్రిస్నానేనాపి మాఘే స్యుర్ధనినో దీర్ఘజీవినః పంచవా సప్తవాహాని చంద్రవద్వర్ధతే ఫలమ్, అథాత స్సంప్రవక్ష్యామి మాఘస్నానవిధిం వరామ్. కర్తవ్యో నియమః కించిద్వ్రితరూపో నరోత్తమైః, ఫలాతిశయహేతోర్హి కించిత్సంగం త్యజేద్బుధః భూమౌ శయీత హోతవ్యం ఆజ్యం త్రిర్హవిమిశ్రితమ్, త్రికాలంవార్చయేన్నిత్యం వాసుదేవం సనాతనమ్. దాతవ్యోదితకోదండో దేవముద్దిశ్య మాధవమ్, ఇంధనం కంబళం వస్త్రం ఉపాన త్కుంకుమావృతమ్. తైలంకార్పాసకోలంచ తూలంతూలవంతీపటీమ్, అన్నం చైవ యథాశక్తి దేయం మాఘే నరాధిప. క్షీరిణీంరోహిణీంగాంచ దద్యాద్వేదవిదే తథా, తాంచ గా మక్షయాం రాజన్ సముద్ర ఇవ సర్వ

---

కైనను స్వర్గమునిచ్చునది అగును. చరములును అచరములునైన ప్రాణులుగల ఈమూడు లోకముల సముదాయమునందును ఈస్నానమునుకూలించుట దుర్లభము. ఈమాఘస్నానమును క్రమముగా చేయశక్తిలేక పోయినను మూడుదినములయినను స్నానము చేసిపేదరికము లేకుండుటను కోరుచు తన శక్తికొలదిని కొంచెమయిన దానముచేయవలెను. మూడుదినములు మాఘస్నానముచేతనే జనులు ధనవంతులునువిశేషకాలము జీవించువారును అగుదురు. ఆయిదుదినములుగాని ఏడుదినములుగాని మాఘస్నానము చేసినపక్షమున అందులఫలము శుక్లపక్షచంద్రునికళలు పెరిగినట్లు దినక్రమమున పెరుగును. కాబట్టి మిక్కిలి శ్లాఘ్యమైన మాఘస్నానవిధానమును విశదముగా చెప్పెదను. ఉత్తములగు జనులు ఇదియు నొకవ్రతముగా నెంచి కొంచెము నియమమును వహించి క్రమముగా స్నానమును జరపినపక్షమున ఆస్నానము విశేషఫలము కలుగుటకు హేతువు అగును. ఈవ్రతమును నడుపునట్టి యోగ్యుడగు జనుడు కొంచెము విషయసాంగత్యమును మాని నేలను పండుకోవలెను. మూడగ్నులను గూర్చుకొని హోమము చేయుచు శాశ్వతుడయిన శ్రీవిష్ణుదేవుని ప్రతిదినమును పూజించి మూడుకాలములందునుగాని ఒకకాలమునందుగాని యెత్తబడిన విల్లుగలవాడైన శ్రీవిష్ణుదేవునిగురించి యేదేని దానముచేయవలెను. ఇదిగాక మాఘమాసమునందు వంటచెరకు కంబళి వస్త్రము చెప్పులు కుంకుమచే కప్పబడిన నూనె ప్రత్తి రేగుపండు దూది దూదిచేర్చికుట్టిన కప్పడుబొంత అన్నము వీనిని శక్తికొలదినిదానముచేయవలెను. ఆలాగుననే పాడియావును ఆబోతును వేదముచదివినబ్రాహ్మణునికి ఇయ్యవలెను. అట్లు దానము చేయబడినగోవు ఎన్నడునుక్షయింపకసము

దా. పరస్యాన్నం నసేవేత త్యజేద్విప్రప్రతిగ్రహమ్, మాఘుం తేభోజయే ద్విప్రాన్ యథాశక్తి నరాధిప. దేయాచదక్షిణా తేభ్యో ఆత్మనో హితమిచ్ఛతా, ఏకాదశీవిధానేన మాఘస్యోద్యాపనంతథా. కర్తవ్యం శ్రద్ధధానేన అక్షయ్యం స్వర్గమిచ్ఛతా, మకరస్థే రవౌమాఘే గోవిందాచ్యుత మాధవ. స్నానేనానేన మే దేవ యథోక్తఫలదో భవ, ఇతిమంత్రం సముచ్చార్య స్నాయాన్మౌనం సమాశ్రితః. వాసుదేవం హరిం విష్ణుం మాధవం మనుతే పునః, తప్తేన వారిణా స్నానం యద్గృహే క్రియతే నరైః. షడబ్దఫలదం తద్ధి మకరస్థే దివాకరే, బహిస్నానంతు కూపాద్ద్వాదశాబ్దఫలప్రదమ్. తటాకే ద్విగుణం రాజన్ నద్యాం చైవ చతుర్గుణమ్, దశధా దేవఖాతేచ శతధాచ మహానదీ. శతం చతుర్గుణం రాజన్ మహానద్యాస్తు సంగమే, సహస్రగుణితం సర్వంతత్ఫలం మకరేరవౌ. గంగాయాంస్నానమాత్రేణ లభతే మానవో నృప, గంగాం యేత్వవగా

---

త్రమువలె మేరలేనిఫలమును ఇచ్చునదియగును. మాఘస్నానమును నియమముతో చేయువాఁడు ఇతరుని అన్నమును భుజింపరాదు. బ్రాహ్మణునివల్లనైనను దానముతీసికొనుట మానవలెను. మాఘమాసము కడపట తనశక్తికొలదిని బ్రాహ్మణులను భోజనము చేయించి వారికి తన మేలును కోరుచు దక్షిణలను ఇయ్యవలెను. పిమ్మట ఏకాదశి విధానముచేత మాఘ వ్రతోద్యాపనము చేయవలెను. మఱియు శ్రద్ధగలవాడై యెన్నఁడును చెడని స్వర్గమునంపలి యిచ్చుచేత "ఓగోవిందా! ఓమాధవా! ఓస్వామీ! మకరరాశియందు సూర్యుఁడుండెడి కాలమయిన మాఘమాసమునందు నేను చేయునట్టి యీస్నానముచేత లభింపగల ఫలములభింప అనుగ్రహింపుము" అను నీఅర్థముగలమంత్రమును చెప్పి మౌనములో స్నానముచేసి సర్వలోకములందును అంతర్యామియై యుండువాఁడును సర్వపాపములను పోగొట్టువాఁడును శ్రీలక్ష్మీదేవికి ప్రియుఁడును నైన శ్రీవిష్ణుమూర్తిని మరల ధ్యానముచేయవలెను. మాఘమాసమునందు తనయింటనుండి వేనీళ్లస్నానము చేయునట్టి జనులకు ఆరు సంవత్సరముల స్నానఫలముకలుగును. నూయి మొదలగు వానిజలములందు బయటస్నానము చేయువారికి పండ్రెండేండ్ల స్నానఫలము కలుగును. ఆబయటిస్నానము చెరువునందైన అంతకు రెండంతఫలముకలుగును. నదియందైనయెడ నాలుగంతలఫలమును మనుష్యులచేత త్రవ్వబడని మడుగులయందయిన పదంతలఫలమును గొప్పనదులయందైనయెడల నూరంతలఫలమును గొప్పనదుల చేరికయందు స్నానముచేసినయెడ నన్నూరంతలఫలమును కలుగును. గంగానదిలో మాఘమాసమునందు స్నానముచేసినమాత్రమున మానవులకు ఈ అన్నిటికంటె వేయియంతలఫలములభించును. ఓరాజా! గంగానది

హంతే మాఘమాసే నృపోత్తమ. చతుర్యుగసహస్రంతే న పతంతి సురాలయాత్, శతేనగుణితేమాఘే సహస్రంరాజసత్తమ. నిర్దిష్టమృషిభిస్స్నానం గంగాయామునసంగమే, దద్యాద్దినే సహస్రంతు సువర్ణానాం విశాంపతే. తేనదత్తంహి గంగాయాం యోమాఘేస్నాతిమానవః, అనడ్వాహసహస్రంతు అయుతంకాపిలంతథా తేన దత్తంహి గంగాయాం యోమాఘేస్నాతిమానవః, పాపానాం భూరిభారస్య దాహదేశం ప్రజాపతిః. ప్రయాగంవిదధేభూప ప్రజానాంచ హితేరతః, మాఘస్నానవిధిం సమ్యక్ సితాసితజలంకిల. పాపధూతః పశూనాంహి బ్రహ్మణా విహితం పురా. బ్రహ్మోవాచ — మార్గార్త్యా మాఘమాసే కృతమితి దురితం బ్రహ్మహా మాచభైషీః పాతకస్మిన్త్రిపుణ్యేమహాతిచదురితే కోమదఃకాచభీతిః, మాఘేమాసిప్రయాగే మకరగతరవౌమజ్జతాంసజ్జనానామబ్బిందుర్వాథనీతే మదమపిభయమప్యత్ర వేదాః ప్రమాణమ్ శ్రుతిః. సితాసితేసరితో యత్ర సంగతేతత్రాప్లుతానో దివముత్పతంతి, యఏవై తాక్

---

యందు మాఘమాసమునందు ఎవరు స్నానము చేయుదురో వారు వేయిమారులు నాలుగుయుగములు కడచునంత కాలము స్వర్గమునుండి క్రిందపడరు. గంగా యమునా నదులు జేరునట్టితావునందు స్నానముజేసినయెడ అంతకు నూరు వేలంతల ఫలము కలుగునని ఋషులు చెప్పుదురు. ఎవడు గంగానదియందు మాఘస్నానము చేయునో వాడు వేయి సువర్ణదానములను వేయి వృషభదానములను పదివేల కపిలగోదానములను చేసినవాడు అగును.అనగా ఆదానములు చేసినవారు పొందునట్టి ఫలమును పొందును.ఇదిగాక ప్రయాగము అనునది పాపములు అనెడి పెద్ద మోపునకు దహనస్థానము అగునట్లుగా ప్రజలు మేలుకొరకు బ్రహ్మ యేర్పరచియున్నాడు. పూర్వకాలమునందు గంగాయమునాదులయొక్క తెల్లనినల్లని నీళ్లజేరునట్టి చోటైన ప్రయాగము పశువుల పాపములనుగూడ విడుపించునదిగాను మాఘస్నానమునకు మంచిదిగాను బ్రహ్మచేత నిర్మింపబడెను.

బ్రహ్మదేవుని మాటలు.— ఓరి బ్రహ్మహత్యచేసినవాడా! ఈలోకమునందు నేను పాపిసైతినని నాచేత పాపము జేయబడెనుఅనిభయపడి మార్గాయాసముచేత శ్రమపడకుము. పుణ్యమయిన మాఘమాసమునందు గొప్పపాపమునందయినను మదమెక్కడిది. అట్టిపాపముజేసినవానికి భయమెక్కడిది. మాఘమాసమునందు సూర్యుడు మకరరాశిని పొందినవాడు అగుచుండగా ప్రయాగమునందు మునుగుము. సత్పురుషసంబంధమైన జలబిందువైనను మదమును భయమును తొలగించుటకు సమర్థమగును. ఈవిషయమునందు వేదములే ప్రమాణములు. వేదములు చెప్పుచున్నవి. ఎక్కడ తెల్లనినదులు కూడునో అక్కడ స్నానముచేసినవారు స్వర్గమును పొందుదురు. ఏపండితులు వానిని

విభజంతిధీరాః తేజానానో అమృతత్వంభజంతి. సితాసితానుయాథారా స్సరస్వత్యాదిగాహితాః, తన్మార్గం బ్రహ్మలోకస్య సృష్టికర్తా ససర్జవా. సితాసితేహియోమజ్జే దపిపాపశతావృతః, మకరస్థే రవౌ మజ్జన్ నస గర్భేషు మజ్జతి దుర్జ్ఞేయా వైష్ణవీమాయా యాదేవైరపి దుస్త్యజా, ప్రయాగే జహ్యాతేసాహిమాఘమాసేనరాధిప. తేజోమయేషులోకేషు భుక్త్వా భోగా ననేకశః, పశ్చాచ్చక్రిణి లీయంతే ప్రయాగేమాఘమజ్జ నాత్. ఉపస్పృశతి యో మాఘే మకరార్కే సితాసితే, తస్యపుణ్యా న్యనేకాని చిత్రగుప్తో విదేత్ఫలమ్. స్వర్ణభారసహస్రేణ కురుక్షేత్రే రవి గ్రహే, యత్ఫలంలభతేమాఘే వేణ్యాంతత్తుదినత్రయే. రాజసూయస హస్రస్య రాజన్నవికలంఫలమ్, సితాసితేచ మాఘే తత్ స్నాతానాం భవతిధ్రువమ్. ప్రయాగస్యచ మాహాత్మ్యంవక్ష్యామి శృణుపార్థివ, పృథి వ్యాం యాని తీర్థాని పుర్యస్సప్తైవయాః పునః. స్నాతుమాయాంతి తేవే

---

విభజించి తెలిసికొనుచున్నారో వారు మోక్షమును పొందుదురు. తెల్లనినల్లని యేజల ధారలు సరస్వతీనది మొదలగు వానియందు మునిగినవై యుండునో ఆధారలమార్గమే బ్రహ్మలోకమునకును మార్గముగా సృష్టికర్త కల్పించెను. అని వేదములు చెప్పుచున్నవి. అని బ్రహ్మచెప్పెను. ఓరాజా! తెల్లనినల్లని యుదకములయందు స్నానము చేసినవాఁడు అనేకపాపములచేత చుట్టబడినవాఁడుగా నున్నను మకరరాశియందు సూర్యుఁడుండగా స్నానముచేసి మరల జన్మములందు మునుగఁడు. దేవతలకుగూడ తొలగింపరాని యేవిష్ణు మాయగలదో ఆమాయగూడ మాఘమాసమునందు ప్రయాగలోతొలగిపోవును. ప్రయా గయందు మాఘస్నానము చేయుటవలన మానవులు తేజస్స్వరూపముగాగల లోకము లందు అనేకవిధముల సుఖముల ననుభవించి పిమ్మట శ్రీవిష్ణుదేవునియందు ఐక్యమును పొందుదురు. మకరమునందు సూర్యుఁడుండెడి మాఘమాసమునందు తెల్లనినల్లనిజలములు గల ప్రయాగమునందు స్నానముచేయువారి పుణ్యములను అనేకములను అనేకవిధముల చేత చిత్రగుప్తుడు తెలిసికొనుచున్నాడు కురుక్షేత్రమునందుసూర్యగ్రహణకాలమునం దువేయిబారువుల బంగారుదానముచేయుటచేత పొందెడిఫలమును మాఘమాసమునందు ప్రయాగమున స్నానముచేయుటచేత పొందవచ్చును. ప్రయాగమునందుమాఘస్నానము చేయుజనులకు వేయి రాజసూయములయొక్క ఫలముతప్పకలభించును. ఇదినిశ్చయము. ఓరాజా! నీకు అట్టిప్రయాగముయొక్క మహిమను చెప్పెదనువినుము. ఈభూమియందు ఎల్లతీర్థములు, మోక్షము నిచ్చునట్టివైన అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి,

ణ్యాం మాఘేమాసి నృపోత్తమ, సర్వతీర్థానికృష్ణాని పాపినాంసంగదోషతః. భవంతి శుక్లవర్ణాని ప్రయాగే మాఘమజ్జనాత్, జన్మజన్మాంతరే పాపం సంచితం యన్నరాధిప. తద్భవేద్భస్మసాన్మాఘే స్నాత్వాణాంచ సితాసితే, వాఙ్మనః కాయజం పాపం నరస్య సుదృఢంభవేత్. ప్రయాగేమాఘమాసేతు త్ర్యహస్నానాత్తు తత్క్షయమ్, ప్రయాగేమాఘమాసేతు త్ర్యహస్నానేనమానవః పాపం త్యక్త్వా దివంయాతి జీర్ణాంత్వచమివోరగః, కురుక్షేత్రసమాగంగా యత్రకుత్రావగాహితా. తస్మాచ్ఛతగుణాప్రోక్తా యత్రవింధ్యేనసంగతా, తస్మా చ్ఛతగుణాప్రోక్తా కాశ్యాముత్తరవాహినీ. కాశ్యాశ్శతగుణాప్రోక్తా గంగాయమునయాసహా, సహస్రగుణితావేణ్యాం భవే త్పశ్చిమవాహినీ. సా రాజన్ దర్శనాదేవ బ్రహ్మహత్యాపహారిణీ, పశ్చిమాభిముఖీ గంగా కాళిందీ యత్ర సంగతా. హంతి కల్పకృతంపాపం సామాఘే నృప మజ్జనాత్, యత్కథ్యతే ధ్రువం రాజన్ తద్వేణీభువికీర్తితా. తస్యాంమాఘేముహూర్తోఽపి దేవానామపి

అవంతి, ద్వారవతి, అనుపట్టణములేదును మాఘమాసమునందు ప్రయాగలో స్నానము జేయుటకై వచ్చుచున్నవి. పాపాత్ముల చేరికలవలన దోషము చేత నల్లనివైనయెల్లతీర్థములును ప్రయాగమునందు మాఘమాసమున మునుగుటవలన తెల్లనివి అగును. మాఘస్నానము చేయుజనులు ప్రతిజన్మమునందును సంపాదించుకొన్న పాపము ప్రయాగమునందు స్నానము చేయగానే కాలి బూడిదయైపోవును. మానవునికి వాక్కు మనస్సు కాయము(దేహము) వీనివలన గలుగు పాపము మిక్కిలి బలమైనదైయున్నను మాఘమాసమునందు ప్రయాగములో మూడుదినములు మాఘస్నానము చేయుటవలన కుబుసమునుండివిడువబడిన పామువలె పాపమునుండి విడువబడి స్వర్గమును పొందును. గంగానది కురుక్షేత్రముతో సమానమైనది. దానియందు ఎక్కడనైనను స్నానము చేయవచ్చును. గంగ వింధ్యపర్వత సంబంధముగలిగి ప్రవహించుచోట అంతకు నూరంతలు ఫలమునిచ్చునదియగును. అది కాశియందు ఉత్తరముఖముగా పారునట్టిచోట అంతకు నూరంతలఫలము నిచ్చునదియగునని చెప్పబడును. ఆ గంగ యమునతోగూడ ప్రవహించుచోట కాశియందుకంటెను నూరంతలఫలము నిచ్చును. వేణీసంగమము గలిగి పశ్చిమముఖముగా పారునప్పుడు అంతకు వేయిపాళ్లు అధికమైన ఫలమునిచ్చును. అది దర్శనము మాత్రముచేతనే బ్రహ్మహత్యను కూడపోగొట్టును. గంగ పడమటిముఖముగా పారుచు యమునతో ఎక్కడకలియునో అక్కడ మాఘస్నానము చేసినయెడల ఒకకల్పకాలము చేయబడిన పాపములు నశించును. ఈ చెప్పబడిన చోటే వేణియని లోకమునందు చెప్పబడుచున్నది. ఇది నిశ్చయము. ఆ వేణియందు మాఘస్నానము ముహూర్తకాలమయినను నిలిచిచేయుటకు

దుర్లభః. బ్రహ్మావిష్ణు మహాదేవ రుద్రాదిత్యమరుద్గణాః, గంధర్వా లోకపాలాశ్చ యక్షకిన్నర గుహ్యకాః. అణిమాదిగుణైర్యుక్తా యేచాన్యే తత్త్వదర్శినః, బ్రాహ్మణీపార్వతీలక్ష్మీ శచీమేధాదితీరతిః సర్వాశ్చ దేవపత్న్యశ్చ తథానాగాంగనాన్నృప,ఘృతాచీ మేనకారంభా ఊర్వశీచ తిలోత్తమా. గణాశ్చాప్సరసాం సర్వే పితౄణాంచ గణా స్తథా, స్నాతుమాయాంతి తేసర్వే మాఘే వేణ్యాంనరాధిప. కృతేయుగే స్వరూపేణ కృతా ప్రచ్ఛన్నరూపిణః, ప్రయాగేమాఘమాసేతు త్ర్యహస్నానస్యయత్ఫలమ్. నాశ్వమేధసహస్రేణ తత్పుణ్యం లభతే భువి.

ఇతి శ్రీపాద్మే పురాణే, మాఘమాహాత్మ్యే, ప్రయాగమహి
మానువర్ణనంనామ పంచత్రింశోఽధ్యాయః.



దేవతలకుకూడ లభించుట అరుదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును ఏకాదశరుద్రులును ద్వాదశాదిత్యులును తక్కిన దేవతాసమూహములును గంధర్వులును దిక్పాలకులును యక్షులును కిన్నరులును గుహ్యకులును అణిమ మహిమ మొదలగు గుణములతోఁగూడిన తత్త్వవేత్తలును సరస్వతీ పార్వతీ లక్ష్మీదేవులును శచి మేధ అదితి రతి అనువారును తక్కిన దేవతలభార్యలును నాగకన్యకలును ఘృతాచి మేనక రంభ ఊర్వశి తిలోత్తమ మొదలుగాగల అప్సరస్త్రీలసమూహమును పితృగణములునైన ఈ చెప్పబడినవారు అందరును మాఘమాసమునందు వేణీస్నానమునకై వత్తురు. అట్లువచ్చి కృతయుగమునందు స్వస్వరూపములతోను తక్కిన యుగములందు మారురూపములతోను స్నానము చేసిపోదురు. ప్రయత్నపూర్వకముగా మూడుదినములు ప్రయాగమునందు వేణీసంగమమున స్నానముచేయుటవలన గలుగుపుణ్యము ఈలోకమునందు వేయి అశ్వమేధయాగములు చేసినను కలుగదు.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు ప్రయాగమహి
మను తెలుపునట్టిదైన ముప్పదియైదవ అధ్యాయకథ.



## షట్త్రింశోఽధ్యాయః.

దత్తాత్రేయః.—త్ర్యహస్నానఫలం మాఘే పురా కాంచనమాలినీ, రాక్షసాయ దదౌ భూప తేన ముక్తస్స పాపకృత్. కార్తవీర్యః. భగవన్ రాక్షసః కో వా కా వా కాంచనమాలినీ, కథం దత్తవతీ ధర్మం సా కథంసంగతి స్తయోః. ఏతత్కథయ యోగీంద్ర పరం కౌతూహలం హి మే. దత్తాత్రేయః.—శృణు రాజన్ విచిత్రం త్వ మితిహాసం పురాతనమ్, యస్య శ్రవణమాత్రేణ వాజపేయఫలం లభేత్. అప్సరారూపసంపన్నా నామ్నా కాంచనమాలినీ, ప్రయాగే మాఘమాసే సా స్నాత్వాయాతి సురాలయమ్. నికుంజే గిరిరాజస్య తిష్ఠతా ఘోరరూపిణా, దృష్ట్వాగగనమారూఢా తేనవృద్ధేనరక్షసా. తేజస్వినీసా హేమాభా సుశ్రోణీ దీర్ఘలోచనా, చంద్రాననా సుకేశీ సా పీనోన్నతపయోధరా. తాం దృష్ట్వా రూపసంపన్నా మువాచసచ రాక్షసః, కాత్వంకమలపత్రా

---

## ముప్పదియారవ అధ్యాయము.

దత్తాత్రేయునిమాటలు.—ఓరాజా! పూర్వకాలమునందు కాంచనమాలిని అనునది మూడుదినములు ప్రయాగయందు మాఘస్నానముచేసినఫలమును ఒక రాక్షసునికి ఇయ్యగా పాపములనుచేసిన ఆరాక్షసుడు మోక్షమును పొందెను.

కార్తవీర్యునిమాటలు.—పూజ్యుడవైన ఓదత్తాత్రేయమహామునీ! రాక్షసుడు ఎవడు. కాంచనమాలిని అనునది యెవతె. ఆమె వానికి ఎట్లు పుణ్యమును ఇచ్చెను. వారికి ఇద్దరికిని చేరిక యెట్లు కలిగెను. ఈవృత్తాంతమును నాకుచెప్పుము. నాకు మిక్కిలి వినవేడుక పుట్టుచున్నది.

దత్తాత్రేయునిమాటలు.—ఓరాజా! వినుము. దేనియొక్క వినికిచేతనే వాజపేయయజ్ఞమును చేసినఫలము కలుగునో అట్టి యీయితిహాసము బహుకాలమునాటిదియు వింతయైనదియు నై యుండును. చక్కదనముగల కాంచనమాలిని అనెడి అప్సరసయొకతె కలదు. ఆమె మాఘమాసమునందు ప్రయాగములో స్నానముచేసి స్వర్గమునకు పోవుచుండగా హిమవత్పర్వతమునందు ఒక పొదరింటిలో కూర్చున్న భయంకరమయిన ఆకృతిగల ఒక ముసలిరాక్షసుడు ఆమెనుచూచి, మిక్కిలి తేజస్సుగలిగినదియు బంగారువన్నెవంటి దేహపువన్నె కలిగినదియు మిక్కిలి అందమయిన పిరుదులు గలిగినదియు నిడుదలయిన కన్నులుగలిగినదియు చంద్రునిబోలిన ముఖముగలిగినదియు మంచితలవెండ్రుకలు గలిగినదియు ఉన్నతములును బటువులునయిన స్తనములు గలిగినదియు మిక్కిలి చక్కదనము గలిగినదియునైన ఆకాశమునందు పోవుచున్న ఆమెతో ఇట్లు పలికెను.

తా. కుత ఆగమ్యతే త్వయా. ఆర్ద్రించవసనం కస్మా దార్ద్రాచకబరీకుతః, కుత్ర వా గమ్యతే భీరో కుతస్తే ఈదృశీగతిః. కేనపుణ్యేనవా భద్రే తవ తేజోమయంవపుః, అతీవరూపసంపన్న మద్భుతంచమనోహరమ్. త్వద్వ స్త్రాంబునిపాతేన మమమూర్ధ్ని సులోచనే, ప్రశాంతమభవత్సద్యః క్రూరం మేమానసంసదా. నిరస్యమహిమా కోఽయ మేతద్వ్యాచష్టుమర్హసి, త్వంమేశీలవతీభాసి వ్యాకరోషితథాకృతిమ్. ఆకారేణైవజానంతి సద్గు ణాన్ సత్సుభామినీ, వసంతిసతిసత్పుష్పం భ్రమరాఇవసౌరభాత్. అప్స రా.—శ్రూయతామప్సరా చాహం భోరక్షః కామరూపిణీ, ప్రయాగా దాగతాచాహం నామ్నా కాంచనమాలినీ. ఆర్ద్రాచ కబరీచేయం ప్ర యాగాంభసిమజ్జనాత్, గంతవ్యశ్చ మయా రక్షః కైలాసః పర్వతో త్తమః. యత్రాస్తే పార్వతీనాథ స్సురాసురనమస్కృతః, వేణీవారిప్ర భావేన రక్షస్తేక్రూరతాగతా. జాతాహంయేన పుణ్యేన గంధర్వస్యసు

---

తామరరేకులనుబోలినకన్నులుగల ఓఅమ్మా! నీవు ఎవరవు? ఎక్కడనుండి వచ్చెదవు? తడికోకయు తడిసిన కొప్పునైయున్నావేమి? నీవు ఈస్థితితో ఎక్కడనుండి యెక్క డికి పోవుచున్నావు? ఓపుణ్యాత్మురాలా! మిక్కిలి చక్కదనముకలిగి ఆశ్చర్యకర మయినదియు మనోహరమయినదియు తేజోరూపమైనదియు నైనయీదేహము నీకు ఏ పుణ్యముచేత లభించినది? నీతడికోకయందలి ఒకబొట్టునీరు నాతలమీదపడినమాత్రము చేతనే ఎప్పుడును క్రూరమయిన నామనస్సు శాంతమయినదాయెను. ఈమహిమ నీకెట్లు కలిగెను? నీయాకారమె నీవు మంచిస్వభావముకలదానవు అగుటను తేటపఱచుచున్నది. మంచిపువ్వులను వాని పరిమళముచేతనే తుమ్మెదలు తెలిసికొనునట్టు సజ్జనులయందు గల సద్గుణములను ఆకారముచేతనే ఇతరులు తెలిసికొనుచున్నారు. కనుక నీవృత్తాంతమం తయు నాకు విశదముగా చెప్పుము.

అప్సరసమాటలు.—ఓయిరాక్షసుడా! వినుము. నేను కామరూపిణినైన అప్సర సను. నాపేరు కాంచనమాలిని. నేను ప్రయాగనుండి వచ్చుచున్నాను. ప్రయాగలో స్నానముచేసినందున నాకొప్పుకూడ తడిగానున్నది. ఇప్పుడు నేను పోవుతావు దేవదాన వులచేతమ్రొక్కబడుచున్న పార్వతీపతియైన శివుడు ఉండుచోటయిన కైలాసపర్వతము. వేణిసంగమస్థానమయిన ప్రయాగయందలి ఉదకము నావస్త్రమునందుండి నీమీదపడెను గనుక ఆపుణ్యతీర్థప్రభావముచేత నీక్రూరత్వము పోయెను. నేను సుమేధసుడు అను గంధర్వరాజుకొమార్తెను. ఏపుణ్యముచేత నేనిట్టిరూపసంపదగల కన్యకనైతినో, ఏపు ణ్యముచేత సుమేధసునకు కూతురనై పుట్టితినో ఆపుణ్యవృత్తాంతమంతయు నీకు చెప్పెదను

మేధసః, కన్యకాదివ్యరూపాహం తత్సర్వం కథయామి తే. కళింగాధిపతే రాజ్ఞో హ్యహమాసంవిలాసినీ, రూపలావణ్యసంపన్నా సౌభాగ్యమదగర్వితా. అన్యాసాం యువతీనాంచ తత్పురే౽హంశిరోమణిః, తజ్జన్మని మయారత్వో భుక్త్వాభోగాననేకశః. మోహితంతత్పురంసర్వం మమయౌవనసంపదా, అమూల్యానిచరత్నాని భూషణాని ధనానిచ. వాసాంసిచ విచిత్రాణి కర్పూరాగరుచందనమ్, ఏవం హ్యుపార్జితంద్రవ్యం మయామోహనరూపయా. నాహంజానామి మోహాత్తం స్వనివాసేనిశాచర, సంసేవంతే యువానో మే చరణౌ కామమోహితాః మయాతేవంచితాస్సర్వే సర్వస్వేనతు మాయయా, అన్యోన్యద్వేషభావేన మృతాః కేచిత్తు కామినః. ఇత్థం తాం నగరీమేత్య సకాలో మేగతస్తథా, ప్రాప్తేతువార్ధకే కాలే శుశోచ హృదయం మమ నదత్తంనహుతంతప్తం నవ్రతం చరితం మయా, నారాధితో మహాదేవ శ్చతుర్వర్గఫలప్రదః. నమయాపూజితాదేవీ దుర్గా దుఃఖార్తిహారిణీ, సర్వపాపహరో విష్ణుర్నస్మృతో భోగలు

---

వినుము. నేను పూర్వజన్మమందు కళింగరాజునకు భోగస్త్రీనైయుండి, చక్కదనము దేహమునందలిమెరుగు కోరదగిన అవయవసంపత్తివీనిచేత గర్వించినదాననై ఆపట్టణము నందలియౌవనస్త్రీలలో శ్రేష్ఠురాలనైయుంటిని. ఆజన్మమునందు బహువిధములైనభోగము లను అనుభవించుచు ఆవిధముగా నేను మెలగుచుండగా ఆపట్టణమునందలి పురుషులందరు నాయౌవనసంపదను జూచి మోహమునొందినవారైనందున నేను వారివలన వెలలేని రత్నములు సొమ్ములు ధనములువింతవింతలైనకోకలు కర్పూరము అగరుగంధము మొదలగు పరిమళద్రవ్యములు ఇవన్నియును సంపాదించితిని. ఆనాయుంకియందు నన్నుజూచి మోహించినవారు ఇందరనిచెప్పుటనాకు తెలియదు. అప్పుడు ఎందరోయౌవనపురుషులు కామముచేత మోహమునొందినవారై నాపాదసేవ చేయుచుందురు. నేను మోసపు నడవడిచేత వారినందరిని మోసపుచ్చి వారి సమస్తధనములను అపహరించితిని. నన్ను మోహించినవారిలోకొందరు పలుపుమచ్చరముచేత ఒకరనొకరు కొట్టుకొని చచ్చిరి. ఈవిధముగా ఆపట్టణమునందు నాకాలమును గడపుచుండి, ముసలితనము రాగా నేనామనసునందు విచారము ఒకటిపుట్టెను. ఎట్లు అనగా! నేను దానములుయజ్ఞములువ్రతములుచేసినదానను గాను ధర్మార్థకామమోక్షములనెడు నాలుగువిధములైన పురుషార్థములను ఇచ్చునట్టి మహాదేవుని నేనుబూజించినదానను గాను. ఎల్లదుఃఖములవలని సంకటములను పోగొట్టునట్టిదయిన దుర్గాదేవియును నాచేత బూజింపబడినదికాదు. భోగములయందు దాసత్తిగలదాననై ఎల్లపాపములను పోగొట్టువాడయిన విష్ణుమూర్తిని తలచినదానను గాను. బ్రాహ్మణ

ద్ధయా. నచ సంతర్పితావిప్రా నకృతం ప్రాణినాం హితమ్, అణుమాత్రం మయా పుణ్యం నకృతంచ ప్రమాదతః. పాతకం తు కృతం భద్ర తేనమే ముహ్యతే మనః, బహుధైవం విచార్యాహం బ్రాహ్మణం శరణంగతా. బ్రాహ్మణం వేదవిద్వాంసం తస్య రాజ్ఞః పురోహితమ్, సచ పృష్టో మయా రహో నిష్కృతిస్స్యాత్కథం మమ. పాపస్యాస్య ద్విజశ్రేష్ఠ కథం యాస్యామి నిష్కృతిమ్, స్వేనైవ కర్మణా తప్తాం పరాంకాం దీనమానసామ్. పాపపంకనిమగ్నాంచ మాముద్ధర కచగ్రహాత్, మయికారుణ్యజంవారి వవర్ష త్వం ద్విజోత్తమ. సజ్జనే సాధవస్సర్వే సాధ్వసాధు నివర్జితే, ఇత్యసౌ మద్వచ శ్శ్రుత్వా చకారానుగ్రహం మయి. ఊచే ప్రీతికరంవాక్యం సర్వధర్మమయం ద్విజః. బ్రాహ్మణః. నిషిద్ధాచరణంజానే సర్వత్రాహం వరాననే, కురు మేసత్వరంవాక్యం యాహి క్షేత్రం ప్రజాపతేః. తత్రగత్వాకురుస్నానం తేనపాపక్షయోభవేత్, నాన్యంపశ్యామి యత్నేన యత్తేపాపప్రణాశనమ్. ప్రాయశ్చిత్తంపరంతీర్థ స్నానం మునిభిరీరితమ్, కింతు తీర్థేత్యజాశు త్వం మనసాప్యశివాంక్రియామ్. ప్రయాగ

---

సంతర్పణముగాని ఇతరములయిన ప్రాణులకు మేలుగాని నేను చేసియెరుగను. ఏమరికైనను కొంచెమైనను పుణ్యము చేసినదానను గాను. ఇట్లు బుద్ధిహీనురాలనై పాపములు చేసితిని. అని యిట్లు బహువిధములుగా విచారపడి పిమ్మట వేదములు చదివినవాడును ఆరాజునకు పురోహితుడునైన యొకబ్రాహ్మణుని శరణుచొచ్చి, ఓస్వామీ! నాకు మంచిగతి యెట్లు కలుగును. ఈపాపము ఎట్లుతొలగునని స్వకీయమయినకర్మమువలని తాపముచేత తపించుచు దుఃఖమునొందినమనసుతో పాపమనెడిబురదలో దిగబడి మునుగుచున్న నన్ను అనుగ్రహించి ఉద్ధరింపుము. నీదయవలన బుట్టినజలమును వానగా కురియింపుము. మంచిచెడ్డలను పాటింపని సజ్జనునియందు పెద్దలగువారు అందరును అనుగ్రహింతురు. కాబట్టి నీవును అట్టే నాయందు అనుగ్రహింపుము. అని యిట్లు వేడుకొనగా, ఆబ్రాహ్మణుడు నామాటను ఆదరించి నాయందు అనుగ్రహముగలవాడై సర్వధర్మస్వరూపమయిన యొకమాట చెప్పెను.

బ్రాహ్మణునిమాటలు.—ఓవనితా! నీవు చేసిన చెడ్డపనులన్నియును నేను ఎరుగుదును. ఇక నీవు నామాటవిని శీఘ్రముగా బ్రహ్మక్షేత్రమునకు బోయి అక్కడ స్నానము చేయుము. ఆస్నానముచేత పాపమంతయు నశించును. అదితప్ప మరియేయుపాయమును నాకు తోచలేదు. పాపములు నశించుటకు గొప్పప్రాయశ్చిత్తము పుణ్యతీర్థములయందలి స్నానము అని మునులు చెప్పుదురు. కనుక శీఘ్రముగ చెడ్డపనులనువదలి తీర్థస్నానము

స్నానశుద్ధా త్వం స్వర్గం యాస్యసి నిశ్చితమ్, ప్రయాగస్నానమాత్రేణ
నృణాం నాకో నసంశయః. అన్యదేశకృతం పాపం తత్క్షణాదేవ భామిని,
ప్రయాగే విలయం యాతి పాపం తత్ర కృతం వినా. శృణు భీరు పురా శక్రో
గౌతమస్య వధూం సతీమ్, శ్రుత్వా కామవశాత్ప్రాప్తాం తాం గతో గుప్త
కాముకః. తేనైవోగ్రేణ రూపేణ తత్రైవ జనితం ఫలమ్, ఋతుస్త్రీగంతు
రింద్రస్య తస్యాశ్చ పురతస్తథా. కురూపం గర్హితం జాతం అతిలజ్జాకరం
వపుః, తద్భర్తుశ్శాపమాహాత్మ్యాత్సహస్రభగచిహ్నితమ్. అధోముఖ
స్తతో భూత్వా దేవరాజో వినిర్గతః, వినింద్య స్వకృతం కర్మణోఽభిభూతస్తు
లజ్జయా. మేరోస్సరసి తోయాఢ్యే శతయోజనవిస్తరే, తత్ర గత్వా ప్రవి
ష్టస్సః హేమాంబురుహకుట్మలే. తత్రస్థో గర్హయన్ నిత్యం ఆత్మానం
మథనం యతః, ధిఙ్మన్మథం దురాచార మాపదాం పరమం పదమ్. దేహస్థం
దుర్మదం శత్రుం అసంతుష్టం నిరాశ్రయమ్, ఇతి వారిణి సంఛన్నే వామ
నే పద్మవాసిని. ఆఖండలం వినా భీరు దేవలోకో నరాజతి, తదా దేవస్సగం
ధర్వా లోకపాలాశ్చ కిన్నరాః. శచ్యా సహ సమాగత్య ప్రత్యూచుశ్చ బృ

---

నను యత్నింపుము. ప్రయాగయందలి స్నానముచేత పరిశుద్ధురాలవైనపక్షమున నీవు
తప్పక స్వర్గమును పొందుదువు. సంశయములేదు. ప్రయాగయందు చేసినపాపము
తక్కిన దేశములయందు చేసినపాపము ప్రయాగలో స్నానము చేసినయెడ వెంటనే నశిం
చును. ఓపుణ్యాత్మురాలా! వినుము. పూర్వకాలమునందు ఇంద్రుడు పతివ్రతయైన గౌత
మునిభార్య చక్కనిదని కామాతురత్వముచేత రజస్వలయైయున్నప్పుడు ఆమెను పొం
దిన పాపముచేతను ఆమె పెనిమిటియైన గౌతముని శాపప్రభావముచేతను ఆమెయెదు
టనే వేలకొలది యోనులచేత గురుతిడబడిన కురూపమును పొందెను. అంతట యింద్రు
డు తాను చేసినపనిని నిందించుకొనుచు అందువలని అవమానముచేత సిగ్గుపడి తలవంచుకొ
న్నవాడై బయలుదేరి నీళ్లచే నిండుకొన్న మేరుపర్వతశిఖరమునందలి నూరుయోజనముల
విరివిగల సరస్సునకుపోయి అందలి బంగారు తామరమొగ్గలో చొచ్చి తన్నును తనకు
ప్రేరకుడైన మన్మథునిని దూషించుచునుండి చెడ్డ నడవడిగలవాడును ఆపదలకు ప్రధాన
స్థానమయినవాడును దేహమునందుండువాడును చెడ్డమదముగలవాడును సంతోషములే
నివాడును ఆశ్రయము లేనివాడును నైన మన్మథుడు అనెడి శత్రువును ఏమనవచ్చును.
ఔరా! అని విచారించుచు నీళ్లయందు అతిసూక్ష్మమయిన శరీరముతో తామరమొగ్గ
యందు దాగియుండెను. అట్లు ఇంద్రుడు దాగగా అతడులేకపోవుటచేత దేవలోకము
అరాజకమయ్యెను. అప్పుడు దేవతలును గంధర్వులును కిన్నరులును దిక్పాలకులును శచీ

హస్పతిమ్. భగవన్ బలభిద్దేవం నహి జానీమహేవయమ్, క్వతిష్ఠతీతిక్వ
గతః కుత్రవా మార్గయామహే. ననాకశ్శోభతే తేన వినా దేవగణై
స్సహ, అపుత్రం కుశలం యద్వత్ కులం శ్రీమద్గుణాన్వితమ్. ఉపాయ
శ్చింత్యతాం సద్య స్స్వర్గ్లోకో యత్ర జాయతే,సనాథశ్చ క్రియాయుక్తోన
విలంబోఽత్ర యుజ్యతే. ఇతి తేషాం వచశ్శ్రుత్వా గురుర్వచనమబ్రవీత్,
జానేహం సాపరాధీనం లజ్జయా యత్ర తిష్ఠతి. రభసారబ్ధకార్యస్తు భు
ఙ్క్తేఽసౌ మఘవాన్ ఫలమ్, నృణాం నీతిపరిత్యాగా ద్విపాకా స్సుర్భ
యంకరాః. అహో రాజ్యమదాన్మత్తః కృత్యాకృత్య మచింతయన్,
కృతవాన్ నింద్యమానోఽసౌ కృతాకృతభయంకరమ్. కుర్వంతి బాలి
శా హ్యత్ర దైవోపహతబుద్ధయః, అపరాధ స్తథాజన్మ ఇహాముత్రచ
నిష్ఫలమ్. అధునా తత్ర గచ్ఛామి యత్ర శక్రస్స తిష్ఠతి, ఇత్యుక్త్వా
నిర్గతాస్సర్వే బృహస్పతిపురోగమాః. దృష్ట్వా సరసివిస్తీర్ణే స్వర్ణపంకజ
కాననే, తుష్టువు ర్దేవరాజానం ప్రబోధో యేన జాయతే. తతో గురోః

---

దేవితోఁగూడ బృహస్పతియొద్దకుపోయి అయ్యా మీకందరకును ఏలినవాడగు ఇంద్రు
డు ఎక్కడికిపోయినాడో ఎక్కడఉన్నాడో తెలియలేదు. ఆతనినిని ఎక్కడ వెదకవ
చ్చును. దేవగణములతోడ స్వర్గము, నేర్పరియును మంచిగుణములతోఁగూడినవాడైన కొ
డుకులేనికులమువలె ప్రకాశింపకున్నది. స్వర్గలోకము రాజుగలదియును రాచకార్యముల
తోఁగూడినదియును అగునుపాయము ఆలస్యముచేయక అతిశీఘ్రముగ విచారింపవలెను.
చేసిన దుష్కార్యమువలననైన నేరముచేత సిగ్గుపడి అందులఫలమును అనుభవించుచు
ఎక్కడనుండుటయును నేనెఱుగుదును. మానవులకునీతితప్పుటవలన భయంకరమయినపాప
ఫలములు అగును. దొరతనపుమదముచేత మత్తుగొన్నవారై కృత్యమునుఅకృత్యమును
విచారింపక చేసి అందువలనభయంకరమయిన ఫలములనుపొందుదురు. ఇది ఆశ్చర్యము.
మూర్ఖులగుజనులు దైవవశముచేత బుద్ధిచెడినవారై అనేకములగు అపరాధములను చేయు
చు ఉన్నారు. అలాగుననే వారిజన్మము ఈలోకమునందును పరలోకమునందును నిష్ఫల
మై పోవుచున్నది. ఇప్పుడు ఇంద్రుడు ఎక్కడనున్నాడో అక్కడికి పోవుదము అని
చెప్పెను. అంతట వారందరును బృహస్పతిని ముందుంచుకొన్నవారై బయలుదేరిపోయి
విశాలమయిన బంగారుకమలములుగల కొలనునుజూచి ఇంద్రునికి తెలివిగలుగునట్టి రీతిని
స్తోత్రముచేసిరి. అంతట ఇంద్రుడు బృహస్పతిదైన బోధముచేత తామరమొగ్గలోనుండి
బయట వచ్చి చిన్నబోయిన మొగముగలవాడును వికారమయిన రూపము గలవాడును

ప్రబోధేన నిర్గతః పద్మకుట్మలాత్, దీనాననో విరూపస్సన్ వ్రీడాకుంచిత లోచనః. జగ్రాహ చరణావింద్రో గురోస్తస్యాగ్రజన్మనః, పాహి మాం నిష్కృతిం బ్రూహి పాపస్యాస్య బృహస్పతే. దేవరాజవచశ్శ్రుత్వా జగౌ విప్రో బృహస్పతిః, ప్రయాగస్నానమాత్రేణ తత్క్షణాదేవ పాతకాత్. ముచ్యసే దేవరాజత్వం తత్రయాస్యామహేవయమ్, తతఃపురోధసా సార్ధం ఆగత్యబలమర్దనః. స్నాత్వాసితాసితేతీర్థే సద్యోముక్తోమహాఘాత్తదా, తతో దేవగురుస్తస్మై ప్రసన్నోఽసౌ వరం దదౌ. క్షీణపాపస్యతే శక్ర మత్ప్రసాదేన సాంప్రతమ్, సహస్ర మేతద్యోనీనాం సహస్రం స్యాద్దృశాం తవ. తత్రైవ ద్విజవాక్యేన శుశుభే స శచీపతిః, లోచనానాం సహస్రేణ పంకజైరివమానసః. తతో బృందారకైస్సర్వైః ఋషిభిశ్చాభిపూజితః, గంధర్వైః స్తూయమానస్తు ప్రాప శక్రోఽమరావతీమ్. ఇత్థం శక్రోవిపాపోఽభూత్ప్రయాగే పాకశాసనః, అపి త్వం యాహి కళ్యాణి ప్రయాగం యోగిసేవితమ్. సద్యః పాపవినాశాయ తథా స్వర్గతయే ధ్రువమ్, ఇతి తస్య వచశ్శ్రుత్వా సేతిహాసం చ మంగళమ్.

---

సిగ్గుచేత సంకోచమునొందిన చూపుగలవాఁడునై బృహస్పతికాళ్లుపట్టుకొని, ఓగురుడా! ఈపాపమునకు తగిన ప్రాయశ్చిత్తము చెప్పి నన్ను గాపాడుము. అని వేడుకొనగా ఆ ఇంద్రునిమాటవిని బృహస్పతి, ఓయింద్రుడా! ప్రయాగలోస్నానముచేసినమాత్రమున నప్పుడే ఈపాపమువలన విడువబడుదువు. నీవు ఆప్రయాగకు మాతోడ రమ్ము అని చెప్పెను. అంతట ఇంద్రుడు తనపురోహితుడయిన బృహస్పతితోకూడ ప్రయాగకువచ్చి తెల్లనినల్లని నీళ్లుగలదైన ప్రయాగయందు స్నానముచేసి అప్పుడే ఆపాపమునుండివిడువబడెను. వెంటనే బృహస్పతి ఆతనియందు అనుగ్రహముగలవాడై, ఓయింద్రా నశించినపాపములుగలవాడ వైతివి. నాయనుగ్రహమువలననే నీదేహమునందలి వేలకొలది యోనులన్నియు నీకు కన్నులుగా నగును. అనివరము ఇచ్చెను. ఆలాగుననే ఇంద్రుడు బ్రాహ్మణవాక్యముచేత వేయికన్నులుగలవాడయి కమలములచేత మానససరోవరము ప్రకాశించునట్లు ప్రకాశించెను. అనంతరము ఇంద్రుడు ఎల్లదేవతలచేతను ఋషులచేతను పూజింపబడినవాడును గంధర్వులచేత పొగడబడుచున్నవాడునునై అమరావతిపట్టణమును చేరెను ఈవిధముగా పాకాసురునిచంపినవాడైన యింద్రుడు పాపములు లేనివాడాయెను. కనుక, ఓపుణ్యాత్మురాలా! ఇపుడే పాపములు నశించుటకొరకు నీవును యోగులచేత సేవింపబడునదియైన ప్రయాగమునకుపొమ్ము. ఆలాగుననే స్వర్గమునునిశ్చయముగ కలుగును. అనిఇట్లు ఆయనచెప్పిన పూర్వకథతోగూడినదియు మిక్కిలి మేలైనదియు

తత్రైవ సంభ్రమాపన్నా పాదౌ నత్వా ద్విజస్యతు. త్యక్త్వా బంధుజనం
సర్వం దాసీదాసగృహం ధనమ్, సకలాన్విషయాన్ప్రత్యో విషగ్రాసా
నివ స్ఫుటమ్. వపుశ్చ క్షణవిధ్వంసి పశ్యంతీ నిర్గతాహ్యహమ్, హృద
యే కుణపవ్యాఘ్ర సదాసంశర్ప్యమానయా. మయా గత్వా కృతం
స్నానం మాఘమాసే సితాసితే, తస్య స్నానస్య మాహాత్మ్యం శృణు
వృద్ధనిశాచర. త్ర్యహాత్పాపక్షయో జాతః సప్తవింశతిభిర్దినైః, విశే
షైశ్వర్యభూత్పుణ్యం తేన దేవత్వమాగతమ్. రమమాణాతు కైలాసే
గిరిజాయాః ప్రియాసఖీ, జాతిస్మరా దజాతాహం ప్రయాగస్య
ప్రభావతః. స్మృత్వా ప్రయాగమాహాత్మ్యం మాఘేమాఘే వ్రజా
మ్యహమ్, ఇతి రాక్షస యత్పృష్టం త్వయా విస్మితచేతసా. తన్మయా కథి
తం సర్వం చరిత్రం ప్రీతయేతవ. మత్ప్రీతయే చరిత్రం త త్త్వం బ్రూహి
మమ రాక్షస కర్మణా కేనజాతోఽసి విరూపోఽతిభయంకరః, శ్మశ్రులో
దీర్ఘదంష్ట్రశ్చ క్రవ్యాదో గిరిగహ్వరే.

---

కైన మాటనువిని త్వరగలదాననై ఆయనపాదములకు మ్రొక్కి చుట్టములనందరను
విడిచిపెట్టి పనివాండ్రు పనికత్తెలు వీరితోడ ఇంటిని ధనమును శబ్దాదులైన ఎల్లవిషయము
లనువిషముతోడి అన్నమునువలెవదలి దేహముక్షణకాలములో నశించునదియని తెలిసికొని
నేను బయలుదేరితిని. అట్లు బయలుదేరితృప్తినొందినమనసుతో ప్రయాగమునకుపోయి
అచ్చట నల్లని తెల్లని జలమునందు స్నానముచేసితిని. ఓ రాక్షసోత్తమా! ఆస్నానము
యొక్క ప్రభావమునువినుము. మూడుదినముల స్నానముచేతనే నాపాపములన్ని నశిం
చెను. తక్కిన యిరువదియేడుదినముల స్నానఫలముచేత విశేషములయిన పుణ్యములు
లభింపగా నేను దేవత్వమునుపొందితిని. ఆప్రయాగస్నానముయొక్క మహిమచేత నేపూ
ర్వజ్ఞానముకలిగి కైలాసపర్వతమునందు పార్వతీదేవికి చెలికత్తెనై క్రీడించుచు మరలజన్మ
ములేనిదాననైతిని. ఇట్టిప్రయాగమహిమనుతలచుకొని ప్రతిమాఘమాసమునందును అచ్చ
టికిపోయి స్నానముచేసి వచ్చుచుందును. ఆశ్చర్యమునొందిన మనసుతో నీవు నన్ను
అడిగినందున నీప్రీతికొరకు నీకువిశదముగాచెప్పితిని. ఇక నాప్రీతికై నీచరిత్రమును నీవు
చెప్పుము. ఏకర్మముచేత కోరమీసమును నిడుపాటికోరలును గలిగి భయంకరమైన
వికారరూపముతో రాక్షసుడవై యీకొండగుహలో నున్నావు. అని రాక్షసుని కాంచన
మాలిని అడిగెను.

ఇతి శ్రీపాద్మేపురాణే మాఘమాహాత్మ్యే కాంచనమాలినీ
రాక్షస సంవాదే కాంచనమాలినీచరిత్రంనామ
షట్త్రింశోఽధ్యాయః.

---

సప్తత్రింశోఽధ్యాయః.

రాక్షసః. ఇష్టందదాతిగృహ్ణాతి గుహ్యాం వక్తిచపృచ్ఛతి, ప్రీత్యాహి సజ్జనా భద్రే తత్తుసర్వం త్వయి స్థితమ్. త్వయా సంభావితం నూనం మన్యే మాం వామలోచనే, భవత్యనిష్కృతి స్త్వద్య వ్యాధస్య క్రూర జన్మనః. తతో వక్ష్యామితే భద్రే దుష్కృతం యత్స్వయంకృతమ్, నివేద్య సజ్జనే దుఃఖం యతస్సర్వం సుఖంభవేత్. శృణు సుశ్రోణీ కాశ్యాం మాం బ్రాహ్మణో వేదపారగః, జాతఃపురాద్విజశ్రేష్ఠః కులేమహతి నిర్మలే. రాజ్ఞాందుష్కృతినాం భీరు శూద్రాణాంచ యథావిశామ్, వారాణస్యాం మహాఘోరం కృతే ధనపరిగ్రహామ్. బహుధా బహువారం చ

---

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు కాంచనమాలినికిని
రాక్షసునికినినైన సంభాషణమున కాంచనమాలినీచరిత్రమును
తెలుపునట్టిదైన ముప్పదియారవ అధ్యాయకథ.

---

ముప్పదియేడవ అధ్యాయము.

రాక్షసునిమాటలు.—ఓపుణ్యాత్మురాలా! సజ్జనులు ప్రీతిచేతనే ఇష్టమైన దానిని ఇచ్చుచున్నారు. పుచ్చుకొనుచున్నారు. రహస్యమును అడుగుచున్నారు. చెప్పుచున్నారు కాబట్టి యీ చెప్పిన గుణములన్నియు నీయందున్నవి. నేను నీచేత మిక్కిలి సన్మానింపబడినవాడ నని తలచెదను. ఇప్పుడు క్రూరజన్మమునొందిన కిరాతు డైనవానికి ప్రాయశ్చిత్తము కలుగదు కనుకను సజ్జనునితో తనదుఃఖమును చెప్పుకొనుటచేత సుఖముకలుగును గనుకను నాచేత చేయబడిన పాపమంతయు నీతోచెప్పెదను. ఓపుణ్యవతీ! నేను పూర్వకాలమునందు మిక్కిలి నిర్మలమును శ్రేష్ఠమునునైన బ్రాహ్మణకులమునందు పుట్టి వేదము తుదముట్ట చదివినవాడై కాశియందు గంగాస్నానము చేయవచ్చిన పాపాత్ములగు రాజులచేతను వైశ్యులచేతను శూద్రులచేతను బహువిధములచేత బహువర్యాయములు నిషిద్ధములు కుత్సితములు భయంకరములైన దానములను పుచ్చుకొనుచుంటిని.

నిషిద్ధం కుత్సితం బహు, చండాలస్యాపి సత్యక్తో మయాభద్రేతిప్రహః. అన్యచ్చ పాతకం తత్ర మమాభూన్మూర్ఖచేతసః, తన్నాస్తి దుష్కృతం కర్మమయాతత్రతు యత్కృతమ్. అన్యచ్ఛ్రూయతాం దోషః క్షేత్రస్య వరవర్ణిని, అవిముక్తేఽణుమాత్రం యత్తదఘం మేరుతాం వ్రజేత్. సధర్మస్తు మయాకేచిత్సంచిత స్తత్ర జన్మని, తతో బహుతిథే కాలే మృతస్తత్రైవ శోభనే. అవిముక్తప్రభావేన నచాహం నరకంగతః, అవిముక్తేనరఃకశ్చి న్నరకం నైతి కిల్బిషీ. అవిముక్తే కృతంపాప మవిముక్తే వినశ్యతి, వజ్రలిప్తేనపాపేన తేన మజ్జన్మ రాక్షసః. రౌద్రంక్రూరతమం పాపం సంభూతం హిమపర్వతే, ద్విర్వ్యాఘ్రత్వాగృధ్రయోనౌ ప్రాక్త్రిర్వాన్యఘోరద్విస్సరీసృపః. ఏకవారములూకశ్చ షడ్వారాహ స్తతఃపరమ్, ఇత్థం పంచదశం జన్మ రాక్షసం యత్రభామినీ. అతీతాని సహస్రాణి వర్షాణాం పంచసప్తతిః, నాస్తిమే నిష్కృతిర్భద్రే ఏతస్మా ద్దుఃఖసాగరాత్. అతస్త్రియోజనం సుభ్రు నిర్జనంచ మయాకృతమ్. అనాగసాంచభూతానాం బహూనాంచ క్షయఃకృతః. కర్మణా తేన మేసుభ్రు దహ్యతేసతతంమనః,

---

అట్లు దానములు పుచ్చుకొనుటయందు మాలవానికైనను నేను వదలినవాడను కాను. ఇది గాక ఇంకను అనేకపాపములు మూర్ఖచిత్తుడైన నాకు అచ్చట పొసగెను. అక్కడ నేను చేసిన పాపకృత్యములకంటె ఇతరములైనవి ఏవియు నుండవు. ఇదిగాక ఆక్షేత్రముయొక్క దోషమునువినుము. ఆ కాశీక్షేత్రమునందు రవంత పాపము చేసినను అదికొండంతగా పెరుగును. ఆజన్మమునందు నేను కొంచెమైనను ధర్మమును సంపాదించినవాడను కాను. ఇట్లు పాపకృత్యములు చేయుచు బహుకాలము ప్రవర్తించుచుండి అక్కడనే ప్రాణములు విడిచితిని. కాశీక్షేత్రప్రభావముచేత నేను నరకమును పొందినవాడను కానైతిని. కాశియందు చేసినపాపము కాశిలో నేనశించునుగనుక కాశిలోనుండువాడు పాపియైనను నరకమును పొందడు. వజ్రముపూసినట్టు అంటియున్న అప్పటిపాపముచేత రాక్షసజన్మము నాకు కలిగెను. ఆజన్మమునందు హిమవత్పర్వతమునుండి మిక్కిలి క్రూరమును భయంకరమునైన పాపమును ఆర్జించి దానివలన రెండుమారులుగద్దజన్మమును అంతకుముందుమూడుమారులు పెద్దపులిజన్మమును రెండుమారులు ప్రాకెడుపురుగుజన్మమును ఆటుపిమ్మట ఆరుతడవలు పందిజన్మమును ఎత్తితిని. కడపట పదియేనవదైన ఈ రాక్షసజన్మము నెత్తి ఈ జన్మమునందు వేయిని డెబ్బదియైదేండ్లు కడచెను. ఒకప్పుడును ఈదుఃఖసముద్రమునుండి విడుదలనాకుకలిగినదికాదు. ఆకారణముచేత ఈకొండయందు మూడామడదూరము జనులు లేకుండచేసితిని. ఏతప్పుచేయని అనేకప్రాణులను నేను నాశము చేసితిని. ఆ పాపకృత్యముచేతనామనస్సు ఎల్లప్పుడుమండుచుండును. ఆటువంటి సా

త్వద్దర్శనసుధాసిక్తం గతంశైత్యంమనోమమ. తీర్థంఫలతికాలేన సద్యస్సంగస్సతాంఖలు, అతస్సత్సంగతిం సుభ్రు ప్రశంసంతివిపాపతః. ఏతత్తే కథితం సర్వం యద్దుఃఖం హృద్గతం మయా, విరళస్సజ్జనే సుభ్రు స్నాత్వా యత్రనవిద్యతే. కరోమ్యత్రోచితం తత్ర కించిన్నోవదతఃపరమ్, తస్య దుఃఖోదధేఃపారం కథం యామీంతి చింతయే. సజ్జనానాంసమాహ్వాతి స్సర్వేషాముపజీవినీ, క్షీరార్ణవః పయోదత్తే హంసాయ న బకాయకిమ్. ఇతితస్య వచశ్శ్రుత్వా కృపార్ద్రీకృతమానసా, ధర్మదానే మనఃకృత్వా జగౌ కాంచనమాలినీ. కరిష్యే నిష్కృతిం భద్ర ఇదానీంఖలు మాశుచః, ప్రతిజ్ఞాంతుదృఢాంకృత్వాయతిష్యేతవముక్తయే. బహవోపికృతామాఘాః ప్రతివర్షం యథావిధి, శ్రద్ధాపూర్వం మయా రతో బ్రహ్మక్షేత్రే సితాసితే తాందదామినసంఖ్యాంతే తస్యధర్మస్యరాక్షస, దృఢోధర్మోహి కర్తవ్య ఇత్యూచుర్విబుధోత్తమాః. ఆర్తే దానం ప్రశంసంతి మునయో వేదవాదినః, సాగరే వర్షతో భద్ర కిం మేఘస్య ఫలంభవేత్. దదామి

---

మనస్సు నీదర్శనమనెడి అమృతముచేత తడుపబడినదై చల్లదనమును పొందెను. సత్పురుషులసహవాసము అప్పుడే పుణ్యతీర్థఫలము నిచ్చునదికదా? అందువల్లనే పాపములు లేమిచే సత్పురుషసాంగత్యము శ్లాఘింపబడుచున్నది. ఇది నావృత్తాంతము. నామనసునందలి దుఃఖమంతయును నీకు విశదముగా చెప్పితిని. ఎచ్చట స్నానముచేసి సజ్జనులకు ఎడమైనవాడను కానో అచ్చటి స్నానమును చేసెదను. ఇంక నేనేమి చెప్పుదును. అయినను పాపియైనవానికి దుఃఖ సముద్రముయొక్క దరి యిది యని చెప్పెదనువారు ఎవరు అని చింతించెదను. అనుసరించి జీవించువారికెల్లను సత్పురుషులయొక్క పిలుపు కలుగునుగాని కలుగకపోదు. పాలసముద్రము తనయందలిపాలను హంసకేగాని కొంగకియ్యదా? అని ఇట్లు ఆరాక్షసుడు చెప్పినమాటలనువిని కాంచనమాలిని దయార్ద్రమైన మనసుగలదై వానికి పుణ్యము నిచ్చుటయందు మనము ఉంచి ఓ పుణ్యాత్ముడా! ఇప్పుడు నిన్ను పాపమునుండి విడిపించెదను. దుఃఖింపకుము. అనిదృఢముగా ప్రతిజ్ఞచేసి నీపాపవిముక్తికై యత్నము చేయగలను. అనేకమాఘమాసములు ప్రతిసంవత్సరమును, తప్పక శ్రద్ధతో ప్రయాగమునందు నేను స్నానముచేసియున్నాను. ఆస్నానములులెక్కలేనివై యుండును వానివలన పుణ్యము ఇట్టిదని దృఢముగా చెప్ప శక్యముకాదు. అటు చెప్పుట ధర్మముకాదని పెద్దలగువారు చెప్పుదురు. వేదమును చదివినమనుజులు ఆర్తునియందు దానముచేయుటను శ్లాఘింతురు. సముద్రమునందు వానకురియుటచేత మేఘమునకు ప్రయోజనమేమి. అట్లుపుణ్యాత్మునికి పుణ్యమిచ్చుట ప్రయోజనములేనిదే అగును.

మాఘపుణ్యంతే కృతమేకంసితాసితే, తేనతేస్వర్గతిస్సద్యో భవిష్యతి న సంశయః. అనుభూతం మయా రక్షః స్వయం తత్పుణ్యజం ఫలమ్, తేన దాస్యామి తేరక్షః సద్యః పాపప్రణాశనమ్. నిష్పీడ్యాథతతో వాసో జలం కృత్వా కరాంబుజే, దదౌసా మాఘజంపుణ్యం తస్మైవృద్ధాయ రక్షసే. శ్రుణు రాజన్ విచిత్రంహి ప్రభావం మాఘమాసజమ్, తద్దైవప్రాప్తపుణ్యస్యాస్వం విముక్త్వా రాక్షసీంతనుమ్. సంభూతో దేవతాకారః తతో భాస్వరవిగ్రహః, దేవయానపథారూఢో హృష్టా దుత్ఫుల్లలోచనః ద్యోతమానస్తథా వ్యోమ్ని భాసయన్ ప్రభయా దిశః, దివ్యరూపధరో రేజే ద్వితీయఇవభాస్కరః. తతోఽభినందయామాస సమాం కాంచనమాలినీమ్, భద్రే వేత్తీశ్వరో దేవః కర్మణాంయఃఫలప్రదః, త్వయాప్యుపకృతం సమ్యగ్యత్రమేనాస్తి నిష్కృతిః, ఇదానీం మయి కారుణ్యం ప్రసీదానుగ్రహంకురు. శిక్షాంవిధేహి మే దేవి సర్వాం నీతిమయీం శుభామ్, సర్వధర్మకరీమానం నకుర్వే పాతకంయథా. మాంశ్రుత్వాత్వదనుజ్ఞాతః పశ్చాద్యామి సురాలయమ్, ఏతన్నిశమ్య తేనోక్తం ప్రియంధర్మమయంవచః.

---

కావున ఆర్తుడవైన నీకు తెల్లనినల్లనిరూపముగల ప్రయాగతీర్థమునందు చేయబడిన ఒక స్నానముయొక్క ఫలమును ఇచ్చెదను. ఆఫలముచేత ఇప్పుడే నీకు స్వర్గము కలుగును. సందేహములేదు. నేనును ఆఫలమును నీకు దానముచేయుటవలని పుణ్యమును అనుభవించెదను. అని తక్షణమే పాపమును నశింపజేయునదియైన ఆఫలమును ఆరాక్షసునిచేతియందు దారపోసెను. ఓరాజా! విచిత్రమయినఆమాఘమాసమువలనిపుణ్యమునువినుము. అంతట ఆరాక్షసుడు కాంచనమాలిని చెప్పినట్టే తనరాక్షసదేహమును విడిచిప్రకాశించునట్టి దేవతాకృతిని పొంది సంతోషముచేత వికాసము నొందిన కన్నులుగలవాడై విమానము నెక్కి తనదేహకాంతిచేత ఆకాశమునందు నిలిచి రెండవసూర్యునివలెనే దిక్కులు వెలుగజేయుచు, ఆకాంచనమాలినిని పొగడుచు, ఓపుణ్యాత్మురాలా! సర్వము నేలునట్టిదేవుడు వారువారుచేసిన కర్మములకు తగినఫలములు నిచ్చును. నీవైననో ఏవిధము చేతను పాపనివర్తికానని నాకు మంచియుపకారముచేసితివి. ఇప్పుడు నాయందు దయచేసి నన్ను అనుగ్రహింపుము. ఓఅమ్మా! మేలయినదియు నీతిస్వరూపమయినదియు నయినశిక్షను నాకు విధించి యేపాపమును చేయక యెల్లధర్మములను చేయునట్టిమార్గమును నాకుపదేశింపుము. ఆఉపదేశమును విని పిమ్మట నీవలన సెలవుపుచ్చుకొన్నవాడనై స్వర్గమునకు పోయెదను. అని రాక్షసుడు ప్రార్థింపగా ప్రియమయినదియు ధర్మముతోగూడినదియు నయిన వానిప్రార్థనను అంగీకరించి కాంచనమాలిని మిక్కిలిసంతోషించినదై

అతిప్రీతాబ్రవీద్రాజన్ ధర్మం కాంచనమాలినీ. ధర్మంభజస్వసతతం త్యజ భూతహింసాం సేవస్వసాధుపురుషాన్ త్యజబాలిశత్వమ్, అన్యస్యదోష గుణకీర్తన మాశు ముక్త్వా సత్యం వదార్చయహరింజహిసాహసాని. దేహేస్థిమాంసరుధిరేహమితిత్యజత్వంజాయాసుతాదిషు సదామమతాం విముంచ, పశ్యానిశం జగదిదం క్షణభంగనిష్ఠం వైరాగ్యభావరసికో భవయోగనిష్ఠః. ప్రీత్యా మయానిగదితం తవ ధర్మజాతం చిత్తేనిధేహి సతతం భవశీలయుక్తః, సంత్యజ్య రాక్షసతనుం ధృతదేవదేహో జ్యోతి ర్మయో వ్రజమహద్యుత మాశునాకమ్. శ్రుతధర్మస్తతో హృష్టః సంతుష్టో రాక్షసోఽబ్రవీత్, భవప్రముదితాన్నిత్యం సర్వదాశివమస్తుతే. ఆచంద్రార్కంరమస్వత్వం కైలాసేశివసన్నిధౌ, ఉమయాఖండితంప్రేమ తవాస్తు వరవర్ణిని. సుధర్మిష్ఠా తపోనిష్ఠా మాతస్త్వం భవసర్వదా, మాస్తు లోభశ్శరీరేతే ఆపన్నార్తిం సదాహర ఇత్యుక్త్వా సంప్రణమ్యాథ స

---

వానికి ధర్మమును ఉపదేశింప నారంభించెను. ఓపుణ్యాత్ముడా! ఎల్లప్పుడు ధర్మమును చేయుము. ప్రాణులను హింసించుట మానుము. సత్పురుషులను కొలువుము. మూర్ఖత్వము వదలుము. ఒకనిదోషమునుగాని గుణమునుగాని శ్లాఘించి చెప్పబోకుము. సత్యము పలుకుము. విష్ణుదేవుని పూజింపుము. సాహసకార్యములను వదలుము. రక్తమాంసములతో గూడిన ఈదేహమునందు నేను అను అభిమానమును విడువుము. పెండ్లాము బిడ్డలు మొదలగువారియందు ఎప్పుడును మమకారము కలిగియుండుటను మానుము. ఎప్పుడును ఈలోకము క్షణకాలములో నశించునదియనితలపుము. యోగమును పొందునదియైన వైరాగ్యమువలని సారస్యమును ఎరిగినవాడవు అగుము. నీయందలి ప్రీతిచేత నేను నీకు ఈధర్మములను చెప్పితిని. ఇదియంతయు మనసుననిలిపి యెల్లప్పుడు మంచినడవడిగలవాడవు అగుము. నీవు నీమునుపటి రాక్షసదేహమును విడిచి దేవదేహమును ధరించి వింతయై జ్యోతిస్స్వరూపమైన తేజస్సుతో శీఘ్రముగ స్వర్గమునకు పొమ్ము. అని కాంచనమాలిని ధర్మోపదేశము చేయగా విని ఆరాక్షసుడు సంతోషించినవాడై, ఓపుణ్యాత్మురాలా! నీవు ఎల్లప్పుడు సంతోషించినదానవు అగుము. నీకు ఎప్పుడును మేలు కలుగుగాక. నీవు సూర్యచంద్రులు ఎంతకాలముందురో అంతకాలమును కైలాసమునందు శివునిసన్నిధిలో వినోదించుచుండుము. నీకు పార్వతీదేవితోడి మిక్కుటమయిన చెలిమి కలుగును. ఓ అమ్మా! నీవు ఎల్లప్పుడును ధర్మమును నడపుదానవు అగుము. దేహమునందలి ఆశ్యాశ నీకు లేకపోవును. నీవు ఎల్లప్పుడు ఆపదపొందినవారిసంకటమును పోగొట్టుచుండుము. అని ఇట్లు పలికి ఆరాక్షసుడు కాంచనమాలినికి మ్రొక్కి అనేకులుగంధర్వులు పొగడు

తాం కాంచనమాలినీమ్, జగామరాక్షసస్స్వర్గంగంధర్వైర్బహుభిస్తుతః. దేవకన్యాస్తదా దృష్ట్వా వవర్షుః పుష్పసంతతిమ్, తస్యాః కాంచనమాలిన్యా మూర్ధ్ని హర్షసమాకులాః. తామాలింగ్య తతఃప్రోచుః కన్యకాస్తు ప్రియంవచః, కృతంభద్రే త్వయాచిత్రం రాక్షసస్య విమోక్షణమ్. దుష్టస్యాస్యభయంకించి ద్విశంత్యస్మిన్ నకాననే, అధునా నిర్భయా హ్యత్ర విచరామో యథాసుఖమ్. శ్రుత్వాతు వచనం తాసాం రాజన్కాంచనమాలినీ, హృష్టా తేనైవదానేన కృతకృత్యాసతీ తదా. తంరాక్షసంకాంచనమాలినీ తదా గంధర్వకన్యా పథిమోక్షసత్వరమ్, క్రీడంత్యమూభిః ప్రయయాహరాలయం ప్రీత్యాసుపూర్ణాహిపరోపకారాత్. సంవాదమేతత్సురకన్యకేరితం భక్త్యా పఠన్యోఽత్ర శృణోతిమానవః, నోబాధ్యతేజాత్వపిరాక్షసాదిభిర్ధర్మేమతిస్తస్య భృశం ప్రజాయతే.

ఇతి శ్రీపాద్మేపురాణే - మాఘమాహాత్మ్యే - కాంచనమాలిన్యా రాక్షసస్య స్వర్గప్రాప్తిర్నామ సప్తత్రింశోఽధ్యాయః.

---

చుండగా స్వర్గమును గూర్చి పోయెను. అప్పుడు దేవకన్యకలు ఆకాంచనమాలినిచూచి సంతోషించినవారై ఆమెశిరమీద పువ్వులవానలుకురియించి ఆమెను కౌగిలించుకొని, ఓపుణ్యాత్మురాలా! నీవు రాక్షసుని ఆపాపశరీరమునుండి విడుదలచేయుట మిక్కిలి ఆశ్చర్యము. అడవియందు రాక్షసుని భయము కొంచమైనను చొరదు. ఇప్పుడు మేము భయములేనివారమయి అడవియందు ఇచ్చవచ్చినట్లు సుఖముగా సంచరించెదము. అని ప్రియముగపలికిరి. ఓరాజా! ఇట్లు పలుకుచున్న ఆకన్యకలమాటలను కాంచనమాలిని విని మిక్కిలి సంతోషించినదై ఆపుణ్యదానము చేయుటచేత కృతకృత్యురాలై ఆరాక్షసుని అట్లు స్వర్గమునకుపంపి తాను గంధర్వకన్యలతోగూడి శీఘ్రముగా కైలాసపర్వతమునకుపోయి పరునికి ఉపకారముచేయుటవలని సంతోషముచేతనిండుకొన్నదై యుండెను. దేవకన్యకచే చెప్పబడిన సంవాదరూపమగు ఈకథను ఎవడు భక్తితో చదువునో ఆమానవుడు ఒకప్పుడును రాక్షసులచేత బాధింపబడడు. అట్టివానిబుద్ధి ధర్మమునందే వర్తించును.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు కాంచనమాలిని రాక్షసునికి స్వర్గమును కలుగజేయుటను తెలిపెడిదైన ముప్పదియేడవ అధ్యాయకథ.

## అష్టత్రింశోఽధ్యాయః.

వసిష్ఠః. కథితం మాఘమాహాత్మ్యం దత్తాత్రేయేణ భాషితమ్, కార్తవీర్యాయ తత్పూర్వం పృచ్ఛతే మాఘవైభవమ్, అధునా సంప్రవక్ష్యామి తన్మాఘస్నానజం ఫలమ్. సర్వక్రతువరిష్ఠం యత్సర్వదానఫలప్రదమ్- సర్వవ్రతతపస్తుల్యం మాఘస్నానం పరంతప. స్నానేన మాఘస్య దిలీప మానవాః పితౄంశ్చ దివిష్ఠాప్య కులద్వయోద్భవాన్, స్వర్గం ప్రయాంతి స్వయముజ్జ్వలాః రవేర్వసై ర్విమానై రుచిరై శ్చ కామగైః. యే మానవాః పాపకృతోఽపి సర్వదా సదా దురాచారగతా విమార్గాః, స్నాత్వాచ మాఘే త్వథిపత్వచం భృశం ముంచంతి దేహా మహాఘకంచుకాత్. సత్యేనహీనాః పితృమాతృదూషకాః హీనాశ్రగుస్థాశ్చ మధర్మవిక్షభాః, యే డాంబికాస్తేఽపి నరాస్సతాంగతిం స్నానైః ప్రయాంత్యత్ర హి మాఘసంభవైః. మాఘేతపో దానవ్రతప్రసేవనం స్నానం హరేః పూజనమక్షయం నృప, తస్మాద్యథాశక్తి నరైః ప్రయత్నతః స్నాత్వా ప్రదేయం వసనాది

---

మువ్పదియెనిమిదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు —ఓయిదిలీపమహారాజా! పూర్వకాలమునందు దత్తాత్రేయుని చేత కార్తవీర్యార్జునునికి చెప్పబడిన మాఘమాహాత్మ్యమును చెప్పితిని. ఇప్పుడు ఆమాఘ స్నానఫలమును నీకు నేను చెప్పెదవినుము. ఎల్లయజ్ఞములకంటెను ఉత్తమమయినదియు, ఎల్ల దానములవలని ఫలమునిచ్చునదియు, ఎల్లనోములను ఎల్లతపస్సులను పోలినదియునగు మాఘస్నానముచేత మానవులు తల్లివంశమువారును తండ్రివంశమువారునైన ఉభయకులముల పితరులను స్వర్గమునందునిలిపి తాము సూర్యుని తేజస్సువంటి తేజస్సుచేత వెలుగుచు తామగమనము గలిగిప్రకాశించునట్టివిమానములందు ఎక్కి స్వర్గమునకుపోవుదురు. మరియు ఎప్పుడు పాపకృత్యములు చేయువారును చెడ్డనడవడిగలవారును దుర్మార్గులునయిన జనులును మాఘస్నానముచేసి మహాపాపములనెడి కుబుసమునుండి పాము విడువబడునట్లు చర్మదోషమువలన విడువబడుదురు. సత్యముచేత తక్కువైనవారును తల్లిదండ్రులను దూషించువారును తక్కువయాశ్రమములందుండువారును శాంతియు ధర్మమును లేనివారును డాంబికులును నైనజనులుకూడ మాఘస్నానములు చేయుటవలన సత్పురుషులుపొందెడి ఉత్తమగతిని పొందుదురు. మాఘమాసమునందు తపస్సు దానములు వ్రతములు నడపుట, స్నానము చేయుట, విష్ణుపూజచేయుట, ఇవి యెప్పుడును తగ్గని ఫలముగలవి యగునుగనుక ప్రయత్నపూర్వకముగా మాఘమాసమునందు తమతమ శక్తికొలదిని స్నానముచేసి వస్త్రదానము మొదలగు దానములను ధనదానమును చేయవలసిలది. మాఘమునందు

కాంచనమ్. మాఘేఽన్నదాతామృతప స్సురాలయే హేమస్య దాతా బలిభిత్సమీపగః, దివ్యాని వాసాంసి దదన్నరస్సదా సూర్యస్య లోకే వసతి ప్రభామయే. యజ్ఞైస్సుదానై స్సుతపోభి రుజ్జ్వలై స్సుబ్రహ్మయోగై ర్వరయోగిసేవయా, శుద్ధా భవంతీహ యథా హి పాపిన స్స్నానై ర్యథా తీర్థభవై స్సుపుణ్యైః. దుఃఖౌఘసంతాప మసహ్య యాతనాం యామీం నతం యాంత్యపి పాపకారిణః, యే మాఘమాసే వరతీర్థమజ్జనం కుర్వంతి చార్ధోదయసూర్యమండలే. స్నాత్వా చ మాఘే హరిమర్చయంతి యే స్వర్గచ్యుతా భూపతయో భవంతి తే, సంభావ్యమపి పార్థివ పాతకం యత్ప్రమాదతోపీహ నృణాం కథంచన. స్నానం తు మాఘస్య యది ప్రసజ్యతే తత్రైవ తత్సంక్షయమేతి నిశ్చితమ్, గంధర్వకన్యాః పృథివీశ శాపజం సంభుజ్యమానాశ్చ ఫలం దురత్యయమ్. స్నానాద్విముక్తాః ఖలు మాఘసంభవా ద్వాక్యాత్తదా రోమశజా త్తదద్భుతమ్, శ్రుత్వా తత్పార్థివః ప్రీత్యా నత్వా తత్పాదపంకజమ్, శ్రద్ధయా పరయా నమ్ర స్తం పప్రచ్ఛ పురోధసమ్ దిలీపః.-భగ

---

అన్నదానము చేసినవాడు స్వర్గమునందు అమృతపానము చేయువాడును, బంగారుదానము చేసినవాడు స్వర్గమునందు ఇంద్రునిదగ్గరనుండువాడును, దివ్యములయిన వస్త్రములను దానముచేసినవాడు వెలుగే స్వరూపముగాగల సూర్యలోకమునం దుండువాడును అగుదురు. యజ్ఞములచేతను మంచి దానములచేతను తపస్సులచేతను ప్రకాశించునట్టి దేవసంబంధమయిన యోగములచేతను ఉత్తములయినయోగీశ్వరులను సేవించుటచేతను పాపులగువారు ఎట్లు పరిశుద్ధులగుదురో అట్లు పుణ్యతీర్థములయందు చేయునట్టి మాఘస్నానములచేత పరిశుద్ధులు అగుదురు. ఎవరు మాఘమాసమునందు శ్రేష్ఠములయిన పుణ్యతీర్థములయందు ప్రొద్దుపొడుచుచుండగా స్నానముచేయుదురో వారు పాపములు చేసినవారైనను దుఃఖసమూహమువలన తాపముచేత సహింపరాని యమయాతనను పొందరు. ఎవరు మాఘస్నానము చేసి విష్ణుపూజ చేయుదురో వారు స్వర్గలోకసుఖముల ననుభవించి భూలోకమునకు దిగబడినవారై రాజులు అగుచున్నారు. ఓరాజా! ఈలోకమునందు మానవులకు ప్రమాదమువలన ఏదేని పాపము కలిగినను అది మాఘస్నానము చేయుట వలన నశించుచున్నది. ఇదినిశ్చయము. గంధర్వకన్యకలు దేనిచేతను నశింపనిశాపమువలన గలిగిన ఫలమును అనుభవించుచుండి రోమశమహాముని మాటలవలన మాఘస్నానము చేసి ఆపాపానుభవమునుండి విడువబడిరి. అని వసిష్ఠమహాముని చెప్పగా దిలీపమహారాజు ఆవింతయైన వృత్తాంతమును విని ప్రీతితో ఆమునియడుగులకు మ్రొక్కి వంగినవాడై మిక్కిలి యక్కరతో తనపురోహితుడైన వసిష్ఠునిగూర్చి యిట్లు పలికెను,

వద బ్రూహి కన్యాభిః శాపప్రాప్తిః కుతః కథమ్, కస్యాపత్యాని కాస్తా
సాం నామకిం కీదృశంవయః. కథం రోమశవాక్యేన విపాకాచ్ఛాపసంభ
వాత్, విముక్తాః కుత్ర తాస్సస్నుః మాఘమాసే తాః కతిసంఖ్యయా. వసి
ష్ఠః. శ్రూయతాం రాజశార్దూల ధర్మగర్భాం పరాంకథామ్, యథారణి
ర్వహ్నిగర్భః ధర్మసూర్వహ్నిసూరితి గంధర్వస్సుఖసంగీత స్తస్య
కన్యా ప్రమోహినీ, సుశీలస్య సుశీలాచ సుస్వరా స్వరవేదినః.
సుతారా చంద్రకాంతస్య చంద్రికా సుభగస్యచ, ఇమాని కిలనామాని
తాసా మప్సరసాంనృప. కుమార్యః పంచ సర్వాస్తా వయసాచ సమాః పు
నః, శోభంతే స్మ మిథస్తాశ్చ భగిన్య ఇవ సర్వదా. ఉద్భిన్నకుచపద్మిన్యః
పద్మిన్య ఇవ మాధవే, ఉన్మీలద్యౌవనైః కాంతా వల్లర్య ఇవ పల్లవైః, హే
మపంకజమాలిన్యః హేమాలంకారభూషితాః, స్వరగ్రామావలీఢాసు
వివిధామూర్ఛనాసుచ. తాశ్చ నానావినోదేషు వేణువీణాప్రవాదనే,
మృదంగనాదసంగీత లాస్యమార్గలయేషుచ. విచిత్రాదివినోదేషు కలా

---

దిలీపుని మాటలు.-ఓమహానుభావా! ఆకన్యకలకు ఎక్కడ ఏనిమిత్తముచేత శాపముకలిగెను వారు ఎవనిబిడ్డలు. వారిపేళ్లేమి. వారు ఎంతవయసుగలవారు. రోమశుని మాటచేత మాఘమాసమునందు ఎక్కడ స్నానముచేసిరి. ఎట్లు శాపానుభవమునుండి విడువబడిరి. వారు ఎందరు. అని దిలీపమహారాజు వసిష్ఠమహామునిని అడిగెను.

వసిష్ఠునిమాటలు.-ఓయిరాజశ్రేష్ఠుడా! లోపలనిప్పుగలదైన అరణిధర్మమును కలుగజేయునదిఅనియు అగ్నిని కలుగజేయునదియనియు అగునట్లు ధర్మమును తనలోపలగలదైనయీయుత్తమకథను చెప్పెదను వినుము. గంధర్వులలో సుఖసంగీతుడు అనువానికి ప్రమోహిని అనియు, సుశీలుడు అనువానికి సుశీలఅనియు సర్వవేదియనువానికి సుస్వరఅనియు, చంద్రకాంతుడు అనువానికి సుతారఅనియు, సుభగుడు అనువానికి చంద్రిక అనియు, కొమార్తెలు గలిగియుండిరి. ఈచెప్పబడినపేరులుగల అయిదుగురు కన్యకలును సమానవయస్సులుగలవారై పరస్పరముతోడబుట్టువులవలెనే యెప్పుడును ఒప్పుచుందురు. వారు వసంతఋతువునందలి తామరతీగలవలె నిక్కిన స్తనములనెడి తామరమొగ్గలు గలవారును చిగిర్చిన పూచిన లేతకొమ్మలవలె వికాసమునొందిన యౌవనముచేత అందగించువారును బంగారు కమలములసరములు ధరించినవారును బంగారుసొమ్ములచేత అలంకరింపబడినవారును నిషాదము మొదలగుస్వరసమూహముయొక్క అనుసరణమునందును ఆస్వరములయొక్క ఆరోహణావరోహణములయందును పిల్లనగ్రోవులనూదుట వీణలు వాయించుట మద్దలవాయించుట పాటలు పాడుట నాట్యముచేయుట ఆటపాటలను వాద్య

సుచ విశారదాః, పితృభిర్లాలితాస్సత్య శ్చేరుశ్చ ధనదాలయే. కౌతుకా దేకదా పంచ మిళితా మాసిమాధవే, కన్యా మందారపుష్పాణి విచిన్వం త్యో వనాద్వనం. గౌరీం సమారాధయితుం వరాంగనాః కదాచిదచ్ఛోద సరోవరం యయుః, హేమాంబుజాని ప్రవరాణి తాః పునః తస్మాదు పాదాయ వరోత్పలైస్సహ. వైడూర్యశుభ్రస్ఫటికప్రకుట్టిమే స్నాత్వా సరస్యాం పరిధాయ చాంబరం, మౌనేనచ స్థండిలపిండికామయీం సువర్ణసిక్తాభిరుమాం వినిర్మముః. ఆవాహ్య తాం కుంకుమపంక చందనై రభ్యర్చ్య గౌరీం వరపంకజాదిభిః, స్నానోపచారైశ్చ సుభక్తి భావితా లాస్యప్రయోగైర్ననృతుః కుమారికాః. గాంధర్వమాశ్రిత్య పరస్పరం తతో గేయం సుతారధ్వనిభి స్సమూర్ఛితం, ఏణీదృశస్తాః ప్రజగుః కళొత్కరం చారుప్రబంధంగతిభిశ్చ సుస్వరం. తస్మిన్ సుతీరే మృగచిత్తహర్షదే కన్యాస్వలం నిర్భరచిత్తవృత్తిషు, అచ్ఛోదతీర్థప్రవరే తదాగత స్స్నాతుం మునే ర్వేదనిధేస్సుతోఽగ్నిపః రూపేణ నిర్జితమనో

---

ములను లయింపజేయుట మొదలగు నానావిధవినోదములందును నానావిధములయిన శిల్పములందును నేర్పుగలవారును తల్లిదండ్రులచేత లాలనచేయబడుచున్నవారును అగుచు కైలాసమునందు సంచరించుచుందురు. అట్లు మెలగుచున్న యాకన్యకలు అయిదుగురును ఒకానొక వైశాఖమాసమునందు ఒకటిగా కూడి గౌరీపూజచేయువారై మందార పుష్పములను గోయుచు, పూదోటలవెంబడిని అచ్ఛోదము అనుకొలకునకుపోయి, ఆ కొలనిలో చక్కగావికసించియున్న బంగారు కలువపువ్వులను తామరపువ్వులును కొన్నిటిని కోసికొని దానిగట్టున వైడూర్యములను మంచిస్ఫటికములను పరచియున్న రాతికట్టడపునేలయందుంచి, స్నానముచేసి మడుగువస్త్రములుకట్టుకొని మౌనముతో దర్భలు మొదలగువానిచేత పరిశుద్ధముగా చేయబడిన ప్రదేశమునందుచేరి బంగారునీరుపోసి కలిపినపిండిచేత గౌరీప్రతిమనుచేసి అందు గౌరీదేవిని ఆవాహనచేసి కుంకుమపువ్వు మొదలగు పరిమళద్రవ్యములచేతను మంచిగంధముచేతను శ్రేష్ఠములయిన తామరపువ్వులచేతను స్నానము మొదలయిన ఉపచారములతో ఆగౌరీదేవిని పూజించి భక్తియుక్తులై సలక్షణముగా నాట్యముచేసి. గంధర్వ సంబంధమయిన మార్గమును అనుసరించి మిక్కిలి గట్టిగాను ముక్తాయింపులు ఎత్తుగడలు పొసగియుండునట్లు మంచి స్వరముతో ఒక ప్రబంధమును ఒప్పిదముగా పాడిరి. అట్లు మృగములకును మనస్సంతోషమును కలుగజేయునట్టి ఆయచ్ఛోదముయొక్క గట్టునందు ఆగంధర్వకన్యకలు వినోదించుచుండగా, అప్పటికి స్నానముచేయుటకై వేదనిధియను మునికుమారుడు అగ్నిపుడు అనువాడు

భవవిగ్రహోఽయం పయోజపత్త్రాయతలోచనో యువా, విస్తీర్ణవక్షా
స్సుభుజోఽథ సుందరః శ్యామచ్ఛవిః కామఇవాపరోహిసః. స బ్రహ్మచారీ
సుశిఖో విరాజతే దండేన యుక్తో ధనుషేవ మన్మథః, ఏణాజినప్రావరణ
స్సుసూత్రధృగ్బద్ధభమౌంజీకటిసూత్రమేఖలః తం దృష్ట్వా బ్రాహ్మణం
బాలాస్తాస్తత్ర సరసీతటే, జహర్షుః కౌతుకావిష్టాః కోఽయంనోనయ
నాతిథిః. సంత్యక్తనృత్యగీతాద్యా స్తస్యాలోకనలాలితాః, హరిణ్యో
లుబ్ధకేనైవ విద్ధాః కామేన సాయకైః పశ్యపశ్యేతి జల్పంత్యో ముహుః
పంచ సుసంభ్రమమ్,తస్మిన్ విప్రవరే యూని కామదేవభ్రమం యయుః.
పునఃపునస్తమభ్యర్చ్య నయనైః పంకజైరివ, పశ్చాద్విచారమారబ్ధ మప్స
రోభిః పరస్పరమ్ యద్యయం కామదేవస్స్యా ద్రతిహీనః కథం భవేత్,
అహోస్విదశ్వినా దేవౌ తౌ దేవౌ యుగచారిణౌ. గంధర్వః కిన్నరో వాథ
సిద్ధో వా కామరూపధృత్, ఋషిపుత్త్రోఽథ వాకశ్చిత్ కశ్చిద్వామానుషో
త్తమః అథవా కశ్చిదేవాయం ధాత్రాసృష్టోహి నః కృతే, యథాభాగ్య

---

వచ్చెను. అతడు మన్మథునికంటె చక్కదనముగల ఆకారమును తామరరేకులవలె విశాల
మయిన రొమ్మును చామనచాయయును వయసునుగలిగి రెండవమన్మథుడే యనదగి
అందగాడైయుండెను. అట్లు ఉన్నందున బ్రహ్మచారియు ఒప్పిదమయిన జుట్టుగలవా
డును ధనస్సు చేతబూనిన మన్మథునివిధమున దండమును చేతపట్టుకొన్నవాడును కృష్ణా
జినమును యజ్ఞోపవీతమును ధరించినవాడును దర్భమొలత్రాడు కట్టుకొన్నవాడును
నైన ఆమునికుమారుని సరోవరము గట్టునందున్న ఆగంధర్వకన్యకలు చూచి మనకన్ను
లకు వింతయిన యీతడు ఎవడో అని తమకమును పొందినవారై తమ ఆటపాటలను
మాని వానిని జూచుటయందలి మక్కువచేత బోయవాని బారిబడిన లేళ్లవిధమున మన్మ
థునిబాణములచేత గ్రుచ్చబడి మెచ్చినవారై తత్తరపాటుతో ఒకరితోనొకరు చూడు
ము చూడుము అని పలుకుచు వాడు మన్మథుడేయని భ్రమించి మరిమరిచూచుచు తమ
లోతాము ఈమీదచెప్పబోవువిధమున ఆలోచింపసాగిరి. వీడు మన్మథుడో యేమో,
మన్మథుడయినయెడ రతీదేవి లేకుండుట యెట్లు? అశ్వినీ దేవతలలో నొకడోయేమో,
అశ్వినీదేవతలు ఇద్దరును జతగా తిరుగుచుందురే. ఒకవేళ గంధర్వుడో కిన్నరుడో
సిద్ధుడో ఇట్లు కామరూపముధరించి వచ్చెనో, అట్లు కానిపక్షమున ఎవడో ఒక
ఋషికుమారుడో లేక సామాన్య మానవుడో కావలెను. వీనిని బ్రహ్మదేవుడు మనకు
గానే సృజించినట్లు తోచుచున్నది. అదృష్టవంతులయదృష్టమునకు పూర్వజన్మమునందు

వతామర్థే నిదానం పూర్వకర్మభిః. తథాసౌ కింకుమారీణాం గౌర్యానీతో ద్విజోత్తమః, ఏవం పంచసు కన్యాసు వదంతీషు నృపోత్తమ. శ్రుత్వా తద్వచనం తాసాం కృతమాధ్యాహ్నికక్రియః, ఆలోక్యహృదయేసోఽపి విఘ్నఏవఉపస్థితః బ్రహ్మవిష్ణుగిరిశాదయస్సురా యేఽపిసిద్ధమునయః పురాతనాః, తేఽపియోగబలినోఽపిమోహితా లీలయాతదబలాభిరద్భుతమ్. యోషితాంనయనతీక్ష్ణసాయకైర్భ్రూలతాసుదృఢచాపనిర్గతైః, ధన్వినామకరకేతునాహతః కస్యనోపతతిహామనోమృగః. తావదేవ నయధీర్విరాజతే తావదేవ జనతాభయం భవేత్, తావదేవ దృఢచిత్తతాభృశం తావదేవ గణనా కులస్యచ. యావదేవవనితేక్షణాస్త్రైర్నాద్యతే ధృతమదైర్న పూరుషః, మోదయంతి మదయంతి రాగిణో యోషితస్సులలితైర్మనోహరైః. మోదయంతి మదయంతి మామిమా ధర్మరక్షణపరం హికైర్గుణైః, మాంపరక్తమలమూత్రనిర్మితే యోషితాం వపుషి నిర్గుణే

చేసినకర్మములు మూలకారణము లయినట్లు కన్యకలమయిన మనము చేసినగౌరిపూజ మన యదృష్టమునకు మూలకారణమైనందున ఆగౌరిదేవిచేత ఈబ్రాహ్మణశ్రేష్ఠుడు ఇచ్చటికి తేబడెను. అని యీవిధమున ఆ అయిదుగురు కన్యకలును తమలోతాముమాటలాడుకొను చుండగా ఆమాటలను విని మధ్యాహ్నకాలమునందు చేయదగిన అర్ఘ్యప్రదానము మొదలగు కృత్యములు చేసికొని నాబ్రహ్మచర్యమునకు ఇదియొకవిఘ్నము పొసగునట్లున్నది. పూర్వకాలమువారైన బ్రహ్మ విష్ణువు మహేశ్వరుడు ఇతరులైనదేవతలు యోగసిద్ధినిపొందిన మునులు మొదలగువారనేకులు యోగబలముగలవారై యుండియు స్త్రీల యొక్క విలాసచేష్టలచే మోహింపజేయబడినవారైరి. ఇది ఆశ్చర్యము. స్త్రీలయొక్క కనుబొమలనెడి దృఢములైన విండ్లవలననుండి వెడలెడి చూపులనెడి చురుకైనబాణములచేత విలుకాడైన మన్మథుడు కొట్టగా ఎవనిమనసనెడి మృగము పడక తప్పించుకొనును. (అనగా లోకములో స్త్రీలవిలాసచేష్టలు చూచి మోహింపనిపురుషుడు లేనేలేడు యనియర్థము) ఎంతపర్యంతము స్త్రీలచూపులనెడి మద్యముచేత మత్తుచెందక ఉండునో అంతవరకే న్యాయబుద్ధి కలిగియుండును. జనసమూహము భయములేనిది ఆగును. దృఢమయి చలింపని మనసుగలిగియుండును. కులమునందు మిక్కిలి యెన్నిక కలిగియుండును. అవల ఈ చెప్పబడినవానిలో ఒకటియును ఉండదు. స్త్రీలు మనోహరమయిన విలాసచేష్టలచేత అనురాగము గలపురుషులు మత్తుగొన్నవారినిగాను సంతోషించినవారినిగాను చేయుచున్నారు. అట్లే ఇప్పుడు ఈకన్యకలును నాధర్మమును కాపాడుకొనుటయందు ఆసక్తములైన గుణములు ఏవికలవో వానిచేత నన్ను సంతోషించిన

ఉశుచౌ. కామినస్తు పరికల్ప్య చారుతాం హారమంతి సువిమూఢచేతసః, యావదత్ర నసమీపగా ఇమాస్తావదేవ స్వగృహం వ్రజామ్యహమ్. సమీపం తస్య యావత్తాః గచ్ఛంతిస్మ పరస్త్రియః, వైష్ణవేన ప్రభావేన తావదంతర్దధే ద్విజః. తస్య యోగబలోద్భూతం ద్విజస్యాదర్శనం తథా, దృష్ట్వా తదద్భుతం కర్మ వైష్ణవం బ్రహ్మచారిణః. విత్రస్తనయనా బాలాః కురర్యఇవ కాతరాః, సంభ్రాంతనయనాశ్శూన్యాః దదృశుస్తా దిశోదశ. కన్యకాః. ఇంద్రజాలంస్ఫుటంవేత్తి మాయాంజానాతివాపునః, దృష్టోప్యదృష్టరూపోఽభూదిత్యూచుశ్చ పరస్పరమ్. తప్తంచ హృదయం తాసాం తస్యైవ విరహాగ్నినా, జ్వలద్దావానలేనైవ సుస్నిగ్ధం సాంద్రకాననమ్. త్యక్త్వేంద్రజాలికీం విద్యాం కాంత దర్శయ సత్వరమ్, త్వద్దర్శనం వినా నూనం హృదయేశ్వరసాంప్రతమ్. నజీవామోథజీవామః పునస్సందర్శనాయవా, అస్మాచ్చ నీయతాం తత్ర శీఘ్రం యత్రగతోభవాన్. ఇత్థం విల

---

వానిగాను మత్తుగొన్నవానిగాను చేయుదురు. ఔరా! ఇక్కాలి మూఢబుద్ధులయిన కాముకులు మాంసము రక్తము మలము మూత్రము వీనితోగూడి మంచిగుణములు లేనిదియు అపరిశుద్ధములైన స్త్రీదేహమునందు మనోహరత్వమును కల్పించుకొని క్రీడించుచున్నారు. కనుక ఈకన్యకలు నాదగ్గరకు వచ్చునంతలోపల నేను నాయింటికిపోయి చేరదను. అని యిట్లు తనలోతాను ఆలోచించి ఆస్త్రీలు తన దగ్గరకువచ్చునంతలో విష్ణుభక్తివలని ప్రభావముచేత బ్రాహ్మణుడు వారికనులకు కానరాకపోయెను. అంతట ఆకన్యకలు యోగబలమువలన నైన యాబ్రహ్మచారియొక్క కానరాకపోవుటను విష్ణుసేవవల్ల నైనదియు ఆశ్చర్యమయినదియు నైన వానిమహిమను ప్రత్యక్షముగా చూచి బెదురుచూపులు గలవారును కురరులు అను పక్షులవలె గట్టిగా మొగపెట్టువారునునై దిక్కులుచూచుచు నిలువబడి, ఈబ్రాహ్మణుడు ఇంద్రజాలవిద్య చక్కగా తెలిసినవాడు. ఇదిగాక అనేకమాయలు తెలిసినవాడు. అట్లుకానిపక్షమున మనకన్నులయెదుట నున్నవాడు ఇంతలోనే కానబడకపోవునా? అని ఒకరికొకరు చెప్పుకొనివానియెడబాటువలన మండుచున్న కార్చిచ్చువల్ల దట్టముగా పెరిగిన అడవివలె తమ మనసులు మండగా, ఓయిప్రియుడా! ఇంద్రజాలవిద్యను వదలి శీఘ్రముగా మాకు పొడచూపుము. ఇప్పుడు నిన్నుచూడక బ్రదుకజాలము. మరల నీదర్శనము కాగలదని బ్రతికియున్నాము. కనుక ఇప్పుడు నీవెక్కడికి పోతివో అక్కడికి మమ్మును తీసుకొనిపొమ్ము అని యీవిధముగా మొరపెట్టుచు చాలసేపు వానిరాకకు ఎదురుచూచి, ఇంకను ఆలస్యముచేసిన యెడల తమతండ్రులు ఏమందురో అనుభయముచేత అంతటితో పోయి ఇల్లుచేరయ

ష్య తాః కన్యాః ప్రతీక్ష్యచ బహుక్షణమ్,పితుర్భయాద్గృహం గంతుం శీఘ్రమారేభిరేతతః. తత్రైమునిగణైర్బద్ధాభృశం విరహవిక్లబాః, కథంచిద్ధైర్యమాలంబ్య తాస్తాస్స్వంస్వం గృహంగతాః. ఆగత్య పతితాస్సర్వా జలయంత్రసమీపతః,కిమేతన్మాతృభిః పృష్టాః కుతః కాలాత్యయోభవత్. కన్యకాః.క్రీడంత్యః కిన్నరీభిస్తు సార్థం సంహతకంచుకాః, సంస్థితాస్మ నవిజ్ఞాతో దివసోంబుదరోధనాత్. పథి శ్రాంతావయం మాతః సంతాపస్తేన నస్తనౌ, ఇత్యుక్త్వా లులుఠు స్తత్ర మణిభూమౌకుమారికాః.

ఇతి శ్రీపాద్మేపురాణే, మాఘమాహాత్మ్యే, గంధర్వకన్యకాచరితంనామ అష్టత్రింశోఽధ్యాయః.

---

## ఏకోనచత్వారింశోఽధ్యాయః.

వసిష్ఠః. ఆకారం గోపయంత్యస్తా ముగ్ధాజల్పంతి మాతృభిః. కాచిన్నర్తయతి క్రీడామయూరం సముదాహృతా. నవాదయంతి తం కీరం

---

త్నించియు వానివలన ప్రేమయనెడి సంకెళ్లలో చిక్కుపడినవారై ఆవిరహమువలన మిక్కిలి దీనతనొంది ఆకన్యకలు ఎట్లోకొంచెము ధైర్యము తెచ్చుకొని తమతమయిండ్లకు పోయి అచ్చటనుండెడి స్థలము మొదలగు జలయంత్రముల వెంబడి పడియుండిరి. అప్పుడు ఆకన్యకలతల్లులు వారినిజూచి యిదియేమి యీయవస్థ. ఇంతసేపు ఎక్కడ ప్రొద్దుపుచ్చితిరి అని అడిగిరి.

కన్యకలమాటలు.—ఓయమ్మా! మేము నేడు కిన్నరకన్యకలతో గూడి రవికలు సయితము వీడిపోగా ఆడుకొనుచు మేఘములు ఆవరించియుండుటచేత ప్రొద్దుతెలియక ఇంతసేపు ఉంటిమి. విశేషసంచారము చేసితిమి గనుక మార్గాయాసమువలన మిక్కిలి చెట్టతగిలి మాదేహములు వాడియున్నవి. అని తల్లులకు సమాధానముచెప్పి రత్నములు పరపియున్న యాప్రదేశములందు పొర్లాడుచుండిరి.

ఇది శ్రీపద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు గంధర్వకన్యకలచరిత్రమును తెలుపునదియైన ముప్పదిఎనిమిదవ అధ్యాయకథ.

---

## ముప్పదితొమ్మిదవ అధ్యాయము.

వసిష్ఠునిమాటలు.—అటుపిమ్మట ఆకన్యకలలో ఒకతె నెమలిని ఆటనేర్పుదానివలె నిలిచినచోట నిలువలేక చిందులు త్రొక్కుచుండెను. మరియొకతె పంజరములోని చిలుకతో పలుకకయుండెను. ఇంకొకతె తాను పెంచుపట్టి గోరువంకతో మాటలాడ

పంజరస్థం కుతూహలాత్, లాలయేచ్ఛుకులం నాన్యా నాలాపయతి శారికామ్. అబలాతుపరాముగ్ధా నైవ ఖేలతి సారసైః, ఖేజిరేనలినోదం వా రేమిరే నైవమందిరే. ఊచుశ్చ బాంధవైర్నాలంవీణావాద్యంనచక్రిరే, కల్పద్రుమప్రసూతంయ ద్రసవచ్చ సుఖాస్పదమ్ మందారకుసుమామోదినపపుర్మధురం మధు, యోగిన్య ఇవ తాఃకన్యా నాసాగ్రన్యస్తలోచనాః. ఆలక్ష్యధ్యానసంతానాః పురుషోత్తమమానసాః, చంద్రకాంతమణిచ్ఛన్నే ప్రవద్వారికక్షైర్నవైః. క్షణం వాతాయనే స్థిత్వా జలయంత్రేక్షణం యథా, రచయంత్యః క్షణంశయ్యా దీర్ఘికాంభోజనీరజైః. వీజ్యమానాస్సఖీభిస్తాః శిశిరైః కదళీదళైః, ఇత్థం యుగసమాంరాత్రి మనయంస్తా వరస్త్రియః కథంచిద్ధీరతాం కృత్వా సజ్వరావిజ్వరా ఇవ, ప్రాతరోర్యమణిందృష్ట్వా మన్యమానాస్వజీవితమ్. విజ్ఞాప్యమాతరంస్వాంస్వాం గౌరీం పూజయితుంగతాః, స్నాత్వా తేన విధానేన పుష్పైర్ధూపైస్తథాపునః. విధాయపూజనందేవ్యా గాయంత్యస్తత్ర తస్థిరే, ఏతస్మిన్నంతరే సోఽపి స్నాతుం విప్రస్సమాగతః. పితురాశ్రమతస్తస్మా దచ్ఛోదేఽత్ర సరోవరే,

---

నివయ్యెను. మరియొకతె ముంగిసను లాలింపనిదయ్యెను ఇంకొకతె సారసపక్షులతో ఆటలాడదయ్యెను. ఇట్లు తామరకొలనికి పోకయు ఇంటిలో ఆటలాడకయు చుట్టములతో చక్కగా మాటలాడకయు వీణలు వాయింపకయు కల్పవృక్షపుపువ్వులవల్లనైన రసవంతమును సౌఖ్యకరమును కల్పవృక్షపుపువ్వులవాసన గలిగినదియును అగు కమ్మనితేనెను త్రాగకయు యోగాభ్యాసము చేయునట్టి విరక్తస్త్రీలవలె ముక్కుకొనను చూపు నిలిపినవారును గురికతప్పక ధ్యానించువారును శ్రీవిష్ణుమూర్తిపై తలపుగలవారును క్రొత్తనీటిబొట్లు పడుచున్నదియు చంద్రకాంతపురాళ్ల చేత కప్పబడినదియునైన కిటికీయందు క్షణకాలమును జలయంత్రమునొద్ద క్షణకాలమును నడబావియందలి తామర పువ్వులు కలువలుపరచిన పానుపుపయి క్షణకాలమును చల్లనిలేత అరటియాకులతో చెలికత్తెలు వీవగా ఇట్లు ఒకయుగముతో సమానమయిన నాటిరాత్రిని కడసి తెల్లవారిప్రొద్దుపొడవగాజూచి బహుప్రయాసముచేత ధైర్యము తెచ్చుకొని విరహతాపముగలవారయ్యు లేనివారివలె ఈరాత్రి విరహవేదనచేత చావక బ్రతికితిమి. అనితలచుచు తమ తల్లులతో గౌరీదేవిని పూజింపబోయెదమని చెప్పి సెలవుపుచ్చుకొని అచ్ఛోదమునకు పోయి ఆకొలనిలో స్నానముచేసి పువ్వులచేతను ధూపము మొదలగు ఉపచారముల చేతను యథావిధిగా గౌరినిపూజించి అచ్చట నిలిచి పాటలు పాడుచుండిరి. అప్పుడు తొలునాటి బ్రహ్మచారి తనతండ్రి యాశ్రమమునందుండి ఆయచ్ఛోదమనెడి కొలనికి

మిత్రం దృష్ట్వాహి రాత్ర్యాంతే పద్మిన్య ఇవ కన్యకాః, ఉత్ఫుల్లనయనా జాతా_స్తం దృష్ట్వా బ్రహ్మచారిణమ్. గత్వా తత్రైవ తాః కన్యాః సమీపం బ్రహ్మచారిణః, సవ్యాపసవ్యబంధేన భుజపాశం విచక్రిరే. గతోసి ధూర్త పూర్వేద్యు ర్గంతుమద్య నలభ్యతే, వృత స్త్వం నూనమస్మాభి ర్నాత్ర తే స్తి. విచారణా ఇత్యుక్తోసౌ ద్విజః ప్రాహ ప్రహసన్ బాహుపాశగః. బ్రాహ్మణః. యుష్మాభిరుచ్యతే భద్రమనుకూలం ప్రియం వచః, ప్రథమాశ్రమనిష్ఠస్య కిం నాద్యాపి మే వ్రతమ్ వేదాధ్యయననిష్ఠస్య పారంయాతుం గురోః కులే, ప్రథమో యత్ర యో ధర్మో రక్షణీయస్స పండితైః. వివాహో యమతో మన్యే నధర్మ ఇతి కన్యకాః, ఆకర్ణ్య తస్య వాక్యాని తమూచుస్తా వరస్త్రియః. సకలధ్వనినోత్కంఠాః కోకిలా ఇవ మాధవే కన్యకాః. ధర్మాదర్థో ర్థతః కామః కామాద్ధర్మఫలోదయః, ఇత్యేవం నిర్ణయం శాస్త్రే వర్ణయంతి విపశ్చితః. స కామో ధర్మబాహుళ్యా త్పురస్తే సముపస్థితః, సేవ్యతాం వివిధైర్భోగైః స్వర్గభూమిరియం తతః. శ్రుత్వా తద్వచనం తాసాం ప్రాహ గంభీరయా గిరా, తథ్యం వో వచనం కింతు సమాప్యైతత్స్వకం వ్రతమ్ ఆ

---

స్నానము చేయవచ్చెను. ఆకన్యకలు రాత్రిపోగానే సూర్యునిజూచి వికాసమును పొందెడి తామరతీగలవలె తేటపారిన కన్నులుగలవారై ఆబ్రహ్మచారినిజూచి వాని దగ్గరకు పోయి కుడియెడమలచేతులు పెనవేసికొని నిలిచి, ఓమోసకారిబాపడా! నిన్నటిదినము పారిపోతివి. నేడు అట్లుపోను సరిపడదు. మాచేత చక్కగా పట్టుబడితివి. ఇక అట్టి యాలోచన నీకేల అని కన్యకలు పలుకగా, వారిచేతులపెనకో చిక్కికొన్న బ్రాహ్మణకుమారుడు నవ్వుచు, ఓకన్యకలారా! మీరు నాకు అనుకూలమును ప్రియమునైనమాటనే చెప్పితిరి. ఐనను నేను బ్రహ్మచర్యమునందు వేదాధ్యయనము చేయుచు గురువునింట ఉన్నాను. నాకు బ్రహ్మచర్యవ్రతమును గురుకులవాసమును పూర్తికాలేదు. తెలిసినవారు ఏయాశ్రమమునందుండునపుడు ఆయాశ్రమధర్మమును తప్పకనడపుదురు. కనుక ఇప్పుడు ఈవివాహకార్యము నాకు ధర్మముకాదని తోచుచున్నది. అని చెప్పిన బ్రహ్మచారిమాటలను విని ఆకన్యకలు వసంతఋతువునందలి కోకిలల కంఠస్వరములవలెనే ఒప్పెడి అవ్యక్తమధురధ్వనులతో ఇట్లు పలికిరి. ఓబ్రాహ్మణుడా! ధర్మమువలన అర్థమును అర్థమువలన కామమును కామమువలననే అర్థముయొక్క ఫలమును కలుగును అనుట శాస్త్రమునందలి నిర్ణయము అని పండితులు చెప్పుదురు. కామముతోగూడిన నీకు ధర్మముయొక్క ఆధిక్యముచేత నానావిధములైన భోగములతో స్వర్గము యెదుటికి వచ్చియున్నది. ఇందు ఆభోగములను అనుభవింపుము. అనగా బ్రాహ్మణకుమారుడు

జ్ఞాంచైవ గురోః కుర్యాం వైవాహంకర్మ నాన్యథా, ఇత్యుక్త్వా పునరూచుస్తాః స్ఫుటం మూర్ఖోసి సువ్రత. సిద్ధౌషధం బ్రహ్మాధియాం రసాయనం విధేః కృతా సాధువరాకులాంగనా, మంత్రస్తథా సిద్ధవరశ్చ ధర్మతో నతే విషాద్యాస్సుధియస్సమాగతాః. కుర్యాత్తు దైవాదపి సిద్ధమాగతా నాస్మిన్నుపేక్షాం నచ యాంతి నీతిగాః, యస్మాదుపేక్షా న పునః ఫలేప్సునా తస్మాన్న దీర్ఘాకరణం ప్రశస్యతే. విషాదప్యమృతం గ్రాహ్యం అమేధ్యాదపి కాంచనమ్, నీచాదప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి. సాంద్రానురాగా కులజన్మనిశ్చలా స్నేహార్ద్రచిత్తాసుగిరాస్వయంవరా, కన్యాసురూపాఖిలు చారులోచనా ధన్యా లభంతేత్ర వరస్యనేతరే. క్వవయం సురసుందర్యః క్వ భవాన్ తాపసోవరః, దుర్ఘటస్యవిధానేన మన్యే ధాతా సపండితః. తస్మాచ్ఛీఘ్రమిదానీంత్వం స్వీకుర్యాస్మంగతం భవాన్, గాంధర్వేణ వివాహేన న జీవామోఽన్యథావయమ్. శ్రుతవాక్యస్తతః ప్రాహ బ్రాహ్మణో వేదవిద్వరః, భోమృగాక్ష్యః కథం త్వా

---

విని మీరుచెప్పినది నిజమే ఐనను ఈనావ్రతమును కడవెళ్లనడపి గురువువలన ఆజ్ఞ తీసికొని పిమ్మట పెండ్లిచేసికొనెదను. అంతపర్యంతము నేను పెండ్లాడను. అనగా కన్యకలు, ఓయి! నీవు మిక్కిలి మూర్ఖుడవు. తత్త్వబుద్ధిగలవారికి శాస్త్రపద్ధతి తప్పక పెండ్లాడిన పెండ్లాము సిద్ధౌషధమైన రసాయనము. అట్లే సిద్ధుడగు నుత్తమునికి ధర్మము వలన మంత్రమును ఆగును. కనుక విద్వాంసులు విషయమువలన పొందబడనివారైనను కన్యకలను అనుగ్రహింతురు. నీతిమంతులగువారు దైవికముగా వచ్చిన అట్టివారిని అంగీకారముచేయక ఉపేక్షింపరు. ఒకవేళ ఉపేక్షించినయెడ మరల పొందుట దీర్ఘకాలము పట్టును. ఇదిగాక విషమువల్లనైనను అమృతమును అమేధ్యమువలననైనను బంగారును (ధనమును) నీచునివలననైనను మంచివిద్యను చెడ్డకులమువలన నైనను శ్రేష్ఠురాలైన కన్యకను గ్రహింపదగినది. మరియు మిక్కిలి అనురాగము కలిగినదియు మంచికులమునందలి పుట్టుకచేత చలింపనిదియు ప్రీతితోడి మనసు కలిగినదియు తానుగావరించినదియు మంచి చక్కదనము గలిగినదియు ఒప్పిదములైన కన్నులుగలిగినదియు నైన కన్యక పుణ్యాత్ములకేగాని ఇతరునికి లభింపదు. మేము దేవతాస్త్రీలము. నీవు బ్రాహ్మణశ్రేష్ఠుడవు. నీకు మేము సులభముగా లభించువారము కాము. అటువంటి మమ్మును నిన్నును కూర్చుటవలన బ్రహ్మ మిక్కిలి తెలిసినవాడు అగుచున్నాడు. కనుక ఇప్పుడు గాంధర్వవిధిచేత మమ్ము శీఘ్రముగా పెండ్లాడుము, అట్లు చేయనియెడ మేము బ్రదుకజాలము. అనగా విని

జ్ఞో ధర్మో ధర్మపరైర్నరైః ధర్మశ్చార్థశ్చ కామశ్చ మోక్షశ్చేతిచతుష్ట
యమ్, యతోధర్మవిచారేణ ప్రసక్తం మమ మానసమ్. తస్మాచ్ఛృణుత
హేకన్యా నచేచ్ఛామి స్వయంవరమ్, ఏవంజ్ఞాత్వాశయం తస్య సమీ
క్ష్యైవ పరస్పరమ్.కరాత్కరం విముచ్యాథ జగ్రాహాంఘ్రిం ప్రమోహినీ.
భుజౌచజగృహే స్తస్య సుశీలాసుస్వరాతదా. ఆలిలింగే సుతారాచ చు
చుంబాస్యంచ చంద్రికా, తథాపి నిర్వికారోఽసౌ ప్రళయానిలసన్నిభః,
శశాపబ్రహ్మచారీతాఃకోపేనాత్యంతమూర్ఛితః, పిశాచ్యఇవమాంలగ్నా
స్తత్పిశాచ్యో భవిష్యథ. ఏవం తేనానుశప్తాస్తా స్సంత్యక్త్వా పురతః
స్థితాః. కన్యాః కిమేతచ్చేష్టితం పాపమనాగసి జనేత్వయా, ప్రియం కృ
త్యంప్రియంకర్తా ధర్మోధర్మజ్ఞతాతవ.అనురక్తేషు భక్తేషు మిత్రేషు ద్రోహ
కారిణః,పుంసో లోకద్వయే సౌఖ్యం నవిందంతీతి నశ్శ్రుతమ్.తస్మాద్భవాం
శ్చనశ్శాపాత్పిశాచోభవ సత్వరమ్, ఇత్యుక్త్వాపరతాబాలా నిశ్వసంత్య

---

ఆబ్రాహ్మణకుమారుడు ఓకన్యకలారా! ధర్మమునందు ఆసక్తిగలమానవులు ధర్మమును ఎట్లు విడుతురు. ధర్మము అర్థము కామము మోక్షము అని నాలుగు పురుషార్థములు. అందు ధర్మవిచారమునందు నామనసు పొందియున్నది కనుక నామాటవినుడు. ఇప్పుడు నేను మీవరణమును ఇచ్ఛింపను. అనిచెప్పెను. అంతట ఆకన్యకలు వాని అభిప్రాయము ఇట్టిదని తెలిసి, ఒకరిమొగము ఒకరు చూచుకొనుచు, ఇక మాటలచే వీడు లోబడడు అని తమలోతాము పెనవేసికొన్నచేతులు విడదీసికొని, ప్రమోహిని అనునది ఆతనియడుగులను పట్టుకొనెను. సుశీల సుస్వర అనువారు ఇద్దరును రెండుభుజములను పట్టుకొనిరి. సుతారఅనునది కౌగిలించుకొనెను. చంద్రికఅనునదివానిమొగమును ముద్దుపెట్టుకొనెను. అట్లు ఆకన్యకలు మనోవికారము కలుగుకార్యములు చేసినను ప్రళయకాలపు అగ్నితో సమానుడగు ఆబ్రాహ్మణకుమారుడు వికారమేమియు పొందనివాడై అతిశయించిన కోపముచేత ఒళ్లుతెలియక మీరు దయ్యములవలె నన్ను పట్టుకొంటిరి. గనుక దయ్యములు అగుడు అని శపించెను. ఇట్లు అతడు శపింపగానే ఆకన్యకలు ఆతనినివదలి ఎడముగాపోయి యెదుట నిలువబడి, ఓబ్రహ్మచారీ! నీవు ఏతప్పును లేని మాయెడల యెంతటి అపకారము చేసితివి? ప్రియమేకృత్యము. ప్రియమేధర్మము. అట్లుండగా ఇట్లుచేసిన నీధర్మము తెలిసినతనము ఏల? తనయందు అనురాగము గలవారును భక్తులును స్నేహితులు ఆగువారికి ద్రోహముచేయుపురుషులు ఇహపరలోకములు రెంటియందును సౌఖ్యము పొందజాలరు అను పెద్దలమాట నీవు వినియెరుగవు. కాబట్టి నీవును మాశాపమువలన శీఘ్రముగ దయ్యమవు అగుము. అని పలికి ఆకన్యకలు తమ

క్షుధాకులాః. తత్రైవాన్యోన్యసంరంభా స్తస్మిన్ సరసిపార్థివ, తాః కన్యా
బ్రహ్మచారీచ సర్వేపైశాచతాంగతాః. క్రందంతి పితరస్తాసాం మాత
రస్తత్రతత్రచ, హాప్రమాదాశ్చబాలాస్తాదైవోహిదురతిక్రమః. అతఊ
ర్ధ్వంపిశాచ్యస్తా ఆక్రోశంత్యస్సుదుఃఖితాః, పిశాచ్యశ్చపిశాచశ్చ క్రంద
మానాస్సుదారుణమ్. ఉపయంతి విపాకంతం పూర్వోపాత్తస్య కర్మణః,
నకాలేప్రభవత్యేవ పూర్వోపాత్తం శుభాశుభమ్. స్వచ్ఛాయామివ
దుర్వారం దేవానామపిపార్థివ, ఇత శ్చేతశ్చధావంత్యో వసంత్యస్సరస
స్తటే. ఏవం బహుతిథే కాలే రోమశో మునిసత్తమః.పుష్యేచైవ చతు
ర్దశ్యా మచ్ఛోదే స్నాతుమాగతః. తందృష్ట్వా బ్రాహ్మణం సర్వే పిశా
చాఃక్షుత్సమాకులాః, ధావంత్యో హంతుకామా స్తే మిళితా యూథవ
ర్తినః. దహ్యమానా స్సుతీక్ష్ణేన రోమశస్యచ తేజసా, అసమర్థాః పురః
స్థాతుం తేసర్వే దూరతః స్థితాః. తత్ర వేదనిధిర్విప్ర స్తత్రైవ సముపాగ
తః, సమీక్ష్యరోమశం రాజన్ సాష్టాంగం ప్రణిపత్యచ. ఉవాచసూనృ
తాంవాచం కృత్వాశిరసిచాంజలిమ్, మహాభాగోదయేవిప్రసాధూనాం

---

వ్యాపారములన్ని మాని నిట్టూర్పులు విడుచుచు ఓర్వరాని ఆకలి బాధింపగా ఆసరస్సు
వద్దనే యుండిరి. ఇట్లు ఒకరొకరి వేగిరపాటువలన ఆకన్యకలును బ్రహ్మచారియు
దయ్యములై మిక్కిలి భయంకరముగా మొఱపెట్టుకొనుచు పూర్వజన్మమునందు చేసిన
కర్మఫలము అనుభవమునకు రాగా అచ్చట కాలముగడుపవలసినవారైరి. ఓరాజా! ఎవరి
కైనను వారువారు చేసిన పుణ్యపాపకర్మములఫలములు అనుభవింపవలసిన కాలమునందు
అనుభవించియే తీరవలెను. ఆశుభాశుభఫలములు దేవతలకైనను తమనీడలవలెనే తొల
గింపకూడనివై అంటియుండును గాని వదలిపోనేరవు. పిమ్మట ఆకన్యకలతల్లిదండ్రులు
వారివృత్తాంతమును విని, అయ్యో! ప్రమాదమువచ్చెనే దైవగతి మీరరానిదికదా అని
ఎక్కడనున్నవారు అక్కడనే పడి యేడువసాగిరి. అంతట ఆకన్యకలును మిక్కిలి
క్రూరముగా ఏడ్చిరి. ఇట్టి చిత్తవృత్తితో ఆసరస్సుగట్టునందు పోరాడుచుండగా బహు
కాలము కడచెను. అంతట ఒకపుష్యబహుళచతుర్దశియందు ఆయచ్ఛోదమనెడి సరస్సు
నందు స్నానముచేయుటకై రోమశుడు అను మహాముని వచ్చెను. అప్పుడు ఆకలిచేత
బాధపడుచున్న ఆదయ్యములన్నియుంగూడి ఆయననుపట్టి చంపి తినదలచి చేరబోయి
తీక్ష్ణమైన ఆయనతేజస్సుచేత కాల్పబడినవై ఆయనయెదుట నిలువలేక దూరముగా
పరుగెత్తిపోయి నిలిచెను. అంతలో మగదయ్యము తండ్రియైన వేదనిధి అను బ్రాహ్మణు
డును అచ్చటికి స్నానముచేయవచ్చి రోమశమహామునినిజూచి సాగిలబడి దండము పెట్టి
చేతులు జోడించుకొని తిన్ననిమాటలతో, ఓ మునిశ్రేష్ఠుడా! మీబోటి పెద్దలసహవా

సంగతిర్భవేత్. గంగాది సర్వతీర్థేషు యోనరస్స్నాతి సర్వదా, యః కరోతి సతాంసంగం తయోస్సత్సంగతిర్వరా. గురూణాంసంగమోవిప్ర దృష్టాదృష్టఫలప్రదః, స్వర్గదో రోగహారీచ కిం తపో నిగ్రహోమతః. ఇత్యుక్త్వాకథయామాస పూర్వవృత్తాంతమద్భుతమ్, ఇమే గంధర్వకన్యాస్తా స్సోఽయం మమ తనూభవః. సర్వే పిశాచరూపేణ మిథశ్శాపవిమోహితాః, దీనాననాశ్చ తిష్ఠంతి తవాగ్రే మునిసత్తమ. త్వద్దర్శనేన బాలానాం నిస్తారోఽద్య భవిష్యతి, సూర్యోదయే తమస్తోమః కింనహీయేత పుష్కలః. శ్రుత్వైవం రోమశో రాజన్ కృపార్ద్రీకృతమానసః, ప్రత్యువాచమహాతేజాస్తంమునింపుత్రదుఃఖితం. రోమశః. మత్ప్రసాదాచ్చ బాలానాం స్మృతిస్సపది జాయతామ్, ధర్మంచ వచ్మితేయేన మిథశ్శాపోలయం వ్రజేత్.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే గంధర్వకన్యకానాం
బ్రాహ్మణకుమారస్యచ పైశాచ్యప్రాప్తిర్నామ
ఏకోనచత్వారింశోఽధ్యాయః.

---

సము గొప్ప మేలుకలుగుటకే లభించును. ఎల్లప్పుడు గంగ మొదలగు పుణ్యతీర్థములు అన్నిటియందును స్నానముచేయుట సత్పురుషుల సహవాసముచేయుట అనువీరెంటియందును సత్పురుషుల సహవాసము ఉత్తమము. స్వర్గమును ఇచ్చునదియు రోగములను పోగొట్టునదియునైన పెద్దలయొక్క సహవాసము ఎదుట తోచునవియు తోచనివియునైన ఫలములను ఇచ్చునది అగుచున్నది. తపస్సు ఏల? తపస్సుయొక్క తిరస్కారము ఏల? అని యిట్లు ప్రియములు చెప్పి వింతయైన ఆపిశాచములపూర్వవృత్తాంతమును చెప్ప నారంభించెను. ఈయెదుటనుండెడి ఆడుదయ్యములు గంధర్వకన్యకలు. ఈమగదయ్యము నాకొమారుడు. వీరుపరస్పరము శపించుకొనుటచేత ఈపిశాచరూపములనుపొంది చిన్నబోయిన మొగములతో నీయెదుట నిలువబడిరి. నీదర్శనముచేత ఈచిన్నవాండ్రకు శాపవిమోచనము కావలసినది. సూర్యుడు ఉదయించినగొడ చీకటి నిండుకొనియుండుట ఎక్కడనైనను కలదా? అని వేదనిధి చెప్పగా, రోమశమహాముని విని కొడుకునుగూర్చి దుఃఖించుచున్న ఆవేదనిధితో, అయ్యా, నాఅనుగ్రహమువలన ఈ పిల్లకాయలకు ఎప్పటి తెలివికలుగును. నేనొకధర్మమును చెప్పెదను. దానిని నడపుటచేత వీరి శాపములు తొలగును అని చెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు బ్రహ్మచారియు గంధర్వ
కన్యకలును పరస్పరము శపించుకొని పిశాచములైన కథను తెలుపునట్టిదైన
ముప్పదితొమ్మిదవ అధ్యాయకథ.

## చత్వారింశోఽధ్యాయః.

వేదనిధిః. మహర్షేకథ్య తాంధర్మో ముచ్యేరన్యేనబాలికాః, నాయం కాలోవిలంబస్య శాపాగ్నిర్దారుణోయతః. రోమశః. మయాసార్థం ప్రసుర్వంతు మాఘస్నానవిధానతః, శాపాన్మోక్ష్యంతి మాఘాంతేనాన్యథా నిష్కృతిర్భవేత్. మాఘస్నానేనసత్తీర్థే ఇతినోనిశ్చితామతిః, సప్తజన్మకృతంపాపం వర్తమానంచదారుణమ్. మాఘస్నానం దహేత్కృత్స్నం పుణ్యతీర్థే విశేషతః, ప్రాయశ్చిత్తం నపశ్యంతి తస్మిన్ పాపే మునీశ్వరాః. పాపంతు పుణ్యతీర్థేషు నశ్యేత్తదపి మాఘతః, స్నానకృన్మానసే మాఘు స్తస్మాన్మోక్షఫలప్రదః. హిమవత్ప్రభృతీర్థేషు సర్వపాపప్రణాశనః, సారస్వతోఽఘువిధ్వంసో బ్రహ్మలోకప్రద స్తథా. విశాలఫలదో మాఘో విశాలాయాం ద్విజోత్తమ, పాపేంధనదవాగ్నిర్హి భవహేతుక్రియాపహా. విష్ణులోకాయ మోక్షాయ జాహ్నవీచ ప్రకీర్తితా, సర

---

## నలువదవ అధ్యాయము.

వేదనిధిమాటలు. ఓరోమశమహామునీ! ఈకన్యకలశాపము తీరెడి ధర్మము ఏదో దానిని చెప్పుము. శాపమనెడి నిప్పు మిక్కిలి క్రూరమయినది గనుక ఇది ఆలస్యము చేయం సమయము కాదు.

రోమశునిమాటలు. ఓబ్రాహ్మణుడా! వినుము. వీరిప్పుడు నాతోగూడ యథావిధిగా మాఘస్నానము చేయవలయును. అట్లు చేసినపక్షమున వీరిశాపములు మాఘమాసము కడవెళ్లినంతలో తీరును. ఇక ఏమిచేసినను ఈశాపములు తీరవు. పుణ్యతీర్థములయందు చేయునట్టి మాఘస్నానముచేత శాపములు తీరునను నమ్మకము నాకు నిశ్చయముగాకలదు. పుణ్యతీర్థములయందలి మాఘస్నానము ఇంతకుమునుపు ఏడుజన్మములందు చేసిన పాపములతోడ ఇప్పుడు చేసిన భయంకరమయిన పాపమును మొదలంట కాల్చివేయును. అట్టిపాపమునకు ప్రాయశ్చిత్తము ఇదేగాని ఇంతకు మించినదానిని ఏమునిశ్రేష్ఠులును చూచి యెరుగరు. కనుక ఏపాపమయినను పుణ్యతీర్థములయందలి మాఘస్నానముచేత నశించును. మానససరోవరమునందు స్నానముచేయుటచేత ఎల్లపాపములను నశింపజేయును. సరస్వతీనదిజలమునందలి స్నానము బ్రహ్మలోకమును ఇచ్చును. విశాలానదియందలి మాఘస్నానము విశేషమయిన ఫలము నిచ్చును, గంగానదియందలి స్నానము పాపములనెడు కట్టెపుల్లలకు నిప్పును జన్మమునకు కారణములైన పనులను తొలగించునదియు విష్ణులోకమును ముక్తిని ఇచ్చునదియు అగును. సరయువు గం

యూర్గండకీ సింధు శ్చంద్రభాగాచ కౌశికీ సాపి గోదావరీభైమీ పయో ష్ణీకృష్ణవేణికా, కావేరీతుంగభద్రాచ యాశ్చాన్యాశ్చ సముద్రగాః ఆ సాంమాఘే నరాయాంతి సర్వలోకవికల్మషాః, నైమిశే విష్ణుసారూప్యం పుష్కరే బ్రహ్మణోంతికమ్. ఆఖండలస్యలోకోహి కురుక్షేత్రేతు మాఘ తః. సర్వాసాంసరితాంవిప్ర సంభేదం మకరేగవౌ. స్నానేన సర్వకామా నా మవాప్నువ్యాయతేనృణామ్, ఏవమాదిషు తీర్థేషు పుణ్యదం చోత్తరో త్తరమ్. ప్రకృతం శృణు విప్రేంద్ర ప్రయాగస్యచ వైభవమ్. గాయంతి దేవాస్సతతం దివిష్ఠా మాఘః ప్రయాగే కిలనో భవిష్యతి, స్నాతారో యత్ర నగర్భవేదనాం పశ్యంతి తిష్ఠింత్యపి విష్ణుసన్నిధౌ. మజ్జంతి యేపి త్రిదినంతుమానవా స్తీర్థేప్రయాగే బహుపాపకంచుకాః, నయాంతితేమే నిరయేషుధర్మిణః స్వర్గేపి తేచారుచరంతి దేవవత్. తీర్థైరశేషై ర్వ్రతదానతపోభి రధ్వరైః స్సార్ధంవిధాత్రా తులయా ధృతః పురా, మాఘప్రయాగస్యత యోర్ద్వయోరభూ న్మాఘోగరీయానతఏవసోఽధికః. వాతాంబుపర్ణాశన

---

డకి సింధువు చంద్రభాగ కౌశిక గోదావరి భైమి పయోష్ణి కృష్ణవేణి కావేరి తుంగ భద్ర అనునదులయందును ఇంకనుగల పుణ్యనదులయందును మాఘమాసమునందు స్నానము చేయుజనులు పాపములు లేనివారై యెల్లపుణ్యలోకములను పొందుదురు. నైమిశారణ్యమునందు మాఘస్నానము చేసినవరికి విష్ణువుతోడి సమానరూపము కలు గును. పుష్కరక్షేత్రమునందలి మాఘస్నానమువలన బ్రహ్మయొద్దియుంనికి కలుగును. కురు క్షేత్రమునందు ఇంద్రలోకము కలుగును. ఈచెప్పిన యెల్లనదులస్నానము కంటెను గంగా యమునా సంగమస్థానమైనప్రయాగయందు మాఘస్నానము చేయుటచేత జను లకు ఎల్లకోరికలును సిద్ధించును. ఓబ్రాహ్మణోత్తమా! ఈచెప్పబడిన అన్నితీర్థములం దును పుణ్యమునిచ్చునదియైన సర్వోత్కృష్టమైన ప్రయాగయొక్కమహిమను ఇప్పుడు చెప్పెదను వినుము స్వర్గమునం దున్నవారయ్యును దేనియందు స్నానము చేసిన జనులు గర్భవేదనను ఎరుగక విష్ణుదేవునిదగ్గరఉందురో అట్టిప్రయాగమునందు మాఘ స్నానముచేయుం ఫలము మాకు కలుగునా అని కీర్తనలు పాడుచుందురు. ఏమానవులు ప్రయాగపుణ్యతీర్థమునందు మూడుదినములు స్నానముచేయుదురో వారు అనేకము లయిన పాపములచెడి కుబుసములు కలవారైనను ఆపాపకర్మములవలన నరకములందు కూలక స్వర్గమునందు వినోదముగా దేవతలవలెనే విహరించుచుందురు. పూర్వకాలము నందు బ్రహ్మదేవుడు తీర్థములను వ్రతములను దానములను తపస్సులను యజ్ఞములను ఒక తట్టును ప్రయాగమాఘస్నానమును ఒకతట్టును త్రాసునందు ఉంచి తూచగా ప్రయాగమా ఘస్నానము తక్కే మ్రొగ్గుకానవచ్చెను. గాలి నీళ్లు ఆకులు ఆహారముగా చేసికొని దేహములను

దేహశోషణై స్తపోభి రుగ్రై శ్చిరకాలసంచితైః, యోగం న సంయాంతి నరాస్తతాంగతిం స్నానాత్ప్రయాగస్యచయాంతియాంగతిమ్. స్నాత్వా చ యే మకరభాస్కరోదయే తీర్థప్రయాగే సురసింధుసంగమే, తేషాం గృహద్వార మలంకరోతి భృంగావళిః కుంజరకర్ణతాడితా. యో రాజసూయాద్ధయమేధయజ్ఞతః స్నానాత్ఫలంసంప్రదదాతిచాధికమ్, పాపాని సర్వాణివిలప్యలీలయానూనంప్రయాగస్సకథంతువర్ణ్యతే. అవంతివిషయే రాజా వీరసేనోఽభవ త్పురా, నర్మదాతీరమాసాద్య రాజసూయంచకార సః. షోడశై రశ్వమేధైశ్చ స్వర్గలోకఫలప్రదైః, స్వర్ణభూషణయూపాద్యై రయజత్సయథావిధి. ప్రదదౌ ధాన్యరాశించ ద్విజేభ్యః పర్వతోపమామ్, వదాన్యో దేవతాభక్తో గోప్రదస్సువర్ణదః. బ్రాహ్మణో భద్రకో నామ మూర్ఖోహీనకులోద్భవః, కృషీవలో దురాచారో వేదాధ్యయనవర్జితః. హీనకర్మసముద్యుక్తో బంధుభిశ్చసముజ్ఝితః, ఇత స్తతఃపరిభ్రామ్యనిర్గ

---

ఎంతగట్టి చిరకాలము చేయునట్టి భయంకరములయిన తపస్సులచేతను యోగములచేతను ప్రయాగమునందు మాఘస్నానము చేసి పొందునట్టి ఉత్తమగతిని జనులు పొందనేరరు. మాఘమాసమునందు ప్రొద్దుపొడుచునపుడు గంగాయమునా సంగమస్థానమయిన ప్రయాగతీర్థమునందు స్నానము చేయువారి యింటివాకిటిని యేనుగుల చెవులచేత కొట్టబడి లేచెడి తుమ్మెదలబారు అలంకరించును. అనగా వారు పరమునందు మోక్షము పొందుటయేగాక యిహమునందును మదపుటేనుగులబారును వాకిట కట్టియుంచుకొనునంతటి సంపదగలవారు అగుదురు. ప్రయాగయందలి మాఘస్నానము రాజసూయయాగమువలనను అశ్వమేధయాగమువలనను ఎంతటిఫలము కలుగునో అంతకు మిక్కుటమయిన ఫలమును ఇచ్చుటయేగాక పాపములనన్నిటిని మిక్కిలియేడ్పించి వినోదించునది అగును. అటువంటి ప్రయాగను వర్ణింప నెవరితరము. పూర్వకాలమునందు అవంతిదేశమునందు వీరసేనుడు అనురాజు ఒకడు కలడు. అతడు నర్మదాతీరమునందు రాజసూయయాగము చేసి, పిమ్మట బంగారు తొడుపులువేసిన యూపస్తంభములు మొదలగువానిచేత శాస్త్రవిధిమేరకు స్వర్గలోకఫలము నిచ్చునవియగు పదియారుఅశ్వమేధయాగములను చేసి, కొండలవలె పోయబడిన ధనధాన్యరాసులను బ్రాహ్మణులకు దానముచేసెను. మరియును ఆరాజు మిక్కిలి దాతయు దేవునియందు భక్తిగలవాడును గోదానములు సువర్ణదానములు చేయువాడునయి యుండెను. ఆకాలమునందు మూర్ఖుడును తక్కువకులమునందు బుట్టినవాడును మిక్కిలి నీచుడును సేద్యముచేసికొని జీవించువాడును చెడ్డనడవడిగలవాడును వేదము చదువనివాడును తుచ్ఛపుపనులు చేయుయత్నించువాడును చుట్టముల

తోఽవృత్తికర్శితః దైవాత్సార్థంసమాసాద్య ప్రయాగంప్రవివేశసః, మాఘమాసంపురస్కృత్య స్నాత స్తత్ర దినత్రయమ్. అనఘ స్నానమాత్రేణ సంభూతోఽభూద్ద్విజోత్తమః, ప్రయాగాచ్చలిత స్తత్ర పునస్స్నాతి స సమాగతః. సరాజా సోఽపివిప్రశ్చ విపన్నా వేకదాతదా, తయో స్సనూగ తిర్దృష్టా మయా శక్రస్యసన్నిధౌ. తేజోరూపం బలస్త్రైణం దేవయానం విభూషణమ్, మాలాచపారిజాతస్యన్నృత్తగీతసమేతయోః ఇతిదృష్ట్వాపి మాహాత్మ్యం క్షేత్రస్యకథముచ్యతే, మాఘస్సితాసితే విప్ర రాజసూయ సమఃకథమ్. ధనుస్త్రిశతవిస్తీర్ణే సితనీలాంబుసంగమే, మాఘూదపునరావృత్తీ రాజసూయాత్పునఃపతేత్. మాఘే మాసి స పాపోపి సితాసిత జలంస్పృశన్, సర్వపాపవినిర్ముక్త స్సురలోకం సగచ్ఛతి. అత్రతే కథయిష్యామి సావధానమనాశ్శృణు.

ఇతి శ్రీపాద్మేపురాణే మాఘమాహాత్మ్యే రోమశవేదనిధి సంవాదం నామ చత్వారింశోఽధ్యాయః.

---

చేత విడువబడినవాఁడును తగిన జీవోపాయములేక యిందునందును అలయుచుండువాడునైన భద్రకుడు అను బ్రాహ్మణుడొకడు ఉండెను. వాడు దైవికముగా తీర్థయాత్ర చేయబోవువారి గుంపుతోగూడి ప్రయాగకుపోయి అచ్చట మూడుదినములు మాఘస్నానముచేసెను. పాపరహితమయిన ఆస్నానముచేతనే వాడు ఉత్తమబ్రాహ్మణుడు ఆయెను. అంతటితో ఊరకుండక చంచలుడయిన ఆబ్రాహ్మణుడు తాను మాత్రము మరల ప్రయాగమునందు స్నానముచేసి వచ్చెను. పిమ్మట ఆవీరసేనమహారాజును ఈబ్రాహ్మణుడును ఏకకాలమునందే వచ్చినవారై స్వర్గలోకమునకు పోయిరి. ఒకానొకప్పుడు నేను స్వర్గమునకు పోయియుండి, దేవేంద్రునిదగ్గఱ తేజస్సును చక్కదనమును బలమును స్త్రీసమూహమును విమానమును అలంకారమును కల్పవృక్షపుపువ్వులదండలును ఆటపాటలును కలవారైయున్న ఆయిద్దరియొక్క సమానమయిన ఉనికిని జూచితిని. ఇట్లు ప్రత్యక్షముగా చూచిననేను ప్రయాగమహిమను ఏమని వర్ణింపగలను. ఇందువలన ప్రయాగమునందలి మాఘస్నానఫలమును రాజసూయఫలముతో సమానమని యెట్లుచెప్పవచ్చును. మున్నూరువిండ్లపట్టుమేరగల తెల్లని నల్లని నీళ్లు కలయునట్టి చోటయిన ప్రయాగమునందలి మాఘస్నానమువలన మరల జన్మము కలుగదు. రాజసూయయాగమువలన ఆఫలము క్షీణింపగానే జనుడు మరల మరల భూలోకమున పడును. పాపాత్ముడయినను మాఘమాసమునందు గంగాయమునా సంగమజలమును ముట్టినమాత్రమున ఎల్ల పాపములచేతను విడువబడినవాడయి దేవలోకమును పొందును. ఈవిషయమునందు నీకు ఒకకథను చెప్పెదను. దానిని సెమ్మదిగలవాడవై వినుము.

మాఘమాహాత్మ్యమునందు రోమశవేదనిధిసంవాదరూపమయిన నలువదవ యధ్యాయకథ.

## ఏకచత్వారింశోఽధ్యాయః.

రోమశః. పిశాచమోచనంనామ ఇతిహాసంపురాతనమ్, శృణ్వం త్వప్సరసోబాలాశ్శృణ్వోతుత్వత్సుతస్తథా. మత్ప్రసాదాత్స్మృతింలబ్ధ్వా పైశాచాన్ముక్తిగామినః, పురా దేవద్యుతిర్విప్రో, వైష్ణవో వేదపారగః. పైశాచ్యం మోచయామాస కృపాగంభీరసాగరః. వేదనిధిః. కుత్రస్థితఃకస్యపుత్రో నియమః కోఽస్యచాభవత్, కేనవా వైష్ణవోజాతః కః పిశాచశ్చమోచితః. ఏతద్విస్తరతస్సర్వంకీర్తయస్వమహామునే. రోమశః. కౌతూహలంమహాపుణ్యంశృణుత్వంమత్ప్రసాదతః, ప్లక్షప్రస్రవణేరమ్యే సరస్వత్యాస్తు నిర్గమే. తత్రాశ్రమపదం తస్య శైల మాశ్రిత్య శోభతే, సాలతాలతమాలైశ్చ బిల్వైరశ్వకుళపాదపైః. తింత్రిణీ చిరిబిల్వైశ్చ చూత చంపకపాదపైః, కరంభైః కోవిదారైశ్చ కేసరైః కుంజరాశనైః. తిలకైః కర్ణికారైశ్చ కుంభీఖదిరతిందుకైః, పనసైరసవద్భిశ్చ నారికేళై స్సదాఫలైః ఏవమాదిభిరన్యైశ్చ వృక్షజాతిభిరావృతః, సదాఫలం

---

## నలువదియొకటవ అధ్యాయము.

రోమశునిమాటలు.—ఓ వేదనిధీ! పిశాచమోచనము అను పేరుగల బహుదినములనాటిదైన యితిహాసము ఒకటికలదు. దానిని నాయనుగ్రహమువలన విని తెలివినొంది పిశాచత్వమునుండి విడుదలను పొందగలవారు అగు ఈఅప్సరసలును నీకొమారుడును విందురుగాక. పూర్వకాలమునందు విష్ణుభక్తుడును వేదము తుదముట్ట చదివినవాడునైన దేవద్యుతి అను బ్రాహ్మణుడు మిక్కిలి దయగలవాడై ఒకనిపిశాచత్వమునుతొలగించెను.

వేదనిధిమాటలు.—ఓరోమశమహామునీ! ఆ దేవద్యుతిఅనువాడు ఎక్కడనుండువాడు. ఎవనికొడుకు. దేనిచేత అతడు విష్ణుభక్తుడు ఆయెను. ఏపిశాచముయొక్క పిశాచత్వమును విడిపించెను. ఈవృత్తాంతమంతయుం విస్తరముగా నాకు చెప్పుము.

రోమశునిమాటలు —వేడుకైనదియుం మిక్కిలి పుణ్యమును అయిన ఆయితిహాసమును నాయనుగ్రహమువలన వినుము. సరస్వతీనది పుట్టినచోట రమ్యమయిన ప్లక్షప్రస్రవణము అనుపుణ్యముక్షేత్రముకలదు. అచ్చట ఒకకొండనుఆనుకొని అతనియాశ్రమము ఒప్పుచుండును. అది యేపెతాడు చీకటిచెట్టు మారేడు పొగడ చింత కానుగు మామిడి సంపెంగ కంపిల్లము కాంచనము నాగకేసరము రావి బొట్టుగు కొండగోగు కలిగొట్టు చంద్ర తుమికి పనస టెంకాయచెట్టు సదాప ఇవి మొదలుగువృక్షములచేతను ఇంకను అనేకములైనవృక్షజాతులచేతను చుట్టబడినదై, ఎల్లప్పుడు పండ్లు పువ్వులుగలదై

సదాపుష్పం పరాగకణధూసరమ్. నవపల్లవసంజాతం మంజరీభిశ్చ వల్లిభిః, ఆహ్లాదజనకం నిత్యం వనంచైత్రరథం యథా. నదంతి కోకిలామత్తాః కూజంతిచ మధువ్రతాః, బహుకోలాహలంవిప్ర తస్వాంతశ్శుకశారిభిః. చరంతివివిధా స్తస్మిన్వానరాః కాననోత్తమే, తస్మిన్వసతిధర్మాత్మా ద్విజో దేవద్యుతిస్సదా. జితేంద్రియో జితక్రోధ స్సత్యవాగనసూయకః, పుత్రస్సుమిత్రో విప్రస్య లబ్ధోలక్ష్మీవరార్థినః. నియమం శ్రూయతాం తస్య సర్వదా నియతాత్మనః, గ్రీష్మే పంచతపా నిత్యం రవౌసన్యస్తలోచనః. వర్షే కాదంబినీజాలా ద్వర్షేత్వభ్రాగమాత్తతః, వాతేప్రవాతి నిష్కంపోదుస్సహోహిమవానివ వసత్యప్సుచ హేమంతే హ్రదేసారస్వతద్విజః, ఇత్థంజగామవర్షాణాం సహస్రంతద్వనేద్విజ. తదాజజ్వాలశైలోసౌ తపస స్తేజసాధునా, సోఢుంనశక్యతేభూతైః తేజ స్తస్య మహాత్మనః వైశ్వానరఇవాభాతి ప్రజ్వల స్తపసాద్విజః, అన్యోపి నియమ స్తస్య శ్రూ

---

పుప్పొడిరవలచేత ఇంచుకమాసిన తెల్లనివన్నెగలిగినవియు లేతచిగురుగుత్తులుగలిగినవియునైన తీగలచేత కుబేరుని యుద్యానవనమువలె ఎల్లప్పుడు ఆనందమును పుట్టించుచుండును. మరియు ఆయాశ్రమము తమతమకు ఉచితములయిన ఆహారములచే మత్తుకొనియున్న కోవెలలకూతలను తుమ్మెదలరొదలను చిలుకలయు గోరువంకలయు పలుకులును నిండుకొనగా కోలాహలధ్వనిగలదైయుండును. అందు పలుతెగలకోతులును సంచారముచేయుచుండును. ఆయాశ్రమమునందు ధర్మస్వభావముగల దేవద్యుతి అనుబ్రాహ్మణుడు సదా వాసముచేయుచుండును. అతడు సుమిత్రుడు అనుబ్రాహ్మణునికి శ్రీవిష్ణుని యనుగ్రహమువలన గలిగినవాడు. ఇంద్రియములను జయించినవాడు. కోపములేనివాడు. నిజము పలుకువాడు. అసూయలేనివాడు. అతనినియమము వినుము. ఎల్లప్పుడుమనస్సును స్వాధీనమునందుంచుకొని గ్రీష్మకాలమందు పంచాగ్నిమధ్యమున నిలిచి సూర్యుని జూచుచును, వర్షాకాలమునందు మబ్బుదట్టముగా కమ్ముకొని వాన కురియుచుండగా మిన్ను చూచుచును, మంచుకాలమునందు చలిగాలివీచుచుండగా మంచుకొండవలె మంచుచేత చలింపక మడుగులోని నీళ్లయందుండుచును, ఆవనమునందు తపస్సుచేయగా ఈవిధమున వేయిసంవత్సరములు కడచెను. అప్పుడు అతని తపస్సువలని తేజస్సుచేత ఆకొండ మండసాగెను. ఆమహాత్మునిదైన తేజస్సునకు అందలి ప్రాణులు సహింపలేని వయ్యెను. అతడు తపస్సుచేత అగ్నిదేవునివలెనే వెలుగసాగెను మరియు అతడు నడపునట్టి ఇతరనియమములను మిక్కిలి దుర్లభములు. వానిని చెప్పెదను వినుము ప్రతిదినము తప్పక చక్కగా చూచి పరిమళించుచున్న పుష్పములచేత మూడుకాలములందును విష్ణు

యతా మతిదుర్లభః. నారాయణం త్రికాలం స సంపూజయతి నిత్యశః, పుష్పాణాంచ సహస్రేణ వికచేన సుగంధినా. వేదసూక్తవిధానేన విష్ణుధ్యానపరాయణః, విష్ణోస్సంప్రీతయే విప్రః కురుతే కర్మచాఖిలమ్. ఏకదా మాసివై శాఖేఏకాదశ్యాంముదామునిః, పూజాంకృత్వాహరేరమ్యాం విచిత్రామకరోత్ స్తుతిమ్. తత్రైవ ఖలమారుహ్య దేవదేవ స్స్వయం హరిః, ఆజగామ పురస్తస్య తయాస్తుత్యాతిహర్షితః. తంద్రృష్ట్వా గరుడారూఢం ప్రత్యగ్రజలదచ్ఛవిమ్, చతుర్భుజం విశాలాక్షం సర్వాలంకారభూషితమ్. ఉద్భూతపులకో విప్రః సానందజలలోచనః, జగామ శిరసా భూమౌ కృతకృత్యమనా స్తథా. నమంతేతేన హర్షేణ నబ్రహ్మాండోదరేషుచ, నసంస్కారం నిజం దేహం బ్రహ్మభూత ఇవాభవత్. తతస్సంభాషిత ప్రీత్యా హరిణా వైష్ణవోమునిః, దేవద్యుతే విజానామి మద్భక్తస్త్వం మదాశ్రితః. సన్యస్తాఖిలకర్మాభిః మద్భక్త్యా మన్మనాస్సదా, వరం బ్రూహి ప్రసన్నోఽస్మి స్తోత్రేణానేన తేనఘ. ఇతి శ్రుత్వా హరేర్వాక్యం ప్రత్యువాచ సతాపసః. దేవద్యుతిః. దేవదేవహరేసాక్షా

---

మూర్తికి సహస్రార్చన చేయును. వేదమునందు చెప్పబడిన క్రమమున విష్ణుధ్యానము చేయుచుండును. ఈ చెప్పబడిననియమములన్నియు శ్రీవిష్ణుప్రీతిగానడపుచుండిన ఆబ్రాహ్మణుడు ఒకానొక వైశాఖమాసమునందలి యేకాదశినాడు సంతోషముతో విష్ణుపూజ చేసి మనోహరమును వింతయునయిన స్తుతిని చేసెను. ఆస్తుతిచేసినచోప్పున దేవతలకు దేవుడైన శ్రీవిష్ణుమూర్తి గరుడవాహనమునెక్కి ఆపొగడ్తవలని సంతోషముచేత అతని యెదుటవచ్చి నిలిచెను. అప్పుడు గరుడునిపై నెక్కినవాడును క్రొత్తమబ్బుయొక్క కాంతివంటి దేహకాంతిగలవాడును, నాలుగుచేతులును విశాలమయిన రొమ్మును గలవాడును, ఎల్ల ఆభరణములచేత అలంకరింపబడినవాడును నగు నా విష్ణుమూర్తిని జూచి, ఆబ్రాహ్మణుడు గగుర్పాటుగలవాడును, ఆనందబాష్పములతోగూడిన కన్నులుగలవాడును, కృతకృత్యమయిన మనసుగలవాడును నై భూమిమీద సాగిలబడిమ్రొక్కి దేహమునందలి దమ్మును సైతముతుడుచుకొనక పరబ్రహ్మత్వమును బొందినవానివలె నుండెను. అంతట వైష్ణవుడైన ఆమునినిజూచి ప్రీతితో శ్రీహరి యిట్లుపలికెను. ఓ దేవద్యుతీ! నీవు ఎల్లప్పుడు నాభక్తుడవు. నన్ను ఆశ్రయించినవాడవు. నాదైనభక్తిచేత ఎల్లకర్మములను వదలినవాడవు నాయందే మనసుగలవాడవు అని నేను తెలిసికొంటిని. నీవుచేసిన స్తోత్రముచేత నీయందు అనుగ్రహముగలవాడనయితిని. కావలసిన వరము అడుగుముఅని సెలవియ్యగా ఆమాటవిని బ్రాహ్మణుడు ఇట్లు అనెను.

దేవద్యుతిమాటలు.— దేవదేవుఁడవును స్వకీయమయినమాయచేత దేహమును

త్వన్మాయాధృతవిగ్రహ. త్వద్దర్శనాత్సదా దేవదుర్లభో నాపరోవరః,
బ్రహ్మాదయ స్సురాస్సర్వే యోగిన స్సనకాదయః. త్వాం సాక్షాత్కర్తు
మిచ్ఛంతి సిద్ధాశ్చకపిలాదయః, అహంమమేతిపాశాయే మోహమూ
లాశ్శుభాశుభాః. సహేతుకాశ్చ దహ్యంతి త్వయిదృష్టే పరాపరే,
జన్మనః కర్మణాబుద్ధ్యా ఆవిర్భూతం ఫలంమమ. యందృష్టోపిజగన్నాథ
పరశ్చకిమతఃపరమ్, పావనార్థంహి దేవేశ త్వత్పాదకమలం హృది. చింత
యా మ్యనిశం భక్త్యా త్వద్గతేనాంతరాత్మనా, ఇదమేకం వరం యాచే
త్వద్భక్తిరుచితా మమ. అస్తువై కమలానాథ ప్రార్థయే నాపరం వరమ్,
ఇతిశ్రుత్వా వచస్తస్య ప్రసన్నహృదయో హరిః ప్రత్యువాచ ప్రసన్నా
త్మా ఏవమస్త్వితితం ద్విజమ్, అస్య తే తపసఃకశ్చిత్ప్రత్యూహో నభవి
తా॥
ష్యతి. ఏతచ్చ త్వత్కృతం స్తోత్రం యేఃఠిష్యంతి మానవాః, తేషాం
మద్విషయా భక్తి ర్భవిష్యతి న సంశయః. కర్మజ్ఞానం చ యత్కించి
త్సాంగం సర్వం భవిష్యతి, జ్ఞానేనచపరానిష్ఠా తేషాం స్థాస్యతి సర్వదా.

---

ధరించినవాఁడవగు నయిన యోహరీ! ఎల్లప్పుడును నీదర్శనము కలిగియుండుటకంటె పొం
దరానివరము లేదు. బ్రహ్మామొదలుగాగల యెల్లదేవతలును సనకుడు మొదలుగాగల
యోగీశ్వరులును కపిలుడు మొదలగుసిద్ధులును నిన్ను ప్రత్యక్షముచేసికొన గోరుచు
న్నారు. నేను నాది అనెడి అజ్ఞానమూలమయిన పాశములే శుభాశుభములు. అవి పరా
పరుడవైన నీయందు హేతువులతోఁగూడినవై కాల్చబడుచున్నవి. నాపుట్టుకవలనను పనుల
వలనను బుద్ధివలనను కలిగినఫలము ఏదికలదో అది నీచేత జూడబడినదికాగా అంతకంటె
మేలయినవరము ఇక ఏమిఉన్నది. ఓస్వామీ! పరిశుద్ధత్వమునకేగదా ఎల్లప్పుడు భక్తితో
నిన్ను పొందిన అంతరాత్మతోను నీ పాదకమలములను మనసున తలచుచుంటిని. నీభక్తి
యందలి ఆసక్తత అనువరమును నేనుకోరెదను. దీనిని ఇచ్చినపక్షమున నేను ఇతరవర
మును కోరను. అని అడిగిన అతనిమాటలనువిని శ్రీవిష్ణుమూర్తి అనుగ్రహముగలమనసు
తోఁఅట్లేకానిమ్మని చెప్పి, ఓబ్రాహ్మణుఁడా! ఈ నీతపస్సునకు విఘ్నము కలుగదు. ఇది
గాక నీవు నన్నుగూర్చిచేసిన స్తోత్రమును ఏమానవులు చదువుదురో వారికి నావిషయ
మైన భక్తికలుగును. అందులకు సందేహములేదు. స్వకర్మముచేత గలిగినజ్ఞానము ఎంత
మాత్రమున్నను అది సంపూర్ణమయినదగును. అజ్ఞానముచేత సర్వోత్తమమైననిష్ఠ వారికి
ఎల్లప్పుడు నిలిచియుండును. అని యిట్లు సెలవిచ్చి దేవదేవుడైన విష్ణుమూర్తి అంతర్ధా

ఇత్యుక్త్వాతు తిరోభూతో దేవదేవో జనార్దనః, దేవద్యుతిస్తదారభ్య నారాయణపరోఽభవత్.

ఇతి శ్రీపాద్మే పురాణే - మాఘమాహాత్మ్యే - దేవద్యుతివైష్ణవత్వవివరణంనామ ఏకచత్వారింశోఽధ్యాయః.

---

## ద్విచత్వారింశోఽధ్యాయః.

వేదనిధిః. మహర్షేఽనుగృహీతోఽస్మి కథయా పావనీకృతః, అనయా విష్ణుసంగత్యా సంగ ఏవాహమద్యవై. కింతత్ స్తోత్రంసమాఖ్యాహి ప్రసన్నో యేనమాధవః, తస్యానఘస్యవిప్రస్యమహత్కౌతూహలం మమ. త్వత్ప్రసాదాదహం విప్ర మన్యే ప్రాప్తమనోరథమ్, మహతాం సంగతిస్తస్య మహత్త్వాయోపకల్పతే రోమశః. కథయామి రహస్యంతజ్జప్యం స్తోత్రమనుత్తమమ్, ప్రగృహీతసుపర్ణేన గరుడాన్మయి చాహృతమ్. అధ్యాత్మ సారగర్భం యన్మహోదయకరం శుభమ్, సర్వపాపహ

---

నము నొందెను. అదిమొదలు దేవద్యుతి శ్రీవిష్ణుభక్తుడు ఆయెను. అని రోమశుడు వేదనిధితో చెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు దేవద్యుతి విష్ణుభక్తుడౌటను తెలుపునట్టిదయిన నలుబదియొకటవఅధ్యాయకథ.

---

## నలుబదిరెండవ అధ్యాయము.

వేదనిధిమాటలు.—ఓ రోమశమహాముని! నీవిప్పుడు అనుగ్రహించితివి గనుక ఈ విష్ణుసంబంధమైన కథచేత నేనుపరిశుద్ధుఁడనైతిని. పాపములేనివాఁడైన దేవద్యుతి అను బ్రాహ్మణుడు విష్ణుప్రీతిగా చేసినస్తోత్రము ఏదో దానిని వినుటయందు నాకు మిక్కిలి వేడుకకలిగియున్నది. పెద్దలయొక్క సహవాసము కలుగుట అందులకు తగిన మహిమను పొందించుటకే గనుక పూజ్యుడవైన నీయనుగ్రహమువలన నేను నా అభీష్టమును నెరవేర్చుకొందు నని తలచుచున్నాను.

రోమశునిమాటలు.—ఓ వేదనిధీ! రహస్యమైనదియుఁజపయోగ్యమైనదియు అన్నిటియందును ఉత్తమమైనదియును అగు ఆస్తోత్రమును నీకు తెలిపెదను. అని గరుత్మంతునిచేత అనుగ్రహింపబడిననాయందు పొందియున్నది. ఇదిగాక అదివేదాంతసారము

రంవిప్రస్యాత్మజ్ఞానపరం వరమ్. దేవద్యుతిః. ఓన్నమోవాసుదేవాయ విశ్వరూపాయచక్రిణే,భక్తప్రియాయదేవాయ జగన్నాథాయతేనమః. స్తోతాస్తుత్యం స్తుతిస్సర్వం జగద్విష్ణుమయం యథా, తథా సంస్తూయ తేయేన భక్తిర్భేదకరీనృణామ్. యస్య దేవస్యనిశ్వాసః వేదాస్సాంగా స్ససూత్రకాః, స్తుతిం ప్రముదితే తస్య భక్తోహం ముఖరోఽభవమ్. వేదానవేత్తియం సాక్షాన్నచవావేత్తినోమనః,మద్విధస్తంకథంస్తౌతిభక్తి యుక్తోనకింవదేత్. బ్రహ్మాదివిపులం విష్ణో త్వమేవ బ్రహ్మణో వపుః, స్రష్టా బ్రహ్మానిదానంచ శుద్ధం బ్రహ్మత్వమేవచ. కాయః కాయీయుగాం గాంగిభూతస్స్వ్రశతి కాయినమ్. కాయదోషైస్త్వనాఘాత యాతనా యతకల్పనా. క్లేశాక్లేశత్వరూపాది కల్పనాతిసృభిస్తథా, దేహభావేన జాగర్తి సనిద్రాతి నిజాత్మని. సుఖసందోహబుద్ధిర్వ్యాసాత్వం విష్ణోనసంశ

---

సంతోషకరము, ఉత్తమము. ఎల్లపాపములనుపోగొట్టునది. ఆత్మజ్ఞానమునకు ఆధారము పూజ్యమును అగును.

దేవద్యుతిమాటలు.—లోకములందు తాను తనయందులోకములును వసించుట చేత వాసుదేవు డనబడు వానికి ఓంకారపూర్వకముగా నమస్కరించెదను. మరియు ప్రపంచస్వరూపుడును చక్రమునుపూనినవాడును తనసేవకులకుప్రియుండయినవాఁడును నాయేలినవాఁడును లోకములకు నాయకుఁడును అయిన ఓస్వామీ! నీకు నమస్కరించెదను. పొగడువాడు పొగడదగినవాడు పొగడ్త అనునిట్టి సకలమును విష్ణువే అని జగత్స్వరూపముగా చేయుస్తోత్రమునందు ఎవనిచేత జనులసేవ భేదపడుచున్నదో, శిక్ష వ్యాకరణము మొదలగు అంగములతోడను భగవత్ప్రతిపాదకములగు సూత్రములతోడను గూడినవేదములు ఎవని ఊర్పులో ఆదేవునికి సేవకుడనై వాని మెప్పుకొరకు నేను స్తోత్రముచేసెదను. ఎవనిని వేదములు గూడ సాక్షాత్కారము చేసికొనజాలవో ఎవనిని నామనసు సైతము ఎరుగదో అట్టివానిని గూర్చి భక్తితోగూడిన నావంటివాడు ఏమి చెప్పగలడు. ఎట్లు పొగడగలడు. బ్రహ్మమొదలుగాగల సర్వప్రాణులునయిన విష్ణుడవును బ్రహ్మస్వరూపుడవును సృష్టికర్తయైన ఆబ్రహ్మకు మూలకారణమయిన పరిశుద్ధ పరబ్రహ్మమును నీవే. దేహమును దేహధారియు దేహధారులకు దంపతులయందు అంగాంగీభావముచేత మరియొకదేహదారిని అంటియుండువాడవును నీవే దేహసంబంధములైన అధికమయిన యాతనలు కలుగుట మొదలయిన దోషములను పొందనివాడవగు నీవు దుఃఖస్వభావముచేతను అదుఃఖస్వభావము మొదలగునవిగల మూడువిధములైన (స్థూల సూక్ష్మకారణ) దేహభావములచేతను అట్టేయెచ్చరిక నొందియుండుదువు. తనయందు మరపునుపొందని సుఖమునుకలిగించు బుద్ధియే సర్వవ్యాపకుడవగునీవు అను విషయము

యః. మహదాదిర్యథాభావ స్తథావై కారికో గుణః, త్వమేక ఏవ తత్సర్వం నానాత్వం మూఢ కల్పనా. త్వమేవ కల్పతే బ్రహ్మా భువనాని పుమా నివ, విదోషం విగుణం సేవ్యం చిద్రూపమఖిలం జగత్. కవీనాం భాతి య జ్ఞార్థం తం విష్ణుం నౌమి నిర్గుణమ్, యస్మిన్ జ్ఞానేన కుర్వంతి కర్మణ్యావిశ్రు తేరితమ్. ఏతేషాం హి జగన్మిత్రం శుద్ధం బ్రహ్మ నమామి తమ్, కామయ జ్ఞాన్ ప్రజార్థంచ ఈషణాభ్యస్సముత్థితాః. లోకమాత్మైవ పశ్యంతో యం బుద్ధ్వైవ చరాచరమ్, పశ్యంతో హి త్వచా తుల్యం దేహోత్థం నౌమి మాధ వమ్. యదృగంతి పునస్తం హి చిత్సంధానం విలక్షణమ్, త్వామేవోప నిషద్బ్రహ్మ చింతయంతి పరాయణాః. పావనార్థం హి దేవేశ త్వత్పాదక మలం హృది, చింతయామ్యనిశం భక్త్యా త్వద్గతేనాంతరాత్మనా. ఇదమేవ వరం యాచే త్వద్భక్తికవచో మమ, అస్తువై కమలాకాంత ప్రార్థయే

---

నంను సందేహములేదు. నీయందు మహత్తు మొదలగుతత్త్వములు ఎట్లో అట్లే పుట్టుట పెరుగుట మొదలగు ఆరువికారములవలని గుణములును ఏర్పడుచున్నవి. ఆదియంతయును ఒక్కడవైన నీవే కాని యితరముకాదు. ఇట్టియేకత్వవిషయమునందు నానాత్వముకల్పించుట మూఢత్వము. ఒక్కడవైన నీవే బ్రహ్మవై పురుషుడు సంతానము కల్పించునట్లు లోకమును కల్పింతువు. దోషము లేనివాడవును రాగద్వేషాదులగు గుణములులేనివాడవును కొలువదగినవాడవును జ్ఞానస్వరూపుడవునయిన నీవు విద్వాంసులయజ్ఞములకొరకు సమస్తజగత్తునునయి వెలుగుచున్నావు. అటువంటి సర్వవ్యాపకుడవును రజస్తమోగుణములు లేనివాడవునయిన నిన్నుగూర్చి నమస్కరించెదను. ప్రసిద్ధముగా జెప్పబడెడియే కర్మవిషయమునందును జ్ఞానముతో ప్రవర్తించు పండితులు ఎవరో ఆయాపండితులకును తక్కినలోకులకును చెలికాడైన పరిశుద్ధబ్రహ్మమునుగూర్చి నమస్కరించెదను. ఎవనిని చరాచరాత్మునిగా నెరిగియును దారేషణపుత్రేషణధనేషణములవలన చిక్కిన వారగుజనులు సంతానముకొరకైన పుత్రకామేష్టి మొదలగు యజ్ఞములను నడపుదు లోకమే పరమాత్మయని జూచుచున్నారో లేక కర్మేంద్రియముచేత సమానునిగా జూచుచున్నారో, అటువంటి లక్ష్మీశుని పెనిమిటివైన నిన్ను దేహమువలన నమస్కరించుచున్నాను. ఇదిగాక నీవు జ్ఞానమును ఘటింపజేయునట్టియు మానుషలక్షణములు లేనట్టియును బుద్ధికవలె ఆగుచున్నావో అట్టినిన్ను వేదాంతములవలన దెలియబడెడిపర బ్రహ్మమునుగా విద్వాంసులు తలచుచున్నారు. దేవతలకు ప్రభువైన ఓయేలినవాడా! ఎల్లప్పుడు నిన్నుబొందిననాయంతరాత్మచేత పరిశుద్ధుడనుఅగుటకే నేను నీపాదపద్మములను నామనసునందు ధ్యానించుచున్నాను. ఓస్వామీ! నీభక్తియనెడికవచమే నాకు

చాపరం వరమ్, మాయాయా మతిచిత్రాయాం తథాచ మమతా నృణామ్. విలీయంతే విదిత్వాయం నమస్తస్మై అమాయినే, ప్రయాణే చాప్రయాణేచ యన్నామస్మరణాన్నృణామ్. సద్యోనశ్యంతి పాపౌఘా నమస్తస్మైచిదాత్మనే, మోహానాల్లోల సజ్వాలా చ్చలల్లోకేషు సర్వదా. యన్నామాంబుధరచ్ఛాయాం ప్రవిష్టో నహి దహ్యతే, యస్యస్మరణమాత్రేణ న మోహో నైవదుర్గతిః, నరోగో నైవ దుఃఖాని తమనంతం నమామ్యహమ్, శబ్దార్థసంవిదర్థీయః విష్ణోర్నామ్ని పరోయది· సత్యే నతేన సంసారో న మాం స్పృశతు మాధవ, నారాయణో జగద్వ్యాపీ యది వేదాదిసమ్మతః. సత్యేన తేన నిర్విఘ్నం విష్ణుభక్తిర్మమాస్తు సా, యేన బీజం నచాబీజం యోబీజంతేన భావితమ్. సవిష్ణుర్భవబీజంమే శ్రితావిద్యాపి అద్యతు, త్రిధాభూత స్సవిద్యస్తు సృష్టిస్థితి

---

వరముగా గోరెదను. అదియట్లుండగా, మరియొకవరమునుగూడ వేడుకొనుచున్నాను. మనుష్యులకు మిక్కిలి యాశ్చర్యకరమయిన మాయయందు నేను అనెడి అహంభావము ఎవనిని తెలిసికొనగా నశించునో ఆమాయాతీతుడైన నీకు నమస్కారము. ఇంటనుండి ఎక్కడికైన పోవునపుడుగాని ఎక్కడికినిపోక ఇంటనేఉండునపుడుకాని ఎవనియొక్క నామములను తలచుటవలన తలచినప్పుడే మనుష్యులయొక్క పాపసమూహములు నశించునో ఆచిత్స్వరూపుడవైన నీకు నమస్కారము. లోకములయందు ఎల్లప్పుడు చలించుచున్న తాపత్రయము అనెడి నిప్పుమంటలో మోహమువలన భ్రమించుచుండువాడు ఎవనినామములనెడి మబ్బుల నీడయందు చొచ్చి దహింపబడడో, ఎవనియొక్క తలచుటతోనే మోహమును నరకమును రోగమును దుఃఖమును లేకపోవునో అటువంటి తుదిలేనివాడగు దేవునిగూర్చి నేను నమస్కరించెదను. ఓలక్ష్మీప్రియుండా! శబ్దములయందలి అర్థజ్ఞానమును గోరెడివాడెవడో వాడు విష్ణునామములయందు ఆసక్తుడు అగుటసత్యము అయినపక్షమున, ఆసత్యముచేత నన్నును సంసారము అంటకుండునుగాక. లోకమునందెల్లను నిండియుండెడు శ్రీమన్నారాయణుడు వేదములుమొదలగువానిచేత ప్రతిపాదింపబడినవాడు అగుట సత్యముఅగునేని, ఆసత్యముచేత ఆవిష్ణుదేవునియందలి భక్తి విఘ్నములేక నాకు కలుగునుగాక. ఏజగత్కారణమైన విష్ణుదేవుడు జగత్తునకు కారణమయినవాడుగాను కారణముకానివాడును ఏకారణముచేత భావింపబడుచున్నాడో, ఆకారణమైన విష్ణుదేవుడగు నీవు ఆకారణముచేతనే ఇప్పుడు నన్ను అవిద్యఆశ్రయించినదయినను నాకు కారణమయినదానవు అగుము. ఏదేవుడు విద్యతోగూడినవా

లయేషుచ. గుణైర్భవతి కార్యేషు సప్రసీదతు మేహరిః, అదితేర్యోఽవతీర్ణోఽసా వాత్మత్రాణాయ కేవలమ్. అభ్యర్చితస్సురై స్సర్వైః సప్రసీదతు మేహరిః, బ్రహ్మాది స్తంబ పర్యంత ప్రాణినామంతరేఽమలః. ఏకో వసతి యోదేవస్సప్రసీదతు మేహరిః, హృత్పద్మగః ఖగః ఖాద్య ఖాతీతః ఖక్రియోఽఖిలః. ఖబ్రహ్మా ఖాదిభుక్ఛాంతః ఖమూర్తిస్తు ఖగాసనః, యద్భాసాయ మృదా యస్య సత్తాయాంతు భవేజ్జగత్. భాజ్యం దుఃఖ మసత్యంచ సభవానేవ తన్మయః, త్వత్సంసృష్టం మోదతే విశ్వం త్వత్త్యక్తమశుచిర్భవేత్. తత్సంగతో ప్యసంగస్త్వం వికారస్తే నతేనహి, కేచిద్భుని పరే ప్రాణం మనోహంకార మంతరమ్. కేచిచ్చాకార చైతన్య కాయమాత్రం పరేఽధమాః, కేచిత్తు పురుషం కేచి చ్ఛబ్దబ్రహ్మాపరే శివమ్. భక్తించ చిన్మయం కేచి ద్గోవిందంత్వాం కుమార్గగాః, తీర్థార్థంస

---

దైయుండియుం సృష్టిస్థితిలయములనెడి మూడుపనులయందును రజస్సు సత్వము తమస్సు అనెడి మూడుగుణములచేతను బ్రహ్మవిష్ణు మహేశ్వరుడు అనెడి మూడురూపములను పొందునో, ఆ శ్రీహరినాకు అనుగ్రహించినవాడు అగునుగాక. దేవతలెల్లను ముఖ్యముగా తమకు కాపాడుటకొరకు ప్రార్థింపగా అదితికొడుకై అవతరించిన ఆయావిష్ణుదేవుడు నాకు అనుగ్రహించినవాడు అగుగాక. బ్రహ్మమొదలు కసవుగంటవరకు గల ప్రాణులయొక్క హృదయములందు ఏదేవుడు ఒక్కడై వాసముచేయుచున్నాడో ఆ శ్రీహరి నాకు అనుగ్రహించినవాడు అగుగాక. హృదయకమలమును పొందినవాడును ఆకాశమునందు మెలగువాడును ఆకాశమునకుముందటివాడును ఆకాశమునకు అతిక్రమించినవాడును క్రియలులేనివాడును సమస్తమునైనవాడును నిరాకారబ్రహ్మమయినవాడును ఆకాశము మొదలగువానిని భుజించువాడును శాంతుడునును ఆకాశస్వరూపుడును గరుడాసనముగలవాడునునీవే. ఎవని తేజస్సు ఏమట్టిచేత ఎవనిసత్తయందు భాగింపదగినదియు దుఃఖమును సత్యముకానిదియు నైన లోకము అగునో, ఆలోకవికారమైన భగవంతుడవును నీవే. లోకము నీతోగూడినదై సంతోషించుచున్నది. నీచేత విలువబడినదై దుఃఖించుచున్నది. నీవు ఆలోకముతో సంబంధము కలవాడవయ్యును లేనివాడవేగనుక దానివికారము నీకులేదు. ఈభూమియందు కొందరుపరుడవైననీయందు ప్రాణము మనస్సు అహంకారము అని తారతమ్యమును ఆరోపించుచున్నారు. కొందరు నీచులు ఆకృతిని చేతనత్వమును కలిగినదయిన దేహమేయని అందురు. మరియు వేదములను పొందినవాడవైన నిన్ను కొందరు పురుషుడు అనియు కొందరు శబ్దబ్రహ్మము అనియు కొందరు శివుడు అనియు కొందరు జ్ఞానస్వరూపుడు అనియు తలతురు. కుత్సితమార్గమును అవలంబించిన మరికొందరు నిన్నుతీర్థవిషయునిగాదలచి అవును

మధిష్ఠాయ కేశాకేశిమిథోజనాః. ప్రవదంతి పునస్త్వాంహి కేచిత్సంతాన రక్షిణం, భూతయోగజచైతన్యం చార్వాకస్త్వాముపాసతే. సౌగతాబ్రువతేతర్కే త్వాంబుద్ధిం క్షణభంగురామ్, శరీరపరిమాణంత్వాం మన్యంతే నచ దేవతామ్. ధ్యాయంతి పురుషంత్వాన్యే త్వామేవప్రకృతేః పరమ్, జన్మాదిరహితం పూర్ణంసచ్చిదానందలక్షణమ్. త్వామేవోపనిషద్భిస్త్వా చింతయంతి పరాయణాః, ఖాదిభూతాని దేహంచ మనోబుద్ధీంద్రియాణిచ· విద్యావిద్యేత్వమేవాత్ర నాన్యత్త్వత్తోఽస్తి కించన, త్వమగ్నిస్త్వంహవిస్త్వంహిహోతాత్వంతత్క్రియాఫలమ్. త్వమస్తినాస్తి వైకుంఠ త్వామహంశరణంగతః, త్వంకర్మఫలదాతాచ దీక్షితానాం క్రియాక్షయే. త్వంహేతుస్సర్వభూతానాం త్వమేవశరణంమమ, యువతీనాంయథాయూని యూనాంచయువతౌయథా. మనోఽభిరమతేరత్యావనో మేరమతేత్వయి, అపిపాపందురాచారం నరంత్వత్ప్రణతంహరే. నేక్షంతేకింకరాయామ్యాః

---

కాదను విషయమునందు పరస్పరము జుట్టుపట్టుకొని పోట్లాడుచున్నారు. ఇదిగాక సంతానమునకు రక్షణము నీవేయని చెప్పెదరు. చార్వాకమతస్థుడగువాఁడు నిన్నుపంచభూతముల చేరికవలన గలిగినచైతన్యమునుగా ఉపాసించును. బౌద్ధులగువారుతర్కమందు అనగా విచారించుటయందు క్షణకాలములో చెడునదియైన బుద్ధినిగా నిన్నుచెప్పెదరు. కొందరు నిన్నుశరీరపరిమాణముగల దేవతనుగాతలపరు. మరికొందరు ప్రకృతికంటె పరుడైన పురుషునిగాను జన్మములు మొదలుగునవి లేనివానిగాను సంపూర్ణునిగానుసత్తు చిత్తుఆనందము అనులక్షణములు గలవానిగానుతలంచెదరు. నీయందు పొందినమనసుగల నీభక్తులు ఉపనిషత్తులవలన ప్రతిపాదింపబడెడి పరబ్రహ్మమునీవే అని ధ్యానించుచున్నారు. విచారింపగా, ఆకాశము మొదలగుమహాభూతములు అయిదును మనస్సును బుద్ధియును త్వక్కు-చక్షువు మొదలగు ఇంద్రియములును విద్యావిద్యలును నీవే. నీకంటె ఇతరమేది యుంకాను. అగ్నియును, అగ్నియందు దేవతలను ఉద్దేశించివేల్వబడెడి నెయ్యిమొదలగు హవియు, ఆనెయ్యిమొదలగువానిని వేల్చెడిపురుషులను, ఆవేల్చుటవలనిఫలమును ఆఫలము కలదు లేదు అనువిషయమును నీవే. కనుక నిన్నుశరణుచొచ్చెదను. ఓస్వామీ! యజ్ఞాది వ్రతదీక్షను వహించినవారికి ఆవ్రతపరిసమాప్తియందు అందులకు తగిన ఫలమును ఇచ్చువాడవును సమస్తప్రాణులకును కారణమైనవాఁడవును నీవుకనుక నీవే నాకు రక్షకుఁడవు. యౌవనస్త్రీలమనస్సు యౌవనపురుషులయందును యౌవనపురుషులమనస్సు యౌవనస్త్రీలయందును క్రీడచేత ఎట్లు రమించునో అట్లు నామనస్సు నీయందు రమించుచున్నది ఓహరీ! కుష్ఠగూబలు సూర్యుని చూడనేరనివిధమున పాపాత్మునినైనను చెడ్డనడత

ఉలూకా స్తపనం యథా, తాపత్రయమఘౌఘంచ తావత్పీడయతే జనమ్. యావత్ శ్రయతినో నాథ భక్త్యా త్వత్పాదపంకజమ్. యత్సంస్పృశంతి గతయః ఖజలేంద్రియాణాం యం సంస్పృశన్తి యతయో గతసంగమోహాః, స్థూలం విలాప్య కరణైకగణం నిదానే తత్కారణం కరణకారణవర్జితేచ. ఇత్థం విలాప్య యతినః ప్రవిశంతి యత్ర తం త్వా హరిం విశదబోధకరం నమామి, యద్ధ్యానసంగమనచూర్ణవశీకృతాం తా మైశ్వర్యచారుగణికాం సుఖమోక్షలక్ష్మీమ్. ఆలింగ్య శేరత ఇహాత్మసుఖైకభాజి తస్మై నమోఽస్తు హరయే మునిసేవితాయ, జన్మాదిభావవికృతిర్నికృతిస్వభావో యస్మిన్నయం పరిచినోతి షడూర్మివర్గః. యం తాటయంతి న సదా మలినాదిదోషా స్తం వాసుదేవమమలం ప్రణతోఽస్మి హార్దమ్, యద్భానుసంగమమలం నిజహార్త్యవిద్యాం యద్భానువహ్నిజనితం జగ దేతి దాహమ్ యద్భావముల్లసదసిద్ధ్యతి సంశయాదీ తస్మై నమోఽస్తు గురవే హరయే ప్ర

వడిగలవాఁడవైనను నీకు మ్రొక్కినమనుష్యుని యమకింకరులు చూడనేరరు. ఓయేలినవాఁడా! ఎంతపర్యంతము జనము భక్తితో నీపాదకమలములను గొలువదో అంతపర్యంతము అజనమును మూఁడువిధములయిన తాపములును పాపములసమూహమును బాధించుచుండును. ఆకాశము భూమి ఇంద్రియములు వీనియొక్క వ్యాపనములు ఎవనిని అంటవో, పెండ్లాముబిడ్డలతోఁగూడికవలని మచ్చికలేనివారయిన యోగులు ఎవనిని అంటుదురో, పద్గుణైశ్వర్యసంపన్నుఁడగు అవిష్ణుదేవుఁడవైననీకు నేను మ్రొక్కెదను. నాకు ప్రసన్నుఁడవు అగుము. యతులైనవారు సాధనాంతరాపేక్షలేనిమూలకారణములు లేనియే దేవునియందు చొత్తురో ఆనిర్మలజ్ఞానమునిచ్చునట్టివిష్ణుదేవుఁడవైన నిన్నుగూర్చి మ్రొక్కెదను. ఏ దేవుని ధ్యానముతోడికూడికయనెడి చొక్కుపొడిచేత స్వాధీనముచేసికోఁబడిన ఐశ్వర్యముగల అందగత్తెయైనబోగముదిఅగుసుఖరూపిణియైన మోక్షలక్ష్మిని కౌగిలించుకొని ఈలోకమునందలిచేతనసుఖమునొక్కదానినే పొందుచు పండుకొనియుండువాఁడెవఁడో, అట్టిమునులచేత సేవింపబడుచున్న నీకు మ్రొక్కెదను. జన్మము మొదలగుభావవికారములు గలిగినదియుం వంచించుస్వభావముగలిగినదియునైన ఆకలి దప్పి శోకము మోహము ముదిమి చావు అనెడి షడూర్ములయొక్క సముదాయము ఎవనియందు నశించునో, మైలపడినవాఁడు అనునివి మొదలగుదోషములు ఎవనిని బాధింపవో, అట్టిపరిశుద్ధుడును ప్రేమగలవాడునైన వాసుదేవునిగూర్చి మ్రొక్కెదను. నిర్మలమయిన యెవనివలని జ్ఞానమనెడివెలుగుయొక్క కూడిక అజ్ఞానమును తొలగించునో, ఎవని తేజస్సనెడి సూర్యునియొక్క వేడిమివల్లన బుట్టినతాపమును లోకము పొందుచున్నదో, ఎవనివలన ప్రకాశించుచున్న

సీద. చరాచరాణిభూతాని సర్వాణ్యస్య హరేర్వపుః, యథా నేతుం సస
త్యేనపురస్తిష్ఠతు మేహరిః యథానారాయణస్సర్వం జగత్ స్థావరజంగమ
మ్, తేనసత్యేన మే దేవస్తద్దర్శయతు కేశవః. భక్తిర్యథా హరౌమేస్తి తద్వ
న్నిష్ఠా గురుర్యది, మమాస్తి తేన సత్యేన దర్శనం యాతు మేహరేః.
ఇత్యేవంశపథైస్సత్యైర్భక్తిం తస్యానుచింతయన్, దర్శయామాస చా
త్మానం సుప్రీతః పురుషోత్తమః. తతో దత్వా వరం తస్య పూరయిత్వా
మనోరథమ్, జగామకమలాకాంతః స్తుత్వా విప్రస్యతోషితః. కృతకృత్యో
ద్విజస్సోఽపి నారాయణపరాయణః, శిష్యైస్సార్ధం జపన్ స్తోత్రంతస్మిన్నా
స్తే తపోవనే. కీర్తయేద్య ఇమంస్తోత్రం శృణుయాద్యోపి మానవః, అశ్వ
మేధస్యయజ్ఞస్య ప్రాప్నోత్యవికలంఫలమ్. ఆత్మవిద్యాప్రబోధంచ లభతే
బ్రాహ్మణస్సదా, నపాపే జాయతేబుద్ధిర్నైవ పశ్యత్యమంగళమ్. బుద్ధి
స్వాస్థ్యం మనస్స్వాస్థ్యంస్వాస్థ్యమైంద్రియకంతథా, నృణాంభవంతి సర్వే

---

(తేటపాటిన) మనస్సు సంశయము మొదలగువానిని పొందదో, అట్టి ఆచార్యుఁడైన శ్రీహరికొరకు నమస్కారము చేసెదను. ఆనీవు నన్ను అనుగ్రహింపుము. చరములును అచరములు నైనప్రాణులనన్నిటిని విష్ణుదేవుని దేహము పొందునట్లు ఆవిష్ణుదేవుడు ఈసత్యముచేత నాయెదుట నిలువబడుగాక. స్థావరములును జంగమములును గల సమస్త జగత్తును శ్రీమన్నారాయణుడు అనెడు సత్యముచేత ఆబ్రహ్మరుద్రులకు జన్మస్థానమైన దేవుడు నాకు ఆజగత్స్వరూపమును చూపునుగాక. శ్రీహరియందలి భక్తినాకుఎట్లుకలదో అట్లు నిష్ఠయును మిక్కుటమైయుండెనుపక్షమున ఈసత్యముచేత నాకు శ్రీవిష్ణుదేవునిదర్శనము లభించునుగాక. ఈవిధముగా శపథరూపములైన సత్యములచేత ఆభగవత్సంబంధమైన భక్తిని మాటిమాటికి తలచుచుండగా, ఆపరమపురుషుడు సంతోషించి ప్రత్యక్షమై ఆతడు అడిగిన వరమిచ్చి కోరికతీర్చి ఆ బ్రాహ్మణునుచేయుంనట్టి స్తోత్రముచేత సంతోషపడియెను. అట్లు కృతార్థుడైన ఆ బ్రాహ్మణుడును శ్రీమన్నారాయణుని యందు పొందిన మనసుగలవాడై శిష్యులతోగూడ ఆస్తోత్రమును జపించుచు ఆ తపోవనమునందేయుండెను. ఇప్పుడు ఈస్తోత్రమును ఏమనుష్యుడు పఠించునో ఏమనుష్యుడు వినునో వాడు అశ్వమేధయాగముయొక్క చెడనిఫలమును పొందును బ్రాహ్మణుడు పఠించినను విన్నను బ్రహ్మవిద్యను అంమలతెలివిని పొందును. వానిబుద్ధి పాపమునందు చొరదు. వాడు అశుభమును చూడడు. ఈ స్తోత్రమును పఠించుటవలన ఎల్లవారికిని బుద్ధినిలకడయును నెమ్మదియును ఇంద్రియపటుత్వమును కలుగును. ఇదిగాక, మేలునచే

పాం అస్యస్తోత్రస్య కీర్తనాత్. విచార్యాథ జపేద్యస్తు శ్రేయోర్థీతత్పరో నరః, న తస్య సంతిపాపాని లభతే వైష్ణవంపదమ్. వాంఛితాన్ లభతే కామాన్ పుత్రాన్ ప్రాప్నోత్యనుత్తమాన్, దీర్ఘమాయు ర్బలంవీర్యం లభతేసర్వదానరః. తిలపాత్రసహస్రేణ యత్ఫలంఫలతేనృణామ్, తత్ఫలంసమవాప్నోతి యఇమాం కీర్తయేత్ స్తుతిమ్. ధర్మార్థకామమోక్షాణాం యంయం కామయతేచయః, అచిరాత్తమవాప్నోతి స్తోత్రేణానేన మానవాః. మహాపాతకయుక్తోఽపి యుక్తోవాసర్వపాతకైః, సద్యోభవతి శుద్ధాత్మా స్తోత్రస్య పఠనాత్సకృత్. అగ్నిచోరనిపాతేషు సదాసంకీర్తయేదిదమ్, దుర్గాతితరణేస్తోత్రం పఠితవ్యంజితాత్మభిః. నక్షత్రగ్రహపీడాసు రాజదైవభయేషుచ, సింహవ్యాఘ్రభయోనాస్తి నాభిచారభయంతథా. భూతప్రేతపిశాచేభ్యో రాక్షసేభ్య స్తథైవచ, పూతనాజృంభకేభ్యశ్చ విఘ్నేభ్యశ్చైవ సర్వదా. నృణాంభయం క్వచిన్నాస్తి స్తవే యస్మిన్ ప్రకీర్తితే, వాసుదేవస్య పూజాం యః కృత్వా స్తోత్రము

---

ఠించిన ఏమనుష్యుడు శ్రద్ధగలిగి విచారణచేసి యీ స్తోత్రము జపించునో వానికి పాపములు కలుగవు. విష్ణు సంబంధమైన పరమపదము కలుగును. మరియు ఈ స్తోత్రమును ఎల్లప్పుడు చదువుచు కోరినకోరికలను పొందును. మిక్కిలి మంచివారైన కొడుకులను పడయును. దీర్ఘాయుస్సును బలమును వీర్యమును పొందును. ఈస్తోత్రమును చదువునట్టి మనుష్యులకు వేయి నువ్వులపాత్రములు దానముచేయుటచేత కలిగెడి ఫలముకలుగును. ఈ స్తోత్రముచేత ధర్మార్థకామములలో దేనిదేనిని ఏయేమనుష్యుడు కోరునో ఆయామనుష్యుడు ఆయాఫలమును శీఘ్రకాలములోనే పొందును. పంచ మహాపాతకములతోగూడినవాడైనను లేక సకలపాపములతోను కూడినవాడైనను ఈ స్తోత్రమును చదివినయెడ అప్పుడే పరిశుద్ధమైన మనసుగలవాడు అగును. ఈస్తోత్రము అగ్నిభయమునందును దొంగ భయమునందును ఎల్లప్పుడు చదువవలసినది. దాటరాని కష్టములను దాటునప్పుడు ఈస్తోత్రము జితేంద్రియులై చదువవలసినది. నక్షత్రపీడయందును గ్రహపీడయందును రాజులవలని భయమునందును క్షుద్రదేవతలవలని భయమునందును ఈస్తోత్రమును చదువవలసినది. ఈస్తోత్రమువలన సింహము పులి వీనివలనిభయముకలుగదు. ఆ లాగుననే దొంగ తోడుబోతువలని భయము కలుగదు. ఎక్కడ యీస్తోత్రము చదువబడునో అక్కడ ఎప్పుడును జనులకు భూతములు ప్రేతములు పిశాచములు రాక్షసులు పూతనాదిగ్రహములు జృంభకము మొదలగు అస్త్రప్రయోగములు పనిచెరుపులు వీనివలని భయము కలుగదు. ఎవడు విష్ణుదేవుని పూజించి ఈ స్తోత్రమును చదువునో

దీరయేత్. లిప్యతే పాతకైర్నాసౌ పద్మపత్రమివాంభసి, గంగాదిసర్వతీర్థేషు వసన్ వై యాతి యాంగతిమ్. తాంగతిం సమవాప్నోతి పఠన్ పుణ్యామిమాంస్తుతిమ్, ఏకకాలం ద్వికాలం వా త్రికాలం వాపి యః పఠేత్. సర్వదా సర్వకార్యేషు సోఽక్షయ్యం సుఖమశ్నుతే, చతుర్ణాం సాంగవేదానాం త్రిరావృత్త్యాపి యత్ఫలమ్. తత్ఫలం లభతే స్తోత్రం అధీయానస్సకృన్నరః, అక్షయ్యం ధనమాప్నోతి స్త్రీణాం భవతి వల్లభః. దేవద్యుతిప్రణీతం హి విష్ణుప్రియకరం శుభమ్, విష్ణుప్రసాదజనకం విష్ణుదర్శనకారణమ్. యోగసారమిమం నామ స్తోత్రం పరమపావనమ్, యః పఠేత్సతతం భక్త్యా విష్ణులోకం స గచ్ఛతి. సర్వమాఘఫలప్రాప్తిరేకవారం స్తవే కృతే, ఇతి తే కథితం స్తోత్రం గుహ్యం పరమపావనమ్ ఇత ఊర్ధ్వం ప్రవక్ష్యామి పిశాచస్య చ మోక్షణమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే - మాఘమాహాత్మ్యే - యోగసారస్తవ
ప్రతిపాదనం నామ ద్విచత్వారింశోఽధ్యాయః.

---

వాఁడు నీళ్లయందలి తామరాకునీళ్లచేత అంటబడనట్లు పాపములచేత నంటబడఁడు; జనుడు పవిత్రమైన యీస్తోత్రమును చదివి గంగ మొదలైన పుణ్యతీర్థము లన్నిటియందును ఉండి పొందునట్టి ఉత్తమగతిని పొందును. ఒకపూటనైనను రెండుపూటలైనను మూఁడుపూటలునైనను ఎల్లప్పుడు ఈస్తోత్రమునుచదువువాఁడు ఎల్లకర్మలయందును తరుగని సౌఖ్యమునుపొందుచుండును. శిక్ష వ్యాకరణము మొదలగు అంగములతోఁగూడి నాలుగు వేదములు మూఁడుమారులు చదువుటచేత ఏఫలముకలుగునో ఆఫలము ఒకసారి యీస్తోత్రమును చదువుటచేత నేమనుష్యుఁడు పొందును. మరియు ఈ స్తోత్రము నుచదువుటచేత తరుగనిధనమును పొందును. స్త్రీలకు ప్రియమైనవాఁడుఅగును. దేవద్యుతివలన చేయబడిన యోగసారస్తవము అనెడియీస్తోత్రము విష్ణువునకు ప్రియముకలుగఁజేయునది. మేలైనది. విష్ణువుయొక్క అనుగ్రహమును పుట్టించునది. విష్ణువుయొక్కదర్శనమునకు హేతువైనది. మిక్కిలిపావనమైనది. ఎవఁడు దీనిని ఎల్లప్పుడు భక్తితోఁ చదువునో వాఁడు విష్ణులోకమును పొందును. ఒకస్తోత్రమును చదివినయెడ ఎల్లమాఘస్నానముల ఫలమును కలుగును. మిక్కిలిరహస్యమును పావనమునైన యీస్తోత్రము నీకుచెప్పబడెను. ఇకమీద పిశాచము యొక్క మోక్షమును చెప్పెదను. అని రోమశుఁడు దేవనిధితోఁ చెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు యోగ
సారస్తవమును తెలిపెడి నలుబదిరెండవ అధ్యాయకథ.

## త్రిచత్వారింశోఽధ్యాయః

రోమశః.—శ్రూయతాం యః పిశాచశ్చ మోచితస్తేన తద్వనే, ఆసీద్రాజా చిత్రసేనో ద్రావిడేవిషయే పురా సోమాన్వయో మహాక్షాత్రశ్శూరస్సత్యపరాక్రమః, దక్షిణాంబుధితీరస్థః స పాలయతి తాః ప్రజాః రత్నసంపూర్ణకోశోసౌ రత్నాకర ఇవాపరః, గజైరశ్వైరథౌఘైశ్చ పత్తిభిః పరివేష్టితః. స్వర్ణైర్నానావిధైరర్థైః పూర్ణకోశో మహాధనః, గజవాజిరథౌఘైశ్చ సంపన్నోఽమితవిక్రమః. మధ్యే నారీసహస్రాణాం సదా క్రీడతి తత్పరః, శోభతేస్మ స సర్వత్ర పాదపైరివ పర్వతః ధర్మజ్ఞస్సత్యసంధశ్చ సర్వశాస్త్రార్థతత్త్వవిత్, పురోహితం పురస్కృత్య శ్రౌతకర్మ చకార సః. యజ్ఞైర్నానావిధైస్తేన కృతాసు బహుదక్షిణాః, నిత్యదానపరో రాజా నిత్యం చాతిథిపూజకః. బ్రహ్మణ్యో బ్రాహ్మణాధీతో సర్వశాస్త్రవిశారదః, బ్రహ్మవిష్ణుమహేశేషు సమబుద్ధిస్తథా గురౌ. గతః కౌతూహలేనైవ కదాచిజ్జటిలాలయం

---

## నలువదిమూఁడవ అధ్యాయము.

రోమశునిమాటలు.—ఓ వేదనిధీ! ఆవనమునందు అతనిచేత పిశాచజన్మమునుండి పిశాచము విడుదలచేయబడిన కథను వినుము. పూర్వకాలమునందు ద్రావిడదేశములో చిత్రసేనుడు అనురాజుకలడు. అతఁడు చంద్రవంశమునందు పుట్టినవాఁడును దొడ్డరాజధర్మముగలవాఁడును, శూరుడును, నిజమైనపరాక్రమముగలవాడునునై దక్షిణసముద్రపుతట్టుననుండెడిజనులను ఏలుచుండెను. ఇంతేకాక అతడు రెండవసముద్రుడో యనునట్లు రత్నములచేత నిండిన బొక్కసముగలవాడును ఏనుగులు గుఱ్ఱములు రథములు పదాతులు ననెడిచతురంగబలములచేత చుట్టబడినవాడును బంగారుమాడలచేతను నానావిధములైన ధనములచేతనునిండుకొన్న బొక్కసముగల ధనవంతుడును ఏనుగులయు గుఱ్ఱములయు రథములయుసమూహములచేత సంపన్నుడునుమితిలేనిపరాక్రమముగలవాడునునై వేలకొలది స్త్రీలనడుమ ఆసక్తితో క్రీడించుచున్నవాడును ధర్మము తెలిసినవాడును సత్యము తప్పనివాడును ఎల్లశాస్త్రముల అర్థము నెరిగినవాఁడునునై పురోహితుని ముందు పెట్టుకొని వేదమునందు చెప్పబడినకర్మములను చేసెను. అందును విశేషదక్షిణలతో నానావిధములైన అనేకయజ్ఞములు చేసి ఎడతెగక దానములు చేయుటయందు ఆసక్తుడును ఎల్లప్పుడు అతిథులను పూజించువాఁడును వేదోక్తధర్మములను నడపువాఁడును బ్రాహ్మణమంత్రములను చదివినవాఁడును ఎల్లశాస్త్రములందు సమర్థుఁడును బ్రహ్మ విష్ణు మహేశ్వరులందు భేదబుద్ధిలేనివాఁడును గురుభక్తిగలవాఁడును నైయుండి, ఒకానొకప్పుడు వేడుకచే జడల్ధరించిన

యమ్. జటిలై ర్వేదబాహ్యైస్తైః పాషండైర్భస్మపాండరైః, సార్థం తతః కథాజాతా రాజ్ఞ స్తస్య మహాత్మనః పాషండాః. ప్రభావశ్శ్రూయతాం రాజన్ శైవధర్మసముద్భవః, ఛిన్నపాశః సముచ్ఛేత శ్వపాకోపిచదీక్షయా. దీక్షైవమోచనీశైవీ సర్వవర్ణాశ్రమాణాం మృషా, నచాత్ర నాకం మృగ్యం హి శివస్యాజ్ఞాం వినాపునః. కిం దానైః కిం వ్రతైరన్యైః కిం వేదైశ్చ కిమధ్వరైః భస్మధారణమాత్రేణ గాణాపత్యం దృఢం భవేత్. జటీముండీశిఖీవాపి భస్మోద్ధూళితవిగ్రహః, శివస్యానుచరో భూత్వా శివేనసహ మోదతే. ఏకద్విత్రిజటో వాపి చతుః పంచజటోఽపివా, నభస్మసదృశం పుణ్యం నభస్మసదృశం తపః. జటినో భస్మసంయుక్తాస్సర్వేపిశివయోగినః, అంధాః కుబ్జా జడా మూర్ఖా జటాభిరుపలక్షితాః. అపిశూద్రాదివర్ణాశ్చ పూజ్యాఏవ నసంశయః, విశ్వామిత్రః క్షత్రియోఽపి తపసా బ్రాహ్మణోఽభవత్. చోరఏవ హి వాల్మీకి స్సజాతోఽసౌ ద్విజాగ్రణీః, అతో నైవవిచారోఽత్ర కర్తవ్యం శివపూజనమ్ తపసాజాయతే విప్రః తస్మాజ్జన్మనకారణమ్, తపఏవశివభక్తా

---

పాషండులుండు ఇంటికిపోయెను. వేదోక్తధర్మమునకు వెలియైనవారును జడలుధరించిన వారును భస్మపుపూతచే తెల్లగానుండువారునునైన ఆపాషండులతో గొప్పవాడైన ఆరాజునకు కొంతవాదము జరిగెను.

పాషండులమాటలు.—ఓరాజా! శైవధర్మమువలనపుట్టినప్రభావమును వినుము. తలపెంచుకొనుటచేత చండాలుడయినను ఆశాపాశములెల్లను తెగగా సంసారబంధము నుండి విడువబడును. శైవదీక్షయేదుఃఖములనువిడిపించునది. వర్ణములుఆశ్రమములు అనునవిఅన్నియుబొంకు. శివునియాజ్ఞలేక అందుస్వర్గములేదు. దానములచేతనుఇతరములైన వ్రతములచేతను వేదములచేతనుయజ్ఞములచేతనుఏమిప్రయోజనము. విభూతినిఽాల్చుకొన్నమాత్రముననే గణపతిత్వముతప్పకకలుగును. జడలుగలవాడయినను బోడితలవాడయినను జుట్టుపెట్టుకొన్నవాడైనను భస్మము దుమ్మెగయపూయబడినదేహము గలవాడు శివుని సేవకుడై శివునితోగూడ ఆనందించును. ఒకజడ రెండుజడలు మూడుజడలు గలవాడైనను నాలుగు ఐదు జడలుగలవాడైనను కావచ్చును. భస్మమునుబోలిన పుణ్యమును భస్మమును బోలిన తపస్సును లేదు గనుక జడలునుభస్మమునుధరించినవారు అందరును శివయోగులగుదురు. గ్రుడ్డివారుగూనివారు, తెలివిమాలినవారు, తెలిసీతెలియనివారుఅయినను జడలుధరించినవారు శూద్రజాతి మొదలగుతక్కువజాతులవారుగూడ పూజ్యులే. అందు సంశయములేదు. విశ్వామిత్రుడు రాచవాడు అయ్యును తపస్సుచేతబ్రాహ్మణుడు అయ్యెను. దొంగగా నుండియుం వాల్మీకి బ్రాహ్మణులకు శ్రేష్ఠుడాయెను. కనుక లేనిపోని విచారము అక్కరలేదు. శివపూజనమే చేయదగినది. తపస్సుచేత బ్రాహ్మణుడు

హి యేనపశ్యంతి తాన్ ద్విజాన్. అతఏవహి రాజేంద్ర శ్రేష్ఠం శైవంహి దర్శనమ్, రహస్యం శైవమార్గోఽస్తి నాన్యం దైవం ప్రపూజయేత్. యత్నేనతపసా విష్ణు ర్వర్జనీయః ప్రయత్నతః, వైష్ణవం ప్రతిమూంనైవ పూజయే న్నాభివాదయేత్. విష్ణుదర్శనమాత్రేణ శివద్రోహః ప్రజాయతే, శివభక్త్యాచ నిశ్శంకం శివస్యప్రియముచ్యతే. శివప్రీత్యానసందేహః కైలాసం యాంతిమానవాః, అయంధర్మోఽనవద్యోఽపి శివభస్మాపి ధారణమ్ ప్రకుర్వంతీహ రాజేంద్ర తతస్తే సంభవంతిచ, తస్మాన్నవిష్ణునామాపి శ్రోతవ్యం భవభీరుణా. అతోఽపి వైష్ణవోవధ్యః సర్వదేశేషు సర్వదా, ఇత్థం నగ్నప్రణీతాంస్తాన్ వర్ణయిత్వా తదాగమాన్. జటిలైర్మోహనైర్ధూర్తైః సభూపాలః ప్రతారితః,శ్రుత్వాతద్వచనం తేషాంచ రాజాతత్పురస్థితః. త్యక్త్వాచవైదికంకర్మ నిందన్వై వేదస్మృతిద్విజాన్, అగ్నిహోత్రాదయశ్శాంతాః స్వగృహేతస్యతత్క్షణాత్ నకరోతిచయద్ధర్మంవచనై స్సముదీరితమ్, విష్ణుంనిందతిసోఽత్యర్థం వైష్ణవాన్ ద్వేష్టిసర్వదా. క్వాసౌవిష్ణుః క్వదృష్టోఽసౌ క్వచ కేనైవ కీర్త్యతే, ఇత్థం నసహతేవిష్ణుం సరాజాద్వైవ

అగుటవలన జన్మము బ్రాహ్మణత్వమునకు కారణము కాదు. అందువలన ఎవరు శివభక్తులో వారు ఆబ్రాహ్మణులను కనులజూడరు. ఓరాజశ్రేష్ఠుడా! కనుకనే శైవమతముశ్రేష్ఠమైనది. రహస్యమైన శైవమార్గము కలదు గనుక అన్యదైవమును పూజింపకూడదు. ప్రయత్నరూపమయిన తపస్సుతోడ విష్ణువు విడువదగినవాడు. ప్రయత్నమువలనవిష్ణుప్రతిమను పూజింపరాదు. విష్ణువునుచూచుటమాత్రము చేతనే శివద్రోహముగలుగుచున్నది. జంకులేకుండెడి శివునియందలిభక్తిచేత శివునికిప్రియముచెప్పబడుచున్నది శివునిప్రీతిచేత జనులు కైలాసమును పొందుదురు. సందేహములేదు. ఈధర్మమునింద్యముకానిది. శివసంబంధమయిన విబూదినైనను ధరింపవలసినది. కనుక లోకమునందలి జనులు భస్మధారణముచేసి శైవులు అగుచున్నారు. ఆకారణమువలన జన్మములకు భయపడువాడు విష్ణువుయొక్క పేరుకూడ వినదగదు. కనుకనే ఎల్లదేశములందును ఎల్లవిధములచేతను విష్ణుభక్తుడు చంపదగినవాడగును. ఈవిధముగా పాషండులచే బోధచేయబడిన ఆమత గ్రంథములను శ్లాఘించి జడలుధరించినవారును మోహముపుట్టించువారునునైన ఆవంచకులచేత రాజు వంచింపబడినవాడై వారిమాటవిని వారియెదుటనిలిచి వేదోక్తకర్మములను విడిచి వేదములనుబ్రాహ్మణులనునిందించెను. అప్పుడే వానియింటిలోని అగ్నిహోత్రములు మొదలగునవి అణగిపోయెను. ప్రమాణవాక్యములచేత ఏధర్మమునుచెప్పబడెనో దానిని చేయక విష్ణువును మిక్కిలి నిందించుచు వైష్ణవులను విరోధించి ఎప్పుడుచూచినను విష్ణువు ఎక్కడెక్కడ చూడబడు ఎక్కడ ఎవనిచేత పొగడబడుచున్నాడు అని యీవిధ

మోహితః. నారాయణం భజంతే యే తాన్ పీడయతి సర్వదా, న బ్రాహ్మణో న వేదాశ్చ వైదికం కర్మ న వ్రతమ్ న దానం మన్యతే దాతుం పాషండాశ్రమమాశ్రితః, అనితే చండదండైశ్చ ప్రజాపీడాం కరోతి సః. స్త్రైణః కామీ మహాలుబ్ధశ్చండకోపస్స పార్థివః, దదౌ గ్రామాన్ గజానశ్వాన్ హేమరత్నవిభూషణాన్. తేభ్యో జటిలదుష్టేభ్యో దత్వా వా హంత స పార్థివః, అవాదయచ్చ నిత్యం స డిండిమాన్ స్వపురే తతః. యోర్చయేద్దైవతం విష్ణుం స దండ్యో వధ్య ఏవ నః, తద్భయాద్వైష్ణవా విప్రాః సజాయా వైష్ణవం తథా. తం దేశం సంపరిత్యజ్య యాతా జనపదాంతరమ్, అవశిష్టాః ప్రజాస్సర్వాః ద్రావిడీం తదనంతరమ్. తతః ప్రభృత్యధర్మిష్ఠాః తస్మిన్ దేశే ద్విజోత్తమ, న చ వర్షతి పర్జన్యో వర్ధతే న గవాం కులమ్ః నదీజలేన జీవంతి సతతం ద్రావిడా జనాః, వృక్షా నారోప్య జీవంతి బ్రాహ్మణా వృత్తికర్షితాః. ప్రయచ్ఛంతి కరం రాజ్ఞే తే ద్విజా మానవర్జితాః, న గర్హంతి ప్రజాస్తస్య చండీశస్య నివేదనమ్. చ్యుతాచారశ్చ్యుతో వేదాశ్చ్యుతాగ్ని

---

ముగా ఆరాజు దైవికముగా అజ్ఞానము నొందినవాడయి విష్ణువును సహింపకపోయెను. మరియుం ఎవరువిష్ణువును సేవింతురో వారిని ఎల్లప్పుడు బాధించును. బ్రాహ్మణుడు లేడు. వేదములు లేవు. వేదవిహితమైనకర్మము లేదు. వ్రతములు లేదు. దానములు లేదు. దానమియ్యదలచుట లేదు. అనియిట్లు ఆరాజు పాషండమతమును ఆశ్రయించినవాడై దుడ్డుకఱ్ఱలను తెప్పించి జనులను బాధపెట్టుచు, స్త్రీసమూహమును కోరువాడును మిక్కిలి లోభియుం వేండ్రమయిన కోపముగలవాడునయి దుష్టులయిన ఆజటాధరులకు ఊళ్లను ఏనుగులను గుఱ్ఱములను బంగారుసొమ్ములను రత్నములను ఇచ్చెను. అయ్యో! ఆ రాజు ఇట్లు చెడినదేగాక పిమ్మట తనపట్టణమునందు ఎవడు విష్ణుదేవుని పూజించునో వాఁడు మాకు దండింపదగినవాఁడును చంపదగినవాఁడును అగును. అని డిండిమమనువాద్యమును మ్రోయించుచు ప్రతిదినము చాటింపసాగెను. అంతట ఆభయమువలన వైష్ణవులయిన బ్రాహ్మణులందరు భార్యలతోఁగూడినవారై విష్ణు సంబంధము లేని ద్రావిడదేశమును విడిచి సజ్జనులుండెడి మరియొకదేశమును ప్రవేశించిరి. అదిమొదలు ఆదేశమునందు తక్కిన ప్రజలందరు అధర్మపునడవడి గలవారయిరి. వానకురియదయ్యెను. ఆవులమంద వృద్ధినొందదాయెను. ద్రవిడదేశపుజనులందరు ఏళ్లయందలి ఊటనీళ్లచే బ్రదుకువారైరి బ్రాహ్మణులు బ్రదుకు తెరువు లేనివారయి చెట్లు నాటిపెంచి జీవించుచుండిరి. మరియుం ఆబ్రాహ్మణులు మానమువిడిచి రాజునకు కప్పముకట్టుచుండిరి. వారియొక్క శివార్చనమునుగూర్చి జనులు దూషింపరయిరి. వాడు తన ఆచారమును వేదములను అగ్నిని

శ్చ చ్యుతక్రియః. సోఽనుశాస్తి జనంభూపః క్రూరఃకాలఇవాపరః, తతో బహుతిథే కాలే సరాజాపంచతాంగతః. వైదికేనవిధానేన నలేభే చౌర్ధ్వదైహికమ్, యమకింకరయూథేన పీడ్యమానో భృశం తదా అయఃకీలామయోమార్గే తప్తాంగారప్రపూరితే, చండార్కరశ్మిసంతప్తే వృక్షచ్ఛాయావివర్జితే. సంతప్తసికతాపూర్ణే వహ్నిజ్వాలా సమాకులే, లోహతుండైశ్చ కాకోలైః హన్యమానా స్సుదారుణైః. వృకైర్దంష్ట్రాకరాళైశ్చ శ్వాభిర్ఘోరైశ్చభక్షితాః, శృణ్వన్ క్రందిత మన్యేషాం నృణాం కిల్బిష కారిణామ్, జగామపార్థివోలోక మతంకస్యభయావహమ్, శృణు ద్విజగతింతస్య తస్మిన్లోకే సుదుర్గమే. నిరయాన్నిరయంయాతః పర్యాయేణాథభూపతిః, ఆదావపాత తామిస్రే దారుణేభూరిదుఃఖదే. పునశ్చాంధతామిస్రే యత్రదుఃఖం దురత్యయమ్, రౌరవాదిషు సర్వేషు నరకేషు ప్రబాధితః. విష్ణుప్రద్వేషమాత్రేణ యుగానామేకవింశతిః, భుక్త్వాచ యాతనాంయామీం విస్తీర్ణనరకోన్నృపః. సుమహాన్ గిరిరాజేశౌ

తక్కినసత్క్రియలను వదలినవాఁడు రెండవయముఁడో అనునట్లుక్రూరుఁడునయినరాజై జనులను ఏలుచుండి, అటుపిమ్మట చిరకాలమునకు చచ్చెను. వానికి వేదమునందు విధింపబడినవిధమున ఉత్తరక్రియలు జరిగినవికావు. కనుక యమకింకరులసమూహముచేత మిక్కిలి బాధింపబడినవాఁడై ఇనుపమేకులుగలదియుం కాలినబొగ్గులచేత నిండింపబడినదియుం పెండ్రమయినయెండచేత కాలినదియుం చెట్లనీడలేనిదియుం కాలిన యిసుకచేత నిండినదియుం నిప్పుమంటలచే నిండికొన్నదియునైనమార్గమునందు ఇనుపముక్కులకాకులచేత పొడువబడుచున్నవాఁడును మిక్కిలి భయంకరములయిన తోడేళ్లచేత కోరలచేత భయంకరములును క్రూరములయిన కుక్కలచేతను తినబడుచున్నవాఁడును నగుచు పాపములు చేసిన యితర జనులయొక్క యేడ్పును వినుచు భయమును గలుగచేయునట్టి యమలోకమును గూర్చిపోయెను. ఓబ్రాహ్మణుఁడా! మంచివారికి పొందరానిదయిన యాలోకమునందలి వానిగతిని చెప్పెదను వినుము. అటుపిమ్మట, ఆరాజు ఒకనరకమునుండి మరియొకనరకమునకు పోవుచు క్రమముగా అన్నినరకములను అనుభవించెను. అందు మొదట భయంకరమైన మిక్కుటమయిన దుఃఖము నిచ్చునట్టిదయిన తామిస్రమను నరకమునందుపడి అందుండి ఎన్నడును నశింపని దుఃఖమునుపొందించెడి అంధతామిస్రమందు పడెను. పిమ్మట క్రమముచొప్పున రౌరవము మొదలుగాగల ఎల్లనరకములయందును బాధింపబడెను. విష్ణువును ద్వేషించినమాత్రముచేతనే ఇరువదియొక్కయుగములు కడచునంతవరకు యమసంబంధమయిన విశేషనరకయాతనను అనుభవించి

పిశాచోఽభూత్తదానృపః, ప్రధావతిదిశస్సర్వా వనేతస్మిన్ బుభుక్షితః, నపశ్యత్యశనంతోయం ధావమానస్సదాగిరౌ. కదాచిత్పర్యటన్సోథ పిశాచశ్శోకపీడితః, ప్లక్షప్రస్రవణారణ్యం ప్రవిష్టోభావిసత్ఫలః. విభీతకతరుచ్ఛాయాం సమాశ్రిత్యసుదుఃఖితః, హాహతోఽస్మిసదాక్రందన్ ఘోరముచ్చైః పునఃపునః క్షుత్తృష్ణాదహ్యమానస్య సర్వభూతద్రుహోమమ, జన్మనోఽస్యదురంతస్యకథమంతో భవిష్యతి. అహోపాపసముద్రేఽస్మిన్ దుఃఖకల్లోలమాలిని, కరావలంబనంకోమే నిమగ్నస్యప్రదాస్యతి. ఇత్థం తస్యపిశాచస్య రోదనందీనచేతసః, దేవద్యుతిరధీయానః శుశ్రావ కరుణామయః. సమాగమ్య తతస్తత్ర తంపిశాచం దదర్శహ, వికరాళముఖందీనంపిశంగనయనంకృశమ్. ఊర్ధ్వమూర్ధజకృష్ణాంగం యమదూత మివాపరమ్, లోలజిహ్వంచ లంబోష్ఠం దీర్ఘజంఘంసిరాకులమ్. దీర్ఘాంఘ్రిందీర్ఘబాహుంచ శుష్కాక్షంశుష్కపంజరమ్, అథాముంకౌతుకావిష్టః పప్రచ్ఛ మునిపుంగవః కోఽసిత్వంభీషణాకార కుతోరోదిషి దారుణమ్, అవస్థేయం

---

పిమ్మట ఆగొప్ప పర్వతమునందు పిశాచమై ఆకలిబాధచేత అందలి అడవియందు అంతటను పారాడుచుండెను. అట్లు ఎల్లప్పుడు ఆకొండయందు అన్నము నీళ్లు గానక నలుదిక్కులకు పారాడుచున్న యాపిశాచము ఒకసమయమునందు రాగల దుఃఖముచేత పీడింపబడినవాడయ్యును పొందువాడై ప్లక్షప్రస్రవణమను అడవిని ప్రవేశించి తాండ్రచెట్టు నీడనుచేరి మిక్కిలి దుఃఖమునొంది భయంకరముగాను గట్టిగాను మాటిమాటికిని అయ్యో! చచ్చితిని చచ్చితిని అని ఎల్లప్పుడు ఏడ్చుచు ఆకలి దప్పులచేత రగులుచున్నవాఁడును ఎల్లభూతములకు ద్రోహముచేయువాఁడును నయిన నాకు మేరలేనిజన్మములు తుదముట్టుట ఎట్లగును. దుఃఖములనెడి గొప్పయలల పరంపరలుగల పాపసముద్రమునందు మునిగియున్న నాకు చేయూఁతనొసఁగువాఁడెవఁడు? అని యిట్లు దుఃఖపడుచున్న ఆపిశాచముయొక్క యేడ్పును విని విద్వాంసుడును దయాస్వరూపుఁడు నైన దేవద్యుతి అచ్చటికి పోయి ఆపిశాచమును చూచెను. భయంకరమైన దఃఖమును విన్నదనమును నల్లని దేహమును యమదూత పోలికయు కదలింపబడుచున్న నాలుకకొనయు వ్రేలుచున్న పెదవియు నిడుపులైన పిక్కలును నరములచేత నిండుకొనుటయు నిడుపులైన అడుగులును నిడుపాటి చేతులును ఎండిన డొక్కయునుగల ఆపిశాచమునుచూచి, ఓరీ! వెరపును పుట్టించెడు దేహముగలవాఁడా! నీవెవఁడవు? ఏల యిట్లు భయంకరముగా ఏడ్చెదవు? నీకు ఈయవస్థ యెట్లు

కుతో బ్రూహి కింవాహంకరవాణితే మమాశ్రమంప్రవిష్టోఽసిదుఃఖభా జో నజంతవః, మోదంతే సర్వఏవాత్ర వైష్ణవేభువనేయథా. వదత్వంస త్వరంభద్ర దుఃఖస్యైతస్యకారణమ్, కాలక్షేపంప్రకుర్వంతి ప్రాప్తేర్థేన మనీషిణః. శ్రుత్వైతద్వచనం ప్రీతః పిశాచస్త్యక్తరోదనః, ఉవాచ దీన యావాచా ప్రణయావనతస్తథా. పిశాచః. సర్వాంగవ్యాపి సంతాపం జహార త్వద్వచోమమ, గ్రీష్మదావానలోద్భూతం వర్షామేఘైరివాచలే. యస్మేఽస్తి సుకృతంకించిత్తేనదృష్టోఽసి భో ద్విజ, నహ్యసంచితపుణ్యా నాం సద్భిరేకత్ర సంగతిః. ఇత్యుక్త్వాకథయామాస సర్వవృత్తాంత మాత్మనః, విష్ణుద్వేషప్రభావేన దశామేతాం స్వయంగతః. యన్నామప్రవ ణాన్ముక్తో స్మృత్వా విష్ణుపదంవ్రజేత్, పాపిష్ఠస్యహరౌతస్మిన్ మమద్వే షోఽభవద్ద్విజ. యంపాలయతిభూతాని ధర్మంప్రతిజగత్త్రయే, యోంత రాత్మాచ భూతానాం తస్మిన్ ద్వేషోమమాభవత్. కర్మణఃఫలదోయశ్చ సర్వవేదేషు పఠ్యతే, తపోభిరిజ్యతే విప్రైః తస్మిన్ ద్వేషోభృశంకృతః.

---

వచ్చెను. నీకు నేనుఏమి చేయవలెనో చెప్పుము. నాయాశ్రమమును ప్రవేశించితివి. ఇచ్చట శ్రీవిష్ణులోకమునందువలె ఎల్లజంతువులును దుఃఖమునుపొందక సంతోషించుచుండును. ఓరిపుణ్యాత్ముడా! నీదుఃఖమునకు కారణము శీఘ్రముగా నాతో చెప్పుము. ఒక మేలు కలుగునప్పుడు బుద్ధిమంతులు కాలము వ్యర్థముగా పోగొట్టరు. అని వేడుకపడియడిగెను ఈమాటను విని పిశాచము దుఃఖమునుమాని సంతోషించి వినయముతో మ్రొక్కి దిట్ట తనములేని మాటలతో ఇట్లు పలికెను.

పిశాచముమాటలు.—ఓబ్రాహ్మణుడా! నీమాటచేత కొండయందు ఎండకాలము నందలి కార్చిచ్చువలని తాపము, వానకాలపు మేఘముచేత అణగినట్లు నా అవయవ ములు అన్నిటియందును వ్యాపించిన తాపము అణగెను. ఏకారణముచేతనో నాకు కొంచెము పుణ్యముకలిగియున్నందున నిన్ను జూచితిని. పుణ్యము లేనివానికి ఎప్పుడును సత్పురుషులతోడి కూడిక కలుగదు. అని చెప్పి తనవృత్తాంతమంతయు చెప్పెను. ఓబ్రా హ్మణుడా! విష్ణుదేవునందలి ద్వేషముయొక్క మహిమచేతనే యీదశను నేను పొంది తిని. ఎవనిపేరు భక్తిగలవాడై తలచుటచేత జనుడు ముక్తుడై విష్ణుపదమును బొందునో అట్టివిష్ణుదేవునియందు పాపాత్ముడనైన నాకు ద్వేషముకలిగెను. ఎవడు మూడులోకము లయందును ధర్మమునుగూర్చి ప్రాణులను పాలించుచున్నాడో అట్టిప్రాణులకెల్లను అంత రాత్మయైన విష్ణుదేవునియందు నాకు ద్వేషముకలిగెను. ఎవడు ఎల్లసత్కర్మములకును ఫల ము నిచ్చునో, ఎవడుఎల్లవేదములయందును చదువబడునో, ఎవడుతపస్సులచే బ్రాహ్మణుల

త్యక్తక్రియైః ప్రియారణ్యై ర్నిస్సంగైః ఖచరైశ్చయః, వేదాంతై ర్యతిభిశ్చింత్యః సమద్వేష్యోఽభవద్ద్విజ. బ్రహ్మాదయస్సురాస్సర్వే యోగినస్సనకాదయః, యమర్చయంతి ముక్త్యర్థం విష్ణుం తం ద్వేష్ట్యహంద్విజ. ఆదిమధ్యావసానం యో విశ్వస్యాస్యసనాతనః, యస్యనాస్త్యాదిమధ్యాంతం సమద్వేష్యపథంగతః. యన్మయా సుకృతం కర్మ విహితం పూర్వజన్మని, విష్ణుద్వేషాగ్నినా దగ్ధం తత్సర్వం భస్మసాదభూత్. కథంచిదస్య పాపస్య సీమాంద్రక్ష్యామి చేదహమ్. ముక్త్వా నారాయణంనాన్య మర్చయిష్యామి చేదహమ్. విష్ణుద్వేషా న్మయాభుక్త్వా చిరాన్నరకయాతనామ్, నరకాన్నిర్గతస్సోఽహం పైశాచీం యోనిమాగతః అధునాహం కర్మపాకై రపాన్యనీత స్త్వదాశ్రమమ్, అద్య త్వద్దర్శనార్కా న్మే నష్టోదుఃఖమయంతమః. ప్రాప్యతేమరణంయత్ర బంధనం శ్రీస్సృఖంవధూః, సతత్ర నియతే స్సేన కర్మణా నతుహా స్తతః. ఇదానీముచితం కర్మ బ్రూహిపైశాచ నాశనమ్, పరోపకారమార్గోహి తేధన్యామందగామినః. దేవద్యుతిః.

---

చేత పూజింపబడునో, ఆవిష్ణుదేవునియందు మిక్కిలిద్వేషించితిని. ఎల్లక్రియలనువిడచినవారును అడవులయందు ప్రియముగలవారునువిషయములసాంగత్యములేనివారును ఆకాశమునందు తిరుగువారునై యతులచేతను వేదాంతములచేతను ధ్యానము చేయదగినవాడైన విష్ణుదేవుడునాకు విరోధియాయెను. బ్రహ్మమొదలుగాగలయెల్లదేవతలును సనకుడుమొదలైన యోగీశ్వరులును మోక్షముకొరకు ఎవనినిపూజింతురో ఆవిష్ణుదేవుని నేను విరోధించితిని. ఎవడు ఈప్రపంచముయొక్కసృష్టిస్థితి సంహారములనుచేయునో, ఎవనికి మొదలు (పుట్టుట) నడుమ (పెరుగుట) తుద (చావు) అనునవిలేవో, ఆ విష్ణుదేవుఁడు నాకు విరోధి యయ్యెను. పూర్వజన్మమునందు నాచేత చేయబడిన పుణ్యము ఏది కలదో అదిఅంతయు విష్ణువలని ద్వేషము అనెడి నిప్పుచేత కాలి బూడిదఐపోయెను. అట్లైనను ఆ పాపముయొక్క మేరను తెలిసికొనువాడనైనయెడ నేను శ్రీవిష్ణుదేవుని విడిచి యితరదేవతలను పూజింపక ఉందును. విష్ణువునందలి ద్వేషమువలన చిరకాలము నరకయాతనను అనుభవించి, పిమ్మట నరకమునుండి బయలు వెడలినవాడనై పిశాచజన్మమును పొందితిని. ఇప్పుడు నేను నాకర్మపరిపాకము చేత నీయాశ్రమమునకు తేబడితిని. మరియు ఇప్పుడు నీదర్శనము అనెడిసూర్యునివలన నాదుఃఖరూపమైన చీకటితొలగెను. కర్మానుగుణముగా కలుగునట్టిచావో నిర్బంధమో సంపదయో సుఖమో స్త్రీయో ఎవనికైనను ఎక్కడనైనను చేజేతకలుగకపోదు. కనుక ఇప్పుడు ఈపిశాచత్వము పోవుటకు తగినక్రియను నాకు చెప్పుము. ఎవరు అదృష్టహీనులకు మేలుచేయుమార్గము గలవారో వారే కృతార్థులు.

అహో ముష్ణాతి మోహోఽయం దేవాసురనరాన్ స్మృతమ్, యయా దేవేష్వపి ద్వేషో జాయతే కర్మనాశనః స్రష్టా పాలయితా హంత జగతాం యో మహేశ్వరః, ఆత్మా చ సర్వభూతానాం తం మూఢో ద్వేష్టి కః కథమ్ భవంతి సర్వకర్మాణి సఫలాని యదర్పణాత్, తద్భక్తివిముఖో మర్త్యః కో ను యాతీహ దుర్గతిమ్. శ్రుతిస్మృతిసదాచారవిహితం కర్మ కేవలమ్, సేవితవ్యం చతుర్వర్ణై ర్యజన్నారాయణం సదా. అన్యథాపి మలం యాంతి విమార్గాగమసేవనాత్, అతో వేదవిరుద్ధార్థశాస్త్రోక్తం కర్మ సంత్యజేత్. స్వబుద్ధిరచితైశ్శాస్త్రై ర్మోహయిత్వా జనం జనాః, విఘ్నంతి శ్రేయసో మార్గం లోకనాశాయ కేవలమ్. నిందంతి దేవతా వేదాన్ తపో నిందంతి సద్ద్విజాన్, తేన తే నిరయం యాంతి అసచ్ఛాస్త్రనిషేవణాత్. అనేనైవ పథా రాజన్ కేరళో నిరయం గతః, ద్విషన్నారాయణం విష్ణుం దేవదేవం జగత్పతిమ్. తస్మాద్ద్వేషం హి దేవేషు బ్రాహ్మణేషు విశేషతః, సంత్యజేత్సు

---

దేవద్యుతిమాటలు. ఓయీ! ఈయజ్ఞానము దేవతలను అసురులను మనుష్యులను మోసపుచ్చుచున్నది. దేనిచేత దేవతలయందు ద్వేషము పుట్టునో దానిచేతనే కర్మము నశించును. లోకములను పుట్టించువాఁడును పెంచువాఁడును చంపువాఁడును ఎవఁడో ఆ యీశ్వరుఁడు ఎల్లప్రాణులకును ఆత్మయగును. అట్టి యీశ్వరుని ఎవఁడయినను ఎట్లు ద్వేషించును. ఎవనికి సమర్పించుటవలన ఎల్లకర్మములును ఫలముకలవి అగునో, వానియందు భక్తిలేని మనుష్యుఁడు ఈలోకమునందు నరకమును అనుసరించిపోవును. వేదములయందును ధర్మశాస్త్రములయందును చెప్పఁబడియుండెడి చేయఁదగినకర్మములను బ్రాహ్మణులు మొదలగు నాలుగువర్ణములవారును ఎల్లప్పుడు శ్రీమన్నారాయణుని ఆరాధించుచు ముఖ్యముగా చేయవలయును. అట్లుగాక విరుద్ధమార్గములను తెలుపునట్టి దేవతాంతరసేవావిషయకగ్రంథములను అనుసరించుటచేత పాపము కలుగును. కనుక వేదమునకు విరుద్ధములైనవిషయములను తెలిపెడి శాస్త్రములందు చెప్పెడికర్మములను విడువవలసినది. కొందరుజనులు తమబుద్ధినిగొని చేయఁబడినశాస్త్రములచేత జనసమూహమును మోహింపఁజేసి కేవలము లోకమును చెరుచుటకై మేలైనమార్గమును పనిచెరిచెదరు. ఆజనులు శాస్త్రములను అనుసరించుటవలన దేవతలను వేదములను తపస్సును మంచిబ్రాహ్మణులను నిందింతురు. అట్లు నిందించుటచేత వారు నరకమును పొందుదురు. ఓరాజా! ఇటువంటిమార్గముచేతనే కేరళుఁడు, సర్వవ్యాపకుఁడును దేవతలకు దేవుఁడును లోకములకు ప్రభువును ఐన శ్రీమన్నారాయణుని ద్వేషించి, ఆకారణముచేతనే దేవతలయందును బ్రాహ్మణులయందును విశేష

ణ్యకామోఽత్ర వేదబాహ్యక్రియాబుధః. అహో సన్మార్గనిష్ఠస్య సచ్చరి
త్రస్యభూపతే, జాతా విధివశాద్దుష్టప్రసంగాత్కుత్సితామతిః. అసతాం
సంగతిః కస్య మూలం న విపదాం భవేత్, పతితైస్సంగతిస్స్పృష్టి శ్శు
చోఽపి మలినో నకిమ్. శ్రుతిస్మృతిసదాచారవిహితం కర్మసర్వదా, స్వం
స్వంధర్మం ప్రయత్నేన శ్రేయోర్థీనసదాత్యజేత్. స్వబుద్ధిరచితైశ్శాస్త్రైః
మోహయిత్వాజనంబహు,హరేహరౌచపాపిష్ఠా యేవిభేదంప్రకుర్వతే,
తేన తే నిరయంయాంతి కులానామేకవింశతిమ్, కర్మణా మనసా వాచా
తస్మాద్ద్వేషం వివర్జయేత్. హరే హరౌ చ ధర్మార్థీ వేదబాహ్యాం త్య
జేత్క్రియామ్, ఇత్థం తత్కథయామాస పైశాచ్యా త్తస్య మోక్షణమ్.
ప్రయాగం గచ్ఛ గచ్ఛేతి మాఘేమాస్యవిచారయన్, తత్ర తే నిశ్చితా
ముక్తిః పైశాచ్యా న్నాత్రసంశయః. తత్రాప్లుతా దివం యాంతి శ్రుతి
రేషా సనాతనీ, విజహాతి నర స్తత్ర ప్రాక్తనం కర్మ దుష్కృతమ్.
ప్రయాగస్నానతో నాస్తి క్వాప్యన్యదధికం ఫలమ్, ప్రాయశ్చిత్తతపో

---

ద్వేషముగలిగి నరకమునుపొందెను. కనుక పండితుడు అనువాడు పుణ్యమునందు ఇచ్ఛగ
లవాడై వేదములకు వెలియైనకర్మములను విడువవలెను. ఓయిరాజా! మంచిమార్గమునందు
ప్రవర్తించెడి మంచినడతగలవానికి దైవవశమున దుష్టులతోడి విశేషసహవాసమువలన
కుత్సితబుద్ధి పుట్టుచున్నది. దుష్టులయొక్క సహవాసము ఆపదలకు మూలముకానియెడల
మరి దేనికి అగును. పతితుని తాకినయెడల శుచియగువాడును అపవిత్రుడగును.
మేలుకోరువారు వేదములందును ధర్మశాస్త్రములందును చెప్పబడిన సత్పురుషులు
నడపెడు తగినకర్మములను తనకులధర్మమును అనుసరించి ఒకరి ప్రయత్నములేకయే నడుప
వలసినది. ఏపాపాత్ములు తమబుద్ధివలన చేయబడిన శాస్త్రములచేత జనులను మిక్కిలి
భ్రమింపజేసి శివునియందును విష్ణువునందును భేదమును నిరూపింతురో వారు ఇరువది
యొక్క తరములవారితోడ నరకమును పొందుదురు. కనుక, పనిచేతను మనసుచేతను
మాటచేతను ద్వేషమును విడువవలసినది. పుణ్యమును అపేక్షించువాడు శివుని విష
యమునందుగాని విష్ణుని విషయమునందుగాని వేదమునకు వెలియైన క్రియలను మాన
వలసినది. అని ఈవిధముగా వానికి ఆపిశాచత్వమువలని విడుదలమార్గము చెప్పి, ఏవి
చారమునులేక మాఘమాసమునందు ప్రయాగమునకు పొమ్ము. అక్కడ నీకు పిశాచత్వము
వలన నుండి విడుదలయగును. నిశ్చయము. ఇందులకు సందేహములేదు. ఎన్నడునుచెడని
దయిన వేదము అచ్చట స్నానముజేసినవారు స్వర్గమును పొందుచున్నారు అని చెప్పు
చున్నది. అచ్చట మునుపు చేసిన పనులవలని పాపములను మనుష్యుడు పోగొట్టుకొనుచు
న్నాడు, ప్రయాగస్నానమువలన గలిగెడి దానికంటె అధిక ఫలము మఱియెక్కడను

రూపం దానరూపం క్రియాత్మకమ్. యాగయోగాధికంవిద్ధి ప్రయాగం పాపినామపి, స్వర్గాపవర్గయోర్ద్వారం తత్పృథివ్యాముపావృతమ్. సితాసితోదవేణీయాతాం హిత్వాభువినాపరా, పాపనైగళ్యబన్ధస్య భేదనైకకుఠారికా. క్వవిష్ణుసూర్యతేజోగ్నిర్గంగాసంగమనేపిచ, క్వవరాశీతలాతుచ్ఛపాపరాశిత్రుణాహుతిః మలీమసఘనధ్వంసోయథాశరదిచంద్రమాః, భాంతిపాపక్షయాత్తద్వన్నరావేణీజలాప్లుతాః సితాసితస్య మాహాత్మ్యమహంవక్తుంనతుక్షమః, యత్తోయకణసంస్పృష్టో విముక్తః కేరళోద్విజః. ఇతివాక్యమ్ముపేశ్రుత్వా పిశాచస్తుష్టమానసః, ముక్తదుఃఖిచ సంప్రీతః పప్రచ్ఛప్రణయాన్మునిమ్ కథం కేరళదేశీయో ద్విజోముక్తో మహామునే, ఏతదాఖ్యాహి వృత్తాన్తం సంశ్రిత్యకరుణాంమమ.

ఇతి శ్రీపాద్మే పురాణే - మాఘమాహాత్మ్యే - దేవద్యుతిపిశాచ సంవాదంనామ త్రిచత్వారింశోఽధ్యాయః.

---

దేనివలనను కలుగదు. పాపాత్ములకైనను ప్రయాగము ప్రాయశ్చిత్తమును తపస్సును దానమును స్వరూపములుగా గలదియు సత్క్రియలుగలిగినదియు యాగములకంటెను యమనియమము మొదలగు యోగములకంటె అధికమైనదియు అని తెలిసికొనుము. స్వర్గమునకును మోక్షమునకు మార్గమైనదియు భూమియందు యథేచ్ఛమైనదియు నయిన త్రివేణిసంగమమును మించిన పుణ్యతీర్థము భూలోకమునందు లేదు. అది పాపములనెడి సంకెళ్లచేత చిక్కుబడ్డవానికి దానిని త్రెంచెడి గొడ్డలి అగుచున్నది. ఎక్కడవిష్ణుతేజస్సును సూర్యతేజస్సును అగ్నితేజస్సు నయినగంగయొక్క కూడికకలదో, ఎక్కడశ్రేష్ఠమైన చల్లనిదై నీచమైనపాపసమూహము అనెడి యెండుగడ్డి హోమద్రవ్యముగాగలదై మురికియనెడి మేఘములు పాడైపోగా శరత్కాలమునందలి చంద్రునివలె స్వచ్ఛమైనదై గంగయొప్పునో ఆ త్రివేణీసంగమమునందలి నీళ్లలో స్నానముచేసినజనులు ఆప్రకారమే పాపములు నశించుటవలన ప్రకాశింతురు. గనుక, ఏ జలబిందువులను అంటినకేరళబ్రాహ్మణుడు మోక్షమును పొందెనో ఆ తెల్లనినల్లని నీళ్లుగలప్రయాగముయొక్క మహిమను చెప్పుటకు నేను చాలినవాడనుకాను అనిచెప్పిన దేవద్యుతిమాటనువిని పిశాచము సంతోషించినమనసుగలదియు దుఃఖమును విడచినదియునయి వినయముతో దేవద్యుతిని జూచి, ఓమహాముసీశ్వరా! కేరళదేశస్థుడైన బ్రాహ్మణుడు ఎట్లు ముక్తుడు అయ్యెను. ఈ వృత్తాంతమును దయచేసి నాకు చెప్పుమని యడిగెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు దేవద్యుతిపిశాచముల సంవాదమును దెలుపునట్టిదైన నలుబదిమూడవ అధ్యాయకథ.

## చతుశ్చత్వారింశోఽధ్యాయః.

దేవద్యుతిః — పిశాచశృణు పుణ్యాం మే కథాం కథయతశ్శుభామ్, కేరళో వసునామాచ బ్రాహ్మణో వేదపారగః. దాయాదాహృతభూమిస్తు నిర్ధనో బంధువర్జితః, జన్మభూమిం పరిత్యజ్య మహాదుఃఖేన నిర్గతః. దేశాద్దేశం పరిభ్రమ్య కాలేన మహతా పునః, ప్రవిశ్య సుమహారణ్యమాప ద్వ్యాధిప్రపీడితః. గచ్ఛంస్తీర్థాంతరశ్రాంతః క్షుత్క్షామో వింధ్యపర్వతే, దుర్భిక్షేతు మృతో లేభే న దాహం నోర్ధ్వదైహికం. స్వేన కర్మవిపాకేన తత్రైవ గిరిగహ్వరే, ప్రేతభూతశ్చిరంకాల మువాస విజనే వనే. శీతవాతాతపక్లిష్టో నిరాహారో నిరూదకః, దిగంబరోఽనుపానత్కో హాహేతి విలపన్ సదా. ఇతస్తతః పరిభ్రమ్య వాయుభూత స్స కేరళః, ద్విజేవశ్శరణం లేభే నసుఖం కుత్రచిత్తదా. శుశోచ తస్మిన్ దుఃఖార్తో నైవ పశ్యతి సద్గతిమ్, సర్వదాదత్తదానస్సన్ భుంక్తే స్వం కర్మణః ఫలమ్. హావిర్జుహ్వతి నాగ్నౌ యే గోవిందం నార్చయంతి యే, భజంతే నాత్మవిద్యాం యే సుతీర్థవిముఖాశ్చ యే. సువర్ణవస్త్రతాంబూలం రత్నమన్నం

---

### నలువదినాలవ అధ్యాయము.

దేవద్యుతిమాటలు. — ఓ పిశాచమా! నాకు తెలిసిన మేలైన కథను చెప్పెదను వినుము. వేదములను తుదముట్టచదివిన వసువు అనెడి కేరళబ్రాహ్మణుడు దాయాదులు తన భూమిని అపహరింపగా పేదయై చుట్టములను పుట్టినదేశమునువిడిచి అతిదుఃఖముతో బయలుదేరి చిరకాలము దేశదేశమును తిరిగి గొప్పఅడవిచొచ్చి కొంచెము వ్యాధి బాధచేత బడలిక నొందినవాడై ఒకానొక పుణ్యతీర్థమును గూర్చిపోవుచు కరవుకాలమునందు ఆకలిగొని డస్సి వింధ్యపర్వతమునందు చనిపోయెను. దహనముగాని చరమక్రియగాని వానికి చేయువారు లేరైరి. అచ్చటనే వాడు చలిగాలి యెండలచేతబాధపడుచు అన్నము నీళ్లులేక దిగంబరుడును చెప్పులులేనివాడును నై ఎల్లప్పుడును అయ్యో యని మొరపెట్టుచు తనచేసినకర్మఫలముచేత ప్రేతమై గాలివలె ఇందునందుతిరుగుచు ఆయడవియందు ఒకకొండగుహలో వాసముచేయుచుండెను. అట్టి యాకేరళబ్రాహ్మణుడు దిక్కుగానక ఒకానొకసమయమునందు దుఃఖముచేత సంకటపడుచు ఎన్నడు దానమియ్యనివాడైనందున సద్గతిని పొందనేరక తనకర్మఫలము ననుభవించుచున్నవాడై యిట్లు చింతించెను. ఎవరుఅగ్నియందు దేవతలనుగూర్చి హోమముచేయరో ఎవరు విష్ణుదేవుని పూజింపరో ఎవరు ఆత్మవిద్యను అభ్యసింపరో ఎవరు పుణ్యతీర్థములకు పెడమొగమైనవారో ఎవరుపేదవారికి ధనము వస్త్రము తాంబూలము రత్నములు అన్నము నీరు

ఫలం జలమ్, ఆర్తేభ్యో న ప్రయచ్ఛంతి తే సర్వత్రైవ దుఃఖినః. బ్రహ్మ స్వంచ పరస్వంచ స్త్రీధనాని హరంతియే, బలేన ఛద్మనా వాపి; ధూర్తాశ్చ పరవంచకాః. డాంబికాః కుహకాశ్చోరాః యేచాన్యే బకవృత్తయః, బాలవృద్ధాతురస్త్రీషు నిర్దయాస్సత్యవర్జితాః. బాలవృద్ధాతురాణాంచ యోహరేతేహ కాంచనమ్, అగ్నిదా గరదా యేచ యేచాన్యే కూట సాక్షిణః అగమ్యాగమనా యేచ యేచాన్యే గ్రామయాజకాః, పితృ మాతృస్నుషాపత్య స్వదారత్యాగినశ్చయే. యేకదర్యాశ్చ లుబ్ధాశ్చ నాస్తికా ధర్మదూషకాః, త్యజంతిస్వామినం యుద్ధే త్యజంతి శరణాగతమ్. గావాంభూమేశ్చహర్తారో యేచాన్యే రత్నదూషకాః, మహాక్షేత్రేషు సర్వేషు ప్రతిగ్రహరతాశ్చయే. పరద్రోహపరా యేచ యేచాన్యే ప్రాణి హింసకాః, పరాపవాదినః పాపాః దేవతాగురునిందకాః కుప్రతిగ్రహిణస్సర్వే సంభవంతి పునఃపునః, ప్రేతరాక్షసపైశాచ తిర్యక్చరకుయోనిషు. న తేషాంసుఖలేశోఽస్తి ఇహలోకే పరత్రచ, తస్మాత్త్యక్త్వా నిషిద్ధా

---

ఇండ్లుఇయ్యరో వారు అందరును యెల్లయెడలను దుఃఖులే అగుదురు. ఎవరు బ్రాహ్మణుల సొత్తును ఇతరులసొత్తును ఆడువారిసొత్తునుఅపహరింతురో ఎవరుబలముచేతగాని మోసము చేతగాని ఒకరిని మోసపుత్తురో వారును, జూదరులును మోసగాండ్రును జంబముగలవారును దొంగలును, ఇంకను ఇట్టినడతగలవారును, కొంగయొక్క వ్యాపారముగలవారును, (అనగాపొంచియుండి సమయమువచ్చినప్పుడు మోసముచేయువారును) మరియు పసిబిడ్డలు ముసలివారు రోగులు ఆడువారు వీరియందుదయలేనివారును, నిజముతప్పువారును పసిబిడ్డలయు ముసలివారలయు రోగులయు ధనమును అపహరించువారును,ఇండ్లుకాల్చుచు విషమును పెట్టుచు తప్పుసాక్ష్యమునుచెప్పుచు పొందరానివారిని పొందుచు ఉండువారును, గ్రామపురోహితులను తల్లిని తండ్రిని కోడలిని బిడ్డలను పెండ్లామును విడిచిపెట్టువారును, పిసినారులును అత్యాశగలవారును, దేవుడులేడనువారును, ధర్మమును చెరుచువారును, యుద్ధమునందుఏలినవానిని విడిచినవారును, శరణుచొచ్చినవారిని కాపాడనివారును, గోవులనుభూమినిరత్నములనుఅపహరించువారును, మహాక్షేత్రములయందు దానములుతీసికొనుటయందు ఆసక్తిగలవారును, ఒకరికిచెరుపుచేయుటయందు అక్కరగలవారును, ప్రాణులను హింసపెట్టువారును, ఒకరియందుఅపదూరుమోపునట్టిపాపులును, దేవతలను గురువులను నిందించువారును, కుత్సితపుదానములను తీసికొనువారునునైన యీచెప్పబడినవారందరును మాటిమాటికి ప్రేతములు రాక్షసులు పిశాచములు పశువులు పక్షులు మొదలగునట్టివైన కుత్సితజన్మము లెత్తుదురు. వారికి ఇహపరలోకములు రెంటి

ర్థం హితంకర్మ సమాచరేత్ యజ్ఞం దానం తపస్తీర్థం మంత్రం దేవం గురుం భజేత్, నాచరేత్కుత్సితంకర్మ మనసాపి సదానరః. విపాకం కర్మణాందృష్ట్వా యోనికోటిషుదుస్సహమ్, చాతుర్వర్ణ్యైర్నరైస్సేవ్యో ధర్మో నిత్యం సమాహితైః ధర్మస్య ఫలమిచ్ఛంతి ధర్మం నేచ్ఛంతి మానవాః, ఫలంపాపస్య నేచ్ఛంతి పాపం కుర్వంతి యత్తతః ఏతత్ప్రేతగతిం దృష్ట్వా పాపబీజాద్ధితంహిసః, కృత్వాధర్మోపదేశంచ పునస్తస్మై ద్విజోఽబ్రవీత్. ఇత్థంస కేరళప్రేతో వర్తమానో గిరౌతదా, చిరంప్రతివహాఽకాలమపశ్యత్పథికం పథి. వహంతం ద్వికరండంచ వేణీపానీయభాండధృత్, గాయంతం ప్రమదాదేవం పుణ్యశ్లోకం జనార్దనమ్ తం దృష్ట్వా సహసా ప్రేతో మార్గరోధంచ కారసః, దర్శయామాసచాత్మానం మాభైషీరిత్యువాచతమ్. పానీయందాతుమిచ్ఛామి త్వత్తః కార్పటికోత్తమ, నదాస్యసి జలంత్వంమే ప్రాణాయాస్యంత్యసంశయః ఇతి ప్రేతవచశ్శ్రుత్వా పాంథః ప్రత్యాహ కౌతుకాత్, కస్త్వందుఃఖాభిభూతోఽసి కృశో

---

యందును కొంచెమైన సుఖము కలుగదు. కనుక నిషిద్ధములయిన విషయములను విడిచి మేలైనకర్మములను చేయవలెను. యజ్ఞమును దానమును తపస్సును తీర్థయాత్రను మంత్ర జపమును దేవపూజను గురుపూజను ఆచరించవలెను. మనస్సుచేతనైన కుత్సితకర్మములను తలపరాదు. అనేకజన్మములయందలికర్మములపరిపాకమునుచూచి నాలుగువర్ణముల జనులును హెచ్చరికతో ఎల్లప్పుడు ధర్మమును నడపవలెను. జనులు ధర్మమువలని ఫలమునుగోరి ధర్మమునుచేయఁగోరరు. పాపఫలములనుకోరక పాపమునుచేయుచుందురు. ఇట్లు వాడు తనప్రేతగతినిచూడ ఇది పాపమూలమేకదా అనుకొనెనని పిశాచమునకు ధర్మోపదేశముచేసి మరల దేవద్యుతి ఇట్లు పలికెను. ఓయీ! ఇట్లు ఆకేరళప్రేతము ఆకొండయందు మెలగుచుండి బహుకాలమునకు పిమ్మట వేణీజలమును రెండుకుప్పెలలో నిండించి కావడి కట్టుకొని యేలినవాఁడును మంచి కీర్తిగలవాడును నయిన శ్రీమన్నారాయణుని పాడుచు త్రోవనుపోవుచున్నయొకబాటసారిని చూచెను. ఇట్లు చూచి తటాలున ఆప్రేతమువానికి అడ్డముపోయి తన్నుజూచిన బాటసారినిగూర్చి, ఓ మార్గస్థుడా! భయపడకుము. నాకుజలమునుఇయ్యగోరెదను,నీవునాకుజలముఇయ్యనియెడ నాప్రాణములుపోవును. అందులకు సందేహములేదు. అనిప్రేతముచెప్పిన మాటలనువిని బాటసారివేడుకతో ఇట్లుపలికెను. దుఃఖముచేత పీడింపబడినవాడవు చిక్కిపోయినవాడవురోగివి దిగములవాఁడవుప్రాణముచేతనే శేషించినవాఁడవు చావనిచ్ఛగలవాఁడవు వికారరూపము

గ్లానో దిగంబరః. జీవశేషో ముమూర్షుశ్చ వికృతేర్భయవర్ధనః, నవధూమమయాకార శ్చంచలశ్చలలోచనః. పద్భ్యా మస్పృష్టభూమిస్త్వం నిర్మాంసోదరబాహుకః, ఇతి తస్య వచశ్శ్రుత్వా ప్రేతో వాక్య మథాబ్రవీత్. శ్రుణుధర్మిష్ఠ తేవచ్మి యేనాహంకర్మణాభవమ్, బ్రాహ్మణోఽదత్తదానోఽహం లోభమోహవశంవదమ్. పరాన్నేన సదాపుష్టః ఏకాకీ మృష్టభోజనః, మయాదత్తా నభిక్షాపి హ్యహంకారేణ పుష్కలః, నకృతో వైశ్వదేవోఽపిప్రతిష్ఠోనబహిర్బలిః, భూతానాంహితృపార్థానాం నహృతాపయసాతృపా. కదాచిత్పితరోనైవ తర్పితాఅటతామహీమ్, నచశ్రాద్ధం వ్రతంవాపి పూజితానచ దేవతాః. వర్షాతపపరిత్రాణం నదత్తే ఛత్రపాదుకే, జలంవాజలపాత్రంవా నైవతాంబూలమౌషధమ్. నగృహే వసతిర్దత్తా నాతిథ్యంకస్యచిత్కృతమ్, అంధవృద్ధాధనానాథ దీనాపన్నానతోషితాః. గవాంగ్రాసోదకందత్తం నరోగాత్పరిమోచితం, నదత్తానహుతాతత్ర ద్విత్రా అపితిలామయా. పృథివ్యాంతిలదాతారో న భవంతి పునఃపునః, నప్రదత్తం వ్యతీపాతే కించిద్దత్తేఽక్షయం భవేత్. సంక్రాంత్యాముపరాగేషు నదత్తంచంద్రసూర్యయోః, పర్వాణ్యన్యాని స

చేత భయమును పెంచుచున్నవాఁడవు క్రొత్తపొగవికారమైన యాకృతిగలవాడవు చపలుఁడవు బెదరుచూపులుగలవాఁడవు, కాళ్లు నేల మోపక నిలుచువాఁడవు కండలేనికడుపు చేతులు గలవాఁడవు నైన నీవుయెవడవు అని యడుగగా, ప్రేతము, ఓపుణ్యాత్ముడా! వినుము. నేను బ్రాహ్మణుఁడను. దానమియ్యనివాడను. లోభము మోహము గలవాడును. ఎల్లప్పుడు పరులయింటి యన్నముచేత నే పొట్టపోసికొన్నవాడను. ఒంటిగా మధురపదార్థములతో భోజనముచేసినవాఁడను. నేను భిక్షముగూఁడ పెట్టియెరుగను. మిక్కిలి గర్వించినవాడను. వైశ్వదేవము భూతబలి దప్పిగొన్న ప్రాణులకు నీళ్లుపోయుట పితృతర్పణము భూసంచారము శ్రాద్ధము వ్రతము దేవపూజ అనువానిని నేను చేసినదేలేదు. వాన యెండ వీని వలన కాపాడునట్టి గొడుగు పావకోళ్లు నీళ్లు నీళ్లపాత్రము తాంబూలము మందు ఇవి యేవియుం నాచేత ఇయ్యబడవు. ఒకానొకయతిథికై యింటిలో నిలువచోటుగాని అన్నముగాని యిచ్చి యెరుగను. గ్రుడ్డివారు ముసలివారు బీదలు దిక్కులేనివారు ఆపద పొందినవారు నాచేత ఆదరింపబడినవారు కారు. పసులకు మేతనీరువిచారించి వ్యాధిపోగొట్టినవాడనుకాను. దానము హోమము చేయకపోయినను నువ్వులదానము చేయువారు భూమియందు పలుమారు పుట్టరు అనిరెండు నువ్వులగింజలైనను ఒకరిచేతిలో రాల్చియెరుగను. కొంచెమిచ్చినను చెడక వర్ధిల్లునట్టి వ్యతీపాతమునందుగాని సంక్రాంతియందుగాని గ్రహణకాలములయందుగాని దానములు చేసినవాడనుకాను. పుట్టుకలే

ర్వాణి జన్మశూన్యాని మేద్విజ తిథయః కార్త్తికీముఖ్యా వంధ్యాజాతా స్సదామమ, పితృభ్యోనప్రదత్తం స్యాదష్టకాసుమఖాసుచ. ద్విజానాం నకృతా ప్రీతిర్మన్వాదిషు యుగాదిషు, నదత్తస్తిలలేశశ్చ ప్రదీపః కార్త్తికేమయా. నస్నాతో మాఘమాసేఽహం రూపసౌభాగ్య కామదే, అగ్నిం ప్రజ్వాల్య కాష్ఠౌఘైః స్నాతానాం మాఘపుష్యయోః శీతార్త్తానాంచ విప్రాణాం నకృతో జాడ్యనిగ్రహః, మాధవాదిషు మాసేషు న దత్తం శీతలంజలమ్. మయానారోపితోఽశ్వత్థో న్యగ్రోధో నైవవర్ధితః, బందీకృతానాం మయాముక్తిః నకృతా ప్రాణినాం క్వచిత్ నప్రాణభయ సంత్రస్తో రక్షిత శ్శరణాగతః, నోపోష్యాత్రత్రిరాత్రాణి తోషితోమధుసూదనః. కృచ్ఛ్రాణి కృచ్ఛ్రపర్యాకం తథాచాంద్రాయణంద్విజ, అష్టాంగతప్తకృచ్ఛ్రంచ తథాసాంతపనానిచ, వ్రతాన్యేతాని పుణ్యాని జుష్టానీంద్రాదిభి స్సురైః, చరితాని మయాతాని నదేహాశ్శోషితోమయా. ఇత్థం పూర్వభవో వంధ్యో మమజాతో ద్విజోత్తమ, పశ్యద్విజ మహాక్రూరం భూతానామత్రజన్మని గతిర్ద్విజవర త్వం హి మమపూర్వస్య కర్మణః, సంతి మార్గాణిమాంసాని వృకవ్యాఘ్రహతానిచ. సుపుష్పాణిసుగంధీని

---

కుండ చేయునట్టి యితరములైన పర్వదినములు కార్త్తికియందలి ముఖ్యతిథులు ఇవన్నియు వ్యర్థముగాగడపితిని. అష్టకలయందుగాని మఖ మొదలగు నక్షత్రములయందుగాని మన్వాదులయందుగాని యుగాదులయందుగాని ఒక నువ్వుగింజయైన పితృప్రీతిగా నాచేత ఇయ్యబడదు. కార్త్తికదీపము పెట్టలేదు. చక్కదనమును ఐశ్వర్యమును ఇచ్చునదియైనమాఘస్నానము చేసినవాడను కాను. మాఘపుష్యమాసములయందు స్నానముచేసి చలిగొని వడకుచున్న బ్రాహ్మణులకు చిదుగులు తెచ్చి మంటవేసి చలి పోగొట్టినవాడను కాను. వైశాఖము మొదలగు మాసములయందు చల్లని నీళ్లు ఇయ్యలేదు. రావిచెట్టు మఱ్ఱిచెట్టు నాటి పెంచి యెరుగను. నిర్బంధములలో చిక్కుకొన్న ప్రాణులను విడిపింపలేదు. ప్రాణభయముచేత మరుగుచొచ్చినవారిని కాపాడలేదు. త్రిరాత్రోపవాసము మొదలగు వానిచేత శ్రీవిష్ణుదేవుని మెప్పింపలేదు. కృచ్ఛ్రములు కృచ్ఛ్రపర్యాకము చాంద్రాయణము అష్టాంగతప్తకృచ్ఛ్రము సాంతపనము మొదలుగాగల పుణ్యవ్రతములను ఇంద్రుడు మొదలగు దేవతలకు ప్రియమైన యజ్ఞములను దేహమును ఎండగట్టి చేసినవాడను కాను. ఈవిధముగా మునుపటిపుట్టుక వ్యర్థమైనది. ఓబ్రాహ్మణోత్తమా! పూర్వజన్మకర్మముల చేత ఈజన్మమునెత్తిన ప్రాణులకెల్లను క్రూరుడనైన నన్ను చూడుము. నాకు నీవేగతి. తోడేలు పెద్దపులులు వీనిచేత చంపబడిన మృగములమాంసములును, మంచివాసనగల పువ్వులును, రుచికరములైన పండ్లును, తినదగినవేళ్లును, తియ్యని తేనెలును, ఇతరవ్యు

ఫలానిరసవంతిచ, మూలానిచ సుభక్ష్యాణి మధూని మధురాణిచ. పన్నా స్యన్నాని శైలేఽస్మిన్ తిష్ఠంతి సుబహూనిచ, త్రిస్రోతసాం నిర్ఝరాంశ్చ సంతి వారిణిసర్వతః. సులభ్యేషుపదార్థేషుపర్వేష్వే తేషుపర్వతే, నతుధా శమపంకించి ద్దేవేనవిహితంసదా. పదేపదే నిధానాని యోజనే యోజనే బలమ్, అప్రసన్నే సరోజాక్షే కుతో మే క్షున్నివారణమ్ వాతాహారే ణజీవామి యథాజీవంతిపన్నగాః, అహంజీవామిహాత్ర స్త ప్రేతయోనిప్ర భావతః. శీలేనప్రజ్ఞయానిత్యం మంత్రపౌరుషవిక్రమైః, సహాయైః ప్రాణ మిత్రైశ్చవలభ్యంలభతేనరః.లాభాలాభేసుఖేదుఃఖేవివాహేమృత్యుజీవ నే, భోగేవియోగేరోగేచ దైవమేవాత్ర కారణమ్. కురూపాః కుకలా మూర్ఖాః కుత్సితాచారనిందితాః, శౌర్యవిక్రమహీనాశ్చ దైవాద్రా జ్యాని భేజిరే కాణాఃకుబ్జాశ్చబధిరానీతిహీనశ్చ నిర్గుణాః, నపుంసకాశ్చ దృశ్యన్తే దైవాద్రాజ్యేప్రతిష్ఠితాః. యైర్దత్తాశ్చ తిలాగావో హిరణ్యం పశవఃస్త్రియః,భక్ష్యభోజ్యానివాసాంసి చందనాన్యగరూణిచ. అటవ్యాం

---

లైన ఆకులును, ఆకొండయందు సమృద్ధముగానున్నవి. గంగానదినిబోలిన సెలయేళ్లయందు నీళ్లును ఎక్కడజూచినను ఉన్నవి. దైవబలము ఎట్టిదో కాని కొండయందు సులభముగాదొరకునట్టి యీపదార్థములయందు దేనివలనను ఎప్పుడును నా యాకలి తీరదు. అడుగడుగునను నిధులును వాని కూడికలయుండెన్ బలమును గలిగియున్నను శ్రీ విష్ణుదేవుని అనుగ్రహము లేనియెడ నా యాకలి యెట్లు తీరును. ప్రేతజన్మము యొక్క ప్రభావమువలన పాములుఎట్లో అట్లు గాలి యాహారముచేత నేను బ్రదుకుచున్నాను. మనుష్యుడు మంచినడవడిచేతను బుద్ధిచేతను మంత్రముచేతను మగతనముచేతను పరాక్రమముచేతను తోడుపాటుచేతను మిక్కిలి కావలసినవారగు స్నేహితులచేతను పొందనలవికానిదానినైనను పొందగలడు. కలుగుట లేకపోపుట సుఖదుఃఖము పెండ్లి చావుబ్రతుకు భోగము భోగమువలనియెడబాటు రోగము వీనియందు అదృష్టము కారణముగా ఏర్పడుచున్నది. చక్కదనము చదువులేనివారును మూర్ఖులును చెడ్డనడవడిచేత నిందింపబడినవారు శూరత్వము పరాక్రమములేనివారును అదృష్టమువలన దొరతనమును పొందుచున్నారు. గ్రుడ్డివారు గూనివారు చెవిటివారు నీతిలేనివారు మంచిగుణము లేనివారు నపుంసకులు నగు జనులు అదృష్టమువలన రాజ్యమునందు శాశ్వతులై కానబడుచున్నారు. ఎవరు నువ్వులు గోవులు బంగారు ఏనుగు మొదలగు మృగములు స్త్రీలు బిసుబండములు భోజనవస్తువులు కోకలు గంధము అగరుగంధము ఇట్టివానిని దానము

పర్వతాగ్రే వా గ్రామేవా నగరేపి వా, పునఃపునశ్చ తిష్ఠంతి తేషాం భోగా
అయత్నతః సంత్యత్ర పర్వతే న్యేఽపి రాక్షసా బలవత్తరాః, రాక్షస్యశ్చ
పిశాచ్యశ్చ పిశాచాశ్చ సుదారుణాః, కదాచిచ్చ కథంచిచ్చ క్వాపి క్వాపి స్వ
కర్మణా, లభంతే నైవ మాంసాని పర్వతేఽథ గిరౌ వనే. ఇతి శ్రుత్వాత్ర
తేభ్యో వా మా భయం భవితా తవ, శుచిం గోవిందభక్తం త్వాం న తే ద్రష్టు
మపి క్షమాః. విష్ణుభక్తి పవిత్రాంశ్చ నారాయణపరాయణాన్, న స్పృ
శంతి న పశ్యంతి రాక్షసాః ప్రేతపూతనాః. భూతభేతాళ గంధర్వా
డాకిన్యః కన్యకాగ్రహాః, అన్యేగ్రహాశ్చ యవనముఖమండిలికాగ్రహాః.
యక్షరక్షో గ్రహాః క్రూరాః దుష్టగ్రహా వినాపి యే, తథా మాతృగ్రహా
భీమగ్రహాశ్చాన్యే వినాయకాః. క్రూరసర్పాశ్చ కూశ్మాండా యే చా
న్యే దుష్టజంతవః, న పశ్యంతి పరం విప్రం వైష్ణవం బ్రాహ్మణం మునిమ్ శు
చిం రక్షంతి భూతాని ధర్మిష్ఠం పీడయంతి న, రక్షంతి చ శుచిం నిత్యం గ్రహా
నక్షత్ర దేవతాః. గోవిందనామ జిహ్వాగ్రే హృత్పద్మే చేశ్వరస్థితిః, శుచిశ్చ

---

చేయుందురో వారికి అడవియందున్నను కొండకొమ్మునందున్నను ఊరియందున్నను పట్ట
ణమునందున్నను ప్రయత్నము చేయకయే భోగములు పలుమారు లభించుచుండును. ఈప
ర్వతమునందు నాకంటె నితరులయిన మిక్కిలి బలముగల రాక్షసులు రాక్షసస్త్రీలు
భయంకరములైన పిశాచములు పిశాచస్త్రీలు అక్కడక్కడ అనేకులు ఉన్నారు. వారి
కెల్లను తమతమ వ్యాపారముల చేత కొలదులకు తగినట్లు ఎట్లో ఎప్పుడో కొండయందు
గాని అడవియందుగాని మాంసము చిక్కుచునే యున్నది. ఇట్లు నేను చెప్పుటను విని నీకు
భయమక్కరలేదు. ఈ చెప్పబడిన రాక్షసాదులు పరిశుద్ధుడవును విష్ణుభక్తుడవును నైన
నిన్ను కన్నెత్తి చూచుటకుకూడ సమర్థులు కారు. విష్ణుభక్తిచేత రక్షింపబడువాడును శ్రీ
విష్ణువునందు ఆసక్తుడును నైనవానిని రాక్షసులు ప్రేతములు పూతనాది స్త్రీభూతములు
బేతాళము మొదలగు పురుషభూతములు గంధర్వులు డాకినులు కన్యకలు మొదలగు గ్రహ
ములు ఇతరములయినదయ్యములు యవనములు మండిలిక మొదలగు గ్రహవిశేషములు
యక్షగ్రహములు రాక్షసగ్రహములు క్రూరములయిన యితరదుష్టగ్రహములు మాతృగ్ర
హములు భీమగ్రహములు వినాయకగ్రహములు కూశ్మాండగ్రహములు క్రూరములయిన
పాములు మొదలగు దుష్టజంతువులు ఇవి అన్నియుం శ్రేష్ఠుడును విష్ణుభక్తుడును బ్రహ్మ
నిష్ఠగలవాడును మౌనముగలవాడును నైన విప్రుని కన్నెత్తి చూడవు భూతములు పరిశుద్ధుని
రక్షించును. ధర్మాత్ముని పీడింపవు. గ్రహములు నక్షత్రములు దేవతలును ఎల్లప్పుడు
పరిశుద్ధుని రక్షింతురు. నాలుకకొనయందు గోవింద నామమును మనసునందు శ్రీవిష్ణుదేవు

జ్ఞానశీలశ్చ తే సర్వత్రాభయఃఖలు, ఏవం భ్రామ్యణభుంజానః స్వకృతం కర్మణఃఫలమ్. నశోచామీహ తత్పాపం విమృశ్యచ పునఃపునః, తావద్యావజ్జలాపూర్ణే నైవకల్లోలినీతటే. సారసోదీరితం వాక్యం శ్రుత్వా కార్పటికోత్తమ,అనిత్యబంధ స్సర్వత్ర వర్తతే సతతం నృణామ్. ద్రుహరానామ చైతస్మిన్ నదీ గిరిసముద్భవా, సదాశీతజలా తావ న్మత్తదంతిసమాకులా. మహోత్కుతూహలావాసా స్నిగ్ధజంబూమనోహరా, తస్యాస్తీర మనుప్రాప్తో గాహమానో వనాద్వనమ్. మయితిష్ఠతి తత్రైవ శ్రమాపనయకామ్యయా, వనాంతరాత్సముత్తీర్య సారసోలక్షణాన్వితః ఆగతః పులినం నద్యాస్సేవితం బహుపక్షిభిః, పీత్వా తత్రైవపానీయం రమిత్వా భార్యయాసహ. సుప్త్వాపక్షపుటేవామే ప్రవేశ్య స్వశిరస్సుఖమ్, ఏతస్మిన్నంతరే దృష్టం పాదపాదవతీర్యచ. రక్తాననస్తు రక్తాక్షో దృఢదీర్ఘనఖోబలీ, రోమశోదీర్ఘవాలశ్చచంచలోష్ఠశ్చ వానరః. యత్రాసౌ సారసస్సుప్త స్తత్ర వేగేనచాగతః, సమాగమ్యచ జగ్రాహ సారసంచరణేదృఢమ్. కరాభ్యాం క్రూరాయాబుద్ధ్యా పశ్యతాం

---

డను ఉండగా పరిశుద్ధుడవును తెలివిగలవాడవును మంచిస్వభావము గలవాడవునైన నీకు ఎక్కడను భయములేదు.ఇట్లు నేనుచేసికొన్న కర్మమువలని ఫలమును అనుభవించుచు సారసపక్షి చెప్పిన మాటను విని ఆపాపమును తలచి మాటిమాటికి దుఃఖింపక ఇక్కడనున్నాను. మనుష్యులకు అంతటను బంధముగానుండును. అదియెట్లు అనగా, ఈకొండయందుబుట్టిన ద్రుహరయనెడి నదియొకటికలదు. అదియెల్లప్పుడు చల్లని నీళ్లుగలిగి మదపుటేనుగులచేత కలపబడినది కు· మిక్కుటమై వేడుకకు ఉనికిపట్టయినదియు దట్టమయిన నేరేడుచెట్లచేత మనోహరమయినదియునై యుండును. అడవులవెంబడి మెలగుచు ఆయేటిగట్టునకుపోయి అందుమునిగి శ్రమతీర్చుకొనగోరి కూర్చుండియుండగా, ఒకయడవినుండి పెంటితోగూడిన సారసపక్షి అనేకపక్షులు తన్ను గొలువగా వచ్చి ఆయేటిలోని యిసుకదిన్నెపైవాలి అందలినీళ్లుత్రాగి భార్యతోగూడ విహరించి మనోజ్ఞమయిన రెక్కలనడుమతలచొప్పించుకొని సుఖముగా నిద్రపోయెను.ఇంతలో ఎఱ్ఱని ముఖమును కన్నులును దృఢములైన నిడుపులైన గోళ్లుగలదియు బలము గలదియు నిడుపాటి మేనివెంట్రుకలును మిక్కిలినిడుపైనతోకయు కదలుచున్న పెదవులును గలదియునైన యొకకోతి చెట్టునుండిదిగివచ్చి నిద్రపోవుచున్న సారసపక్షియున్నచోటికి పోయి క్రూరబుద్ధిగలదై రెండుచేతులతోను ఆపక్షియొక్క కాలుగట్టిగా పట్టుకొనెను. అది చూచి

బహూపక్షిణామ్, ఉద్ధత్య తేన తేసర్వేగతా అన్యత్ర ఖేచరాః సారసీ బత ఖిన్నాచ విరావంకుర్వతీస్థితా, సారసోభగ్ననిద్రస్సన్ తాశ్చచంచలలోచనాః. అవలోకితవాన్ శీఘ్రం తతో నమ్రశిరోధరః, విలోక్య వానరం పృష్ఠే హంతుకామం సముద్యతమ్. తదాసంభాషయామాస గిరా మధురయాఖగః. అపరాధం వినామాం హి త్వంశాఖామృగబాధసే. సాపరాధజనా లోకే బాధ్యతే భూమిపైరపి, నపీడయితు మర్హ స్త్వం తాదృశానుత్తమాన్ జనాన్. అస్మానహింసకాన్ సాధూన్ పరవృత్తి పరాఙ్ముఖాన్, జలశైవలభక్షాంశ్చ ఖేచరాన్వనవాసినః. స్వదారరతశీలాంశ్చ పరదారవివర్జితాన్, పరాపవాదశూన్యాంశ్చ తథా స్తేనానయాచకాన్. ఉదవృత్తసంగహీనాంశ్చ ద్విజావరణసేవకాన్, శాఖామృగ నబాధేథా స్సర్వదాపఘునంమమ. జానామి తవజన్మాహం నత్వంవేదచ మామిహ, ఇత్యాకర్ణ్య వచస్తస్య ఉవాచ సచ సారసమ్. చపలో వానరశ్శీఘ్రం ప్రష్టుం సముపచక్రమే.

ఇతి శ్రీపాద్మే పురాణే మాఘమాహాత్మ్యే కార్పటికరాక్షస
సంవాదోనామ చతుశ్చత్వారింశోఽధ్యాయః.

---

అక్కడనున్న తక్కినపక్షులన్ని యెగిరిపోయి మరియొక్కచోట వాలెను. ఆడుసారసపక్షిమాత్రము దుఃఖమునొందినదై కూయుచు అచ్చటనే యుండెను. సారసపక్షియు నిద్రచెడి లేచి తనభార్యలును తానును మెడవంచి తన్నుచంపదలచిన యాకోతినిజూచి మంచిమాటలతో ఇట్లు పలికెను. ఓవానరమా! నేరములేనినన్ను నిమిత్తములేకయే బాధించుచున్నావు. రాజులుగూడ లోకమునందు తప్పులేనివానిని దండింపరు. అట్టియుత్తములైన జనులను బాధించుటకు నీవు తగినవాడవు కావు. ఒకరిని హింసచేయనివారును సాధువులును ఇతరవ్యాపారములందుదృష్టిపెట్టనివారును నీటిపాచినితినువారును ఆకాశమునందు తిరుగువారును అడవియందుండువారును స్వభార్యతో క్రీడించునట్టి నియమముగలవారును ఇతరభార్యలను విడిచినవారును ఒకరిని దూషింపనివారును దొంగలింపనివారును యాచింపనివారును మీదు చూచుచు తిరుగువారితో కూడనివారును పక్షులగుంపులచేత కొలువబడువారును నైన మమ్మును మా దేహమును నీవేల బాధించెదవు. నీపుట్టు పూర్వోత్తరము నేను ఎరుగుదును. ఈసమూహమును నీవు ఎరుగవు ఇట్లు అడిగిన ఆసారసపక్షిమాటలను విని చపలస్వభావముగల కోతి శీఘ్రముగా ఆవృత్తాంతమును అడుగ నారంభించెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు తీర్థవాసియైన కాటసారికిని
పిశాచమునకు నైన సంవాదమును తెలుపునట్టిదైన నలువదినాలవ అధ్యాయకథ.

---

## పంచచత్వారింశోఽధ్యాయః.

వానరః.—బ్రూహి నామకథం వేత్సి మమజన్మ పురాతనమ్, త్వంపక్షీజ్ఞానహీనశ్చ తిర్యక్త్వాహం వనేచరః. సారసః - జానేఽహం తావకంజన్మ జాతిస్మృతిమతేస్థితః, త్వంహి విద్యాధిపోనామ ప్రాగ్భవే పర్వతేశ్వరః. అహం పూజ్యతమో విప్ర స్తవవంశపురోహితః, తేన ప్రత్యభిజానామి త్వాం సత్యంవానరోత్తమ. ఇమాంపాలయితాభూమిం ప్రజాస్సర్వత్ర పీడితాః, త్వయా వివేకహీనేన భృశంసంచయతాధనమ్. ప్రజాపీడనతాపోత్థవహ్నిజ్వాలైశ్చ వానర, ప్రాప్తమంధశ్చనరకే కుంభీపాకేపి దారుణే. పునఃపునశ్చదగ్ధేన జాతేనచపునఃపునః, నారకేణశరీరేణసమాశ్చప్రయుతంత్వయా. కుర్వతాదారుణాన్ శబ్దాన్ రుదతాచ పునఃపునః, కుంభీపాకానలేతీవ్రేస్వానుభూయశ్చదారుణః. నిస్తీర్ణనరకోభూపపాపశేషేణ సాంప్రతమ్, ప్రాప్తోసి వానరంజన్మ యేనమాం హంతుమిచ్ఛసి. విప్రస్య భవనాత్పూర్వం పక్వరంభాఫలానిచ, అననుజ్ఞాప్య భుక్తాని చాపహృత్య

## నలువది అయిదవ అధ్యాయము.

---

వానరముమాటలు.—ఓసారసమా! నీవు పక్షివి జ్ఞానములేనిదానవు. నేను తిర్యగ్జంతువునైన కోతిని. నాపుట్టుపూర్వోత్తరము నీవెట్లు ఎరుగుదువు చెప్పుము.

సారసపక్షిమాటలు.—పూర్వజన్మజ్ఞానము గలిగి యుండుటచేత నీపూర్వజన్మవృత్తాంతమును నేనెరుగుదును. ఓవానరశ్రేష్ఠుడా! నీవు మునుపటిజన్మమునందు పర్వతదేశమునకు రాజయిన విద్యాధిపుడవు. నేను నీకు పురోహితుడైన ఉత్తమబ్రాహ్మణుడను. ఆకారణముచేత నిన్ను నేను చక్కగా నెరుగుదును. తెలివిమాలి విశేషించి ధనముకూడబెట్టవలెననుతలపుగలవాడవై ఈభూమిని ఏలుచున్న నీచే ప్రజలు బాధింపబడిరి. నీవును ప్రజలను పీడించుటవలని తాపముచేత బుట్టిన నిప్పుమంటలను అంధకూపము కుంభీపాకము మొదలగుభయంకరములైన నరకములందు పలుమారు తపింపజేయబడుచు పది లక్షల సంవత్సరములు కడపితివి. మాటిమాటికి భయంకరధ్వనితో మొరపెట్టుకొనుచు తీక్ష్ణమైన కుంభీపాకాగ్నియందలి తాపము ననుభవించి నరకమునుండి విడువబడినవాఁడవై అందుల పాపశేషమును అనుభవించుటకై యిప్పుడు ఈకోతిపుట్టుక పుట్టి నన్ను చంపగోరుచున్నావు. మునుపటి జన్మమునందు ఒక బ్రాహ్మణునియింట చక్కగా పండియున్న అరటిపండ్లను ఆబ్రాహ్మణుని యుత్తరువులేక బలాత్కారముగా తెప్పించి తింటివి. దొంగతనపుపనివలన ఈకోతిజన్మమును అడవియందలియునికియు కలిగి ఇప్పుడు

త్వయాబలాత్, విపాకః కర్మణః ప్రాప్త స్తవ స్తేయస్య దారుణమ్. వాన
రత్వంవనే వాసో అధునా తేనవర్తసే, అశుభస్యశుభస్యాపి పురావిహితక
ర్మణః. భోగః క్రీడతి భూతేషు యోఽలంఘ్య స్త్రిదశైరపి, ఇత్థంచజన్మజా
నామి యథావచ్చ సహేతుకమ్. ప్రాప్తసారసదేహోఽపి జ్ఞానేన పరి
మోచనః, ఇతిశ్రుతకథోవిప్ర వానరో హ్యాహ సారసమ్. సమ్యక్త్వం
వేత్సి మజ్జన్మ త్వం కథంపక్షితాంగతః. సారసః. పక్షియోనిగతో యేన
తత్సర్వం శ్రోతుమర్హసి, ధాన్యరాశిశతంసాగ్ర ముత్కృష్టంచ త్వయా
పురా. బహుభ్యో బ్రాహ్మణేభ్యశ్చ నర్మదాయాం రవిగ్రహే, పౌరోహి
త్యమదాల్లోభా ద్వంచయిత్వా ద్విజాంశ్చతాన్. కించిద్దత్వాద్విజేభ్యశ్చ
గృహీత మఖిలం మయా, విప్రసాధారణద్రవ్యగ్రహణోత్పన్న పాతకా
త్. పతితః కాలసూత్రేచ నరకేరక్తకర్దమే, చలత్క్రిమిసుసంపూర్ణే దు
ర్గంధే పూయఫేనిలే, అనాథ స్తత్ర మగ్నస్మిన్ మగ్నదేహో నిరంత
రమ్, తస్మిన్ శోణితపంకేహం నిరుచ్ఛ్వాసోఽభవం తదా. ముహూర్తోపి
మహాకల్పశతంజాతో మమాత్రహి, యాతనాశ్చానుభూయేత్థం సమా

---

ఇచ్చట తిరుగుచున్నావు. మంచిదిగాని చెడ్డదిగాని మునుపుచేసిన పనులవలనిఫలము
దేవతలకైనను అనుభవింపక తీరదు. ఇట్లు నీపుట్టుకను అంకులకుగల కారణముతోడనే
నెరుగుదును. ఇట్టిసారసదేహము నాచేతపొందబడినను జ్ఞానముచేత విడుచుట అగును.
అని ఇట్లు చెప్పగా తనకథయంతయు విని ఆకోతి సారసపక్షినిమాచి నాపుట్టుకను
చక్కగా ఎరుగుదువే నీవెట్లు సారసపక్షివైతివని అడిగెను. నేనుపక్షినైపుట్టుటకు కార
ణమును నీవు వినదగుదువు జెప్పెదను వినుము. ఓవానరమా! పూర్వజన్మమునందు
నర్మదానదిగట్టున సూర్యగ్రహణసమయమునందు అనేక ధాన్యపురాసులు ఎదురుగాపో
యించి బ్రాహ్మణులకు ఇమ్మనగా నేను రాజపురోహితత్వమువలని మదముచేత ఆబ్రాహ్మ
ణులను వంచించి వారికి ఇచ్చినదానిలో కొంచెము కొంచెము తీసికొమ్మని తక్కిన
దంతయు అపహరించితిని. బ్రాహ్మణులకందరకు బాధ్యతగల ఆద్రవ్యమును అపహరిం
చిన పాపమువలన కాలసూత్రమను నరకమునందును కదలుచున్న పురుగులచేత నిండిన
దియైన రక్తకర్దమమను నరకమునందును చెడ్డకంపుగల పూయఫేనిలమను నరకమునం
దును పడి ఆనరకములందు మునిగి దిక్కుగానక ఆనెత్తుటి బురదయందు అణగిన దేహ
ముతో ఊపిరివిడువరాక ముహూర్తకాలము నూరుకల్పములుగాతోచగా ఆనరకయా
తన ననుభవించుచు వేయిసంవత్సరములు కడపితిని. అందువలని దుఃఖము చెప్పశక్యము

నాం నియుతంమయా. వక్తుంహి తం నశక్నోమి దుఃఖంవానరనాయక, దైవాత్కథమపిప్రాప్త ఉత్తరోనరకాంబుధిః. యేనకర్మవిపాకేన శకు నిత్వముపస్థితమ్, తదపి శ్రూయతాంవక్ష్యే నిశ్శేషంయత్స్వహేతుకమ్. అపహృత్య ఘనా కాంస్యభాజనం భగినీగృహాత్, అతఃయాయ మయా దత్తం యేనమేసారసోగతిః. ఇయంచ బ్రాహ్మణీ పూర్వం కాంస్యచోరీ సుదారుణా, యేనేయం సారసీజాతా మద్భార్యాసహధర్మిణీ. ఇత్థంవానరతేసర్వం కథితం కర్మణఃఫలమ్, వృత్తంచవర్తమానంచ భవిష్యచ్ఛృణు సాంప్రతమ్. అహంహంసో భవిష్యామి త్వంచహంసోభవిష్యసి, హంసీయమపి మద్భార్యాసారసేచభవిష్యసి దేశేతు కామరూపాఖ్యేస్వాస్థ్యం నోత్ర యథాసుఖమ్, గోయోనిం భావికల్యాణీం యాస్యామ స్తదనంతరమ్. అతశ్చమానుషంజన్మప్రాప్తంమేదుర్లభంపునః, శ్రేయస్తద్విపరీతంచ ప్రాణిభిరైర్యశ్చసాధ్యతే.ఏవం సర్వైః విధైః జంతూన్ మోహయిత్వా సమాయయా,స్వైర్గుణైర్యుతదుఃఖైశ్చ నాన్యానేవహి కేవలమ్. అయం లోకేప్రవృత్తశ్చనిసర్గాద్విధినిర్మితః,ధర్మాధర్మపరోఽత్యర్థంసుఖదుఃఖఫలాత్మకః. సేవితఃప్రాణిభిర్నిత్యం సర్వథైవపునఃపునః, దేవాసురనరవ్యాఘ్రి

---

కాదు. అట్లు ఆనరకమునను భవించిన పిమ్మట ఈపక్షిజన్మము కలిగెను. ఈజన్మముకలిగిన వృత్తాంతమును కారణముతోడ తెలియజేసెదనువినుము. నాచేత ఇవ్వబడిన శాశ్వతమైన కంచుపాత్రము చెల్లెలి ఇంటనుండి దొంగిలించి తెచ్చినందున నాకు ఈసారసజన్మముకలిగెను. ఈనాభార్యయుం క్రూరురాలై మునుపు కంచుదొంగిలించియే ఈజన్మమెత్తినది. ఈవిధముగా పూర్వకర్మపరిపాకమువలన ఈజన్మము నాకు కలిగెను. ఇక నేను నీవు నాభార్య మనము ముగ్గురమును హంసలుగాపుట్టి కామరూప దేశమునందు సుఖముగా నుండగలము. పిమ్మట మాకు పరిశుద్ధమయిన గోవు జన్మము కలుగును. ఆటుపిమ్మట నాకు పొందరానిదైన మనుష్యజన్మము మరల సిద్ధించును. ఆజన్మమందు మేలో కీడో ప్రాణులచేత సాధింపనగును. ఇట్లు ఎల్లవిధములయిన జంతువులను సర్వాంతర్యామియైన భగవంతుడు తనమాయచేత మోహింపజేసి స్వగుణములచేతనే దుఃఖముతోగూడినవారు అగుటచేత ఈలోకమునందు మమ్ము బ్రహ్మచేత చేయబడిన సహజ ధర్మమువలన ప్రవర్తింప చేయుచు ధర్మాధర్మములయందు మిక్కిలి యాసక్తులగువారికి సుఖదుఃఖముల నిచ్చుచుండును. ఎల్లవిధములచేత మాటిమాటికి ప్రాణులచేత సేవింపబడినవాడును అగుచున్నాడు. దేవతలు రాక్షసులు మనుష్యులు పులులు సులి

క్రిమికీటకళేబరైః నాతిక్రాంతోఽపి కేనాపి పంథా యం దుఃఖకంటకః, విరక్తా యోగినోఽధ్యేతృస్నాతా వేదాంతపారగాః అణోరపిగురోర్వాపి పుణ్యాపుణ్యస్యకర్మిణః, దదాతీహ ఫలంజ్ఞాత్వా దేశంకాలంమహేశ్వర. ఇత్థంవిధివిధానజ్ఞా మాయాంజ్ఞాత్వేశ్వరస్యచ, నశోచంతినహృష్యంతి నవధ్యంతి మహాధియః. నాన్యథాశక్యతేకర్తుం విపాకంపూర్వకర్మణః, ఉపాయైఃకర్మణావాపి శాఖామృగబలైరపి. పురాత్వంభూపతిర్జాతఃపశ్చాజ్జాతోఽసి వానరః, అధునావానరంజన్మ భూయఃప్రాప్స్యతిమానృశమ్, ఇతిమత్వా విశోకస్త్వం శాఖామృగయథాసుఖమ్, ప్రతీక్షాంకురు కాలస్య రమమాణోఽత్ర కాననే. అహమప్యేవపాశేన మయాబద్ధోఽవనేవనే, క్షపయిష్యామి మజ్జన్మధైర్యమాస్థాయ సారసమ్. వానరః — మయాత్వంపూజితఃపూర్వం నామిత్వామధునాప్యహమ్, జాతిస్మరోఽసిజానాసిసర్వమత్రచదైహికమ్. తిష్ఠసారసపారస్య శ్శివమస్తుసదాతవ, త్వద్వాక్యాదపి మోహోఽద్యహం

---

పురుగులు పెద్దపురుగులు మొదలగునవియైపుట్టిన ప్రాణులు ఎట్టును దుఃఖమునెడి ముండ్లుగలమార్గమును దాటినవారు కారు. సంసారమునందు విరక్తికలవారును యోగులును వేదమును చదివినవారును స్నానముచేయువారును వేదాంతము తుదముట్ట తెలిసినవారును ఐనను కొంచెమోగొప్పో పుణ్యకర్మముగాని పాపకర్మముగాని చేసినయెడల ఆకర్మములు అందులకు తగినఫలమును దేశకాలమును గుర్తెరిగి ఇచ్చును. అనిశాస్త్రవిధులను తెలిసినబుద్ధిమంతులు ఈశ్వరునిమాయనెరిగి దుఃఖమును సంతోషమును మనోవ్యథను పొందరు. కనుక పూర్వకర్మపరిపాకమును తప్పింపను ఎవరికిని అలవికాదు. ఓవానరుడా! మునుపు ఉపాయములతోడను అందులకుతగిన పనులతోడను సేనలతోడను కూడినవాడవైయుండి పిమ్మటకోతివై పుట్టితివి. ఈవానరజన్మము మనకు తగినదే అనియెంచి లేనివిచారమును తెచ్చుకొనక ఎట్టున్నయెడసుఖమో అట్లు మంచికాలమునకు ఎదురుచూచుచు ఈయడవియందు విహరించుచుండుము. నేను ఇటువంటి బంధకములలో తగులుకొనుచు ధైర్యమును వదలక అడవులవెంట నాసారసజన్మమును కడపెదను అని సారసపక్షి చెప్పెను.

వానరునిమాటలు — ఓసారసపక్షీ! నీవు మునుపు నాచేత పూజింపబడితివి. ఇప్పుడును నేను నిన్నుగూర్చి మ్రొక్కెదను. నీవు పూర్వజన్మస్మృతి గలిగి ఈదేహసంబంధమైన విషయమంతయు తెలిసినవాడవైతివి. నీవు భార్యతోడ సుఖముగానుండుము. నేను నీమాటవలన అజ్ఞానమును విడచినవాడనయి సుఖముగా అడవియందు సంచరించెదను, అని చెప్పి వానరుడు పోయెను,

విచరిష్యే యథాసుఖమ్ పిశాచః. ఇత్థం రమ్యం విచిత్రంచ పావనం పరమద్విజ, కపిసారససంవాదం శ్రుతం యావన్న దీతకే. తావన్మయా విబోధో భూత్తేన శోకక్షయంగతః, ఇదానీం జాహ్నవీతోయ మాహాత్మ్యం పరమాద్భుతమ్. దృష్టోత్ర బ్రాహ్మణశ్రేష్ఠ త్వాం యాచే జాహ్నవీజలమ్. ప్రీతోఽస్మి స్నాతుకామో వై తీవ్రతృష్ణాప్రపీడితః. అస్మిన్నేవజలే దృష్టం మహాశ్చర్యం మహాద్భుతమ్, గంగాతోయమహం పాతుం త్వత్తః పాపహరం శుభమ్.

ఇతి శ్రీపాద్మే పురాణే - మాఘమాహాత్మ్యే - కపిసారససంవాదో నామ పంచచత్వారింశోఽధ్యాయః.

---

## షట్చత్వారింశోఽధ్యాయః.

పిశాచః — పారియాత్రేఽమలః కశ్చిద్బ్రాహ్మణో వేదపారగః, అయాజయద్యాజనాద్వింధ్యే సంభూతో బ్రహ్మరాక్షసః మమసంగస్య లాభేన స్థితోఽశోహాయ వాష్టకమ్, తస్యాస్థీని స్వపుత్రేణ సంచితాని ద్విజోత్తమ.

---

పిశాచముమాటలు. — ఓ బ్రాహ్మణోత్తమా! పావనమును విచిత్రమును రమ్యమునయిన ఈకపిసారసముల సంవాదమంతయు ఏటిగట్టుననుండి వింటిని. అంతమాత్రముననే నాకు జ్ఞానముకలిగెను. అజ్ఞానము చేత దుఃఖము నశించెను. ఇప్పుడు మిక్కిలి వింతయయిన గంగాజలముయొక్క ప్రభావమును కనుగొంటిని. బ్రాహ్మణశ్రేష్ఠుడవైన నిన్ను గంగాజలము యాచించితిని. మిక్కుటమైన దప్పిచేత బాధనొందువాడనయిన ఆనీళ్లయందు స్నానముచేయగోరినవానివలె తృప్తినొందినవాడనైతిని. ఈనీళ్లయందు కానబడిన మిక్కిలివింతయైనదియు వింతను కలుగజేయునదియు పాపములను పోగొట్టునదియు మేలయినదియు నైన నీయొద్దనుండెడి గంగజలము నన్ను రక్షించుచు.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు కోతికిని సారసపక్షికిని నైన సంవాదమును తెలిపెడు నలువదిఅయిదవ అధ్యాయకథ.

---

## నలువదియాఱవ అధ్యాయము.

పిశాచముయొక్కమాటలు. - పారియాత్రమునందు నిర్మలుడును వేదముతుదముట్ట చదివినవాడునైన యొకబ్రాహ్మణుడుగలడు. ఆతడు యజ్ఞములుచేయించునట్టి వ్యాపారమువలన అనేక యజ్ఞములుచేయించి తుదను ఆ దేశమువిడిచి బ్రహ్మరాక్షసుడైపుట్టి వింధ్య పర్వతములందు నాతోగూడ యెనిమిది యేండ్లుగూడియుండెను. పిమ్మట ఆతనికొడుకు

క్షిప్తాన్యానీయ గంగాయాః తీర్థే పాపౌఘనాశనే, తత్క్షణాదేవ ముక్తోఽసౌ రాక్షసత్వాత్సుదారుణాత్. ఇతిగంగాజలస్యాహం మహిమానంమహాద్భుతమ్, సాక్షాద్దృష్టం మయా తేన గాంగేయప్రార్థయేజ్జలమ్. పురస్తాద్యత్కృతంతీర్థే మయాభూరిప్రతిగ్రహాః, నకృతస్తత్ప్రతీకారఃతత్రజవ్యాధిలక్షణమ్. తేనమే ప్రేతభూతస్య దుర్లభోదకభోజనమ్, సహస్రద్వయవర్షాణామతీతం వింధ్యపర్వతే. ఇతి తేకథితంసర్వం హిత్వాలజ్జాం గరీయసీమ్, ఇదానీం జలదానేన ధార్మికశ్రేష్ఠ సత్వరమ్. సంతర్పయ మమప్రాణాన్ కంఠమాత్రావలంబినః, దుస్సహం ప్రేతభావేఽపి జీవనంప్రాణినామిహ. శరీరంరక్షణీయంహి సర్వదా సర్వథానరైః, నహీచ్ఛంతితనుత్యాగమపి కుష్ఠాదిరోగిణః. ఇత్యేతద్వచనం శ్రుత్వా విస్మయం పరమంగతః, పథికశ్చింతయామాస కృపాంప్రేతే సముద్వహన్. పుణ్యపాపఫలం లోకే ప్రత్యక్షంఖలు దృశ్యతే, దేవదానవమానుష్యం తిర్యక్త్వం క్రిమికీటతామ్. నానాయోనిషు జన్మాని నానావ్యాధిప్రపీడనమ్, మరణం బాలవృద్ధానామంధత్వం కుబ్జతాం తథా, ఐశ్వర్యంచ దరిద్రత్వం పాండిత్యం

---

అతని అస్థులను తీసికొనిపోయి గంగలో పాపనాశనము అనుఘట్టములందు కలిపెను. అంతట అప్పుడే ఆబ్రాహ్మణుడు క్రూరమైన రాక్షసత్వమునుండి విడువబడెను. ఇట్లు గంగాజలము యొక్క వింతయైనమహిమను నేను ప్రత్యక్షముగా చూచితిని. గనుక గంగయందలిదైన జలమును వేడెదను. ముందు నేను పుణ్యతీర్థమునందు విశేషధనమును తీసికొన్నందులకు ప్రాయశ్చిత్తమేమియు చేసికొన్నవాడను కాను. కాబట్టి అందువల్ల నేను ప్రేతమునై అన్నము నీళ్లు గానక యిట్లు అల్లాడుచు వింధ్యపర్వతమునందు రెండువేలయేండ్లు గడపితిని. ఇట్లు మిక్కుటమైన సిగ్గును విడిచి సర్వవృత్తాంతమును నీకు చెప్పితిని. ధర్మాత్ములలో శ్రేష్ఠుడైన యోబ్రాహ్మణుడా! ఇప్పుడు శీఘ్రముగా నాకు గంగాజలమును ఇచ్చి కంఠగతములైన నా ప్రాణములను తనుపునొందింపుము. ఈలోకమునందు ప్రాణులకు ప్రేతత్వముతో బ్రదుకుట మిక్కిలి కష్టము. ఎల్లవిధములచేతను ఎప్పుడును జనులు దేహమును కాపాడుకొనవలసినది. కుష్ఠరోగము మొదలగునవి గలవారుకూడ దేహమును విడువగోరరు. ఇట్లు వేడుకొనుచున్న ప్రేతముయొక్క మాటలను విని ఆబాటసారి మిక్కిలి యాశ్చర్యపడి దానియందు దయపుట్టగా ఇట్లు ఆలోచించెను. లోకమునందు పుణ్యఫలమును పాపఫలమును ప్రత్యక్షముగా కనబడుచున్నదిగదా. అందు దేవతలు దానవులు మనుష్యులు పశువులు పురుగులు మొదలగు అనేకవిధములైన జన్మములును బహువిధములైన వ్యాధిబాధలును పిల్లకాయలయుం ముసలివాండ్రయుం చావులును గ్రుడ్డితనము గూనితనము

మూఢతాం తథా. ఏతేచరాచరేలోకే భవంతికథమన్యథా, తే ధన్యాః కర్మభూమౌయే న్యాయమార్గార్జితం ధనమ్. సత్పాత్రేభ్యః ప్రయచ్ఛంతి కుర్వంతిహ్యాత్మనోహితమ్, భూమిరత్నహిరణ్యానిగావోధాన్యం గృహస్థలమ్. రథాశ్వవాససో గ్రామ స్సిద్ధమన్నం ఫలంజలమ్, కన్యాదివ్యౌషధం మంత్రం ఛత్రోపానద్ద్వయాసనమ్ శయ్యాతాంబూలమాల్యానితాళగీతవిరాజితమ్, యద్యదిష్టతమం తత్తద్దేయంసర్వంహితేప్సుభిః. యద్దత్తం ప్రాప్యతే స్వర్గే దత్తమేవోపభుజ్యతే, యత్కించి దిదమశ్నాతి నాదత్తముపతిష్ఠతి. స కార్పటికధర్మజ్ఞ ఇమాంగాథామగాయత, ఇతిశ్రుత్వా పునఃప్రేతః ప్రోవాచ చ సచేతనః. మన్యే సర్వజ్ఞకల్పోసి పాంథ త్వం నాత్ర సంశయః, దేహిమే జీవనంవాపి చాతకాయ ఘనోయథా. ఏతస్మిన్ ప్రాణదానేఽద్య మా విలంబం కురుద్విజ, దద్యాత్ప్రేతాయ పాంథస్స వచనం న్యాయగర్భితమ్, భృగుకచ్ఛే మమ ప్రేత పితరౌ తత్ర తిష్ఠతః. తదర్థే తీర్థరాజస్య మయా వారి సమాహృతమ్. తత్పితాసితపానీయం

కలిమిలేమి తెలివిగలిగియుండుట ఏమితెలియకపోవుట ఇవి మొదలైనవి లోకమునందు చరములును అచరములునైన ప్రాణులకు కలుగుచున్నవి. అవి కలుగ పోవుటయెట్లు? ఎవరు ఈకర్మభూమియందు న్యాయమార్గముచేత ఆర్జించిధనవంతులై యోగ్యులగువారికి ఇచ్చి ప్రాణులకు మేలుచేయుదురో వారు భూమి రత్నములు బంగారు గోవులు ధాన్యము ఇల్లుకట్టుచోటు రథములు గుఱ్ఱములు వస్త్రములు గ్రామములు ఉత్తమైన అన్నము పండు కన్యక మేలైనమందు మంత్రము గొడుగు చెప్పులు పీట పానుపు తాంబూలము పూదండలు తాళరాగములచేత ప్రకాశించెడిపాట అనునీచెప్పఁబడిన వానిలో ఎవరెవరికి ఏదేది ఇష్టమో దానిదానిని వారివారికి ఇయ్యవలసినది. ఏదియిచ్చినస్వర్గము కలుగునో దానినిఇచ్చి అందువలని ఫలమును అనుభవింపవలెను. కొంచెమైనను ఇచ్చినదియు అనుభవించినదియునే దక్కునుగాని, మరియేదియుందక్కదు. అనునీయర్థముగల కృతిని ఆతీర్థవాసిపాడెను. దానినివిని ప్రేతము కళదెలుపుకొనిమరల నాతీర్థవాసితో ఓ తెరువరీ! నీవుశివునితో సమానుడవు అనితలచెదను. అందులకు సందేహము లేదు. మేఘము చాతకమునకుజీవనమును(జలమును)ఇచ్చునట్లు నాకు జీవనమును (బ్రతుకును) ఇమ్ము. అయ్యో! బ్రాహ్మణుఁడా, ఇప్పుడు నాకు ప్రాణదానముచేయుటయందు ఆలస్యము చేయకుము. అనగా ఆతెరువరిప్రేతముతోన్యాయముతోగూడినయొకమాటచెప్పెను. ఓప్రేతమా! నాతల్లిదండ్రులు భృగుకచ్ఛమునందు ఉన్నారు. వారికొరకు ఉత్తమతీర్థమైన ప్రయాగయందుండి యీజలమును యెత్తుకొనిపోయెదను. ఆజలము నడిత్రోవలో నీవుఅడిగెదవు,

ముద్ధ్యేచ ప్రార్థితం త్వయా, తదర్థేజాతసందేహః కిమత్ర మమ యుజ్యతే. బలాబలం విచార్యాథ కరిష్యే ప్రబలం విధిమ్, వేదేభ్యో ధర్మశాస్త్రేభ్యో నాహం జానే న కేవలమ్. హయమేథాదియజ్ఞేభ్య స్సర్వేభ్యో హ్యధికం ఫలమ్, ఋషిభి ర్దేవతాభిశ్చ ప్రాణినాం ప్రాణరక్షణమ్. పిత్రర్థం పునరాదాయ జలం నేష్యామి పావనమ్, ఏష మే ప్రబలో భాతి శుద్ధధర్మప్రదోఽధికః పరోపకర్మణోఽన్యశ్చసర్వమల్పం స్మృతం బుధైః, పరోపకారిభిర్దత్తా అపిప్రాణాన్నృభిః పురా. పరోపకారః కర్తవ్యః ప్రాణైరపి ధనైరపి, పరోపకారజంపుణ్యం నస్యాత్క్రతుశతైరపి. పరోపకారవ్యాపారపరో యః పురుషస్సదా, పరంపదమవాప్నోతి పరాదపిచ యత్పరమ్. అద్భిః ప్రేతోపకారస్యాత్కింనలబ్ధం మయాపునః, దధీచినా పురాగీతః శ్లోకశ్చ శ్రూయతే భువి. సర్వధర్మమయస్సార స్సర్వధర్మజ్ఞసత్తమ, ఇత్యుక్త్వా ప్రదదౌ తోయం గంగాకాళిందిసంభవమ్. ప్రేతస్య ప్రాణగత్యర్థం సధర్మిష్ఠవరో ద్విజః, ప్రేతోఽపి తజ్జలం పీత్వా అభిషిచ్య శిరస్తథా. విజహౌ ప్రేతదేహం స్వం దివ్యదేహశ్చాభవత్క్షణాత్, సామ్రా

అందులకై సందేహించి యోచించుచున్నాను. చేయఁగలపనులయొక్క బలాబలమును విచారించి అందు ప్రబలమైన పనిని చేయవలసినది. నేను కేవలము వేదశాస్త్రముల వలననే ఋషులచేతను దేవతలచేతనుకూడ అశ్వమేధము మొదలగు యజ్ఞము లన్నిటికంటెను ప్రాణులయొక్క రక్షణము అధికఫలము నిచ్చునది యని తెలిసికొని యున్నాను. తల్లిదండ్రులకు కావలసిన పరిశుద్ధమైన గంగాజలమును మరల పోయి తెచ్చెదను. నిర్మలమైనపుణ్యము నిచ్చునదియు మేలైనదియు నైన పరోపకారమును చేయువారికి తక్కినదంతయు తక్కువైనదని పండితులు చెప్పుదురు. కనుక నాకు ఇదే ప్రబలమని తోచుచున్నది. పరులకు ఉపకారముచేయుటవలన గలిగెడిపుణ్యము నూరు యజ్ఞములుచేసిననుకలుగదు. ఎవఁడు పరోపకారము చేయునో వాఁడు ఎప్పుడును పురుషులలో నుత్తముఁడు అగును. అట్టియుత్తముఁడు శాశ్వతమైన పరమపదమునుపొందును. జలముల చేత ప్రేతమునకు ఉపకారము చేసినయెడ నాకు ఏదికలుగకపోవును? పూర్వకాలమునందు దధీచిచేత చెప్పబడిన సర్వధర్మమయమును సారవంతమునైనశ్లోకమును లోకమునందు వినబడదా? అనిపలికి గంగా యమునా నదులయందలిదైనజలమును ధర్మాత్ముఁడును ఉత్తముఁడునైన ఆబ్రాహ్మణుఁడు ఆప్రేతముయొక్క ప్రాణమును కాపాడుటకొరకు ఇచ్చెను. ప్రేతమైన కేరళుఁడు ఆనీళ్లనుత్రాగి తలమీఁదపోసికొని తన ప్రేతదేహమును వదలి తత్క్షణమే దేవదేహమును పడసినవాఁడై, ఆగొప్పవింతను జూచి, గంగయందుండి తేబడిన

జ్యం యదినోయత్నాన్మందాకిన్యుద్ధృతాంభసా. ఆశ్చర్యంతన్మహద్దృష్ట్వా నిజగాదస కేరళః, అహంవిముక్తః ప్రేతత్వా ద్వేణీపానీయబిందుభిః. బ్రహ్మాదయో నైవశక్తా మన్యేవక్తుం మహద్గుణమ్, గంగాయాస్తుమహాదేవో దత్తేకంకథ మన్యథా.అచింత్యభక్త్యా గంగాంభస్తిలమాత్రంతు యఃపిబేత్, దేవో భవేత్స సిద్ధోవా న గర్భంతు పునర్విశేత్. సుధాబ్ధా యానపాత్రాణి పయోబిందుకణాణవః, వ్యూహాతోనుగతి శ్శ్రుణ్వ యస్తాంస్తాఃకోనసేవతే. న కాలో నకలిఃపంకో దంభోళి ర్నైవ నారకః, తంపరాభవితుం శక్తో గంగాయాంస్నాతి యస్సకృత్. నతపోభి ర్నదానైశ్చ నైవ హోమజపాధ్వరైః, యదంభఃకణసంసేకాత్ప్రేతత్వం హ్యజహాత్క్షణాత్. తజ్జలాప్లుతదేహానాం కైవల్యంనాత్రసంశయః, కాయేమనసియేవాపి పాపకర్మణ రంజితాః. కిన్నాశయతితేషాంత దంహోగంగోదకంవినా, సిధ్యంతి సిద్ధయస్తస్య స్వర్గంతస్య గృహాచ్చిరమ్. కరస్థం తస్య కైవల్యం యో గంగాం సేవతేనరః, యదంభస్స్పర్శనాత్పాపా న్ముచ్యంతేప్రేతరక్షసాః. నరోవగాహ్యతేగంగాం యాతి తద్వైష్ణవంపదమ్, దా

---

నీళ్లచేత మాకు చక్రవర్తిత్వమైనను కలుగును. వేణియందలి నీటిబొట్లవలన నేను ప్రేతత్వమునుండి విడువబడితిని. బ్రహ్మ మొదలగువారుకూడ ఇందులకు సమర్థులు కారు. ఈ జలముయొక్క గొప్పగుణమును చెప్పను శక్యము కాదు. మహాదేవుడు ఇచ్చినగంగజలము మరియొకవిధమైనది యెట్లు అగును. ఏజనుడు పాలసముద్రమునందుపోయెడి యోడలను పొంచుకొలయందలి రేణువులు రాసులుగా వెంబడించుటను వినుచును అనుభవింపక మిక్కిలి భక్తితో గంగాజలమును నువ్వగింజంతయైన త్రాగునో, వాఁడు దేవతయో సిద్ధుడో అగును గాని మరల తల్లిగర్భమునుచొరడు. ఎవడు గంగయందు ఒకానొకప్పుడు స్నానము చేయునో వానిని కాలము కలహము పాపము వజ్రాయుధము నరకము ఇవి భంగపెట్టజాలవు. తపస్సులచేతను దానములచేతను హోమములచేతను జపములచేతను యజ్ఞములచేతను తొలగని ప్రేతత్వము ఏజలబిందువులచేత తడియుటవలన తత్క్షణమే తొలగునో, ఆజలమునందు మునిగిన దేహధారులకు కైవల్యము లభించుటకు సందేహము లేదు. ఎవరు మనసునందు దేహమునందును పాపకర్మముచేత ప్రకాశింతురో వారి పాపము గంగనీళ్లుతప్ప మరిదేనిచేత నశించును ? ఏమనుష్యుడు గంగస్నానము చేయునో వానికి ఎల్లయత్నములును నెరవేరును. మరియు వానికి ఇంటికంటె స్వర్గము శాశ్వతమైనదగును. మోక్షమును వానిచేతిలోనిది యగును. ఏనీళ్లు సోకుటవలన ప్రేతములు రాక్షసులును పాపమువలన విడువబడుదురో ఆగంగ నీటియందు స్నానము చేసి మానవుడు శ్రీవిష్ణుదేవునిదైన పరమపదమును పొందును. ఎవనిదాయాది గంగయందు పితృతర్ప

యాదోయస్య గంగాయాం కురుతే పితృతర్పణమ్. నరకస్థా దివం యాం
తి స్వర్గస్థా బ్రహ్మతాంతు తే, న గంగాసదృశీశుద్ధి ర్నగంగాసదృశీగతిః.
నగంగాసదృశీముక్తి ర్గంగా సర్వాధికా యతః, ఆయుష్మాన్ భవ పాంథ
త్త్వం మా ధర్మవిముఖో భవ. త్వయా సంభావితస్సద్యో గంగాంబుకణ
పానతః, ఇత్యుక్త్వా ప్రస్థితో నాకం యః పిశాచ స్స కేరళః. ఆశీర్భిరభినం
ద్యాథ పాంథం ధర్మధురంధరమ్, దేవద్యుతిః.—ప్రేతం విమోక్ష్య పాం
థోపి పున రాదాయ తజ్జలమ్, గత స్తేనైవమార్గేణ గాయన్ విశ్వేశ్వరం
విభుమ్ ఇత్థం ప్రయాగమాహాత్మ్యం శ్రుత్వా నత్వా చ తం మునిమ్,
ప్రయాగేసహసామాఘే పిశాచస్సత్వరం గతః. స్నాత్వాసితాసితేసోఽపి
మాఘమాసే ద్విజోత్తమ, పిశాచః క్షీణపాపస్సన్ పైశాచీం విజహౌ త
నుమ్. దివ్యదేహ స్తతోభూత్వా ద్రావిడో భూపతి స్తదా, స్తువన్నారా
యణం దేవం భక్త్యా ద్వేషవివర్జితః. గంధర్వైః స్తూయమానస్సన్ నాక
నారీనిషేవితః, ఉత్తమేనవిమానేన పురందరపురం యయౌ. ఇతి తే కథితం
సర్వం పురావృత్తం సహేతుకమ్, ఇతిహాసం ద్విజశ్రేష్ఠ సద్యః పాతక
నాశనమ్. జ్ఞానదం మోక్షదం చైవ శ్రుతం దుర్గతినాశనమ్, అధునాతు

---

ణముచేయునో వానికులమువారు నరకమునందున్నయెడల స్వర్గమును స్వర్గమునం దున్న యెడల మోక్షమును పొందుదురు. గంగవంటిపావనమును గంగవంటి యుత్తమగతియు ను గంగవంటి మోక్షమును లేదు. గంగ యీచెప్పఁబడిన యన్నిటికంటెను హెచ్చై నది. ఓ తెరువరీ! నీవు దీర్ఘాయుష్మంతుడవై యుండుము. ధర్మమునకు మారుమొగమైన వాడవు కాకుము. గంగనీరు త్రాగుటవలన ఇప్పుడే నీచేత సన్మానింపబడితిని. అని చెప్పి ఆపిశాచముగానున్న కేరళుడు ధర్మాత్ముడైన బాటసారిబ్రాహ్మణుని దీవించి పొగడి అంతట స్వర్గమునకు బోయెను. ఆ తెరువరియగు బ్రాహ్మణుడును కేరళుని ప్రేతత్వమును విడిపించి మరల ప్రయాగమునకుపోయి గంగనుతీసికొని యేలినవాడగు సర్వేశ్వరుని పొగడుచు తనత్రోవను తానుపోయెను. అని దేవద్యుతి పిశాచమునకు చెప్పెను. ఇట్లు పిశాచము ప్రయాగమాహాత్మ్యమును విని ఆమునీశ్వరునికి మ్రొక్కి శీఘ్రముగ ప్రయాగమునకు పోయి అందు మాఘస్నానముచేసి పాపములెల్ల నశింపగా పిశాచదేహముపోయి దేవదే హమురాగా మునుపటి ద్వేషముమాని భక్తితో శ్రీమన్నారాయణదేవుని స్తోత్రము చేయుచు గంధర్వులు పొగడగా, అప్సరసలు సేవింపగా శ్రేష్ఠమైన విమానములో దేవ లోకమునకు పోయెను. కనుక విన్నప్పుడే పాపములను చెరుచునదియు జ్ఞానమును మో క్షమును ఇచ్చునదియు, పెద్దలచేత వినబడినదియు, నరకమును తొలగించునదియు నైన

మయాసార్ధ మిమాః కన్యా స్సుతస్తు తే, త్వంచాహంచ ప్రయాగం వై సర్వే సద్గతిమాప్స్యవః. మాఘస్నానంప్రకుర్వంతి దేవానామపిదుర్లభమ్, తత్రమోక్ష్యంతి పైశాచ్యం మిథశ్శాపసముద్భవమ్.

ఇతి శ్రీ పాద్మే పురాణే మాఘమాహాత్మ్యే దేవద్యుతి ప్రసాదేన ద్రవిడరాజస్య పిశాచత్వమోచనంనామ షట్చత్వారింశోఽధ్యాయః.

---

## సప్తచత్వారింశోఽధ్యాయః.

వసిష్ఠః.—ఏవం రోమశవక్త్రాబ్జాత్కథాం మధుమనోహరామ్, పీత్వా ప్రముదితాస్సర్వే నిస్తీర్ణదురితార్ణవాః. ప్రస్థితా తేన సార్ధం తే కాష్ఠాంసపదిదక్షిణామ్, దిలీప శృణు భూపాల స్నాత్వాబోధసరోవరే. సత్వరం వ్యోమమార్గేణ సమానగతయస్తు తే, సమాగత్య స్థితా వ్యోమ్ని సంతుష్టహృదయాస్తు తే. తదూచే రోమశ స్తత్ర మదయక్ష సర్వ మానసమ్, పశ్యంతు శ్రద్ధయా సర్వే తీర్థరాజమిమం భువి. ఇయం సా

---

యీ పురాతనకథను కారణములతోడ నీవుచెప్పితిని నీ ఇప్పుడు ఈకన్యకలును నీకొడుకును నీవును నేనును సద్గతిని కోరినవారమై ప్రయాగమునకు పోయి అందు దేవతలకు గూడ దొరకనిదగు మాఘస్నానము చేయుదము. అచ్చట పరస్పరశాపములవలన గలిగిన పిశాచత్వమునుండి వీరు విడువబడుదురు. అని రోమశుడు చెప్పెను.

ఇది శ్రీపాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు దేవద్యుతియనుగ్రహమువలన ద్రవిడదేశపురాజు పిశాచత్వము పోవుటను తెలిపెడి నలువదియారవ అధ్యాయకథ.

---

## నలువదియేడవ అధ్యాయము.

ఓదిలీపమహారాజా! ఈవిధముగా రోమశమహామునిచేత చెప్పబడిన యీయింపైనకథనువిని పిశాచములును వేదనిధియు సముద్రమువలె మేరలేనిపాపములు తొలగిపోగా మిక్కిలి సంతోషించి, జ్ఞానమగెడి శ్రేష్ఠమైన కొలనియందు మునిగినవారుఅగుచు అప్పుడే ఆయనవెంట దక్షిణదిక్కునుగూర్చి వెడలిఆకాశమార్గమునముందు వెనుకలుగాక సరిగానడచి వేగమున ప్రయాగముచేరబోయి ఆపుణ్యతీర్థమును చూచుటవలని సంతోషముచేత మనసుపొంగగా ఆకాశమునందే నిలిచిరి. అప్పుడు రోమశుడు వారిమనసులు తనియ అందలివిశేషమును చూపి చెప్పసాగెను. ఓవేదనిధీ! మీరుఅందరుసుఖాలోకము నందలితీర్థములకెల్లనురాజువంటిదైన ఈతీర్థమును శ్రద్ధతో చూడుడు. వేనియందును తృప్తి

మాఘవేదీతు యజమానస్య వేధసః, ఇమాని త్రీణి కుండాని దీప్తాన్యా
జస్రవహ్నిభిః. యేషు తృప్తిం గతో వహ్ని ర్యేన కేనాపి తృప్యతే,
స్తంబేరమకరస్థూలధారయా ఘృతధారయా అత్ర దేవాస్త్రయస్త్రిం
శ త్తృప్తా ముముదిరేభృశమ్, నేదిష్ఠయాహ్యతిస్వాదు పర్యస్తసోమ
ధారయా. ఆవిర్భూతస్స్వయంయత్ర శూలటంకో మహేశ్వరః, అతు
ర్యోఽయంసురై స్సేవ్య ఆపాతాళజటోవటః. మృకండుసూనునాకల్పే
యంప్రవిష్టస్సుఖస్థితిమ్, లోకేజలాకులేసోథ యోగనిద్రాపరోహరిః. సే
యం భగవతీ శంభోర్వల్లభా లాలితా భృశమ్, సిద్ధ్యర్థం సేవితా సిద్ధై
ర్భుక్తిముక్తిఫలార్థిభిః. ఉత్సంగా త్సాగరా చ్చక్రు ర్దివ్యస్త్రీలో
చనోత్సవః, మాఘూనాశ్రితోప్యసేవ్యా సేయం భాగీరథీనదీ యస్యా
జలావగాహేన లోకేచార్కసమానతామ్, లభ్యంతే ప్రాణినస్సర్వేసా
నదీయమునాత్వియమ్. అనయోఃపుణ్యనద్యోస్తు సేవ్యోయం సంగమో
మునే, అవిముక్తే విముచ్యంతే నారకం జ్ఞానజన్మనః. యత్రస్నాత్వానలి

---

పొందని అగ్నిదేవుడు దేనిచేత తృప్తిపొందినవాడు అగునో అట్టియెడతెగక మండు
చుండెడి అగ్నులతోగూడిన మూడుగుండములు గలదియు, బ్రహ్మయజమానుడుగాగల
దియు నైన మాఘవేదికయిదిగో ఉన్నది. ఇక్కడ ఏనుగుతొండములావుగల నేతిధారచేత
ముప్పదిమూడుకోట్ల దేవతలు తృప్తినొంది మిక్కిలిసంతోషించిరి. ఇందుమిక్కిలి రుచిగ
లిగిసమీపించిన దైపడిన సోమరసముయొక్క ధారచేతపుట్టినశూలటంకములుగల శివమూర్తి
ఇతడు. పాతాళమువరకుదిగిన యూడలుగల అక్షయవటముఇది. ప్రళయకాలమునందు
నీళ్లలోగలిసిపోయిన లోకమునందు సుఖమైన యునికినిగూర్చి యెవనిని మార్కండే
యుండు శరణుచొచ్చెనో ఆయోగనిద్రాపరవశుడైన ప్రయాగమాధవుడు ఇతడు. శివు
నికిప్రియురాలై మిక్కిలి చపలత్వముగలదియు షడ్గుణైశ్వర్యసంపన్నయు కోరికలు సిద్ధిం
చుటకై సేవింపబడునదియు దేవతాస్త్రీలకు కనువిందుగు చేయుచు జనులచేత మాఘమాస
ములనాశ్రయించి సమీపమునయుండెడి సముద్రునికంటె విశేషించి సేవింపబడినది యైన
భాగీరథీనదియిది. లోకమునందు దేనినీళ్లలోస్నానము చేయుటచేత ఎల్లజనులకును సూర్యు
నితోడి సమానత్వము కలుగునో ఆయమునానది యిది. ఈరెండు పుణ్యనదుల చేరిక యైన
యీతీర్థము సేవింపదగినది. కాశియందు జ్ఞానజన్మముగలవారు నరకమునుండి విడువబడు
దురు. ఎక్కడస్నానముచేసినవారు చావుపుట్టుకలనెడి కార్చిచ్చుచేత కాల్పబడరో అట్టి
యీప్రయాగమునందు జ్ఞానజన్మముగలవారును అజ్ఞానజన్మముగలవారు నైన యెల్లప్రా
ణులను జ్ఞానమువలనగాని అజ్ఞానమువలనగాని స్నానముచేసి నరకమునుండి విడువబడు

హ్యంతే జన్మమృత్యుదవాగ్నినా, జ్ఞానాజ్ఞానా త్ప్రయాగేఽస్మిన్ ము
చ్యంతే సర్వజన్మనః. ఇష్ట్వాత్రైవ మహాయజ్ఞైః సృష్టికామః ప్రజాపతిః,
అవాప్య సృష్టిసామర్థ్యం తతస్సృష్టిం చకార సః. అత్ర నారాయణస్స్నాత్వా
పత్నీకామ స్సితాసితే, తతోవై లబ్ధవాన్ లక్ష్మీం భార్యామమృతమంథ
నే. షణ్మాసాదత్ర నివసన్ స్నాత్వా కాశ్యాం జయేప్సయా, త్రిపురం
పాతయామాస ఏకబాణేన శూలభృత్. వాసవస్యాపి శాపేన స్వర్గ
భ్రష్టా పురోర్వశీ, స్వర్గకామాత్ర సాసస్నా లేభే స్వర్గం తతోఽచిరాత్.
పుత్రంవంశకరం లేభే యయాతిం నహుషో మునే, పుత్రకామః ప్రయా
గేఽస్మిన్ స్నాత్వా పుణ్యే సితాసితే. ధనకామః పురా శక్రః స్నాత్వా
అత్ర ద్విజోత్తమ, ధనదస్య నిధీం త్సర్వాన్ తస్మా జ్జగ్రాహ మాయ
యా. నారాయణో నరేణైవ వర్షాణా మయుతం పురా, నిరాహారః
ప్రయాగేఽస్మిన్ కృతవాన్ ధర్మభార్వితమ్ జిగీషుణాత్రసన్న్యాసో దశ
ధర్మరతో ద్విజ, అణిమాదిగుణాన్ లేభే యోగసిద్ధించ దుర్లభమ్ కాశ్య
పోత్ర తపస్తేపే శివారాధనతత్పరః, అస్మిన్ తీర్థే భరద్వాజః షణ్ణాంవై

---

దురు. ఇక్కడనే సృష్టిచేయుకోరికగల బ్రహ్మదేవుడు యజ్ఞములుచేసి మిక్కుటమైన సృష్టిసామర్థ్యమును పొంది పిమ్మట లోకములను సృజించెను. ఈ తెల్లని నల్లని నీళ్లుగల వేణీసంగమమునందు శ్రీవిష్ణుమూర్తి పెండ్లామునుకోరి స్నానముచేసి పిమ్మట అమృతమును తరుచుటయందు లక్ష్మీదేవిని భార్యగాపడసెను. గెలుపుకోరికచేత ఇచ్చటను కాశియందును ఆరునెలలు స్నానముచేయుటవలన శివుడు ఒకబాణముచేతనే త్రిపురములను పడగొట్టెను. ఇంద్రునిశాపముచేత ఊర్వశి స్వర్గభ్రష్టురాలై మరల స్వర్గమును చేరవలెననుకోరికచేత ఇందుస్నానముచేసి అచిరకాలముననే స్వర్గమునుపొందెను. నహుషుడు పుత్రుని కోరినవాడై యీ ప్రయాగమునందు స్నానముచేసి వంశకర్తయైన యయాతియను కొడుకును పడసెను. పూర్వకాలమునందు ఇంద్రుడు ధనమునుకోరినవాడై యిచ్చట స్నానముచేసి కుబేరునియొక్క తొమ్మిదినిధులను కపటముచేత నాచుకొనెను. జయింప నిచ్ఛగల ధర్ముని కొడుకులైన నరుడు నారాయణుడు అనుఋషులు పదివేల యేండ్లు తపస్సుచేసి యిష్టమును నెరవేర్చుకొనిరి. శివపూజసేయుటయందాసక్తుడైన కాశ్యపుడనుఋషి పదియైనయింద్రియములను చలింపక నిలుపుకొని ధర్మముతప్పక తపస్సుచేసి అణిమ మొదలగుఐశ్వర్యగుణములను, పొందరానిదైన యోగసిద్ధినిపొందెను. ఈ తీర్థమునందు తపస్సుచేసి భరద్వాజుడు ఆరుగురుమహామునులలో ఏడవవాడుగా చేరెను. సనకుడు మొదలుగాగల బ్రాహ్మణులు యోగఫలము నిచ్చునట్టి చోటైన యీతీర్థము

సప్తమో భవేత్. అస్మింతీర్థే పురా విప్రాః క్షేత్రజ్ఞస్యాపరోక్షతామ్, యోగస్య ఫలభూమిం తే లేభిరే సనకాదయః. అస్మిన్మాఘే చ యే స్నాంతి గంగాకాళిందిసంగమే, తారారూపేణ తైర్వ్యాప్తా ద్యౌరియం సకలామలాః. విందంతి కామాన్ భోగాంశ్చ ముక్తిం యాంతి ముముక్షవః, సిద్ధించ సాధకా యాంతి ప్రయాగేఽస్మిన్ ద్విజోత్తమ ఋచీకేన పురాదత్తో గంధర్వో వాయసో భవేత్, శాపాద్విముక్తస్సోఽప్యత్ర స్నాతస్సద్య స్సితాసితే. సాంప్రతం ముక్తికామాస్తు కన్యాః పంచసుతశ్చ తే, మద్వాక్యా దత్ర మజ్జంతు పరహంసే సితాసితే. ప్రాక్కారితాఘవిధ్వంస వేణీజల సితాసితే, లభంతా ముజ్జ్వలాం లక్ష్మీం క్షీణశాపబలాం హ్యలమ్. ఇత్యార్షం వచనంసత్యం మహాశ్చర్యమలంఘనమ్, శ్రుత్వా చోత్కంఠచిత్తాస్తు తస్థుస్స్నానాయ చోద్యమః. ప్రయాగం ప్రాప్య దుష్ప్రాపం సస్నుర్నిత్యం సితాసితే, భక్త్యా చ పరయా రాజన్ మకరస్థే దివాకరే. మాఘే పంచదశస్నాతాః కన్యా ద్విజసుతస్తథా, రోమశస్య పురస్సర్వే పైశాచం విజహుః క్షణాత్. విముక్తశా

నందు తపస్సుచేసి క్షేత్రజ్ఞుడయిన శ్రీవిష్ణుని ప్రత్యక్షము చేసికొనిరి. గంగయు యమునయు చేరునట్టిచోటైన ఈతీర్థమునందు మాఘస్నానము చేయునట్టి పురుషులు ఆకాశమునందు కళాసహితులై నిర్మలులై వ్యాపించి యెల్లకోరికలను భోగములను పడసి మోక్షమును పొందుదురు. ఈప్రయాగమునందు యోగమును సాధింపగోరువారు యోగసిద్ధిని పొందుదురు. పూర్వకాలమునందు ఋచికుడిచ్చినశాపమువలన కాకియైన గంధర్వుడు ఇక్కడస్నానము చేసి అప్పుడే పాపమునుండి విడువబడెను. ఇప్పుడు పరమహంసస్వరూపమయిన తెల్లనినల్లనితీర్థమునందు (వేణీసంగమమునందు) మోక్షముఁగోరినవారగు అయిదుగురు కన్యకలు నీకొమారుఁడును నామాటవలన స్నానము చేయుదురుగాక. పూర్వజన్మమునందు చేసిన పాపములను చెరుచునదియైన తెల్లనినల్లని వేణీజలమునందు శాపములు తొలగగా ప్రకాశించునట్టి సంపదను పొందుదురుగాక అనిచెప్పగా ఆమహామునియొక్క నిజమును వింతయయినదియు దాటరానిదియు నయినమాటను విని తమకమునొందిన మనసులుగలవారై వారు స్నానమునకు ప్రయత్నపడిరి. ఓరాజా! నిర్మలమయిన భక్తితో ప్రయాగమును చేరి ప్రతిదినమును తెల్లనినల్లని జలమునందు సూర్యుఁడు మకరరాశియందుండెడి కాలమగు మాఘమాసమునందు స్నానము చేసిరి. అట్లు పదియేనుదినములు స్నానము చేయగా గంధర్వకన్యకలు బ్రాహ్మణకుమారుడును క్షణకాలములో రోమశునియెదుటనే దుఃఖమునుండియు శాపమునుండియు విడువబడుటవలన పిశా

ప్రాద్దుఃఖేన తనుంస్వాంస్వాంచ లేభిరే, ఆత్మలాభాత్తాదాసీన్నో మిథో లాభంచ మేనిరే. దృష్ట్వా వేదనిధిఃపుత్రంతాఃకన్యా దేవరూపిణీః, తుష్టావ రోమశం ప్రీత్యా ప్రసన్నేనాంతరాత్మనా. అనుగ్రహేణ భవత స్తీర్ణశ్శాపమహార్ణవాత్, ఇదానీముచితం బ్రూహి బాలానామృషిసత్తమ. రోమశః. కుమారోఽధీతవేదోఽసౌ సమాప్తనియమోయువా, ఆసాంచ సానురాగాణాం గృహ్ణాతు కరపంకజమ్. తతో రోమశవాక్యాచ్చ స్వపితుర్వచనాత్తథా, వివాహం విధినా చక్రే బ్రహ్మచారీ సమాహితః. శుభైర్వాక్యైశ్చ మంత్రైశ్చ ఋషిభ్యం కృతమంగళః, పంచానామపి కన్యానాం పాణిం జగ్రాహ ధర్మతః. ఆనందిన్య స్తదాసర్వాః కన్యాపూర్ణమనోరథాః, బభూవసుకుమారశ్చ ప్రావృషీవబభూవతుః. దత్త్వానుజ్ఞాం మునిం సోఽథ రోమశస్తైర్నమస్కృతః, జగామస్వాశ్రమం మేరుం పర్వతం సురసేవితం. విప్రో వేదనిధిస్సోఽథ స్నుషాః పంచ సుతంతథా, పురస్కృత్య పురా విప్రో ధనదస్యదిశంయయౌ. ఇతి నృపవరమాఘస్నాన

---

చత్వమును విడిచి తమతమయెప్పటిదేహములను పొంది మాకుమాలాభమునుబట్టి ఒండొరులయొక్క లాభమును ఆయెను. అని తలచిరి. అప్పుడు వేదనిధి దేవతారూపములుగల కన్యకలను తనకొడుకును జూచి సంతోషించి రోమశునిగూర్చి వికాసమునొందిన మనసుతో, ఓఋషిశ్రేష్ఠుడా! మీరు నీయనుగ్రహముచేత శాపమనెడి గొప్ప సముద్రమును దాటిరి. కనుక ఇప్పుడు ఈచిన్నవారికిని ఈకన్యకలకు తగిన కృత్యము ఇదియని నీవే చెప్పుము. అనగా రోమశుడు వేదములు చదివినవాడును బ్రహ్మచర్యనియమమును తుదముట్ట నడపినవాడును ప్రాయముగలవాడు నయిన యీచిన్నవాడు అనురాగము గల వారైన యీకన్యకలను పెండ్లాడవలసినది అని చెప్పెను. అంతట వేదనిధి తమతండ్రి మాటనువలెనే రోమశునిమాటనుబట్టి యథావిధిగా కొడుకునకు పెండ్లిచేసెను. ఆబ్రహ్మచారియుం మనసులోని కలవరమును మాని మంచి దీవనమాటలచేతను మంత్రములచేతను ఋషులవలన చేయబడిన శుభకార్యములు గలవాడై క్రమముగా అయిదుగురు కన్యకలను పెండ్లాడెను. అప్పుడు ఆకన్యకలును తమకోరిక యీడేరగా సంతోషించిరి. ఇట్లు వారు వానకాలమునందలి నామాల చెరుకువలె ఉల్లాసమును వహించియుండగా రోమశమహాముని వారిచేత మ్రొక్కుడుగొని వారికి సెలవిచ్చి పంపి దేవతలకు ఉనికిపట్టయిన మేరుపర్వతమునందలి తన యాశ్రమమునుగూర్చి పోయెను. ఆటుపిమ్మట ఆవేదనిధి యనెడి బ్రాహ్మణుడు తనకోడండ్రను అయిదుగురిని కొడుకును పిలుచుకొని ఉత్తర దిక్కునుబట్టి పోయెను. ఓ-రాజా! తీర్థములలో ఉత్తమమయిన ప్రయాగమునందు మునిశ్రేష్ఠుడైన రోమశముని మాటనుబట్టి మాఘస్నానమువలన పుట్టిన పుణ్యముగలవారును

సంజాతపుణ్యా మునివరవచనాత్తీర్థరాజే ప్రయాగే, సకలకలుషముక్తాః పంచగంధర్వకన్యా నిజహితవరసిద్ధిం ప్రాప్య హర్షం చ జగ్ముః. య ఇదం మాఘమాహాత్మ్యం మాఘమాసే నృపోత్తమ, శ్రావయేత ద్విజో విప్రాన్ స్నాత్వా మాఘే ద్విజోత్తమాన్. తమంతే మాఘమాసస్య పూజయేయుః ఫలార్థినః, పూజితస్తు తదా వక్తా తేషా మాశిషమీరయేత్. సువర్ణరత్నభూషాదీన్ దద్యాద్వస్త్రాదిభిస్సహ, పూజయేద్బ్రాహ్మణాన్ కాంశ్చిద్వేదశాస్త్రార్థకోవిదాన్. ఉత్తమం పుణ్యమేవైతత్తదర్ధం మధ్యమం స్మృతమ్, తదర్ధమధమం చైత దిత్యాహు స్తత్వవేదినః. వస్త్రం కాంస్యం యథాశక్తి తాంబూలం చందనాని చ, దద్యాద్యథేష్టం భోక్తృభోజ్య బ్రాహ్మణేభ్యః ప్రయత్నతః. వక్తుశ్చ దానేన సమేతి హర్షం మాఘే తతః కేశవ ఏవ హర్షితః, తస్మాద్ధరేర్లోకముపైతి మానవః శ్రోతా చ మాఘే న పునర్భవేత్సః. మాఘాత్యయే గంతుమశక్నువాన్యః పౌరాణికం శ్రోతృజనాంశ్చ సభ్యాన్, అభ్యర్చయేత్కాంచనవస్త్రదానైః ప్రయాగమా

---

ఎల్లదోషములు తొలగినవారును నైన ఆ అయిదుగురు గంధర్వకన్యకలును కోరినకోరిక నెరవేర్చుకొని సంతోషించినకథగల ఈమాఘమాహాత్మ్యమును మాఘమాసమునందు స్నానముచేసి బ్రాహ్మణులకు వినిపించునట్టి బ్రాహ్మణుని లేక బ్రాహ్మణశ్రేష్ఠులను మాఘమాసముకడపట మాఘస్నానఫలమును కోరునట్టివారు పూజింపవలెను ఆపురాణము చెప్పెడి బ్రాహ్మణుడును వారిచేత పూజింపబడి వారిని దీవింపవలెను. మాఘపురాణమును వినిన పిమ్మట ఆవిన్నవారు పురాణము చెప్పినబ్రాహ్మణునికి వస్త్రములు మొదలగువానితో రత్నములవియును బంగారువియునయిన సొమ్ములను ఇయ్యవలెను. అటుపిమ్మట వేదశాస్త్రముల అర్థము నెరిగిన పండితులగుకొందరు బ్రాహ్మణులను పూజింపవలెను. ఇట్లుచేయుట ఉత్తమధర్మము. ఇందు సగముచేయుట మధ్యమధర్మము. ఆసగమునందు సగముచేయుట అధమధర్మము అని తత్త్వము తెలిసిన పెద్దలు చెప్పుదురు. ఇదిగాక తమ శక్తికొలది కొందరుబ్రాహ్మణులను ఆదరించి తృప్తిగా భోజనముపెట్టి భోజనము చేసిన పిమ్మట వారికి తాంబూలము చందనము మొదలగువానితోగూడ వస్త్రమును కంచుపాత్రమును ఇయ్యవలసినది. మాఘమాసమునందు పురాణము చెప్పినవాడు విష్ణువుతో సమానుడు కనుక అతనికి ఇచ్చినదానము తనకే యిచ్చినదానివంటిదని విష్ణుదేవుడు సంతోషించును. కాబట్టి మాఘమాసమునందు పురాణము విన్నవాడు విష్ణులోకమును పొందును. అట్టివాడు మరల భూమియందు పుట్టడు. పుణ్యతీర్థములకుపోయి మాఘస్నానముచేయ శక్తిలేనివాడు ఎవడో వాడు మాఘపురాణము చెప్పునట్టివానిని ఆపురాణము వినెడి సభవారిని బంగారముచేతను వస్త్రములచేతను పూజించి ప్రయా

ఘః కృత ఏవ తేన. పౌరాణికం శ్రోతృజనాంశ్చ సమ్యగ్గంధాక్షతైశ్చారు సుగంధిపుష్పైః, మాల్యైస్సురుభ్యర్చ్య ఫలేప్సురస్త్రై హేమాంబరం విప్రవరాయ దద్యాత్. యో మాఘమాహాత్మ్యమిదం లిఖిత్వా సుపుస్తకే విస్ఫుటశుద్ధియుక్తే, కరోతి దానం సువిచక్షణాయ తమూర్వశీవాంఛతి దేవలోకే శ్రీసూతః —ఇతిశ్రుత్వా దిలీపోఽసౌ వసిష్ఠేన సమీరితమ్, శ్రద్ధయా మాఘమాహాత్మ్యం మాఘాంతేత మపూజయత్. ముక్తాహారం దదౌ తస్మై స్వర్ణభూషణముత్తమమ్, కేయూరమంగుళీయంచ నానారత్నవినిర్మితమ్. కంకణం కటిసూత్రంచ నవరత్నవిరాజితమ్, వాసాంసి బహుమూల్యాని ధనధాన్యాన్యనేకశః. భుజోపధానం రజతం భద్రాసనముపానహమ్, మృదులేచ విచిత్రేచ మణిపాటలపాదుకే. శిబికామభిరామాంచ వాయువేగంతురంగమమ్, తాలవృంతంచ ధాన్యాని సర్వాణి ప్రదదౌ నృపః. చందనాక్షతతాంబూలైర్ధామభి స్సౌరభోత్తమైః, పూజయిత్వా వసిష్ఠంతు తతస్తేనాభినందితః. వసిష్ఠేన ప్రహృ

---

గమునందు మాఘస్నానము చేసినవాడు అగును అనగా ప్రయాగమునందు మాఘస్నానముచేసిన ఫలమును పొందును. ఇనుక పురాణము విన్నవాడు అందుఫలమును అపేక్షించి పురాణము చెప్పెడివానిని గంధముచేతను అక్షతలచేతను మంచి వాసనగల పువ్వులదండలచేతను లెస్సగా పూజించి అతనికి బంగారుసరిగవస్త్రమును ఇయ్యవలెను. ఎవడు ఈ మాఘమాహాత్మ్యమును మంచి పుస్తకమునందు చక్కగా తెలియునట్లు తప్పులు లేక వ్రాసి గొప్ప పండితునికి దానముచేయునో వానిని దేవలోకమునందు ఊర్వశి కోరును.

శ్రీసూతునిమాటలు.—ఇట్లు వసిష్ఠమహాముని చెప్పినయీమాఘమాహాత్మ్యమును దిలీపమహారాజు శ్రద్ధతోవిని మాఘమాసము కడపట ఆవసిష్ఠమహామునిని పూజించి ఆయనకు ముత్యాలహారము బంగారు సరపెణ భుజకీర్తులు నానారత్నములు పొదిగిన ఉంగరము ముంజేతికడియాలు తొమ్మిదివిధములయిన రత్నములతోచేసిన మొలనూలు మిక్కిలివెలగల వస్త్రములు అనేకవిధములయిన ధనధాన్యములు ఒరుగుదిండు వెండితో చేసిన మంచిపీఠము మెత్తనిచెప్పులు రత్నములు పొదిగినందున పలువన్నెలు గలిగినవియు ఎరుపు తెలుపు కలిసినవియు నైన పావకోళ్లు ఒప్పిదమయిన అందలము గాలివలె వడిగానడుచునట్టి గుఱ్ఱము విసనకఱ్ఱ తక్కిన సమస్తవస్తువులు వీనినంతయు దిలీపుడు ఇచ్చి పచ్చగందము అక్షతలు తాంబూలము వాసనగల పువ్వుదండలు వీనిచేత వసిష్ఠునిపూజించి, ఆయనచే దీవనను పడసి, ఆదీవనలచేత వర్ధిల్లెను. ఇదిగాక ఆ దిలీపమహారాజు నేతితోను పిండివంటలతోను పరమాన్నములతోను బ్రాహ్మణులను భోజనముచేయించి,

ష్టేన ఆశీర్భిరభివర్ధితః, బ్రాహ్మణాన్ భోజయామాస ఘృతభక్ష్యాన్నపా
యసైః. భుక్తాభుక్తద్విజేభ్యోఽపి దక్షిణాం ప్రదదౌ నృపః, పునః ప్రదక్షి
ణీకృత్య వసిష్ఠం చాప్యరుంధతీమ్. అగ్నిత్రయం నమస్కృత్య తత్రస్థాం
సర్వకామదామ్, సౌరభేయీం మహాధేనుం నృపతిస్స్వపురం యయౌ.
ఇత్థం మునీంద్రా రవివంశజన్మా సాంగం సమాఘం కృతవాన్ దిలీపః,
ఉక్తం మయా యద్వదితం భవద్భ్యః ద్వైపాయనాయాస్తు నమో మ
హద్భ్యః. యో మాఘమాసే కురుతే ద్విజానాం గోపీమృదో దాన ము
మస్యఘఘ్నమ్, దివౌకసా మప్సరసాం పురస్తా త్తిలోత్తమా తస్య కు
టుంబినీస్యాత్ మాఘేస్నాత్వా యేసదాబాహ్యతోయే శృణ్వంతోవా
మాఘమాహాత్మ్యమేవ, తేషాంవిష్ణుస్సత్వప్రసన్నః కృపాళు ర్దీర్ఘాయు
ష్మంతః పుత్రవంతో భవేయుః. ఇతి శ్రుత్వా మునిశ్రేష్ఠా నైమిశారణ్య
వాసినః, కుశవల్కలపుష్పైశ్చ ఫలమూలయవాదిభిః. సూతం సంపూ
జయామాసు ర్భక్త్యా పౌరాణికప్రభుమ్, పాణిభి స్స్వపవిత్రైశ్చ పస్పృ
శు స్స్నాతమాదరాత్, కేచిదాలింగనం చక్రు రానందాశ్రుపరిప్లుతాః.

---

భోజనము చేసినవారును చేయనివారును నైన బ్రాహ్మణులకు అందరకు దక్షిణలిచ్చి, పిమ్మట వసిష్ఠునికిని అరుంధతికిని మూడగ్నులకును ప్రదక్షిణము చేసి, ఆయాశ్రమమునం దుండెడి యెల్లకోరికలను ఇచ్చునదియై దూడతో గూడినదైన వసిష్ఠుని హోమధేనువునకు మ్రొక్కి, తనపట్టణమునుగూర్చి పోయెను. ఓమునీంద్రులారా! సూర్యవంశమునందు పుట్టినవాడగు దిలీపమహారాజు ఇట్లు మాఘస్నానవ్రతమును కొరతలేక నడపిన కథయెల్లను మీకు నేను చెప్పితిని. ఇక మీరును దొడ్డవారైన వ్యాసులవారికిని నమస్కరించెదను. ఎవడు మాఘమాసమునందు తెల్లవారి యెల్లపాపములను చెరుచునట్టి గోపిచందనపు పట్టిని బ్రాహ్మణులకు ఇచ్చునో వానికి తిలోత్తమయనెడి అప్సరస్త్రీ తక్కిన అప్సరసలయును దేవతలయును సమక్షమున భార్యయగును. ఎవరు మాఘమాసమునందు ఎడతెగక ఊరిబయటి నీటియందు స్నానముచేసి మాఘమాహాత్మ్యమును విందురో వారికి దయాళువైన శ్రీవిష్ణుదేవుడు ప్రసన్నుడగును. అట్టివారు దీర్ఘాయుస్సును కొడుకులును కొమార్తెలును గలవారు అగుదురు. అనియిట్లు సూతుడు చెప్పిన మాఘమాహాత్మ్యమును విని నైమిశారణ్యమునం దుండెడి ఋషులు, కొందరు పురాణము చెప్పెడివారిలో శ్రేష్ఠుడైన సూతుని దర్భలు నారచీరలు పువ్వులు పండ్లు వేళ్లు దుంపలు యవలు మొదలగువానిచేత పూజించిరి. కొందరు మహామునులు మిక్కిలి ప్రేమతో పవిత్రములతో గూడిన తమచేతులచేత అంటిరి. మరికొందరు సంతోషము హెచ్చగా వెడలెడి కన్నీళ్లచేత చక్కగా తడుపుచు కౌగిలించుకొనిరి. ఇట్లు మునులచేత ఆదరింపబడిన సూతుడు

ఉత్థాయ సూతో మునిపుంగవేభ్యః కృత్వా నమస్కారమతీవ హృష్టః, ఇత్థం జగాదోన్నతబాహురుచ్చైర్ద్విజోత్తమానాం కుశలాని సంతు. పరమిదమితిహాసం పావనం తీర్థభూతం వృజినవిలయహేతుం యశ్శృణోతీహ నిత్యమ్, స భవతి పరిపూర్ణస్సర్వదా సర్వకామైర్వ్రజతిచ పరలోకం దుర్లభం ధర్మహీనైః. ఉవాచ సూతో గురువాగ్విభూతిశ్శ్రీమాఘమాహాత్మ్యమిదం మునీనామ్, శ్రుత్వాచ తే శ్రోత్రసుఖం మునీంద్రాస్స్వదీర్ఘసత్త్రం విధివద్వితేనుః. యేపఠంతీహ లోకేతు యేశృణ్వంతిచమానవాః, తే సర్వే పాపనిర్ముక్తాః యాస్యంతి పరమాంగతిమ్. విసర్గబిందుమాత్రాణి పదపాదాక్షరాణిచ, న్యూనాతిరిక్తం తత్సర్వం క్షమస్వ పురుషోత్తమ.

ఇతి శ్రీ పాద్మే పురాణే-మాఘమాహాత్మ్యే- వసిష్ఠదిలీపసంవాదే
విప్రకుమారగంధర్వకన్యకానాం పిశాచత్వవిమోచనాది
కథనంనామ సప్తచత్వారింశోఽధ్యాయః. సమాప్తః.

---

మిక్కిలి సంతోషించి ఆమునుల కందఱికిని మ్రొక్కి చేతులుపైకి ఎగసిజాపి ఈబ్రాహ్మణశ్రేష్ఠుల కెల్లను మేలుకలుగునుగాక అని గట్టిగా పలికెను. ఈలోకమునందు పావనమై పుణ్యతీర్థమై పాపముల నాశమునకు కారణమై యొప్పునట్టి ఈఉత్తమ ఇతిహాసమును ఎప్పుడును వినువాడు ఎవడో వాడు ఎల్లవిధములచేతను ఎల్లకోరికలును నెరవేరగా పుణ్యములేనివారికి పొందశక్యముగాని ఉత్తమలోకమును పొందును. మిక్కిలి మాటనేర్పుగలసూతుడు మునిశ్రేష్ఠులకు చెప్పిన ఈమాఘమాహాత్మ్యమును ఆమునులు చెవులు తనియ విని తాము చేయుచున్న సత్త్రయాగమును యథావిధిగా పూర్తిజేసిరి. ఈమాఘమాహాత్మ్యమును చదువువారును వినువారును నైన జనులందరు పాపమువలన విడువబడినవారై ఉత్తమగతినిపొందుదురు. ఓపురుషోత్తముడవైన శ్రీహరీ! ఇందలి విసర్గములు సున్నలు మాత్రావర్ణములు పదములు పాదములయందలి అక్షరములు ఎచ్చుతక్కువలైయున్నను వానినిగూర్చి మన్నింపుము.

ఇది శ్రీ పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు బ్రాహ్మణకుమారుని
యొక్కయు గంధర్వకన్యకలయొక్కయు పిశాచత్వవిముక్తి మొదలగు
కథలుగల నలుబదియేడవ అధ్యాయకథ.

సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1928.

# సంస్కృతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| కార్తీకమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| కాశీమాహాత్మ్యము, తెనుగు వచనము | ... | 0 | 8 |
| గయామాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 0 | 6 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| జగన్నాథమాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 2 |
| ధనుర్మాసమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| బాలరామాయణము, మూలము, పెద్దచ్చు | ... | 0 | 1 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యానసహితము | (అచ్చగుచున్నది) | | |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము | ... | 10 | 0 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | | 2 | 0 |
| ప్రతిపదాంధ్రటీకా తాత్పర్యవిశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు 15 వాల్యములు | | 70 | 0 |
| డిటో ఆరణ్యకాండము | ... | 10 | 0 |
| డిటో కిష్కింధాకాండము | ... | 10 | 0 |
| డిటో సుందరకాండము | (అచ్చగుచున్నది) | | |
| డిటో యుద్ధకాండము | ... | 20 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము, సాధారణప్రతి | ... | 3 | 8 |
| డిటో రెండువాల్యములు, దళసరికాగితములు | ... | 6 | 0 |
| డిటో సుందరకాండము, చిన్నసైజు | ... | 1 | 0 |
| డిటో ఉత్తరకాండము, మేలుప్రతి | ... | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహా, ఆంధ్రతాత్పర్యసహితము 7 వాల్యములు | | 17 | 0 |
| ,, బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| ,, అయోధ్యాకాండము ,, | ... | 3 | 0 |
| ,, ఆరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| ,, కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| ,, సుందరకాండము ,, | ... | 2 | 0 |
| ,, యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| ,, ఉత్తరకాండము ,, | ... | 2 | 8 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము 2 సంపుటములు, చిన్నసైజున చక్కగ ముద్రితము. | ... | 15 | 0 |
| శైవధర్మము | ... | 1 | 8 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆబ్దికమన్త్రములు (యజుర్వేదము) మూలము | ... | 0 | 6 |
| ఆంధ్రద్రావిడ సంధ్యావందనము | ... | 0 | 2 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము, మేలు ప్రతి | ... | 2 | 0 |
| ఋగ్వేద ఆశ్వలాయనసూత్రములు | ... | 0 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక, చిన్నసైజు | ... | 0 | 2 |
| ఋగ్వేదసంధ్యావందనభాష్యమ్ | ... | 1 | 8 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, బ్రహ్మమేధసహితము | ... | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | ... | 0 | 6 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| ,, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| తైత్తిరీయఆరణ్యకోపనిషత్తులు పితృమేధము మంత్రప్రశ్నములు సహా. సస్వరము | | 3 | 0 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 2 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 8 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము—అనేకవిషయములఁ జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁ బరిష్కరించియున్నాము. | | 2 | 0 |
| రుద్రము, నమకము, చమకము, సస్వరము చిన్నసైజు | ... | 0 | 2 |
| శ్రీవైష్ణవాహ్నికము | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 4 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు మంచికాగితములపై చక్కఁగముద్రితము. | | 2 | 0 |
| వైశ్యసంధ్యావందనము | ... | 0 | 1 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.